# శ్రీ గీతా యోగము





రచయిత:

చెలసాని నాగేశ్వరరావు

శ్రీ అరవింద సొసైటి :: తెనాలి

ప్రథమ ముద్రణ : 21, ఫిబ్రవరి, 1982

ప్రతులు : 1000

వెల : సాదాప్రతి రు. 15_00
మేలిప్రతి రు. 20_00



ప్రకాశకులు : శ్రీ అరవింద సొసైటి, తెనాలి.

ప్రాప్తిస్థానములు :

1. శ్రీ చెలసాని నాగేశ్వరరావు, శేరీకలవపూడి (via) అంగలూరు - 521330.
2. శ్రీ అరవింద సొసైటి, బోసురోడ్డు, తెనాలి - 522201.
3. శబ్ద, శ్రీ అరవిందాశ్రమము, పుదుచ్చేరి - 605002
4. **Institute of Human Study, University Rd., HYDERABAD-500 768**

ముద్రణ : బాబా ఆర్టు ప్రింటర్సు, తెనాలి-1

# విషయసూచిక

# మా మాట

భగవద్గీత, శ్రుతిశిరస్సులైన వేదాంతములందు వెలుగొందుచున్న శిరోరత్నము. తద్రత్న దీధితులచే ప్రభావితము కాని వైదిక దర్శనము ఒక్కటి కూడా లేదనుటలో నతిశయోక్తి లేదు. ఆ భగవద్గీతకు ఎన్నో భాష్యములు, ఎన్నో వ్యాఖ్యానములు వెలయుట తన్మహత్వప్రదర్శకము గాక, మరి యేమగును! అది ఉపనిషత్సారము, సర్వశాస్త్రాకరము, కర్మ, భక్తి, జ్ఞానయోగ సముచ్చయము. విశేషించి, అష్టాదశాధ్యాయ పరిమితమై వెలసిన అష్టాదశయోగ సమాహారమే భగవద్గీత.

అయిన, అందు ఏ యోగము గ్రాహ్యము, ఏది పరిహరణీయము అనిన, భగవత్సమ్మితములు గాన, సర్వయోగములు సమాదరణీయములే యనుట, నిర్వివాదాంశము. సర్వయోగసమన్వయము చేయుచు, అనుస్యూతముగా నున్న ఒక సూత్రమున్నది. 'ఏకం సద్విప్రా బహుధా వదన్తి' అను ఆర్యోక్తిననుసరించి, ఆ సూత్రమును గుర్తించుటలోనే వివిధ దార్శనికులు భిన్న భిన్న మార్గములను ద్రొక్కిరి; తత్ఫలితముగా వేరు వేరు భాష్యములు, వ్యాఖ్యానములు వచ్చినవి

నాడు ద్వాపరమున, నిర్వేదముతో కర్తవ్యవిమూఢుడైన అర్జునునకు కృష్ణభగవద్రూప చైతన్యము గీతోపదేశమొనర్చి కర్మనిష్ఠుని గావించెను. అదే విధముగా ఈ యుగములో ఇరువదవ శతాబ్దిలో శ్రీ అరవిందులు అలీపూరు జైలులో బద్ధులై యున్న సమయమున అర్జునునివలె నిర్వేదమునకు లోనైరి. భారతజాతి సముద్ధరణ కార్యమున మునిగియున్న తరుణములో భగవానుడు తనను కారాగార బద్ధునిగా ఏల చేసెనని శ్రీ అరవిందులు విషాదయోగమున మునిగియుండిరి. ఆ జైలులోనే వాసుదేవదర్శనప్లావితులై గీతాప్రకాశమున వారు మునకలిడిరి; గీతాహృదయము కరతలామలక మయ్యెను. 1914 నుండి 1920 వరకు శ్రీ అరవిందులు గీతాహృదయము నావిష్కరించుచు చేసిన వ్యాఖ్యానము అనిదంపూర్వము. తద్వ్యాఖ్యానమునకున్న అపూర్వత, ఆధునికత, విశిష్టతలు ప్రశంసనీయములు. నాడు పరమేశ్వరచైతన్యము శ్రీకృష్ణరూపమున నవతరించి అర్జునునకు గీతోపదేశము

చేయగా నేడు రూపరహితముగా వాసుదేవ చైతన్యము శ్రీ అరవిందులకు గీతాహృదయ రహస్యము నుపదేశించెను. ఈ విధముగా శ్రీ అరవింద దర్శన వినిస్సృతమైనదే 'Essays on The Gita' అనే అమూల్య గ్రంథము.

శ్రీ అరవిందులు 'యోగస్థః కురు కర్మాణి'యను వచనమే గీతోపదేశమునకు కీలకసూత్రముగా గ్రహించిరి. సంన్యాసమే గీతాతాత్పర్యమైనచో, నిర్వేదవశుడైన అర్జునుడున్న వీతరాగస్థితి, సంన్యాస బీజావాపము చేయుట కెంతేని యుపయుక్తము. కాని, శ్రీ కృష్ణభగవానుడు అర్జునునకు అష్టాదశ యోగములను బోధించి, యోగయోగ్యుని గావించి కర్మయోగానుష్ఠానమునకు పురికొల్పెను; పరిత్యజించిన గాండీవమును చేపట్టించి, మానవాళి ఆత్మవికాసానికి మార్గముచూపెను; యోగస్థుడవై కర్మనాచరించుము' అనే సూత్రమే మానవాళి జీవనమార్గానికి శరణ్యము గాని, కర్మసంన్యాసము కాదని భగవానుడు ఘంటాపథముగా జెప్పెను.

జీవయుతము కాని తత్త్వవిచారము, ఆచరణయోగ్యము కాని నిష్ఫలప్రకాశము గాన, గీతాహృదయము నెరిగిన యోగి ఆత్మరూపుడు, సర్వభూతస్థితుడు నగు ఈశ్వరునితో యుక్తుడై, జీవనచేతన లేక బాహ్యచేతనకు, పరమాత్మచేతనకు మధ్యనున్న అంతరమును ఛేదించును. బాహ్యాభ్యంతర నిమ్న ప్రకృతిని సర్వమును దివ్యీకృత మొనర్చును; కృష్ణుని చేతిలోని వేణువు వలె కర్తృత్వాహంకార రహితుడై సమస్తవిశ్వమును దివ్యజీవనస్రవంతిలో ఓలలాడించుచు, అంతరంగస్థితుడు, పరమేశ్వరప్రతినిధి అయిన చైత్యపురుషుని అవబోధానుసారము దివ్యజీవనమును నెరపును; లోకకళ్యాణమునకై, శాంత్యానంద సౌఖ్యముల నొనగూర్చును. ఇదియే గీతాయోగము. అందుచేతనే రచయిత ఈ గ్రంథమునకు 'శ్రీ గీతాయోగము' – అని నామకరణము చేసియున్నారు. ఇది చాల సముచితము, అర్థవంతము. ఏలనన, ఇందలి ప్రతి అధ్యాయములో ప్రతిపాదించిన అర్థము ఒక్కొక్క యోగము. ఇంతేగాక, ప్రతి యధ్యాయాంతమున 'ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే' – యని యుండుట వలన 'గీతాయోగము' అను నామము ఈ గ్రంథమునకు సర్వథా సార్థకము.

గీతపై శ్రీ అరవిందుల అపూర్వ వ్యాఖ్యానమును, యథాతథముగ నాకళింపు జేసుకొనిన యీ రచయిత 'Essays on The Gita'ను 'గీతావ్యాసము'లను పేరుతో ననువదించి, దానిపై 'అపూర్వతా పరిచయము'ను గూడ కూర్చిన పుణ్యశ్లోకుడు.

ఇటీవలనే మూలము, సంగ్రహార్థము, లఘుటీకలతో పారాయణోపయుక్తమగునట్లు భగవద్గీతను ప్రచురించి వారి గ్రామమందలి కృష్ణ దేవాలయ స్వామికి సమర్పించిన భక్తి నిర్భరహృదయుడు. ఇప్పుడు ఈ 'గీతాయోగము'ను శ్రీ అరవిందులు దర్శించిన గీతారహస్యమును శ్రీ శంకరాదుల దర్శనాదులతో తులనాత్మకముగా, గంభీరముగా పరిశీలించి, శ్రీఅరవిందుల వ్యాఖ్యాన విశేషార్థమును వెలుగులోనికి దెచ్చిన యోగశీలి యీ రచయిత.

ప్రతి యధ్యాయారంభమునందు 'పరిశీలన'యను శీర్షికతో శ్రీఅరవిందుల వ్యాఖ్యానమునకు, ఇతరుల వ్యాఖ్యానములకు గల భేదాన్ని ప్రదర్శించి, అందలి విశేషార్థమును గూడ సుబోధకముగా నిచ్చియున్నారు. ఏతాదృశ యోగ్యతా సముపేతులైన రచయిత శ్రీ చెలసాని నాగేశ్వరరావుగారికి మా పక్షమున, ఆంధ్ర పాఠకలోక పక్షమున కృతజ్ఞతాభివాదములను సమర్పించుచున్నాము.

ఈ గ్రంథ ముద్రణకు ఉదారముగా విరాళములిచ్చి మమ్ము ప్రోత్సహించిన వదాన్యులకు మా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదము లందజేయుచున్నాము. వారికి సర్వేశ్వరుడు సదా శ్రేయము చేకూర్చుగాక!

ఈ గ్రంథమును ఇంత సుందరముగా, సకాలములో ముద్రించియిచ్చిన బాబా ఆర్ట్ ప్రింటర్స్, సాలిపేట – తెనాలి వారికి మా అభినందనలు.

శ్రీ మాతారవిందులకు ప్రణామములతో —

**శ్రీ అరవింద సొసైటి,**

తెనాలి.

# విరాళములు సమర్పించిన మాన్యులు

శ్రీమతి గుత్తా లక్ష్మీనరసమ్మగారు, (ఏలూరు)

శ్రీమతి పోలవరపు వరలక్ష్మిగారు, (మొగలిరాజపురం-విజయవాడ)

శ్రీ కనిగొళ్ళ ప్రకాశరావుగారు, (ఏలూరు)

శ్రీ తాళ్ళూరి వెంకట రామకృష్ణయ్యగారు, (యలమంచిలి)

శ్రీమతి పోలవరపు బాపమ్మగారు, (పునాదిపాడు)

శ్రీ గంధం పేర్రాజుగారు, (ఏలూరు)

శ్రీ లక్కింశెట్టి మాణిక్యాలరావుగారు, (ఏలూరు)

శ్రీ చెలసాని నాగేశ్వరరావుగారు, (శేరీకలవపూడి)



# ప్రస్తావన

గీతపై అసంఖ్యాకముగా గ్రంథములు వెలసియున్నవి గదా; అయినప్పుడు మఱల నీ ప్రయత్న మెందుకు? ఈ ప్రశ్నకు క్షమాపణ కాదు, సమాధానము చెప్పుటకే ఈ ప్రస్తావన.

## గీత సార్వకాలికము

భగవద్గీత సార్వకాలికము, సార్వదైశికము నగు యోగశాస్త్రము; అందు ఒకే కాలమునకు, ఒకే దేశమునకు సంబద్ధమైనది చాల స్వల్పము. ఆ స్వల్పమును గూడ ఎప్పటి కప్పుడు అప్పటి కాలానుగుణముగా వ్యాఖ్యానించుకొనుటకు గావలసిన సూచనలు సైతము దానియందే మనకు బొడకట్టును. ఉదాహరణకు, గీతలోని యజ్ఞతత్త్వమునకు ఎప్పటికప్పుడు విశాలతర, గంభీరతర రార్థమును ఎట్లు చెప్పుకొన వచ్చునో, దాని నచ్చటి యజ్ఞ ప్రస్తావనయే మనకు దెలుపును.

## భావి వ్యాఖ్యానము

అట్లు గంభీరతరార్థమును వెలికితీసి, గీతను అపూర్వముగా వ్యాఖ్యానించిన మహామనీషి శ్రీ అరవిందుడు. ఈ అపూర్వ వ్యాఖ్యాన వైభవ మేమి యన, ఇది వర్తమానమునకే కాక, భావి యుగమునకు గూడ దివ్యముగా అనువర్తించును. కారణము, ఆయన ఆర్ష ప్రతిభతో ప్రపంచముయొక్క భావి పరిణామగతిని ముందుగనే దర్శించి, భావి ప్రపంచమునకు సోపానసరణిగా గీతను వ్యాఖ్యానించి యున్నారు. కనుక నిది భవ్యవ్యాఖ్యానమే కాక, భావి వ్యాఖ్యానమును. ఈ సత్యమునే శ్రీ అరవిందుని సహచరియగు శ్రీమాత మన కెట్లు ధ్రువీకరించును —

"మానవుడు నిన్నటి సృష్టిలోనివాడు. కాగా రేపటి సృష్టిని, రేపటి సృష్టిలోని అతిమానస పురుషుని ప్రకటించుటకు వచ్చినవాడు శ్రీ అరవిందుడు."

"శ్రీ అరవిందుడు భావికిజెందినవాడు; ఆయన భావికి వర్తించు సందేశమును దెచ్చినవాడు. భగవదిచ్ఛచేత సంకల్పించబడిన, ఒక మహోజ్జ్వల భవిష్యత్తుయొక్క నిర్మాణమును త్వరితపఱచు నిమిత్తము, ఆయన మన కింకను దారిచూపుచున్నాడు."

ఇట్లు దివ్య భవిష్యత్తునకు కవాటమగు ఈ వ్యాఖ్యానము నించుక పరిచయపఱచుటకే ఈ ప్రయత్న మని మనవి.

## విశేషముల పరిచయము

అపును, వ్యాసరూపమున శ్రీ అరవిందుడు చేసిన గీతావాఖ్యానమునకు ఈ గ్రంథకర్త చేసిన పూర్ణానువాదము ప్రకటింపబడియే యున్నది. అయినపుడు మఱల నీ గ్రంథ మేలనందురా ? ఏలయన అది యొక మహాసాగరము; పైగా నచ్చట శ్లోకాల వారీగా వ్యాఖ్య చేయబడలేదు. కనుక ఆ మూలవ్యాఖ్యానము క్రొత్తవారికి కొంత అగమ్యముగా గన్పించును. అందుచేత మన ఇప్పటి గ్రంథమున శ్రీ అరవిందుని 'గీతావ్యాసములను' దృష్టిలో నుంచుకొని, ప్రతిశ్లోకమునకు తదనుగుణముగా అనువాద మివ్వబడును. ఇంకను అట్టి తాత్పర్యము (అనువాదము) క్రింద అచ్చటచ్చట ఆ యా శ్లోకములకు సంబంధించిన విశేషములు 'విశేషార్థ'మను పేరిట చూపబడును. అపుడు మనము తలపెట్టిన, ప్రస్తుత గీతారూపము శ్రీ అరవిందుని మూలవ్యాఖ్యానానికి సరళపరిచయము, సుగమసోపానము కాగల దని ఆశయము. ఇట్టి పరిచయ ప్రక్రియ శ్రీ అరవిందుని అందుబాటులోనికి దెచ్చుటకు నెంతయు ఆవశ్యకమని మిత్రులు స్వానుభవపూర్వకముగా చేసిన నిర్బంధమును ఈ ప్రయత్నమునకు ఒక ముఖ్యప్రేరణ.

శ్రీకృష్ణదేవాలయము, శేరీకలవపూడి-కి సంబంధించిన శ్రీ సీతాదేవీ భజన సమాజమువారు ఇటీవల గీతాపఠనము నలవఱచుకొనిరి. అందు వారికి ఎదురైన

కఠినతలను దృష్టిలో నుంచుకొని, సామాన్యమగు చదువు గలవారికి గూడ పఠనము సుకర మగుటకు శ్లోకపాఠములందు,

సఞ్జయ = సంజయ

పాండుపుత్రాణా మాచార్య = పాండుపుత్రాణాం ఆచార్య,

ప్రహరణా స్సర్వే = ప్రహరణాః సర్వే –

ఇత్యాది మార్పులు చేయబడినవి.

పైవిధముగా వికసింపజేసిన, హృదయపూర్వకముగా సమర్పించుకొను నీ ప్రేమసుమము – తన గీతపై పూసిన ఈ ప్రేమసుమము – శ్రీ కృష్ణపరమాత్మ ప్రసాదమునకు పాత్రమగు గాక!

శేరీకలవపూడి,
——1981

ఇట్లు,
గ్రంథకర్త.



# పరివర్తనా రహస్యము

మానవుని బౌద్ధిక, భావిక, ప్రాణిక మఱియు భౌతిక సత్తయొక్క అభివృద్ధినే పాశ్చాత్యులు తమ ఆదర్శమును గావించుకొని యున్నారు. మంచిదే, కాని వారు మానవుని ఆధ్యాత్మిక జీవనముయొక్క అధికతర సంభవతలను దూరముగా వదలివేసిరి. మఱియు తమ ఆదర్శసిద్ధికి భౌతికవిజ్ఞానము మఱియు యంత్రసామగ్రియందు మాత్రమే తమ విశ్వాసము నుంచియున్నారు గాని, అందునిమిత్తము ఒక ఆధ్యాత్మిక పరివర్తనము ఆవశ్యక మని వారు గ్రహించ లేదు.

కాగా, ఈ ఆధ్యాత్మిక పరివర్తనా రహస్యము సైతము భారత దేశమునకు హస్తగతమైయున్నది, అయితే అది తగినంతగా అనుష్ఠింప బడి యుండ లేదు. "యోగస్థః కురు కర్మాణి" - అను గీతాసూత్రమే ఈ రహస్యముయొక్క సంగ్రహస్వరూపము, యోగమునందుండి - భగవంతునితో సంయోగమునం దుండి - సర్వోన్నతాత్మ యొక్క ఆధారము పైనను, ఆధ్యాత్మిక శక్తిచే మనలోని సర్వ విభాగముల శాసనముద్వారాను సర్వకర్మలను జేయుటే ఈ రహస్యస్వరూపము. ఇదియే మానవుని సర్వసమస్యలు మఱియు కఠినతలయొక్క నిజమగు పరమపరిష్కారము.

—శ్రీ అరవిందుడు

# దివ్య కర్మ

యోగస్థః కురు కర్మాణి (గీత : 2-48).

(భగవంతునితో యోగమునం దుండి కర్మ చేయుము.)

మయి సర్వాణి కర్మాణి సన్యస్య యుధ్యస్వ (3-30).

(నాయందు సర్వకర్మలను సన్యసించి, యుద్ధము చేయుము).

కర్తారం అకర్తారం విద్ధి (4-13).

(నేను చేయుచునే చేయనివాడ నని తెలిసికొనుము).

కర్మణి అకర్మ, అకర్మణి కర్మ (4-18).

(కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను గాంచును)

బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం (4-24).

(అగ్ని బ్రహ్మ, హవనముచేయువాడు బ్రహ్మ).

ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి (4-41).

(ఆత్మస్థుడైన వానిని కర్మలు బంధించవు).

సర్వం కర్మ జ్ఞానే పరిసమాప్యతే (4-33).

(సర్వకర్మయు అపుడు జ్ఞానరూపము ధరించును).

హత్వాఽపి న హంతి, న నిబధ్యతే (18-17).

(చంపినను చంపనివాడే, కాన బద్ధుడు గాడు).

# గీతాహృదయము

గీతాశాస్త్రము సర్వ సమన్వయాత్మకము. కావున నది అవశ్యముగా అనేక సత్యములను చర్చించును. కాగా, వీనిలో మన మభిమానించిన ఒకానొక సత్యమును మాత్రము నొక్కి చెప్పి, ఇదియే గీతామత మని భ్రమపడుటకు విశేషించి ఈ గ్రంథమున ఎంతో ఎక్కువ అవకాశము గలదు. అందుచేత, ఏది గీతాహృదయము ? హృదయభూతమగు ఏ మూలసత్యమును గ్రహించిన, తక్కిన సత్యము లన్నియు తమ యథాస్థానమున మన కవగతమగును ? — అను ప్రశ్నకు మున్ముందు సమాధానము కనుగొనవలసియున్నది.

## గీతాసన్నివేశము

గీతాసన్నివేశమును — గీత ఆవిర్భవించిన సందర్భమును — పరికింతుమేని అది మన కివ్విషయమున దారిచూపును.

అర్జునుడు కర్మవీరుడు, క్షత్రియవర్యుడు. అతడు యుద్ధమున అధర్మ యోధులను హతమార్చి, ధర్మమును స్థాపింప మహోత్సాహముతో రణరంగమున అడుగుపెట్టును. కాని అపు డేమి సంభవించెను ? తన క్షాత్ర ధర్మమును, సామాజిక విధియు అతనిని యుద్ధము వైపునకు పట్టిలాగును, మఱియు తన బంధుప్రీతియు, పాపభీతియు నతనిని యుద్ధమునకు పరాఙ్ముఖుని జేయును. ఇట్టి సంఘర్షమునకు, సంక్షోభమునకు లోనై, ఏమి చేయవలెనో పాలుపోక, "ధర్మసంమూఢచేతస్కుడై" (గీత : 2–7) తన జీవనసారథియగు కృష్ణపరమాత్మ పాదములు పట్టును. ఇదిగో, ఇదియే గీతోపదేశమును ప్రేరేపించిన అసాధారణ సన్నివేశము.

## సన్యాసము పరిష్కారము గాదు

ఇట్లు అర్జునునికి ఎదురైనది నూటికి నూఱుపాళ్లు కర్మసమస్య, కర్మద్వారా ధర్మమును స్థాపించవలసిన జీవనసమస్య. దీనికి పరిష్కారము కర్మయందే కనుగొన

వలెను గాని, కర్మసన్న్యాసమునందు కాదు. ఏలన అర్జును డొకవేళ తాత్కాలి కావేశ ముచేత సన్న్యసించినను, అంతటితో తన అంతఃసంఘర్షము అంత మొందదు. తన క్షత్రియప్రకృతి తననింకను అధర్మయోధులపైకి పురికొల్పుచునే యుండును (18-59). అంతే కాదు, అప్పటి దేశపరిస్థితిని సైతము అది మఱింత విషమింపజేయును. అర్జునునివంటి శ్రేష్ఠమానవుల (3-21) సన్న్యాసప్రవృత్తి భారతదేశ పతనానికి, భారతమాత కన్నీటికి ఒక ప్రబల కారణ మయ్యె నని శ్రీ అరవిందుడు వాపోవును.

ఇట్లు సన్న్యాసము అర్జునుని సమస్యను పరిష్కరించదు, సరే; ఆహంకారిక కర్మయు దానికి పరిష్కారము కాజాలదు. ఏలన, నేను చంపుచున్నాను – అను భావ మున్నంతవఱకు, పాపభయ మతనిని విడనాడదు. అందుచేత అతని నైతిక సత్త అతనిపై తిరుగబడి, సంక్షోభము పుట్టించును. అయినపుడు తరణోపాయము ?

## "యోగస్థః కురు కర్మాణి"

కర్మ మానరాదు, ఆహంకారిక కర్మ పనికిరాదు. అంటే, కర్మను నిరహంకారిక భూమికలోని కుద్ధరించి, అచ్చటినుండి కర్మ చేయవలెను, కాదు, కర్మను జరుగనీయవలెను. ఇదియే అర్జునునికి, అతనివంటి మనకు తరణోపాయము, ఇదియే మన జీవనసమస్యలకు వాస్తవ, ఆధ్యాత్మిక పరిష్కారము. గీతాసన్నివేశము లేవదీసిన గహనసమస్య నిది ఇట్లు పరిష్కరించినది గావున, ఇదియే గీతాహృదయము గావలెను దీనినే, దీని సంగ్రహస్వరూపమునే, "యోగస్థః కురు కర్మాణి"- అను సూత్రముచే శ్రీ భగవానుడు మనకు బోధించియున్నాడు. దీని అర్థ మేమన, యోగస్థః = యోగస్థుడవై, యోగమునం దుండి, భగవంతునితో సంయోగమునం దుండి; కర్మాణి = కర్మలను, జీవనము మఱియు ఆత్మవికాసము అపేక్షించు సర్వ కర్మలను; కురు = చేయుము, చేయుచునే చేయనివాడవు కమ్ము, అథవా చేయకయే, చేయువాడవు కమ్ము !

## ధ్రువీకరణము

సన్న్యాసమును గాదు, ఆహంకారిక కర్మయు గాదు, అజ్ఞానమోహములు నశించిన పిమ్మట సంభవమగు యోగస్థ కర్మయే గీతాసార మని ఉపసంహారమునందు అర్జును డిచ్చిన సమాధానమును మనకు ధ్రువీకరించి నుడువును :—

"హే కృష్ణా ! నీ ప్రసాదమువలన నాకు మోహము నశించి, జ్ఞానము ప్రాప్తించినది.(ఎవడు కర్త ? యను విషయమున) నాసర్వసందేహములు విచ్ఛిన్నము కాగా, నీ ఆదేశము ననుష్ఠించుటకు నడుముకట్టి నిలబడియున్నాను (18-73)." అనగా నీ ఆదేశమగు యుద్ధమునకు(3-30) నేను సిద్ధముగానున్నాను. గీతోపదేశము యొక్క ఈ పరమఫలితమును బట్టియు, యోగస్థ కర్మయే – జ్ఞానముచేత ఉద్ధరించబడినదియు (3-30), భక్తిచేత ప్రేరితమైనదియు (3-25, 6-31) నగు యోగస్థ కర్మయే గీతాహృదయ మని మనకు తెలియ నగును. ఇట్లు జ్ఞానము కర్మకు విరుద్ధము కాకపోగా, అది కర్మను ఉద్ధరించి, శుద్ధమొనరించి, భగవంతునికి ఆమోదయోగ్యము గావించును.

నాల్గవ అధ్యాయారంభమున ఒక ఆసక్తి కరమైన ప్రసక్తి కలదు. ఇది రాజర్షి పరంపరయందు ప్రచలితమైన పురాతన యోగ మని అచ్చట భగవానుడు వెల్లడించును (4-2,3). అనగా నిది సన్న్యాసముతో సంబంధము లేని రాజర్షులకు ప్రోక్తమైన ప్రబలయోగము.

అయితే "యోగస్థః కురు కర్మాణి" యను ఈ భవ్యస్థితి ఒకేసారి ఎగిరి అందుకొన వలనుపడునది గాదు. ఈ స్థితికి మూడు ముఖ్యసోపానములు గలవు.

## 1. కర్మయోగము

ఇందలి ప్రథమ సోపానము కర్మయోగము. ఇచ్చట సాధకుడు ఫలము కొఱకు కర్మ జేయక (2-47), కర్మ నొక యజ్ఞముగా పరమాత్మ కర్పించును(3-9). అయినను ఈ దశలో నత డింకను గుణభూమికలోనే యున్నాడు గావున, అతని కిచట, నేను కర్త - నను బుద్ధి యుండును. ఈ సోపానమున పట్టు కర్మపై నుండును.

అయితే అతడు కర్మఫలము నాశించుటలేదు గాన, జయాపజయములపట్ల అతనియందు అధికాధిక సమత పెంపొందును. అటులే యజ్ఞముగా కర్మసమర్పణ ఒక భక్తివృత్తిగాన, అతనియం దీ దశలోనే భక్తివికసింప నారంభించును. కాగా

భక్తితో గూడిన ఈ సమచిత్తతయందు (13-10) అతనికి సమతారూపమగు ఏకాత్మ సాక్షాత్కరించును. ఇది కర్మయజ్ఞముయొక్క జ్ఞానమయ పరిణామము, ప్రథమ ప్రకాశమయ ఫలితము.

## 2. జ్ఞానయోగము

ఇట్లు సాక్షాత్కరించిన ఆత్మయొక్కయు, ఆత్మకు ప్రతిగానుండు ప్రపంచము యొక్కయు యథార్థ స్వరూపజ్ఞాన మతని కిపుడు భాసింప నారంభించును. ఈ జ్ఞానమునందు అతడు సాధించు నిష్ఠయే జ్ఞానయోగము (18-50).

ఈ జ్ఞానమునందు ఆత్మ సాధకునికి సమము, నిష్క్రియము, నిర్వ్యక్తికము నగు అక్షరతత్త్వముగా (15-16) దర్శన మిచ్చును. ఈ మాఱని అక్షరతత్త్వమునకు ప్రతిగా అతని కిచట అనుక్షణము మాఱుచుండు విశ్వశక్తిరూపమగు క్షరతత్త్వమును గోచరించును. (15-16). కర్మ యంతయు అసమము, సక్రియము, సవ్యక్తికము నగు నీ క్షరశక్తియొక్క వ్యాపారమే యని అతడు గాంచును. ఇట్లు ఆత్మస్థుడైన సాధకు డిచట కర్మ చేయునది తాను గాక, ప్రకృతియే యని యెఱింగి, కర్మఫలముతోపాటు కర్తృత్వబుద్ధిని గూడ త్యజించును.

నిష్క్రియ ఆత్మ, సక్రియ ప్రకృతిరూపమగు ద్వంద్వ మింకను నిలిచి యుండును, వీని మధ్యను గల వ్యవధాన మింకను పూడలేదు.

ఇచ్చట పట్టు జ్ఞానముపై నుండును. అయినను కర్మయజ్ఞము కొన సాగుచునే యుండును, కర్మమార్గము జ్ఞానమార్గముతో ఏకమగునే గాని, దానిలో అంతరించి, లుప్తముగాదు.

## 3. భక్తియోగము

ఈ నిర్వ్యక్తికమగు (impersonal) ఆత్మయందు ప్రవేశించగనే మిథ్యావ్యక్తిత్వముతో మిళితమగు అహంకారము సర్వథా నశించిపోవును. అపుడు

అన్ని తత్త్వములును, వాని పరస్పర సంబంధములును తమ నిజరూపమున భాసించును. ఈ భాసమునందు ఏ పరమాత్మ కింతవనుక యజ్ఞము సమర్పించబడుచు వచ్చెనో, ఇపు డా పరమాత్మ ప్రస్ఫుటమగును. అక్షరాత్మ అతని ఒక పార్శ్వముగను, క్షరప్రకృతి అతని మఱియొక పార్శ్వముగను తెలియవచ్చును (15-17), మఱియు ప్రకృతిగతమగు జీవుడు అభివ్యక్తియందు అతని ఒకఅంశముగా విదితమగును. (15-7).

రెండవదియగు జ్ఞానభూమికయందు ఇట్లు తన మూలము గోచరించి నంతనే, అంతరాత్మ (జీవుడు) తన మూలమును జేరుకొన పరితపించును. మూలమగు ఆ పరమాత్మకు సాధకు డిపుడు తెలిసి తన ప్రేమను, భక్తిని, యజ్ఞకర్మను నివేదించుకొనును, తన సమస్త సత్తను అతనికే సమర్పించుకొనును (18-55), తన సమస్త చేతనను అతని దివ్య చేతనలోని కుద్ధరించుకొనును (18-65). అట్లు చేయుటవలన ప్రకృతికిని, ప్రకృతిద్వారా తాను చేయు కర్మలకును పరమునందు (above) భాసించు పరమాత్మయొక్క దివ్యఅతీతత్వమున పాలుపంచుకొని, సాధకుడు పరమాత్మ వలెనే పరిపూర్ణ ఆధ్యాత్మిక స్వేచ్ఛయందు దివ్యకర్మ చేయగలుగును.

ఏ పరమాత్మయందు, పురుషోత్తమునియందు క్షరాక్షరములు, అనగా సత్తాశక్తులు – రెండును ఏకమగునో, ద్వితీయ సోపానమున ఆత్మప్రకృతులకు గల అంతరము ఏ పరమాత్మయందు అంతరించునో, మఱియు జీవుడు జీవలోకమున ఏ పరమాత్మయొక్క ఒక అంశమో (15-7), ఆ పరమాత్మకు జీవుడు తన సత్తాశక్తులను సర్వాత్మనా సమర్పించుకొనుచు, ఆ పరమాత్మలోని కుద్ధరింపబడుటయే భక్తియోగము. ఇదియే పరిపూర్ణ దివ్యత్వమునకు తృతీయ సోపానము. ఇచ్చట పట్టు భక్తియం దుండును (18-54). అయినను జ్ఞానము అప్రధానము చేయబడదు, పైగా నది ఆత్మభూమికనుండి పరమాత్మ భూమికలోని కుద్ధరించబడి, భక్తితో అనుప్రాణితము, పరిపూర్ణము చేయబడును.

ఇట్లు చివరకు కర్మజ్ఞానముల ద్వివిధమార్గము కర్మజ్ఞానభక్తుల త్రివిధమార్గమగును. మఱియు నీ త్రివిధ పూర్ణమార్గముయొక్క పరమఫలమగు భగవంతునితో సాయుజ్యమును (18-65), భగవంతుని ప్రకృతితో సాధర్మ్యమును (14-2) సాధకుని కిపుడు ప్రాప్తించును.

## పరిష్కారమే గాదు, సంసిద్ధియును

ఈ త్రివిధమార్గముయొక్క చరమదశయందు మనకు భగవంతునితో సాక్షాత్సంయోగము ప్రాప్తించును, మన మపుడు యోగస్థులమై కర్మచేయగలుగుదుము; వేఱు మాటలలో భగవంతుడే మనద్వారా కర్మ చేయుచున్నాడని కనుగొందుము. కావున నపుడు కర్మనిర్ణయమునకు గాని, కర్మానుష్ఠానమునకు గాని, సంబంధించిన సమస్య మన కేమియు నుండదు; ఇట్లు "యోగస్థః కురు కర్మాణి" సాధనచే మన కర్మసమస్యకు పరమ పరిష్కారము లభించును. కాని ఇది మాత్రమే ఈ సాధన యొక్క పరమ ఫలితము గాదు.

ఈ సాధనను ఇంకను, ఇంకను కొనసాగించుటచే మనము భగవంతునితో సంయోగమునే గాక, అతనియందు నెలకొని, అతనియందే ప్రతిష్ఠను పొందగలిగెదము (6-31), చివరకు అతని సత్తతో సాయుజ్యమును, అతని ప్రకృతితో సాధర్మ్యమును, సాధించగలిగెదము (18-55). ఇదియే జీవాత్మ అందించగలిగిన మహోన్నత సంసిద్ధి.

మనము గీతాహృదయముగా దర్శించిన "యోగస్థః కురు కర్మాణి"వలన ప్రాప్తమైన ఈ సంసిద్ధియొక్క ఒకటి, రెండు విశిష్టతలను జూతము.

## గీతాసంసిద్ధి సర్వసమగ్రత

గీతామార్గము సమగ్ర త్రిమార్గమై నటులే, గీతాసిద్ధియు సర్వసమగ్రము, చూడుడు; ఏకాత్మజ్ఞానము (6-29) ఈ సంసిద్ధియందు ద్వితీయ సోపానము.

కావున దీనియందు అద్వైతము గలదు. పోగా ప్రథమ సోపానమున, నేను చేయుచున్నాను (3-27) - అను యీ గుణమాయ (7-14) గలదో, అది ఆత్మసోపానమున అతిక్రమించబడి, పరమాత్మపదమున స్వాధీనము చేసికొనబడును. ఇట్లు గీతా సంసిద్ధి మాయను (మాయావాదమును) గుర్తించి, ఆ మాయయొక్క కోటలను పీకివేసి, దానిని దివ్యలీలకు సాధనము గావించుకొనును (4-6). తర్వాత, ఆత్మయందు మనము భగవంతునితో ఏకముగా నుండుచునే, అభివ్యక్తియందు అతని శాశ్వతాంశముగా (15-7) నుందుము. ఇట్లు బ్రహ్మభూతుల మయ్యును (18-54) ఈ సంసిద్ధియందు మనము భగవంతునియందు నివసింతుము (12-8); అనగా నిచ్చట అద్వైతముతోబాటు విశిష్టాద్వైతమును గలదు. ఇంకను, ఈ సంసిద్ధియందు నిష్క్రియ పురుషుడు సక్రియ ప్రకృతి-ఉభయులు గలరు (13-20). అయితే ఈ ఉభయులు పురుషోత్తమునిలో (15-17) ఏకముచేయబడుదురు. కావున గీతా సంసిద్ధియందు తన పూర్ణస్థితి కుద్ధరించబడిన సాంఖ్యమును గలదు ఇచ్చట పరభక్తికి అవకాశ మిచ్చు జీవేశ్వరుల భేదాభేదము గలదు గాన, ఇందు వైష్ణవభక్తివాదమునకును స్థానము గలదు (6-47). నరుని హృదయమున సదా నారాయణుడు అవస్థితుడై యుండును (18-6 ); గాన, ఇచ్చట నరనారాయణ భావమును గలదు. ఈ పూర్ణ సంసిద్ధియందు వీని అన్నింటి అనుభవము మనకు గలుగుచుండును.

## ప్రకృతి పరివర్తనము

ఈ సంసిద్ధియందు వీని నన్నింటిని మించిన మఱియొక అపూర్వసామర్థ్యమును గలదు. యోగస్థుడవై కర్మ చేయుము - అను సాధనయందు నీవు పరమున నెలకొని, ఇహమున పనిజేతువు; ఇట్లు పరతత్త్వమునకును, పార్థివతత్త్వమునకును మధ్యగల అంతరమును కలిపివేతువు, జడచేతనముల సంయోగమును సాధింతువు. అందుచేత నిది భగవంతుని చిచ్ఛక్తిచేత జడప్రకృతిని మార్చివేయగల కీలకమగును. కార్యోన్ముఖమైన ఈ చిచ్ఛక్తియే శ్రీ అరవిందుని దర్శనమున పరమ విశిష్టమగు <u>అతిమనస్సు</u>. ఈ అతిమనఃశక్తి ప్రకృతినుండి అంతరాత్మ మోక్షమునే

గాక, అజ్ఞానాహంకారములనుండి ప్రకృతిమోక్షమును (13-35) గూడ సాధించును: అంతే కాదు, తన దివ్యతను గట్టిపెట్టి చిచ్ఛక్తి అపరప్రకృతిని దివ్యీకరించును గూడ. దీనినే భగవంతుని ప్రకృతితో జీవుని సాధర్మ్య మందుము.

సాయుజ్యముపై విలసిల్లు ఈ సాధర్మ్యమే సృష్టిపరిణామముయొక్క చరమలక్ష్య మని శ్రీ అరవిందదర్శనము. ఇట్లు గాక, ప్రకృతినుండి మోక్షమే, జననరాహిత్యమే సృష్టి లక్ష్య మగుచో, అసలు మనము జన్మించు టెందులకు ? - అని శ్రీమాత సూటిగా ప్రశ్నించును. అపుడు సృష్టి నిరర్థక మగును-సృష్టి క్రియ కెట్టి అర్థము నుండదు.

## దివ్యీకరణ బాహ్యరూపము

అతిమనఃశక్తివలన సిద్ధించు నీ దివ్యీకరణము అత్యంత బాహ్యప్రకృతిని గూడ చేపట్టును. ఈ బాహ్యతమ పరివర్తనము నిమిత్తము గీతామాత మనకు విధించు సాధన -

"మన్మనా భవ" (18-65),
మచ్చిత్తో భవ (18-57).

వీనికి శ్రీ శంకరాదులు చెప్పు అర్థము.

నాయందు మనస్సు నుంచుము,
నాయందు చిత్తము నుంచుము.

పోగా, శ్రీ అరవిందుడు చెప్పు అర్థము —

మమ మనో యస్య తవ, స త్వం మన్మనాః (భవ),

అనగా, నా మనస్సునే నీ మనస్సుగా గల్గియుండుము. అయితే నా చిత్తమునే నీ చిత్తముగా గల్గియుండుము—అని భగవంతు డుపదేశించును. చిత్త మన సమస్త చేతనయు, అందుచేత సందర్భమును బట్టి చిత్త మను పదమును కర్మ మీచట శరీర చేతన యని శ్రీ అరవిందుడు నిశితముగా వ్యాఖ్యానించును.

చూడుడు, శ్రీ అరవిందునికి, ఇతరులకు నిచట ఎంత అంతరమున్నదో! శ్రీ అరవింద ననుసరించి, మన మనస్సును, చిత్తమును భగవంతునివే అయినపుడు భగవంతుడే మనయందు సంకల్పించును, చింతించును, అనగా మనయందు జీవించువాడు భగవంతుడే యగును, అథవా మనము అహంకారరూపమున గాక, భగవంతుని ప్రకృతితో భగవద్రూపమున జీవింతుము. ఇట్లు శ్రీ అరవిందుని వ్యాఖ్యానము భావి దివ్యసృష్టికి దారితీయు వ్యాఖ్యానము, కావుననే దానిని భావి వ్యాఖ్యాన మనియున్నాము.

## "సర్వథా వర్తమానోఽపి"

ఈ సంసిద్ధినిపుడు ఇంచుక సామాన్యసిద్ధితో బోల్చిచూతము. "జ్ఞానవంతుడైనను తన ప్రకృతి కనుగుణముగనే వ్యవహరించును." (3-33), మఱియు "విద్వాంసుని మనస్సును గూడ అతని ఇంద్రియములు బలాత్కారముగా హరించుకొనిపోవును." (2-60)-అని గీత యొకచోట జెప్పును. మఱియొకచోట నదే గీత, "గుణములచేత విచలితుడుగాడు" (14-23)-అని పలికి, చివరకు "జీవనమునందును, కర్మలయందును ఆ యోగి ఎంతస్వేచ్ఛగా వర్తించినను, నాయందే వర్తించును గాని, చ్యుతుడు గాడు," (6-31) అని ముగించును. ఈ గీతావాక్యాలు పరస్పరవిరుద్ధములా, లేక వీనికి సమన్వయ మున్నదా? ఉన్నది; అదే గీతామహిమ —

"నేతినేతి", అనగా "ఇది కాదు, ఇది కాదు" అను నిషేధమార్గమున గుణమయ ప్రకృతిని నిరాకరించుచు, లోనికి పోయినవానికి, ఆ ప్రకృతిని విడగొట్టి, లోనికి పోవుచున్నాడు గాన, వానికి మూలమగు పరప్రకృతి (7-5) అతనికి గోచరించదు. ఇక లోనికి పోయి, నిర్గుణాత్మయందు సమాధిలో నున్నంతకాలము, అతనిని గుణములు చలింపజేయవు; మఱియు జాగ్రదవస్థలో సైతము తాను వ్యవహరించక, ఇతరుల వ్యవహారమును ఉదాసీనుడై [ఉత్ = పైన ఆత్మయందు,

ఆసీనుడై = కూర్చుండి] చూచుచున్నంతకాలము విచలితుడు గాడు (14-23). పోతే, తాను స్వయముగా వ్యవహరించు నపుడు, వ్యవహార మంతయు ప్రకృతిదే గనుకను, అతనికి పరప్రకృతి పట్టుబడలేదు గనుకను, అతడు తన అపర ప్రకృతిలోనికి జాఱిపోయి, దాని కనుగుణముగా మాత్రమే వ్యవహరించక తప్పదు (3-33).

ఇక నిట్లు గాక, కర్మయోగముతో ప్రారంభించి, దానిని చివరంట గొనసాగించుచు, తనగుణప్రకృతిని ఉద్ధరించుకొనుచు, ఎవడు క్రమముగా నిర్గుణాత్మకు పైన విలసిల్లు ప్రకృతి ప్రభువగు పరమేశ్వరునిలోని కారోహించునో, అతనికి ఆ పరమేశ్వరుని పరప్రకృతి పట్టువడును. అపుడు అతడు ఆ ప్రకృతిద్వారానే వ్యవహరించును గాన, వ్యవహారము నిమిత్తము క్రింది ప్రకృతిలోనికి చ్యుతుడు గావలసిన ఆవశ్యకత యుండదు. మఱియు నతని అపర ప్రకృతి దివ్యప్రకృతిలోని కుద్ధరించబడినది గాన, అది అతని లీలకు సాధకమే యగును గాని, బాధకము గాదు. ఇట్లు అతడు అపర ప్రకృతికి పైన విలసిల్లు పరప్రకృతినుండి వ్యవహరించును గాన, అత డెట్లు వర్తించినను, "నాయందే" (6-31) వర్తించును.

ఇట్లు గీతాసంసిద్ధియందు మనసు ప్రకృతికి ప్రభువుగా వ్యవహరించు చుండగా, మాయావాదము లక్షించు జ్ఞానసిద్ధియందు ప్రకృతికి దాసులమై పనిజేతుము.

## లక్ష్యము జన్మరాహిత్యము గాదు

ఇట్లు వ్యవహారమునందు సైతము పూర్ణయోగి ప్రకృతి కతీతుడై యుండును గావునను, జననమరణములు సైతము ప్రకృతి క్రియలే గావునను, అతడు జనన మరణములకు భయపడడు; అతడు ఈశ్వరునివలె అజుడుగనేయుండి జనించును (4-6). తన ప్రకృతిగతసత్తయందు అతడు సైతము బాధల ననుభవించవలసి యుండును గదా?—అందురేమో, కాదు, అదియును చివరి కుండదు—అని శ్రీ అరవిందుడు తన అనుభవమును వెల్లడించును.

చివరకు, శరీరముయొక్క అణువణువునందు సైతము నిండియున్న సచ్చిదానందుని సాక్షాత్కరించుకొని నపుడు, బాధయు ఆనందముయొక్క ఒక రీతిగనే అనుభూత మగును. కావున అంతయు లీలాప్రాయమే యగును.

పోతే, అట్టి పూర్ణయోగి లక్ష్యము? అత డిపుడు తన యిచ్ఛను భగవదిచ్ఛతో నేకముచేసికొని యున్నాడు. ఆ భగవదిచ్ఛను స్వేచ్ఛగా వర్తింపచు, ఆ నిర్వహణలోని మహదానందము చూఱగొనుచు, సృష్టికార్యమును ముందుకు నడుపుటయే (3-25) అతని లక్ష్యము, కాదు, అతని సహజ ప్రవృత్తి.

ఇంకను ఇట్టి రహస్యముల నెన్నింటినో మనము శ్రీ అరవిందుని గీతా వ్యాఖ్యానమున దర్శించి హర్షించగలము. కాని మన మీ ప్రస్తుత గ్రంథమున నిర్ణయించుకొనిన పరిధి కడు పరిమితము. కాగా నీ పరిమిత పరిధిలోనే ఆ రహస్యములలో కొన్నింటిని పాఠకలోకమునకు పరిచయముచేయ దలంచుచున్నాము — ఇదియే ఈ ప్రయత్నము వెనుక నున్న ఉద్దేశ్యము.

## తులనాత్మక పరిశీలన

కాగా, తులనాత్మకముగా పోల్చి చూపిన, ఆ విశేషములు మఱింత హత్తుకొనగలవు. అందుచేత ఆయా శ్లోకముల క్రింద శ్రీ శంకరాదులు చేసిన వ్యాఖ్యలలోని అంశములు గూడ సరసనే చూపబడును. ఈ విధానములో ఎవ్వరినీ కించపఱచు ఆలోచన లేదని మనవి.

శ్రీ రాముడు తన అవతారకాలమున సాత్త్వికధర్మమును స్థాపించ వచ్చెను. అటుపిమ్మట శ్రీ కృష్ణుడు వచ్చి, సాత్త్వికధర్మమును మించిన గుణాతీత ధర్మమునకు అంకురార్పణ గావించె ననీ, ఉన్న సత్యమును జెప్పిన, అది శ్రీరాముని కించపఱచుట యగునా? అసలు రామ కృష్ణ లుభయులు ఒకరే గాదా? అటులే

శ్రీ శంకరుడే తిరిగి ఈ కాలమున వచ్చి యుండిన, మఱికొంత ముందునకు బోయి యుండును. అందుచేత శ్రీ శంకరునితో గాని, బుద్ధదేవునితో గాని శ్రీ అరవిందుని బోల్చి చూపినపుడు, అందు వారిని కించపఱచు ప్రసక్తియే మనము రానీయగూడదు.

కావున పూర్వమే ఏర్పఱచుకొనిన ఎట్టి దురభిమానములు లేని నిర్మల చిత్తముతో ఈ చిన్నపొత్తము నధ్యయనము గావించి, అందలి క్రొత్త పోకడలను, నూతన సత్యములను గ్రహించెదము గాక! అట్లు చేసిన, ఆ మేరకు ఈ ప్రయత్నము ఫలించిన దగును.

శ్రీ కృష్ణార్పణ మస్తు!

గ్రంథకర్త.



# గీ తాం జ లిః

గీతాకల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితం
వేదవ్యాస వివర్ధితం శ్రుతిశిరోబీజం ప్రబోధాంకురం,
నానాశాస్త్రరహస్యశాఖ మరతిక్షాంతి ప్రవాళాంకితం
కృష్ణాంఘ్రిద్వయ భక్తిపుష్పసురభిం మోక్షప్రదం జ్ఞానినాం.

గీత యొక కల్పవృక్షము; దానిని నాటినవాడు శ్రీకృష్ణుడు, పెంచినవాడు వేదవ్యాసుడు; ఆ వృక్షబీజము ఉపనిషత్తులు, ఆ బీజముయొక్క మొదటి మొలక మెలకువ, నానాశాస్త్ర రహస్యములు దాని శాఖలు, క్షమావైరాగ్యములు దాని చిగుళ్లు, శ్రీకృష్ణుని పాదారవిందముల యందలి భక్తియే దానియందు వికసించి, సౌరభమును వెదజల్లు పుష్పము, తోగా జ్ఞానముద్వారా ప్రాప్తించు మోక్షమే దాని ఫలము.

సర్వశాస్త్ర మయీ గీతా సర్వదేవమయీ యతః,
సర్వధర్మమయీ యస్మాత్ తస్మా దేతాం సమభ్యసేత్.

భగవద్గీత సర్వశాస్త్రమయము, సర్వదేవమయము, సర్వధర్మమయము; కావున బాగుగా గీతాభ్యాసము చేయదగును.

# అథ గురుధ్యానం

ఓం నమో బ్రహ్మాదిభ్యో
బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో
వంశ ఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః.

ఓం నమోహి ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైక మూర్తయే,
నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః. 1

ఓం హయాస్యా ద్యవతారైస్తు జ్ఞానసిద్ధా మునీశ్వరాః,
కృతార్థతాం గతా స్తంవై నారాయణ ముపాస్మహే. 2

ఓం వేదతత్త్వై ర్మహావాక్యైర్ వశిష్ఠాద్యా మహర్షయః,
చతుర్భి శ్చతురా ఆసన్, తంవై పద్మభువం భజే. 3

ఓం బ్రహ్మర్షిర్ బ్రహ్మవిద్వర్యో బ్రహ్మణ్యో బ్రాహ్మణప్రియః,
తపస్వీ తత్త్వవిద్యస్తు తం వశిష్ఠం భజేఽన్వహం. 4

ఓం యోగజ్ఞం యోగినాం వర్యం బ్రహ్మజ్ఞాన విభూషితం,
శ్రీ మద్ వసిష్ఠతనయం శక్తిం వందే మహామునిం. 5

ఓం ధర్మజ్ఞం ధార్మికం ధీరం ధర్మాత్మానం దయానిధిం,
ధర్మశాస్త్ర ప్రవక్తారం పరాశరమునిం భజే. 6

ఓం కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతం,
వేదాబ్జభాస్కరం వందే శమాదినిలయం మునిం. 7

ఓం శ్రీపరాశర పౌత్రం శ్రీ — వ్యాసపుత్ర మకల్మషం,
నిత్య వైరాగ్య సంపన్నం జీవన్ముక్తం శుకం భజే. 8

ఓం మాండూక్య కారికాకర్తా యో భాతి బ్రహ్మవిద్వరః,
శ్రీ గౌడపాదాచార్యం తం—ప్రణమామి ముహుర్ముహుః.

ఓం యోగీశ్వరం వేదచూడం వేదాంతార్థ నిధిం మునిం,
గోవిందభగవత్పాదా—చార్యవర్య ముపాస్మహే. 10

ఓం హరలీలావతారాయ శంకరాయ పరౌజసే,
కైవల్యకలనా కల్ప - తరవే గురవే నమః. 11

ఓం బ్రహ్మణేవ మూర్తిమతే శ్రుతానాం శుద్ధిహేతవే,
నారాయణ యతీంద్రాయ తస్మై శ్రీగురవే నమః. 12

ఓం నారాయణ సమారంభాం శ్రీకృష్ణవరమధ్యమాం,
అస్మద్గురూత్తమాంతాంచ వందే గురుపరంపరాం. 13

ఓం మంగళం గురుదేవాయ మహనీయ గుణాత్మనే,
సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళం. 14

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ -

ఇతి మధ్యమాభ్యాం నమః,

నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః -

ఇత్యనామికాభ్యాం నమః,

పశ్యమే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః

ఇతి కనిష్ఠికాభ్యాం నమః,

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ -

ఇతి కరతల కరపృష్ఠాభ్యాం నమః,

## అథ అంగన్యాసః

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః -

ఇతి హృదయాయ నమః,

నచైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః -

ఇతి శిరసే స్వాహా,

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ -

ఇతి శిఖాయై వషట్,

నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః -

ఇతి కవచాయ హుం,

పశ్యమే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః -

ఇతి నేత్రత్రయాయ వౌషట్,

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ -

ఇత్యస్త్రాయ ఫట్,

# అథ ధ్యానం

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతం,
అద్వైతామృత వర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీం
అంబ ! త్వా మనుసంధధామి భగవద్గీతే ! భవద్వేషిణీం. 1

నమోఽస్తు తే వ్యాస ! విశాలబుద్ధే !
ఫుల్లారవిందాయత పత్రనేత్ర!
యేన త్వయా భారతతైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయ ప్రదీపః. 2

ప్రపన్న పారిజాతాయ తోత్రవే త్రైకపాణయే,
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః. 3
సర్వోపనిషదో గావో, దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీర్ భోక్తా, దుగ్ధం గీతామృతం మహత్. 4
వసుదేవసుతం దేవం కంసచాణూర మర్దనం,
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుం. 5

భీష్మద్రోణతటా జయద్రథజలా గాంధారనీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా,
అశ్వత్థామవికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ, కైవర్తకః కేశవః. 6

# అథ గీతాపారవిధిః

ఓం శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే.

ఓం గురుర్ బ్రహ్మా గురుర్ విష్ణుర్ గురుర్ దేవోమహేశ్వరః
గురుః సాక్షాత్ పరం బ్రహ్మ, తస్మై శ్రీ గురవే నమః.

ఓం కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనం,
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిం.

ఓం వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే,
నమోవై బ్రహ్మనిధయే వాశిష్ఠాయ నమోనమః.

ఓం నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.

గీతాపారాయణము చేయు నపుడు, అర్జునునకు గీతోపదేశము చేయు చున్న శ్రీకృష్ణ భగవానుడును, తదుపదేశ అర్థమును మన మనస్సులో స్ఫురించుచుండ దగును. ప్రయత్నించిన నెమ్మదినెమ్మదిగా అట్లు చేయ గలిగెదము.

## అథ వినియోగః

ఓం అస్య శ్రీభగద్గీతాశాస్త్ర మహామంత్రస్య
శ్రీవేదవ్యాసో భగవాన్ ఋషిః,
అనుష్టుప్ఛందః,
శ్రీకృష్ణ పరమాత్మా దేవతా,
అశోచ్యా నన్వశోచ స్త్వం – ఇతి బీజం,
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ –ఇతి శక్తిః,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.
– ఇతి కీలకం.
మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్ తరిష్యసి– ఇతి కవచం,
కిరీటినం గదినం చక్రహస్తం – ఇత్యస్త్రం,
అనాదిమధ్యాంత మనంతవీర్యం – ఇతి ధ్యానం,
శ్రీ కృష్ణ పరమాత్మ ప్రీత్యర్థే పారాయణే వినియోగః.

## అథ కరన్యాసః

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః –
ఇత్యంగుష్ఠాభ్యాం నమః,
న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః –
ఇతి తర్జనీభ్యాం నమః,

## అథ ధ్యానం

పారాశర్యవచః సరోజ మమలం గీతార్థగంధోత్కటం
నానాఖ్యానకకేసరం హరికథా సద్భానునా బోధితం,
లోకే సజ్జనషట్పదై రహరహః పేపీయమానం ముదా
భూయాద్ భారతపంకజం కలిమలప్రధ్వంసి నః శ్రేయసే. 7

భారతామృత సర్వస్వం విష్ణోర్ వక్త్రాద్ వినిస్సృతం,
గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే. 8

గీతా సుగీతా కర్తవ్యా కి మన్యైః శాస్త్రవిస్తరైః,
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్ వినిస్సృతా. 9

మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం,
యత్కృపా త మహం వందే పరమానంద మాధవం. 10

యం బ్రహ్మా వరుణేంద్రరుద్రమరుతః స్తున్వంతి దివ్యైః స్తవైః
వేదైః సాంగపదక్రమోపనిషదై ర్గాయంతి యం సామగాః,
ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినో
యస్యాంతం న విదుః సురాసురగణా దేవాయ తస్మై నమః

—)(—

# సర్వజ్ఞత్వము

గీత ఆధ్యాత్మిక సత్యము మఱియు అనుభవములయొక్క సమస్త ప్రపంచము పైనను తెఱచుకొను ఒక మహాకవాటము, మఱియు నా కవాటరూపమున అది మనకు ప్రసాదించు దృష్టిలోనికి పరమధామముయొక్క సర్వప్రాంతములు వచ్చివేయును.

—శ్రీ అరవిందుడు

శ్రీ అరవిందు డిట్లు పరామర్శించుటకు మూలమగు గీతాశ్లోకమును గనుడు.—

యో మా మేవ మసమ్మూఢో
జానాతి పురుషోత్తమం,
స సర్వవిద్ భజతి మాం
సర్వభావేన భారత ! గీత : 15–19

మోహమును బాసి, ఎవడు నన్నిట్టుల పురుషోత్తమునిగా నెఱుంగునో, అతడు సర్వవిదు డగును, మఱియు సర్వమునందును నన్ను గాంచుచు, సర్వాత్మనా సేవించును. [సేవించుచు సర్వవిదు డగును, సర్వవిదుడై సర్వాత్మనా సేవించును. ఇచ్చట మనకు సాధన, సాఫల్యము, సిద్ధజీవనము - మూడును గన్పించును.]



శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీ గీ తా యో గ మం తి

## అథ ప్రథమోఽధ్యాయః

## అర్జున విషాదయోగః

ఒక పరిశీలన :— మనము 'నేను – పదమును ఏకవచనములో వాడు చున్నప్పటికి, ప్రతివానిలోను ఈ నేను–వెనుక అనేక నేను లుండును. ఉదాహరణకు, జూద మాడగూడ దని ఒకనియందలి ఒక నేను నిశ్చయించుకొన్నను, మఱియొక నేను మెడలువిఱిచి, అతనిచేత లదే జూదము నాడించును, బలాత్కారముగా పాపమును జేయించును (గీత : 3–36). ఈ నేనులను నిశితముగా గుర్తించి, ప్రతి నేను – చర్యను విడివిడిగా చూపుట శ్రీ అరవిందుని ప్రత్యేకత. ఈ రీతిగా అర్జునుని సంపూర్ణ విషాదమును ఆయ నిట్లు వివేచించి చూపును—

ఆ విషాదము మున్ముందు హత్యాకృత్యమునకు భీతిల్లిన నాడీ మయ నేను – యొక్క బాహ్య సంకోచము (3–1). తర్వాత, అది 'స్వజనులను' (1–37) కోల్పోవుటచేత కలుగగల శోకశూన్యతలకు వెఱచిన హృదయాత్మక నేను – యొక్క విషాదము. పిమ్మట, పూజ్యులగు భీష్మద్రోణాదులను వధించిన, ఘోరపాపము(1–36) కట్టికుడుపు నను నైతి కాహంకారముయొక్క విషాదము. ఇంకను, ఈ ప్రచండ యుద్ధమువలన జాతికిజాతియే నశించి పోవునను బౌద్ధికాహంకారము యొక్క భయము, విషాదము (1–43). ఇట్టి విషాదము తన సత్తయొక్క సర్వ విభాగములను ఆవహించినది గావుననే, అర్జునుడు కుప్పకూలిపోయెను.

శ్రీ అరవిందు డిచట మనకు దెలుపు మఱియొక విశేష మేమన, యుద్ధమున తా నెవరిని వధించవలెనో, అర్జునునికి ముందే తెలియును, అందుకు సిద్ధపడియే అతడు యుద్ధరంగమునకు వచ్చెను. అయినపుడు అత డెందుకు కుప్పగూలి పోయెను ? అది అతని సారథియగు, సూత్రధారియగు శ్రీకృష్ణుని చర్య – యుద్ధము యొక్క నగ్నస్వరూపము అపుడు మాత్రమే అతని గుండెలలో గ్రుచ్చుకొనెను, అట్లు గ్రుచ్చుకొను నట్లు చేసినది ఆ దివ్యఘటకుడు. అట్లు చేసిన గాని,అర్జునుడు జావగాఱిపోయి, 'శిష్యుడను, ప్రపన్నుడనై యాచించుచున్నాను' (2–7) – అని భగవానుని ఉపదేశము నర్థించడు.

అయితే ఈ రహస్యము శ్రీ అరవిందుడు మాత్రమే మన కెందుచేత వెల్లడించగలిగెను. ఎందుచేత నన, ఆ శ్రీకృష్ణుడే శ్రీ అరవిందుని సైతము 1909 లో జైలులో వేయించి, అటులే పేడుకొనునట్లు చేసెను:

ఇవి మనకు ఇతర వ్యాఖ్యానములనుండి లభించు విశేషములు

ధృతరాష్ట్ర ఉవాచ :—

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కి మకుర్వత సంజయ. 1

ధృతరాష్ట్రు డడిగెను – నా వారును పాండవులును, ఓ సంజయా: యుద్ధ సంకల్పముతో ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమున కేగిరి గదా, అపు డేమి జరిగెను?

విశేషార్థము ; కురుక్షేత్రము రక్తము చిందించు భయంకర యుద్ధ రంగము గదా! అది ధర్మక్షేత్ర మెట్లు కాగలదు ?

"భక్షకుడు భక్షించుచు భక్షింపబడును" – ఇది భౌతిక ప్రపంచమును శాసించు జీవననియమము. కావున ఎట్లును కొంతవఱకు హింస తప్పదు. మఱియు విచక్షణాయుతమైన వినాశము సృష్టికి మూలము." — ఇది జీవనవికాస నియమము. కనుక యుద్ధము ధర్మయుద్ధము కాగలదు. కురుక్షేత్రము ధర్మక్షేత్రము కాగలదు.

తదితర మతములకు సాధ్యము కాని గభీరతను ఆధ్యాత్మికతను భారతీయ మత మెట్లు సృజించగలిగెను ? కరాళకాలియు భగవంతుడే (11-22) యని సూటిగా గుర్తించి, యుద్ధము మఱియు శాంతి ఎవనియందు కలియునో, అట్టి పురుషోత్తముని, తన లక్ష్యము గావించుకొనుటచేతనే – యని శ్రీ అరవిందుడు తెలుపును, రుద్రునికి చెల్లించవలసిన ఋణము ఇంకను ఉన్న దని ఆయన వక్కాణించును.

సంజయ ఉవాచ :—

దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా,
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. 2

సంజయుడు చెప్పెను — వ్యూహాకారముగా రచింపబడియున్న పాండవ సైన్యము నపుడు దుర్యోధనుడు వీక్షించి, ద్రోణాచార్యుని సమీపించి, రారాజుగా తా నిటుల పలికెను.

పశ్యైతాం పాండుపుత్రాణాం ఆచార్య మహతీం చమూం,
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా. 3

ఆచార్యవర్యా ! చతురుడగు మీ శిష్యుడు, ధృష్టద్యుమ్నునిచే రచింపబడియున్న పాండవుల ఈ మహాసైన్యమును పరికించుడు.

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః. 4

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్,
పురుజిత్ కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. 5

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః. 6

ఈ పాండవ సేనయందు గొప్పవిలుకాండ్రు, యుద్ధమున భీమార్జునులకు దీటువచ్చు శూరు లెందరో గలరు : యుయుధానుడు, విరాటుడు, మహారథుడగు ద్రుపదుడు, ధృష్టకేతువు, చేకితానుడు, వీర్యవంతుడగు కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, నరశ్రేష్ఠుడగు శైబ్యుడు, పరాక్రమశాలియగు యుధామన్యువు, వీర్యవంతుడగు ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ద్రౌపదీపుత్రులును గలరు. వీ రందరును మహారథులే.

అస్మాకంతు విశిష్టా యే తాన్ నిబోధ ద్విజోత్తమ,
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. 7

పోగా మనలోని ప్రముఖుల, నా సైన్యముయొక్క నాయకులు నగువారిని, ఓ బ్రాహ్మణోత్తమా ! మీ గుర్తుకొఱకు తెలుపుచున్నాను.

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిర్ జయద్రథః. 8

అన్యేచ బహవః శూరా మదర్థే త్యక్తజీవితాః,
నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః. 9

మీరును, భీష్ముడును, కర్ణుడును, జయశీలి కృపాచార్యుడును, అశ్వత్థామయు, నా తమ్ముడు వికర్ణుడును, భూరిశ్రవుడును, సైంధవుడును ఇందు గలరు. ఇంకను నాకొఱకు తమ జీవితమును ధారవోసిన పెక్కుమంది శూరవర్యులు గలరు. వీ రందరును నానా శస్త్ర ప్రయోగ సమర్థులు, యుద్ధనిపుణులు.

అపర్యాప్తం త దస్మాకం బలం భీష్మాభిరక్షితం,
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితం. 10

భీష్మునిచేత రక్షింపబడుచు (దూరదూరమువఱకు వ్యాపించియున్న) ఆ మన చతురంగబలము అపరిమితము కాగా, భీమునిచేత రక్షింపబడుచు (ఇచ్చటచ్చటే యున్న) ఈ పాండవుల బలము పరిమితము.

విశేషార్థము : 'అపర్యాప్తం' = పరిమితము, 'పర్యాప్తం' = అపరిమితము - అని కూడ వాడుక అర్థములు గలవు. అపుడు మన బలము పరిమితము, పాండవుల బలము అపరిమితము - అని చెప్పుకొనవలెను. భీష్ముడు మనసా పాండవపక్షపాతి గనుక, ఇట్లు పాండవ బలమే అపరిమిత మని శ్రీధరవ్యాఖ్యానము.

అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః,
భీష్మమే వాభిరక్షంతు భవంతః సర్వ ఏవహిః. 11

కాగా వ్యూహద్వారము లన్నింటియందును మీమీ నియమిత స్థానముల నిలిచి, మీరందఱును అన్నివైపులనుంచి భీష్మునే రక్షించెదరు గాక.

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్. 12

(ఆవాక్యములనువిని) దుర్యోధనునికి హర్షము రేకెత్తించుచు, కురువృద్ధుడగు భీష్మపితామహుడు తన ప్రతాపమునకు దీటుగా గొంతెత్తి సింహనాదము గావించి, శంఖమును పూరించెను.

తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః,
సహసై వాభ్యహన్యంత స శబ్ద స్తుములోఽభవత్. 13

దాని వెనువెంటనే శంఖములు, భేరులు, ఢక్కలు, మృదంగములు, రణశృంగములు హఠాత్తుగా ప్రయోగింపబడెను. ఆ భీషణధ్వనులతో దిక్కులు పిక్కటిల్లెను.

తతః శ్వేతైర్ హయైర్ యుక్తే మహతి స్యందనే స్థితౌ,
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. 14

అటు పిమ్మట తెల్లని గుఱ్ఱముల బూన్చిన మహారథమునందు గూర్చొని యున్న కృష్ణార్జును లిరువురు తమ దివ్యశంఖములను బలముగా నూదిరి.

విశేషార్థము : శరీరరథమునందు ఆసీనులై యున్న నరనారాయణులకు, జీవేశ్వరులకు (18-61) యుద్ధరథమునందు దర్శన మిచ్చు కృష్ణార్జునులు ప్రతి రూపములు.

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. 15

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః,
నకులః సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ. 16

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీచ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః. 17
ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్.

పాంచజన్య మను శంఖమును కృష్ణుడును, దేవదత్తమను దానిని అర్జునుడును, పౌండ్ర మను మహాశంఖమును భయంకరకర్ముడగు భీముడును ఊదిరి. అటులే యుధిష్ఠిరుడు అనంతవిజయ మను శంఖమును, నకులుడు సుఘోషమును,సహదేవుడు మణిపుష్పకమును పూరించిరి. ఇంకను గొప్ప విలుకాడగు కాశీరాజు, మహారథు డగు శిఖండి, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, పరాజయ మెఱుగని సాత్యకి, ద్రుపదుడు, ద్రౌపదీపుత్రులు, మహాబాహువగు సుభద్రాపుత్రుడు, ధృతరాష్ట్రమహారాజా ! తమ తమ శంఖములను సేనయం దంతటను వేఱువేఱుగా పూరించిరి.

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్. 19

పాండవవీరుల భయంకరమగు ఆ శంఖధ్వనులు భూనభోంతరముల మాఱు మ్రోగుచు, దుర్యోధనాదుల హృదయము నదరగొట్టెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః. 20
హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే !

అపుడు కపిధ్వజుడైన అర్జునుడు యుద్ధసన్నద్ధులై యున్న ధృతరాష్ట్రపుత్రులను జూచి, తన ధనస్సు నందుకొని, శస్త్రప్రయోగము ఆరంభము కానుండగా, ఓ ధృతరాష్ట్రమహారాజా! తన సారథి ని ట్లర్థించెను_

అర్జున ఉవాచ:_

సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత 21
యావ దేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్,
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే. 22

అర్జును డర్థించెను_ఈ రణసంరంభమునందు నే నెవరితో పోరాడవలయునో, యుద్ధకాములై ఎదురుగా నిలబడిన అట్టివారి నించుక చూచెదను; దయచేసి ఓ కృష్ణా! రథము నుభయసేనల మధ్య నిలుపుము.

యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్ యుద్ధే ప్రియచికీర్షవః. 23

దుర్బుద్ధియగు దుర్యోధనునికి యుద్ధమున ప్రియము చేయగోరి, ఎవరిచట జేరులుతీరి యుద్ధమునకు మొగ్గుచున్నారో, వారిని చూడ నిమ్ము.

సంజయ ఉవాచ:_

ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత !
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమం. 24
భీష్మద్రోణ ప్రముఖతః సర్వేషాంచ మహీక్షితాం,
ఉవాచ 'పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూ' నితి. 25

సంజయుడు చెప్పెను _ అర్జును డిటు లర్థించగా, ఓ ధృతరాష్ట్ర మహారాజా! శ్రీకృష్ణు డుభయ సేనల మధ్యను భీష్మద్రోణులకును, రాజు లందరికిని ఎదుట ఆ దివ్యరథమును నిలిపి, 'అర్జున! ఇచట చేరియున్న ఈ కౌరవులను పరికించుము'

విశేషార్థము : ఎవరిని చంపుటకు వెఱచి, అర్జునుడు విషాదమున క్రుంగి పోవుట అనివార్య మగునో, అట్టి భీష్మద్రోణుల ముందే — పూజ్యుల ముందే — శ్రీకృష్ణుడు రథమును నిలిపెను. మఱియు అంతకు ముందు ఎఱింగియుండియు, తిరిగి అర్జునుడు వారి నందరిని చూడగోరుట అసహజముగా, పరప్రేరణగా దోచుట లేదా ? దీని నంతను బట్టి, సూత్రధారి శ్రీకృష్ణుడే తన సఖుని విషాదము వైపునకు నడుపుచున్నా డనే అనుమానము జనించును.

**తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్,**
**ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా**
**శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయో రపి.** 26

అప్పు డర్జునుడు రెండు సేనలయందు గల తండ్రులను, తాతలను, గురువులను మేనమామలను అటులే సోదరులను, పౌత్రులను ఇంకను మామలను, మిత్రులను అందరిని నిరీక్షించెను.

**తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూ నవస్థితాన్,**
**కృపయా పరయాఽఽవిష్టో విషీద న్నిద మబ్రవీత్.** 27

అచట నిలిచియున్న ఆయా బంధుగుల నందరిని కౌంతేయుడు కలయ జూచి, తీవ్రమగు కృపకు వశుడై, క్రుంగిపోవుచు నిట్లు పిలపించెను.

విశేషార్థము : ఈ కృపను తర్వాత భగవానుడు నిరసించును (2-3). కృప సాధులక్షణము గదా ? అయి నప్పు డెందులకు నిరసించెను ? ఏలన కృప వేఱు, దయ వేఱు కృప తనతో దౌర్బల్యమును గొనివచ్చును, తన కాశ్రయ మిచ్చిన వానిని నిర్వీర్యుని, క్రియాఽసమర్థుని జేసివేయును. దీనికి ప్రతియగు దయ దైవగుణము (16-2). ఈ దయ 'ప్రేమ, వివేక, ప్రశాంతబలములతో పైనుండి దిగివచ్చును' అని శ్రీఅరవిందుని దర్శనము. ఇది మృదువు, కఠోరము రెండును అగును. దయతోనే ఈదయ కఠోరచర్య గైకొనగలదు, గైకొనిఉద్ధరించ గలదు.

కాగా కృపయాఽఽవిష్టుడు = దయార్ద్రహృదయుడు – అని ఇతరుల వ్యాఖ్యానములు. ఎంత వ్యత్యాసము !

**అర్జున ఉవాచ :—**

**దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితం.** 28

సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి,
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే. 29

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే,
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః. 30

అర్జునుడు విన్నవించుకొనెను_యుద్ధము చేయగోరి, యిచట సమకూడియున్న ఈ స్వజనులను జూచి, ఓకృష్ణా! నా అవయవములు పట్టుతప్పుచున్నవి, నో రెండి పోవుచున్నది. శరీరము వణకుచున్నది, రోమములు నిక్కబొడుచుచున్నవి; ఇంకను గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. చర్మము మండుచున్నది; చివరకు తల తిరిగిపోవుచున్నది, నిలబడను గూడ నిలబడలేక పోవుచున్నాను.

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ,
నచ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే, 31

కేశవా! ఎన్నో అపశకునములు గూడ గోచరించుచున్నవి, మఱియు (నెంత చింతించినను) స్వజనులను జంపిన పిమ్మట కలుగ గల శ్రేయ మేదియో నా కగపడుట లేదు.

విశేషార్థము: పైన 'స్వజనులను' చూచిన తోడనే అతని అవయవములు పట్టుదప్పినవి: ఇది నాడుల, ఇంద్రియముల, హృదయవృత్తుల విషాదము. ఇచ్చట ఆలోచించినను, అతనికి శ్రేయము గన్పించుటలేదు; ఇది బుద్ధివిషాదము.

పోతే, అతని విషాదమునకు మూలము 'చంపుట' గాదు. 'స్వజనులను' జంపుట. ఏలన స్వజనులను జంపిన, అతని కిక శూన్యతా శోకములే మిగులును. ఇట్లు నిజ మారయ, అర్జునుని నేత్రములను అశ్రుపూర్ణము గావించిన కృప (1-27) పరవిషయము గాదు, స్వవిషయము; అది ఆత్మలాలన గాని, ఆత్మకృప గాని, పరకృప మాత్రము గాదు; అనగా కృపయే గాని, దయ గాదు.

మంచిది, కాని ధర్మయుద్ధమునకు ముందు అపశకునము లెందుకు గోచరించవలెను? ఈ అపశకునము లెవరికి గోచరించెను? బాహ్యమును మాత్రమే చూడగల అర్జునుని కంటికి. యుద్ధమువలన కలుగగల అవశ్య దుఃఖమునకు సూచన లీ దుశ్శకునములు. అయితే ప్రేమవల్లనే కాక, ఈ యుద్ధమువలన సైతము భగవంతు డుద్దేశించిన సృష్టివికాసము సిద్ధించును. అందువలన అదే సమయమున యుద్ధము ధర్మసాధకమును కాగలదు. శ్రీకృష్ణుని కంటి కిదియు గోచరించును; దీనిని సూచించు అనుకూల శకునములును గోచరించును. —శ్రీ అరవిందుడు.

న కాంక్షే విజయం కృష్ణ! నచ రాజ్యం సుఖానిచ,
కిం నో రాజ్యేన గోవింద! కిం భోగై ర్జీవితేన వా. 32

కృష్ణా: నాకు విజయము వలదు, రాజ్యము వలదు, సుఖములును వలదు. రాజ్యముతో గాని, అసలు జీవితముతో గాని మా కేమి ప్రయోజనము? ఏలన —

యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖానిచ,
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ. 33
ఆచార్యాః పితరః పుత్రాస్ తథైవచ పితామహాః,
మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబంధిన స్తథా. 34

ఎవరి నిమిత్తము మేము రాజ్యమును, భోగములను సుఖములను గోరుకొని యుంటిమో, అట్టిఆచార్యులు, తండ్రులు, పుత్రులు, తాతలు, ఇంకను మేనమామలు, మామలు, మనుమలు, బావమఱదులు, తక్కిన బందుగులు ప్రాణముల మీదను, రాజ్యము మీదను ఆశను వదలి, ఇదిగో, ఎదురుగా రణ రంగమున నిలిచియున్నారు.

ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన,
అపి త్రైలోక్యరాజ్యస్య-హేతోః కిన్ను మహీకృతే. 35

వీరు పైబడి నన్ను చంపుచున్నను, ఓ కృష్ణా! వీరిని మాత్రము నేను చంపగోరను — భూలోక రాజ్యముకొఱకే గాదు, త్రైలోక రాజ్యము కొఱకును జంపగోరను.

నిహత్య ధార్తరాష్ట్రాన్ నః కా ప్రీతిః స్యాజ్ జనార్దన,
పాప మేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః. 36

(పైగా) దుర్యోధనాదులను చంపివేయుట మా కెట్లు ప్రీతి హేతువగును? చంపవచ్చిన, వారిని చంపినను, మాకు పాపమే చుట్టుకొనునుగదా.

విశేషార్థము: చంపిన మమ్ములను పాపము కట్టికుడుపును; కాన చంపను: ఇది అర్జునుని నైతిక సత్తయొక్క తిరుగుబాటు. శ్రీ అరవిందుని ఇట్టి వ్యాఖ్యను బట్టి, మనము మనలోని విభిన్న సత్తలను వివేచించి, తెలిసికొన గలిగెదము.

ఒక ఆసక్తికర విషయము: వారికొఱకే మేము రాజ్యము కోరియున్నాము గాన, వారిని వధించుట తగ దని ఒక క్షణము ముందు చెప్పి, ఇక నిపుడు మమ్ము లను పాపము పీడించును గాన, చంపనొల్లను-అని అర్జునుడు వక్కాణించును. అది

గౌణకారణము, ఇదీ ముఖ్యకారణము. మన పరోపకార వచనముల వెనుక ఇట్టి స్వార్థచింతన దాగియుండు నని శ్రీ అరవిందుడు పదేపదే హెచ్చరించును. ఇట్లు అర్జునుని వాదమంతయు లోలోపల స్వార్థవాద మని తేలును.

తస్మా న్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్,
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ. 37

కావున, ఓ మాధవా ! స్వబాంధవులగు కౌరవులను చంపుట మాకేమాత్రము తగదు. మా వారిని జంపి మే మెట్లు సుఖించగలము ?

విశేషార్థము : అర్జునుని వాదమునుండి ఈ 'స్వ' - ను దీసివేసిన, దాని కిక ప్రాణమే యుండదు.

యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః,
కులక్షయకృతం దోషం మిత్రద్రోహేచ పాతకం. 38
కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుం,
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్ జనార్దన. 39

దుర్యోధనాదుల చిత్తము లోభమునకు లోనై యున్నది. కావున కులక్షయము వలన గలుగు దోషమును, మిత్రద్రోహమువలన గలుగు పాపమును వారు చూడలేకపోవచ్చును. కాని ఓ జనార్దనా ! ఆ దోషములను బాగుగా నెఱింగిన మన మేల ఈ పాపమునుండి విరమించుకొనగూడదో, నా కర్థము గాకున్నది.

విశేషార్థము : ఓ కృష్ణా ! నీవు ప్రజాక్షేమముకొఱకు యుద్ధముచేయు మందువేని, ఆ ప్రజలనే ఈ యుద్ధము పొట్టబెట్టుకొనునే, అయినపు డది ఎవరి క్షేమము కొఱకు ? - అని అర్జునుడు అప్రతిహతముగా గన్పించు మఱియొక ఆక్షేపణ లేవ దీయును. అందరిని పొట్టబెట్టుకొను-నను మాట అతిశయోక్తి. కొద్దిమంది మిగిలియే యుందురు. ఇక వారితో పరిణామగతి ఒక నూతన మార్గమునకు దిరుగును. కురుక్షేత్ర మహాసమరానంతరము జరిగినది కూడ నదియే.

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్నం అధర్మోఽభిభవ త్యుత. 40
అధర్మాభిభవాత్ కృష్ణ! ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసంకరః. 41

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ,
పతంతి పితరోహ్యేషాం లుప్తపిండోదకక్రియాః. 42

కులము నందలి పురుషులు యుద్ధమున నశించుటచే. అనాదిగా వచ్చు కుల ధర్మములు నశించిపోవును. అట్లు ధర్మము నశింపగా, కులమునం దంతటను అధర్మము పెచ్చుపెఱుగును. ఇక నందువలన కులస్త్రీలు చెడిపోదురు. స్త్రీలు చెడిపోగా, వర్ణసంకర మగును. అట్టి సంకరమువలన కులఘాతకులకును, కులమునకును నరకము తథ్యము. ఏలన ఈ కులఘాతుకుల పితరులు శ్రాద్ధతర్పణములు లేక అధోగతి పాలగుదురు.

దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. 43
ఉత్సన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన !
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. 44

వర్ణసంకరమును కలిగించు కులవినాశకుల ఈ దోషములచేత శాశ్వతమగు జాతిధర్మములును, కులధర్మములును కూలిపోవును. మఱియు నో జనార్దనా! అట్లు కులధర్మములు కూలిపోయిన మానవులకు తప్పక నరకనివాసము ప్రాప్తించు నని వినియున్నాము.

అహోబత మహత్పాపం కర్తుం వ్యవసితా వయం,
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః. 45

కటకటా! రాజ్యసుఖమునందు గల లోభముచేత స్వజనులనే చంపివేయుటకు నడుముకట్టి, ఎంతటి మహాపాపము నాచరింప నిశ్చయించుకొనియున్నాము.

యది మా మప్రతీకారం అశస్త్రం శస్త్రపాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యుస్ తన్మే క్షేమతరం భవేత్. 46

నిరాయుధుడనై ప్రతీకారము తలపెట్టని నన్ను దుర్యోధనాదు లొకవేళ సాయుధులై వచ్చి రణరంగమున చంపివేతురేని, అదియే నా కెక్కువ క్షేమకరము కాగలదు.

విశేషార్థము: ఆత్మభావమును, చివరకు క్షాత్రభావమును గూడ విడిచి, బాహ్య అహంభావములో మునిగిపోయినపుడు, ఒక శ్రేష్ఠమానవునకు (3-21) సైతము కలుగ గల పరమవిషాదముయొక్క పరాకాష్ఠ యిది.

సంజయ ఉవాచ :-

ఏవ ముక్త్వాఽర్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్న మానసః. 47

ఓ ధృతరాష్ట్ర మహారాజా! శోకము తన మనస్సును కలిచివేయుచుండగా, అర్జును డిట్లు పలికి, తన విల్లంబులను విసరివేసి, రణరంగమున రథములోపల చతికిలబడిపోయెను.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే
అర్జునవిషాదయోగో నామ ప్రథమోఽధ్యాయః

ఇది ఉపనిత్సారమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జున సంవాదము నగు శ్రీ మద్భగవద్గీతలయందు
అర్జున విషాదయోగ మను ప్రథమాధ్యాయము





# శ్రీ గీతా యోగము

## అథ ద్వితీయోఽధ్యాయః

## సాంఖ్యయోగః

ఒక పరిశీలన : నేను క్షత్రియుడను, ధర్మము నిమిత్తము యుద్ధముచేయుట నా సామాజిక విధి – యని అర్జును డాటోపముతో రణరంగమున ప్రవేశించును. కాని స్వజనులను కలయజూచిన తోడనే అతనిని మమతా మోహ మావేశించును. కాగా, ఓ కృష్ణా ! పూజ్యులగు భీష్మాదులను వధించి, ఆ రక్తసిక్తమైన కూడును నే నెట్లు కుడువగలను ? (2-4,5) – అని పాప మతడు మొఱపెట్టుకొనును.

ఇట్లు, నేను క్షత్రియుడ – నను భావము అతనిపట్ల కార్యకారి గా లేదు. ఆ బాహ్య ప్రాతిపదికపై నత డిపుడు యుద్ధము చేయజాలడు. కనుక తనకు దైవ నియుక్తమైన యుద్ధము చేయవలెననిన, అతనికి అంతర జ్ఞానము నావిష్కరించి, నూతన ప్రాతిపదికను చూపవలెను. భగవాను డిపు దదియే చేయును.

అర్జునా ! మోహముచేత అంధుడవు గాకుము. చూడు : దేహము వేఱు, దేహములను ధరించు దేహి వేఱు. ఈ దేహి నిత్యము (2-18); దేహము మాత్రమే నశ్వరము, జననమరణాధీనము. పోతే, నీవు దేహివి, అటులనే భీష్మాదులును. కావున నిచట మరణించువా రెవరును లేరు. మరణించునవి దేహములు మఱియు నా దేహములు మనము కాదుగదా–అని శ్రీ కృష్ణుడు తన ఉపదేశము నారంభించును.

మఱియు నో అర్జునా ! దేహివగు (జీవుడవగు) నీవు ఆత్మరూపమున అకర్తవు. ఇట్లు నీవు చంపువాడవునుగావు, భీష్మాదులు చంపబడువారునుగాదు (2-19). కనుక నీకే పాపము నంటదు.

లోలోపల నేను చంపువాడను కాను సరే, అయినను ఈ బాహ్యసమర మెందుకందువా ? విను : ప్రకృతిగతుడగు జీవుని లక్ష్యము – పరమలక్ష్యము – అమృతత్వము (2-15). ఈ లక్ష్యసాధనకు కొన్ని సంధి సమయములందు ఇట్టి సమరము లావశ్యకము లగును – అని శ్రీ కృష్ణుడు దేహాత్మ వివేచనరూపమగు సాంఖ్యమును బోధించును.

ఈ సాంఖ్యదృష్టిని, అంతర్జ్ఞానమును ఆచరణలోనికి తెచ్చునదే యోగము, యోగవిధానము (2-39).

అవ్యక్తమునుండి బాహ్యప్రకృతి వ్యక్తమగునపుడు, ఆత్మ ఆ ప్రకృతిలో లీనమగును. అదే ఆత్మ తిరిగి వికసించు నపుడు, దాని వికాసక్రమ మిట్లుండు నని గీత చెప్పును — విషయములకు పైన ఇంద్రియములు, వానికి పైన మనస్సు, దానికి పైన బుద్ధి, దానికి పైన పురుషుడు లేక ఆత్మ. ఇట్లు ఆత్మకు మిక్కిలి సన్నిహితముగా నుండు తత్త్వము బుద్ధి. కావున ఈ బుద్ధిద్వారా జీవుడు సమము, నిష్క్రియము నగు ఆత్మయుక్తుడు కాగలడు. బుద్ధి ద్వారా ఆత్మతో జీవుని యోగమే బుద్ధి యోగము (7-10. 18-57); కాదు, ఆ యోగమునుండి ప్రవహించు విముక్తి కర్మయే బుద్ధియోగము. ఏలన——

"యోగస్థః కురు కర్మాణి" (2-48).

అని గీత మనలను ఉద్బోధించును. ఇదియే గీతయొక్క అపూర్వత : అది ప్రతి జ్ఞానమును కర్మలోనికి మార్చును, మార్చి కర్మసమస్యను పరిష్కరించును. జ్ఞానకర్మ — సముచ్చయము సాధ్యము కాదను మాయావాదమున కిది ఎంతదూరము !

ఈ బుద్ధియోగమున ఆత్మయొక్క "నైష్కర్మ్యము" ననుభవించుచునే, అజ్ఞునుడు కర్మ చేయగలుగును గాన, యుద్ధకర్మవలన పాపము పైకొను నను భయ మతని కిక యుండదు. కావుననే దివ్యగురువు మున్ముందు బుద్ధియోగము నుపదేశించినాడు, తర్వాత ప్రేమయోగము నుపదేశించును.

సమన్వయము గీతా వైశిష్ట్యము, దానియందే గీతయొక్క సర్వాధిక్యము గలదు. కనుక ఈ సమన్వయమును గురించి రెండు మాటలు——

ఈ బుద్ధియోగ సాధనయందు అనేకముగా నున్న సాంఖ్యపురుషుడు ఏకమాత్ర మగు అక్షరాత్మ యని తేలును — ఈ అక్షరాత్మయే వేదాంత బ్రహ్మము. మఱియు సాంఖ్యమునందలి గుణమయ ప్రకృతి సాంఖ్యమునందువలె పురుషునినుండి వేఱుగాక, పురుషునియొక్క అపరప్రకృతి (7-5) లేక బ్రహ్మముయొక్క మాయ యని తేలును. ఇట్లు శుద్ధసాంఖ్యములోని పురుషబహుత్వమును, ప్రకృతి పృథక్త్వమును తొలగించి, గీత శుద్ధ సాంఖ్యమును వేదాంత సాంఖ్యము గావించును. ఇది గీత సాధించిన సాంఖ్యవేదాంతముల సమన్వయము.

పోగా, యోగమునకు, అనగా కర్మయోగమునకు, ఈశ్వరు డావశ్యకము. ఏలన ఈశ్వరుడు కర్మను సంకల్పించును, ఆ సంకల్పమే కర్మకు మూలము. మఱియు

అక్షరాత్మ కెట్టి సంకల్పములు నుండవు గావున, అదియే ఈశ్వరు డని చెప్పుట యుక్తియుక్తము కాజాలదు.

కావున గీత ఈశ్వరుడు లేక పురుషోత్తము డనబడు తృతీయ పురుషుని సర్వోత్తముని (15-17) ప్రతిపాదించును.

బుద్ధియోగము ద్వారా ఆత్మస్థుడైన జీవుడు,

"యుక్త ఆసీత మత్పరః" (2-61) –

అను ప్రేమయోగముద్వారా పై కెగసి, ఈశ్వరునియందు నెలకొనగలడు. ఇచ్చట వేదాంతబ్రహ్మము ఈ యీశ్వరునియొక్క ఒక పార్శ్వమనియు, వేదాంతమాయ ఇతనియొక్క మఱియొక పార్శ్వ మనియు తేలును. ఇట్లు వేదాంతసాంఖ్యము గీతాసాంఖ్య మగును. శుద్ధసాంఖ్యమునుండి వేదాంతసాంఖ్యమునకు వచ్చియుండిన మన మిపుడు వేదాంతసాంఖ్యమునుండి గీతాసాంఖ్యమున కెగసినాము. మఱియు బ్రహ్మమునకు ఈశ్వరునితో సమన్వయమును సాధించి, సాంఖ్యవేదాంతములకు యోగముతో సమన్వయమును, అనగా సాంఖ్య వేదాంత యోగ సమన్వయమును సాధించినాము – గీతామాత సాధించినది.

మఱియు అక్షరాత్మయందలి కర్మజ్ఞాన – సమన్వయమునకు ప్రేమను జోడించి, పై కెగసి, పురుషోత్తమునియందు కర్మజ్ఞాన భక్తిసమన్వయమును సాధించినాము.

ఇది సాంఖ్యవేదాంతయోగముల సమన్వయము, మఱియు కర్మజ్ఞాన భక్తుల సమన్వయము. ఈ సమన్వయ సాధనయందలి సోపానములను మన మనసున ధరించి యున్నచో, గీతాశ్లోకముల అర్థము మన కెంతో ఎక్కువ స్పష్టపడును.

**సంజయ ఉవాచ :–**

**తం తథా కృపయాఽఽవిష్టం అశ్రుపూర్ణాకులేక్షణం,**
**విషీదంత మిదం వాక్యం ఉవాచ మధుసూదనః. 1**

సంజయుడు చెప్పెను – మహారాజా ! అట్లు కృపావేశమునకు వశుడై, నిండు కన్నీటితో కలతచెందిన నయనములతో దిగజాఱి పోవుచున్న అర్జునుని గాంచి మధుసూదను డిట్లు మందలించెను.

**శ్రీ భగవాను ఉవాచ :–**

**కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితం,**
**అనార్య జుష్ట మస్వర్గ్యం అకీర్తికర మర్జున ! 2**

శ్రీ భగవానుడు పలికెను - అనార్యులు మాత్రమే, అ ర్జు నా ! ఇట్టి మనో మాలిన్యమునకు తావిత్తురు; అది స్వర్గప్రతిబంధకము, అకీర్తికరము. అది నీకీ సంకటసమయమున ఎటనుండి వాపురించినది ?

విశేషార్థము : నీ వా ర్యు డ వు, అందునను, ఆర్యక్షత్రియుడవు — అని సంబోధించి, ఆర్యుల సమున్నత భావముపై నాధారపడిన సంగ్రహోపదేశము భగవానుడు ముందు చేయుచున్నాడు. ఇది కార్యకారి గానపుడు పరమార్థోపదేశము చేయును.

క్లైబ్యం మాస్మగమః పార్థ ! నైతత్ త్వ య్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప. 3

పార్థా ! నీ విట్లు నిర్వీర్యుడవు గాకుము, ఇది నీకు తగనే తగదు. క్షుద్రమగు నీ హృదయదౌర్బల్యమును వీడి, ఓ శత్రుభయంకరా ! లెమ్ము,యుద్ధమునకు నడుము కట్టుము.

విశేషార్థము : దౌర్బల్యమే పాపము. - వివేకానందుడు. హృదయ దౌర్బల్యమును వీడుము : ఇదియే గీతాసారము. —కె. యం. మున్షీ.

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన,
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన. 4

ఓ కృష్ణా ! పుష్పములతో పూజించదగిన భీష్మద్రోణులపై యుద్ధమున బాణములు ప్రయోగించుటకు నా చేతు లెట్లాడును ?

గురూ న హత్వాహి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే,
హత్వార్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్. 5

మహానుభావులగు గురువులను చంపనొల్లక, ఈ లోకమున బిచ్చమెత్తుకొనియైన జీవించుట మేలు. అట్లుగాక గురువులను నేను చంపుదు నేని, వారిరక్తముతో తడిసిన కామ్యభోగముల నిచటనే అనుభవించవలసిన దురవస్థ యేర్పడును.

న చైతద్ విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః,

యానేవ హత్వా న జిజీవిషామస్
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. 6

మేము వారిని జయించవలెనో, లేక వారే మమ్ములను జయించవలెనో - వీనిలో మా కేది శ్రేష్ఠమో తెలియరాకున్నది. ఏలన ఎవరిని చంపి, మే మసలు జీవింపనే కోరమో, ఆ ధృతరాష్ట్రపుత్రులే యుద్ధమునకు మా యెదుట నిలబడి యున్నారు.

కార్పణ్యదోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢచేతాః,
యచ్ఛ్రేయస్ స్యాన్ నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం. 7

క్షుద్రమగు దౌర్బల్యము నా స్వభావము నావహించగా, ధర్మాధర్మములను నిర్ణయించలేని చేతస్సుతో, కృష్ణా ! నిన్ను యాచించుచున్నాను - మాకేది శ్రేయమో, దానిని నిశ్చితముగా జెప్పుము. నేను నీ శిష్యుడను, నీ పాదములు పట్టినాను, నాకు దారి జూపుము.

విశేషార్థము : చేతస్సు = సర్వచేతన. చేతస్సు బుద్ధి మాత్రమే గాదు: శరీరచేతన, ఇంద్రియచేతన; ఇత్యాదు లన్నియు చేతస్సులో అంతర్భాగము. అనగా అర్జునుని సర్వచేతనయు మోహసంమూఢ మైనది. అర్జునుని విషాదము అన్ని చేతనలను ఎటు లాక్రమించెనో, ప్రథమాధ్యాయమున పరిశీలనలో చూచి యున్నాము. తక్కినవారు చేతస్సు = బుద్ధి, యని వ్యాఖ్యానించగా, శ్రీ అరవిందు డీ వివరణ చేయును.

ప్రపత్తి = సంపూర్ణ శరణాగతి. దీనినే భగవానుడు గీతాచరమ శ్లోకములో చరమోపదేశముగా చెప్పును. అట్టి ప్రపత్తి భావము ముందే కలిగియున్నాడు గాన, అర్జునుడు చరమోపదేశమునకు అర్హుడు.

నహి ప్రపశ్యామి మ మాపనుద్యాద్
యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణాం,
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యం. 8

భూలోకమున నిష్కంటకమైన సమృద్ధ రాజ్యమును, స్వర్గలోకమును దేవతలపై ఆధిపత్యమును బొందినప్పటికి, ఇంద్రియములను పీల్చి పిప్పిచేయు ఈ దారుణ శోకమును బాపగల దారి గానవచ్చుట లేదు, కృష్ణా!

విశేషార్థము : ఈ దారుణ మనఃసంతాపమే అర్జునుడు యుద్ధవిముఖుడగుటకు అసలు కారణము. అర్జునుడు చూపిన తక్కిన కారణము లన్నియు దానిని కప్పిపుచ్చుకొనుటకే. —శ్రీ అరవిందుడు.

**సంజయ ఉవాచ :—**

ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః,
న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ. 9

సంజయుడు చెప్పెను - స్వభావతః శత్రువులను తపింపజేయు వాడయ్యును, అర్జునుడు, ఓ రాజా, తన ఇంద్రియములకు ఈశుడైన శ్రీకృష్ణుని కిట్లు తన సంతాపమును వెళ్లబోసికొని, 'యుద్ధం చేయజాల' నని మిన్నకుండెను.

త మువాచ హృషీకేశః ప్రహస న్నివ భారత!
సేనయో రుభయో ర్మధ్యే విషీదంత మిదం వచః. 10

ఓ మహారాజా! రెండు సేనల మధ్యను ఇట్లు జావగాఱిపోవుచున్న అర్జునుని జూచి, పరిహాసము చేయుచున్న వానివలె భగవాను డిట్లు పలుక నారంభించెను.

**శ్రీ భగవాను ఉవాచ :—**

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. 11

శ్రీ భగవానుడు బల్కెను - చూడు మర్జునా, నీ వెంత పరస్పర విరుద్ధముగా వ్యవహరించు చున్నావో: శోకింపదగని వారిని గుఱించి శోకించుచు, పైగా నా శోకమును పండితవచనములతో సమర్థించుకొను చున్నావు. యథార్థ పండితులు మరణించినవారిని గుఱించిగాని, మరణించనున్నవారిని గుఱించిగాని శోకింపరే.

విశేషార్థము : అర్జునుని యుద్ధ విముఖతకు, నేను చంపువాడను — అను అతని అజ్ఞానమే కారణము. కనుక నా అజ్ఞానమును దొలగింప భగవాను డతనికి ఆత్మజ్ఞానము నుపదేశించును. ఆ జ్ఞానమువలన అర్జునుడు పాపభయమున కతీతుడై, విముక్త కర్మ చేయగలుగును (18-73). జ్ఞానము కర్మను అహంకారమునుండి ఆత్మస్థాయికి లేవనెత్తునేగాని, దానిని రద్దుచేయదు: ఇది శ్రీ అరవిందుని వ్యాఖ్యానము.

కాగా, అర్జునుని శోకమోహములను బాపుటకు భగవాను డతనికి సర్వ కర్మ సన్న్యాస పూర్వకమైన ఆత్మ జ్ఞానము నుపదేశించు నని శ్రీ శంకరుడు చెప్పెను ఏలన శంకరాచార్యుని మతమున కర్మ జ్ఞానములకు పొత్తుకుదురదు, వాని సముచ్చయము అసంభవము, కనీసము అసహజము.

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః,
నచైవ న భవిష్యామః సర్వే వయ మతః పరం. 12

పండితు లెందుకు శోకింప రనిన, నేను గాని, నీవు గాని, ఈ రాజులు గాని పూర్వ మెపుడును లేనివారము గాము, ముం దెపుడును లేకపోవువారమును గాము.

అవతారిక : అయితే మరణ మెవరికి? దాని స్వరూపము?

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతర ప్రాప్తిర్ ధీరస్తత్ర న ముహ్యతి. 13

జీవున కీ శరీరమున బాల్య, యౌవన, వార్ధక్యములను అవస్థ లెటుల ప్రాప్తించు చున్నవో, అటులే దేహ మరణానంతరము మఱియొక దేహ ప్రాప్తియు గలుగును. కావున మరణ విషయమున ధీరుడగు వాడు శోకింపడు.

విశేషార్థము : దేహి యన దేహము ధరించిన జీవుడు, అంతరాత్మ (15-7); దేహి యన ఆత్మ కాదు. ఈ జీవుడు ప్రకృతిగతుడై నపుడు క్షరు డనియు, ఆత్మస్థుడై నపుడు అక్షరుడనియు పిలువబడును : ఇది శ్రీ అరవిందుని వివేచన శ్రీ శంకరునకు ఇట్టి భగవదంశమగు జీవుడు లేడు. జీవుడు మిథ్య.

ధీరుడు = ఆత్మస్థుడై, బాహ్యస్పర్శలకు చలించని జీవుడు.

ఇట్లు మరణము దేహమునకు మాత్రమే మఱియు నది నూతన శరీరమునకు అవకాశము కల్పించి, చేతనావికాసము ద్వారా అమృతత్వసాధన మగును; ఇది దాని స్వరూపము.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినోఽనిత్యాస్ తాం స్తితిక్షస్వ భారత. 14

విషయములతో నింద్రియముల సంయోగము, అర్జునా, శీతోష్ణములు, మున్నగు సుఖదుఃఖములకు గారణము. అట్టి సుఖదుఃఖములు వచ్చిపోవు నవియే కాని, నిత్యములు గావు. కావున కౌంతేయా, వానిని సహింపుము.

విశేషార్థము: బాహ్యాస్పర్శలకు, హృదయావేగములకు చలించకుండుటకు ఉపాయములు నాలుగు—1. సహనము, 2. ఉదాసీనత, 3. నతి, 4. యోగము: హఠయోగికి సహనము, తత్త్వవేత్తకు ఉదాసీనత, భక్తునకు నతి(అది భగవదిచ్ఛ లే యనుకొని, కష్టమునకు తలవంచుట), గీతాయోగికి భగవంతునితో యోగము (2-61). గీతాయోగి భగవంతునితో యోగయుక్తుడై, బాహ్యాస్పర్శలకు అందక, పైన వర్తించును. ఇది స్పర్శలనుండి పలాయనము గాదు, వానిని పైనుంచి శాసించు అధికారము. ఇది శ్రీ అరవిందుని అసాధారణ వివేచన.

యం హి న వ్యథయం త్త్యేతే పురుషం పురుషర్షభ,
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. 15

ఎవని నీ బాహ్యాస్పర్శలును, అంతరావేగములును వేధించవో, అతడు, పురుషపుంగవుడవగు నో అర్జునా, సుఖదుఃఖములందు సమతను సాధించిన ధీరుడు. కాగా నట్టి ధీరుడే అమృతత్వమున కర్హుడు

విశేషార్థము : అమృతత్వ మన మరణానంతర జీవనము కాదు. అది మనస్సు గల ప్రతిజీవికి నుండును. అది జననమరణరాహిత్యమును గాదు. ఏది మరణాతీతమో, మరణమునే ఎఱుగని తత్త్వమో, దానియందు, నే నపురుడను - అను ప్రజ్ఞతో నివసించుటయే అమృతత్వము. ఈ ప్రజ్ఞ జననమరణములకు భయపడదు (2-22). ఇది శ్రీ అరవిందుని వ్యాఖ్య కాగా, జననమరణరాహిత్యలక్షణ మగు మోక్షము అమృతత్వ మని శ్రీ శంకరు డనును.

నాసతో విద్యతే భావో, నాభావో విద్యతే సతః,
ఉభయో రపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః. 16

అసత్తునకు ఉనికియును లేదు, సత్తునకు లేమియును లేదు. తత్త్వదర్శులు ఈ రెండింటియొక్క ఇట్టి తత్త్వమును దర్శించియున్నారు.

విశేషార్థము : ఇతర వ్యాఖ్యాత లందరు సత్తు = ఆత్మ, అసత్తు = శరీరము, ఆత్మ ఎల్లపుడు నుండునది, శరీరము ఎప్పుడును లేనిది-అని చెప్పి వాని మధ్య ఒక విరోధమును చూపుదురు. కాగా శ్రీ అరవిందుని అనుభవ మేమన, ఈ విరోధము మనస్సునకు గన్పించు విరోధము మాత్రమే. లోనికి పయనించి, సత్తును మాఱని ఆత్మగాను, అసత్తును మాఱుచుండు దాని విస్తారముగాను దర్శించగలము. అసత్తు మిథ్య గాదు, ఆత్మకు అభివ్యక్తి సాధనమగు స్వీయశక్తి. కావున అసత్తును 'లేనిది' అను టుచితము కాదు, అనగా అది **Non-being** కాదు, అది అభివ్యక్తి

సాధనమగు భావము, మాఱుచునుండు 'సంభూతి'. ఈ 'సంభూతి' ని ఆంగ్లమున Becoming అందురు. సంక్షిప్తముగా, సత్ = Being, మార్పులేనిది; అసత్తు = Becoming సంభూతి, మార్పు గలది.

ఇట్టి వ్యాఖ్యకు ఆధారము? శ్రీ అరవిందుని అనుభవమే గాక, తర్వాతి శ్లోకమును (2-17) దీనిని చెప్పును. అవినాశి ఆత్మయొక్క విస్తారమే ఇది యంతయు నని ఈ శ్లోకము చెప్పుచున్నది గదా.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతం,
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చిత్ కర్తు మర్హతి. 17

దేనిచేత నిది యంతయు విస్తరింపజేయబడి యున్నదో, అర్జునా, అది అవినాశి ఆత్మ యని తెలియుము. అవ్యయమగు నట్టి ఆత్మ కెవ్వడును వినాశమును గల్పింపజాలడు.

విశేషార్థము : ఈ విశ్వ మంతయు ఆత్మచేత 'తతం'=వ్యాప్తము, అని శ్రీ శంకరుడు చెప్పగా, ఆత్మచేత 'తతం=విస్తరింపజేయబడినది-అని శ్రీ అరవిందుడు నుడువును. ఇదియే 'తతం' నకు ముఖ్యార్థము.

తర్వాతి శ్లోకము (2-18) గూడ, 'ఆత్మయొక్క శరీరములు' అని చెప్పును, అనగా ఆకాశము శరీరమును వ్యాపించినట్లు, ఆత్మ శరీరమునువ్యాపించి మాత్రమే లేదు, శరీరము ఆత్మయొక్క శక్తి యనియు దెలియుచున్నది.

అంతవంత ఇమే దేహా నిత్య స్యోక్తాః శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మాద్ యుధ్యస్వ భారత. 18

పోతే, అర్జునా, నిత్యమగు నాత్మ ఏ దేహములను ధరించునో, అవి (మాత్రమే) నాశవంతములు; ఆత్మ వినాశము లేనిది మఱియు ప్రత్యక్షాది ప్రమాణముల చేత కొలువరానిది. ఇట్లు దేహము లాత్మగావు గాన, ఓ కౌంతేయా, నీవు యుద్ధము చేయుము.

విశేషార్థము : తన శక్తి రూపములు మార్చుకొనుచున్నను, ఆత్మ స్వయముగా మాఱదు. ఇది ఆత్మయొక్క అద్భుత మహిమ.

య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే. 19

యుద్ధ విషయమున, ఎవ డీ దేహిని చంపువానినిగ మఱియు నెవ డీ దేహిని

చంపబడువానినిగ నెఱుంగునో, వా రిరువురును వాస్తవ మెఱిగినవారు గారు. ఈ దేహి (ఆత్మ) నిజానికి చంపను చంపడు, చంపబడను చంపబడడు.

న జాయతే మ్రియతే వా కదాచిన్
నాయం భూత్వాఽభవితా వా న భూయః,
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. 20

ఈ ఆత్మ ఎప్పుడును పుట్టునదియు గాదు, గిట్టునదియు గాదు; అటులే ఉండి, లేకుండునదియు గాదు, లేకుండి, ఉండునదియు గాదు. దీనికి జననమరణములు లేవు; ఇది నిత్యము, శాశ్వతము, సనాతనము. శరీరము చంపబడుచుండగా, నిది చంపబడుట లేదు.

వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయం,
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కం. 21

ఎవ డీ నిత్యము, అనాది, అవ్యయము నగు ఆత్మను తానుగా నెఱుగునో, అతడు, ఓ పార్థా, ఎవనినేని ఎట్లు చంపగలడు, ఎట్లు చంపించగలడు? (కారణ, మీ ఆత్మకు సాక్షాత్కర్తృత్వమును లేదు, ప్రేరణకర్తృత్వమును లేదు)

విశేషార్థము: ఆత్మ చేయదు, చేయించదు గాన, ఆత్మజ్ఞానికి సన్యాసమునందే అధికారము గాని, కర్మయందు గా దని శ్రీ శంకరుడు. ఆత్మస్థుడగు వానికి, నేను చేయుచున్నాను – అను అహంకారము చే యు చు న్న ను ఉండదు. కావున అది అంతఃసన్యాసమే గాని, బాహ్య సన్యాసము గా దని శ్రీ అరవిందుడు.

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణాన్
యన్యాని సంయాతి నవాని దేహీ. 22

పాత బట్టలను విడిచివేసి, మానవు డెటుల క్రొత్త వానిని స్వీకరించునో, అటులే దేహియగు జీవుడు ముసలి శరీరములను విడిచివేసి, నవ్య శరీరములను బొందును.

విశేషార్థము: చూడుడు, శ్లోకము (2-15). పాత బట్టను తీసివేసి నపుడు,చని పోతిమి – అను భావము మనకు కలుగదు. అటులే పాత తనువును నేను బట్టనువలె

విడిచివేయుచున్నాను. ఇచ్చట మరణప్రసక్తియే లేదు - అను ప్రజ్ఞ మనకు సిద్ధించి నప్పుడు - అదిగో, అదియే అమృతత్వము. ఇది జననమరణ రాహిత్యమున కంటెను అధికము. -శ్రీ అరవిందుడు.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః,
న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః. 23

ఈ ఆత్మను శస్త్రములు ఛేదింపజాలవు, అగ్ని దహించజాలదు, నీరు తడుపజాలదు, గాలి ఎండింపజాలదు. కారణము, ఆత్మకు అవయవములు లేవు. అది నిరవయవ వస్తువు.

అచ్ఛేద్యో௨యమదాహ్యో௨యమక్లేద్యో௨శోష్య ఏవచ,
నిత్యః సర్వగతః స్థాణు రచలో௨యం సనాతనః. 24

ఈ ఆత్మ ఛేదింప సాధ్యముకానిది, దహింపను, తడుపను, ఎండింపను సాధ్యముకానిది. ఇది నిత్యము, సర్వగతము, స్థిరము, అచలము, సనాతనమును

విశేషార్థము : అస్త్రములు ఛేదింపజాలవు గాన ఆత్మ అచ్ఛేద్యమా? లేక, అచ్ఛేద్యము గాన, దానిని అస్త్రములు ఛేదింపజాలవా? ఆధ్యాత్మికానుభవమునకు అచ్ఛేద్య మని ముందు తెలియును. కావున దానిని అస్త్రములు ఛేదింపజాల వని నిర్ణయింతుము.

అవ్యక్తో௨యమచింత్యో௨యమవికార్యో௨య ముచ్యతే,
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి. 25

ఈ ఆత్మ అవ్యక్తము, అచింత్యము, వికారక్రియ కతీతమునని చెప్పబడును. కావున దీని నిట్లు తెలిసికొని, దీనిని గుఱించి శోకింప దగవు.

విశేషార్థము : ఆత్మ అవ్యక్తమైనను, అది అభివ్యక్తమైన దానికంటె నధికము, మఱియు వ్యక్తమైన మనఃప్రాణశరీరములు దాని నభివ్యక్తము చేయ యత్నించుచున్నవి. సృష్టియు, అందలి మనఃప్రాణశరీరములును మిథ్యయగుచో, నవి సత్యమగు ఆత్మను వ్యక్తము చేయజాలవు. కావున సృష్టి మిథ్య గాదు, దాని కర్థమును గలదు, అవ్యక్తమును వ్యక్తము చేయుటే దాని అర్థము.
- శ్రీ అరవిందుడు

అవతారిక : అంతరాత్మకు జ్ఞానోదయమై, అది ఆత్మస్థము గాక పూర్వము చచ్చుచు, బుట్టుచు నున్నట్లు దాని కనుభవ మగును. అపుడు సైతము నీవు, అర్జునా, శోకింపదగవు. కారణము -

అథ చైనం నిత్యజాతం నిత్యంవా మన్యసే మృతం,
తథాపి త్వం మహాబాహో ! నైవం శోచితు మర్హసి. 26

ఈ ఆత్మ ఎల్లపుడు పుట్టుచు, గిట్టుచు నుండు నని ఒకవేళ నీవు దలంచినను ఓ మహాబాహూ, నీ విట్లు శోకింపదగవు.

జాతస్య హి ధ్రువో మృత్యుర్ ధ్రువం జన్మ మృతస్యచ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. 27

ఏలన, జన్మించిన వానికి మరణము తప్పదు, మరణించిన వానికి జన్మమును దప్పదు. కావున తప్పని సరియగు నట్టి విషయమున నీకు శోకించుట తగదు.

విశేషార్థము : జననమరణములు అనివార్యములు మాత్రమే గాదు, అవి ప్రయోజనకరములును. ఏలన జననమరణములద్వారా వాని కతీతమైన అమరత్వము నందుకొందుము, ఏస్మట దివ్యలీల నెరపుదుము. అందుచేతను సైతము వానిని గురించి శోకింపదగదు. — శ్రీ అరవిందుడు. పోతే శంకరాచార్యుని మతమున, జ్ఞానికి జన్మయే లే నపుడు, దివ్యలీల మాట చెప్పనేల ?

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా. 28

అవ్యక్తావస్థనుండి చరాచర భూతము లన్నియు ఆవిర్భవించి, వ్యక్తావస్థయందు ఇంచుక తడవుండి, తిరిగి ఆ అవ్యక్తావస్థలోనికే పోవును. (మరణ మన నిదియే గాన), అవ్విషయమున శోక మెందుకు ?

విశేషార్థము : అవ్యక్తస్థితియందు భూతములు జీవనకాలమునందు కంటె అస్తిత్వమున తక్కువయుగావు, పరిస్థితులయందు ఎక్కువ సుఖహీనములునుగావు. కావున శోక మెందుకు ? — అని శ్రీ అరవిందుడు. పూర్వము కన్పించక, ఇపుడించుక కన్పించి, తిరిగి నష్టమగు భ్రాంతి మాత్ర భూతముల విషయమున శోక మెందుకు ? అని శ్రీ శంకరుడు.

ఆశ్చర్యవత్ పశ్యతి కశ్చి దేనం
ఆశ్చర్యవద్ వదతి తథైవ చాన్యః,
ఆశ్చర్యవ చ్చైన మన్యః శ్రుణోతి
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్. 29

ఒకడీ ఆత్మను ఆశ్చర్యవస్తువుగా జూచును, మఱియొకడు దీనిని ఆశ్చర్య విషయముగా చెప్పును, ఇంకొకడు దీనిని ఆశ్చర్యాస్పదముగా వినును; అయినను ఈ ఆత్మ నెవ్వడు నెఱుంగడు.

విశేషార్థము : ఏ మానవ మనస్సును ఈ ఆత్మను, ఈ నిర్ద్వంద్వ వస్తువు నింతదనుక తెలిసికొనలేదు; ఇదియే ఆశ్చర్యమునకు గారణము. ఈ ఆత్మయందు కర్మ అకర్మ యగును (4-18). ఇట్టి ఈ ఆత్మలక్షణములు మనస్సునకు అంతుబట్టని విషయములు. కనుక ఆత్మ ఆశ్చర్యము. — శ్రీ అరవిందుడు. ఆయన మఱియు నిట్లు దెలుపును : ఈ ఆత్మ, అథవా దేహి, జీవన రూపములచేత మఱుగుపడి యున్నను, జీవన మంతయు దీని ఛాయామాత్రమే. ఇంకను జననమరణములు దాని గౌణక్రియా మాత్రమే. దీనితో శ్రీ శంకరు డంగీకరించడు.

**దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత,**
**తస్మాత్ సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి. 30**

సర్వ దేహములందును గల ఈ దేహిని వధింప నెప్పుడును శక్యము గాదు. కావున, ఓ అర్జునా, ఏ ప్రాణిని గుఱించియు నీవు శోకించుట యుక్తము గాదు.

విశేషార్థము : నిజానికి ఆత్మ మఱియు దేహి ఒకటి గావు. అయినను గీత యందు ఈ రెండును పర్యాయ పదములుగా వచ్చుచున్నట్లు గన్పించును. దేహి — దేహము ధరించినది, అంతరాత్మ. పైగా నీ దేహి వైయక్తికము. పోతే ఆత్మ అన్ని దేహము లందును సమముగా, వాని నంటక యుండును. ఇట్లు ఆత్మ వైయక్తికమును గాదు, దేహధారియు గాదు. అయితే దేహి ఆత్మస్థమై నపుడు, ఆత్మలక్షణము లగు అకర్తృత్వాదులు సైతము దాని కబ్బును. అందుచేతనే దేహియు అవధ్య మని చెప్పబడినది. శ్రీ అరవిందుని ఈ వివేచన శ్రీ శంకరునకు అంగీకారయోగ్యము గాదు. ఏలన ఈయనకు గీతచెప్పు (15-7) శాశ్వత వైయక్తిక జీవుడు లేడు.

అవతారిక : ఇపు డిక ఆత్మజ్ఞానముయొక్క లోతులనుంచి కొంత పైకివచ్చి, అర్జునుని స్వధర్మమును పురస్కరించుకొని భగవానుడు బోధించును. అయితే ఇది గౌణోపదేశము మాత్రమే. ఏలన నిది పనిచేయ దని దివ్యగురువునకు తెలియనే తెలియును. స్వధర్మమే యైనను, పాపమునకు ఒడిగట్టజాల నని అర్జునుడు చెప్పియే యున్నాడు గదా.

స్వధర్మ మపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయో౽న్యత్ క్షత్రియస్య నవిద్యతే.

నీ స్వధర్మమును జూచినను, నీ విట్లు కంపించిపోవుట పాడి గాదు. ఏలన ధర్మయుద్ధమునకు మించిన శ్రేయ మేదియు క్షత్రియున కుండదు.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతం,
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధ మీదృశం. 32

యుద్ధము క్షత్రియునకు తెఱచిన స్వర్గద్వారము. అది యిపుడు నీకు స్వయముగనే ప్రాప్తించినది. అదృష్టవంతులగు క్షత్రియులే, పార్థా, ఇట్టియుద్ధమును పొందుదురు.

విశేషార్థము : ఇదియు అర్జునుని మార్చజాలదు. సురల సామ్రాజ్యము లభించినను, నా యీ దుఃఖము నది తొలగించజాలదు (2-8) అని అర్జునుడు పలికి యున్నాడు గదా.

అథ చేత్ త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి,
తతః స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి. 33

అయినను నీ వీ ధర్మసంగ్రామమును సలుప వేని, దానిచే స్వధర్మమును, కీర్తిచంద్రికను బోగొట్టుకొని, పాపమును బొందెదవు.

విశేషార్థము : అర్జునా! చూచితివా? యుద్ధముచేత గాదు, యుద్ధము చేయక పోవుటచేతనే నీవు పాపమును బొందెదవు! ఇదియు పాపభూమికలోని సమాధానమే గాని, తదతీతము గాదు. అందుచేత నిదియు పనిచేయలేదు. —శ్రీ అరవిందుడు.

అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తే౽వ్యయాం,
సంభావితస్య చాకీర్తిర్ మరణా దతిరిచ్యతే. 34

ఎప్పటికిని మాసిపోని నీ అపకీర్తిని సైతము, ఓ అర్జునా, లోకులు కాకులుగా చెప్పుకొనెదరు. కాగా సమ్మానమును బొందియున్న ఘనునకు అపకీర్తి చావు కంటెను నికృష్టము.

భయాద్ రణా దుపరతం మంస్యంతే త్వాం మహారథాః,
యేషాంచ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవం.

మఱియు యుద్ధమునకు భయపడి, దానినుండి విరమించుకొంటి వని మహావీరు

లందరు తలంచెదరు. ఇంతవఱకు నిన్ను గౌరవించిన వారే నిన్నిపుడు చులకన చేసెదరు.

అవాచ్య వాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః,
నిందంత స్తవ సామర్థ్యం, తతో దుఃఖతరం ను కిం. 36

మహావీరుల మాట ఇటుండ, నీ శత్రువులు నీ సామర్థ్యమును నిందించుచు నిన్ను అనరాని మాట లెన్నో అనెదరు.

హతోవా ప్రాప్స్యసే స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీం,
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః. 37

అయితే నీవీ యుద్ధమున చంపబడి స్వర్గమును బొందెదవు, లేనిచో నీవే జయించి పృథివీరాజ్యము ననుభవించెదవు. కావున యుద్ధముచేయ కృతనిశ్చయుడవై, ఓ అర్జునా ! లెమ్ము, నడుముకట్టుము.

విశేషార్థము : అర్జునుని శోక మోహములను బాపుటకు, భగవానుడు ప్రధానముగా, ముందుగా ఆత్మజ్ఞానము నుపదేశించెను గదా. ఆ మహాజ్ఞాన మీ యుద్ధకర్మ నెట్లు సమర్థించును ?

ఆత్మ గమ్యమును చేరుకొన మనకు గల పథము పూలబాట గాదు. అది సంఘర్ష సంకులము. ఒకొకప్పు డీ సంఘర్షము బాహ్య యుద్ధరూపము సైతము ధరించవచ్చును. విశేషించి, అర్జునుడు ఆత్మ జ్ఞానమునకు అవలంబించవలసిన మార్గమున అది అనివార్యమైనది. ఏలన అతని సాంఘిక ధర్మము, జీవన ధర్మము, స్వభావ ధర్మము - అన్నియు దానినే చూపును, ఇట్లు ఆత్మజ్ఞానము, తన కొక సాధనగా, ఒక ముఖ్యసాధనగా, స్వధర్మాచరణమును - అర్జునుని విషయమున యుద్ధమును - సమర్థించును.

ఇంతవఱకు శ్రీ అరవిందునితో శ్రీ శంకరు డంగీకరించును. కాని జ్ఞానము ప్రాప్తించిన పిమ్మట కర్మ పనికిరా దని శ్రీ శంకరుడు వాదించును. కారణము, కర్మ - మాయాభూమికలోనిది. కాని "దాని మూలము దివ్యము, కర్మకు మూలము భగవత్సంకల్పము. కావున అది బాధకము గాకపోవుటయే గాక, చివరంట సాధకము గూడ నగును. పిమ్మట సిద్ధియందు, అది సిద్ధియొక్క ఒక రూపమే యగును" - అని శ్రీ అరవిందుడు వివరించును. జ్ఞానము నుపదేశించి, తదాధారముపై, 'కనుక యుద్ధము చేయుము' (2-18) - అని గీత చేసిన ఉపదేశముయొక్క తాత్పర్యమిదియే.

అవతారిక : తిరిగి సమున్నతోపదేశమునకు వచ్చుచున్నాడు.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి. 38

సుఖదుఃఖములను, లాభాలాభములను, జయాపజయములను సమముగా నెంచి, పిమ్మట యుద్ధము చేయ బూనుకొనుము. అట్లు చేసిన, నిన్ను పాప మంటదు.

విశేషార్థము : 'మే మెంత పాపమునకు ఒడిగట్టినాము !' (1-45) అని అర్జునుడు చేసిన ఆక్రోశమునకు దివ్యగురు విచ్చిన సమాధాన మిది. సమత్వమును పాప మంటదు, అది పాప భావమునకు అతీతము. ఈ సమత్వము గీత యొక్క ముఖ్యోపదేశమున ఒక ముఖ్యాంశము. ఈ సమత్వము ఆత్మధర్మము. ఈ సమత్వము నందు ఫలము నాశించి కర్మ చేయడు. కనుక పై శ్లోకములోని 'పృథివీరాజ్యము ననుభవించెదవు' అని చేసిన యుపదేశము దీని కంటెను చాల క్రిందిది.

అవతారిక : కర్మయందు సమత్వ సాధకమగు కర్మయోగ విషయకమగు బుద్ధి నిపు డుపదేశించును.

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్ యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి. 39

సాంఖ్యశాస్త్ర విషయకమగు బుద్ధిని (బౌద్ధిక జ్ఞానమును) నీ కింతవఱకు నుపదేశించితిని. ఇపుడు కర్మయోగ విషయకమగు బుద్ధిని నీకు జెప్పెదను. ఇట్టి బుద్ధియుక్తుడవై నీ వర్జునా, కర్మబంధమును విదళించివేసెదవు.

విశేషార్థము : ఇరువదినాలుగు ప్రకృతి తత్త్వముల కంటెను పురుషుడు పరు డని పురుషుని వేఱుచేసి చూపునది సాంఖ్యశాస్త్రము. ఇది వివేచనాత్మకము. పోతే యోగము అనుష్ఠానాత్మకము. ఉదాహరణకు, కర్మానుష్ఠానము యోగమున ఒక భాగము. ఇట్టి అనుష్ఠానమునందు ప్రతిక్రియయు, ప్రతితత్త్వమును క్రమముగా పైకి వెళ్లి తన మూలముతో సంయోగము నందును. కావుననే ఈ ప్రక్రియకు యోగమను పేరు వచ్చినది.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే,
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్. 40

ఇక్కడ నొక్క అడుగు వేసినను అది వృథాపోదు, పైగా నెట్టి అనర్థమును గలుగదు. ఈ ధర్మము నించుక అనుష్ఠించినను, అది మహాభయమునుండి రక్షించును.

విశేషార్థము : కర్మస్వరూపము, కర్మమూలము, కర్మవిధానము, కర్మ ప్రయోజనము తెలియవు గనుక, కర్మ బంధించునను మహాభయము నీకు గలదు. అదిగో, ఆ మహాభయమునుండి ఈ యోగము నిన్ను రక్షించును-అని శ్రీఅరవిందుడు. జననమరణచక్రమే మహాభయము, దానినుండి రక్షించును - అని శ్రీ శంకరుడు. "సర్వపాపములనుండి విడిపింతును" (18-66) - అను గీతా చరమవాక్యము గూడ శ్రీ అరవిందుని వ్యాఖ్యనే సమర్థించును.

**వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన,**
**బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినాం. 41**

నిశ్చయించునది బుద్ధి. కర్మయోగమునందు అట్టి బుద్ధి ఒకే నిశ్చయముపై నిలిచి, ఏకరూపముగా నుండును. నిశ్చయవిషయమున అట్టి దృఢత్వము లేనివారి బుద్ధి బహుశాఖలుగాను, అనంతముగాను చీలిపోవును, అది ఏకరూపముగానుండదు.

విశేషార్థము : బుద్ధికి రెండు వృత్తులు - 1. జ్ఞానము, 2. సంకల్పము. మఱియు సంకల్పము క్రియాపరము. ఇట్లు బుద్ధి ఒక వైపున తెలిసికొనుచు, రెండవవైపున ఆ తెలిసిన జ్ఞానమునకు కార్యరూప మిచ్చును. కనుక జ్ఞానపూర్వకమగు కర్మానుష్ఠానమే బుద్ధియోగ మని శ్రీ అరవిందుడు. బుద్ధితో నాత్మను తెలిసికొనుట మాత్రమే బుద్ధియోగ మని శ్రీ శంకరుడు.

**యా మిమాం పుష్పితాం వాచం ప్రవదం త్యవిపశ్చితః,**
**వేదవాదరతాః పార్థ నాన్య దస్తీతి వాదినః. 42**
**కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదాం,**
**క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి. 43**
**భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృతచేతసాం,**
**వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే. 44**

పార్థా ! యజ్ఞము చేసిన ఇహపర భోగములు లభించును - అని చెప్పు వేదవాదమునందు ప్రీతిగలవారు కొంద రున్నారు, స్వర్గ భోగమేతప్ప తదితర పురుషార్థ మేదియు లే దని వారు వాదింతురు. ఇట్లు వారు కామస్వరూపులును, స్వర్గపరాయణులును, కావుననే అల్పజ్ఞులును. ఇట్టివీరు జన్మను, కర్మను, తత్ఫలమును ఇచ్చునదియు, భోగైశ్వర్య సంపాదనకై వివిధ కార్యకలాపములను విధించునదియునగు నే మనోహర వాక్యమునుజూపుదురో, దానిచేత నాకర్షింపబడి, ఎవరు భోగమునందును, ఐశ్వర్యము

నందును ఆసక్తు లగుదురో, వారి బుద్ధికి దృఢనిశ్చయ ముండదు; కావున నది సమాధియందు కుదురుకొనదు.

విశేషార్థము : బుద్ధికి రెండు రూపములు, ఒక రూపము పైకి, పరమాత్మ వైపునకు దిరిగి, ఏకమగు నా పరమాత్మ దిశగా ఏకాగ్రమగును; రెండవ రూపము క్రిందికి, కర్మఫలముల వైపునకు దిరిగి, అటు నిటు చెదిరిపోవును. 41-వ శ్లోకము వ్యవసాయాత్మక, అనగా ఏకాగ్రరూపమును, 42, 43, 44 - శ్లోకములు బుద్ధియొక్క విక్షిప్త రూపమును మనకు జూపును.

త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. 45

వేదములు త్రిగుణముల వికారమగు ఈ ప్రపంచమును గుఱించియే తెల్పును. నీవు మాత్రము, ఓ అర్జునా, త్రిగుణాతీతుడవు కమ్ము, ద్వంద్వరహితుడవు కమ్ము, నీ యథార్థ సత్తయందు నిత్యస్థితుడవు కమ్ము, యోగక్షేమములను గుఱించి చింతించని వాడవు కమ్ము, ఆత్మవంతుడవు కమ్ము.

విశేషార్థము : సత్త్వస్థుడు = తన యథార్థ సత్తయందు స్థితుడని శ్రీ అరవిందుడు; సత్త్వస్థుడు = సత్త్వగుణస్థితు - డని ఇతర వ్యాఖ్యాతలు. సత్ + త్వం = సత్త్వం, సత్త. ఉదాహరణకు, నిత్య + త్వం = నిత్యత్వం, నిత్యత. కనుక ఉత్పత్తిని బట్టి, సత్వం = సత్త. ఈ అర్థము సందర్భమునకు తగియున్నది గూడను. ఎట్లన, ఆత్మ గుణాతీతము, కనుక ఆత్మవంతుడు సత్త్వగుణస్థితు డని చెప్పగూడదు, గుణాతీతమగు సత్తాస్థితు డనియే చెప్పదగును. ఇట్లు సందర్భము శ్రీ అరవిందునే సమర్థించును. ఇంకను -

ఆత్మవంతుడు = **Possessed of Self.** ఆత్మను గలిగియున్న వా డని శ్రీ అరవిందుడు ఉన్న దున్నట్లు అర్థము చెప్పును. పోతే శ్రీ శంకరుడు ఆత్మవంతుడు = అప్రమత్తుడు - అని చెప్పును. స్వధర్మానుష్ఠానపరుడు, ఇంకను జ్ఞానము కలుగని, సత్త్వగుణస్థితుడు నగు అర్జునునికి చేసిన ఉపదేశముగా శ్రీ శంకరుడు ఈ శ్లోకమున పై అంతస్తును చెప్పి, ఈ అంతస్తునకు మెట్లను తర్వాతి శ్లోకములలో వివరించుచున్నారు.

యావా నర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. 46

నలువైపుల నీరు పాఱుచున్నపుడు బావిజలముతో నెంత అవసర ముండునో, జ్ఞానవిలసితుడగు బ్రాహ్మణునికి వేదము లన్నింటితోను అంతే అవసర ముండును.

విశేషార్థము : 42-46 శ్లోకములందు దారుణమైన వేదనిరసన గన్పించును. గీత నిరసించుటకొఱకే ఇట్లు నిరసించుట లేదు. విశాలప్రాతిపదికపై కర్మజ్ఞాన సమన్వయము చేయగోరి, అట్లు నిరసించినది.

వేదాంతుల పరిభాషయందు కర్మ యన వేదప్రోక్తమైన యజ్ఞకర్మయే. కాని సర్వకర్మలను - "నాయందు సర్వకర్మలను...." (3-30) - జ్ఞానపురస్సరముగా యజ్ఞ భావముతో జేయవచ్చును. జీవనము నంతను యజ్ఞము గావించుకొనవచ్చును. కర్మను ధార్మిక కర్మకే పరిమితము గావించ నవసరము లేదు-అని తెలుపుటకే పైన గన్పించిన వేదనిరసనము.

ఇపుడు కేవల శమపరమగు తత్త్వశాస్త్రముల మహాదోషమును గీత పరిహరించును.

కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతు ర్భూర్ మా తే సంగోఽ స్త్వ కర్మణి.

కర్మయందు, కర్మయందే నీ కధికారము గలదు గాని, ఫలములం దెప్పుడును లేదు. కావున ఫలము నీ కర్మకు హేతువు గారాదు. అట్లని అకర్మయందును నీకు సంగ ముండరాదు.

విశేషార్థము : కర్మయందు సంగ ముండరాదు సరే, అకర్మయందును సంగ ముండరాదు ! నీవు కర్మచేత పరిచ్ఛిన్నుడవు గాకూడదు, సరే, అకర్మచేతను పరిచ్ఛిన్నుడవు గారాదు ! ఈ భావమునే శ్లోకము (3-18) గూడ పోషించును. శ్రీ అరవిందుని ఈ ప్రతిపాదన చాల చక్కగా నున్నది గదా !

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. 48

యోగమునందు నిలిచి, సంగము విడిచి, జయాపజయములందు సముడవై ఓ అర్జునా ! కర్మ చేయుము.

విశేషార్థము : 'యోగస్థః కురు కర్మాణి'-ఈమూడు మాటల సూత్రమునందు గీతాయోగ మంతయు వచ్చివేయును. ఇవ్విషయమున 'గీతాహృదయ' మను పీఠికను చూచెదరు గాక !

ఇట్లు గీతాకర్మలు ఫలము నాశించిచేయు వైదికకర్మలును గావు (2-47), చంచల మనస్సును తృప్తిపఱచుటకు చేయు విక్షిప్తకర్మలును గావు (2-48). అవి అక్షరాత్మతో యోగమునం దుండి చేయు భవ్యకర్మలు (2-48).

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ,
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. 49

బుద్ధిచేత భగవంతునితో యోగమునం దుండి చేయు నిష్కామకర్మకంటెను సకామ కర్మ, అర్జునా! చాల తక్కువ. కనుక అట్టి బుద్ధియందే ఆశ్రయమును గోరుకొనుము.....ఫలము నాశించి కర్మచేయువారు మిక్కిలి దీనులు.

విశేషార్థము : బుద్ధికి రెండుశక్తులు గలవు – 1. జ్ఞానశక్తి, 5. సంకల్పశక్తి (=ఇచ్ఛాశక్తి. ఇదియే కర్మమూలము, క్రియాశక్తి) కనుక జ్ఞానరూపమగు బుద్ధి యోగము కర్మరూపమగు బుద్ధియోగమునందు, అనగా కర్మయోగమునందు పరిపూర్తి నందును. ఇట్లు బుద్ధియోగ, కర్మయోగములు పరస్పర విరుద్ధములు గాక పోగా, పరస్పర పూరకములు గూడను.

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మాద్ యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం.50

తన బుద్ధిని భగవంతునితో యుక్తము గావించిన యోగి ఇచ్చట నీ ప్రపంచ మునందే పుణ్యపాపచింతను పాఱదోలును. కావున, అర్జునా! అట్టి యోగమునకు బూనుకొనుము. మఱియు యోగము కర్మలయందు కౌశలము సుమా!

విశేషార్థము : సాపేక్షమగు పుణ్యపాపములను వేఱుచేయవలసిన అవసరము చేతను, పాప మంటునేమో యను భయముచేతను, పుణ్యసాధనయందలి ఆయాసము చేతను కర్మ క్లిష్టమగుట లేదా? లేదు. ఏలన యోగయుక్తుడు ఆత్మజ్ఞానము యొక్క స్వేచ్ఛయందు, పుణ్యపాపములకు అతీతమగు నొక దివ్యధర్మమునుండి పనిచేయును. మఱియు నిష్కామ కర్మ పేలవముగా నిస్తేజముగా నుండు నని శంకింతువా?అదియును సరిగాదు. ఏలన కర్మాధీశ్వరుడగు భగవంతుని జ్ఞానసంకల్ప ములు,వీర్యసైపుణ్యములు అందు నిండియుండును.ఇట్లు యోగము కర్మకౌశలమగును.

కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛం త్యనామయం. 51

ఇట్లు ఊర్ధ్వబుద్ధి (2-41) యుక్తులైన యోగులు కర్మఫలమును త్యజించి వేతురు గనుక, జన్మను గల్గించు బంధమునుండి విముక్తులై, మానవజాతిని వేధించు నెట్టి ఆధివ్యాధులు లేని పరమపదమును బొందుదురు.

విశేషార్థము : కర్మ సన్యాసముచేతనే పరమపద మని వాదించు శ్రీ శంకరుని మతము నిది స్పష్టముగనే ఖండించును. జన్మరాహిత్యమునే తమ లక్ష్యముగా పెట్టుకొన్నవారు సైతము, దానిని కర్మయోగముచేత బొందగలరు — అని మన కీ శ్లోకము చెప్పును.

యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి,
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. 52

(అధోముఖమై నపుడు తనకు ఫలాసక్తివలన గలుగు) మోహమాలిన్యము నెపుడు నీ బుద్ధి దాటి వర్తించునో, అపుడు, అర్జునా, వినినదానిని గురించియు, వినవలసిన దానిని గురించియు నీకు వెగటు జనించును.

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి. 53

పరస్పర విరుద్ధములగు శ్రుతి వాక్యములను వినుటచేత విచలితమై యున్న నీ బుద్ధి సమాధియం దెపుడు అచలముగా నిలుచునో, అపుడు, అర్జునా, పరమాత్మతో యోగము నందెదవు.

విశేషార్థము : సమాధి యన బాహ్యస్పృహ లేని స్థితి యని సామాన్య భావన, కాని గీతార్థ మది కాదు. కామవిముక్తి దేనినుండి ఉద్భవించునో, అట్టి అంతఃస్థితి సమాధి యని శ్రీ అరవిందుడు. తర్వాతిశ్లోకములు ఈ అర్థమునే దెలుపును : ఈ సమాధియందు మనస్సు బాహ్యజీవనముయొక్క రాగద్వేషాలకు పైన సమముగా, శాంతముగా భాసిల్లును; బాహ్య కర్మయందు సైతము లోని కాకృష్టమై యుండును; ఇతరుల దృష్టిలో నది లౌకిక కర్మయందు వ్యాపృతమై యున్నపుడు సైతము, సర్వదా భగవదభిముఖముగనే యుండును.

అర్జున ఉవాచ :—

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ,
స్థితధీః కిం ప్రభాషేత కి మాసీత వ్రజేత కిం. 54

అర్జును డడిగెను – కేశవా! సమాధియం దున్న స్థితప్రజ్ఞుని లక్షణ మేమి? అత డెట్లు మాటాడును? ఏ రీతిగ నుండును? ఎట్లు సంచరించును.

**శ్రీ భగవాను ఉవాచ :–**

**ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్,**
**ఆత్మన్యే వాత్మనా తుష్టస్ స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. 55**

మనుజుడు తన మనసునం దున్నట్టి కోరిక లన్నింటిని, అర్జునా – ఎపుడు విడిచివేయునో మఱియు ఆత్మచేతనే ఆత్మయందే ఎపుడు సంతుష్టిని బొందునో, అప్పు డతనిని స్థితప్రజ్ఞు డందురు.

విశేషార్థము : అర్జునుడు బాహ్యముగా గుర్తించదగు స్థితప్రజ్ఞుని లక్షణము నడిగెను. కాని భగవానుడు ఆత్మతుష్టిని లక్షణముగా జెప్పెను. ఇది అంతర్లక్షణము. కారణము, స్థితప్రజ్ఞుని వేఱుచేసి చూపునట్టి బాహ్య లక్షణము లేమియు నుండవు. పైకి నతడు దాదాపు ఇతరులవలెనే యుండును. కనుక ఒక స్థితప్రజ్ఞుడు మాత్రమే మఱియొక స్థితప్రజ్ఞు నెఱుంగగలడు.

**దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః,**
**వీతరాగభయక్రోధః స్థితధీర్ ముని రుచ్యతే. 56**

దుఃఖములందు చలించని మనస్సు గలవాడును, సుఖములందు గతించిన కామాంకురము గలవాడును, రాగము, భయము, క్రోధము పోయినవాడు నగు ముని స్థితప్రజ్ఞు డనబడును. (అట్టివాడే స్థితప్రజ్ఞుడు కాగలడు.)

**యః సర్వ త్రానభిస్నేహస్ తత్తత్ప్రాప్య శుభాశుభం,**
**నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 57**

ఎవనికి దేనియందును అనురాగముండదో, ఎవనికి శుభము ప్రాప్తించినపుడు సంతోషముగాని, అశుభము ప్రాప్తించినపుడు ద్వేషముగాని జనించదో, అతని ప్రజ్ఞ ప్రతిష్ఠితము.

**యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః,**
**ఇంద్రియా ణీంద్రియార్థేభ్యస్ తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 58**

తాబేలు తన అంగములను వలె, ఎపుడీ యోగి ఎల్లెడల తన ఇంద్రియములను వాని విషయములనుండి లోనికి ఉపసంహరించుకొనునో, అపుడతని ప్రజ్ఞ ప్రతిష్ఠిత మగును.

విశేషార్థము : దివ్యగురు విచ్చట కామనిర్మూలన క్రమమును దెలుపుచున్నాడు. ఇంద్రియములను తమ విషయములనుండి లాగి, మనస్సునందును, మనస్సును బుద్ధి యందును, బుద్ధిని ఆత్మయందును స్థిరపఱచవలెను. ఇచ్చట భగవానుడు బాహ్య వైరాగ్యమును, భౌతిక సన్యాసమును బోధించుచున్నాడని మన కనిపించవచ్చును అది సరికాదు. నేను బోధించునది అంతరుపసంహరణము మఱియు కామనాసన్యాస మని ఆయన అనంతర శ్లోకముద్వారా తెలుపును. — శ్రీ అరవిందుడు

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. 59

ఉపవాసముచేత జీవునకు ఆహారముతో భౌతిక సంపర్కమే పోవును గాని, మనస్సునకు ఆహారమునందుగల ప్రీతి మిగిలియే యుండును. అయితే బుద్ధియోగము ద్వారా పరమపురుషుని దర్శించినపుడు, ఆ ప్రీతియు నిర్మూల మగును.

విశేషార్థము : బాహ్య సన్యాసమునందు మనోనివృత్తి యుండదు, మనస్సు విషయ వాసనచేత దూషితమగుచునే యుండును. పోతే, మనస్సు బుద్ధి ద్వారా శాంతము, స్వీయానందతృప్తము నగు పరమాత్మయందు నెలకొనినపుడు, అది విషయములందు గల తన ప్రీతిని అంతరముగా సన్యసించ గలుగును. ఇట్టి యెడ బాహ్యసన్యాస మనావశ్యకము. ఇదియే విముక్తికి సత్యమార్గము. — శ్రీఅరవిందుడు. (2-64, 71)-శ్లోకములందు ఈ విషయము మఱింత స్పష్టపడును.

యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః. 60

సదా సంక్షోభనశీలములగు ఇంద్రియములు పూర్ణవశిత్వముకొఱకు ప్రయత్నించు ప్రాజ్ఞుని మనస్సును సైతము (విషయాభిముఖముగా సంక్షుబ్ధము గావించి, విషయముల పైకి) బలవంతముగా నీడ్చుకొనిపోవును.

విశేషార్థము : చూచుచుండగనే ఈడ్చుకొనిపోవును, వివేకిపురుషుడు ఈ క్రియను చూడగలడు- అని శ్రీఅరవింద శంకరు లిరువురు ఏకకంఠమున చెప్పుదురు.

ఆయితే "పూర్ణవశిత్వముకొఱకు" అని శ్రీ అరవిందుడు చెప్పిన దానిలోని భావ మేమన, "పరమును జూచిన" (2-59) పిమ్మట సైతము పూర్ణవశిత్వము సాధించుటకు గొంత కాలము పట్టును. ఏలన ముందు పరమాత్మను దర్శించి, పిమ్మట పరమాత్మ యందు నెలకొని, చివరకు పరమాత్మవంతు డగును. కాని శంకరునికి జగత్తు మిథ్య. కావున అది నిజమగు పరమాత్మ దర్శనమే అగుచో, దర్శించిన వెంటనే ప్రపంచ మదృశ్య మగును — మేల్కొనిన వెంటనే స్వప్న ప్రపంచము కరగిపోయినట్లు. ఇకను అదృశ్యమైన ప్రపంచము మనస్సు నీడ్చు కొనిపోవుట యుండనే యుండదు. ఇందు సత్యముకంటె తర్క మెక్కువ గన్పించును.

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
వశేహి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 61

(ఇంద్రియము లట్టివి గావున) వాని నన్నింటిని చక్కగా నియమించి, నాకే సర్వసమర్పితుడవై నాతో యోగమునందు దృఢముగా నాసీనుడవు కమ్ము. పోతే, ఎవని యింద్రియములు వశమునందుండునో, అతని ప్రజ్ఞ ప్రతిష్ఠితము, అతడు స్థితప్రజ్ఞుడు.

విశేషార్థము : ఇచ్చటి "నా"కు అర్థము ఆత్మయని శ్రీ శంకరుడు; పరమ పురుషుడు, భగవంతు డని శ్రీ అరవిందుడు.

బుద్ధి తన స్వప్రయత్నముచేతను గాని, మనస్సు తన స్వయంశిక్షణ చేతను గాని ఇంద్రియ సంయమమును సాధించజాలదు. వేనియందు శాంతియు, ప్రభుతయు సహజసిద్ధములో, అట్టి లోపలి భగవంతునితో బుద్ధిసంయోగముచేతనే అది సిద్ధించును. కావున 'యుక్త ఆసీత మత్పరః' అని భగవానుడు మన కుపాయము జూపును. భగవంతుడు మనను విడిపించవలెను గాని, మనను మనము విడిపించుకొనజాలము. గీతయొక్క చరమ శ్లోకము (18-66) దీనిని స్పష్టముగా జెప్పును.

'యుక్త ఆసీత మత్పరః' — ఈ మూడు మాటలయందును పరమరహస్యము బీజప్రాయముగా నున్నది. గీతారీతియే యిది : ముందు సత్యముయొక్క ఒక చిన్న సూచన చేసి, క్రమముగా దానిని పెంపొందించును. 15-వ అధ్యాయమున దీని పూర్ణప్రతిపాదన వచ్చును.

'నే' ననగా వాసుదేవుడు, ప్రత్యగాత్మ యని శంకరాచార్యుడు. కాని శంకరాచార్యుని ఆత్మకు వ్యక్తిత్వములేదుగదా, అది నిర్వ్యక్తికముగదా; అయినపుడు ఆత్మ వాసుదేవుడెట్లగును ?

ఈ శ్లోక వ్యాఖ్యానమునందు శ్రీఅరవింద శ్రీ రామానుజాచార్యులకు ఎక్కువ సాదృశ్య మున్నది.

అవతారిక : ఇపుడు పతన వినాశముల క్రమమును జెప్పును.

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే,
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే.

క్రోధాద్ భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్ బుద్ధినాశో, బుద్ధినాశాత్ ప్రణశ్యతి. 63

విషయములను ధ్యానించు మానవునికి వానియందు సంగము జనించును, అట్టి సంగమునుండి కామమును, ఆ కామమునుండి క్రోధమును ఉద్భవించును. క్రోధము నుండి ఆత్మను మఱుగుపఱచు మోహము కలుగును. ఈ మోహమువలన బుద్ధికి ఆత్మపట్ల మఱపు జనించును. ఆ మఱపువలన బుద్ధియు ఆవేశమేఘములో అదృశ్యమగును. అపుడు ఆ మానవుడును తదావేశమే అయిపోయి, ఆత్మగా నుండ విరమించును. అదియే అతని నాశము — 'ప్రణాశము.'

విశేషార్థము : విషయములు ధ్యానించు వానికి వానియందు సంగమేర్పడును, సరే. కాని అస లట్లు ఎందుకు ధ్యానించును ? ఇంద్రియముల ననుసరించు గుణము మనసునకు సహజము. అట్లనుసరించి, విషయములను అంతరభిరుచితో నిరీక్షించును. నిరీక్షించుచు, వానిపైన కుదురుకొని, వానిని బుద్ధికి ఆలోచనా విషయము గావించును. ఇదిగో, ఇట్లు మానవుడు విషయములను ధ్యానించుట జరుగును. 60-వ మఱియు 62-వ శ్లోకములకు గల సంబంధమును గమనించి నపుడు మాత్రమే తెలియవచ్చు ఈ సత్యమును శ్రీ అరవిందు డొక్కడే వెలికి దీసెను.

అవతారిక : ఇపుడు వినాశమును దప్పించుకొను ఊర్ధ్వగతిని దెలుపును —

రాగద్వేషవియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి. 64

(ఆత్మతో బుద్ధియోగము సిద్ధించి నపుడు) విషయముల నంటి వానిపై పని చేయుచునే, ఇంద్రియములను అంతరాత్మకు అధీనముగాను, అంతరాత్మను పర మాత్మకు విధేయముగాను ఉంచుకొనగలము. అపు డింద్రియములు రాగద్వేషముల బారినుండి బైటబడును, వానిపై శాంతి, స్వచ్ఛతా, సంతోష రూపమగు ప్రసన్నత కుదురుకొనును.

ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. 65

ఇక నీ ప్రసన్నత ప్రాప్తించి నపుడు, సర్వదుఃఖములు నంతరించిపోవును. ఏలన చేతన ప్రసన్నమై నపుడు, బుద్ధి ఆత్మశాంతియందు శీఘ్రమే స్థిరపడును.

విశేషార్థము : రాగద్వేషరహితముగా విషయములను సేవించినపుడు, సేవించి నపుడు మాత్రమే, ప్రసన్నత ప్రాప్తించును. ఇక ప్రసన్నత ప్రాప్తించినపుడు దుఃఖము లంతరించిపోవును - అంతరించిపోనవి కర్మలు గావు, దుఃఖములు.

కర్మలు కొనసాగుచున్న సమయముననే ఆత్మసమతయందును, ఆత్మజ్ఞానము నందును బుద్ధియొక్క ఏ ప్రశాంత, నిష్కామ, నిష్ఠేద స్థిరత సిద్ధించునో, దానినే గీత సమాధి యని పిలుచును.

నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా,
న చాభావయతః శాంతి రశాంతస్య కుతః సుఖం. 66

పరమాత్మతో బుద్ధియోగము లేని వానికి దృఢబుద్ధి యుండదు, దృఢ స్వరూపభావనయు నుండదు, ఇక నాత్మస్వరూపభావన లేనివానికి శాంతి శూన్యము, కాగా శాంతి లేనివానికి సుఖ మెటనుండి వచ్చును ?

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివాంభసి. 67

విషయముల వెంటబడుచున్న ఇంద్రియములను ఏ మనస్సు అనుసరించునో, ఆ మనస్సు, సముద్రమునందు ప్రబలవాయువు నావను హరించివేసి నట్లు, అతని ప్రజ్ఞను హరించి వేయును.

తస్మా ద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః,
ఇంద్రియా ణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా. 68

కావున, మహాబాహువగు నో అర్జునా, ఎవడు తన ఇంద్రియములను విషయముల పైకి యధేచ్ఛగా పోనీయక, అరికట్టి వశమునం దుంచుకొనునో, అతని ప్రజ్ఞ ప్రతిష్ఠితమై యుండును.

విశేషార్థము : సారాంశ మేమన, ఇంద్రియములు వశముకానిదే, మన ప్రజ్ఞ ప్రతిష్ఠితముకాదు, మనకు గీతాసమాధి సిద్ధించదు. ఇక నింద్రియములు వశమగుటకు బుద్ధియోగము నాశ్రయించి (18-57), అనగా బుద్ధిద్వారా పరమాత్మతో యోగయుక్తులము గావలెను (2-61).

అవతారిక : చివరి నాలుగు శ్లోకములు స్థితప్రజ్ఞుని బ్రాహ్మీస్థితిని వర్ణించును.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. 69

సర్వభూతములకు నేది రాత్రియో, దానియందు ముని మేల్కొనియుండును. ఇక దేనియందు సర్వభూతములు మేల్కొని యుండునో, అది అంతర్దర్శియగు మునికి రాత్రి యగును.

విశేషార్థము : సామాన్యుల ఇంద్రియములు ద్వంద్వమయ జీవనమునందు ప్రవర్తించును; కనుక అది వారికి పగలు. కాని సంయమీంద్రుని చేతన దానిపట్ల ముడుచుకొని పోవును, నిద్రించును; కనుక నదియే అతనికి రాత్రి. అటులే ఏ బ్రహ్మభావమునందు యోగి పూర్ణచేతనతో మేల్కొనియుండునో, అది సామాన్యులకు రాత్రి. దానియందు వారి ఇంద్రియములు ముడుచుకొనిపోవును గదా. ఇట్లు బుద్ధియోగముచేత యోగి ప్రాపించిన బ్రాహ్మీస్థితియందు సామాన్య విలువ లన్నియు తాఱుమాఱగును.

ద్వంద్వజీవనము యోగికి రాత్రి గాని, అసలు జీవనమే రాత్రి యని దాని భావము గాదు. ద్వంద్వాతీతము, గుణాతీతము నగు జీవనమున్నది గదా (3-30).

ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్,
తద్వత్ కామా యం ప్రవిశంతి సర్వే
స శాంతి మాప్నోతి న కామకామీ. 70

నదీ ప్రవాహములు వచ్చి ప్రవేశించుచున్నను, సముద్రముయొక్క లోతులు ఎట్లు కలత జెందక, అచలముగా నుండునో, అటులే కామవిషయము లెవని యందు ప్రవేశించుచుండియు, తన లోతులను చలింపజేయవో, అట్టి స్థితప్రజ్ఞుడు శాంతిని బొందును గాని, స్వయముగా కామములను కామించువాడు బొందజాలడు.

విశేషార్థము : స్థితప్రజ్ఞుడు గుణాతీతమగు నాత్మసత్తయందు నెలకొని యుండును. కనుక గుణపరిధిలోని కామము లతని కలంచజాలవు. అతని బాహ్య సత్త కామములచేత నిండుక కలకబారినను, అతని ఆత్మసత్త అచల ప్రతిష్ఠముగా నుండును.

విహాయ కామాన్ యః సర్వాన్ పుమాం శ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకారః, స శాంతి మధిగచ్ఛతి. 71

కామముల నన్నింటిని (2-55) విడిచివేసి, అహంకార మమకారములు లేనివాడై, అందుచేతనే కామస్పృహ సైతము లేనివాడై ఎవడు విషయములను స్వీకరించునో, అట్టి స్థితప్రజ్ఞుడు శాంతిని బొందును.

విశేషార్థము : ఆత్మస్థుడైన సన్యాసి కేవలము శరీరధారణకు ఆవశ్యకమగు విషయములను నిస్పృహుడై సేవించు నని శ్రీ శంకరుడు. స్థితప్రజ్ఞుడు ఆత్మయందు అహంకారమును అర్పివేసినవాడు గనుక, అందరివలెనే జీవించుచు, లోపలమాత్రము విషయములయందు నిస్పృహుడై యుండును — అని శ్రీ అరవిందుడు. నిరహంకారుడు ఏమి చేసినను, అది వాని నంటదు గదా. అయినపుడు అతడు జ్ఞానమయ పూర్ణ జీవితము నెందుకు జీవించలేడు ? జీవించును గూడ. ఇది ఇంతవరకు గీత సాధించిన జ్ఞాన కర్మల వ్యావహారిక సమన్వయము.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ, నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. 72

ఇదిగో, యిది, అర్జునా, బ్రాహ్మస్థితి — బ్రహ్మయందు సుస్థిర స్థితి. దీనిని బొందినవా డెన్నటికిని తిరిగి మోహము నందడు. కనుక అంతకాలమునందు సైతము దీనియందు నిలిచి, అతడు బ్రహ్మనిర్వాణమును బడయును.

విశేషార్థము : అంతకు పూర్వము గాక, కనీసము చరమవయస్సున శః స్థితిని బొంది నప్పటికి, అతడు బ్రహ్మనిర్వాణమును బొందును—అని శ్రీ శంకరుడు.

బ్రహ్మనిర్వాణము = బ్రహ్మయందు నిర్వాణము. ఇది బౌద్ధుల అభావాత్మక, ఆత్మవిధ్వంసనరూప నిర్వాణము గాదు. పరంతు ఏకము, అనంతము, నైర్వ్యక్తికము నగు బ్రహ్మమహాసత్తయందు వేఱుచేయు స్వభావముగల అహంకార వ్యక్తిత్వము యొక్క నిర్వాణము (నిర్వాణము = ఆఱిపోవుట) – అని శ్రీ అరవిందుడు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే
సాంఖ్యయోగో నామ ద్వితీయోఽధ్యాయః





# శ్రీ గీతా యోగము

## అథ తృతీయోఽధ్యాయః

## కర్మ యోగః

ఒక పరిశీలన : "ఆత్మతో యోగమునం దుండి కర్మ చేయుము" (2-48); అంతర సన్న్యాస మపేక్షణీయము గాని, బాహ్య సన్న్యాసము గాదు (2-59); "యోగ మన కర్మకౌశలము" (2-50) – ఇత్యాది వాక్యములచే క్రిందటి అధ్యాయము నందలి బుద్ధియోగము జ్ఞానకర్మల సమన్వయమును సాధించనే సాధించినది; బ్రహ్మశాంతిని నీ కర్మల కాధారము గావించుకొనుము (2-71) – అని చెప్పనే చెప్పినది.

కాని ఆ కాలమున సాంఖ్యసిద్ధాంతముపై నాధారపడిన జ్ఞానయోగము (3-3) ప్రాబల్యము వహించి యుండెను. కర్మ జ్ఞానములకు పొత్తు కుదురదు; జ్ఞానము విమోచకము కాగా, కర్మ బంధకము – అని అది చెప్పుచుండెను. ఈ సాంఖ్య భావములే అర్జునుని మనస్సునందు ప్రాబల్యము వహించియుండెనుగాన, పై సూక్ష్మ సమన్వయము ఆయన మనస్సున కెక్కలేదు.

పైగా, "కర్మ మిక్కలి తక్కువ" (2-49) – అని శ్రీకృష్ణ డొకచోట చెప్పును; మఱియు "కావున యుద్ధము చేయుము" (2-18) – అని మఱియొకచోట చెప్పును, సామాన్య కర్మనే కాక, ఘోరయుద్ధ కర్మను సైతము ప్రోత్సహించును. ఈ వాక్యముల మర్మమును గ్రహించని అర్జునునికి అవి పరస్పర విరుద్ధములుగా గన్పించెను.

ఇట్లు అర్జునునకు అప్పటి జ్ఞానయోగము మఱియు భగవదుపదేశము-రెండింటి యందును జ్ఞానకర్మల విరోధమే కన్పించగా, రెండింటిలో, కృష్ణా నాకేది శ్రేయమో దానిని తెగవేసి చెప్పు-మని భగవానుని వేడుకొనును (3-2).

ఈ వేడికోలు మన్నించి, కర్మయోగమును మఱింత స్పష్టముగాను, వివరము గాను ప్రతిపాదించి, అర్జునునకు గన్పించు జ్ఞానకర్మల విరోధాభాసమును భగవానుడు దొలగించును -

చూడు మర్జునా! కర్మ బుద్ధియోగముకంటెను తక్కువని నేను చెప్పిన మాట నిజమే. అయితే బుద్ధియోగ మన కర్మఫలముల దిశగా పరుగులువెట్టు బుద్ధితో గాక, పరమాత్మదిశగా నేకాగ్రమైన బుద్ధితో గూడిన కర్మయోగము, జ్ఞానపూర్వక కర్మయోగము (2-41). అంతేకాదు, కర్మకంటెను గూడ నీ దృష్టిలో నున్న అకర్మ మఱింత తక్కువ (3-8). ఏలన జీవనమే ఒక సంతత క్రియ, కావున కర్మ చేయనివానికి శరీరయాత్రయు సంభవము గాదు. ఇట్లు కర్మయోగము కర్మ కంటెను అధికము మఱియు కర్మ అకర్మకంటెను అధికము.

ఒకవేళ బాహ్య అకర్మ సాధ్య మనుకొనినను, అది నీకు 'నైష్కర్మ్య' సిద్ధి నీయదు (3-4). ఏలన నైష్కర్మ్యము లోపలి పురుషుని లక్షణముగాని, బాహ్య ప్రకృతి లక్షణము గాదు. ప్రకృతి స్వభముగా నుండక కర్మచేసినపుడే అది ప్రసన్నమగును. అట్టి ప్రసన్నత యందు లోపలి పురుషనైష్కర్మ్య మనుభూత మగును. ఇట్లు కర్మయే నైష్కర్మ్యమునకు మార్గము సుమా!

అయితే రాగద్వేషరహితములైన కర్మలే అట్టి ప్రసన్నత నిచ్చును (2-64). పోతే స్వభావనియతమైన కర్మ ఏది గలదో, అదియే రాగద్వేష రహితముగా జేయుటకు సాధ్యమగును. మఱియు నిట్టి కర్మ సహజము గనుక, అది సంగము-పట్టు-లేకుండ చేయుటకును సాధ్యమగును. ఇక నీ స్వభావనియతమైన కర్మనే స్వధర్మ మందురు గాన, పరధర్మము గాక, స్వధర్మమే (3-35) - స్వధర్మానుష్ఠానమే - మన నైష్కర్మ్యమునకు మార్గమగును; అంతియే గాని బాహ్యకర్మ సన్యాసము గాదు.

పోతే, అర్జునా, ఇట్టి స్వధర్మమునకు - నియతకర్మకు - గూడ నొక ఫల ముండును గదా, దాని మాటేమి టందువా? ఫలాసక్తితో జేసిన, అదియైనను నిన్ను బంధించును. కావున భగవంతుని కొరక యజ్ఞముగా నీవు నీ స్వధర్మము నాచరించవలెను (3-9), ఇట్టి యజ్ఞకర్మచేత నీ ఆత్మలక్షణమగు నైష్కర్మ్యము ననుభవించు చునే, ఇంకను పైకెగసి, భగవంతునితో సాయుజ్యము నందగలవు. ఇదియే నీ సంపూర్ణ సంసిద్ధి. జనకాదు లీ సంసిద్ధిని కర్మచేతనే బొందిరి (3-20) గాన, నీ కివ్విషయమున ఎట్టి సందియము నుండ నవసరము లేదు.

ఈ సాయుజ్యమునందు నీ కొరక పరమసత్యము గోచరించును - సర్వమునకు మూలమైన భగవంతునినుండియే కర్మ సైతము వెలువడుచున్నది. కనుక నీ వా భగవంతునియందే సర్వకర్మలను సంన్యసించగలిగెదవు, సంన్యసించెదవు (3-30),

అనగా నిజానికి కర్మకర్త భగవంతుడే నని నీవు గాంచెదవు ! అదిగో, అపుడు నీ కర్మ దివ్యకర్మ యగును.

చివరకు, భగవంతునితో సాయుజ్యరూపమగు సంసిద్ధిని బొందిన పిమ్మట, భగవంతునివలెనే (3-32) నీవును లోకసంగ్రహార్థము సహజముగనే కర్మను చేయుచు నుండెదవు (3-25).

ఇదిగో, యిదియే కర్మయోగ స్వరూపమును, మహిమయు, కనుక నో అర్జునా, ఇట్లు దెలిసి నీకర్మ ననుష్ఠింపుము. లెమ్ము !

**అర్జున ఉవాచ :—**

**జ్యాయసీ చేత్ కర్మణస్తే మతా బుద్ధిర్ జనార్దన,**
**తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ. 1**

అర్జునుడు ప్రశ్నించెను - కర్మకంటెను, ఓ కేశవా ! బుద్ధియే మిన్న యని నీ అభిప్రాయ మగుచో (2-49), మఱి నన్నేల నీ ఘోరయుద్ధ కర్మయందు నియోగింపుచున్నావు ?

**వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే,**
**తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయాం. 2**

ఓ! భ్రమ వాక్యమువలె నున్న మాటను జెప్పి, నా బుద్ధిని, ఓకృష్ణా, కలవర పెట్టుచు నట్లున్నావు. కావున నేను దేనిచేత శ్రేయమును బొందగలనో, కర్మ జ్ఞానములలో నట్టి యొకే దానిని నిశ్చయించి నాకు నెలవీయుము.

విశేషార్థము : ఈ రెండు శ్లోకాలకు సంబంధించి, 'పరిశీలనను' జూచెదరుగాక!

**శ్రీ భగవా నువాచ :—**

**లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ,**
**జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం. 3**

శ్రీ భగవానుడు చెప్పెను - పాపరహితా, అర్జునా ! సాంఖ్యులకు (తత్త్వ విచారణాపరులకు) జ్ఞానయోగనిష్ఠయు, యోగులకు (అనుష్ఠానపరులకు) కర్మయోగ నిష్ఠయు పూర్వ మీ లోకమున నాచే జెప్పబడెను.

విశేషార్థము : జ్ఞానము వేఱు, కర్మ వేఱు, రెండింటికి సఖ్య మసంభవ మని వాదించుటకు శంకరసంప్రదాయ మీ శ్లోకము నొక ప్రబలాధారముగ గొనును. కాని అవి జ్ఞానప్రధాన, కర్మప్రధాన మార్గములే గాని, శంకరసంప్రదాయము తలంచు నట్లు, రెండు అత్యంత విరుద్ధ మార్గములు గావు. ఈ విషయమును తర్వాతి శ్లోకము స్పష్టముచేయును - అని శ్రీ అరవిందుడు చూపును. చూడుడు-

కర్మల నారంభించినంత మాత్రమున సాంఖ్యు లపేక్షించు నైష్కర్మ్యము సిద్ధించదు, మఱియు ఆరంభించిన వానిని సంన్యసించినంత మాత్రమున సిద్ధి చేకూరదు (3-4). అనగా బాహ్య సన్యాసము నైష్కర్మ్యమునకు సాధనము గాదు. ఇట్లు శంకర సాంప్రదాయ మూహించిన బాహ్యసన్యాసము భగవానుడు చెప్పిన జ్ఞానయోగమున లేదు. పైగా బాహ్యసన్యాసము సంభవము గా దనియు వచించును (3-5). ఇంకను, ముందుకు వెళ్లి 'కర్మయందు అకర్మ, అకర్మయందు కర్మ' (4-18) - అని చెప్పి, భగవాను డీ రెండు మార్గముల సమైక్యమును సైతము సాధించును.

అవతారిక : బాహ్యసన్న్యాసము ఆంతర సంన్యాసమునకు మార్గముకాదు -

**న కర్మణా మనారంభాన్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,**
**నచ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి. 4**

కర్మలను ఆరంభించినంత మాత్రమున పురుషుడు తన ఆత్మయొక్క నైష్కర్మ్యము ననుభవింపజాలడు. మఱియు వానిని సంన్యసించినంత మాత్రమున సిద్ధిని బొందజాలడు.

అవతారిక : బాహ్యసంన్యాసము సాధ్యము సైతము గాదు -

**నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్,**
**కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః. 5**

ఎవడును ఒక్క క్షణ మేనియు కర్మ చేయక యుండుట లేదు. ఏలన ప్రకృతిగుణములు ప్రతివానిచేత వివశముగా కర్మచేయించును.

అవతారిక : కావున సంన్యాస ప్రయత్నము మిథ్యాచారమే యగును.

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్,
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే. 6

కనుక నెవడు కర్మేంద్రియములను అడచిపట్టి, ఇంద్రియవిషయములను మనస్సుచేత స్మరించుచు నుండునో, అట్టి భ్రాంతచిత్తుడు మిథ్యాచారు డనబడును.

విశేషార్థము ; ఒకవేళ చెట్టువలె నిశ్చలముగా నుండగలిగినను, అట్లు బాహ్య క్రియను అడచివేసి, దానికి మూలమగు నాంతరక్రియను సాగించుచో మనమేమి సాధించి నట్లు ? అది కఠోరక్లేశము మాత్రమే యగును. కనుక నతడు మిథ్యాచారుడు

మిథ్యాచారుడు= దాంభికుడు, కపటవర్తనుడు - అని ఇతర వ్యాఖ్యాతలు చేయు వ్యాఖ్యానమును నే నంగీకరించజాలను. అంతటి కఠోరక్లేశమును విధించు కొనువాడు కపటవర్తను డెట్లగును ? అతని ఆచారము భ్రాంతము, నిరర్థకము. కనుక నతడు భ్రాంతాత్ముడే గాని దాంభికుడు గాడు - అని శ్రీ అరవిందుడు.

యస్ త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున,
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తః స విశిష్యతే. 7

పోతే, ఎవడు, ఓ అర్జునా, ఇంద్రియము లన్నింటిని మనస్సుచేత నియమించి, ఇంద్రియ క్రియలందు సక్తుడుగాక,కర్మేంద్రియములతో కర్మయోగము నాచరించునో, అతడు ఉత్తముడు

అవతారిక : అందుచేత -

నియతం కురు కర్మత్వం కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపిచ తే న ప్రసిద్ధ్యే దకర్మణః. 8

నీవు, ఓ అర్జునా, నియతకర్మ నాచరింపుము. కర్మ నిశ్చయముగా అకర్మ కంటెను శ్రేష్ఠము. మఱియు కర్మచేయకుండిన, నీకు శరీరయాత్రయు కొనసాగదు.

విశేషార్థము : నియత కర్మ = వేదవిహిత యజ్ఞకర్మలు, నిత్యనైమిత్తిక కర్తలు - అని శంకరుడు. దీనిని నే నామోదించజాలనని శ్రీ అరవిందుడు.

ఇచ్చటి 'నియత' పదము పై శ్లోకము (3-7) లోని 'నియమ్య' పదము ననుసరించును. కనుక నియత కర్మ = విముక్త బుద్ధిచేత నియతమైన నిష్కామ కర్మ — అని శ్రీ అరవిందుడు. ఇట్లు ఇచ్చటను, తదితరత్రను శ్రీ అరవిందుడు ఒక సంప్రదాయమును గాక, గీతామూలమునే అనుసరించును.

ఇట్టి నియతకర్మలోనికి జీవనకర్మ లన్నియు — యుద్ధము సైతము — వచ్చి చేయును. కనుక నిది దివ్యజీవనమునకు మార్గము.

మఱియొక విశేషము : ఇట్లు పైకి వెళ్లి, భగవంతునితో యోగము సందిన బుద్ధి స్వయముగా విముక్తమై, ఆత్మజ్ఞానము మఱియు నిర్విశేషమానంద ప్రభావముచే మనఇంద్రియశరీరములను నియమించి వానితో నిష్కామకర్మ చేయించును, అనగా బుద్ధియోగము కర్మయోగమున పరిపూర్తి నందును — జ్ఞానము కర్మయందు పూర్తి యగును. ఇట్లు జ్ఞానము లేక బుద్ధి కర్మకంటె నధిక మనినప్పుడు, జ్ఞానము కర్మకు విరుద్ధ మని అర్థము కాదు.

అవతారిక : నియత కర్మ మాత్రము బంధకము గాదా? కాదు —

**యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః,**
**తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర. 9**

యజ్ఞముకొఱకు గాక చేయు కర్మ లన్నియు మానవుని బంధించును గాన, ఓ కౌంతేయా! యజ్ఞార్థము సంగము లేక కర్మ నాచరింపుము.

విశేషార్థము : కర్మచేయునది ప్రకృతి. ఆ ప్రకృతియొక్క సమస్త క్రియయు, ప్రకృతి భగవంతుని ప్రకృతిగాన, భగవంతునినుండియే ప్రవర్తించును, అతనియందే నిలుచును, అతనివైపునకే సాగును; ఇట్లు సృష్టియే ఒక మహాయజ్ఞము. అహంకార విమూఢులమై మన మీ సత్యమును గుర్తించక, యజ్ఞముకొఱకు గాక, స్వార్థము కొఱకు అహంకారముతో కర్మ చేతుము. అందుచేతనే అది బంధించును. కనుక అహంకారసంగము లేక చేయు నియతకర్మలు మనను బంధించజాలవు — వైదిక కర్మలే గాదు, నియత జీవనకర్మలును బంధించజాలవు.

అవతారిక : యజ్ఞము వినా జీవనమే లేదు —

**సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,**
**అనేన ప్రసవిష్యధ్వం ఏష వోఽ స్త్విష్టకామధుక్. 10**

పూర్వము బ్రహ్మదేవుడు యజ్ఞసహితముగనే ప్రజలనుసృజించి, 'ఈ యజ్ఞము చేత మీ కోరికలను సాధించుకొనుడు, ఇది మీకు కామధేను వగుగాక !' – అని వారికి జెప్పెను.

**దేవాన్ భావయ తానేన తే దేవా భావయంతు వః,**
**పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ. 11**

యజ్ఞముచేత మీరు దేవతలను వృద్ధిబొందింపుడు, ఆ దేవతలును మిమ్ము వృద్ధిబొందింతురుగాక ; ఇట్లు పరస్పరము వృద్ధిబొందించుకొనుచు పరమ శ్రేయమును బొందుడు.

విశేషార్థము : ఇట్లు యజ్ఞ మన ఆదానప్రదాన మని తేలును. కాని ఈ శ్లోకము లందలి పదజాలమును బట్టి, ఈ యజ్ఞము వైదిక యజ్ఞము, ఇందలి ఆదానప్రదానము మానవులకును, దేవతలకును మధ్య జరుగునది – యని మున్ముందు అనిపించును. సన్న్యాస సంప్రదాయము యజ్ఞమును ఈవైదికయజ్ఞమునకే పరిమితముచేయనుగూడ.

కాని గీతాభావము ఇంత స్థూలము, సంకుచితమును గాదు. చూడుడు 4-వ అధ్యాయమున మఱల నీ యజ్ఞప్రసక్తి వచ్చును. అచ్చట 'బ్రహ్మాగ్ని' (4-25), 'యోగాగ్ని' (4-27) - ఇత్యాది పదములు ప్రయోగింపబడినవి. కనుక ఈ యజ్ఞము ఆధ్యాత్మికము, మనోవైజ్ఞానికము – ఇత్యాదికము *గూడ* నని విస్పష్టముగా దేలును. మఱియు 'యజ్ఞార్థము చేయు క ర్మ యం త యు లీనమైపోవును' (4-23) - అని చెప్పబడినది గాన, యథార్థము చేయు సర్వకర్మయు యజ్ఞకర్మయే యగును.

సత్త యంతయు నొకే సత్త గావున, సత్తలోని వివిధ భాగములకు మధ్యను, ఆ భాగములకు మఱియు వాని మూలమగు భగవంతునకు మధ్యను అనుక్షణము ఆదానప్రదానము జరుగుచుండును. ఈ యజ్ఞనియమము సృష్టి నంతను బాలించును. యజ్ఞమును తమ నిత్యసఖుని గావించి, సర్వభూతమహేశ్వరుడు సర్వభూతములను సృజించె ననుటకు ఈ యజ్ఞధర్మము ప్రబల నిదర్శనమని శ్రీ అరవిందుడు చెప్పును.

ఈ యజ్ఞమే భగవంతుని, ప్రపంచమును, కర్మను గలుపు గభీరసత్యము. ఈ యజ్ఞాచరణముచేతనే భగవంతుని మనము తిరిగి సచేతనముగా బొందగలుగు

చున్నాము; లేనిచో ఏ వ్యక్తి కా వ్యక్తి పరిచ్ఛిన్నముగనే, తన నాలుగు గోడల మధ్యనే బంధింపబడి యుండిపోవును.

ఇట్లు, బౌద్ధమతమువలె యజ్ఞమును సర్వథా ఖండించక, గీత దానికి సర్వ విశాలము సముద్ధారకము నగు భవ్యరూపము నిచ్చును. ఈ ఉద్దేశ్యముతోనే గీత మున్ముందు (3–10, 11) వైదికపరిభాషలో యజ్ఞమును ప్రస్తావించును.

**ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,**
**తైర్దత్తా నప్రదా యైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః. 12**

ఇట్లు యజ్ఞముచేత నారాధింపబడిన దేవతలు మీకు కోరినభోగముల నిచ్చెదరు. కాగా వా రిచ్చిన భోగములను తిరిగి వారికి నివేదించక, ఎవ డనుభవించునో, వాడు దొంగయే యగును.

**యజ్ఞశిష్టాశినః సన్తో ముచ్యంతే సర్వకిల్బిషైః,**
**భుంజతే తే త్వఘం పాపా యే పచం త్యాత్మకారణాత్. 13**

మరి ఎవరు యజ్ఞమునందు మిగిలిన యజ్ఞశేషమును ప్రసాదముగా స్వీకరించి జీవయాత్ర సాగింతురో, వారు సర్వపాపములనుండియు విముక్తు లగుదురు. కాని ఎవరు తమకొఱకే వండుకొందురో, వారు పాపమును భక్షించువారే యగుదురు.

విశేషార్థము : ఒకవేళ లుబ్ధులమై యజ్ఞధర్మమును పాలింప మేని, ప్రకృతి బలాత్కారముగా మననుండి యజ్ఞభాగమును లాగుకొనును - పన్ను లివ్వనిచో, ప్రభుత్వము బలవంతముగా వానిని వసూలుచేసినట్లు. యుద్ధములు విప్లవములు ఈ బలాత్కార చిహ్నములే.

అవతారిక : ఇపుడు సృష్టిచక్రమునందు యజ్ఞస్థానము చూపబడును -

**అన్నా ద్భవంతి భూతాని, పర్జన్యా దన్నసంభవః,**
**యజ్ఞా ద్భవతి పర్జన్యో, యజ్ఞః కర్మసముద్భవః. 14**
**కర్మ బ్రహ్మోద్భవం విద్ధి, బ్ర హ్మాక్షరసముద్భవం,**
**తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం. 15**

అన్నమునుండి ప్రాణులు గలుగును, అటులే అన్నము మేఘమునుండియు, మేఘము యజ్ఞమునుండియు, యజ్ఞము కర్మనుండియు నుద్భవించును. మఱియు

బ్రహ్మమునుండి కర్మయు, అక్షరమునుండి బ్రహ్మము నుద్భవించును. కావున సర్వవ్యాపి బ్రహ్మము సదా యజ్ఞమునందు ప్రతిష్ఠితమైయుండును.

విశేషార్థము : యజ్ఞము= వైదికయజ్ఞము, కర్మ = వైదిక కర్మ, బ్రహ్మము = శబ్దబ్రహ్మమగు వేదము – అని వేదవాదము పట్టుబట్టును. శంకరుడు నైతము బ్రహ్మము= వేదము-అనియే వ్యాఖ్యానించును. కాని –

అక్షరబ్రహ్మమునుండి క్షరబ్రహ్మము వచ్చును. కావున నిచ్చట బ్రహ్మ మన క్షరబ్రహ్మము లేక ప్రకృతియందు పనిచేయుచున్న క్షరపురుషుడు, 'మహేశ్వరుడు' (5-29) – అని శ్రీ అరవిందుడు. వేదము ఈ క్షరబ్రహ్మమును గురించియే చెప్పును – 'త్రైగుణ్య విషయా వేదాః' (2-45). ఈ సాంకేతికార్థమున మాత్రమే బ్రహ్మము=వేదము – అనవచ్చును గాని, వాచ్యార్థమున గాదు. క్షరబ్రహ్మమునుండి కర్మ, కర్మనుండి యజ్ఞము. ఇది సహజము, సరళము నైన అర్థము. క్షరబ్రహ్మమునే సగుణబ్రహ్మయు నందురు. పోతే –

యజ్ఞమునుండి వర్షము : "యజ్ఞమునందు వేల్చబడిన ఆహుతి ఆదిత్యుని చేరుకొనును మఱియు నాదిత్యునినుండి వర్షము వచ్చును." అని చెప్పు మనుస్మృతి వాక్యమును శ్రీ శంకరు లుదాహరించును. యజ్ఞభావమును వైదికయజ్ఞమునకే పరిమితము గావించినప్పుడు, ఇట్టి విచిత్రమైన వివరణము నొకటి దానిని చెప్పక తప్పదు. అయితే శ్రీ అరవిందు డేమి చెప్పును ? చూడుడు : సైన్సు దేనిని వర్ష కారణముగా జెప్పునో. అది యొక ప్రకృతిక్రియయే గదా, మఱియు ప్రకృతి క్రియంతయు నొక యజ్ఞమే– ఒక ఆదానప్రదానమే. కనుక యజ్ఞమునుండి వర్షము – అను మాట ఒక సహజ, సరళ సత్య మగును. యజ్ఞభావమును విస్తృతపఱచి నప్పుడు, ఇట్టి సరళవివరణకు తావుండును.

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః,
అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి. 16

ఇట్లు ప్రవర్తింపజేయబడుచున్న సృష్టిచక్రము ననుసరించి ఎవడు ప్రవర్తింపడో, అట్టి ఇంద్రియలోలుని ఆయువునకు మఱియొక పేరు పాపము, అతని జీవితము వ్యర్థము.

విశేషార్థము : అక్షరము→ బ్రహ్మము → కర్మ → యజ్ఞము → వర్షము→ అన్నము→ ప్రాణులు : ఇదియొక పరంపరయేగాని, చక్రము గాదు కదా ? అయి

నపుడు గీత దీని నెందుకు చక్ర మనుచున్నది? ఎందు కన, యజ్ఞము ద్వారా ప్రాణులు తిరిగి అక్షరములో ప్రవేశించి, అచ్చట సచేతనముగా నెలకొందురు. మఱియు నవ్యక్తమగు అక్షరము ప్రాణులయందు వ్యక్తమగును. అట్లు చేరయక, ప్రాణులు ప్రాణులుగానే యున్నచో, వారి జీవితము వ్యర్థము.

అవతారిక :- ఇట్లు అక్షరమును తిరిగి చేరిన ప్రాణికి కర్మ యుండునా?

యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవచ సంతుష్టస్ తస్య కార్యం న విద్యతే. 17

నైవ తస్య కృతే నార్థో నాఽకృతే నేహ కశ్చన,
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః. 18

(స్వర్గకాముని వలె) గాక, ఎవడు ఆత్మయందు రమించుచు, ఆత్మయందే సంతృప్తిని, సంతుష్టిని అనుభవించునో, అతనికి చేయవలసిన కార్య మేదియు నుండదు. మఱియు చేసిన కర్మచేతగాని, చేయని కర్మచేతగాని అతని కిట నెట్టి ప్రయోజనము నుండదు. మఱియు సర్వభూతములయందును ఒక ప్రయోజనము నపేక్షించి ఆశ్రయించవలసిన దేదియు నతని కుండదు.

విశేషార్థము : ఇచ్చట సూక్ష్మముగా గమనించవలసిన దేమన, ఆత్మస్థునికి కార్య ముండ దని చెప్పబడెను గాని, కర్మ యుండ దని చెప్పబడలేదు. మఱియు నతనికి కర్మవలన పొందవలసిన ప్రయోజన ముండదు సరే, అకర్మవలన-సన్న్యాసమువలన-పొందవలసిన ప్రయోజనము నుండదు. మఱియు కర్మాకర్మలలో నొక దానిని ఎన్నికచేయవలసినది స్వీయ ప్రయోజన దృష్ట్యా కాదు, లోకసంగ్రహ దృష్ట్యా. అందుచేత -

తస్మా దసక్తః సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః. 19

కావున, ఓ కౌంతేయా, అసక్తుడవై సదా చేయదగిన కర్మను సమగ్రముగా చేయుము (అనంతర శ్లోకము స్పష్టపఱచు నట్లు, లోకసంగ్రహానికి త్తము చేయుము); అట్లు చేయుచు పురుషుడు పరమ పదము నందును. జ్ఞానికి కర్మవలన మోక్షరూప

ప్రయోజన మిక నుండకపోయినను, సంసిద్ధిరూప ప్రయోజన ముండును. ఇచ్చట సంసిద్ధియే.

విశేషార్థము : (అజ్ఞానియగువాడు కర్మ చేయవలసినదే) 'కావున' యని శంకరుడు. నిజ్ఞాయగువాడు అకర్మవలన బొందవలసిన ప్రయోజనమేమియు నుండదు 'గావున' (3-18), అతడు అకర్మ నాశ్రయించక, లోకహితార్థము కర్మచేయవలెను - అని శ్రీ అరవిందుడు.

ఇట్లు 19-వ శ్లోకములోని 'కావున'కు 18-వ శ్లోకముతో సంబంధము కలిపిన మహాప్రతిభ శ్రీ అరవిందునికే దక్కును. శ్రీ శంకరుని కావున'కు 18-వ శ్లోకములో నెట్టి అధారము లేదు. ఏలన 17, 18 శ్లోకములను వ్యాఖ్యానించుచు, ప్రారబ్ధ క్షయమువఱకు శరీరధారణమాత్ర కర్మ తప్ప, అతడు మఱే కర్మయు చేయ డని ఆయన చెప్పను. అకర్మవలన సైతము జ్ఞానికి ఒరగున దేదియు లే దని 18-వ శ్లోకము చెప్పిన సూక్ష్మార్థము నాయన విడిచివేసెను - అని చెప్పక తప్పదు.

కనుక శ్రీ అరవిందుని వ్యాఖ్యకు సందర్భశుద్ధి గలదు. పైగా (3-25) - శ్లోకము ఇచ్చటి శ్రీ అరవిందుని వ్యాఖ్యను స్పష్టవచనములలో సమర్థించును.

'అసక్తుడవై చే యు చు' పరమును బొందెదవు : ఇందలి 'చేయుచు' అను పదము శ్రీ శంకరుని వాదమును ఖండించును. చిత్తశుద్ధి పర్యంతమే కర్మ, తర్వాత కర్మ విడిచినగాని జ్ఞాననిష్ఠ కలుగదు - అని శంకరుడు వాదించును. 'చేయుచునే' పరమును బొందెదవు, కర్మ బాధకము కాకపోగా, సాధకము గూడ నని చెప్పి, గీత శంకర వాదమును నిరాకరించును. గీత ఈ అర్థమునే మఱింతగా నిట్లు స్పష్టము చేయును -

**కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః,**
**లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి. 20**

కర్మచేతనే జనకాదులు సంసిద్ధిని చేరుకొనిరి. (ఒకవేళ నీ వా సంసిద్ధిని చేరుకొనియే యున్నను) లోకులకు దారిజూపుచు, లోకమును సన్మార్గమున ప్రవర్తింప జేయు నిమిత్తమైనను, అర్జునా, నీవు కర్మచేయవలసి యుందువు.

విశేషార్థము : సంసిద్ధి = మోక్షము - అని శంకరాదులు. సంసిద్ధికి మోక్షము స్థిరాధార మని శ్రీ అరవిందుడు. మోక్షమును, అనగా కర్మనుండి విముక్తిని, బొందిన

పెట్టుట ఆ విముక్తప్రాతిపదికపై కర్మ కతీతముగానుండి ఎంతోకాలము జనకాదుల వలె కర్మచేసిన గాని, భగవంతునికి సహజమగు "కర్మకౌశలము" (2-50) మన కబ్బదు. సంసిద్ధిలోనికి మోక్షమే కాక, ఈ కర్మకౌశలాదిక మంతయు వచ్చి వేయును.

శ్రీ అరవింద దర్శనము నందలి మఱియొక అద్వితీయ విషయము: లోకము నీకొఱకు, నాకొఱకు సృజింపబడలేదు. భగవంతుడు లోకమును, లోకములోని మనలను తన కార్యము నిమిత్తము - తన అభివ్యక్తి నిమిత్తము - సృజించుకొనినాడు. కనుక అజ్ఞానమునందును, జ్ఞానమునందును - రెండింటియందును - భగవత్ప్రయోజన మునకు సాధనముగా మనము మన పాత్రను నిర్వహించవలసినదే.

అంతే కాదు, జ్ఞానముద్వారా భగవంతునితో మనము ఏకత నందినపుడు, భగవంతుడు చేయు కార్యమును మన మెట్లు చేయక యుండగలము ? ఒకవేళ అట్లు ఉండగలిగినచో, మన జ్ఞానములో లోప మున్న దనియే అర్థ - మని శ్రీ అరవిందుడు విమర్శించును. క్రియ దగ్గరకు వచ్చు సరికి ఇతర వ్యాఖ్యాతల యందు మన వ్యష్టిసత్తయొక్క దృష్టియే గాని, మన సమష్టిసత్తయొక్క దృష్టి గన్పించుటలేదు. 'లోకసంగ్రహ' మను పదమున ఈ సమష్టిదృష్టి యున్నది.

బహుశః ఇందుచేతనే ఈ అధ్యాయము నందలి 20, ....26 - ఈ యేడింటిని బోలిన అద్భుత శ్లోకములు గీతలో సైతము బహు విరళ మని శ్రీ అరవిందుడు కొనియాడును.

అవతారిక : నీ కర్మ లోకసంగ్రహమున కెట్లు తోడ్పడునో వినుము -

**యద్య దాచరతి శ్రేష్ఠస్ తత్తదే వేతరో జనః,**
**స యత్ ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే.　　21**

దేనిని దేనిని శ్రేష్ఠమానవు డాచరించునో, దానిని దానినే ఇతరులును జేతురు. అత డే ప్రమాణము స్థాపించునో, దానినే లోక మంతయు ననుసరించును.

అవతారిక : ఇవ్విషయమున, అర్జునా, నేనే నీకు ఆదర్శము -

**నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,**
**నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి.　　22**

అర్జునా! ఈ ముల్లోకములందును నా కవశ్యముగా చేయవలసిన కర్తవ్యమేమియు లేదు. ఏలన నేను పొందని వస్తువు గాని, పొందవలసిన వస్తువుగాని ఏదియు లేదు. అయినను, కౌంతేయా, నేను కర్మయందు వర్తించుచునే యున్నాను.

విశేషార్థము : గీతయొక్క ఒక పరమ విశిష్టత ఇది: ఇచ్చట భగవానుడే తనను తన శిష్యునకు ఆదర్శముగా జూపును. భగవానుడే గీతాసన్నివేశమునందు మనకు పరమప్రముఖముగా గన్పించును—అని శ్రీ అరవిందుడు వ్రేలుపెట్టి చూపును

శ్రీకృష్ణుడు జ్ఞానియా, అజ్ఞానియా? హాస్యాస్పదము, అసలీ ప్రశ్నయే ఉదయించదు – వికృత మనస్కులకు తప్ప. అతడు జ్ఞానియే (7–26) గాదు, జ్ఞానస్వరూపుడును, యోగేశ్వరుడును (18–78). మంచిది, మఱియు ఆయన నిరంతరము కర్మచేయుచున్నాడు గదా. అయినప్పుడు జ్ఞాని కర్మచేయరాదు అని మన మెట్లు వాదించగలము? సరే, ఆయన చేయగలడేమో కాని, జ్ఞానము పొందిన మానవుడు చేయలేడందుమా? అట్లగుచో, కర్మవిషయమున అతడు తన నెందుకు మానవునకు ఆదర్శముగా చూపుకొనును? ఇంతెందుకు? జ్ఞాని కర్మచేయరాదని చెప్పిన శంకరాచార్యుడే అనితరసాధ్యమగు అద్భుత కర్మ నెట్లు చేసెను?

యది హ్యహం న వర్తేయ జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. 23

నే నించుక తడ వేనియు, అర్జునా, అప్రమత్తతో కర్మయందు ప్రవర్తించనేని, అట్టి నా అకర్మమార్గమునే సర్వవిధముల మానవులు సైతము అనుసరింతురు.

ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్యచ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః. 24

మఱియు, నేను కర్మచేయనేని. ఈ జనులందరు వినాశమున గూలిపోవుదురు. ఎట్లన నే నప్పుడు సంకరకర్తనై, ప్రజావినాశనమునకు దారి చూపినవాడ నగుదును.

విశేషార్థము : బుద్ధుడు, శంకరుని వంటి మహామహులు సన్న్యాసమును స్వీకరించి, దానిని ప్రోత్సహించుటచేత, సన్న్యాసము జాతీయాదర్శమై కూర్చొనెను. తత్ఫలితముగా నొక ఏబది లక్షల మంది సన్న్యాసము దీసికొనగా, ఒక ఏబది కోట్ల మంది అదే గమ్యమను భావము నేర్పఱచుకొనిరి. ఇదియే భారతముయొక్క ఘోరపతనమునకు ప్రబల కారణ మని శ్రీ అరవిందుని అవగాహన. కావున నిచ్చట సంకట మన ముఖ్యముగా ధర్మసంకటము, భావసంకరము.

**సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,**
**కుర్యాద్ విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహం. 25**

అవిద్వాంసు లెట్లు కర్మయందు సక్తులై - తగుల్కొని - కర్మనాచరింతురో, అర్జునా, విద్వాంసుడు అసక్తుడై, సరిగా నటులే జగత్కల్యాణముకొఱకు కర్మల నాచరించవలెను.

విశేషార్థము : జ్ఞానికర్మవిషయమున ఇంతకంటెను స్పష్టమైన నిర్దేశము మఱియొక టుండదు. మఱియు జ్ఞానమువలన ప్రాప్తించిన అసక్తత కర్మకు విరుద్ధము గా దని ఈ వాక్యమువలన దెలిసిపోవును. అసక్తత కర్మసామర్థ్యమును పెంచునే గాని తగ్గించదు – 'యోగః కర్మసు కౌశలం' (2-50).

**న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం,**
**జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్.26**

నేను చేయుచున్నాను–అని కర్మయందు సక్తులైనవారి బుద్ధియందు విద్వాంసుడు భేదమును – పరస్పర విరోధమును – గల్పించరాదు. అతడు సర్వ కర్మలను స్వయముగా నాచరించుచు, అవిద్వాంసులను గూడ సర్వకర్మలు జేయ ప్రోత్సహించవలెను.

విశేషార్థము : కర్మాకర్మల విషయమున పండితులు సైతము మోహము నందుదురు (4-16). ఇచ్చట బుద్ధిభేద - మన కర్మాకర్మల విషయమగు బుద్ధిభేదమే.

స్థితప్రజ్ఞు డే రీతి జరించును (2-54) ? – అనగా నతడేమి చేయును ? – అని అర్జునుడు ప్రశ్నించెను గదా. దానికి భగవాను డిచ్చట సమాధాన మిచ్చెను: అతడు లోకసంగ్రహార్థము కర్మ చేయును.

ఇతడు గీతయొక్క అతిమానవుడు, శ్రేష్ఠమానవుడు (3–21), దివ్యీకృత మానవుడు (4_10). ఇతడు దేవతలవంటి అతిమానవుడును గాడు, రాక్షసులవంటి అతిమానవుడును గాడు, భగవంతునితో 'యుక్తుడై' (3–26) యుండి వ్యవహరించు అతిమానవుడు – అని శ్రీ అరవిందుడు. అనగా శ్రీ అరవిందుడు తన భగీరథ ప్రయత్నముచేత సాధింప దలపెట్టిన అతిమానవజాతి బీజాంకురరూపమున గీతలో నుండనే యున్నది.

'సర్వకర్మాణి' : ఈ అతిమానవుడు సమృద్ధ జీవనమునకు ఆవశ్యకమగు సర్వకర్మలను' (3–26) జేయును. ఈ 'సర్వకర్మలు'–అను పదము పలుల మలుల వక్కాణించబడును – (3–30), (4–18), (18–57). కావున 'జ్ఞాని శరీరధారణార్థము భిక్షాటనము మాత్రము చేయును' అనునది గీతామతము కాదు.

అవతారిక : అవిద్వాంసుని లక్షణము ?

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే. 27

ప్రకృతియొక్క త్రిగుణముల చేతనే సర్వ విధములగు కర్మలు చేయబడు చుండగా, అహంకారముచేత నావరింపబడిన ఆత్మ గలవాడు, 'నేనే కర్త' నని తలంచును.

విశేషార్థము : అహంకారము ఆత్మ నావరించి, కర్మలు చేయు ప్రకృతి గుణములతో నిన్ను తాదాత్మ్యము జెందించి, నేనే చేయుచున్నా - నను భ్రాంతిని బుట్టించును.

అవతారిక : విద్వాంసుని జ్ఞానస్వరూపము -

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః,
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే. 28

ఇక నో మహాబాహూ ! అర్జునా ! ఈ యీ గుణములు ఈ యీ కర్మలను జేయును–అని తత్త్వతః సత్యము నెఱింగిన తత్త్వవిదుడు,ఇంద్రియరూపము దాల్చిన గుణములు విషయరూపము దాల్చిన గుణములందు ప్రవర్తించుచున్న వని కనుచు, గుణకర్మలయందు బద్ధుడు గాడు.

విశేషార్థము : ఇచ్చట గీతాబోధనాపద్ధతియొక్క ఒక ముఖ్యలక్షణమును మనము చెప్పుకొనవచ్చును – రెండవ అధ్యాయమున కర్మయందే నీ కధికారము (2–47) - అని వక్కాణించి, ఇచ్చట నేను కర్త ననుకొనువాడు మూఢుడు, తత్త్వవిత్తు నే నకర్తనని చూచును – అని చెప్పను, అనగా ప్రకృతికే గాని, నీకు కర్మయం దధికారము లేదని చూపును. ఇంకను ముందుకు వెళ్లి, 'కర్తారం అకర్తారం'

(4-13), అనగా భగవంతుడు లేక జ్ఞాని చేయుచునే చేయనివాడు—అని ముగించును. ఇట్లు గీత క్రమారోహణపద్ధతి నవలంబించి, సాధకుని మెట్టుపై మెట్టుగా పైకి గొనిపోవును. ఈ లక్షణమును గుర్తించ మేని, గీతలోని ఏదియో యొక వాక్యము నందు ఆగ్రహము (పట్టు) వహించి, అదియే గీతాబోధన యని భ్రమపడుదురు. చూడుడు : 'కర్మయందే నీ కధికారము' (2-47) - అను గీతావచనమునే గీతా మహావాక్యముగా నెంచి, బంకిమచంద్రుడు, మున్నగు ఆధునికులు భగవంతునితో సంబంధము లేని కేవల లౌకికకర్మనే గీతాముఖ్యముగా బోధించిరి. పోతే, శంకరాచార్యుడు, మున్నగు ప్రాచీనులు, 'తత్త్వవిదుని కే కర్మలు నుండవు' (3-28)-అను గీతావచనమునే పరమరహస్యముగా గొని, కర్మసన్న్యాసపూర్వకమగు జ్ఞానమును గీత నాధారము చేసికొని బోధించిరి కాగా, 'జ్ఞాని లోకసంగ్రహార్థము చేయును,అతడు చేయుచునే చేయనివాడు' (3-25, 4-13) — అని చెప్పిన గీతావాక్యమే గీతయొక్క సమగ్రసార మని వ్యాఖ్యానించి, ఆ సత్యమును వెలికిదీయుట శ్రీ అరవిందుని వంతునకు వచ్చెను.

ప్రకృతే ర్గుణసంమూఢాః సజ్జంతే గుణకర్మసు,
తా నకృత్స్నవిదో మందాన్ కృత్స్నవి న్న విచాలయేత్.

ప్రకృతిగుణములు కల్పించు మోహమునకులోనై ఎవరు గుణకర్మలయందు సక్తులగుదురో, వారు అల్పజ్ఞులు. అట్టి మందమతుల మతిని సర్వజ్ఞులగు వారు చలింపజేయరాదు.

అవతారిక : ఇపుడు ఫలితార్థమును ప్రవచించును—

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. 30

ఆత్మస్థము, (భగవదున్ముఖము) నగు బుద్ధిచే నాయందు సర్వ కర్మలను సన్న్యసించి, ఆశయు, మమకారము లేనివాడవై, తత్ఫలితముగా సంతాపరహితుడవై యుద్ధము చేయుము.

విశేషార్థము : ఇది యొక కీలక శ్లోకము. దీని అర్థమును వివరించుటయందు
[illegible]

ఇచ్చట కీలక పదము 'సన్న్యస్య.' దీనిఅర్థమును జూతము : ప్రకృతిస్థుడగువాడు ప్రకృతిగుణములతో తాదాత్మ్యమువెంది, నేను చేయుచున్నా నని భ్రమించును. అట్టివానికి సన్న్యాసమే లేదు. పోతే ప్రకృతిస్థుడగు జీవుడు బుద్ధి యోగముచేత నెపుడు లోనికి పయనించి, ఆత్మస్థు డగునో, అపు డతడు, ప్రకృతియే కర్మ చేయుచున్నది, నే నకర్తను - అని కాంచును - అట్లుగాంచి, అతడు కర్మలను ప్రకృతియందు సన్న్యసించును. అక్కడితో నాగక, ఆత్మజ్ఞానమునకు బిమ్మట భగవద్ - జ్ఞానమును బొంది, ఆ ప్రకృతి భగవంతుని ప్రకృతి యని దర్శించును. అట్లు దర్శించి, ఇతః పూర్వము ప్రకృతియందు సన్న్యసించిన తన కర్మను ఇప్పుడు భగవంతునియందు సన్న్యసించును, అనగా భగవంతుడే తనద్వారా కర్మ చే యు చు న్నా డని చూచును. అందుచేతనే యుద్ధమునందు చంపుటవలన పాపము సంభవించునను సంతాప మతని కుండదు. అట్టి దర్శనమున అంతయు భగవంతుడే గావున, అతనికి నాది యను మమకార ముండదు; అహంకారమును ఉండదు గాన, ఆశయు నుండదు.

ఇట్లు కర్మల ఆంతర సన్న్యాసమునందు సైతము వాని బాహ్యాచరణము : ఇదియే యజ్ఞపరాకాష్ఠ యని శ్రీ అనువిందుడు.

ఇక శ్రీ శంకరుడు, కర్మలను నాయందు సంన్యసించి = కర్మలను నాయందు నిక్షేపించి _ అని చెప్పుటకు మాత్రము చెప్పును. కాని వెంటనే "నేను కర్తను. ఈశ్వరునికి భృత్యునివలె కర్మ చేయుచున్నాను" అను బుద్ధిచే కర్మచేయును - అని జోడించును. అనగా 'సర్వకర్మలను సన్న్యసించి' - అను పదముయొక్క అర్థమును ఏమాత్రము చెప్పలేదు. ఎందుకుచెప్పలేదు ? ఆంతరసన్న్యాసము, బాహ్యకర్మాచరణము_ అనునది ఆయన దర్శనమున లేదు. కర్మచేయువానికి నేను చేయుచున్నాను - అను భాసము తప్పదు గనుక, అతని కాంతర సన్న్యాస మేమి యుండును ? - అని ఆయన వాదము. జ్ఞాని లోకసంగ్రహార్థము కర్మచేయును - అను ప్రకరణార్థమునకు గూడ ఈ వ్యాఖ్యానము శుద్ధవిరుద్ధము.

**యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః,**
**శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః. 31**

శ్రద్ధతో నాయం దసూయ లేనివారై ఏ మానవులు నా యీ మతమును నిత్యము ననుష్ఠింతురో, వారును (కర్మచేయుచునే) కర్మనుండి విముక్తులగుదురు.

యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతం,
సర్వజ్ఞాన విమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః. 32

కాని ఎవరు నా యీ మతమును నిందించుచు ననుష్ఠించరో. అట్టివారు సర్వ జ్ఞానమునందు విమూఢు లనియు, బుద్ధిహీను లనియు, నష్టప్రాయు లనియు దెలిసి కొనుము.

విశేషార్థము : సర్వజ్ఞానము = కృత్స్నజ్ఞానము (3-29), పూర్ణజ్ఞానము. ఆత్మ వేఱు, ప్రకృతి వేఱు-అనునది పాక్షిక జ్ఞానము. ఆత్మ ప్రకృతులు రెండును భగవంతునియం దేకమగును. కావున కర్మాకర్మలు విరుద్ధములు గావు - అను జ్ఞానము సర్వజ్ఞానము.

అవతారిక : ఎవడేని నా ఈ జ్ఞానము నెందుచేత ననుష్ఠించ డనిన -

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్ జ్ఞానవా నపి,
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33

జ్ఞానవంతుడు సైతము తన ప్రకృతిని (స్వభావమును) అనుసరించియే వర్తించును. ఏలన సర్వభూతములు తమ ప్రకృతిని బట్టియే వ్యవహరించును. ఇట్టి యెడ నిగ్రహ మేమి చేయగలదు?

అవతారిక: అయితే సాధకుడు చేతులు ముడుచుకొని కూర్చొనవలసిన దేనా? ప్రకృతిని యథేచ్ఛగా సాగనివ్వవలసిన దేనా?

ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ,
తయో ర్న వశ మాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ. 34

ఇంద్రియమునకు తన విషయమునందు రాగద్వేషములు పొంచియుండును. (వీనికి వశుడైన వాడే తన ప్రకృతి ననుసరించుటకు బాధ్యు డగును).కావున వానికి వశుడవు గాకుము. అవియే ఆత్మమార్గమున నిన్ను దోచుకొను దొంగలు.

అవతారిక : నిజానికి రాగద్వేషముల వలననే పరధర్మాచరణము. కాని—

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 35

బాగుగా ననుష్ఠింపబడిన పరధర్మముకంటెను గుణములేనిదైనను స్వధర్మమే శ్రేష్ఠము. ఏలన స్వధర్మమునందు చనిపోయినను మేలేగాని, పరధర్మము విపత్కరము.

విశేషార్థము : జ్ఞానవంతుడు సైతము తన ప్రకృతిని బట్టియే వ్యవహరించును (3-33) : ఈ ఒక్క వాక్యమునే దీసికొన్నచో, గీత ఆత్మపై ప్రకృతి యొక్క పూర్ణాధిపత్యమును ప్రతిపాదించుచున్నట్లు తోచును. ఈ సత్యముపైననే గీత, నీ కర్మయందు నీ ప్రకృతిధర్మమునే నిష్ఠతో ననుసరించుము – అను 'స్వధర్మ' సిద్ధాంతమును ప్రతిష్ఠించును. అయినపుడు ప్రకృతి ప్రేరేపించు పాపము సైతము స్వధర్మమే యగునా? ఎన్నటికిని గాదు.

ఏలన, ప్రకృతియందు రెండు అంశములు గలవు – శాశ్వతాంశము, ఆగంతుకాంశము. ఇందలి శాశ్వతాంశమే ప్రకృతిసారము, పరప్రకృతి – అంశము (7_5). ఇదియే మనుజుని మూలస్వభావము. స్వధర్మ మన ఈ స్వభావనియతమగు కర్మ (18–47). ఈ స్వభావ మనివార్యము గాన దానిని నిగ్రహింపజూచుట వ్యర్థము (3_33).

పోతే, ఆగంతుక అంశము గలదు. ఇదియే ఇంద్రియమునకు తదర్థమునందు రాగద్వేషములను బుట్టించి, పాపహేతు వగును. ఇదిగో, ఈ ప్రకృతిని మనము వ శ ము జేసికొనవలెను.

ఇచ్చట నొక సూక్ష్మవివేచనగలదు : నిగ్రహము (3_33) వేఱు, సంయమము = వశము జేసికొనుట (3_34) వేఱు. ఆగంతుక లేక నిమ్న ప్రకృతిని సైతము మనము నిగ్రహించరాదు, అనగా త్రొక్కివేయరాదు : త్రొక్కివేసిన అది క్షీణించిపోవును (6_5), లాలించిన శత్రు వగును (6_6). పోగా దానిని బుద్ధియోగము ద్వారా వశము జేసికొని, ఉద్ధరించిన (6_5), అది మనకు మిత్ర మగును. ఇది పూర్ణయోగపద్ధతి.

ఇట్లు ఆగంతుక, శాశ్వత ప్రకృతులను ప్రతిపాదించియు, నిగ్రహ, సంయమములను వివేచించియు శ్రీ అరవిందుడు 33, 34 _ శ్లోకములలో గన్పించు విరోధమును అతి నిపుణముగా దొలగించెను. ఇది ఇతర వ్యాఖ్యానములందు గన్పించదు. ఇంతే గాదు, శ్రీ అరవిందుని మతీయొక ప్రతిభాకిరణము సైతము మన కిచ్చట దర్శన మిచ్చును——

జ్ఞానవంతుడు = శాస్త్రపండితుడు-అని ఇతర వ్యాఖ్యాతలు. ఆత్మజ్ఞాని గుణములకు చలించడు (14-23): కనుక నట్టి జ్ఞాని ప్రకృతి నెందుకు అవశముగా ననుసరించును?-అని వారి వాదము. కాగా శ్రీ అరవిందుడు చేసిన వివరణ యేమన జ్ఞానవంతుడు= నిష్క్రియ ఆత్మజ్ఞాని. సమాధియం దున్నంత కాలము ఇతడు గుణములకు చలించడు ఇక క్రియ యంతయు ప్రకృతిచే గావున, మఱియు నీ జ్ఞానికి పరప్రకృతి జ్ఞాన మింకను లేదు గనుక' వ్యవహారమునందు అతడు అపర ప్రకృతిలోనికి- గుణప్రకృతిలోనికి (7-14)-దిగకను తప్పదు, దాని ననుసరించకను తప్పదు. ఇట్లు అజ్ఞాని, కేవలాత్మజ్ఞాని - ఉభయులు ప్రకృతి కనుగుణముగా వ్యవహరించక తప్పదు.

అవతారిక : అగంతుక ప్రకృతి విషయము దెలియక -

అర్జున ఉవాచ :—

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛ న్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః. 36

అర్జును డడిగెను-అయితే, ఓ కృష్ణా ! పురుషుడు పాపముచేయ నిచ్ఛగించ నప్పటికిని, ఎవడో అతనిని బలాత్కారముగా మెడలు పంచి పాపము చేయించు చున్నట్లు తోచును : అత డెవడు ?

శ్రీ భగవానువాచ :—

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః,
మహాశనో మహాపాప్మా, విద్ధ్యేన మిహ వైరిణం. 37

శ్రీ భగవానుడు చెలిపెను-అది కామము, అది క్రోధము (క్రోధము కామము యొక్క రూపాంతరమే) అది రజోగుణప్రకోపమునుండి పుట్టును. ఎప్పటికి దాని పొట్టనిండదు, అదియే పాపహేతువు, కాదు, అదియే పాపము. అదియే (జ్ఞాన) శత్రువు.

ధూమే నావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేనచ,
యథోల్బే నావృతో గర్భ స్తథా తే నేద మావృతం. 38

పొగచేత నిప్పును, మురికిచేత అద్దమును, మావిచేత గర్భము నందలి శిశువును ఎటుల కప్పబడి యుండునో, అటులే కామముచేత నిదియు కప్పబడి యుండును.

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినోన నిత్యవైరిణా,
కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేనచ. 39

కౌంతేయా ! కామము నెప్పటికిని పూరించజాలము, అది అనలమువలె ఎప్పటికిని 'చాలును' అని అనదు. కావుననే అట్టి ఈ కామము జ్ఞానికి నిత్యశత్రువు. ఏలన అది అతని జ్ఞానమును కప్పివేసియుండును.

విశేషార్థము : ఇట్లు కామము పాపహేతువే గాదు, అనగా నైతికానర్థమే గాదు, ఆధ్యాత్మికానర్థము గూడను ఏలన అది ఆత్మజ్ఞానమును గప్పి వేయును. అర్జునుడు పాపమువఱకే వెళ్లగా, భగవానుడు ఆత్మవఱకును వెళ్లి దాని అనర్థమును జూచును.

అవతారిక: కామమును పూరించలేము గనుక, శత్రువును వలె ఖండింపవలెను-

ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతైర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినం. 40

ఇంద్రియములు, మనోబుద్ధులు నీ కామము వసిచేయు స్థానములు వీనిచేతనే ఈ కామము జీవుని జ్ఞానము నావరించి. అతనిని మోహమున ముంచును.

తస్మాత్త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞానవాశనం. 41

కావున నో వీరవర్యా, అర్జునా, ముందు నీవు ఇంద్రియములను వశము గావించుకొని, జ్ఞాన విజ్ఞానములను నాశనముచేయు నీ కామరూప పాపమును ఖండించి వేయుము.

అవతారిక : కాని కామభూమికనుండి కామమును జయించలేవు గాన —

ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధిర్ యో బుద్ధేః పరతస్తు సః. 42

ఇంద్రియములు విషయముల కంటెను పై నుండు నని సాంఖ్యము చెప్పును. అటులే ఇంద్రియముల కంటెను మనస్సును, మనస్సుకంటెను బుద్ధియు బైనుండును. ఇక బుద్ధికంటెను బైనుండువాడు ఆధ్యాత్మిక పురుషుడు.

**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా,**
**జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదం. 43**

ఇట్లు సర్వపరుడైన పురుషు నెఱింగి, నీ నిమ్నతర సత్తను ఊర్ధ్వతర సత్తచేత వశపఱచుకొని (6-5), కష్టసాధ్యమగు నీ కామరూప శత్రువును మహాబాహూ, ఖండించివేయుము.

విశేషార్థము : సాధన చచ్చువారికి గాదు, ఆధ్యాత్మిక యుద్ధము సలుపగల మహాబాహువుల కని ఈ శ్లోకము సూచించును.

ఒకదాని పైన నొకటి-యని తత్త్వములను పరిగణించు సాంఖ్యశాస్త్రము గీతాయోగమునకు ప్రాతిపదిక యనియు మన కిట దెలియును, అనగా బుద్ధియోగము వెనుక నున్న ఉపపత్తియు మన కిట దెలియును.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే
**కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః.**





# శ్రీ గీ తా యో గ మం

## అథ చతుర్థోఽధ్యాయః

## జ్ఞా న యో గః

ఒక పరిశీలన : శ్రీ శంకరు పీ అధ్యాయమును జ్ఞాన కర్మ సంన్యాసయోగ మని పిలుచును. కారణము, ఆయన దృష్టిలో క్రిందటి రెండు అధ్యాయములు 'కర్మసన్న్యాసయుతము, జ్ఞాననిష్ఠాలక్షణము' నగు యోగమును జెప్పినవి. కర్మ యోగము దీనికి పూర్వాంగముగా మాత్రమే 3-వ అధ్యాయమున చెప్పబడినది. కనుక నీ యోగము జ్ఞానకర్మ సంన్యాసయోగ మగును. ఈ యోగమునందు ప్రవృత్తి, నివృత్తి లక్షణమగు వేదార్థ మంతయు పరిసమాప్త మైనది. గీతయం దంతటను ఈ యోగమే చెప్ప నుద్దేశింపబడినది. (కావున చతుర్థాధ్యాయమునకు ఈ పేరు పెట్టుట ఉచితమగును.)

ఇట్లు 2, 3 – అధ్యాయములందు గీతార్థ మంతయు పరిసమాప్త మైనది గావుననే, భగవానుడు 4-వ అధ్యాయారంభమున ఆ యోగవంశమును జెప్పి, దానిని స్తోత్రము చేయును. ఇది శ్రీ శంకరుని అభిప్రాయము. కాగా నిపుడు శ్రీ అరవిందుని వ్యాఖ్యాను జాతము—

గీతాయోగము సన్న్యాసయుత, అనగా, కర్మరహిత జ్ఞానయోగము గాదు. అది కర్మసహిత జ్ఞానయోగమును గాదు, అది జ్ఞానసహిత కర్మయోగము; అనగా కర్మతో బయలుదేరి జ్ఞానమును జేపకొని, ఆ జ్ఞానసహితమగు కర్మ చేతుము. గీతాయోగ మింతకంటెను గూడ అధికము, అది జ్ఞానసహిత యజ్ఞకర్మయోగము, జ్ఞానసహిత కర్మయోగము మాత్రమే గాదు.

ఇచ్చట కర్మ జ్ఞానమునందు పూర్ణత నందును (4-33), ఆ జ్ఞానమే తిరిగి కర్మరూపము ధరించును (4-24), మఱియు నుభయము పురుషోత్తముని కర్పించ బడును (4-23). కావుననే యిది జ్ఞానసహిత, అథవా జ్ఞానాత్మక యజ్ఞకర్మ యోగము.

తర్వాత, కర్మయోగరూపమగు ప్రవృత్తి సైతము నివృత్తికి దారితీయునే గాని, సాక్షాన్నివృత్తిలో నది నిలువదు – అని చెప్పు శ్రీ శంకర దర్శనము వేదార్థము గాదు. చూడుడు : ఆత్మయందు సర్వభూతములను, ఆత్మను సర్వభూతములందును, ఆత్మను సర్వభూతములు గాను (ఈశ ఉప.) దర్శించుమనదే వేదదర్శనము. అనగా నివృత్తియందు ప్రవృత్తిని, ప్రవృత్తియందు నివృత్తిని (4-18), చివరకు నివృత్తినే ప్రవృత్తిగాను దర్శించుమనదే వేదదర్శనము (4-13).

నివృత్తియే ప్రవృత్తి ఎట్లగును ? – అను ప్రశ్న వెంటనే పైకి లేచును. భేదముద్వారా మాత్రమే ప్రపంచము నర్థముచేసికొనగల మనస్సునకే ప్రశ్న సహజము. కాగా నీ విషయమున శ్రీ అరవిందుడు మనకీ వెలుగు నిచ్చును : ఏ ద్వంద్వములు మనశ్చేతనకు పరస్పర విరుద్ధములో, ఆ ద్వంద్వములే అధిమనశ్చేతనకు పరస్పరపూరకములు, ఆ ద్వంద్వములే అతిమనశ్చేతనకు ఏకమాత్రములు. అనగా సర్వద్వంద్వములు పురుషోత్తమునియందు ఏకత నందును, మఱియు నా పురుషోత్తమదర్శనము అతని పరమచేతనయగు అతిమనస్సునకే సాధ్యము (10-15).

ఈ పురుషోత్తముని సూచనామాత్రము, అదియు పేరు పెట్టక గుప్తపరిచిని, 2-వ అధ్యాయమునందు ఒక సారియు (2-61), 3-వ అధ్యాయమునందు ఒకటి, రెండు సారులును (3-22, 30) వచ్చినది. ఈ పురుషోత్తముని పూర్ణప్రతిపాదన సిద్ధాంతరీత్యా 15-వ అధ్యాయమునందును, సాధనరీత్యా 18-వ అధ్యాయాంతమునను మనకు ప్రాప్తించును. కనుక 3-వ అధ్యాయముతోనే గీతార్థము సమాప్తమైన దని చెప్పు శంకరాచార్యునితో శ్రీ అరవిందు డేకీభవించడు.

పోతే, 4-వ అధ్యాయ ప్రారంభమున వంశకథనము వచ్చినది కదా ? 3-వ అధ్యాయముతో గీతార్థసమాప్తి కది సూచకము కాదా ? – అనిన, కానవసరములేదు. ఏలన దానిద్వారా అర్జునుని ప్రశ్నకు (4-4) దారితీసి, ఆ ప్రశ్నకు సమాధానముగా భగవానుడు తన అవతారతత్త్వమును వెల్లడించును. ఇట్లు వంశకథనము తర్వాతి బోధనకు, కనీస మిచ్చుట, ఒక ఉపాయము మాత్రమే.

శ్రీ అరవిందుడు వెలికిదీసిన ఈ విశేషములను మనస్సునం దుంచుకొని, ఈ అధ్యాయము నధ్యయనము చేతము.

శ్రీ భగవానువాచ :—

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయం,
వివస్వాన్ మనవే ప్రాహ, మను రిక్ష్వాకవేఽబ్రవీత్. 1

శ్రీ భగవానుడు నుడివెను_అర్జునా, 2,3 అధ్యాయములలో నీకు ప్రవచించుచు వచ్చిన ఈ యోగమును, ఈ అవ్యయయోగమును, పూర్వము నేను సూర్యదేవునకు వెల్లడించితిని, పిమ్మట నా సూర్యుడు తన పుత్రుడగు మనువునకును, ఆ మనువు తన కుమారుడగు ఇక్ష్వాకునకును అందించిరి.

విశేషార్థము : జగత్తును పాలించు క్షత్రియవర్యులకు బలమును గల్గించ గోరి భగవాను డీ యోగమును ప్రవచించెను_అని శ్రీ శంకరుడు. కాని ఇది కర్మ రహితమైన జ్ఞానయోగ మని ఆయన పట్టుబట్టును గదా; అయినపు డది క్షత్రియుల కెట్లు తోడ్పడును ?

ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః,
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప. 2

ఇట్లు ఆనువంశికముగా వచ్చిన ఈ యోగము రాజర్షిపరంపరయందు ప్రచలితమయ్యెను. కాని చాల కాలము గడచిపోవుటచేత, ఓ అర్జునా, ఈ యోగ మిపుడు నష్టప్రాయమైనది.

స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమం. 3

అర్జునా! ఈ యోగము సర్వోత్తమ రహస్యము. అయినను నీవు నా భక్తుడవు మఱియు సఖుడవు గనుక, అదే పురాతన యోగమును మఱల నీ కిపుడు వెల్లడించితిని.

విశేషార్థము: శ్రీకృష్ణు డెందుచేత దీనిని ఉత్తమరహస్యమని చెప్పెను?_శక్తిగల యోగములు నిర్వ్యక్తిక బ్రహ్మమునకో, సవ్యక్తిక దేవతకో మాత్రమే దారితీయును. అపుడుసాధకుడు నిష్క్రియ జ్ఞానములోనో, స్థాణుమగ్న ఆనందములోనో ముక్తిని మాత్రముపొందును. కాని ఈ యోగము దివ్యశాంతితో గూడిన దివ్యకర్మలకు సాధకుని లేవనెత్తును; ఒక పరిపూర్ణ స్వేచ్ఛలో నే కీభూతమైన దివ్యజ్ఞానము,

దివ్యప్రక్రియ మఱియు దివ్యసుఖములలోని కుద్ధరించును. ఇట్లు తక్కిన యోగ మార్గముల నన్నింటిని ఇది తనలో నిముడ్చుకొనును. కాగా నిట్లిముడ్చుకొనుట వాని నిదిఅతిశయించి యుండిననే గాని సాధ్యము గాదు. అందుచేతనే వానికంటె నిది ఉత్తమరహస్యము.

ఇది కేవలశాంతి గాని, కేవలకర్మగాని కాదు. ఇది శాంతియందు కర్మ, కర్మయందు శాంతి : కావుననే ఇది మనస్సునకు అర్థముకాని కడుంగడు రహస్యము అని శ్రీ అరవిందుడు.

**అర్జున ఉవాచ :—**

**అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః,**
**కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి.** 4

అర్జునుడు చోద్యముగా ప్రశ్నించెను - కృష్ణా! నీజన్మ నిన్న మొన్నటిది, సూర్యుడు జన్మించి ఏండ్లు పూండ్లు నైనవి. అయినపుడు నీవు సృష్ట్యాదియందు సూర్యున కుపదేశించితి వని నే నెట్లు అనుకొనగలను ?

విశేషార్థము : అర్జునుడు కర్మప్రధానుడు గాని, బుద్ధిప్రధానుడుగాడు— అని అర్జునుని ఈ ప్రశ్నయు, నితరప్రశ్నలును మనకు దెలుపును. లేనిచో, 'నాకును, నీకును అనాకానేక జన్మలు గతించినవి' (2–12)—అని భగవానుడు ముందే చెప్పియు న్నపుడు, అర్జును డిట్లు ప్రశ్నించడు. దానికి బదులుగా, ఈ యోగ మెందువలన ఉత్తమరహస్యము ?—అని అడిగియుండును. శ్రీ అరవిందు డిట్లు చెప్పగా, మనకు కలుగగల ఇట్టి ప్రశ్నకు సమాధానము చెప్పించుటకు గ్రంథకర్తయే అర్జును డడిగి నట్లు ఈ ప్రశ్న నడిగించె నని శ్రీ శంకరుడు.

అవతారిక : ఈ ప్రశ్న నవకాశము గావించుకొని, భగవా నిపుడు తన స్వరూపము, అవతారప్రక్రియ—ఇత్యాదికమును వివరించును -

**శ్రీ భగవా నువాచ :—**

**బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున,**
**తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప.** 5

నాకును, నీకును, ఓ అర్జునా! అనేక జన్మలు గతించినవి. అయితే మనకు వ్యత్యాస మెక్కడన, వాని నన్నింటిని నే నెఱుంగుదును, నీ వెఱుంగవు.

**అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్,**
**ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా.**

ఆత్మయందు నే జన్మరహితుడ నయ్యును, వ్యయములేనివాడ నయ్యును, సర్వభూతములను శాసించు ఈశ్వరుడ నయ్యును, నా స్వీయ ప్రకృతి నధీనమునం దుంచుకొని స్వీయ మాయచేత జన్మింతును

విశేషార్థము: జన్మలేనివాడు ఎట్లు జన్మించగలడు? కనుక అవతార మనునది లేనే లేదు. మానవులలో విశిష్టులనే అవతార మను భవ్యనామముతో బిలుతుము, అంతే - అని కఠోరతార్కికుడు వాదించును. శాసించు ఈశ్వరుడు శాసితు డెట్లగును? జన్మించినచో సృష్టిలో నొకడై శాసితుడు గావలసినదే గదా? కావున అవతార మసంభవ మని ద్వైతవాది - ఈశ్వరునికి, శాశితునికి మధ్యఅఖాతమును గల్పించు ద్వైతవాది - వక్కాణించును. పోతే అద్వైతి ఈ విరోధము నెట్లు పరిష్కరించును? శాశితుడు మిథ్య, సృష్టి మిథ్య, అవ్యయ ఆత్మకు జన్మ మిథ్య, ఆత్మ లేక ఈశ్వరుడు తన త్రిగుణమాయచేత జన్మించినట్లు గన్పించును - గారడీవాడు మిథ్యారూపములను సృజించినట్లు. ఇట్లు జన్మ మిథ్య గావున, నిజానికి అజుడు అజుడుగనే యుండును, అవ్యయుడు అవ్యయుడుగనే ఉండును, ఈశ్వరుడు ఈశ్వరుడుగనే యుండును - అని మాయావాది విరోధమును పరిష్కరించును.

అస లిది పరిష్కారమే గా దని శ్రీ అరవిందుడు. అజుడుగ నుండుచునే ఎట్లు వాస్తవముగా జన్మించునో వివరించునది పరిష్కార మగును గాని, జన్మ వాస్తవముగా లేనేలే దని కొట్టివేయునది పరిష్కార మెట్లగును? - అని శ్రీ అరవిందుడు ప్రశ్నించును.

పరమ పురుషు డేకకాలమున మూడు శాశ్వతావస్థలను ధరించి సృష్టిక్రియ నెరపును. వీనిలో ప్రతి అవస్థయు సృష్టిక్రియ కావశ్యకమే. 1. క్షరప్రకృతిలో నుండి, క్షరప్రకృతి ననుసరించి మాఱుచుండు క్షరపురుషుడు. 2. క్షరములో నుండియు క్షరమునంటక, క్షరప్రకృతిక్రియకు నిశ్చలాధారముగా నుండు నిష్క్రియ అక్షరపురుషుడు. ఈ పురుష లిరువుర సృష్టిక్రియకు ఆవశ్యక తత్త్వములే. పోతే

వీరిరువురు ఇంకను ఒక ద్వంద్వముగనే యున్నారు గాన, వీరిని భరించి యుండు ఏకమాత్ర పురుష డొకఁ డుండవలెను. అతడే ఉత్తమ పురుషుఁడు, పురుషోత్తముడు (15-16, 17, 18)

ఇపుడు చూడుడు: క్షరాక్షరు లిరువురు ఈ ఉత్తముని రెండు శాస్త్రీయ పార్శ్వములు గనుక, ఉత్తముడు ఆత్మరూపమున అజుడుగ నుండుచునే, జీవాత్మ లేక క్షరరూపమున వాస్తవముగా జన్మించును. ఇదిగో, ఇది 'అజుడ నయ్యును జన్మింతును' – అను సమస్యకు వాస్తవ పరిష్కారము.

శ్రీ శంకరునికి మాయ యన విమోహక గుణమాయ మాత్రమే (7-13). ఏలన ఆయన పరప్రకృతిని, గుణాతీతమగు పరమాయను, గుర్తించడు. అందుచేతనే మాయవలన గలుగు జన్మ మిథ్య యని చెప్పును. కాని భగవంతుడు తన పరమాయ చేత (4-6) జన్మించును, తన అవరమాయచేత గాదు. కనుక భగవదవతారము వాస్తవము. ఈ పరమాయ, ఈ పరశక్తి, అభివ్యక్తిసాధనమే గాని, భ్రాంతి జనకము గాదు.

ఉభయులకు మాయకు సంబంధించిన ఇట్టి మౌలిక భేదము ఉన్నది గాన, శ్రీ శంకరారవిందుల వ్యాఖ్యానములు దాదాపు ప్రతి ముఖ్యశ్లోకమునందును భిన్నముగా నుండును.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం. 7

ఎప్పుడెప్పుడు, అర్జునా, ధర్మ మడుగంటి, అధర్మము పెచ్చుపెరుగునో, అప్పుడప్పుడు నన్ను నేను సృజించుకొందును.

విశేషార్థము: 'సృజించుకొందును' అను మాట జన్మయొక్క వాస్తవికతనే తెలుపునుగాని, 'జన్మించి నట్లు గన్పింతును' అని చెప్పిన శంకరుని వ్యాఖ్యను బోషించదు. మఱియు జన్మ వాస్తవముగానిచో, అవతారముయొక్క ప్రధాన ప్రయోజనమే సిద్ధించ దని 10-వ శ్లోకము క్రింద చూచెదము.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. 8

సాధుజనులను సంరక్షించుటకును, దుర్జనులను దునుమాడుటకును, ఇట్లు ధర్మమును బాగుగా స్థాపించుటకును, అర్జునా, యుగయుగమునందు నే నవతరింతును.

విశేషార్థము : అవతార ప్రయోజన మేమిటి? — అను ప్రశ్న వచ్చినపుడు, సందేహ మెందుకు? ధర్మసంస్థాపనయని గీతయే చెప్పుచున్నది గదా-యని అందరు సమాధానింతురు. కాని ఇది గౌణ ప్రయోజనము మాత్రమే యని శ్రీఅరవిందుని నిశితానుభవము దెలుపును. ఈ ప్రయోజనము నిమిత్తము భగవంతుడే స్వయముగా రావలసిన పనిలేదు, భగవద్విభూతులు గాని, మహామానవులుగాని దానిని సాధించ గల రని, ఆయన వ్యాఖ్యానించును.

జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి, మా మేతి సోఽర్జున. 9

ఎవ డిట్లు, అర్జునా, నా దివ్యజన్మను, దివ్యకర్మను తమ నిజతత్త్వము నం దెఱుంగునో, అతడు దేహము విడిచి నపుడు పునర్జన్మకు రాక, నన్నే పొందును.

విశేషార్థము: అజు డయ్యును, అజత్వమునకుభంగము లేకయే, భగవంతుడు వాస్తవముగా జన్మించును (4-6): ఇది దివ్యజన్మ. భగవంతుడు కర్త యయ్యును, అకర్త; అతనిని కర్మ లంటవు, అతనికి కర్మఫల స్పృహలేదు (4-13, 14): ఇది దివ్యకర్మ.

వీతరాగ భయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః. 10

రాగము, భయము, క్రోధములనుండి విడివడి, నాతో నిండి, నాయందే ఆశ్రయము గొని, ఇట్టి జ్ఞానతపస్సుచేత పవిత్రులైన (4-38) వా రెందరో,అర్జునా నా భావమును బొందియున్నారు.

విశేషార్థము : మద్భావము= నా భావము, పురుషోత్తమ ప్రకృతి. ఈ శ్లోకము మన కవతారముయొక్క పరమ ప్రయోజనమును దెలుపును —

అవతారమునకు రెండు పార్శ్వములు - 1. అవరోహణము, 2. ఆరోహణము. కాగా అవరోహణము = మానవభావమునందు భగవద్భావముయొక్క జననము, మానవ ఆకృతియందును, ప్రకృతియందును భగవత్ప్రకృతియొక్క ఆవిష్కరణము. పోతే ఆరోహణము = భగవద్భావములోనికి మానవభావము

యొక్క జననము, దివ్యప్రకృతి మఱియు చేతనలోనికి మానవుని ఉద్గమనము. ఇట్లు భగవంతుడు మానవ ప్రకృతిలోనికి దిగి, అందుబాటులోనికి వచ్చుటచేత, మానవుని అంతరాత్మ దివ్యప్రకృతిలో తిరిగి జన్మించును. అవతారము యొక్క రెండవ పార్శ్వమగు ఈ ద్వితీయ జన్మయే, మానవునికి దివ్యతాప్రాప్తియే, అవతారముయొక్క ప్రధాన ప్రయోజనము. ధర్మసంస్థాపన మీ దివ్యప్రయోజన మునకు ఒక సాధనము మాత్రమే.

పైపైన చదువుకొనిపోవు సామాన్య పాఠకునకుగాని, సంప్రదాయ భావాలతో చిక్కుము గట్టిన వైదిక (formal) వ్యాఖ్యాతకు గాని అవతారము యొక్క ఈ ద్వితీయ పార్శ్వము స్ఫురించ దని శ్రీ అరవిందుడు వాపోవును.

అవతారిక : అందరును నిన్నేందుకు పొందుట లేదు ?

**యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహం**
**మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.** 11

ఎవరే మార్గమున నన్ను చేరుదురో, వారినామార్గముననే నేను స్వీకరింతును. ఏలన, ఓ పార్థా, సర్వమార్గములును నేనువేసినవే మఱియు మనుజులు ఆ మార్గము లనే అనుసరించుచున్నారు

విశేషార్థము : పర్వత శిఖరమునకు అనేక మార్గములు, అందు దేని నవలంబించినను, పర్వతశిఖరమునే చేరును; సామాన్యముగా ఈ శ్లోకమున కీ అర్థమునే చెప్పుదురు. శ్రీ వివేకానందుడు గూడ చికాగో మహాసభలో దీని కీ అర్థమునే చెప్పినట్లు గుర్తు. కాని సందర్భమును బట్టి చూడ, దీని కీ అర్థము రాదు. పర్వతములోని అన్ని భాగములును (దేవతలును) పర్వతమే (భగవంతుడే). కాన ఏ మార్గము నవలంబించినను, పర్వతమునే చేరుకొందుము, కాని అది పర్వతశిఖరము కా నవసరము లేదు, అనగా దేవతలను ( భగవంతుని రూపములను) జేరుకొందుము గాని, దేవతామూలమగు భగవంతుని స్వరూపమును గాకపోవచ్చును. చూ.(9–23). తర్వాతి శ్లోక మీ అర్థమును వ్యక్తము చేయును.

**కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః,**
**క్షిప్రంహి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా.** 12

13]

కర్మఫలమును గాంక్షించుచు, కొందరిచట దేవతలను గూర్చి యజ్ఞము చేయుదురు. ఏలన (ఏకేశ్వర జ్ఞానము లేక, ఆ ఏకేశ్వరుని వివిధ రూపములగు దేవతలను గూర్చి చేయు జ్ఞానరహిత) కర్మలవలన గలుగు సిద్ధి ఈ మనుష్య లోకమున శీఘ్రముగా లభించును

విశేషార్థము : ఈ జ్ఞానరహిత కర్మమార్గము సైతము భగవన్నిర్మితమే యైనను, ఈ మార్గమున కర్మఫలమును మాత్రమే బొందును గాని, సాక్షాత్తు భగవంతుని బొందడు. ఈ జ్ఞానరహిత కర్మమార్గము సులభతరము కాగా, జ్ఞాన సహిత కర్మమార్గము కష్టతరము. అందుచేతనే ఈ రెండవ మార్గము నిమిత్తము మానవుడు గుణకర్మల విభాగముచేత చతుర్విధమగు (4-13) ధర్మము నవలంబించ వలసియుండును – అని చెప్పి శ్రీ అరవిందుడు 12,13 శ్లోకాలకు గల అంతరమును జూపును. కాగా, 12-వ శ్లోకములోని శీఘ్రసిద్ధికి కారణము 13-వ శ్లోకములోని వర్ణాశ్రమవిభజన యని శ్రీ శంకరుడు రెండు శ్లోకములకుఏకార్థమునే చెప్పును.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః,
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయం. 13

గుణమును బట్టియు, గుణమునకు సహజమైన కర్మను బట్టియు నాచే (ఈశ్వరునిచే) నాలుగు వర్ణములు సృజించబడినవి. ఇట్లు వానికి నేను కర్తనైనను, నేను అకర్తను, అవ్యయుడను – అని ఎఱుంగుము.

విశేషార్థము : 'చాతుర్వర్ణ్యం' ఒక ఆధ్యాత్మిక సత్యముయొక్క బాహ్య రూపము. గుణమును బట్టి స్వభావము, స్వభావమునుబట్టి కర్మ.ఇదియే ఆ ఆధ్యాత్మిక సత్యము. చాతుర్వర్ణ్యము వెనుక నున్న ఈ సత్యము శాశ్వతముగాని, ఈ సత్యము యొక్క బాహ్యరూపమగు, జన్మను బట్టి ఏర్పడు చాతుర్వర్ణ్యము శాశ్వతము గాదు. 'గుణకర్మవిభాగశః' అని సూచించి, గీతయే కాలానుగుణముగా చాతుర్వర్ణ్యవ్యవస్థను విస్తృతము చేసికొనగల సూత్రమును మన కందించుచున్న దని శ్రీ అరవిందుడు.

భగవంతుడు తన నిష్క్రియ ఆత్మరూపమున అకర్త; అందుచేతనే తన సక్రియ ప్రకృతిరూపమున, అనగా తన క్షరపురుషరూపమున, కర్మచేయు చున్నను, దానియందు సక్తుడుగాడు – అని శ్రీ అరవిందుడు. కాగా, 'మాయా సంవ్యవహారముచేత' భగవంతుడు కర్తగా గన్పించినను, వస్తుతః అతడు కర్తగాడు, అందుచేతనే అవ్యయుడు – అని శ్రీ శంకరుడు. అనగా ద్వంద్వములో నొకటి

మిథ్య యైననే తప్పు, రెండవది సత్యముగాదు. శంకరుడు నిర్వ్యక్తిక ఆత్మవరకే వెళ్లి, ఆత్మకు పైనున్న నిర్వ్యక్తిక వ్యక్తిత్వమగు పురుషోత్తముని జూడకపోవుట చేత నిట్లు చెప్పవలసి వచ్చుచున్నదని మనము గ్రహింపదగును.

న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్నస బధ్యతే. 14

(ఇట్లు నేను కర్త నైనను, అకర్తను గనుక) నన్ను కర్మ లంటవు, నాకు కర్మఫలమునం దపేక్షయు నుండదు. ఎవడు న న్నిట్లు బాగుగా నెఱుంగునో, వాడు కర్మబద్ధుడు గాడు

విశేషార్థము : సాధకుడు నిజానికి భగవంతుడే గనుక, భగవంతుని బాగుగా నెఱింగి నపుడు, అతడు భగవంతుడే యగును, మఱియు భగవంతునివలె అతడును కర్మబద్ధుడు గాడు. మనము భగవంతు నెఱింగితిమో, లేదో నిర్ణయించుకొనుటకు ఇది గీటురాయి సుమా! నేను చేయుచునే చేయుటలేదు, తినుచునే తినుటలేదు - అనే జ్ఞానము మన కున్నదా?

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మా త్త్వం పూర్వైః పూర్వతరం కృతం.

నేను అకర్తను, నన్ను కర్మ లంటవు - అని తెలిసికొని పూర్వ ముముక్షువులు సైతము కర్మ గావించిరి. కావున నీవును, ఓ అర్జునా, నీకంటె పూర్వము పూర్వులు చేసిన ఆ కర్మనే చేయుము.

విశేషార్థము : ఇట్లు తెలిసినవాడు కర్మబద్ధుడు గాడు అని చెప్పి (4-14), కర్మబంధమునుండి విముక్తి బొందగోరిన ముముక్షువు ఇట్లు తెలిసి కర్మ చేయును (4-15) - అని పలుల చెప్పును. అనగా, ఈ జ్ఞానము కలిగిన వెంటనే కర్మ ముక్తుడు గాడు, ఈ జ్ఞానముతో కర్మచేసి నప్పుడే కర్మ-ముక్తు డగును - అని దీని అర్థము. కర్మ చేయుచునే కర్మ నంటని స్థితి ఒకసారి భాసించినను, ఆ స్థితియందు నెలకొనుటకు ఎంతో కాలము జ్ఞానపూర్వక కర్మను చేయవలసి యుండు నని శ్రీ అరవిందుడు. కాని మిథ్యావాదమునకు ఇది విరుద్ధము. ఏలన మేల్కొనిన వెంటనే మిథ్యాస్వప్నము కరగిపోయినట్లు, నిష్క్రియాత్మ తెలిసిన వెంటనే మిథ్యా బంధము అదృశ్య మగును - అని అది భావించును.

అవతారిక : నీవు కర్మనే చేయు మని పైన జెప్పి, ఇపు డా కర్మస్వరూపమును జెప్పును –

**కిం కర్మ కి మకర్మేతి కవయో౽ప్యత్ర మోహితాః,**
**తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్ జ్ఞాత్వా మోక్ష్యసే౽శుభాత్. 16**

ఏది కర్మ ? ఏది అకర్మ ? – ఇవ్విషయమున పండితులు సైతము భ్రాంతులగుచున్నారు. ఏ కర్మజ్ఞానముచేత నీవు సర్వానర్థముల నుండియు విముక్తుడవగుదువో, అట్టి కర్మస్వరూపము నిపుడు నీకు వెల్లడింతును.

విశేషార్థము : కవులు = జ్ఞానులు – అని శ్రీ అరవిందుడు. కవులు = మేధావులు – అని శ్రీ శంకరుడు జీవనమే ఒక పాశముగాదా ? మేల్కొనిన మానవునికి కర్మనివృత్తియే శరణ్యము గాదా ? – అని తలంచు, జ్ఞాని సైతము మోహితుడే నని శ్రీ అరవిందుడు. ఏలన కర్మవిరామముచేత గాక, కర్మాచరణముచేతనే పూర్ణజ్ఞానము, సంపూర్ణవిముక్తియు ప్రాప్తించును.

పోతే, అశుభము = సంసారము – అని శ్రీ శంకరుడు. ఏలన సంసారమే, అనగా జీవనమే, బంధనము, అశుభము. కాని 'ఏకర్మచేత అశుభము నుండి, సర్వానర్థముల నుండి, ముక్తుడ వగుదువో' అని గీత చెప్పినది గదా. అయినపుడు సర్వకర్మయు, సర్వజీవనము నెట్లు అశుభ మగును ?

**కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,**
**అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. 17**

కర్మను గుఱించియు, వికర్మను గుఱించియు, అకర్మను గుఱించియు నెఱుంగవలసి యున్నది. కర్మమార్గము కడు జటిలము.

అవతారిక : ఇపుడు కర్మ, అకర్మలను బోధించును.

**కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణిచ కర్మ యః,**
**స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్.**

కర్మయందు అకర్మను, అటులే అకర్మయందు కర్మను ఎవడు గాంచునో, అతడే మనుష్యులలో బుద్ధిమంతుడు, అతడే యోగయుక్తుడు, అతడే సర్వకర్మకర్త – యని తెలియుము.

విశేషార్థము : గీత పోను పోను సాంఖ్యమును సవరించును, అయినను గీతాబోధనకు సాంఖ్యశాస్త్ర మాధారము. ఈ ఆధారముపై ఈ శ్లోకార్థము మనకు తేలికగా తెలియును.

ప్రకృతి కర్మచేయుచున్నపుడు సైతము, పురుషుడు కర్మచేయడు: ఇది కర్మయందు అకర్మదర్శనము. అటులే చలనము లేనట్లు గన్పించు పాషాణము నందును, స్తబ్ధముగా గూర్చొనియుండు సన్యాసియందును ప్రకృతి పనిచేయుచునే యుండును పాషాణములోపల పరమాణువులు మహావేగముతో పరిభ్రమించుచునే యుండును. అటులే కరచరణాదుల సహజక్రియనాపుటకు సన్యాసి మనస్సు ఎంతో అధికతర ప్రయాసమునకు లోనగును. ఇట్లు ప్రకృతియొక్క అకర్మగా గన్పించు అకర్మయందు సైతము ప్రకృతియొక్క మఱియొక భాగపగు అహంకారము పని చేయుచునే యుండును; ఇది అకర్మయందు కర్మదర్శనము.

అజ్ఞానవశమున, నేను చేయుచున్నాను - అను అహంకారముచేత విమూఢ పురుషునకే (3-27) అకర్మను, సన్యాసమును, ఆశ్రయించవలసిన ఆవశ్యకత గన్పించును. కర్మయందు సైతము నేను అకర్మనే అనుభవించుచున్నాను — అను బుద్ధిమంతుడగు జ్ఞానికి బాహ్య సన్న్యాసముతో అవసర మేమ యుండును? కనుక బాహ్యసన్యాసము అజ్ఞానలక్షణమే గాని, జ్ఞానలక్షణము గాదని శ్రీ అరవిందుడు చూపును

కాగా, ఆత్మ ఏకము, దానియందు భాగములు లేవు. కోతే, కర్త, కర్మ, క్రియ — అను అనేకత్వము నపేక్షించు కర్మ అజ్ఞానభూమికయందే సాధ్యము గాని, ఆత్మవస్తువు ప్రాప్తించిన వెంటనే అది పడిపోవును - అని శ్రీ శంకరుడు వాదించును. దీనికి సమాధానముగా, ఆత్మపైన కర్మప్రభువగు ఈశ్వరుడు లేనిచో, అట్లేజరుగును. కాని అట్టి ఈశ్వరు డున్నాడు, మఱియు నతడు ఆత్మశాంతిని ఆధారము చేసికొని, ఆత్మవస్తువును పొందిన సాధకుని వ్యక్తిగత ప్రకృతిద్వారా కర్మను కొనసాగించును — అని శ్రీ అరవిందుడు వివరించును.

కనుక ఆత్మవస్తువును బొందిన సాధకుడు, పిమ్మట ఈశ్వరునితో యుక్తుడై - "యుక్తః" - కర్మచేయును, సమగ్ర మహాకర్మను సైతము చేయును - "కృత్స్న కర్మకృత్".

కాని "కృత్స్నకర్మకృత్" అను స్పష్టవచనముయొక్క అర్థమును శంకరు డే విధముగా దాటవేయునో, చూడుడు : కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను దర్శించిన వాని ప్రశంసావచన మిది. ఆత్మయొక్క అకర్మను దర్శించిన

వానికి సర్వకర్మల ఫలము లభించి నట్లే గాన, అతడు "కృత్స్నకర్మకృత్" అని చెప్పబడెను, అంతే – అని శంకరభాష్యము.

నేను చేయుచున్నా – నను అహంకారము లేక, ఈశ్వరునితో యుక్తుడై, ఆత్మశాంతియందు సర్వకర్మలను చేయుటే దివ్యకర్తయొక్క ప్రథమ లక్షణ మని శ్రీ అరవిందుడు.

పైన అహంకారమును పురస్కరించుకొని, 'అకర్మయందు కర్మను వివరించితిమి. అహంకారము లేనివాని విషయమున దీని అర్థ మే మగును ?

ద్వైతసాంఖ్యమును వేదాంతసాంఖ్యములోని కుద్ధరించి, ప్రకృతి వేఱు వస్తువుగాదు, ప్రకృతి ఆత్మ లేక ఈశ్వరుని శక్తియే–"స్వాం ప్రకృతిం"(4-6)-అని గీత ప్రతిపాదించును. ఇట్లు ప్రకృతియందు ఆత్మ యుండును, అనగా కర్మయందు అకర్మ యుండును; అటులే ఆత్మయందు ప్రకృతి యుండును, అనగా అకర్మయందు కర్మయుండును. ఈ అకర్మ అహంకారకృతమైన అకర్మ గాదు, ఆత్మయొక్క సత్తాభూతమైన అకర్మ. ఇది అహంకారప్రసక్తిలేని, జ్ఞానభూమికయందలి కర్మ మఱియు అకర్మల సహజ సమన్వయము.

**యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,**
**జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః. 19**

ఎవని సర్వకర్మలు కామము మఱియు దాని మూలమగు సంకల్పముచేత, రహితములో, అట్టి జ్ఞానియొక్క కర్మ లన్నియు, కర్మయందు అకర్మను, అకర్మ యందు కర్మను జూచు అతని జ్ఞానముచేతనే దహించివేయబడును. అట్టి జ్ఞాని పరమార్థతః పండితు డని విజ్ఞు లందురు.

విశేషార్థము : నేను చేయుచున్నా నను జ్ఞాన మతని కుండదు గాన, కర్మ లతని మనస్సుపై ఎట్టి కళంకమును, వికృతచిహ్నమును విడువవు : ఇదియే జ్ఞానము కర్మలను దహించి వేయు ననుట కర్థము.

"యద్యద్ధి కురుతే కర్మ తత్తత్ కామస్యచేష్టితం" – ఏ యే కర్మ మానవుడు చేయునో, అది అంతయు కామప్రేరితమే–యను నియమమును చెప్పుదురు గదా; అయినప్పుడు సంకల్పరహితమైన కర్మ ఎట్లుండును ? ఈ దివ్యకర్త కర్మల వెనుక అవర సంకల్ప ముండదు గాని, ఈశ్వర సంకల్ప ముండును. కామవిముక్తి దివ్యకర్త యొక్క ద్వితీయ లక్షణము.

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్ కరోతి సః. 20

కర్మఫలముతో సంగమును త్యజించి, ఆత్మయందు నిత్యతృప్తుడై (3-17), కావుననే తన తృప్తికొఱకు బాహ్యమునందు దేనిని ఆశ్రయించనివాడై (3-18), కర్మయందు సర్వోత్సాహముతో ప్రవర్తించినప్పటికి, అట్టి దివ్యకర్త ఏమియు చేయనివాడే.

విశేషార్థము : కర్మకు మూలమగు సంకల్పకర్తయే గాక, ఈశ్వరుడు కర్మకర్తయును, అనగా హృదయనివాసియైన ఈశ్వరపాలితయగు ఈశ్వరశక్తియే కర్మ చేయును.

నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషం. 21

ఆశలు లేనివాడును, అంతరంగ బహిరంగములను నియమించిన వాడును, దొరకినదానిని తన సంపత్తిగా దాచుకొననివాడు నగు మనుజుడు శరీర మాత్రము చేతనే కర్మచేయుచు, పాపము నొందడు.

విశేషార్థము : శారీరం కర్మ = శరీరముచేత నిర్వర్తించబడు కర్మ, కేవలం శారీరం కర్మ = శరీరమాత్రముచేతనే నిర్వర్తించబడు కర్మ (5-11). ఏలన దివ్యకర్త చేయు కర్మకు ఆవశ్యకమగు తక్కిన సంకల్పాదిక మంతయు పైనుంచి వచ్చును — అని శ్రీ అరవిందుడు. పోతే, శారీరం కర్మ = శరీరధారణార్థము చేయబడు కనీసకర్మ - అని శంకరుడు. ఏలన శరీరము నిషిద్ధకర్మ నైతము చేయవచ్చును, అయినపుడు పాప మెట్లు పొందకుండును? అతనికి కర్తృత్వబుద్ధియే లేనపుడు, ఆ శారీరకర్మయొక్క సంకల్పము భగవంతునిదే అయినపుడు, ఆ శారీరకర్మ నిషిద్ధ కర్మ ఎట్లగును? అని శ్రీ అరవిందుని సమాధానము.

ఈ దివ్యకర్త తన వ్యక్తిత్వమును నిర్వ్యక్తికాత్మలో నిర్మూలించి వేసిన వాడు — పోతే ప్రకృతిక్రియ నిమిత్తము ఇంకను మిగిలియున్న వ్యక్తిత్వాభాసము బంధముక్తము, విశ్వవ్యాపకమునగు నొక దివ్యవస్తువు. పురుషోత్తముడు వేసికొనిన ఒక సజీవ వేషము. ఇట్టి నిర్వ్యక్తికతయే దివ్యకర్తయొక్క తృతీయ లక్షణము.

యదృచ్ఛాలాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః,
సమః సిద్ధా వసిద్ధౌచ కృత్వాఽపి న నిబధ్యతే. 22

ప్రాప్తించిన దానితో సంతుష్టుడును, జయాపజయములు, మున్నగు ద్వంద్వములకు అతీతుడును, వైరము లేనివాడును, కార్యసిద్ధియందును, అసిద్ధియందును సమభావముతో నుండువాడు నగు యోగి కర్మచేసి నప్పటికి బద్ధుడు గాడు.

విశేషార్థము : అర్జునుడు క్షత్రియుడుగా శుభాశుభములను సమముగా భావింపజాలడు (2-34). కాని ముక్తాత్మగా, అనగా, ద్వంద్వాతీతుడుగా, అత డట్లు చేయగలడు చేయును. ఏలన శుభాశుభముల సంమిశ్రముచేతనే శాశ్వత శుభముయొక్క వికాసశీలరూపములు క్రమముగా నిర్మింపబడు నని ఇపు డతనికి తెలియును. పూర్వలక్షణ త్రయమగు జ్ఞానము, నిష్కామత, నిర్వ్యక్తితల ఫలితమగు నీ సమతయే దివ్యకర్తయొక్క చతుర్థలక్షణము. అంతరానందము(5-24), పంచమ లక్షణము, ఇదియే నిత్యతృప్తి (4-20), ఆత్మరతి (3-17), కర్మకు అతీతముగానుండుట (5-8,9) అనగా త్రిగుణాతీతత (14-19), దివ్యకర్తకు షష్ఠ లక్షణము.

'కర్మ చేసి నప్పటికి' - అనే పదమునందు, 'శరీరధారణార్థము మాత్రము కర్మ చేసి నప్పటికి' - అనే భావ మెక్కడను లేదు. ఏ కర్తవ్య కర్మ నైనను జేయవచ్చును - కర్తవ్య కర్మ = పరమాత్మ తననుంచి అపేక్షించు కర్మ.

అవతారిక : ఇట్టి కర్తవ్య కర్మకే మఱియొక పేరు జ్ఞానయజ్ఞము.

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః,
యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. 23

గుణములతో సంగమును విడనాడి, గుణముక్తుడై, తన చేతనయంతయు ఆత్మజ్ఞానమునందు ప్రతిష్ఠితమైనవాడు. ఇట్టి జ్ఞానమున భగవదర్థము చేయు యజ్ఞ కర్మ సమస్తము లీనమైపోవును.

విశేషార్థము : యోగియొక్క కర్మలు అతని విముక్తాత్మనుండి ఉద్గమించి దాని కే వికారమును గలిగించకయే అంతరించును - అక్షరాత్మరూపమగు మహాసాగరమున తరంగములవలె లేచిన కర్మలు, తరంగములవలెనే లీనమగును. ఇది దివ్యకర్తకు సప్తమ లక్షణము.

అవతారిక : ఏ జ్ఞానముచేత కర్మ యంతయు లీనమగునో, ఆ జ్ఞానము జ్ఞానస్వరూపము నిపుడు దెలుపును.

బ్రహ్మార్పణం, బ్రహ్మహవిర్, బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం,
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా. 24

యజ్ఞపాత్రము బ్రహ్మ, హవిస్సు బ్రహ్మ, అగ్ని బ్రహ్మ, యజమానుడు బ్రహ్మ, యజ్ఞకర్మ బ్రహ్మ, ఇట్టి యజ్ఞగమ్యమును బ్రహ్మమే.

విశేషార్థము : సోఽహం, సర్వం ఖల్విదం బ్రహ్మ, అయ మాత్మా బ్రహ్మ: ఇత్యాది ఉపనిషద్ వాక్యములచే ప్రతిపాదింపబడిన ఏకత్వజ్ఞానమే ఈ శ్లోకమును చెప్పు జ్ఞానము. ఆఏకమే కర్తృక్రియాకర్మరూపము ధరించినది-అని శ్రీఅరవిందుడు. బ్రహ్మలో భాగములు లేవు, ఈ భాగములు దానియందు ఆరోపించబడినవి – ముత్యపు చిప్పయందు వెండి ఆరోపించబడునట్లు. కావున యజ్ఞము వాస్తవము గాదు, జ్ఞానమును స్తుతించుటకే. ఈ వర్ణన—అని శ్రీ శంకరుడు సగుణ, నిర్గుణ బ్రహ్మములను ఏకము, వాస్తవము చేయు పరబ్రహ్మను దర్శించకపోవుటయే శంకరుని ఈవాదమునకు కారణమని శ్రీఅరవిందుడు సమాధానించును.

ఈపరబ్రహ్మ యజ్ఞాంగము లన్నియు దానై, విశ్వయజ్ఞమును నడుపుచున్నాడు. అంతరాత్మ ఆతని దివ్యసత్తాచేతనలను తెలిసికొని తనవి గావించుకొను నిమిత్తమే పరబ్రహ్మ నడుపు ఈ యజ్ఞము.

ఈ విశ్వయజ్ఞమును దార్శనిక యజ్ఞమని చెప్పుకొనవచ్చును. దీనినే గాక, వైదికయజ్ఞమును విస్తరింపజేయుచు, గీత ఇపుడు మానసిక యజ్ఞములను వర్ణించును. సర్వయజ్ఞములకు సర్వసామాన్య సూత్రము ఆదానప్రదానము.

దైవమే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే,
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి. 25

కొందరు యోగులు దేవతల రూపమున నున్న భగవంతునికి యజ్ఞము గావించి, తద్వారా భగవంతుని పొందజూతురు. ఇక భగవంతు నిప్పటికే ఎఱింగి యున్న ఇతరులు బ్రహ్మరూప అగ్నియందు ఆత్మను ఆత్మచేతనే వేల్చుకొందురు.

శ్రోత్రాదీ నీంద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీన్ విషయా నన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి. 26

కొందరు ఇంద్రియములను సంయమాగ్నులయందు ఆహుతిచేయగా, కొందరు ఇంద్రియవిషయములగు శబ్దాదులను ఇంద్రియాగ్నులయందు ఆహుతిచేయుదురు

విశేషార్థము : ఇంద్రియములను ఆహుతిచేయుట యనగా, ఇంద్రియ క్రియలను ఉపశమింపజేయుట. పిమ్మట ఆ క్రియ యను తెరవెనుక నున్న ప్రశాంతాత్మ మనకు గోచరించును. పోతే, శబ్దాదులను ఇంద్రియములందు ఆహుతి చేయుట యనగా, మనస్సు చలించని విధముగా విషయముల నింద్రియములలోనికి స్వీకరించుట (2-64).

సర్వా ణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే.

మఱికొందరు ఇంద్రియ కర్మ లన్నింటిని, ప్రాణకర్మ లన్నింటిని జ్ఞానము చేత వెలిగింపబడిన ఆత్మసంయమయోగ మను అగ్నియందు వేల్తురు.

విశేషార్థము : ఇంద్రియములకంటెను అతీతముగానున్న ఆత్మజ్ఞానము గలిగినపుడు, ఇంద్రియసంయమము సహజమగును (3-43) కనుక, సజ్ఞానముచే వెలిగింపబడిన సంయమ మని చెప్పబడినది.

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే,
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః. 28

కొందరు ద్రవ్యసద్వినియోగమును యజ్ఞబుద్ధ్యా చేతురు, కొందరు తపోయజ్ఞ మును, కొందరు ధ్యానయజ్ఞమును, కొందరు వేదపఠనయజ్ఞమును, కొందరు శాస్త్రజ్ఞాన యజ్ఞమును జేతురు. వీరందరు తీక్ష్ణవ్రతములతో నొప్పు సంయమశీలురే.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే,
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః. 29

ఇంకను కొందరు ప్రాణమును స్వాధీనము చేసికొన గోరి, ప్రాణాపానముల సంచారమును నియమించి,అపానమునందు ప్రాణమును,ప్రాణమునందు అపానమును వేల్తురు.

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి,
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః. 30

మఱియు కొందరు నియతాహారమును దీసుకొనుచు, ప్రాణాగ్నులయందే ప్రాణములను వేల్తురు. వీరందరును యజ్ఞవిదులే, వీరి యజ్ఞములు వీరి సత్త్వయందలి మాలిన్యము దహించి, ఆ సత్త్వను శుద్ధి గావించును.

అవతారిక : యజ్ఞములను పరిగణించి, ఇపుడు యజ్ఞఫలమును జెప్పును.

**యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనం,**
**నాఽయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ.**

యజ్ఞమునందు శేషించిన అమృత మనబడు పదార్థమును భుజించువారు, ఓ కురుసత్తమా, అర్జునా! సనాతన బ్రహ్మమును బొందుదురు. యజ్ఞము చేయనివానికి ఇహమే లేనపుడు, పరమెట్లు ప్రాప్తించును?

విశేషార్థము : 1) యజ్ఞార్థము కాక, స్వార్థము నిమిత్తమే కర్మచేయువాడు జీవితలక్ష్యమునే కోల్పోవును (3-16). 2) సకామయజ్ఞముచేయువానికి ప్రాప్తించు భోగము యజ్ఞఫలమే గాన, ఆమేర కీతని కర్మ సమర్పితము, పవిత్రము. 3) పోతే నిష్కామముగా, నిస్సంగముగా చేయు జ్ఞానయజ్ఞము సనాతన బ్రహ్మనే ఫలముగా బొందును.

**ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే,**
**కర్మజాన్ విద్ధి తాన్ సర్వాన్, ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే.32**

ఇట్లు బహువిధ యజ్ఞములు బ్రహ్మముఖమునందు విస్తృతములైనవి. అవి యన్నియు కర్మనుండి పుట్టును. ఇట్లు తెలిసికొని విముక్తుడ వగుదువు.

విశేషార్థము : బ్రహ్మ = క్షరబ్రహ్మ, సర్వభూత మహేశ్వరుడు (5-29). బ్రహ్మముఖమునందు = ముఖమువలె ఆహుతులను స్వీకరించు ఆ మహేశ్వరుని దివ్యాగ్నియందు, దివ్యశక్తియందు — అని శ్రీ అరవిందుడు. మఱియు (3-15). క్రింద విశేషార్థమును జూడుడు. పోతే, బ్రహ్మముఖమునందు = వేదముఖమునందు — అని శ్రీ శంకరుడు.

యజ్ఞములు కర్మనుండి పుట్టును : ఎట్లు? విశ్వశక్తినుండి కర్మ పుట్టును. ఆ విశ్వశక్తి ఆ కర్మలో బ్రవేశించి, ఆ కర్మను విశ్వేశ్వరుని కర్పించుచు, ఆ కర్మను యజ్ఞము చేయును. అట్టి యజ్ఞమునకు చరమఫలము ఆత్మజ్ఞానము, ఈశ్వర చేతనాప్రాప్తి. ఇట్టి యజ్ఞమర్మము నెఱింగినవాడు విముక్తుడగును : ఇది శ్రీ అరవిందుని మర్మదర్శి వ్యాఖ్యానము. కాగా, యజ్ఞములు కర్మజన్యములు,

వానివలన ఆత్మ తెలియబడదు; ఏలన ఆత్మ కర్మరహితము – అని శ్రీ శంకరుడు. కాని 'కర్మయందు అకర్మ' (4-18) అని గీత చూపించిన సమన్వయము ఈ విరోధ ప్రతిపాదనకు వ్యతిరేకము గాదా?

శ్రేయాన్ ద్రవ్యమయాద్ యజ్ఞాజ్ జ్ఞానయజ్ఞః పరంతప,
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే. 33

ద్రవ్యాత్మకమగు యజ్ఞముకంటెను జ్ఞానాత్మకమగు యజ్ఞము శ్రేష్ఠతరము. ఏలన నిశ్శేషముగా సర్వకర్తయు, పార్థా! జ్ఞానమునందు పరిసమాప్తి నందును (చివరకు జ్ఞానరూపము ధరించును).

విశేషార్థము : (కర్మ జ్ఞానమునందు) పరిసమాప్తి నందును = అంతర్భాగ మగును. ఏలన కర్మ ఫలము నారంభించగా, జ్ఞానము మోక్షము నారంభించును, మఱియు కర్మఫలము మోక్షమునందు ఒక స్వల్పాంశము – అని శ్రీ శంకరుడు. చూడుడు, ఎంత చతురముగా నున్నదో ఈ వ్యాఖ్య! గీత కర్మజ్ఞానముల సంబంధ మును సూటిగా చెప్పుచుండగా, శ్రీ శంకరుడు కర్మజ్ఞానముల ఫల ప్రసక్తిని తెచ్చి, ఫలతః కర్మ జ్ఞానములో నొకఅంశము గనుక, స్వరూపతః కూడ అంతే నని చెప్పును

కర్మ పైకి వెళ్లి జ్ఞానరూపము ధరించును, జ్ఞానము క్రిందికి వచ్చి కర్మరూపము ధరించును : ఇట్లు ఒకే వస్తువు, చిచ్ఛక్తి, రెండు రూపములను ధరించు నని శ్రీ అరవిందుడు—— భగవంతుడు దిగివచ్చి మానవరూపమును, మానవుడు పైకెక్కి భగవద్రూపమును ధరించినట్లు.

సామాన్య మానవుని కర్మ సైతము, అట్లతనికి తెలియకపోయినను, ఆత్మ యందే ఒక తరంగముగా బుట్టి, తిరిగి – ఒక చక్రము తిరిగి (3-16) – ఆత్మయందే పర్యవసించును, అనగా జ్ఞానరూపము ధరించును.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. 34

అట్టి జ్ఞానమును నీవు, ఓ అర్జునా, గురువులను సేవించుచు, సమయము నెఱిగి వారికి సాష్టాంగనమస్కారము చేసి, ప్రశ్నించుచు, తెలిసికొనుము.

విశేషార్థము : ఇది ఎట్టి నిమ్నజ్ఞానమును గాదు, పరంతు అత్యున్నత ఆత్మజ్ఞానము మఱియు భగవజ్జ్ఞానము. దీనిని, సృష్టితత్త్వములను వాస్తవముగా

దర్శించిన గురూత్తములే మన కుపదేశించగలరు — అని శ్రీ అరవిందుడు. తత్త్వ జ్ఞానము = సమ్యగ్ జ్ఞానము — అని శ్రీ శంకరుడు.

అవతారిక : ఈ జ్ఞానవ్యాప్తి ఎంతటిది ?

**యజ్ జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ,**
**యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి. 35**

ఏ జ్ఞానము నెఱింగిన, ఓ అర్జునా, నీవు తిరిగి ఇట్లు మోహమునకు వశుడవు గావో, ఏ జ్ఞానముచేత సర్వభూతములను ఆత్మయందు, తర్వాత నాయందును జూచెదవో, అట్టి (సమగ్ర) జ్ఞానమును ఆ తత్త్వదర్శులు నీ కుపదేశించెదరు.

విశేషార్థము : ఇక్కడ శంకర భాష్యము చాల పేలవముగా గన్పించును. ఆత్మయందు = ప్రత్యగాత్మయందు, అథో = మఱియు, నాయందు = పరమేశ్వరుని యందు, సర్వభూతములను జూచెదవు. క్షేత్రజ్ఞునికి (ప్రత్యగాత్మకు), ఈశ్వరునికి ఏకత్వమును గీతయు (13-3), సర్వోపనిషత్తులును ప్రతిపాదించును గదా. కనుక ఆత్మయందు, మఱియు నాయందు జూచును' — అని శ్రీ శంకరుడు.

పోతే, ఆత్మయందు = అక్షరాత్మయందు, అథో = తర్వాత, మయి = పరమేశ్వరునియందు, సర్వభూతములను జూచెదవు — అని శ్రీ అరవిందుడు.

ఆత్మ ఏకము, అక్షరము, సర్వగతము, సర్వగర్భము, స్వయంసిద్ధము నగు మూలసత్త లేక బ్రహ్మము. మనోమయ సత్త మఱుగున నుండు ఈ ఆత్మలోనికి, అహంకారమునుండి విడివడి, మన చేతన ప్రవేశించి నపుడు, అది విస్తరించును. అపు డన్ని భూతములను ఈ ఏకసత్తలోపల భావములనుగా (as becomings) మనము చూడగలము.

కాని ఈ ఆత్మ లేక అక్షరబ్రహ్మము గూడ తర్వాత మన మూలభూత అంతశ్చేతనకు ఒక పరమపురుషుని — భగవంతునియొక్క — స్వీయప్రకటనముగా గన్పించును. ఆత్మయందు మన సత్త మాత్రమే గన్పించును గాని, ఈ పరమ పురుషునియందు మన సత్త, వ్యక్తిత్వము, జీవనము — అన్నియు గన్పించును. క్షరాక్షరములు రెండును ఇతని అభివ్యక్తులే (15-17, 18). ఆత్మ నిష్క్రియము; కనుక ఆత్మలోనికి గాక, ఇతని హస్తములలోనికే (3-30), మనము మన కర్మలను సమర్పించివేతుము.

పోతే, అంతరాత్మ లేక క్షేత్రజ్ఞుడు (13-3), పురుషోత్తమునితో ఏకాత్మకుడే యైనను, అభివ్యక్తియందు క్షేత్రజ్ఞుడు పురుషోత్తమునియొక్క ఒక సనాతనాంశము (15-7). కనుక సంసిద్ధియందు సైతము అంతరాత్మ పురుషోత్తమునితో ఏకత ననుభవించుచునే ఆతనియందు నివసించును (12 8). శ్రీ శంకరు డీ విభేదమును గుర్తించడు. ఏలన ఆయనకు అభివ్యక్తి మిథ్య; నిజానికి, కావున క్షేత్రజ్ఞత్వమే మిథ్య. అభివ్యక్తి మిథ్య గావున, చివరకు ఈశ్వరత్వమును మిథ్యయే.

పురుషోత్తమునికి ఆత్మపైనే ఆధిక్యము గలదో, గీతాఽద్వైతమునకు శంకరాఽద్వైతముపైనదే ఆధిక్యము గలదని శ్రీ అరవిందుడు చూపును.

"పురుషః....అక్షరాత్ పరతః పరః" (ముండక ఉప. 2-1-2) - అక్షరుడే పరుడైనను, అక్షరునికంటె పరుడగు పురుషు డున్నాడు - అని ఉపనిషత్తులును సూచించినవి. అయితే గీత ఆ సూచనలకు పూర్ణరూప మిచ్చి పురుషోత్తముని ప్రతిపాదించినది. కనుక క్షేత్రజ్ఞ ఈశ్వరులకు కేవల ఏకత్వము గాక, అద్వైతము, అనగా భేదాభేదము మాత్రమే గలదని గీత మనకు చెప్పును. అందుచేతనే, అథో = తర్వాత - అను అర్థమే సరియైనది.

అవతారిక : ఇపు డట్టి జ్ఞానమహిమను జెప్పును.

**అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః,**
**సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి. 36**

ఒకవేళ పాపాత్ము లందరికంటెను నీవు, ఓ అర్జునా, ఎక్కువ పాపము చేసినవాడవే యైనను, ఆ కుటిలము నంతను ఒక్క జ్ఞానరూప నావచేతనే చక్కగా తరించివేయగలవు

విశేషార్థము : వృజినం = కుటిలము - అని శ్రీ అరవిందుడు. భగవత్ప్రాప్తికి అడ్డువచ్చునది కుటిలస్వభావము, కుటిలప్రవర్తనము. కనుక అదియే పాపము. పోతే, వృజినం = పాపము - అని శ్రీ శంకరుడు. ముముక్షువునకు ధర్మము కూడ పాపమే - అని ఆయన వ్యాఖ్యానించును ఏలన ధర్మమును ఫలము నిచ్చును.

**యథైధాంసి సమిద్ధోఽగ్నిర్ భస్మసాత్ కురుతేఽర్జున,**
**జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా. 37**

మండుచున్న అగ్ని కట్టెల నెట్లు కాల్చి బూడిద చేయునో, అటులే, ఓ అర్జునా, జ్ఞాన మను అగ్ని సర్వకర్మలను భస్మము చేసివేయును.

విశేషార్థము : కర్మలను భస్మము చేయును = కర్మలను నిర్బీజము చేయును, అనగా మఱియొక జన్మ నారంభించుటకు అసమర్థము గావించును - అని శ్రీ శంకరుడు.

కర్మలను భస్మము చేయును=కర్మలను లీనము చేయును (4-23), అనగా నవి ఎట్టి ప్రతిక్రియా సంస్కారమును విడువవు. చూడుడు : (4-19) క్రింద వ్యాఖ్యానము. ఇంతవఱకు దాదాపు ఉభయుల వ్యాఖ్యయు నొకటే. కాని కర్మ పై కెగసి జ్ఞానరూపము ధరించగా (4-33), ఆ జ్ఞానశక్తియే కర్మ చేయును. అందుచేత జ్ఞానముతో కర్మ ఆగిపోదు, కర్మ దివ్యకర్మ యగును - అని శ్రీ అరవిందుని వ్యాఖ్యావిశేషము.

నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
తత్ స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి. 38

జ్ఞానముతో సమముగా పవిత్రము చేయు వస్తు వేదియు ఈ లోకమున లేదు. దానిని యోగమున సిద్ధి బొందిన మానవుడు కాలక్రమమున తన లోపలనే కనుగొనును. చూ (18-46,50).

విశేషార్థము : యోగ మన కర్మయోగముయొక్క నిష్కామత, సమత, భక్తి. వీనియందు అత డెంతెంత పూర్ణతను బొందునో, అంతంత తన లోపల జ్ఞానము పెరుగును. జ్ఞానములోని కతడు పెరుగును.

"తన లోపలనే కనుగొనును": ఈ పదము, ఈ జ్ఞానము పరమజ్ఞానము, ఇంద్రియముల ద్వారా ప్రోగుచేయు బాహ్యజ్ఞానము కాదు-అని తెలుపును. — శ్రీ అరవిందుడు.

అవతారిక : కావుననే ఇంద్రియ జయ మావశ్యకము.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి. 39

శ్రద్ధావంతుడు, తదేకనిష్ఠుడు, బాగుగా నింద్రియములను జయించినవాడు జ్ఞానమును బొందును; పోతే జ్ఞానమును బొందినవాడు అచిరకాలముననే శాంతిని బడయును.

విశేషార్థము : శ్రద్ధావంతుడు=ఆదరముతో గూడిన విశ్వాసము గలవాడు. నిమ్న జ్ఞానమున సత్యాన్రృతములు రెండును గలిసియుండును కావున దీనియందలి అన్రృతమును సంశయపూర్వకముగా దొలగించవలసియుండును. పోతే ఊర్ధ్వజ్ఞానమున అట్టి అన్రృతమిశ్ర ముండదు. కనుక నచ్చట సంశయమునకు దావులేదు. ఇక పొందిన జ్ఞానముయొక్క అపూర్ణతను, దాని మూలములే శంకించుటచేత గాక, పూర్ణతర సాక్షాత్కారముచేతనే పూరించుకొనగలము.

అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి, న పరో, న సుఖం సంశయాత్మనః.

అజ్ఞుడు, శ్రద్ధలేనివాడు, మఱియు సంశయించు స్వభావముగలవాడు నశించి పోవును. సంశయస్వభావునికి ఈ లోకమును లేదు, ఆ లోకమును లేదు, సుఖమును లేదు.

విశేషార్థము : అజ్ఞానమునుండి అశ్రద్ధ, అశ్రద్ధనుండి సంశయము.

శ్రద్ధవంటి నిశ్చితాధారము లభించి నపుడే, మనుజు డెంతోకొంత లౌకిక లేక పారలౌకిక సాఫల్యమును, తృప్తిని, సుఖమును బడయగలడు. శ్రద్ధ లేకపోగా, సంశయము గూడ రేగు నేని, అపుడు నాశము తప్పదు. ఉదాహరణకు, ధ్యానమున వెలుగు గన్పించి నపుడు, అది భ్రమ యని సంశయింతు మేని, ఆ వెలుగిక గన్పించదు, సాధనయే నశించిపోవును.

యోగసంన్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయం,
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ. 41

కనుక నెవడు జ్ఞానముచేత సంశయమును ఛేదించివేయునో, ఛేదించి, యోగము చేత సర్వకర్మలను సన్యసించునో, మఱియు ఆత్మస్థుడై యుండునో, అతనిని కర్మలు బంధించవు (కాన సాగుచునే యుండును గాని బంధించవు.)

విశేషార్థము : యోగముచేత కర్మసంన్యాసము— అన, ఏ మూలమునుండి కర్మలు ప్రవర్తించునో, అట్టి పురుషోత్తమునితో సంయోగము గలిగియుండి, అతని

హస్తములలోనికి కర్మలను సంన్యసించుట యగును (3-30). ఇది బాహ్యసంన్యాస మెంత మాత్రమును గాదు, నేను చేయుట లేదు. పరమపురుషుడే నాద్వారా చేయుచున్నాడను ఆంతరసంన్యాసము మాత్రమే గీతాసంన్యాస మన నిదియే యని మనము మఱువరాదు. — శ్రీ అరవిందుడు.

వ్యోతే, యోగము=పరమార్థదర్శనము - అని శ్రీ శంకరుడు ఇట్లు యోగ పదమునకు సంయోగ మను సూటి అర్థమును జెప్పక, నిష్క్రియ మగు పరతత్త్వ దర్శన మని చెప్పును. ఈ దర్శనముచేత ధర్మాధర్మము లనబడు సర్వకర్మలను సంన్యసించుటయే యోగముచేత కర్మసంన్యాసము.

'ఆత్మవంతుడు' = ఆత్మను గలిగియున్నవాడు, ఆత్మస్థుడు - అని శ్రీ అరవిందుడు సూటి అర్థమును చెప్పగా, 'ఆత్మవంతుడు'= అప్రమత్తుడు — అని శ్రీ శంకరుడు. శ్రీ అరవిందునికి ఆత్మక్రింద అంతరాత్మయు, ఆత్మపైన పరమాత్మయు గలవు సృష్టిక్రియకు ఈ మూడు తత్త్వములును ఏకకాలమున ఆవశ్యకములు. కాని శ్రీ శంకరునికి అంతరాత్మ నిజముగా లేదు గావున, అంతరాత్మ నిజానికి ఆత్మయే గావున అంతరాత్మ 'ఆత్మస్థము' — అనుట పొసగదు అటులే పరమాత్మయు లేదు గావున, 'ఆత్మను గలిగియున్నవాడు' - అనుటయు పొసగదు.

అవతారిక : ఇపుడు ఫలితార్థమును జెప్పును:

తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత. 42

(సంశయము మన కర్మను కుంఠితము గావించును) గనుక అజ్ఞానమువలన బుట్టి, హృదయమునందు గూడుకట్టుకొని యుండు, ఆత్మను గుఱించిన ఈ సంశయమును జ్ఞానఖడ్గముచేత ఛేదించి, కర్మయోగము నాచరింపుము. లెమ్ము, అర్జునా! లెమ్ము.

విశేషార్థము : ఆత్మ ఎట్లు స్వయం సిద్ధమో, అటులే స్వయంవ్యక్తమును కాని అజ్ఞానమునుండి జనించిన సంశయవ్యాకులములు దీనిని గప్పివేయును. కనుక జ్ఞానముచే దీనిని ఛేదించివేసినపుడు, జ్ఞానసహజమగు విముక్త కర్మ వెలువడును. ఇట్లు జ్ఞానము అర్జునుని యుద్ధకర్మకు దోహదమే యగును గాని, విఘాతము గాదు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీ కృ ష్ణా ర్జు న స ం వా దే

## జ్ఞానయోగో నామ చతుర్థోఽధ్యాయః





# శ్రీ గీ తా యో గ ము

## అథ పంచమోఽధ్యాయః

## స న్న్యా స యో గః

ఒక పరిశీలన : క్రిందటి అధ్యాయాంతమున "సన్న్యస్తకర్మాణం"(4-41), "యోగ మాతిష్ఠ" (4-42) - అను పదములు వచ్చినవి; అనగా నీవు కర్మలను సన్న్యసించుము-అని చెప్పి, మఱల, నీవు కర్మల నాచరింపుము – అని భగవానుడు విరుద్ధవచనము చెప్పి నట్లనిపించును. అట్లు అనిపించుటచేతనే, "కృష్ణా! ఒక వైపున కర్మసన్న్యాసమును జెప్పుచునే, రెండవ వైపున కర్మయోగమును జెప్పు చున్నావు. ఇ దేమిటి ?"-అని అర్జునుడు ప్రశ్నించును (5-1).

నిజానికి, శ్రీకృష్ణుడు "సన్న్యస్త కర్మాణం" అని మాత్రమే చెప్పలేదు. "యోగసన్న్యస్తకర్మాణం" అని చెప్పియున్నాడు. అనగా, భగవంతునితో యోగమును గలిగియుండి, కర్మలను ఆయన హస్తములలోనికి ఆంతరముగా సన్న్యసింపుము – అని చెప్పియున్నాడు. కనుక ఈ ఆంతర సన్న్యాసానికిని, "యోగ మాతిష్ఠ" – అని చెప్పిన బాహ్యకర్మాచరణానికిని వాస్తవానికి విరోధము లేదు.

పోతే, అర్జునునికి గన్పించిన విరోధమునకు సమాధాన మిచ్చుచు, భగవానుడు, ఆనాడు ప్రచలితమైన భావములను బట్టి, పరమ శుభమునకు రెండు మార్గములు – 1. కర్మసన్న్యాసము, 2 కర్మయోగము-అని ప్రస్తావించి, అవి రెండును గమ్యమును జేర్చును – అని చెప్పును (5-2). అనగా నీ రెండు మార్గములలో మానవుడు దేనినైనను అవలంబించవచ్చును.

ఈ మాటపై పట్టు బట్టి, శ్రీ శంకరుడు "జ్ఞానమార్గము వేఱు, కర్మమార్గము వేఱు. వీనికి సమన్వయము సాధ్యమగుచో, రెండు మార్గముల నెందుకు చెప్పును ?"– అని వాదించును. మఱియు, కర్మయోగము చిత్తశుద్ధిని గలిగించి, జ్ఞానమున కర్హత నిచ్చును గాన, అదియు నిశ్శ్రేయసకరమే యని చెప్పబడెను గాని, సాక్షాత్తుగా

గాదని ఆయన పట్టుబట్టును. ఈ పట్టునందు మూలములోని పదములకు సూటి అర్థమును గాక, తర్కబలముతో గూడిన అర్థములను జెప్పవలసి వచ్చును.

ఇక సూటి అర్థ మేమన, రెండు మార్గములు నిశ్శ్రేయసకరములే యైనను, కర్మసన్న్యాసముకంటె కర్మయోగము ప్రశస్యతరము. ఏలన కర్మయోగము నందలి రాగద్వేషముల అంతఃసన్న్యాసమే ముఖ్యము. కారణము, ద్వంద్వముక్తుడు సుఖముగా బంధముక్తు డగును (5-3).

ఈ అంతఃసన్న్యాసము లేని బాహ్యసన్న్యాసము వ్యర్థము, దాదాపు అసాధ్యము గూడను (5-6). ఇక నీ అంతఃసంన్యాసము గలవాడు బ్రహ్మను అచిరకాలముననే పొందును గావున, బాహ్యసంన్యాసము ఆవశ్యకమే గాదు (5-6). మఱియు నిట్లు బ్రహ్మను లేక సర్వాత్మను బొందినవాడు కర్మ జేయుచున్నను, అతనిని కర్మ అంటదు (5-7). ఏలన అతడు ఆ బ్రహ్మయందే కర్మల నర్పించి, కర్తృత్వ భావము లేక యుండును (5-10).

ఇది కర్మసంన్యాస, కర్మయోగముల సమన్వయమే గదా. ఇట్లు, ఆనాటి భావములను బట్టి రెండు మార్గములు గలవని చెప్పిన భగవానుడు తన మతముగా ఆ రెండు మార్గముల సమన్వయమును సాధించును. స్పష్టార్థ మిట్లుండ, శ్రీ శంకరుడు సమన్వయము సాధ్యము కాదని పట్టుబట్టును

**అర్జున ఉవాచ :—**

సంన్యాసం కర్మణాం కృష్ణ పున ర్యోగంచ శంససి,
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితం. 1

అర్జునుడు ప్రశ్నించెను — కృష్ణా ! నీవు ఒకే గుక్కలో కర్మసంన్యాసమును (4-41), కర్మయోగమును (4-42) గూడ ప్రశంసించుచున్నావు. అట్లు గాక, ఈ రెండింటిలో నేది శ్రేష్ఠతరమో, బాగుగా నిశ్చయించి, ఆ ఒక్కదానినే చెప్పుము.

విశేషార్థము : దీనికిని, దీని క్రింది శ్లోకములకు 'పరిశీలనను' — ఇంతకు ముందు అధ్యాయారంభమున ఇచ్చిన పరిశీలనను — జూడదగును.

**శ్రీ భగవా నువాచ :—**

సంన్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ,
తయోస్తు కర్మసంన్యాసాత్ కర్మయోగో విశిష్యతే. 2

శ్రీ భగవానుడు పలికెను - సంన్యాసము మఱియు కర్మయోగము - రెండును పరమశుభమునకు దారితీయును. కాని వాని రెండింటిలో కర్మసంన్యాసము కంటె కర్మయోగము శ్రేష్ఠతరము.

అవతారిక : ఏలన —

జ్ఞేయః స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి,
నిర్ద్వంద్వోహి మహాబాహో సుఖం బంధాత్ ప్రముచ్యతే.

ఎవడు, ఓ మహాబాహూ, అర్జునా, దేనిని ద్వేషించడో, దేనిని కాంక్షించడో, అతడు నిత్యసన్న్యాసి యని తెలియవలెను. కారణము, ఇట్టి ద్వంద్వముక్తుడు అనాయాసముగా బంధముక్తు డగును, కర్మబంధముక్తు డగును. [సంన్యాసఫల మిదియే గాన, అట్టి ద్వంద్వముక్తుడు సన్న్యాసియే యని అర్థము.]

విశేషార్థము : ద్వంద్వముక్తుడు బంధముక్తు డెట్లగును ? ద్వంద్వముక్తునికి ఆత్మజ్ఞానము కలుగును. అప్పు డతడు ఆత్మస్థుడై, నేను చేయుట లేదని తెలిసికొనును. ఇదిగో, ఈ అంతః సన్న్యాసముచేత అతడు కర్మముక్తు డగును. కావున ఫలమును బట్టియే కాక, స్వరూపమును బట్టియు అతడు సన్న్యాసియే.

మఱియు, ఆత్మ నిత్యనిష్క్రియము గనుక, అతడును తాను నిత్యసన్న్యాసి యని తెలిసికొనును. పోతే ఈ నిత్యసన్న్యాసిపదము చాల మహత్త్వపూర్ణము. ఎట్లన, జ్ఞాని నిత్యసన్న్యాసి గనుక, అతని విముక్తి, సమత, నిర్వ్యక్తికత, శాంతి, ఆనందము పైన. కర్మ చేయుట, చేయకపోవుట - యనునంతటి బాహ్యవిషయముపై నాధారపడియుండవు - అని శ్రీ అరవిందుడు ఒత్తిచెప్పును ఇట్లు అంతఃసన్న్యాసి సన్న్యాసియే గాక, సన్న్యాసికంటెను పరమాధికుడు.

అవతారిక : ఈ శ్లోకమున సమన్వయము దిశగా గీత ఒకడుగు వేయును—

సాంఖ్యయోగౌ పృథగ్ బాలాః ప్రవదంతి న పండితాః,
ఏకమ ప్యాస్థితః సమ్య గుభయో ర్విందతే ఫలం. 4

సాంఖ్యయోగము వేఱు, కర్మయోగము వేఱు - అని పిల్లలు మాత్రమే పలుకుదురు గాని, పండితులు గాదు. ఏలన ఒక దానిని సమగ్రముగా అనుష్ఠించి నప్పటికి, సాధకుడు రెండింటి ఫలమును బొందును.

విశేషార్థము : ఒకదాని ననుష్ఠించి నప్పటికి రెండింటి ఫలము నెట్లు పొందును ? పాక్షికముగా గాదు, సమగ్రముగా అనుష్ఠించి నపుడు పొందును ఏలన తమ సమగ్రరూపమున అవి ఒకదానియం దొకటి యుండును. ఎట్లు ; సన్యాసమునందు కర్మయోగ స్వరూపమగు రాగద్వేషరాహిత్య (5-3) ముండును. పోగా, కర్మయోగమునందు సన్యాస స్వరూపమగు అంతఃకర్మసన్యాస (5-8) ముండును - అని శ్రీ అరవిందుడు 'సమ్యక్' పదమును వ్యాఖ్యానించును. ఇట్లు సమ్యక్ = సమగ్రముగా - అని శ్రీ అరవిందుడు చెప్పగా, సమ్యక్ = బాగుగా - అని మాత్రము శ్రీ శంకరుడు చెప్పును. క్రింది శ్లోకమును శ్రీ అరవిందుని ఈ అర్థమునే బోషించును.

**యత్ సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్ యోగై రపి గమ్యతే**
**ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి. 5**

సాంఖ్యయోగులచేత నే స్థానము పొందబడుచున్నదో, కర్మయోగులచేతను అదే స్థానము పొందబడుచున్నది. ఇట్లు సాంఖ్యయోగములు రెండును ఒకటియే యని చూచినవాడే నిజమును చూచినవాడు.

విశేషార్థము : స్థానము = మోక్షము - అని శ్రీ శంకరుడు. ఇచ్చట మోక్ష మన, నిశ్చల, నిర్వ్యక్తిక, నిర్విశేష సత్తామాత్రమగు బ్రహ్మప్రాప్తి

పోతే, స్థానము = పరమపదము (15-6)-అని శ్రీ అరవిందుడు. ఈ పదము నిర్విశేషసత్తామాత్రమే గాదు. ఇది సర్వచలనములకు, సర్వవ్యక్తిత్వములకు సర్వవిశేషములకు మూలము. కావున దీనిని ఒక్క జ్ఞానముచేతగాని, ఒక్క కర్మ చేత గాని పొంద సాధ్యము కాదు. ఆ పద మెట్లు సమగ్రమో, దాని సాధనయు అట్లు సమగ్రము గావలసియుండును కావున, సాంఖ్యమా పదమును బొందవలె ననిన సాంఖ్యమునందు యోగ ముండవలెను, అటులే యోగమునందు సాంఖ్య ముండవలెను. ఇట్లు, రెండును ఒకే గమ్యమును చేరును - అని చెప్పినపుడు, ఆ రెండును ఫలమును బట్టియే కాక, స్వరూపమును బట్టి సైతము ఒకటియే యని మన మర్థము చేసికొనవలెను

స్వరూపము మాట నటుంచి, ఫలమును బట్టి సైతము కర్మయోగము, జ్ఞాన యోగము నొకటి గావు. ఏలన కర్మయోగము చిత్తశుద్ధి ద్వారా గమ్యమునకు పరంపరాసాధనమే గాని, సాక్షాత్సాధనము గాదు, జ్ఞానయోగమే సాక్షాత్సాధనము..

అని శ్రీ శంకరుడు తాత్పర్యముగా జెప్పను. ఇది మూలముయొక్క సూటి అర్థమున కెంతో దూరము !

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః,
యోగయుక్తో ముని ర్బ్రహ్మ నచిరే ణాధిగచ్ఛతి. 6

పోతే, ఓ మహాబాహూ, అర్జునా ! (సన్న్యాస, యోగములు రెండును గమ్య ప్రాపకములే యైనను) యోగము లేకుండ - కర్మయోగము లేకుండ - సన్న్యాసము కష్టసాధ్యము. కాగా యోగము నాచరించు ముని శీఘ్రముగా బ్రహ్మను బొందును.

విశేషార్థము : సూటియైన అర్థమును కాదని, బ్రహ్మ = సన్న్యాసము-అని ఇక్కడను శ్రీ శంకరుడు వచించును ఏలన ఆయన మతమున యోగము సరాసరి బ్రహ్మను బొందలేదు. కాని తర్వాతి శ్లోకము గూడ శ్రీ శంకరుని ఈ అర్థమునకు వ్యతిరేకము.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః,
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. 7

కర్మయోగము నాచరించునాడు విశుద్ధ - అంతఃకరణు డగును, శరీరమును, ఇంద్రియములను జయించినవా డగును; కావున సర్వభూతముల నిర్వ్యక్తికాత్మ యగును. అందుచేత చేయుచున్నను అతనికి కర్మ లంటవు.

అవతారిక : అందుకు కారణము, నేను చేయుట లేదని అతని కిపుడు తెలియును -

నైవ కించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్నన్ గచ్ఛన్
స్వపన్ శ్వసన్, 8

ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిషన్నపి,
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. 9

నిష్క్రియ, నిర్వ్యక్తి కాత్మతో యోగమునం దున్న మనస్సు గలిగి - "యుక్తః" - సక్రియతత్త్వము త్రిగుణములే యని ఎఱింగిన వ్యక్తి-"తత్త్వవిత్"- నే నేమియు జేయుటలే దని తలంచును; మఱియు చూచుట, వినుట; ఆస్వాదించుట,

ఆఘ్రాణించుట; తినుట, తిరుగుట; నిద్రించుట, శ్వసించుట, భాషించుట; గ్రహించుట, త్యజించుట; కండ్లు తెఱచుట లేక మూయుట - ను జేయునపుడు, ఇంద్రియములు ఇంద్రియార్థములందు వర్తించుచున్న వనియే ఆత డనుకొనును

అవతారిక : కనుక ఇంద్రియకర్మ లే బ్రహ్మమునుండి వెలువడునో, ఆ బ్రహ్మము నందు తాను తన కర్మలను తిరిగి స్థాపించును -

## బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః,
## లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా. 10

కర్మలతో సంగమును త్యజించి, వానిని బ్రహ్మయందు నిలిపి, ఎవడు వాని నాచరించునో, తామరాకును జల మంట నట్లు, అతనిని పాప మంటదు

విశేషార్థము : ఫలముతో బాటు కర్మలను సన్యసించవలసినదే, కాని బాహ్యముగా గాదు, ఆంతరముగా; ప్రకృతిజడతలోనికి గాదు, దేని శాంతికి భంగము లేకుండ, దేని ద్వారా సర్వకర్మయు ప్రభవించునో, అట్టి బ్రహ్మము లోనికి (5-10), తర్వాత (4-35) కర్మమూలమగు, కర్మభోక్తయగు ఈశ్వరుని లోనికి (3-30). ఇదియే వాస్తవసన్యాసము - అని శ్రీ అరవిందుడు.

పోతే, 8, 9 - శ్లోకములు తత్త్వవిత్తు, సన్యాసిని గుఱించి చెప్పిన శ్లోకాలు కాగా, ఈ శ్లోకము అతత్త్వవిత్తు, కర్మప్రవృత్తుని గుఱించి చెప్పిన శ్లోక - మని శ్రీ శంకరుడు. ఎందుచేత ? "ఎవడు కర్మల నాచరించునో" అని యుండుటచేత :

సర్వభూతాత్మయైన వాడు జ్ఞానియే గదా. అట్టివాడు కర్మచేసినను, అది అతని నంటదు - అని (5-7) చెప్పిన అర్థము నే ఈ శ్లోకమును (5-10) చెప్పు చున్నది గదా. అయినపుడు ఈ శ్లోకము అజ్ఞానివిషయ మెందుకు కావలెను ? అస్తు.

పోతే, ఇది అజ్ఞాని విషయము గనుక, బ్రహ్మ = ఈశ్వరుడు-అని శ్రీశంకరుడు బలాత్కరించి అర్థము చెప్పను ఈ అజ్ఞాని, స్వామికి సేవకుడు కర్మ చేయునట్లు ఈశ్వరునికి సేవకునివలె కర్మ చేయును: ఇట్లు చేయుటే బ్రహ్మయందు కర్మలను నిలుపుట (నిక్షేపించుట) కాపున శంకరు ననుసరించి ఈశ్లోకమున ఆంతరసన్యాసార్థము లేనేలేదు: సరే, అరవిందు ననుసరించి ఈ ఆంతర సన్యాసమునకు పూర్వాంగముగా -

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి,
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే. 11

అంతఃకరణ, బహిఃకరణ శుద్ధినిమిత్తము ఫలసంగము లేని కేవల శరీరము చేతను, కేవల మనస్సుచేతను, కేవల బుద్ధిచేతను, కేవల ఇంద్రియములచేతను యోగులు కర్మ చేతురు.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీం,
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. 12

ఇట్లు ఫలమును త్యజించి, కర్మ జేయుచు, బ్రహ్మతో యుక్తుడైన యోగి బ్రహ్మనిష్ఠాజన్యమైన నిశ్చల శాంతిని బొందును. అట్లు యుక్తుడు గానివాడు కామ ప్రేరణచేత ఫలమునందు సక్తుడై, కామవ్యాపారమున తగుల్కొనును.

విశేషార్థము : కర్మయోగి సత్త్వశుద్ధి, జ్ఞానప్రాప్తి, సర్వకర్మ - సన్యాస, జ్ఞాననిష్ఠా క్రమేణ మాత్రమే నైష్ఠిక శాంతిని బొందునుగాని, కర్మచేయుచునే గాదు- అని వివరించుటను శంకరుడు విస్మరించలేదు ; ఆయన బ్రహ్మ మట్టిది, అది కర్మను సహించలేదు.

అవతారిక : బ్రహ్మయందు ఈ ఆధారము లభించి నపుడు -

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్న కారయన్. 13

దేహధారి ఆత్మ తన ప్రకృతిని పూర్తిగా వశమునందుంచుకొని, దాని కర్మల నన్నింటిని మానసికముగా, అనగా బాహ్యము గాక, ఆంతరముగా, (ప్రకృతిప్రభువు నందు) సన్యసించి (3-30), స్వయముగా చేయక, నితరులచే జేయించక. నవద్వార పురమునందు సుఖముగా నుండును

విశేషార్థము : ఇచ్చట కీలకపదము 'మానసికముగా'. కావున ఇచ్చటి సన్యాసము మానసికముగా(వివేకబుద్ధ్యా)కర్మయందు అకర్మను దర్శించుటచేత(4-18) చేసిన సన్యాసము. అందుచేత నిది బాహ్యకర్మ కద్దురాని అంతఃసన్యాసమే గాని, బాహ్యసన్యాసము గాదు - అని స్పష్టమే. కాని ఇది నిత్య, నైమిత్తిక, కామ్య, ప్రతిషిద్ధ సర్వకర్మల బాహ్యసన్యాస మని శ్రీ శంకరుడు

మాటవరుసకు, ఇది బాహ్యసన్యాసమే అనుకొందము. అప్పుడు తనది గాని ప్రకృతికర్మను తన దనుకొని అతడు సన్యసించినవా డగును. ఇది అజ్ఞాన చేష్టయే గదా, అట్టి సంన్యాసి జ్ఞాని ఎట్లగును ?

అవతారిక : దేహధారి ఆత్మ, అనగా అంతరాత్మ, ఇపుడు ప్రభువను పేరుతో నొప్పు, నిర్వ్యక్తిక సర్వాత్మ ఐనది. ఇట్టి అంతరాత్మ లేక ప్రభువు -

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫలసంయోగం, స్వభావస్తు ప్రవర్తతే. 14

ఈ ప్రభువు ప్రపంచముయొక్క కర్మలను గాని, మనస్సు యొక్క కర్తృత్వమును గాని, కర్మల, కర్మఫలముల సంయోగము, అనగా కార్యకారణ సంబంధమును గాని సృజించడు. ప్రభువు గాక, స్వభావమే దీని నంతను జేయును.

విశేషార్థము : స్వభావము = స్వ + భావము = ఆత్మయొక్క పరిణామగత భావము (becoming). ఇది అవిద్యాలక్షణమగు ప్రకృతి, మాయ (7-14) - అని శ్రీ శంకరుడు. అది ఆత్మయొక్క భావము గదా, అయినపుడు మాయ ఎట్లగును ? అని శ్రీ అరవిందుడు. ఆ స్వభావమునందలి గుణ ప్రకృతి మాత్రమే మాయ గాని, ఆ స్వభావసారమగు పరప్రకృతి (7-5) మాయ గాదు.

నాదత్తే కస్యచిత్ పాపం నచైవ సుకృతం విభుః,
అజ్ఞానే నావృతం జ్ఞానం, తేన ముహ్యంతి జంతవః. 15

ఈ సర్వవ్యాపి(విభువు), నిర్వ్యక్తికాత్మ తాను పుణ్య పాపములను చేయక పోవుటయే గాక, ఎవరి పుణ్యపాపములను స్వీకరించను గూడ స్వీకరించడు. తమ ఈ ముఖ్యాత్మ - జ్ఞానం అజ్ఞానముచేత ఆవరింపబడి యుండుటచేత సామాన్య జీవులు మోహవశు లగుదురు.

విశేషార్థము : నిర్వ్యక్తికాత్మ స్వయముగా కర్మ చేయకపోయినను, అంతరాత్మ చేయు కర్మకు దాని అనుమతి – "అనుమంతా" (13-23) - అవసరము. అందుచేతను ఆమేరకు అది ప్రభువు. పోతే, అది సర్వవ్యాపి గనుక విభువు.

భగవంతుడు తన నిర్వ్యక్తికాత్మ రూపమున ఎవరి పుణ్యపాపములను స్వీకరించడు నిజమే కాని భగవంతుడు తన పురుషోత్తమ-రూపమున భక్తుల పుణ్యమును

యజ్ఞభోక్తగా స్వీకరించును (5-29), వారిని పాపములనుండి విడిపించును (18-66), వారి యోగక్షేమములు వహించును (9-22) - అని శ్రీ అరవిందుడు.

పోతే, ఈశ్వరుడు భక్తుని పాపము నైనను స్వీకరించడు, భక్తులచేత అర్పింపబడిన తమ పుణ్యము నైనను స్వీకరించడు. అయినపుడు భక్తు లెందుకు పూజాహోమాదికమగు తమ సుకృతమును ఈశ్వరున కర్పింతురు ? అజ్ఞానము చేతనే। - యని శ్రీ శంకరుడు

ఈ వచనము భక్తుల కెంత మనస్తాపము గల్గించును ? ఎంతగా వారికి కోప కారణమగును ? భక్తుల కోపతాపముల మాట నటుంచి, ఇది అసలు గీతామతమేనా ? "నేనీ జగత్తునకు మాతాపితలను" (9-17)-అని చెప్పిన గీతావచనము మాటేమిటి ? ఇది వ్యావహారిక సత్యము మాత్రమే, పరమార్థము కాదని శంకరుడు కొట్టివేయ గలుగునా ? లేదు, కొట్టివేయలేడు. ఏలన, నేను మాతాపితలను - అని చెప్పిన భగవానుడే, "నాకంటెను పైన మరేదియు లేదు" (7-7) - అనియు, "నేను బ్రహ్మకు గూడ ప్రతిష్ఠను" (14-27) - అనియు చెప్పియున్నాడు గదా.

అయినపుడు శ్రీ శంకరు డిట్లెందుకు చెప్పవలసివచ్చె నన, ఆయనకు అక్షరాత్మకంటె పైన ఈశ్వరు డెవడును లేడు. ఇక నా అక్షరాత్మ నిర్వ్యక్తికము. కనుక భక్తిని స్వీకరించు పరమపురుషు డెవడును లేడు. కావున భక్తివృత్తి యంతయు మోహజన్యమే :

జ్ఞానేనతు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్యవజ్ జ్ఞానం ప్రకాశయతి తత్పరం 16

ఇక ఆత్మవిషయమగు అట్టి అజ్ఞానము ఎవరికి జ్ఞానముచేత నాశముచేయ బడునో, వారి కా జ్ఞానము గుణప్రకృతికి పైనుండు తమ ఆత్మను ప్రభాకరునివలె ప్రకాశింపజేయును

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః. 17

ఆ జ్ఞానవిషయమగు బ్రహ్మయందే బుద్ధిని ప్రవేశపెట్టిన వారును, ఆ బ్రహ్మనే ఆత్మగా గలిగిన వారును, ఆ బ్రహ్మయందే నిష్ఠ గలవారును, ఆ బ్రహ్మనే పరమ లక్ష్యముగా పెట్టుకొనిన వారును జన్మరాహిత్యమును బొందుదురు. ఏలన జన్మకారణ మగు సంస్కారము నంతను వారి జ్ఞానము నాశముజేసివేసినది.

విశేషార్థము : అట్టి జ్ఞానులు జన్మించ రని గాదు; అవశ్యముగా జన్మించ వలసిన అవశ్యకతనుండి తమను విడిపించుకొందురు - అని శ్రీ అరవిందుడు. లోక సంగ్రహార్థము భగవంతునితో బాటు వారును ఇచ్ఛాపూర్వకముగా జన్మించవచ్చును.

అవతారిక : ఇపుడు జ్ఞానఫలమగు సమతను జెప్పును -

**విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,**
**శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః. 18**

విద్యావినయ సంపన్నుడగు బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుగు నందును, అటులే కుక్కయందును, కుక్కమాంసము తినువానియందును పండితులు సమమగు ఆత్మనే చూతురు, అథవా అట్టి సమదర్శులే పండితులు.

విశేషార్థము : అందరి యందును, అన్నింటియందును ఈ సమదర్శనము అందరిపట్లను, అన్నింటిపట్లను సమవ్యవహారములోనికి బరిణమించును - అని శ్రీ అరవిందుడు.

**ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః,**
**నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః. 19**

ఎవరి మనస్సు సమస్థితియందు ప్రతిష్ఠిత మగునో, వా రిచ్చట, ఈ శరీర జీవనమునందే సృష్టిని జయించినవా రగుదురు. ఆ కారణముచేత నిర్దోషము, సమము నగు బ్రహ్మమునందు వారు ప్రతిష్ఠితులై యుందురు.

విశేషార్థము : సృష్టి అసమము. అట్టి అసమసృష్టితో వ్యవహరించు దివ్యకర్తకు సమత అత్యంతావశ్యకము, కాగా ప్రపంచమును సన్యసించిన సన్యాసికి ఈ సమత అవసరము లేదు. సమత యున్నపుడు దివ్యకర్త ప్రపంచముయొక్క విషమతలలో చిక్కుకొనక, వాని పైనుండి వానితో వ్యవహరించగలడు. ఇదియే సృష్టిని జయించుట - "తైర్జితః సర్గః," అయినపుడు ఇట్టి జ్ఞానికి సన్యసించవలసిన ఆవశ్యకత ఏ ముండును ?

"నిర్దోషం హి సమం బ్రహ్మ" : బ్రహ్మ సమమే గాక, నిర్దోషమును. కావున బ్రహ్మస్థితుడు సమతను బొందుటయే గాక, అతని కర్మలును నిర్దోషము లగును - అని శ్రీ అరవిందుడు. ఇట్లు బ్రహ్మస్థితి కర్మను విలుప్తము చేయుటకు బదులు, విముక్తము, నిర్దుష్టము, ప్రబలము గావించును.

న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య నోద్విజేత్ ప్రాప్యచాప్రియం
స్థిరబుద్ధి రసంమూఢో బ్రహ్మవిద్ బ్రహ్మణి స్థితః. 20

బ్రహ్మయందు స్థితుడైన బ్రహ్మవిదుడు బుద్ధిని స్థిరపఱచి, మోహవశుడు గాక, (సమత సహజమగు నిమిత్తము) ప్రియమును బొందినపుడు ఉప్పొంగరాదు, అప్రియము ప్రాప్తించి నపుడు చలించరాదు.

అవతారిక : ఇట్లు బ్రహ్మనిష్ఠుని సమతను వర్ణించిన పిమ్మట, గీత తర్వాతి 9-శ్లోకములలోను బ్రహ్మయోగము మఱియు బ్రహ్మనిర్వాణమును గుఱించిన తన భావమును వివరించును.

బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విందత్యాత్మని యత్ సుఖం,
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే. 21

బాహ్యస్పర్శలయందు అంతరాత్మ సక్తముగా నపుడు, యోగి ఆత్మయందు గల సుఖము ననుభవించును. అపు డతని అంతరాత్మ బ్రహ్మతో యోగమునం దుండును గాన, అక్షయసుఖము ననుభవించును.

విశేషార్థము : అసంగము లేనిదే, వ్యవహారమునందు సైతము మన మక్షయసుఖ మనుభవించజాల మని ఈ శ్లోకము మన కొక సాధనాకీలకమును దెలుపును

యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే,
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః. 22

అర్జునా ! విషయములు మఱియు ఇంద్రియముల సంస్పర్శచేత గలుగు భోగములు దుఃఖహేతువులు మఱియు నవి ఆదియు, అంతము గలిగి, స్వల్పకాలము మాత్రమే యుండును. కనుక విజ్ఞుడు వానియందు రమించడు.

శక్నో తీహైవ యః సోఢుం ప్రాక్ శరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః. 23

శరీరమును విడుచుటకు పూర్వమే, ఇహజీవనమునందే ఎవడు కామక్రోధ ముల ప్రబలవేగమును సహించి తట్టుకొనగల్గునో, అతడు బ్రహ్మయోగయుక్తుడును అక్షయ సుఖియు నగును.

విశేషార్థము : శరీరము పోయిన పిమ్మట కామవిముక్తి స్వయముగాఁ బ్రాప్తించునులే - అను భ్రాంతికి తావీయరాదు. మఱియు నిండు జీవనమునందే "ఇహైవ" - కామక్రోధములను జయించి, బ్రహ్మసుఖము ననుభవించవలెను కనుక గీతాయోగమునకు సన్న్యాసాపేక్ష లేదు.

అవతారిక : పై శ్లోకము నందలి సుఖస్వరూపము చెప్పబడును.

**యోఽన్తః సుఖోఽన్తరారామ స్తథాఽన్తర్జ్యోతిరేవ యః,**
**స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి. 24**

ఎవనికి సుఖమును, రతియు, జ్యోతియు లోపలనే లభించునో, అతడు యోగి. అట్టి యోగి బ్రహ్మయై, బ్రహ్మమందు నిర్వాణము నందును

విశేషార్థము : నిర్వాణము = (దీపము) ఆఱిపోవుట, నశించుట ఇచ్చట సుఖాదుల అంతరనుభవము గలదు గాన, నిర్వాణ మన సర్వనాశము గాదని తెలియును. కనుక నిది బౌద్ధులయొక్క కేవల నిర్వాణము గాదు, ఇది "బ్రహ్మనిర్వాణము", అనగా నిర్వ్యక్తిక మగు బ్రహ్మసత్తయందు శరీరాది - పరిచ్ఛిన్నమైన అహంకార వ్యక్తిత్వముయొక్క లయము. ఇపుడు అంతరాత్మ క్షుద్రమగు అహంకారపురుషుడుగా నుండక, తన చేతనయందు బ్రహ్మతో నేకమగును. అనగా సనాతన మగు (15-7) అంతరాత్మ తన ఆధ్యాత్మిక వ్యక్తిత్వమును గోల్పోవకయే బ్రహ్మైక్యము నందును. తర్వాతి శ్లోకములోని "సర్వభూతహితే రతాః"-అను పదము, నిర్వాణము నందిన యోగి సర్వభూతముల హితమునందు వ్యాపృతుడై యుండు నని చెప్పును గాన, అతనికి ఆధ్యాత్మిక వ్యక్తిత్వ ముండు ననియే దాని అర్థము.

ఇట్లు గీతానిర్వాణము బౌద్ధుల నిర్వాణమును గాదు, మాయావాదుల మోక్షమునుగాదు (మాయావాదుల మోక్షమునందు వ్యక్తిత్వ ముండదు. వారికి వ్యక్తిత్వము మిథ్య).

**లభన్తే బ్రహ్మనిర్వాణం ఋషయః క్షీణకల్మషాః,**
**ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః. 25**

పాపకళంకము క్షీణించినవారును, సందేహగ్రంథి పీడినవారును, ఆత్మవశ్యులును, సర్వభూతముల హితమునందు నిరతులైనవారు నగు ఋషులు బ్రహ్మనిర్వాణమును బొందుచున్నారు.

విశేషార్థము :  సర్వభూతహితే రతాః = అహింసకులు, దేనిని హింసించని వారు - అని శ్రీ శంకరుడు. ఏలన శంకరుని ఋషులు ఏమియు చేయువారు గారు, సర్వభూతహితమునందు వారు నిరతులు గారు! శ్రీ శంకరు డిచట స్పష్టమైన అర్థమును ఎట్లు మార్చివేసెనో, గమనించదగును

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసాం,
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనాం.		26

కామక్రోధములనుండి విముక్తులై, ఆత్మవశిత్వమును సాధించిన యతివర్యులకు బ్రహ్మనిర్వాణము నలువైపుల వారిని చుట్టి విలసిల్లును వారి కాత్మ జ్ఞానము గలదు గాన, వారు దానియందు నివసించుచునే యున్నారు.

విశేషార్థము :  అభితః = సర్వతః, చుట్టును - అని శ్రీ అరవిందుడు. అభితః = ఉభయతః, జీవించియున్నపుడు, తర్వాతను - అని శ్రీ శంకరుడు. శ్రీ అరవిందునిదే స్పష్టార్థమును, పూర్ణార్థమును.

విదితాత్మలను నిర్వాణము నలువైపుల చుట్టియుండును. అనగా నిర్వాణము ప్రపంచచేతనను తనలో నిముడ్చుకొనును. కావున నిర్వాణము నిమిత్తము సమాధిలో కూరుకొనిపో నవసరము లేదు, లేక బుద్ధుడు చెప్పి నట్లు, ప్రపంచమునుంచియే ఉపసంహరించుకొన వలసిన అగత్యమును లేదు.

ఇచ్చట ఒక సూక్ష్మ విభేదమును - శ్రీ అరవిందునికిని, ఇతరులకును గల ఒక సూక్ష్మ విభేదమును - గమనింపదగును.

విదితాత్మలకు బ్రహ్మనిర్వాణము లభించును - అని ఇతరులు అనువదించగా, విదితాత్మలు బ్రహ్మనిర్వాణమునందు నివసించుచునే యున్నారు - అని శ్రీ అరవిందుడు అనువదించును. అనగా, ఇతరుల దృష్టిలో ఆత్మజ్ఞానము బ్రహ్మనిర్వాణమునకు గారణము కాగా, శ్రీ అరవిందునికి బ్రహ్మనిర్వాణము యొక్క పదార్థమే (substance itself) ఆత్మజ్ఞానము. కావుననే పుష్పమును సౌరభము చుట్టియుండు నట్లు, ఆత్మజ్ఞానిని నిర్వాణము చుట్టియుండును.

మఱియు, బ్రహ్మయు, భగవంతుడు ప్రపంచమునుండి వేఱువడి లేరు. ఏ బ్రహ్మయందు ఋషులు తమ అహంకార నిర్వాణమును బొందుచున్నారో, ఆ బ్రహ్మ అతీతముగనే కాక, అన్నింటియందును వ్యాపించి, విస్తరించి యుండును (2-17).

కనుక బ్రహ్మనిర్వాణమును బొందిన ఋషులు సర్వభూతములందును బ్రహ్మను, ఈశ్వరుని (4-35) దర్శించుచు, సహజముగనే సర్వభూతముల హితము చాచరింతురు. ఇట్లు సర్వభూతహితాచరణమును, ఆత్మజ్ఞానమువలె, నిర్వాణ హేతువు మాత్రమే గాక, నిర్వాణ - పదార్థమే (సారమే) యగును - అని శ్రీ అరవిందుడు. ఆయన జీవితమే దీనికి ఒక నిదర్శనము.

అవతారిక : ఇపుడు సక్రియచేతనాసన్న్యాస లక్షణము గల మోక్షమునకు దారితీయుచున్నట్లు గన్పించు రాజయోగప్రక్రియ చెప్పబడును.

స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాం శ్చక్షుశ్చై వాంతరే భ్రువోః,
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ. 27

యతేంద్రియ మనోబుద్ధిర్ మునిర్మోక్ష పరాయణః,
విగతేచ్ఛా భయక్రోధో యః సదా ముక్త ఏవ సః. 28

బాహ్యస్పర్శలను బహిష్కరించి, దృష్టిని భ్రూమధ్యమున నిలిపి, నాసికా పుటములందు సంచరించు ప్రాణాపానగతులను సమము గావించి, ఇంద్రియమనో బుద్ధులను నియమించి, ఇచ్ఛా భయక్రోధములు గతించినవాడై, మోక్షమునే లక్షించు నట్టి ఏ ముని గలడో, అతడు సదా ముక్తుడే

విశేషార్థము : ఇచ్చట చిత్తవృత్తినిరోధము గలదు, ప్రాణాయామము గలదు, దృష్టిప్రత్యాహారము గలదు - ఇవి యన్నియు సమాధికి దారితీయు ప్రక్రియలు. కనుక మన కీ ప్రశ్న ఉదయించును: నిష్క్రియమోక్షమునకు ఒక చరమ ప్రక్రియగా గీత మన కీ రాజయోగసాధనను జూపుచున్నదా, లేక బహిర్ముఖ మానసమును జయించుటకు ఒక ప్రత్యేకసాధనగా దానిని మన కదించుచున్నదా? నిష్క్రియమోక్షమును గాక, ఒక పరమగతిని బొందుటకు ఇది యొక ప్రత్యేక సాధన మాత్రమే. ఒక ద్వారము మాత్రమే యని సందర్భము దెలుపును ఎట్లు? దీనివలన మనము తెలియవలసినది - "జ్ఞాత్వా" (5-29) - సక్రియ సర్వలోక మహేశ్వరుని, పొందవలసినది ఆ ఈశ్వరుని పరమగతిని. అదియే ఇపుడు చెప్ప బడును -

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరం,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి. 29

మానవు డెపుడు నన్ను యజ్ఞముయొక్కయు, తపస్యయొక్కయు భోక్తను గాను, సర్వలోకమహేశ్వరునిగాను సర్వభూత సుహృదునిగాను ఎఱుంగునో, అపుడు శాంతిని బొందును.

విశేషార్థము : ఇచ్చట గీతయొక్క పరమభావనయగు పురుషోత్తమునికి మనము తిరిగి వచ్చినాము – పేరు పెట్టకపోయినను, కృష్ణుడు "నేను", "నన్ను" అన్నపుడు, వాని అర్థ మా పురుషోత్తముడే.

శాంతిని అపేక్షించినను, ఈ పురుషోత్తముని మనము దెలిసికొనవలెను, కావుననే ఇచ్చట నిర్వాణశాంతికి వలయు నియమములతో ఈ పురుషోత్తమ జ్ఞానము ప్రత్యేకించి చెప్పబడినది. ఇట్లీ పురుషోత్తముడు శక్తి, క్రియల కెట్లు ఈశ్వరుడో మౌన, శాంతులకును అటులే ఈశ్వరుడు. ఈయనయందు క్రియా, నిర్వాణములు రెండును కలిసికొని ఏకమగును. కనుక నిర్వాణము క్రియాదూరముగాదు, ప్రత్యుత (పైగా) క్రియాధారము, క్రియాసహితము, క్రియాగతము, క్రియాత్మకము.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే

**సంన్యాసయోగో నామ పంచమోఽధ్యాయః**





# శ్రీ గీతా యోగము

## అథ షష్ఠోఽధ్యాయః

## ధ్యాన యోగః

ఒక పరిశీలన : క్రిందటి అధ్యాయాంతమున రాజయోగ ప్రక్రియ వర్ణింపబడినది (5–27,28). ఇది సాధారణముగా ప్రకృతి నుండి ఉపసంహరణాత్మకమగు మోక్షమునకు దారితీయు ధ్యానయోగవిధానము. కాని ఈ మోక్షమే గీతకు పరాకాష్ఠయా? ఈ వాక్యమే గీతయొక్క చరమ వాక్యమా? కాదు – అని గీతయే మనకు జెప్పును; ఆ చరమ వాక్యము అధ్యాయముయొక్క చరమ శ్లోకమగు తర్వాతి శ్లోకమున మనకు సాక్షాత్కరించును—

"మోక్షశాంతి నపేక్షించిన ముని యజ్ఞతపస్యల భోక్త, సర్వభూత సుహృదుడు, సర్వలోక మహేశ్వరుడు నగు నన్ను దెలిసికొని శాంతిని బొందును." (5–29).

ఇట్లు మోక్షపరాయణుడగు (5–28) ముని సైతము తా నపేక్షించిన శాంతి సంసిద్ధికైనను, శాంతి, క్రియల రెండింటికిని ప్రభువగు సర్వభూతమహేశ్వరు నెఱుంగవలెను. రాజయోగ ప్రక్రియద్వారా చివరకు దెలియదగినవాడీ ఈశ్వరుడే యని సందర్భమును బట్టి శ్రీ శంకరుడును చెప్పక తప్పలేదు.

ఇట్లు గీత కర్మయోగ ప్రభావమును ధ్యానయోగమున మఱల ప్రవేశపెట్టును. ఈశ్వరు నెఱింగిన ముని ఈశ్వరునివలెనే సర్వభూతసుహృదు డగును (5–29), సర్వభూతహితమునందు నిరతుడగును (5.25): ఏలన అది గీతాప్రోక్తమగు సమ్యగ్ జ్ఞానమే అయితే, భగవంతుని అక్షరాత్మగనే కాక, ఋషులు సర్వభూతస్థితుడగు విశ్వాత్మగను, విశ్వాతీతుడగు పరమాత్మగను గూడ దెలియుదురు. అనగా ఋషి అక్షరశాంతి ననుభవించుచునే, నిజానికి నిత్యమగు ఆ శాంతిసామర్థ్యముచేతనే, క్షరప్రపంచముతో సైతము సంబంధము పెట్టుకొని, మానవునిపట్ల దివ్యప్రేమను, భగవంతునిపట్ల దివ్యభక్తిని చూపగలుగును, చూపును. ఈ విషయమును (6–30,31) శ్లోకములు మఱింత స్పష్టపఱచును.

ఒక్క మాటలో, ధ్యానయోగము అక్షరాత్మ ప్రాప్తిద్వారా పరమాత్మ కొక ద్వారము. 5-వ అధ్యాయాంతమున సూచనామాత్రముగా జెప్పబడిన ఈ సత్య మెంతో మహత్త్వపూర్ణమైనది గావుననే,6-వ అధ్యాయ మంతయు దీని విపులీకరణకే వెచ్చింపబడినది — అని శ్రీ అరవిందుడు దెలుపును. దీనికి 6-వ అధ్యాయముయొక్క చివరి శ్లోక మొక నిదర్శనము — "నాతో నంతరాత్మ నేకము గావించి, ఎవడు నన్ను శ్రద్ధతో భజించునో, అతడు యోగులలో సైతము ఉత్తమయోగి" (6-47). అట్టి భజనము మునులకు సహజమని సైతము పోతనామాత్యుని భాగవత మిట్లుపలుకును—

ధీరులు, నిరపేక్షులు, నా
త్మారాములు నైన మునులు, హరిభజనము ని
ష్కారణము చేయుచుందురు,
నారాయణు డట్టివాడ నవ్యచరిత్రా!

శ్రీ భగవా నువాచ —

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,
స సన్న్యాసీ చ యోగీచ, న నిరగ్నిర్ న చాఽక్రియః. 1

శ్రీ భగవానుడు పలికెను — ఎవడు కర్మఫలము నాశ్రయించక, చేయదగిన కర్మను జేయునో, అట్టి యోగియే సన్న్యాసిగాని, అగ్నిహోత్రమును త్యజించినవాడు గాని, కర్మలను త్యజించినవాడు గాని సన్న్యాసిగాడు.

విశేషార్థము : ధ్యానయోగము పరమాత్మకు ఒక ద్వారమని వివరించుటకు ముందు గురువు — ఇది అత్యంత ముఖ్యము సన్న్యాస మాంతరము గాని, బాహ్యము గాదని ఆంతర సన్న్యాసమే సన్న్యాససార మని మఱియొక సారి ఉద్ఘాటించును — అని శ్రీ అరవిందుడు. కాగా, సన్న్యాసమునకు పూర్వాంగమగు కర్మయోగస్తుతి నిమిత్తము మాత్రమే అట్లు చెప్పబడిన దని శ్రీ శంకరుడు. కాని తర్వాతి శ్లోకము శ్రీఅరవిందుని అర్థమునే పోషించును —

యం సన్న్యాస మితి ప్రాహుర్ యోగం తం విద్ధి పాండవ
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన. 2

దేనిని సన్న్యాస మని చెప్పుదురో, ఓ అర్జునా, అది (నిజానికి)యోగమే యని యెఱుంగుము. ఏలన సంకల్ప సన్న్యాసము చేయనివాడెవడును యోగి కాజాలడు

విశేషార్థము : కావున యోగియందు సంకల్ప సన్న్యాస మున్నది, మఱియు నదియే సన్న్యాససారము. కనుక యోగి సన్న్యాసియే, మఱియు యోగియే సన్న్యాసి యని - శ్రీ అరవిందుడు. ఇచ్చట సంకల్పమూలకములగు కామాదు లన్నియు నని అర్థము.

అవతారిక : 'సన్న్యాసి' యోగియే గావున, అతడు కర్మచేయవలెను. కాని ఏ క్రమమున, ఏ ఉద్దేశ్యముతో ?—

**ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే,**
**యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే. 3**

యోగపర్వతము నారోహించగోరు వానికి కర్మ కారణ మని చెప్పబడును; అటులే యోగపర్వతము నారోహించిన అతనికే శమము కారణ మని చెప్పబడును.

విశేషార్థము : యోగ మన చేతనయొక్క క్రింది స్తరము పై స్తరములోని కెక్కి, దానితో సంయోగము నందుట, తన మూలముతో నేక మగుట. ఇట్టి యోగము నారోహించగోరు వాడు ముందు కర్మ చేయవలెను. ఏలన అది అతని ఆరోహణమునకు, విముక్తికి, బ్రహ్మ నిర్వాణమునకు గారణము.

పోతే అతడు యోగము నారోహించి నపుడు ? అతని కిక కర్మ కారణము గాదు. మఱి ? అతని కిపుడు శమము కారణ మగును. మఱల శమము దేనికి కారణము ? [ఇచ్చటే అనుభవము నుండి ఉదయించిన శ్రీ అరవిందుని అపూర్వతను గననగును.] ఆత్మనిష్ఠకును, మఱియు దేనియందు కర్మవిముక్త మానవుని కర్మలు చేయబడునో, అట్టి సమతకును గారణము, అనగా నిష్కామకర్మ యోగారూఢత ద్వారా శమమునకు గారణము కాగా, ఆ శమము ఆత్మనిష్ఠద్వారా విముక్త కర్మకు గారణము.

ఇంతకు శమ మన నేమిటి ? నిష్కామకర్మ ద్వారా ప్రాప్తించిన ఆత్మ వశిత్వము మఱియు ఆత్మతత్త్వములకు సహజమగు శాంతి - అని శ్రీ అరవిందుడు; సర్వకర్మలనుండియు నివృత్తి యని శ్రీ శంకరుడు. మంచిది, కాని శ్రీ శంకరుని శమము దేనికి గారణము ? యోగఫలమునకు యోగఫలము ? నిష్క్రియ

మోక్షము, అనగా ప్రకృతినుండి ఉపసంహరణము మఱియు బ్రహ్మమునందు లయము. కాని ఇది గీతామతము కాదు. ఏలన తర్వాతి శ్లోకము యోగారూఢునికి కర్మలు గల వని చెప్పుచున్నది –

**యదాహి నేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్యతే,**
**సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. 4**

ఇంద్రియార్థములందు గాని, కర్మలయందు గాని సాధకు డెపుడు సక్తుడు గాడో, మఱియు సర్వసంకల్పములను సన్యసించియుండునో, అపుడతడు యోగారూఢు డని చెప్పబడును.

విశేషార్థము : యోగారూఢుడు కర్మలయందు సక్తుడు గా డనిన, అతనికి కర్మలు లే వని గాదు, అతనికి కర్మలయందు సక్తత లే దనియే, అతడు కర్మల నంటక, కర్మాతీతుడై కర్మల జేయు ననియే, అర్థము. ఇవ్విషయమున, (3–19), (5-7), (18-17) – శ్లోకాలను జూడసగును.

అవతారిక : యోగారూఢు డగుటకు నిమ్నాత్మ నెట్లు జయించవలెను ?

**ఉద్ధరే దాత్మ నాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్,**
**ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః. 5**

సాధకుడు తన నిమ్నాత్మను తన ఉన్నతాత్మచేత ఉద్ధరించుకొనవలెను గాని, ఆ నిమ్నాత్మను పతనము జెందించరాదు. ఏలన నిమ్నాత్మ ఉన్నతాత్మకు బంధు వెట్లు కాగలదో, అటులే శత్రువును కాగలదు.

విశేషార్థము : ముందు, మానవుడు తనకు రెండు-నిజానికి అనేక-ఆత్మలు గలవని గుర్తించవలెను (3–42). ఇట్లు గుర్తించగల సామర్థ్యము పశువునకు లేదు. ఇది మానవుని పశువునుండి వేఱుచేయు స్వరూపలక్షణము – అని శ్రీ అరవిందుడు అపూర్వముగా జెప్పను.

తర్వాత, నిగ్రహము వేఱు, సంయమము వేఱు. నిగ్రహము = బలాత్కారము; సంయమము = సరిగా నుపయోగించుచు అదుపులో నుంచుట. నిగ్రహమువలన నిమ్నాత్మయొక్క శక్తులు క్షీణించిపోవను – "అవసాదయేత్". ఈ సంయమ స్వరూపమును (6-16,17) శ్లోకములు మనకు దెలుపును.

బంధు రాత్మాత్మన స్తస్యయే నాత్మై వాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్. 6

ఎవనియొక్క నిమ్నాత్మ ఉన్నతాత్మచేత జయించబడునో, అతని కా నిమ్నాత్మ మిత్ర మగును. కాని అట్లు జయించబడనిచో, అదియే శత్రువలె అపకారము చేయును.

విశేషార్థము : మానవుడు నిమ్నాత్మను ఉన్నతాత్మచేత జయించవలెను-అని కాక, తక్కిన వ్యాఖ్యాతలు తనను దాను జయించకొనవలెను-అని అనువదించినారు దీనిలో రెండు అనర్థములు గలవు : 1) ఉన్నతాత్మను గుర్తించ నపుడు మాయలో నుండి మాయతో పోరాడుటయే యగును దానివలన మాయ మఱింత బలపడుటయే జరుగును : ఇది మన అనుభవములోని విషయమే. 2) నీకు నీవే సాయపడ వలెను గాని, నీకు సాయపడు దేవు డెవడును లేడు - అని చెప్పినట్లగును.

అవతారిక : ఇపు డాత్మజయముయొక్క పరమఫలితమును జెప్పును -

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః. 7

నిమ్నాత్మను జయించి, ప్రశాంతిని, (ఉన్నతాత్మయందు ప్రతిష్ఠను) బొంది నపుడు, మానవునికి శీతోష్ణసుఖదుఃఖములందును, అటులే మానావమానములయందును పరమాత్మ సదా అనుభూతమగు చుండును.

విశేషార్థము : పరమాత్మా సమాహితః = బాహ్యావ్యాపారమును జూచు మానవుని బహిర్ముఖసత్తయందు సైతము పరమాత్మ స్థిరప్రతిష్ఠితుడు (సం + ఆహితుడు) అగును-అని శ్రీ అరవిందుడు. జీవనచేతనకు, పరమాత్మచేతనకు మధ్యనున్న అంతరాయము ఛేదించబడినది, ఆ కారణముగా పరమాత్మ బాహ్య జీవనచేతనయందు సైతము, బాహ్యప్రకృతియందు సైతము, ప్రతిష్ఠితు డగును. ఇదియే దివ్యజీవనము ఈ శ్లోకమునం దిట్టి దివ్యజీవనబీజమును జూచినవాడు శ్రీ అరవిందు డొక్కడే. కాగా, ప్రశాంతుడగు సన్న్యాసికి పరమాత్మ సదా ఆత్మరూప మున అనుభూత (సమాహిత)మగును, అనగా ఆత్మయందే పరమాత్మానుభవము గాని, జీవనకర్మలయందు గాదు-అని శ్రీ శంకరుడు

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః. 8

ఎపుడు యోగి కూటస్థునివలె సర్వవికారములకు అతీతముగా నుండునో, ఆత్మజ్ఞానముచేతను, తత్త్వముల విజ్ఞానముచేతను తృప్తుడగునో, ఇంద్రియములను జయించినవాడై మట్టి, ఱాయి, బంగారములందు సమదర్శియగునో, అపు డతడు కూటస్థయోగి యనబడును.

విశేషార్థము : కూటస్థుడు = అక్షరపురుషుడు. సమత్వ మక్షరాత్మలక్షణము. కనుక నీ యోగిని శ్రీ అరవిందుడు కూటస్థయోగి అనుచున్నారు. ఈ సమతాప్రాది పదికపై పరమాత్మతో యోగము నందిన యోగి పరమాత్మయోగి యనబడును. ఇతనియందు సమతతో బాటు విముక్తకర్మలును విలసిల్లును.

సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్య బంధుషు,
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే. 9

సుహృదులయందును, మిత్రులయందును. ఉదాసీనులయందును, మధ్యస్థులయందును, శత్రువులయందును, బంధువులందును, అటులే సజ్జనులు మఱియు దుర్జనులయందును సమబుద్ధి గల కూటస్థయోగి యోగారూఢులయందు శ్రేష్ఠుడు.

అవతారిక : అయితే ఈ కూటస్థయోగము సులభము గాదు. కారణము, చంచల మానసము దాడిచేయు బాహ్యవస్తువులచే నిట్టె సమతనుండి విషమతలోనికి లాగబడును. కనుక తన జ్ఞాన, కర్మల ప్రధానపద్ధతితో బాటు గీత ఇచ్చట రాజయోగప్రక్రియను గూడ ప్రవేశపెట్టుచున్నది – .

యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. 10

ధ్యానయోగి ఏకాంతమున ఒంటరిగా నుండి, దేహేంద్రియముల నదుపులో నుంచుకొని, ఆశను వీడి, తన దగ్గఱ నే సంపత్తిని ఉంచుకొనక, సదా ఆత్మతో యోగము నభ్యసింపవలెను.

విశేషార్థము : ఇచ్చట సన్న్యాసలక్షణములగు ఏకాంతవాసము, అపరిగ్రహము, మున్నగు నవి గన్పించును. కనుక నిది - గీతాయోగము – సన్న్యాసపరమగు యోగ మని శ్రీ శంకరుని వాదము.

ఆ సన్న్యాస సంస్కారము బలముగాగల కొద్దిమందికి గీత బాహ్యసన్న్యాసమును కాదనదు. అయితే గీతాతాత్పర్య మది గాదు - అని శ్రీ అరవిందుడు (5-29) శ్లోకము క్రింద చూపియే యున్నాడు.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరం. 11

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యాద్ యోగ మాత్మవిశుద్ధయే.

పరిశుద్ధమగు ప్రదేశమునందు యోగి తన ఆసనమును స్థిరముగా నేర్పఱచుకొనవలెను. అది అంత ఎత్తుగను ఉండరాదు. అంత పల్లముగను ఉండరాదు. అది క్రింద దర్భాసనము, దానిపైన లేడి చర్మము, దానిపైన వస్త్రముతోగూడి యుండవలెను. అట్టి ఆసనమునందు గూర్చొని చిత్తమును, ఇంద్రియములను అరికట్టి, మనస్సు నేకాగ్రపఱచి, యోగి అంతఃకరణశుద్ధి నిమిత్తము యోగము నభ్యసింపవలెను.

విశేషార్థము : మనోవిక్షేపము (చాంచల్యము) ఒక మాలిన్యమే గాన దాని శుద్ధికొఱకు ఏకాగ్రతాభ్యాసము.

సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్. 13

ప్రశాంతాత్మా విగతభీర్ బ్రహ్మచారివ్రతే స్థితః,
మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. 14

అతడు స్థిరుడై, తన దేహమును, కంఠమును, శిరమును నిలువుగా ఒకే లైనులో నిలిపి, అటు నిటు జూడక, దృష్టిని భ్రూమధ్యమున నిలుపవలెను నిలిపి ప్రశాంతముగా, నిర్భయముగా బ్రహ్మచర్యవ్రత మవలంబించి, మనస్సును చక్కగా నియమించి, చిత్తవ్యాపారము నంతను మత్పరము(భగవత్పరము)గావించి యోగము నందుండవలెను.

విశేషార్థము : ఇట్లు రాజయోగముయొక్క పరమలక్ష్యము భగవంతు డగుటయే గాక, రాజయోగసాధనయు భగవంతునిపై నాధారపడును. ఎట్లన,

మనోవ్యాపారము నంతను భగవత్పరము గావించగా, చేతనయొక్క నిమ్నతర క్రియ ఉచ్చతర శాంతిలో లీనమగును – అని శ్రీ అరవిందుడు. అటులే (2-61) గూడ వచించును. తర్వాతి శ్లోకమునందలి 'మత్సంస్థాం' పదము దీనికి కారణమును దెలుపును.

విగతభీః (భయములేనివాడై) : దేని విషయమగు భయము ? అహంకారము నిర్వ్యక్తికాత్మయొక్క శాంతిలో లయించి పోవుచున్నపుడు, 'నేను నశించిపోవుచున్నా' ననే భయము. ఈ భయము అహంకారనాశమునకు అడ్డువచ్చును. అయితే ఈ అహంకారనాశము భగవంతుని సనాతనాంశమగు (15-7) జీవాత్మనాశము గాదు. కావున భయములేని వాడై ఆత్మయోగము నభ్యసింపవలెను.

యుంజ న్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి.  15

ఇట్లు తన మానసమును నియమించి, ఆత్మతో యోగమును సదా అభ్యసించు యోగివర్యుడు మదధీనమగు (భగవదధీనమగు) పరమనిర్వాణశాంతిని బొందును.

విశేషార్థము : మత్సంస్థాం = మదధీనము, భగవదధీనము-అని శ్రీ శంకరుడు సైతము వ్యాఖ్యానించును. ఇట్లు శాంతి భగవదధీనము గావుననే, మనోవ్యాపారమును భగవత్పరము గావించినపుడు (6-14), అది శాంతిలో లీనమగును.

అవతారిక : మితమును పాటించిన వాని కీ యోగము సులభ మని తర్వాతి రెండు శ్లోకములు నిర్దేశించును –

నాఽత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః,
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున.  16

ఈ యోగ, మర్జునా, మితిమీటి తినువానికి గాని, బొత్తిగా తినని వానికి గాని సిద్ధించదు; అటులే మితిమీటి నిద్రించువానికి గాని, మితిమీటి మేల్కొనియుండు వానికి గాని సిద్ధించదు

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావ బోధస్య యోగో భవతి దుఃఖహా.  17

అట్లు గాక, యుక్తమగు ఆహారవిహారములు గలవానికి, కర్మలయందు యుక్తమగు శ్రమజేయువానికి, అటులే యుక్తమగు నిద్రా జాగరణములు పాటించు వానికి ఈ యోగము సిద్ధించి, దుఃఖమును హరించును

విశేషార్థము : 'కర్మలయందు యుక్తమగు శ్రమ జేయువానికి' అని యున్నది గదా. అందుచేత ఈ ఏకాంతయోగము నభ్యసించు రోజులలో సైతము తదితర కర్మలను, సంబంధములను విడనాడుటను గీత చెప్పుటలేదు – అని శ్రీ అరవిందుడు (6–10) శ్లోకార్థమును ఈ (6–17) శ్లోకముతోబాటు చూచినపుడు, శ్రీ అరవిందునకీ అర్థము బయల్పడెను ఆయన వ్యాఖ్యానము సందర్భము నెంతగా గమనించునో, దీనివలన మనకు దెలియును.

పోతే, ఇంతకంటెను ఎక్కువ విశేష మేమన, 'యుక్తము' = మితము – అనునది ఇచ్చటి అర్థమైనను, గీతయందు ఇతరత్ర అంతటను, యుక్తము = భగవంతునితో యుక్తము–అని అర్థ మని శ్రీ అరవిందుడు దెలుపును ఉదాహరణకు, "యోగస్థః కురు కర్మాణి" (2 48), "యుక్త ఆసీత మత్పరః" (2.61). (6–14). అనగా యోగము నారోహించు నపుడు మితకర్మలు, యోగము నారోహించిన పిమ్మట యుక్తకర్మలు, భగవంతునితో యోగమునం దుండి చేయు కర్మలు. ఇవి నిర్వాణశాంతియందు యోగియొక్క వైయక్తిక ప్రకృతిద్వారా భగవంతుని నుండి ప్రవర్తించు కర్మలు ఇపుడు సర్వము బ్రహ్మములోనికి స్వీకరింపబడి, భగవంతునిచే ధరింపబడినది – "మయి సర్వాణి కర్మాణి సన్న్యస్య"(3–30). శ్రీ అరవిందుని ఈ ప్రకాశమయ వ్యాఖ్యవలన 'యుక్త'పదముయొక్క పరమార్థము మనకు దెలియుటయే కాక, సత్తామాత్రమగు బ్రహ్మమునకును, సత్తావంతుడగు భగవంతునికిని గల సంబంధము గూడ మనకుదెలియవచ్చును.

అవతారిక : ప్రయత్నరాహిత్యము యోగారూఢతకు లక్షణము –

**యదా వినియతం చిత్తం ఆత్మన్యే వావతిష్ఠతే,**
**నిస్స్పృహః సర్వకామేభ్యో, యుక్త ఇత్యుచ్యతే తదా.**

ఏ కామ్యవస్తువుపట్లను ఎట్టి స్పృహయు లేకపోవుటచేత ఆత్మయందు నియమింపబడిన చిత్తమాత్మయందే స్థిరముగా నెపుడు నిలిచిపోవునో, అపుడు సాధకుడు యోగి యని చెప్పబడును.

విశేషార్థము : సర్వసంకల్ప సన్న్యాసికంటెను (6-4) ఈ సర్వకామ నిస్స్పృహుడించుక విశిష్టుడు. ఏలన మొదటివానికి సన్న్యసించవలసిన ప్రయత్న మున్నది.

అవతారిక : 'యుక్తు' డగు యోగిచిత్తమున కొక దృష్టాంతము -

యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా,
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః. 19

గాలిలేని చోట పెట్టబడి నపుడు నిశ్చలముగా వెలుగు దీపశిఖ చిత్తమును వశము గావించుకొని ఆత్మతో యోగము ననుసంధించుచున్న యోగియొక్క చిత్తమునకు ఉపమానముగా స్మరించబడును.

విశేషార్థము : గాలిలేనిచోట పెట్టబడినది గాన,దీపము చలించదు, చలనము లేని ఆత్మయందు పెట్టబడినది గాన, చిత్తము చలించదు.

అవతారిక : ఇట్లు చిత్త ముపశమించి నపుడు -

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మ నాత్మానం పశ్య న్నాత్మని తుష్యతి. 20

దేనియందు - ఏ యోగస్థితియందు - యోగానుష్ఠానబలముచేత నిరుద్ధమైన చిత్తము పూర్తి శమమును బొందునో, దేనియందు అంతరాత్మ ఆత్మను ఆత్మచేతనే చూచుచు, ఆత్మయందే తుష్టినందునో - (20, 21, 22 శ్లోకముల అన్వయము 24 - శ్లోకముతో) -

విశేషార్థము : 'ఆత్మచేతనే' = పరిశుద్ధమగు అంతఃకరణముచే (మనస్సుచే)- అని శ్రీ శంకరుడు. కాని, ఆత్మచేతనే = యథార్థముగా ఆత్మచేతనే - అని శ్రీ అరవిందుడు. ఏలన చిత్తము, అనగా చేతన యంతయు ప్రశమించి నపుడు, ఆత్మ స్వయంప్రకాశము గనుక, ఆత్మ తనచేతనే తాను చూడబడును. మఱియు మనస్సు కల్పించు రూపమునను గాక, అహంకారముద్వారా ప్రాప్తించు రూపమునకు గాక, ఆత్మ స్వస్వరూపముననే దృష్టమగును. ఇట్లు మనము అలంకారప్రాయ మనుకొనిన అనేక పదములు యోగమున యథార్థములే యగును ;

సుఖ మాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియం,
వేత్తి యత్ర, న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః. 21

ఇంకను, దేనియందు ఇంద్రియాతీతమును, బుద్ధికి మాత్రమే గ్రాహ్యము నగు అనంత సుఖమును యోగి అనుభవించునో, మఱియు దేనియందు స్థితుడైన వాడు ఆత్మతత్త్వమునుండి పడిపోడో –

విశేషార్థము : ఇది ఇంద్రియములకు పరిచితమగు అశాంత సుఖముగాదు, ఇది ప్రశాంత అంతరానందము. దీనియందు అంతరాత్మ ఇంద్రియసంక్షోభమునకు బైనుండును గాన, తన ఆధ్యాత్మిక తత్త్వమునుండి పడిపోజాలదు.

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే. 22

ఏది లభించి నపుడు, దానికంటె అధికతర లాభము గల దని యోగి అనుకొనడో, దేనియందు స్థితుడై నపుడు, దారుణ దుఃఖముచేత నైనను చలింపకుండునో –

విశేషార్థము : బాహ్యస్పర్శలకు ఏ ప్రతిక్రియ గలదో, అదియే మానసిక దుఃఖము. కాగా ఈ అంతరానందము బాహ్యస్పర్శలకు, తత్ప్రతిక్రియలకు అతీతము గాన, మానసిక దుఃఖము అంతరానందమును స్పృశింపజాలదు.

తం విద్యాద్ దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితం,
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. 23

ఇట్లు దుఃఖముతో మనస్సునకు గల వివాహసంబంధమునకు విడాకు లిచ్చునట్టి ఆత్మసంయోగమునే యోగ మందురు కావున విసుగు జెందని చిత్తముతో, దృఢనిశ్చయముతో అట్టి యోగమును సాధింపవలెను.

విశేషార్థము : సహజ ఆధ్యాత్మికానందము యొక్క సుదృఢప్రాప్తికే యోగ మని పేరు. అయితే ఈ యోగప్రాప్తి చాల కఠినము కనుక దీని సాధనయందు మధ్యమధ్య కలుగు పరాజయముల వలన నిరుత్సాహ పడక, 'దృఢనిశ్చయముతో' దీనిని సాధింపవలెను.

అవతారిక : పైన ముఖ్యముగా యోగఫలమును జెప్పి, ఇపుడు యోగ సాధనాక్రమమును జెప్పును –

సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః,
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. 24

**శనైః శనై రుపరమేద్ బుద్ధ్యా ధృతిగ్రహీతయా,**
**ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. 25**

సంకల్పములనుండి బుట్టుచుండు కామముల నన్నింటిని అశేషముగా వాని మూలముతో సైతము త్యజించివేయవలెను. పిమ్మట మనస్సుచేతనే ఇంద్రియములను నలువైపులనుండి మఱల్చి, నియమించవలెను. అపుడు స్థిరతతో గూడిన బుద్ధిచేత మనోవ్యాపారమునుండి ఉపసంహరించుకొని, ఆమనస్సును ఆత్మతోనేకము గావించి, దేనిని చింతించక యుండవలెను.

విశేషార్థము : మనస్సునుండి వేఱువడి నపుడే మనస్సును బుద్ధిచేత ఆత్మ లోనికి లాగి, ఆత్మయందు స్థాపించుట, దానితో నేకముచేయుట సాధ్యమగును.

"మనస్సును ఆత్మసంస్థము గావించి, ఏమియు చింతించగూడదు" – ఇది యోగముయొక్క – రాజయోగముయొక్క – పరమ విధి యని శ్రీ శంకరుడు చెప్పిన దెంతయు నిజము. కాగా ఆత్మను తప్ప మఱిదేనిని చింతించరా దని ఒక వ్యాఖ్యానము గలదు : అది తప్పు ఏలన మనస్సు ఆత్మతో నేకమైనపుడు, ఆత్మ స్వయముగా భాసించును. ఇచ్చట చింతనతో పని లేదు. పైగా అట్టి చింతన ఆత్మను మూసివేయు ఆవరణ యగును – అని మనకు శ్రీ అరవిందుని వ్యాఖ్యవలన దెలియును.

**యతోయతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరం,**
**తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశంనయేత్. 26**

స్వభావతః చంచలము, కావుననే అస్థిరమగు మనస్సు ఎచటెచటికి పాఱిపోవునో, అచటినుండి దానిని మఱలించి, నియమించి, ఆత్మయందు నిలిపి, ఆత్మకు సమముగావించవలెను.

**ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమం,**
**ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషం. 27**

ఇట్లు చేయగా చేయగా మనస్సు పూర్తిగా శమించును. అపుడు బ్రహ్మ మయిన యోగిని అకల్మషము, ఆవేగరహితము నగు ఉత్తమానందము ముంచెత్తును.

విశేషార్థము : అకల్మషము, ఆవేగరహితము నగు సుఖ మని చెప్పి, శ్రీఅరవిందుడు ఆ విశేషణములను 'సుఖమునకు' వర్తింపజేయగా, అకల్మషుడు, ఆవేగరహితుడు నగు యోగి యని ఇతరులు వ్యాఖ్యానించియున్నారు ఇంద్రియ సుఖము స్వభావతః అశాంతము కాగా, ఆత్మానందము స్వభావతః ప్రశాంతము. చూ. (6-21) క్రింద విశేషార్థము కావుననే శ్రీ అరవిందు డట్లు వ్యాఖ్యానించెను.

అవతారిక : ఇపుడు యోగఫలమును జెప్పును –

**యుంజ న్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః,**
**సుఖేన బ్రహ్మసంస్పర్శం అత్యంతం సుఖ మశ్నుతే. 28**

ఇట్లు సదా ఆత్మయోగము నభ్యసించుచు, యోగి కల్మషరహితుడై, బ్రహ్మ తాదాత్మ్యమువలన లభించు బ్రహ్మభిన్నమగు అక్షయ సుఖమును అనాయాసముగా ననుభవించును.

విశేషార్థము : నియతమానసునికి పరమశాంతి (6-15), విగతకల్మషునికి పరమసుఖము (6-28). 'నియతమానస' పదము ప్రయత్నమును సూచించును. మఱియు కల్మష మున్నపుడే ప్రయత్న మవసరము. అట్టియెడ శాంతి మాత్రమే. ప్రయత్నముయొక్క అవశ్యకత తీరిపోయి నపుడు, అనగా బ్రహ్మభూతత్వము సహజమై నపుడు, ఆనందానుభవము సైతము గల్గును.

ఇట్లు జ్ఞానము తర్వాత శాంతి (4-39), శాంతి తర్వాత సుఖము (6-15,28).

అయితే ఈ సుఖ మింకను నిష్క్రియసుఖము మాత్రమే, నిష్క్రియ బ్రహ్మమునందలి సుఖము మాత్రమే. దీని తర్వాత సక్రియ ఈశ్వరునియందలి సుఖమును – సక్రియసుఖమును – బొందుట కింకను కాలము పట్టును. ఈ సక్రియ సుఖమునకు సంబంధించిన స్థితిని (6-31) శ్లోకము మనకు వర్ణించును.

ఈ సత్యమునకు నిదర్శనము మనకు శ్రీ అరవిందుడే : ఆయన బరోడాలో నుండగనే నిర్వాణశాంతిని బొందెను; తర్వాత కొన్ని దశాబ్దములు మహోన్నత సాధన చేసి గాని, పాండిచ్చేరీలో ఆయన సక్రియ పరమానందమున ప్రతిష్ఠితుడు గాలేదు.

సక్రియ పరతత్త్వమునే అంగీకరించని వ్యాఖ్యానములు గీతాబోధనలో గర్భితమైన ఈ అంతస్తుల నెట్లు వెలికిదీయగలవు ?

తర్వాతి మూడు శ్లోకములు ఈ ప్రక్రియ పరతత్త్వమునకు మూడు మెట్లను వర్ణించును —

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 29

తన అంతరాత్మ ఆత్మతో యోగయుక్తమై యున్నపుడు, మానవుడు సర్వభూతములయందును ఆత్మను, సర్వభూతములను ఆత్మయందును జూచును. అతడన్నింటిని సమదృష్టితో జూచును.

విశేషార్థము : ఇట్లు గీత ఆత్మసాక్షాత్కారమున విశ్వభావము నిముడ్చుచున్నది. సాధకుని వ్యక్తిసత్తయందలి ఆత్మసాక్షాత్కారము విశ్వసత్తయందలి సర్వాత్మసాక్షాత్కారముగా వికాసమును బొందినది. విశ్వము తనయందే యున్నపుడు విశ్వజీవనమును, విశ్వమును ఆత్మదర్శి ఎట్లు సన్యసించగలడు?

ఇట్లు తన ఆత్మను విశ్వాత్మగా దర్శించి, తనకును, విశ్వమునకు గల సంబంధమును గుర్తించుట ఈశ్వరయోగమునందు ప్రథమ - మహత్త్వపూర్ణ సోపానము.

కాని క్షరవికారములందే మాత్రము వసించినను, కష్టపడి సాధించిన అక్షరాత్మయోగమును గోల్పోవు ప్రమాద ముండదా? యోగి ఆత్మను గోల్పోయి తిరిగి మనస్సులోనికి జారిపోడా? పోడు. ఏలన —

యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి 30

ఎవడు సర్వత్ర నన్ను (ఈశ్వరుని) దర్శించునో, మఱియు సర్వమును నాయందు దర్శించునో, అతడు నన్ను గోల్పోడు, నేను అతనిని గోల్పోను.

విశేషార్థము : శ్లోకమునుబట్టి ముందు ఆత్మదర్శనము, తర్వాత నాదర్శనము అని గీత మనకు చెప్పకయే చెప్పినది. ఈ క్రమము "ఆత్మని అథో మయి" (4-35) అను తావున స్పష్టముగానే చెప్పబడినది గూడ, నిజానికి ఈ శ్లోకములు రెండును ఆ సూత్రము యొక్క విపులీకరణము మాత్రమే.

పోతే, ఇట్టి ఈశ్వరుని దర్శించినపుడు ఆత్మను గాని, ఆ ఈశ్వరునే గాని యోగి ఇక నెప్పటికిని గోల్పోడు. కారణము, నిర్వాణశాంతి అక్షరాత్మ ద్వారా

ప్రాప్తమైనను, ఆది ఈశ్వరసత్తయందు ప్రతిష్ఠితము - "మత్సంస్థాం" (6-15). మఱియు అక్షరాత్మవలెనే, అక్షరాత్మ స్వరూపమగు శాంతియు సర్వత్ర వ్యాపించి, క్రియాకలాపమునకు సైతము ఆధారముగా నుండును గాన, క్షరవికారములందు సైతము - కర్మయందు సైతము - మన మాత్మను గోల్పోము. కనుక నిట్టి పూర్ణతర సాక్షాత్కారము ప్రాప్తించి నపుడు, సన్యసించవలసిన అవసరమే ముండును?- అని శ్రీ అరవిందుడు ప్రశ్నించును.

విశ్వాత్మ దర్శనమునకు బిమ్మట, విశ్వేశ్వరదర్శనము పూర్ణయోగమునందలి ద్వితీయ, మహత్త్వపూర్ణ సోపానము.

కాగా శ్రీ శంకరుడు, ఆత్మయే ఈశ్వరుడు - అని వ్యాఖ్యానించును కనుక పై రెండు శ్లోకాలకు ఆ వ్యాఖ్యానము ఒకటిగనే నడచును,అందుచేత కర్మకలాపము నందు తిరిగి మనస్సులోనికి అంతరాత్మ జాఱిపోవు నవకాశము లేదా ? - అని ప్రశ్నవచ్చినపుడు, జాఱిపోవును, కనుకనే సన్న్యాసము ఆవశ్యక - మని ఆయన సమాధానము చెప్పును.

అవతారిక : సరే, ఈశ్వరుని దర్శించిన యోగి కర్మయందును చ్యుతుడు గాడు. కాని అతడెందుకు కర్మ చేయును ? దివ్యప్రేమచేత నని తర్వాతి శ్లోకము తెలుపును -

సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. 31

నాతో ఏకత్వము నవలంబించి, సర్వభూతములయందు నన్ను ప్రేమించు యోగి - అత డేప్రకారమున నివసించుచున్నను, కర్మచేయుచున్నను, నాయందే నివసించును, కర్మచేయును.

విశేషార్థము : సర్వమునందును భగవంతుని జూచుట యన, సర్వమును భగవంతునిగా ప్రేమించి, సేవించుటయే యగును. ఈ ప్రేమధర్మమే ఈశ్వర యోగి కిపుడు పరమధర్మము. ఏ మతము గాని, ఏ శాస్త్రము గాని ఇంతకు మించిన జీవనధర్మమును ప్రతిపాదించియుండ లేదు - అని శ్రీ అరవిందు డీ గీతా ధర్మమును వేనోళ్ళ ప్రశంసించును.

లోకసంగ్రహార్థము జ్ఞాని కర్మచేయవలెను (3-25)-అని చెప్పు వచనమునకు వెనుక నున్న హేతు విషద తెల్లము చేయబడినది. శాస్త్రము విధించుటచేత గాక,

సర్వమును ఈశ్వరునిగా - తనకును, సర్వమునకును మూలమగు ఈశ్వరునిగా - చూచుటచేత పెల్లుబుకుచుండు ప్రేమచేతనే అతడట్లు చేయును. ఇది సహజము, అనివార్యము కూడను. ఇట్లు గానిచో ఆత్మజ్ఞానము పరమాత్మ జ్ఞానములోనికి పరిణమించలేదనియే అర్థము.

మఱియు, ఆత్మరూపుడగు ఈశ్వరునితోను, పరమాత్మరూపుడగు ఈశ్వరునితోనే కాక, సర్వభూతస్థితుడగు ఈశ్వరునితోను - "మహేశ్వరునితోను" (5-29)- ఏకత్వమును బొంది, ఆ ఏకత్వమున ఆ ఈశ్వరుని సేవించువాడు (ఆ ఈశ్వరునివలెనే) ఎట్లు వర్తించినను ఆ ఈశ్వరునియందే వర్తించును గాని, మనః స్థితిలోనికి పడిపోడు. ఇది అభయస్థానము, ఇది ప్రభుతాపదము. ఇందు యోగియొక్క ముక్తియు, ఆనందమును నిష్క్రియతలో ముడుచుకొని యుండవు, ఉండవలసిన అగత్యము లేదు. ఇది ఈశ్వరయోగమునకు తృతీయ సోపానము, పరాకాష్ఠ.

"ఎట్లు వర్తించినను....." అని గీత ఇంత స్పష్టముగా వక్కాణించుచుండ, జ్ఞానమునందు కర్మయుండదు, భక్తి యుండదు : ఇదియే గీతామతమని ఎవరేని ఎట్లు చెప్పగలరు ?

అయినను శ్రీ శంకరుడేమి చెప్పెను? "సర్వభూతస్థితుడనగు నాతో ఏకత్వము నంది, ఎవడు నన్ను భజించునో" అని చెప్పు, (6-31) శ్లోకముయొక్క మొదటి సగమును ఆయన వ్యాఖ్యానించనే లేదు. ఈ సగము అంతకు ముందటి శ్లోకము(6-30) లోని సమ్యగ్దర్శనమునే తిరిగి చెప్పుచున్నదని మాత్రము అవతారికలో కేవలము పేర్కొనెను. ఎందుచేత వ్యాఖ్యానించలేదు ? సర్వభూతములు, అందలి ఈశ్వరుడు, ఆ ఈశ్వరుని యందు భక్తి : ఇవి యన్నియు నివృత్తిపరమగు జ్ఞాననిష్ఠలోనివిగావు, అందుకు బాహ్యములు. కావున వీనిని ఆయన వ్యాఖ్యానించక, దాటవేసెనని అనుకొనవలసివచ్చును.

పోతే, "ఎట్లు వర్తించినను నాయందే వర్తించును" - అను పదమును ఆయనెట్లు వ్యాఖ్యానించెను ? సాధకుడు సమ్యగ్దర్శనమును బొందెను గాన, అతని ముక్తికిపుడు ఎట్టి ప్రతిబంధమును లేదు. అతడు తన నిత్యముక్తత్వమును గుర్తించినాడు - అని వ్యాఖ్యానించెను। ఇట్లు ఈ వచనమునకు గూడ ఆయన కర్మతో సంబంధము లేకుండ చేసివేసెను।

అవతారిక : కనీసము నిమ్నప్రకృతి విషయములైన సుఖదుఃఖములనైనను యోగి విడిచివేయవలెను గదా? అదియును గాదు, వానిని సైతము ఆత్మదృష్టి సమతయందు యోగి ఆలింగనము గావించుకొనును —

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,**
**సుఖం వా యదివా దుఃఖం స యోగీ పరమో మతః. 32**

ఎవడు, అర్జునా, సుఖమైనను, దుఃఖమైనను సమదృష్టితో ఆత్మ రూపమున జూచునో, అతడు పరమ యోగి యని నా మతము.

విశేషార్థము : ఇది శ్రీ అరవిందుని అనువాదము. సర్వము ఆత్మయే అయినపుడు, సుఖదుఃఖములు గూడ ఆత్మయే అగును గాన, సమగ్ర ఆత్మదర్శి వానిని సైతము, అనగా వానితో గూడిన బాహ్యజీవితమును సైతము, ఆలింగనము గావించుకొనును.

పోతే, శ్రీ శంకరుని అనువాదమును జూడుడు : "తనతో పోల్చిచూచుకొని, తన కెట్లు సుఖము ప్రియమో, ఇతరులకు అట్లే యనియు లేక తన కెట్లు దుఃఖము అప్రియమో, ఇతరులకు అట్లే యనియు దలంచి, ఎవడు ఇతరుల కపకారము చేయక అహింసకుడై యుండునో, అతడు పరమ యోగి యని నా మతము."

అట్లు చూచి, యోగి అహింసకుడై యుండు నని మాత్రమే శ్రీ శంకరుడు చెప్పును గాని, ఇతరులకు సుఖమును సమకూర్చుటకును, దుఃఖమును దొలగించుటకును యోగి కార్యపరు డగు నని శ్రీ శంకరుడు చెప్పడు.

ఇచ్చట ఉభయుల అనువాదములలో నున్న మహదంతరమును గమనించ దగును.

గీత ఎచ్చటెచ్చట జ్ఞానమును జెప్పునో, అచ్చటచట దాని ఫలమగు కర్మను సైతము చెప్పును ఉదాహరణకు, ఆత్మజ్ఞానమును జెప్పి, "అందుచేత, ఓ అర్జునా, యుద్ధము చేయుము" (2-18)-అనియు, "విద్వాంసుడు లోకసంగ్రహార్థము అసక్తుడై కర్మచేయవలెను" (3-25)-అనియు ఈశ్వరజ్ఞాని సర్వభూతములయందునూ గల నన్ను సేవించును" (6-31)- అనియు జెప్పి, గీత జ్ఞానమును కర్మలోనికి మార్చును. ఇదియే నిష్పక్షపాతదృష్టికి గీతామతము.

ఒక మాట : యోగి స్వయముగా ద్వంద్వాతీతుడు గాన, అతని ఆత్మానందమున సుఖదుఃఖము లుండవు. అయితే ఇతరుల దుఃఖము సైతము ఆత్మపరిధి

లోనిదేగాన, అతడా దుఃఖమును జూచును మఱియు ఆ చూపుచేత వారి దుఃఖమును దొలగించుటకు ప్రేరితుడగును – అని శ్రీ అరవిందుని వివరణము.

అవతారిక : ఇపు డర్జునుడు ఈ సమతాయోగముయొక్క కష్టసాధ్యతను గుఱించి కొన్ని ప్రశ్న లడుగును –

అర్జున ఉవాచ –

యోఽయం యోగ స్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన,
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరాం. 33

అర్జును డడిగెను – సమతాలక్షణమగు ఏ యీ యోగము, ఓ మధుసూదనా, నీచే జెప్పబడినదో, మనస్సుయొక్క చంచలత్వముచే దాని స్థిరానుభవము నాకు పట్టువడకయున్నది.

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవ ద్దృఢం,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరం. 34

మనస్సు, ఓ కృష్ణా, చంచలము, క్షోభకరము, బలయుతము, సుదృఢము నైనది గదా ! కావున దానిని నిగ్రహించుట (కట్టివేయుట) వాయువును నిగ్రహించుట వలె మిక్కిలి కష్టసాధ్య మని నా అభిప్రాయము.

విశేషార్థము : మనోవ్యాపారమే ఆత్మను మఱుగుచేయు ఆవరణము కావున మనస్సు నిశ్చలమైననే గాని, సాధకుడు సమమగు ఆత్మను దర్శించి సమతను బొందలేడు. కాని మనస్సును నిశ్చలముగావించుట అసాధ్య మని తన పూర్వానుభవమును బట్టి అర్జునుని అభిప్రాయము.

శ్రీ భగవా నువాచ –

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం,
అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే. 35

శ్రీ భగవానుడు చెప్పెను – మహాబాహూ, అర్జునా ! సంశయము లేదు, చంచలమగు మనస్సును నిగ్రహించుట కష్టమే మఱి. కాని, ఓ కౌంతేయా, అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను దానిని వశము గావించుకొనవచ్చును.

విశేషార్థము : కామము లేనప్పుడు సైతము మనస్సు నిలబడదు కారణము, చంచలత్వము దాని స్వభావము. కనుక నా సహజ చంచలత బోవుటకు అభ్యాసము గూడ అవసరము.

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనాతు యతతా శక్యోఽవాప్తు ముపాయతః. 36

మనస్సు వశముగాని వానికి ఆత్మతో యోగప్రాప్తి అసాధ్య మని నా అభిప్రాయము. కాని మనస్సు వశమైన వాడు ఉపాయముతో ప్రయత్నించుచు, ఆ యోగమును సాధింపగలడు.

విశేషార్థము : పై శ్లోకములో నిగ్రహమును జెప్పి, ఇక్కడ మనోవశ్యతను మాత్రమే చెప్పుచున్నాడు. ఏలన మనస్సు వశముచేసికొనుటకే మున్ముందు మనో నిగ్రహము గాని, ఆ నిగ్రహమునే కొనసాగించి, దానిని శాశ్వతముగా అడచి వేయరాదు. ఆ ప్రయత్నము ఫలించదు సరిగదా (3-33), యోగము సాధ్యము కాదను అవిశ్వాసమునకు గూడ దారితీయును - అని శ్రీ అరవిందుడు.

"ఉపాయముతో" : ఉపాయ మన అభ్యాస వైరాగ్యములేనా ? అవు నని శ్రీ శంకరుడు. కాని "మనస్సును ఆత్మసంస్థము గావించి" (6-25) - అని వచ్చి యుండుటచే, మనస్సు ఆత్మను విషయముగా చూచుటకు ప్రయత్నించక, దానితో ఏకమై, దానియందుండుటయే ప్రధాన. పరమోపాయ మని మనము గ్రహింప వచ్చును.

అర్జున ఉవాచ -

అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః,
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి. 37

అర్జును డడిగెను - శ్రద్ధావిశ్వాసము లున్నప్పటికి, మనస్సు వశముగాని అయతి - మానసము యోగమున నిలువజాలక భ్రంశము నందును. అట్లు యోగ సంసిద్ధిని బడయజాలని ఆ అయతి గతి ఏమగును, కృష్ణా ?

కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి. 38

అయతియగు వాడు బ్రహ్మప్రాప్తి మార్గమున విమూఢు డగుటచే, అటు యోగసంసిద్ధిని గాని, ఇటు సంసారసంపత్తిని గాని బొందలేక, ఉభయ విభ్రష్టుడును, నిరాశ్రయుడునై, ఓ మహాబాహూ, కృష్ణా, చెదరిన మేఘ శకలమువలె (సర్వథా) నశించిపోడు గదా ?

ఏతం మే సంశయం కృష్ణ ఛేత్తు మర్హ స్యశేషతః,
త్వదన్యః సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే. 39

ఈ నా సంశయము నశేషముగా దొలగించుటకు నీకే అర్హత గలదు. ఏలన ఇతరు లెవ్వరును ఈ పని చేయజాలరు.

విశేషార్థము : అందరినివలెనే, యోగిని సైతము హృదయస్థుడవై నడుపు వాడవు నీవే గాన, యోగి యొక్క భావిగతి సైతము నీ కొక్కనికే తెలియు - నని అర్జునుని భావము.

శ్రీ భగవా నువాచ -

పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే,
నహి కల్యాణకృత్ కశ్చిద్ దుర్గతిం తాత గచ్ఛతి. 40

పార్థ ! ఇహలోకమున గాని, పరలోకమున గాని అతనికి (యోగభ్రష్టునికి) వినాశ మనునది యుండనేయుండదు. శుభము నాచరించువా డెవ్వడును అశుభమును - దుర్గతిని-బొందడు గదా !

విశేషార్థము : మామిడిగింజ వేసినవానికి మధురమగు మామిడిపండ్లే ఫలించును గాని, ప్రాణమును హరించు ఉమ్మెత్తకాయలు ప్రాప్తించవు. కారణము, ప్రపంచము నొక నియమము పాలించుచున్నది. ఆ నియమమును నిర్మించిన ఈశ్వరు డున్నాడు. కాన శుభమునకు ఫలము శుభమే గాని, అశుభము గాజాలదు.

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీః సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. 41

యోగమును పూర్తిచేయజాలని యోగభ్రష్టుడు పుణ్యాత్ముల లోకములను ప్రాపించి, అచ్చట చిరకాలము గడపి, తిరిగి శుచిమంతులు, శ్రీమంతులు నగువారి కుటుంబమున జన్మదాల్చును.

అథవా యోగినా మేవ కులే భవతి ధీమతాం,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశం. 42

లేక, బహుశః (శ్రీమంతులుగాని) ధీమంతులగు యోగులకులము నందు బుట్టును. నిశ్చయముగా నిట్టి జన్మ ఈ లోకమున కడు దుర్లభము.

విశేషార్థము : శ్రీమంతుల యిండ్లలో బుట్టుటచే అతని కిచ్చటను దుర్గతి యుండదు పుణ్యవంతుల లోకముల కేగుటచే అతని కక్కడను దుర్గతి యుండదు (6-40). పోతే యోగుల కులము పరమార్థమునకు సన్నిహిత మార్గము గనుక, అది సర్వమును మించిన సద్గతి.

అవతారిక : యోగదృష్ట్యా సైతము యోగభ్రంశ మెందుచే వినాశము గా దనిన —

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం,
యతతేచ తతో భూయః సంసిద్ధౌ కురునందన. 43

అట్లు శ్రీమంతుల గృహములందు లేక యోగుల కులమునందు జన్మించిన యోగభ్రష్టుడు పూర్వదేహమునందు సాధించిన బుద్ధివికాసముతో తిరిగి సంపర్కము నొంది, ఓ అర్జునా, మఱల అంతకంటెను అధికతర వికాసమునకు బ్రయత్నించును.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. 44

అప్పటి పూర్వాభ్యాసబలముచేతనే మఱల నతడు బలాత్కారముగా యోగ మార్గమునకు లాగబడును. కనుక కేవలము యోగము నెఱుంగగోరువాడు సైతము (సకామయజ్ఞమును జెప్పు) వేదమును మించిన వా డగును.

విశేషార్థము : వేదము త్రైగుణ్యవిషయము (2-45), కాని యోగి లక్ష్యము త్రిగుణాతీతమగు ఆత్మ మఱియు పరమాత్మ. కనుక యోగము నెఱుంగగోరువాడు సైతము వేదపరిధి నతిక్రమించినవాడే. అట్టి యోగఫలితము నిపుడు చెప్పును —

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేక జన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిం. 45

పట్టుదలతో సాధనచేయు యోగికి కల్మషములు క్షీణించిపోవును; అపు డతడు అనేక జన్మలలో క్రమముగా యోగసంసిద్ధిని బొంది, తత్ఫలితముగా పరమ స్థానమును ప్రాపించును

విశేషార్థము : సామాన్య మానవు డెంత ప్రయత్నించినను, శ్రీ అరవిందుని వంటి మహాయోగి స్థితి నందుకొనజాలడు - ఒకే జన్మలో. ఈ కఠిన సత్యము సాధకు లందరికి అనుభవసిద్ధమే కనుక శ్రీ అరవిందునివంటి యోగి అనేకజన్మ లెత్తియే యుండు నని తెలును. ఇది పునర్జన్మ గల దనుటకు ఒక ప్రమాణము.

అవతారిక : యోగి పరమస్థానమును బొందును గనుక —

తపస్విభ్యోఽధికో యోగీ, జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్య శ్చాధికో యోగీ, తస్మా ద్యోగీ భవార్జున. 46

తపస్వులకంటెను యోగి అధికుడు, జ్ఞానులకంటెను గూడ అధికుడు. అటులే కర్మలకంటెను అధికుడు. కనుక, ఓ అర్జునా, నీవు యోగివి కమ్ము.

విశేషార్థము : "జ్ఞానులకంటెను గూడ" – ఈ పదమును వ్యాఖ్యానించుచు, శాస్త్రజ్ఞానమాత్రము గల జ్ఞానులకంటెను యోగి అధికుడు – అని శ్రీ శంకరుడు.

కాని "గూడ" – అను విశేషణము యొక్క సామర్థ్యమును బట్టి, కేవలము శాస్త్రజ్ఞానులకంటెనే కాక, నిష్క్రియాత్మ జ్ఞానులకంటెను గూడ యోగి అధికు-డని శ్రీ అరవిందుడు. ఈ గీతాయోగమునందు దివ్యజ్ఞానము, దివ్యక్రియ, దివ్యసుఖము మూడును ఇమిడి యుండును. చూ. (4-3), అందుచేత యోగి అధికుడు.

అవతారిక : ఉత్తమ యోగి ఎవడు ?-

యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః.

యోగులందరియందును గూడ ఎవడు నా కర్పించబడిన తన సర్వాంతరాత్మతో నాయందు ప్రేమయు, శ్రద్ధయు గల్గి యుండునో, అతడు నాతో (భగవంతునితో) యోగమున యుక్తతము డని నా మతము.

విశేషార్థము : భక్తిచేత భగవంతునితో సాయుజ్యము సిద్ధించును మఱియు భగవంతునియందు సర్వము నిమిడియుండును – క్షరాక్షరములు రెండును ఇమిడి

యుండును; కావున భగవంతునితో సాయుజ్యము-ఏకత-సర్వాధికమైన సాయుజ్యము. అందుచేతనే భక్తుడు లేక భక్తియోగి యోగు లందరియందు సైతము యుక్తతముడు.

ఇట్లు భక్తియే గీతాయోగమునకు పరాకాష్ఠ. దీనిని గీత పలుమాఱు వక్కాణించి చెప్పును. ఇంతకు పూర్వమే గీత ఆత్మదర్శనమును (6-29), భగవద్దర్శనమును (6-30) జెప్పి, ఆ ప్రకరణకు పరాకాష్ఠగా భగవద్భజనమును జెప్పినది (6-31) తర్వాతను, ఉదాహరణకు, (18-55)న, మఱల దీనినే విస్పష్టముగా నుడువును.

అందుచేత గీతాయోగి తపస్సును తపస్సుకొఱకు గాక, జ్ఞానమును జ్ఞానము కొఱకు గాక, కర్మను కర్మకొఱకు గాక, సర్వమును భగవంతునితో సాయుజ్యము కొఱకే అన్వేషించును.

ఈ (6-47) శ్లోకము మొదటి ఆఱు అధ్యాయాలకు సమాపక వచనము మఱియు దీనియందే మిగిలినదాని బీజ మంతయు నున్నది. అనగా ఈ భక్తిబీజము తక్కిన అధ్యాయాలలో పెంపొందింపబడును. భక్తివిషయమగు భగవంతుడును, ఆ భగవంతునితో భక్తునకు గల సంబంధమును ఒక ఉత్తమ రహస్యము (4-3), ఒక పరమగుహ్యము (18-54). కావున వానిని గుఱించి ఎంత చెప్పినను, చెప్ప వలసిన దింకను మిగిలియే యుండును (10-42)-అని చెప్పి, శ్రీ అరవిందు డీ చరమశ్లోకమునకును, తక్కిన గీతాశాస్త్రమునకును గల సంబంధమును తెలుపును.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే
## ధ్యానయోగో నామ షష్ఠోఽధ్యాయః





# శ్రీ గీతా యోగము

## అథ సప్తమోఽధ్యాయః

## జ్ఞాన విజ్ఞాన యోగః

ఒక పరిశీలన : క్రిందటి అధ్యాయము యొక్క చివరి శ్లోకమున, అనగా గీతయందలి ప్రథమ షట్కము యొక్క చరమ శ్లోకమున, "నాకు సమర్పించ బడిన అంతరాత్మతో నన్ను శ్రద్ధగా భజించు భక్తుడు యోగులయందు సైతము యుక్తతముడు" – అని భగవానుడు సూత్రప్రాయముగా చెప్పెను. కాగా నిచ్చటి "నన్ను" యొక్క, అనగా భగవంతుని యొక్క, తత్త్వ మెయ్యది? అటులే అంతరాత్మకును భగవంతునికిని గల సంబంధ మెట్టిది? మఱియు భజనక్రమ మెయ్యది? – అను ప్రశ్నలు సహజముగానే అర్జునుని మానసమునందుదయించును. ఏలన ఈ ప్రశ్నలకు సమాధానము తెలిసిననే గాని, భగవంతుని జ్ఞానసహితముగా భజించుట కవకాశ ముండదు కావున ఆ ప్రశ్నలను ముందుగనే ఊహించి, దివ్యగురువు 7–వ అధ్యాయమున వానికి సమాధాన మిచ్చును. నిజానికి 6–12 అధ్యాయములతో గూడిన ద్వితీయషట్క మంతయు ఈ సమాధానములకే వెచ్చించ బడును.

ఈ అధ్యాయములం దిట్లు పరమపురుషుని స్వరూపమును ఒక విశాల ప్రాతిపదికపై ప్రతిపాదించి (7–5,6), ఆ ప్రాతిపదికపై గీత భక్తి జ్ఞానముల సమన్వయమును సాధించును (7–17 9–13). ప్రథమ షట్కమున ఆత్మ ప్రాతిపదికపై కర్మజ్ఞానముల నెట్లు సమన్వయపఱచెనో, గీత ద్వితీయ షట్కమున పరమపురుషుని ప్రాతిపదికపై భక్తి జ్ఞానముల నట్లు సమన్వయ పఱచును.

మంచిది, కాని గీత ముందున్న సమస్య కర్మసమస్య. అర్జునుడు యుద్ధ విముఖుడైనాడు, అతనిని తదున్ముఖుని గావించుటయే గీతా ఆశయము గదా. అయినపుడు గీత కర్మజ్ఞానముల పరాకాష్ఠగా భక్తి నెందుకు ప్రవేశపెట్టుచున్నది? ఎందుకన, భక్తి కర్మను ఈశ్వర స్తరమునకు లేపనెత్తును. ఎట్లు? భక్తి జీవాత్మకు

ఈశ్వరునితో సాయుజ్యమును సాధించును. ఈ సాయుజ్యమున జీవు డీశ్వరునితో తన సత్తయం దేకతను గాంచును: ఇది అద్వైతము. పోతే, అదే జీవుడు తన వ్యక్తిత్వమును ప్రకృతియందు ఈశ్వరునియొక్క ఒక ఆంశిక అభివ్యక్తిగా గాంచును (7-5 15-7): ఇది విశిష్టాద్వైతము అనగా జీవుని కర్మ లిపుడు జీవుని కర్మలు గావు, అవి జీవునిద్వారా జరుగు ఈశ్వరకర్మలు. ఈ స్థితియందు అర్జునుని కర్మలు నిజానికి అర్జునునిద్వారా జరుగు ఈశ్వరకర్మలు. ఇచ్చట అర్జునునికి ఎట్టి కర్మసంగము నుండదు. కావున ఎట్టి పాపభయము నుండదు. లోకసంగ్రహార్థము, అతడు ఈశ్వరేచ్ఛను తనద్వారా స్వేచ్ఛగా కొనసాగనిచ్చును; అథవా తనకు సత్తయందు ఈశ్వరునితో ఏకత కలదు గావున, తానే ఈశ్వరభావమున కర్మాతీతుడై లోకసంగ్రహార్థము కర్మచేయును - అనియు చెప్పవచ్చును.

ఇట్లు భక్తి సాయుజ్యముద్వారా అర్జునుని స్వీయకర్మను ఈశ్వరకర్మలోనికి లేవనెత్తును, మఱియు సర్వభూతస్థితుడగు ఈశ్వరునిపట్ల గల భక్తి-ప్రేమ - ఆ ఈశ్వరకర్మలకు ప్రేరకశక్తి యగును. అందుచేతనే అర్జునుని కర్మసమస్యను పరిష్కరించుటకు గీత యోగమునకు పరాకాష్ఠగా భక్తిని ప్రవేశపెట్టెను. ఇది దివ్యజ్ఞానముమీద ఆధారపడిన దివ్యపరిష్కారము భక్తి ఈజ్ఞానమునకు సాధకము, ఈ జ్ఞానకర్మలకు ప్రేరకము నగును. తనను గుఱించిన ఈ జ్ఞానము నిపు డీశ్వరుడు ప్రస్తావించుచున్నాడు -

శ్రీ భగవా నువాచ -

**మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్ మదాశ్రయః,**
**అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. 1**

శ్రీ భగవానుడు పలికెను-నాయందు లగ్నమైన మనస్సుతో, పార్థా! మఱియు నన్నే ఆశ్రయము చేసికొని, (నాతో) యోగమును సాధించుచు, సంశయలేశము గూడ లేక న న్నెట్లు సమగ్రముగా దెలిసికొనగలవో, ఆ విధానమును వినుము.

విశేషార్థము: "నన్నే ఆశ్రయము చేసికొని," - ఇచ్చట శ్రీ అరవిందు ననుసరించి, ఆశ్రయము = సచేతన సత్త మఱియు క్రియయొక్క సమస్త ఆధారము, నివాసము, ఆశ్రయస్థానము. అనగా అహంకారమును ఆధారము చేసికొని కాక, ఈశ్వరునే ఆధారము చేసికొని, ఈశ్వరస్థాయినుండియే కర్మచేయుచు, యోగి ఈశ్వర

సాయుజ్యమును బొందును. పోతే, కర్మ, యజ్ఞ, తపో, దానములలో దేనిని ఆశ్రయించక, ఈశ్వరునే ఆశ్రయించి కూర్చొనును, సమాధియం దుండును - అని శ్రీ శంకరుడు

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః,
యజ్ జ్ఞాత్వానేహ భూయోఽన్యజ్ జ్ఞాతవ్య మవశిష్యతే. 2

దేనిని తెలిసికొనిన ఇక నీ ప్రపంచమున తెలిసికొనవలసిన దేదియు మిగిలి యుండదో, విజ్ఞానసహితమగు నట్టి జ్ఞానమును నీ కిపుడు అశేషముగా జెప్పెదను -

విశేషార్థము : జ్ఞానము = పరమపురుషుని స్వరూప మేది గలదో, ఆ స్వరూపముయొక్క అపరోక్ష, ఆధ్యాత్మిక జ్ఞానము విజ్ఞానము = ప్రకృతి, పురుషుడు, మున్నగు ఆ పరమపురుషుని సృష్టితత్త్వములు-25 తత్త్వములు - ఏవి గలవో, వానియొక్క యథార్థ, ప్రత్యక్ష (intimate)జ్ఞానము-అని శ్రీఅరవిందుడు. ఈ రెండును గలిసి భగవంతునియొక్క "సమగ్ర" (7-1) జ్ఞాన మగును. ఇక వాసుదేవుడే సర్వము - "వాసుదేవః సర్వం" (7-19) - గనుక ఆ వాసుదేవుని సమగ్రజ్ఞానము ప్రాప్తించి నపుడు, సర్వము విదితమగును, సర్వజ్ఞత సిద్ధించును, తెలియవలసిన దేదియు మిగిలియుండదు.

పోతే, జ్ఞానము = శాస్త్రజ్ఞానము, విజ్ఞానము = అనుభవజ్ఞానము - అని శ్రీ శంకరుడు. ఇట్లు ఈయన సృష్టితత్త్వములను విడిచివేసి నట్లు గన్పించును. ఈ జ్ఞానము ప్రాప్తించినపుడు,కర్మాదిసాధన లన్నియు ఈ జ్ఞానమున అంతర్గతములు గాన (4-33), ఇక తెలియ దగిన ఏ ఇతర సాధనయు నుండదు. ఇట్లు సర్వజ్ఞత్వమును శంకరాచార్యుడు సాధనపరముగా అన్వయించును. కాని విజ్ఞాన మన తత్త్వముల జ్ఞాన మని తర్వాతి శ్లోకము స్పష్టముగనే చెప్పును,మఱియుశ్రీఅరవిందునికి జ్ఞానవిజ్ఞానములు రెండును అనుభవజ్ఞానములే.

మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే,
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః. 3

వేలకొలది మానవులలో నెవడో ఒకడు మాత్రమే సిద్ధికొఱకు ప్రయత్నము చేయును, ఇక నట్లు ప్రయత్నముచేసి, సిద్ధి బొందిన వారిలో సైతము ఎవడో ఒకడు మాత్రమే నన్ను నా సర్వసృష్టితత్త్వము లందును తెలిసికొనును.

విశేషార్థము : ఆత్మజ్ఞానము బొందిన సిద్ధులయందు సైతము ఎవడో, ఒకడు మాత్రమే భగవంతుని తత్త్వతః - తన తత్త్వములందు సైతము - దెలిసికొను వా డుండును. ఇట్లు భగవానుని సమగ్రజ్ఞానము కడు విరళము - అని శ్రీ అరవిందుడు. పోతే, మోక్షమునకు ప్రయత్నించువాడు సైతము సిద్ధు డనియే లెక్క - అని శ్రీ శంకరుడు. మఱియు తత్త్వతః = యథావత్తుగా (ఉన్నదున్నట్లుగా) - అని అర్థము చెప్పి, శ్రీ శంకరుడు తత్త్వముల ప్రసక్తినే రానీయలేదు.

ఇట్లు శ్రీ శంకరునికి, ముముక్షువే సిద్ధుడు; పోతే, ముక్తుడు పరమసిద్ధుడు. కాని శ్రీ అరవిందునికి, ముక్తుడు సిద్ధుడు మాత్రమే; పోతే, భగవంతుని ఆత్మ రూపముననే కాక, సమగ్రముగా దెలిసినవాడు పరమసిద్ధుడు, ఈ పరమసిద్ధునికి ఆత్మయే కాక, ప్రపంచము, క్రియ, ప్రకృతి - అన్నియు దెలియును. ఇతడే గీత ప్రతిజ్ఞచేసిన సర్వజ్ఞుడు (7-2), గనుక ఇదియే గీతార్థము.

అవతారిక : పైన నే తత్త్వముల ప్రసక్తి వచ్చెనో, గీత ఆ తత్త్వముల నిప్పుడు పేర్కొనును —

భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా. 4

అప రేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం,
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్. 5

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము - అని నా ప్రకృతి అష్టవిధము. కాని ఇది నా అపర (నిమ్న) ప్రకృతి మాత్రమే. దీనికంటెను అన్యమగు నా పర ప్రకృతి యొకటి గల దని తెలిసికొనుము. జీవు డగునది ఈ పరప్రకృతియే, జగత్తును ధరించున దీ పర ప్రకృతియే.

విశేషార్థము : అపర ప్రకృతి సాంఖ్యుల ప్రకృతి, అది గుణమయము, బాహ్యము. పర ప్రకృతి గీత అదనముగా ప్రతిపాదించిన దివ్యప్రకృతి, ఇది గుణాతీతము, ఆధ్యాత్మికము. ఈ గంభీర, మహత్త్వపూర్ణ విభేదమే గీతా యోగమునకు ప్రాతిపదిక. గీతాయోగ మంతయు అపరప్రకృతినుంచి పర

ప్రకృతి లోనికి పయనించి, ఎగసి, పరప్రకృతిచేత అపరప్రకృతిని రూపాంతర మొందించుటయే

సాంఖ్యప్రకృతి కేవలము భౌతిక ప్రకృతి యగుటచే, సాంఖ్యము పురుషునికి, ప్రకృతికి మధ్య ఒక అగాధమును నిల్పి, రెండును రెండు విభిన్న వస్తువు లని చెప్పవలసివచ్చెను. అటులే గీతయు అపర ప్రకృతి దగ్గఱ నాగిపోయి యుండిన, ఆత్మకును, విశ్వప్రకృతికిని మధ్య ఒక పరిష్కరింపరాని విరోధమును ప్రతిపాదించి యుండును. ఏలన అపుడు విశ్వప్రకృతి త్రిగుణముల మాయయే యగును, మఱియు విశ్వసృష్టి యంతయు ఈ మాయయొక్క నిర్మాణమే యగును ఇదియే శ్రీ శంకరుని మాయావాదము.

కాని గీతానుభవమునకు పరప్రకృతి యొకటి గలదు. ఇదియే విశ్వసృష్టికి వాస్తవ మూలము, దాని మూలభూత సృజనాత్మక బలము (force), మఱియు దాని మూలభూత కార్యనిర్వాహక శక్తి. పోతే, నిమ్నము,అజ్ఞము నగు అపర ప్రకృతి పర ప్రకృతియొక్క ఒక ఉత్పత్తి (derivation) మాత్రమే, దానియొక్క అంధకారావృతమగు ఒక ఛాయ మాత్రమే.

ఈ సర్వోన్నత క్రియాశక్తి యగు పరప్రకృతియందు నిమ్నప్రకృతియందువలె గాక, పురుషప్రకృతులు రెండును ఏకమగును. అచ్చట ప్రకృతి పురుషునియొక్క సంకల్పము మఱియు కార్యనిర్వాహకశక్తి మాత్రమే – అతని సత్తయొక్క క్రియాకలాపము మాత్రమే. అచ్చట ప్రకృతి పురుషునికంటె భిన్నమగు ఒక వస్తువు గాదు, శక్తిగతుడైన పురుషుడే

"జీవభూతాం" : పరప్రకృతి జీవభూతము – అని చెప్పబడినది గాని, జీవ మాత్ర మని చెప్పబడలేదు. అనగా జీవుడుగా అభివ్యక్తమయ్యెను, అంతే గాని, అది జీవప్రకృతిమాత్రమే గాదు. అది తన మూలమున ఏకమాత్ర పరమపురుషుని యొక్క పూర్ణప్రకృతి. జీవుడు పరమపురుషునియొక్క అంశికాభివ్యక్తి (15-7)- అని తర్వాత గీతయే చెప్పును. ఇట్లు విశ్వమునందు లేక అసంఖ్యాక విశ్వములందు గల జీవుల ప్రకృతినంతను దీసికొనినను, అది తన అభివ్యక్తియందు పరప్రకృతి గాజాలదు. వేఱుమాటలలో, జీవు లందరు గలసినను, తమ అభివ్యక్తియందు పరమ పురుషుడు గాజాలరు.

"ధార్యతే జగత్": ఈ పరప్రకృతియే జీవుల ఆధ్యాత్మిక స్వభావమైనది. ఈ స్వభావరూపమున నిదియే జీవపరిణామమునకు ఆధ్యాత్మి కాధారము. ఇట్లు విశ్వము తన సంభవనము (becoming) నందు పర ప్రకృతిచేత ధరింపబడు చున్నది

కోతే, శ్రీ శంకరుడు, పరప్రకృతి ఆత్మభూతము, క్షేత్రజ్ఞలక్షణము – అని వ్యాఖ్యానించెను. అనగా పరప్రకృతి ఆత్మయందు నివృత్తముగను. అంతఃస్థిత ముగను ఉండు ప్రకృతి. దీనినుండియే క్షేత్రజ్ఞుడు (జీవుడు), మున్నగు విశ్వము వెలువడి, మఱల దానిలోనే లయించును. అవును, ఈ ఆత్మప్రకృతి పరప్రకృతియే గాని, ఇదియే పరప్రకృతి గాదు–అని శ్రీ అరవిందుడు: పరప్రకృతి పరమేశ్వరుని చిచ్ఛక్తి, ఆది అక్షరాత్మలోపల నివృత్తియందును,క్షరాత్మలోపల ప్రవృత్తియందును ఉండును. అది ఉభయమునకు మూలము, మఱియు ఉభయముకంటెను అధికము.

ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా. 6

సర్వభూతములు, అర్జునా, ఈ పరప్రకృతినుండియే ప్రభవించుచున్న వని తెలిసికొనుము. నేనే సమస్త జగత్తునకు ప్రభవము (ఉత్పత్తిస్థానము) మఱియు ప్రళయము (లయస్థానము).

విశేషార్థము : ప్రథమ పంక్తిలో పరప్రకృతి జగత్కారణ మనియు, వెంటనే ద్వితీయ పంక్తిలో తానే జగత్కారణ మనియు భగవానుడు చెప్పుటచే, పరప్రకృతి పురుషోత్తములు ఒకటియే యనియు, అవి ఒకే వస్తువును చూచు రెండు విధానము లనియు మన మెఱుంగవలెను – అని శ్రీ అరవిందుడు

"ఏతద్యోనీని" : పరాపర ప్రకృతులు రెండును జగత్కారణ మని శ్రీ శంకరుడు చెప్పగా, పరప్రకృతియే జగత్కారణ మని శ్రీ అరవిందుడు ఏలన అపర ప్రకృతియు పరప్రకృతి యొక్క ఒక ఉత్పత్తియే, ఒక ఛాయయే. ఒకవేళ అపరప్రకృతి గూడ జగత్కారణ మైతే, అపర ప్రకృతి త్రిగుణమాయ గనుక, ఎవనికిని మాయను తరించుట సాధ్యమై యుండెడిది కాదు. మఱియు ప్రకృతికిని, తనకును శ్రీ కృష్ణుడు అభేదమును జెప్పెను గాన, ఇచ్చటి ఏతత్ – శబ్దమునకు అర్థము పరప్రకృతి యొక్కటియే గావలెను.

అవతారిక : నేనే (భగవంతుడే) జగత్తునకు మూలము గావున —

మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ,
మయి ప్రోత మిదం సర్వం సూత్రే మణిగణా ఇవ. 7

నాకంటెను పైన, అర్జునా, అన్య మేమియు లేదు. దారమునందు పూసల వలె, నాయందే ఈ కన్పించు సర్వమును కూర్చబడియున్నది.

విశేషార్థము : దారము వేఱు, పూసలు వేఱు; దారము పూసలకు ఆధారము మాత్రమే. కాని భగవంతుడు లేక పరప్రకృతి సర్వమునకు ఆధారము మాత్రమే గాక, సర్వమునకును మూలము మఱియు సర్వము గూడను. కనుక ఈ ఉపమానము కొంతమేరకే వర్తించు నని శ్రీ అరవిందుడు. ప్రతిజీవియు తన మూలస్వభావమునందీ పరప్రకృతియే (7-5), ఆ ఏకతయే అభివ్యక్తియందు సైతము బహుత్వమును ధరించుచున్నది (7-5).

అవతారిక : తన శుద్ధ ప్రకృతియొక్క ఏ యే రూపమున సర్వము కూర్చబడి యున్నదో, భగవాను డిపుడు తెలుపును—

రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాస్మి శశి సూర్యయోః,
ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు. 8

అర్జునా : నేను జలమందు రుచిని, సూర్యచంద్రులయందు కాంతిని, సర్వవేదములందును ఓంకారమును, నరులయందు నరత్వమును.

విశేషార్థము : జలముయొక్క గుణమగు రుచి జలముయొక్క శుద్ధ, సూక్ష్మ రూపమగు జల-తన్మాత్రము. భౌతికదృష్టికి మనకు గన్పించు జలము సత్యవస్తువనియు, రుచి దానిమీద నాధారపడియుండు గుణ మనియు అనిపించును. కాని ఆధ్యాత్మికదృష్టికి రుచియే సత్యవస్తు వనియు, జలము దాని స్థూలభావము మాత్రమనియు తెలియును. సూక్ష్మము స్థూలమునకు మూలము మఱియు దానిలో ప్రవేశించియుండి, మణులకు లోని దారమువలె, దాని కాధారము నగును. ప్రతిదానియందును గల సూక్ష్మశుద్ధాంశము, అనగా దాని ఆధ్యాత్మిక స్వభావము, పరప్రకృతి. ఆ రూపమున ప్రతిదానియందును సాక్షాత్తుగా భగవంతు డున్నాడు. మఱియు నా స్వభావమునుబట్టియే వస్తువుయొక్క బాహ్యసంభవనము (సంభూతి, becoming) సాగుచుండును. జలమును గుఱించి చేసిన ఈ వ్యాఖ్య పరంపరలోని ఇతర అంశములకు గూడ వర్తించును.

పుణ్యో గంధః పృథివ్యాంచ తేజ శ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు. 9

మఱియు నేను భూమియందు సుగంధమును, అగ్నియందు తేజస్సును, సర్వభూతములయందు జీవనమును, తాపసులయందు తపస్సును అయి యున్నాను.

విశేషార్థము : జీవన క్రియ ఏ జీవనశక్తిపై నాధారపడునో, అది జీవనము. ఆ శక్తిరూపమున భగవానుడు జీవన క్రియయందు ఉపస్థితుడై యున్నాడు.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనం,
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహం. 10

సమస్త భూతములయొక్క సనాతన బీజము నేనని, ఓ అర్జునా, నీవెఱుంగుము. అటులే బుద్ధిమంతుల యొక్క బుద్ధియు, తేజోవంతుల యొక్క తేజస్సును నేనే.

విశేషార్థము : బీజమునుండి వృక్షము వెలువడి నపుడు బీజము నశించును గదా. కావున బీజ మెట్లు సనాతనము కాగలదు? ఆధ్యాత్మిక బీజము సంగతి వేఱు. సమస్త బాహ్య పరివర్తనల యొక్క, మాఱుచుండియు నేకముగా నుండు, అంతర శక్తి అది. ప్రతి వస్తువు లోపలను ఆ వస్తువుయొక్క సారభూత (essential) గుణ మొక టుండును. బాహ్యగుణములు మాఱినను, అది ఎప్పటికిని స్వరూపనాశము నొందదు – అని శ్రీ అరవిందుడు. మూలసత్యము బహుళమగు ఏకము గాని, కేవలమగు ఏకము గాదు. మూలమునందే బహుళత్వము గలదు గాన, ఆ బహుళత్వము అభివ్యక్తియందును అటులే నిలిచియుండును, అనగా బహుళము లోని ప్రతిబీజము తన ప్రధాన ధర్మమును కోల్పోకయుండును.

బలం బలవతాం చాహం కామరాగవివర్జితం,
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ. 11

కామము, రాగము లేని బలవంతుల ఏ బలము గలదో, ఆ బలము నేను, మఱియు కురుకులశ్రేష్ఠా, అర్జునా, భూతములయందు తమ (స్వభావ) ధర్మమునకు విరుద్ధముకాని ఏ కామము గలదో, అదియు నేనే.

విశేషార్థము : బాహ్యసుఖములతో మన బలమున కే సంగము గలదో, ఆ సంగమును దొలగించి నపుడు మిగులు శుద్ధమగు బలము భగవంతుడు. మఱియు

ధర్మావిరుద్ధమైన కామము భగవంతుడే గనుక, సర్వకామము నిషిద్ధమే యని తలంప రాదు ఇట్లు దివ్యబలము, దివ్యకామము గలవు గాన, దివ్యజీవనము సాధ్య మని తెలియవలెను జీవన మంతయు బంధకారకమే, మిథ్యయే యను వాదమున కిది విరుద్ధము.

**యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే,**
**మత్త ఏవేతి తాన్ విద్ధి న త్వహం తేషు, తే మయి.12**

సత్త్వ రజస్తమోగుణముల వికారములగు ఏ సాత్త్విక, రాజస, తామస పదార్థములు గలవో, అవి నానుండియే ఉత్పన్నమైన వని ఎఱుంగుము. కాని నేను వానియందు లేను. అవి మాత్రము నాయం దున్నవి

విశేషార్థము : ఇచ్చట ప్రబలము, అయినను సూక్ష్మ మగు విభేదము పొడకట్టు నని శ్రీ అరవిందుడు చెప్పును నేను ఆధ్యాత్మిక ప్రకాశము, బలము, కామము, శక్తి, బుద్ధిని – అని చెప్పి, భగవానుడు వానినుండి జనించిన గుణమయ ప్రకాశము, బలము, కామము, శక్తి, బుద్ధి "నానుండి ఉత్పన్నమైన" వని వచించి, "నేను స్వరూపతః అవి కాను, మఱియు నేను వానియందు లేను, అయితే అవి నాయందు గలవు." – అని ముగించును.

అనగా, ఆధ్యాత్మిక ప్రకాశము, మున్నగు నవి భగవంతుని "స్వభావము", అంటే అవి సరాసరి తన భావమే (స్వ + భావము). ప్రతి జీవియందును గల ఈ స్వభావము తదతీతమగు ఈశ్వరభావము – "మద్భావము" (14-19) – నుండి సరాసరి నిర్గమించి, దానితో సరాసరి సంబంధము కలిగియుండును. పోతే స్వభావము నుండి గుణభావము ఉత్పన్నమగును సంక్షిప్తముగా, మద్భావమునుండి స్వభావము, స్వభావమునుండి గుణభావము.

ఈ క్రమమువలన మన కేమి తెలియును? గుణమయమగు అపరప్రకృతి యొక్క నిమ్నతర శక్తులు తమ మూలమును, తమ సత్యమును, తమ వాస్తవ ప్రవృత్తి నియమమును కనుగొనవలె ననిన, స్వభావము ద్వారా తమ మూలములగు పరప్రకృతి శక్తులలోని కెగయవలెను. అటులే జీవుడును – ఇప్పుడు నిమ్నప్రకృతి క్రియాకలాపములో బద్ధుడై యున్న జీవుడును–స్వభావముద్వారా ఈశ్వరభావములోని కెగసి, అచ్చట ఈశ్వరునివలె పూర్ణుడై, బాహ్యప్రకృతిని పైనుండి నడుపవలెను. గీత పరాపర ప్రకృతులను వివేచించి చెప్పుటకు ఫల మిదియే.

గుణభావములలో భగవంతుడు లేడనిన, అసలే లేడని కాదు, అందులో చిక్కుకొని లేడని అర్థము. అసలే లేకపోయిన, దానికి మనుగడయే ఉండదు గదా

అవతారిక : ఇపుడు సాత్త్వికాది గుణమయ భావముల ప్రభావమును జెప్పును —

త్రిభి ర్గుణమయై ర్భావై రేభిః సర్వ మిదం జగత్,
మోహితం నాభిజానాతి మామేభ్యః పర మవ్యయం. 13

ఈ మూడు సాత్త్వికాది గుణమయ భావములచేతను ఈ జగత్తంతయు మోహమునకు వశము గావింపబడి, వీనికంటె పరుడను, అవ్యయుడను అగు నన్ను గుర్తింపజాలకున్నది

విశేషార్థము : గుణమయ మగు అపర ప్రకృతి ఒక మాయ, అనగా భ్రాంతిని గల్గించు నొక శక్తి ఈ భ్రాంతి మన కొక విపరీత దృష్టిని బుట్టించును ఉదాహరణకు, ఈ భ్రాంతికారణముగా. అంతరాత్మ శరీరములో నున్న దనియు, అది బహుశః శరీరమునుండి పుట్టిన ఒక ఉపవస్తు వనియు మన మూహింతుము, మఱియు అనుభవింతుము. కాని నిజానికి శరీరమే అంతరాత్మలో నున్నది, శరీరమే ఆత్మనుండి పుట్టిన ఒక ఉపవస్తువు. ఇట్లీ గుణమయ ప్రకృతి మిథ్యాదృష్టిని సృష్టించి, అహంకారములోపల మనల నావరించివేసి, అహంకారమునకు పరమునందున్న ప్రభువును, మఱుగుపఱచును.

అయితే, గుణ ప్రకృతి ఒక మాయ యనిచెప్పినపుడు, అది అసలు లేనేలే దని కాని, అది అవాస్తవ వస్తువులతో వ్యవహరించునని కాని అర్థము కాదు. అది వాస్తవ వస్తువులతోనే వ్యవహరించును గాని, వాని పరస్పర సంబంధమును విపరీతముగా జూపును – అని శ్రీ అరవిందుడు. కాగా, మాయ మఱియు దాని సృష్టి జ్ఞానము గల్గినపుడు లేకయేపోవు నని శ్రీ శంకరుడు

అవతారిక : ఈ మాయను తరించుట ఎందు కంత కష్టముగా నున్నది?

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే. 14

గుణమయమగు నా యీ మాయ దైవమాయ గనుకనే, దాట కష్టసాధ్యమగు చున్నది. నా వైపుకు తిరిగి, నన్ను ఆశ్రయించిన వారు మాత్రమే ఈ మాయను తరింపగలరు.

విశేషార్థము : దైవమాయ = దేవునియొక్క, మాయావియగు ఈశ్వరుని యొక్క తానేయైన - "స్వభూతా" - మాయ - అని శ్రీ శంకరుడు. మాయ, ఈశ్వరుడే అయినపుడు, ఈశ్వరు నాశ్రయించి నప్పటికి మాయ నెట్లు తరించగలడు ? అని ప్రశ్న పుట్టును

పోతే, దైవమాయ=బ్రహ్మ విష్ణు మహేశ్వరు లగు ఏ దేవతలు గలరో, అడిగో వారి స్వరూపమునందున్న దేవునియొక్క మాయ - అని శ్రీ అరవిందుడు. అథవా గుణములయందు వాని మోహన క్రియకు అధారముగానున్న దేవుని మాయ అంతే కాని, గుణములకు పరమునందున్న దేవుని మాయ కాదు ఒకే భగవంతుడు గుణగతుడుగను, గుణాతీతుడుగను ఉండును గుణపరుడగు భగవంతుని మాయ(4-6) భ్రాంతిజనకము గాదు, పైగా భ్రాంతినాశకము, జ్ఞానదీపకము. కనుక నిమ్నమాయను ఉపయోగించుకొని, దాని ప్రయోజనము తీరినపుడు, దానికి ఆశ్రయులగు బ్రహ్మ విష్ణుమహేశ్వరులనుండి మఱలి, వారికి మూలమగు పరమేశ్వరునే మనము సాక్షాత్తు ఆశ్రయించవలెను. ఆ పరమేశ్వరు విద్యామాయ అవిద్యామాయను దాటుటకు మన కేడుగడ యగును శ్రీ శంకరుని వ్యాఖ్యానముపై జనించిన సంశయమును శ్రీ అరవిందు డెంత చమత్కారముగా తొలగించెనో, కన నగును.

అవతారిక : భగవంతు నాశ్రయించినవారు మాయను తరింతురు గదా, అయినపుడు అందరు నెందు కాశ్రయించరు ? ——

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయ యాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః. 15

పాపము నాచరించువారు, మోహవశులు, మానవులలో నిమ్నస్థాయికి జెందినవారు, మాయ తమ జ్ఞానము నపహరించి వేయగా, ఆసురప్రకృతి నాశ్రయింతురు గాన, నా వైపుకు దిరిగి న న్నాశ్రయించరు.

విశేషార్థము : ప్రకృతిని వశముచేసికొన బ్రయత్నించు అంతరాత్మకు విరుద్ధముగా నిమ్నప్రకృతి తామస, రాజస కామముల సంతృప్తికి చేయు కర్మలే పాపము. కాగా తామస, రాజస ప్రవృత్తులను క్రమముగా వశపఱచుకొనుచు, వానిపై సత్త్వాధిపత్యమునకు దారితీయు సత్త్వప్రధాన నైతిక కర్మలే పుణ్యము. మఱియు నిట్టి పుణ్యాత్ములు మాయనుండి బైటబడుచు, భగవంతుని భజింతురు ——

చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున,
ఆర్తో, జిజ్ఞాసు, రర్థార్థీ, జ్ఞానీచ భరతర్షభ. 16

నాలుగు విధములగు పుణ్యాత్ములు. ఓ పార్థా! నన్ను భజింతురు – ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి మఱియు జ్ఞాని.

విశేషార్థము : ఆర్తుడు = ప్రపంచ దుఃఖమునుండి రక్షణ గోరువాడు. జిజ్ఞాసువు = జ్ఞానము బొందగోరు వాడు. అర్థార్థి = ఏదియో యొక లాభమును గోరువాడు జ్ఞాని = జ్ఞానము బొందిన వాడు జ్ఞానము = భగవంతుని 'సమగ్ర'(7-1) జ్ఞానము.

1. ప్రాణిక - భావిక ప్రకృతియొక్క భక్తి, 2. వ్యావహారిక మఱియు సక్రియ ప్రకృతియొక్క భక్తి, 3. హేతుశీల బౌద్ధిక ప్రకృతియొక్క భక్తి, 4. అత్యున్నత అంతఃస్ఫూర్తిశీల (intuitive) సత్తయొక్క భక్తి - అని శ్రీ అరవిందుడు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం సచ మమ ప్రియః. 17

ఆ నలుగురిలోను – నలుగురి భక్తులలోను – జ్ఞాని భక్తుడు సర్వశ్రేష్ఠుడు. ఏలన అతడు భగవంతునితో నిత్యయుక్తుడు మఱియు నతని భక్తి అనన్యము. నేను జ్ఞానికి చెప్పలేనంత ప్రియుడను, అతడును అటులే నాకు ప్రియుడు

విశేషార్థము : "ఎవనికి నేను పురుషోత్తముడ నను జ్ఞానము గలదో, అతడు తన సర్వ - జ్ఞానముతోను, తన ప్రాకృతసత్తయొక్క సర్వప్రకారమునను నన్ను భజించును." (15-19). ఇది సమగ్రజ్ఞానము (7-1), మఱియు సమగ్ర ఆత్మసమర్పణ (18-66) తో గూడిన పరమభక్తి. జ్ఞానముతో గూడిన ఈ భక్తినే పెంపొందింప గీత ఇప్పుడు ఉపక్రమించుచున్నది – అని శ్రీ అరవిందుడు. పోగా, ఆత్మ ప్రియ మని సర్వులకు ప్రసిద్ధము, మఱియు వాసుదేవుడు జ్ఞానికి ఆత్మ, కనుక వాసుదేవుడు జ్ఞానికి ప్రియుడు - అని శ్రీ శంకరుడు నుడువును. కాని శ్రీ శంకరుడు పట్టుబట్టినట్లు, ఆత్మ నిజముగా నిర్వ్యక్తికమే అయితే, అది ఆత్మ అయినప్పటికి, ఎట్లు ప్రియము కాగలదు? కావున వాసుదేవుడు కేవలమాత్మయే అనుట పొసగదు; వాసుదేవుడు, గీతయు, శ్రీ అరవిందుడును పనిగట్టుకొని చూపునట్లు (15-18).

నిర్వ్యక్తిక వ్యక్తి (impersonal person) యే కావలెను గాని, కేవల నిర్వ్యక్తి కాత్మ కాదు.

పోతే, ఎందుచేత పురుషోత్తముడు జ్ఞాని కత్యంత ప్రియుడు ? శ్రీ శంకరుడు చెప్పు నట్లు ఆత్మయగుట మాత్రముచేతనే కాదు; జ్ఞానము బడసి నపుడు, జీవుడు తన ఆత్మయు, ప్రకృతియు - అంతయు పురుషోత్తముడే యని ఎఱుంగుటచేత.

జ్ఞానము బడసనపుడు, జీవుడు, అంతకు పూర్వముకూడ తాను పురుషోత్తమునితో యుక్తుడుగనే యుండె నని ఎఱుంగును అందుచేత జ్ఞాని నిత్యయుక్తుడు. ఈ నిత్యయుక్తత్వము సాధనాఫలితము గాదు. సాధన కేవలము దానిని తెలిసికొనెను.

వాసుదేవుడే సర్వము (7-19) గనుక, జ్ఞానికి భజనీయుడగు నితరుడు లేనే లేడు గావున, జ్ఞాని ఏకభక్తికుడు ( = ఒక్కనియందే భక్తి గలవాడు)-అని శ్రీ శంకరుడు చక్కగా దెలిపెను.

**ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతం,**
**ఆస్థితః సహి యుక్తాత్మా మామే వానుత్తమాం గతిం.18**

ఈ నాలుగు రకముల భక్తు లందరును ఉదారులే, కాని జ్ఞాని మాత్రము నే ననియే నా నిశ్చయము. ఏలన ఆతడు నాతో తన నేకము జేసికొని, పరమగతి యగు నన్నే చేరుటకు నాతో నేకత నందుటకు, ఉద్యమించియున్నాడు.

విశేషార్థము : "జ్ఞాని ఉద్యమించియున్నాడు"- ఇచ్చట రెండు అంతస్సులు గన్పించును. ఒకటి, జ్ఞానికి స్థానమైన ఆత్మ; రెండవది, జ్ఞాని పొందుటకు ఉద్యమించుచున్న పరమాత్మ లేక పురుషోత్తముడు (15-17) కనుక వాసుదేవుడు ఆత్మ మాత్రమే కాదని తేలును.

"ఆత్మైవ" : దీని అర్థము, జ్ఞాని నా ఆత్మయే - అని కాదు, జ్ఞాని నేనే- అని. [ఆత్మకు నే నను అర్థము సైతము గలదు.] దీనిని శ్రీ శంకరుడు గూడ చెప్పును. కనుక భక్తుడు, భగవంతుడు - ఇరువురు పరస్పరము అత్యంత ప్రియులగుటకు కారణము ఒకరి ఆత్మ మఱియొక రగుట గాదు, ఒకరు మఱియొక రగుటయే.

బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే,
వాసుదేవః సర్వ మితి స మహాత్మా సుదుర్లభః. 19

అనేక జన్మలకు పిమ్మట జ్ఞానవంతుడు నాలో సర్వాత్మనా ప్రవేశించును (18-55). వాసుదేవుడే సర్వ-మను సాక్షాత్కారము పొందినవాడు (అక్షరశః) మహాత్ముడు. అట్టి మహాత్ముడు కడు దుర్లభుడు (7-3).

విశేషార్థము : ఈ జ్ఞానము బౌద్ధిక జ్ఞానము గాదు, ఇది తాదాత్మ్యజ్ఞానము. కనుక ఈజ్ఞానియు వాసుదేవునివలె సర్వము నగును. అందుచేత అతడు మహాత్ముడు.

ఇది తాదాత్మ్య జ్ఞానమే యైనను, ఈ సమగ్రజ్ఞానము బొందిన పిమ్మట నైతము, అనేక జన్మలలో ఆ జ్ఞానమును సిద్ధపఱచుకొనిన గాని. వాసుదేవునితో ఏకతయు, ఆ ఏకతద్వారా సర్వముతో ఏకతయు ప్రాప్తించ దని శ్రీ అరవిందుడు తన అనుభవమునుండి పలుకును.

అవతారిక : వాసుదేవుని జ్ఞాన మెందుచేత దుర్లభ మన -

కామై స్తైస్తైర్ హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః,
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా.

కొందరు - అత్యధికసంఖ్యాకులు - తమ స్వీయ ప్రకృతిచేత ప్రేరితులై తదనురూపమగు ఆయా కామములను బొందజూతురు. ఈకామములు తమ ఆంతర జ్ఞానమును హరించివేయగా, కామప్రాప్తికొఱకు ఈ కామములకు సంబంధించిన దేవతలను వారు భజింతురు. ఆ భజనయందు తమ ప్రకృతి కనురూపమగు ఆయా నియమములను ఏర్పఱచుకొందురు.

విశేషార్థము : బాహ్యకామములు ఆంతరజ్ఞానమును హరించివేయును గాన, ఆ కామములే వాసుదేవుని జ్ఞానము దుర్లభమగుటకు గారణము. అట్టి కామములు గలవారి కింకను వాసుదేవుని సరాసరి భజించుట కర్హత ప్రాప్తించలేదు గావున, ఆ భజనకు సాధనముగా భగవానుడు ఇతరదేవతాభజనమును తానే ప్రోత్సహించును. ఇదియే శ్లోకము (4-11) న కర్థము.

యోయో యాంయాం తనుం భక్తః శ్రద్ధ యార్చితు మిచ్ఛతి
తస్యాత స్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహం. 21

కామియగు ఏ యే భక్తుడు ఏ యే దేవతా రూపమునందు తనకు గల శ్రద్ధ చేత ఆ యా దేవతారూపమును పూజింపగోరునో, ఆ యా భక్తునికి ఆ యా శ్రద్ధనే మఱింత స్థిరపఱతును (4-11).

స తయా శ్రద్ధయా యుక్త స్తస్యా రాధన మీహతే,
లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్హి తాన్. 22

అపు డత డా స్థిరశ్రద్ధతో గూడుకొని, ఆ దేవతారూపము నారాధించి, ఆ రూపమునుండి తన కామములను బొందును. ఏలన అవి నాచేత సమకూర్చ బడినవి.

విశేషార్థము : కర్మఫల విభాగము నెఱింగిన ఈశ్వరుడే కర్మఫలము నీయవలెను. మఱియు నత డిచ్చిన కామములను పొందక తప్పదు గాన, ఆ కామి భక్తు డా కామముల నవశ్యము పొందును, పొందక తప్పదు - అని అర్థము. ఇది శ్రీ శంకర వ్యాఖ్య

పోతే, ఆ దేవతల రూపమున ఆ కామముల నేనే సమకూర్చుటకు గారణ మేమన, అపూర్ణ మానవ మేధ నన్ను స్పృశించుటకు ఆ దేవతారూపము లొక మాధ్యమము (medium) మఱియు ఆ కామములు మానవుడు నా వైపునకు దిరుగుట కొక ప్రథమ సాధనము, మఱియు సర్వభక్తికి పరమ ఆవశ్యకతయగు శ్రద్ధ ఈ నిమ్న భక్తియందు సైతము నుండును - అని శ్రీ అరవిందుడు.

ఇట్లు భగవంతు డేమి చేయునో శ్రీ శంకరుడు చెప్పగా, ఎందుకు చేయునో శ్రీ అరవిందుడు వివరించెను.

అవతారిక : దేవతల భక్తులకు సైతము శ్రద్ధను దృఢపఱచునది భగవంతుడే, ఫలము నిచ్చునది భగవంతుడే; అయినను ఆ ఫలము తన భక్తులు బొందు ఫలము కంటెను ఎంతో నికృష్టము —

అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసాం,
దేవాన్ దేవయజో యాంతి, మద్భక్తా యాంతి మామపి.

ఆయా దేవతలను యజించువారి ప్రజ్ఞ కడు స్వల్పము, అటులే వారు పొందు ఫలము కడు పరిమితము. ఎట్లన దేవతాయాజకులు దేవతలను పొందుదురు. కాగా నా భక్తులు నన్నే పొందుదురు.

విశేషార్థము : దేవతలను యజించు వారి ప్రజ్ఞకు విషయము స్వల్పమగు దేవతలును, స్వల్పమగు కామములును గాన, ఆ ప్రజ్ఞయు స్వల్పమే.

దేవతలను పూజించువారు సైతము ఆ దేవతారూపమున నున్న భగవంతునే నిజానికి పూజించుచున్నను, ఆ విషయము వారికి దెలియదు. అందుచేత వారికి లభించుఫల మంతవంతము (9-24).

"నా భక్తులు నన్నే పొందుదురు"-ఇచ్చటి 'నా' దేహము ధరించిన కృష్ణుని చెప్పను-అని తర్వాతి శ్లోకముచే తెలియును -

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః
పరం భావ మజానంతో మ మావ్యయ మనుత్తమం. 24

అవ్యక్తము, అవినాశి, నిరతిశయము నగు నా ప్రపంచాతీతస్వరూపము నెఱుంగక, ఆధ్యాత్మిక బుద్ధి లేని మందబుద్ధులు నన్ను వ్యక్తమైన మానవ మాత్రునిగా దలంతురు (9-11).

విశేషార్థము : అందుచేత వారు నన్నాశ్రయించరు (7-15). మఱియు దేవతలయందు అవ్యక్తముగా నున్న నా పరమస్వరూపము నెఱుంగక, వ్యక్తమైన దేవతలే భగవంతు డని తలంచి, వా రా దేవతల నాశ్రయింతురు (7-20).

అవతారిక : భగవంతుని అవ్యయస్వరూపము దెలియకపోవుటకు గారణ మే మనిన —

నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః,
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయం.

యోగమాయచేత పూర్తిగా నావరింపబడి యుండుటచే, నే నందరికిని కన్పించు వాడను గాను. ఆ మాయచేత మోహితులై ఈ జనులు నా అజ, అవ్యయ స్వరూపమును గుర్తించజాలకున్నారు.

విశేషార్థము : యోగమాయ యనగా, యోగము = గుణముల యుక్తి, ఘటనము, క్రియాకలాపము; అదియే మాయ, అనగా గుణవ్యాపారము బుట్టించు భ్రమమే మాయ - అని శ్రీ శంకరుడు. అన్యత్ర ఈ అర్థము నంగీకరించుచునే, శ్రీ ఆచార్యుల దిక్కడ మఱియొక గంభీరార్థమును దెలుపును. ఏమన —

యోగమాయ = భగవంతుని యోగము, సంయోగముయొక్క మాయ. అనగా, భగవంతుడు ఈమాయాశక్తిచేత ప్రపంచముతో సంయోగమునందుండుచునే, ప్రపంచమున కతీతముగా నుండును, ప్రపంచమునందు అంతర్వర్తిగా నుండుచునే, దానికంటెనుండి దాగియుండును, హృదయములందు అవస్థితుడై యుండుచునే, సామాన్య జనసమూహమునకు ప్రకాశము గాడు ఇట్లు శ్రీ శంకరుని నిర్వచనము యోగమాయయొక్క ఆవరణ పార్శ్వమును జెప్పగా, శ్రీ అరవిందుని నిర్వచనము దానియొక్క సాధనభూతపార్శ్వమును జెప్పును అనగా ఏకకాలమున అంతర్వర్తిగాను అతీతముగాను ఉండుట కది ఎట్లు సాధనమో, ఆ పార్శ్వమును జెప్పును. అనగా బహిర్ముఖ కామికి అది ఆవరణము, అంతర్ముఖ పూర్ణజ్ఞాని కది సాధనము, సంగ రహిత దివ్యజీవనమునకు సాధనము.

ఇట్లు, యోగము = సంయోగము-అను ముఖ్యార్థమునకు సరిపడు వ్యాఖ్యచేసిన ఘనత శ్రీ అరవిందునకు దక్కును.

అవతారిక : తన యోగ మాయచేత భగవంతుడు అతీతుడుగా గూడ నున్నాడు గాన -

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున,
భవిష్యాణి చ భూతాని, మాంతు వేద న కశ్చన. 26

గతించిన, ఇప్పటి మఱియు భావి భూతముల నన్నింటిని నే నెఱుంగుదును; కాని నన్ను మాత్ర మెవడును ఎఱుగడు.

విశేషార్థము : కాలాతీతమునందు కాలవిభాగములు మూడును ఏకమగును. అక్కడ అంతయు నిత్యవర్తమానము. కనుక అతీతునికి త్రికాలదర్శిత్వము సిద్ధమై యుండును. "నన్ను ఎవ్వడు నెఱుంగ" డనిన గుణాతీతుడు గాని వా డెవ్వడు నన్నెఱుంగ డని అర్థము.

అవతారిక : ఏ మోహముచేత భగవంతు నెఱుంగకున్నా డనిన -

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత,
సర్వభూతాని సంమోహం సర్గే యాంతి పరంతప. 27

ఇచ్ఛ మఱియు ద్వేష మను ద్వంద్వమునుండి, అర్జునా, ఏ మోహము కలుగు చున్నదో, అదిగో, ఆ మోహముచేత సర్వభూతములు తమ పుట్టుకయందే (వివేచించి తెలిసికొనుట కవకాశ మీయని) సంమోహమును పొందుచున్నవి.

విశేషార్థము : ద్వంద్వములు తమకు దామే సంమోహమును బుట్టించవు. ద్వంద్వములు సృష్టిప్రక్రియ కవసరము, మఱియు నట్టి సృష్టియందు మోహరహిత మగు జీవితమున కవకాశ మున్నది (7-28). అయితే మోహమును బుట్టించు ఒక్క ద్వంద్వము మాత్ర మున్నది - ఇచ్ఛాద్వేషములే ఆ ద్వంద్వము. ఉదాహరణకు మానావమానములను ద్వంద్వ మున్నది. అది స్వతః మోహము గల్గించదు. కాని మానముపట్ల ఏ యిచ్ఛ, అవమానముపట్ల ఏ ద్వేషము గలవో, అవియే మనస్తాపమును గల్గించును. ఈ తాపమే మోహకారణము, మోహము, అవివేకావస్థ. ఈ అవివేకముచేతనే ప్రకృతియందు దాగియున్న భగవంతుని తెలియజాలకున్నాము.

అవతారిక : ఇపుడు భగవంతుని తెలిసికొను క్రమము చెప్పబడును —

యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణాం,
తే ద్వంద్వమోహ నిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః. 28

కాని పుణ్యకర్మల నాచరించుటచేత ఎవరి పాపము క్షీణించి, నాశ మొందినదో, వారు ద్వంద్వమోహమునుండి బైటబడుదురు, మఱియు నపుడు నన్ను గట్టిపట్టుతో భజింతురు.

విశేషార్థము : ఇట్లు మానవులు ముందు నైతిక జీవనమును నెరపవలెను, అనగా సత్త్వగుణ కార్యమగు పుణ్యము నాచరించి, రజస్తమోగుణ కార్యమగు పాపమును తుదముట్టించవలెను. పిమ్మట నైతిక నియమమును గూడ దాటి, పైకి వెళ్లి, ఆత్మయొక్క ఆధ్యాత్మిక ప్రకృతియందు నివసించవలెను. ఈ ప్రకృతి ద్వంద్వాతీతము గాన, అతడును ద్వంద్వాతీతు డగును. అనగా నిపు డతనికి, "నేను పుణ్యవంతుడను లేక నేను పాపాత్ముడను" అను భావ ముండదు, పరంతు తన సమున్నత ఆధ్యాత్మిక ప్రకృతియందు భగవదిచ్ఛ ననుసరించి (3-30), లోకహితార్థము (3-25) కర్మల నాచరించును. ఇదియే భగవద్భజన, లేకపోతే భగవద్భజనయొక్క సహజపరిణామము.

ఇట్లు గీత కర్మజ్ఞానములనే కాక, సాధకుని నుండి భక్తిని కూడ అపేక్షించుచున్నది – భక్తి యన భగవంతుని సేవ, ఆరాధన, భగవంతునియందు ప్రేమ, మఱియు భగవంతునితో తిరిగి సంయోగము బొంద అంతరాత్మ యొక్క తపన. ఈ విధముగా ప్రథమ షట్కము నందలి కర్మజ్ఞాన సమన్వయము ఇచ్చట కర్మజ్ఞాన భక్తి సమన్వయ మగును

అవతారిక : ఆత్మలేక బ్రహ్మజ్ఞానమును బొంది సాధకుడు భగవంతుని భజించును, మఱియు ఆ జ్ఞానమును సైతము భగవంతు నాశ్రయించి పొందును—

జరామరణ మోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే,
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మచాఖిలం. 29

ఎవరు నన్ను ఆశ్రయించి సాధన చేతురో, వారు జరామరణముల నుండి మోక్షమున కావశ్యకమగు బ్రహ్మజ్ఞానమును, సమస్త అధ్యాత్మ జ్ఞానమును, సకల కర్మజ్ఞానమును బొందుదురు,

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః,
ప్రయాణకాలేఽపిచ మాం తే విదు ర్యుక్తచేతసః. 30

మఱియు (నన్ను ఆశ్రయించిన) వారు నన్ను దెలిసికొందురు. ఇంకను అదే సమయమున సత్తయొక్క భౌతికప్రకృతిని (అధిభూతమును), దైవప్రకృతిని (అధిదైవమును), మఱియు యజ్ఞప్రభువుయొక్క సత్యమును (అధియజ్ఞుని) దెలిసికొందురు. అందుచేత ప్రయాణకాలముయొక్క నిర్ణాయక క్షణమునందు సైతము వారు నా జ్ఞానమును గలిగియుందురు, మఱియు నాతో సర్వాత్మనాయుక్తులై యుందురు. (కావున వారు నన్నే పొందుదురు) (8-5).

విశేషార్థము : ఇది శ్రీ అరవిందుని ప్రకాశప్రద అనువాదము. ఆ ప్రకాశమే మనిన, పురుషోత్తముని మార్గమున బ్రహ్మాదుల జ్ఞానము మనకు, అందులో అంతర్భాగముగానే, లభించును. అతనిని ఆశ్రయించిన వారు బ్రహ్మాదుల నెఱుంగుదురు – అని చెప్పిన దాని కర్థ మిదియే.

ఇంకను 30-వ శ్లోకముయొక్క అనువాదము "మఱియు" అను పదముతో ప్రారంభించి, భగవంతుని ఆశ్రయించినవారు బ్రహ్మజ్ఞానముతో ఆగిపోరని శ్రీ అరవిందుడు మనకు చెలుపును. దీని భావమేమన, మోక్షముగోరు వారు బ్రహ్మజ్ఞానముతో నాగిపోయి, ఆ నిర్వ్యక్తిక బ్రహ్మములో తమ వ్యక్తిత్వమును గోల్పో నవసరము లేదు, ఆ మోక్షమును వ్యక్తిత్వసహితముగానే వారు పరమ పురుషుని సర్వోన్నత స్థితియందు బొందగలరు, పొందుదురు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే

జ్ఞానవిజ్ఞానయోగో నామ సప్తమోఽధ్యాయః





# శ్రీ గీతా యోగము

## అథ అష్టమోఽధ్యాయః

## అక్షర బ్రహ్మ యోగః

ఒక పరిశీలన : శంకరాచార్యు డీ అధ్యాయమును 'అక్షర బ్రహ్మ నిర్దేశః' అని పిలచును. కొందరు దీనిని 'అక్షర బ్రహ్మయోగ' మందురు. కాగా శ్రీ అరవిందుడు దీనిని 'పరమపురుషయోగ' మనును. ఏలన ఈ అధ్యాయము సత్తామాత్రమగు అక్షర బ్రహ్మమునే కాక, తదక్షర బ్రహ్మమును, పర ప్రకృతియు నెవని తత్త్వములో, అట్టి పరమపురుషుని జెప్పును. 7-వ అధ్యాయము ఈ పరమపురుషుని ప్రస్తావించి, అతని పూర్ణతర జ్ఞానమును 8-వ అధ్యాయమున కప్పగించినది.

7-వ అధ్యాయమును సమీక్షించిన, అచ్చట మనకు రెండు ప్రధానభావములు గోచరించును – 1. కిరణభావము. భగవంతుడే సర్వజీవులకు ప్రభవస్థానము (7-5) గావున, ప్రతి జీవుడును అతనియొక్క ఒక కిరణము, ఒక అంశము (15-7), అభివ్యక్తియందు ఒక అంశము. 2. ప్రకృతిద్వయ భావము గీత అపర ప్రకృతినే కాక, పర ప్రకృతి నొక దానిని చెప్పును. ఇది భగవంతుని ఆధ్యాత్మిక మూలప్రకృతి. ఈ ప్రకృతిచేతనే భగవంతుడు జీవుడుగా అభివ్యక్తు డయ్యెను (7-5) దీనియందు జీవుడు భగవంతునితో ఏకముగా నుండును. పోతే జీవు డపర ప్రకృతియందు అహంకారము మఱియు అజ్ఞానముల కలవరములకు లోనై తన మూలమగు భగవంతునిమండి విముక్తు డగును, నానా క్లేశము లనుభవించును

కావున అపర ప్రకృతినుండి వెలువడి, జీవుడు పర ప్రకృతిలో ప్రవేశించి, భగవంతునితో తన ఏకతను తిరిగిపొందుటయే అతని సంసిద్ధియగును. ఇది సంసిద్ధి యేలయన, తన మూలమగు భగవంతునితో ఏకమై నపుడు, జీవుడు తన వ్యక్తిత్వ మును గోల్పోడు. పైగా భగవంతునితో అనన్యమగు తన సంపూర్ణ వ్యక్తిత్వ మును బొందును, భగవంతునివలె తానును పూర్ణమని తెలిసికొనును – "పూర్ణ మదః, పూర్ణ మిదం" (బృ. ఉ.)

ఇది గీత మనకు నూతనముగా, తన పరప్రకృతి ప్రతిపాదనచేత, జూపిన నూతన మార్గము. ఇది పరిపూర్తిమార్గము, నిషేధమార్గము గాదు. ఇచ్చట, నేతినేతి - యను విశ్వప్రకృతి నిషేధమార్గమున అపరప్రకృతినుండి ఉపసంహరించు కొని, జీవుడు నిర్వ్యక్తిక బ్రహ్మమునందు తన వ్యక్తిత్వమును గోల్పోడు; అతడు బ్రహ్మమునందు తన అహంకారమును మాత్రమే లయముగావించి, ఇంకను పైకెగసి, పరమపురుషునియందు తన పూర్ణ వ్యక్తిత్వమును బొందును.

ఇందులకు ఈ పరమపురుషుని సమగ్రజ్ఞాన మావశ్యకము, అనగా నితని సర్వతత్త్వములందును జీవు డితనిని దెలియవలెను. కనుక 8-వ అధ్యాయము 7-వ అధ్యాయాంతమున ప్రస్తావించబడిన ఆ సృష్టితత్త్వముల జ్ఞానముతో ప్రారంభ మగును.

అర్జున ఉవాచ -

కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ,
అధిభూతంచ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే. 1
అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన,
ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః. 2

అర్జును డడిగెను - ఓ పురుషోత్తమా! ఆ బ్రహ్మ మేది యగును? అటులే ఏది అధ్యాత్మము? ఏది కర్మము? ఇంకను దేనిని అధిభూత మందురు? మఱియు అధిదైవ మన నేమి? తర్వాత, ఈ దేహమునందు అధియజ్ఞు డెవరు, అతనిని తెలిసికొను టెట్లు? చివరకు, ప్రాణ ప్రయాణకాలమున యోగులు నిన్నెట్లు తెలిసికొనగలరు?

శ్రీ భగవా నువాచ -

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే,
భూతభావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః. 3
అధిభూతం క్షరో భావో పురుష శ్చాధిదైవతం,
అధియజ్ఞోఽహమే వాత్ర దేహే దేహభృతాంవర. 4

శ్రీ భగవానుడు దెలిపెను - అర్జునా! ఏ పరమ అక్షర (మార్పు జెందని) తత్త్వము గలదో, దానినే బ్రహ్మము లేక ఆత్మ యందురు. ఈ ఆత్మసత్తయొక్క ఏ మూలస్వభావము (స్వ + భావము = స్వీయ సంభూతితత్త్వము) గలదో, అదియే అధ్యాత్మము. పోతే కర్మ యన ఈ స్వభావముయొక్క సృజనాత్మక శక్తి (= విసర్గః). ఈ కర్మయే స్వభావానుగుణముగా సర్వభూతములను, క్షరమగు (మారుచుండు) వాని అంతర బాహ్యరూపములను రూపొందించును కర్మచేత స్వభావమునుండి వెలువడిన ఈ క్షరభావమే అధిభూతము ( = భూతముల బాహ్య ప్రకృతి) ఈ క్షరభావములోనికి దిగిన దైవాంశ (15-7) యేది గలదో, అదియే పురుషుడు, ఆ పురుషుడే అధిదైవతము ఇతని ఉనికిచేతనే కర్మక్రియ యంతయు హృదయస్థుడగు భగవంతునికి చేయబడు యజ్ఞరూపము ధరించును. లోపల రహస్యముగా ఈ యజ్ఞమును స్వీకరించు భగవంతుడే అధియజ్ఞుడు.

విశేషార్థము : 'పరమం అక్షరం' - పరమం = సర్వోన్నతము కావున అక్షరమే సర్వోన్నత తత్త్వ మని శ్రీ శంకరుడు. పోతే, భగవంతుని యొక్క అభివ్యక్తిరూపము లనేకములు గలవు. ఆ రూపములలో అక్షరాత్మ సర్వోన్నతము. అందుచేతనే భగవానుడు తన విభూతి పరిగణనయందు ఆత్మను ప్రథమముగా జెప్పును (10-20). కనుక అక్షరము సర్వోన్నత తత్త్వము గాదు. అభివ్యక్త తత్త్వములలో సర్వోన్నతము మాత్రమే యని మనము శ్రీ అరవిందుని వ్యాఖ్య నుండి గ్రహించగలుగుదుము మఱియు ఈ పరంపరలోనే 4-వ తత్త్వము క్షరభావము ఈ క్షరభావమునకు వ్యతిరేకము అక్షరము. ఈ క్షరాక్షరములు రెండును తదతీతుడగు భగవంతుని తత్త్వములు (15-17).

పురుషుడు ఇంద్రియ క్రియలకు అనుమతి నిచ్చువాడు, అనగా నతడు సాక్షిమాత్రుడు - అని శ్రీ శంకరుడు అతడు క్షరగతుడు, పరిణామశీలుడు నగు క్షరపురుష డని శ్రీ అరవిందుడు ఇతడు క్షరమునందున్నపుడు క్షరుడు, అక్షరమునందున్నపుడు అక్షరుడు, ఉత్తమునియం (15-17) దుభయము నగును (13-23).

**అంతకాలేచ మామేవ స్మరన్ ముక్త్వా కలేబరం,**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః.**

అంతకాలమునందు సైతము నన్నే స్మరించుచు, ఎవడు దేహమును విడిచి వెళ్ళునో, అతడు, సందియము లేదు, నా భావమును బొందును.

విశేషార్థము : 'నా భావము'=పురుషోత్తముని భావము, పురుషోత్తముని సత్తాస్థితి, పురుషోత్తమత్వము. అనగా నతడు మానవత్వమును వీడి పురుషోత్తమత్వమును బొందును. ఇది ఒకవిధముగా పురుషోత్తము డగుటయే. ఏలన ఇచ్చట అంతరాత్మ తన ప్రకృతియొక్క ఒక చరమపరివర్తన ద్వారా పురుషోత్తముని ప్రకృతితో యుక్తమగుచున్నది.

పరిణామక్రమమున అంతరాత్మ అపరప్రకృతియందు ఆ యా భావములను– "తంతం భావం" (8-6)–బొంది, నెమ్మదిగా "స్వభావమును" (8-3) తెలిసికొని, పొంది, చివరకు తన పరిణామముయొక్క పరాకాష్ఠగా భగవద్భావమును – "మద్భావం" (8-5)–బొందును. ఈ 'మద్భావమును' బొందుట అంతరాత్మకు చరమ పరమసంభూతి – అని శ్రీ అరవిందుడు. పోతే, "నా భావమును బొందును"= భగవంతుని స్వరూపమును బొందును – అని శ్రీ శంకరుడు. స్వరూప మన సత్తామాత్రము. ఇచ్చట ప్రకృతి ప్రసక్తి లేదు. కాని 'భావ' మన్నపుడు ప్రకృతి ప్రసక్తి యుండితీరవలెను. ఉదాహరణకు, మానవభావ మనిన మానవప్రకృతితో గూడిన సత్తాస్థితి.

**యంయం వాఽపి స్మరన్ భావం త్యజ త్యంతే కలేబరం,**
**తంత మేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః. 6**

ఎవడు తన జీవితకాల మంతయు ఏ భావమును (స్థితిని) భావించి యుండి, అంత్యక్షణమున ఆ భావమునే స్మరించుచు దేహమును విడుచునో, అర్జునా, అతడా భావమునే బొందును.

విశేషార్థము : ప్రయాణకాలమున ని న్నెట్లు తెలిసికొనవలెను ? (8-2)-అని అర్జును డడిగిన ప్రశ్నకు సమాధాన మిట వచ్చినది. భగవంతుని బొందుటకు రెండు నియమములు– 1. అంత్యస్మరణము, 2. తద్భావభావనము, అనగా జీవితము పొడవునను భగవంతునే భావించుచు, తన అంతరంగమును భగవద్రూపమున రూపొందింప కొనవలెను. అట్లు చేసిన అంత్యకాలమున నైతము భగవంతుని జ్ఞాన ముండును. నిజానికి అంతరాత్మ ఏ ఆదర్శమును భావించునో, ప్రకృతి తన కర్మచేత తదార్శ్యమునే రూపొందించును. వాస్తవమారయ, ప్రకృతి పనియే ఇది.

**తస్మాత్ సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్యచ,**
**మయ్యర్పిత మనోబుద్ధిర్ మామే వైష్య స్యసంశయః. 7**

కావున, కౌంతేయా, సర్వకాలములందును నన్ను స్మరించుము, మఱియు యుద్ధముచేయుము. ఏలన నీ మనోబుద్ధులను నాయందే నిలిపి, నాకే సమర్పించి వేసినచో, నన్నే పొందెదవు, సంశయములేదు.

విశేషార్థము : అయోగ్యజీవితమును గడపిన వానికి మరణసమయమున క్రైస్తవపురోహితుడు విలేపనమును (unction) బూసి, 'ఇక నీకు యోగ్యమరణ' మని చెప్పుటచేతనో, ఎటులో కాశీలో మరణించుట చేతనో సద్గతి లభించును – అని అనుకొను సామాన్యాభిప్రాయానికి, గీతాయోగమునకు సంబంధము లే దని శ్రీ అరవిందుడు నిర్దేశించును. అనుస్మరణము, సర్వాత్మ సమర్పణము: ఈ రెండును మాత్రమే భగవద్భావము నీయగలవు.

మంచిది, కాని యుద్ధముచేయు టెందులకు విధించబడెను ? యుద్ధము అర్జునుని సహజకర్మ. అట్టి కర్మయే అంతరంగ భావమునకు – ఆదర్శమునకు – రూపము గల్పించును.

అవతారిక : ఎల్లపుడు ఎందుచేత స్మరించవలె ననిన —

అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్. 8

ఎల్లపుడు అతనినే స్మరించుచు చేయు సంతతాభ్యాసము యొక్క అనన్య యోగమునందు అతనితో యుక్తమైయుండు చేతనచేత మాత్రమే యోగి ఆ దివ్య పరమపురుషుని బొందును.

అవతారిక : ఈ పరమపురుషుని ప్రథమ వర్ణనను మన మిప్పుడు చవి చూతము —

కవిం పురాణ మనుశాసితారం
అణోరణీయాంస మనుస్మరే ద్యః,
సర్వస్య ధాతార మచింత్యరూపం
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్. 9

ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ,
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యం. 10

ఈ పరమపురుషుడు సర్వద్రష్ట పురాణపురుషుడు, జగచ్ఛాసకుడు, అణువు కంటె అణువు (సూక్ష్మరూపుడు), సర్వమును యథాస్థానమున నిలుపువాడు, చింతింప నలవికాని రూపముగలవాడు, సూర్యునివంటి చైతన్యప్రకాశముగల వాడు, కావుననే అజ్ఞానాంధకారమునకు పరుడు (అతీతుడు) ఇక నితని బొందుటకు అవశ్యకమగు సామగ్రి యేమన, అచల మనస్సు, యోగబలముతో సనాథమైన అంతరాత్మ, భక్తియందు భగవంతునితో సంయోగము మఱియు భ్రూమధ్యమునకు లాగి, అచట స్థాపింపబడిన ప్రాణశక్తి. అట్టి దివ్య పరాత్పరపురుషుని ఎడతెగక చింతించుచు వచ్చి, ప్రయాణ కాలమున ఇట్టి యోగసామగ్రితో సంపన్నుడైనవాడు అతనినే పొందును.

విశేషార్థము : ద్రష్ట, శాసకుడు, విధాత, మున్నగు విశేషణము లుండుట చేత ఈ పరమపురుషుడు నిర్వ్యక్తికము, నిశ్చలము, సర్వసమము నగు అక్షర పురుషుడు గాడు. ఈ పరమపురుషుడును తన కాలాతీతస్థానమున అక్షరుడే, అనగా వ్యయములేనివాడే గాన, అతనిని సైతము అక్షరుడు (8-21) - అనవచ్చును.

'అచింత్యరూపం' : అతడు అక్షరుడైనను, అక్షరాత్మవలె నిర్విశేషుడు గాడు; అతనికి విశేషములు గలవు, ఉదాహరణకు, రూపము గలదు. కాని ఆ రూపము అణువుకంటె అణువు గనుక, అది మనశ్చేతనకు చింత్యము గాదు. అతడు అగోచరుడును గాదు, అతనితో భక్తిసంబంధము నేర్పఱచుకొనవచ్చును-"భక్త్యా యుక్తః" (8-10) - అని శ్రీ అరవిందుడు.

వాని కొక నియతరూప మున్న దనుకొన్నను, అది ఎవనికి చింత్యముగాదు- అని శ్రీ శంకరుడు, 'అనుకొన్నను'లోని భావ మేమన, అతనికి నిజానికి రూపము లేదు. ఏలన ఏది దృశ్యమో, అది నశ్యము - అని ఆయన అన్యత్ర సూత్రీక రించును. పోతే, సత్త ఒక భ్రాంతిగాదు, ఒక పదార్థము (substance) గాన, సత్తకు సూక్ష్మరూపముండనే యుండు - నని శ్రీ అరవిందుని సమాధానము.

యదక్షరం వేదవిదో వదంతి
విశంతి య ద్యతయో వీతరాగాః,
య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
త త్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 11

వేదవిదులు ఏ అక్షరపదమును గుఱించి చెప్పుదురో, తపస్వులు వీతరాగులై దేనియందు ప్రవేశింతురో, దేనిని పొందగోరి వారు బ్రహ్మచర్యము నభ్యసింతురో, నీ కా పదమును, అర్జునా, సంగ్రహముగా ప్రవచింతును.

విశేషార్థము : పదము = పదము పెట్టుట కాధారము. (foot-hold) అని శ్రీ అరవిందుడు. అనగా అక్షర మనబడు ఈ సనాతన సద్వస్తువు అంతరాత్మ సత్తకు ఆధారమగు పరమోన్నత పదము, కావుననే కాలభూమికయందు అంతరాత్మ గతికి పరమ గమ్యము – అక్షరము స్వయముగా నొక గతి (movement) గాదు, అది యొక అద్య, పరమ స్థానము (8–28); కాని అది అంతరాత్మ గతికి పరమ గమ్యము.

పదము = పదనీయము, గమ్యము – అని శ్రీ శంకరుడు. కొంతవఱకు ఇది శ్రీ అరవిందుని వ్యాఖ్యతో సమముగా నున్నను, ఇందు అక్షరము అంతరాత్మ సత్తకు ఆధార మను అర్థము రాలేదు.

అవతారిక : ఇపుడు కొంత భిన్నమగు మఱియొక యోగప్రక్రియనుజెప్పును–

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణాం.

ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్,
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిం. 13

ఎవడు ఇంద్రియ ద్వారములను మూసివేసి, మనస్సును హృదయమునందు బంధించి, విక్షిప్తమగు ప్రాణశక్తిని లాగి, శిరస్సున స్థాపించి. బుద్ధిని ఓంకార – ఉచ్చారణయందు ఏకాగ్రపఱచి, ఆ బుద్ధియొక్క భావనాశక్తిని నన్ను అను స్మరించుటయం దేకాగ్రపఱచి–ఇట్టి యోగప్రక్రియ నవలంబించి, ఎవడు దేహమును వదలి, పయనించునో, అతడు పరమ గతిని (పదమును) పొందును.

విశేషార్థము : "మా మనుస్మరన్" = నన్ను అనుస్మరించుచు, పూర్వము జీవితము పొడవునను స్మరించుచుండి, దాని ననుసరించి, (అను = అనుసరించి) అంత్యకాలమున గూడ స్మరించుచు, అంత్యక్షణమున చేయవలసిన దొక ప్రక్రియ మాత్రమే. కాగా పరమపద ప్రాప్తికి ప్రధాన నియమము అనుస్మరణము, అనగా జీవనమునందు, కర్మ మఱియు యుద్ధమునందు సైతము భగవంతునియొక్క సంతత, అనన్య స్మరణము – "మా మనుస్మర యుధ్యచ" (8-7) – మఱియు జీవనక్రియ నంతను ఒక అవిచ్ఛిన్నయోగములోనికి - "నిత్యయోగములోనికి" (8-14)- మార్చి వేయుట. —— శ్రీ అరవిందుడు.

అవతారిక : ఈ అర్థమును తర్వాతి శ్లోకము స్పష్టపఱచును ——

అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః. 14

వ్యభిచరించని అనన్య చిత్తముతో ఎవడు నిత్యమును, నిరంతరమును నన్ను అనుస్మరించునో, అట్టి నిత్యయుక్తుడగు యోగికి నేను, పార్థా, సులభుడను

అవతారిక : పరమపురుషునే పొందుటలోని విశేష మేమన –

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతం,
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః. 15

నన్ను బొందిన మహాత్ములు పరమ సంసిద్ధిని బొందినవారు;అట్టి మహాత్ములు దుఃఖనిలయము, అశాశ్వతము నగు పునర్జన్మను బొందరు.

విశేషార్థము : విశ్వాంతర్గతమైన సర్వోన్నత లోకముల సైతము పునర్జన్మకు అధీనములు. కాని పురుషోత్తమ పదము విశ్వాతీతము. కనుక పురుషోత్తముని బొందిన అంతరాత్మ అవశ్యకముగా జన్మించవలసిన అగత్య ముండదు. మఱియు నిట్లు పునర్జన్మరాహిత్యమునకు నిష్క్రియబ్రహ్మములో లయము బొందవలసిన అగత్యమును లేదు. పురుషోత్తమునితో సాయుజ్యము నందినవాడు జన్మించియు అజుడగనే (4-6) యుండును గాన, అతడు లోకసంగ్రహార్థము (3-25) జన్మించుటకు భయపడడు.

ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున,
మా ముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే. 16

బ్రహ్మలోకమువఱకును గల సర్వలోకములు, అర్జునా, తిరిగి వచ్చు స్వభావము గలవి; పోతే, నన్ను బొందినవానికి మాత్రము పునర్జన్మ యుండదు (14-2)

అవతారిక : పునరావర్తన కాలవ్యవధి చెప్పబడును -

సహస్రయుగపర్యంత మహ ర్యద్ బ్రహ్మణో విదుః,
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః. 17

వేయి యుగములు బ్రహ్మదేవుని కొక పగలు, అటులే వేయి యుగములు ఆతని కొక రాత్రి. ఈ విషయము నెఱింగినవారే పగలు మఱియు రాత్రియొక్క తత్త్వము నెఱింగినవారు.

విశేషార్థము : మానవమానము వేఱు, బ్రహ్మమానము వేఱు. కాన మన రాత్రింబవళ్లు మనకు దెలిసి నట్లు బ్రహ్మయొక్క రాత్రింబవళ్ళు తెలియవు. కాని గుణాతీతు డైనవాడు విశ్వవ్యాపారమునకు పైకి పోవును గాన, అతనికి బ్రహ్మయొక్క అహోరాత్రములును దెలియును.

అవ్యక్తాద్ వ్యక్తయః సర్వాః ప్రభవం త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే. 18

బ్రహ్మదేవుని పగలు ప్రారంభమై నపుడు సర్వభూతములు అవ్యక్తావస్థనుండి పుట్టును, మఱల రాత్రి వచ్చుటతోడనే అవి ఆ అవ్యక్తము నందే లయించును.

భూతగ్రామః స ఏవాయం భూత్వాభూత్వా ప్రలీయతే,
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవ త్యహరాగమే. 19

ఒక సృష్టిలో నున్న భూతసముదాయమే మఱల మఱల పుట్టుచు, రాత్రి వచ్చుటతో లయము నొందును, పగలు వచ్చుటతో ప్రభవించును – అవి అవశముగా నట్లు ప్రళయప్రభవములను బొందుచుండును

విశేషార్థము : మన రాత్రి, మన పగలు గూడ మన కొకవిధమగు ప్రళయ ప్రభవములే. నిద్ర ముంచుకొని వచ్చి, రాత్రివేళ అవశముగా నిద్రపోదుము, అటులే అవశముగా ఉదయమున లేతుము. దీనిని బట్టి శ్లోకములోని 'అవశ' పదమును గుఱించి ఒక అభిప్రాయము మన మేర్పఱచుకొనవచ్చును.

అవతారిక : ఇపుడు అతీతమగు అవ్యక్తము చెప్పబడును —

**పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్ సనాతనః,**
**యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి. 20**

పూర్వోక్తమగు (8-18) అవ్యక్తముకంటెను అన్యము, పరము నగు మఱియొక అవ్యక్త భావము (సత్తాస్తరము) గలదు. అది నిత్యము, అది సర్వ భూతముల నాశముతో నాశము నందదు.

విశేషార్థము : పూర్వోక్తమగు అవ్యక్తము భూతముల వ్యక్తస్థితికి వ్యతిరేకము. ఒకటి భూతముల అవ్యక్తస్థితి, రెండవది వ్యక్తస్థితి. ఇవి రెండును విశ్వభావములోనివే, కాలగతములే, మార్పునకు లోనైనవే. ఈ ద్వంద్వములోని అవ్యక్తము కంటెను విలక్షణము, పరము (అతీతము) నగు, అనగా విశ్వాతీతమగు, మఱియొక అవ్యక్తభావము గలదు ఇది భగవంతుని మూలభావము, ఇది స్వయం స్థితము, ఇది మార్పులేని నిత్యము, నిత్యభావము,

బీజము వృక్షముయొక్క అవ్యక్తభావము, కాని బీజము సైతము విశ్వము లోనిదే. కనుక రెండును నాశశీలములే.

**అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిం,**
**యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ. 21**

ఆ 'పరమును' లేక పరుని అవ్యక్తు డందురు, అక్షరు డందురు; అతనినే పరమగతి యందురు మఱియు నా పరమగతిని బొందినవారు తిరిగిరారు అదియే నా సత్తయొక్క పరమ పదము

విశేషార్థము : క్షర సత్త — క్షర పురుషుడు, అక్షర సత్త - అక్షర పురుషుడు, ఉత్తమ సత్త - ఉత్తమ పురుషుడు (15-17). ఇట్లు ప్రతి సత్తకును సత్తావంతుడగు ఒక పురుషు డుండును. పైకి పోయిన కొలది సత్తకును, పురుషునకును అధికాధిక అభేదము అనుభూతమగును. కావున (8-20) లోని భావమును (సత్తను) (8-21) లో పురుష డనుచున్నారు ఇంతకంటెను స్పష్టముగ (8-20) లోని పరభావమును (8-22) లో పరపురుష డనుచున్నారు (పర = అతీత).

అంతేకాదు, 21-వ శ్లోకముయొక్క ప్రథమపాదములో అక్షరపురుష డని చెప్పబడిన వానినే, ద్వితీయపాదములో 'పరమగతి' యని చెప్పుచున్నారు. కనుకనే

పరమగతి = పరమాత్మ + పరమస్థానము—అని శ్రీ అరవిందుడు అనువదించెను. కాగా శ్రీ శంకరుడు, పరమ గతి = ప్రకృష్ట గతి - అని మాత్రమే చెప్పెను. నిజానికి శ్రీ శంకరునికి పరమతత్త్వము ఒక గమ్యవస్తువే కాని, గమ్యపురుషుడు గాదు.

అవతారిక : ఈ సర్వోన్నత, అతీత పురుషు నెట్లు పొందవచ్చును ?-

పురుషః స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా,
యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వ మిదం తతం. 22

ఎవనియందు భూతము లన్నియు వర్తించుచున్నవో, మఱియు నెవనిచేత ఈ ప్రపంచ సంతతియు దేశకాలములందు విస్తరింపజేయబడినదో, పార్థా, ఆ పరమ పురుషుడు అనన్యభక్తిచేత మాత్రమే లభించును.

విశేషార్థము : కార్యము కారణమునందు వర్తించును, (ఉదాహరణకు, తరంగము సముద్రమునందు వర్తించును), కనుక కార్యమగు భూతములు కారణమగు పరమపురుషునియందు వర్తించును—అని శ్రీ శంకరుడు తెలిపెను. బాగుగనే యున్నది, కాని, 'యేన సర్వ మిదం తతం' = ఆకాశముచేత ఘటమువలె ఎవనిచేత నిది వ్యాప్తమై యున్నదో - అని మఱల నాల్గవ పాదము ననువదించెను. ఇది సరికాదు. ఘటము నకు కారణము భూమి (మట్టి)గాన, ఎట్లు ఘటము భూమియొక్క విస్తారమో, వేఱు మాటలలో, ఎట్లు ఘటము భూమిచేత విస్తరింపజేయ బడినదో, అట్లు ప్రపంచము అతనిచేత దేశకాలములందు విస్తరింపజేయబడెను - అని వ్యాఖ్యానించుట యుక్తము : శ్రీ అరవిందు డిటులే వ్యాఖ్యానించెను. అనగా, తతం = వ్యాప్తము : ఈ అర్థము సరిగాదు. తతం = విస్తరింపజేయబడినది : ఈ అర్థము సరియైనది. శ్రీ శంకరుని వ్యాఖ్య ననుసరించి, ఆకాశము ఘటము నంటనట్లు, ఈ పురుషుడును శరీరాదుల నంటడు - అని అర్థము వచ్చును. కాని ఇది సరిగాదు, ఏలన ఈ పరమపురుషుడు తన క్షరపురుష రూపమున క్షరభావము నంటుచు నుండును. లేనిచో క్షరము ప్రవర్తింపజాలదు

కనుకనే ఈ పరాత్పర పురుషుడు, అవ్యక్తమును మించిన అవ్యక్తుడు, మనకు పొత్తిగా నందని కేవలుడు (Absolute) గాడు, ఎట్టి సంబంధమును పెట్టుకొనుటకు వీలుపడని 'అవ్యవహార్యుడు' (మా. ఉ.) గాడు. అతనితో భక్తిసంబంధమును పెట్టుకొనవచ్చును. అనన్యభక్తితో అతనిని పొందవచ్చును.

ఆత్మ - అక్షరాత్మ - అతీంద్రియము, బుద్ధిగ్రాహ్యము (8-21)-అని చెప్పబడినది. కాగా నిచ్చట పరమపురుషుకు, భక్తిహృదయవృత్తి గనుక, హృదయగ్రాహ్యుడని చెప్పినట్లైనది నిజానికి ఈ పరమపురుషుని బొందవలె ననిన, ప్రాణశక్తి, మనఃసంకల్పము, బుద్ధిజ్ఞానము, హృదయ ప్రేమ - అన్నియు నావశ్యకమే. అతడు సమగ్ర స్వరూపుడు గాన, అతని సాధనమును సమగ్రము గావలెను. కాగా ఈ సమగ్రసాధనముయొక్క కిరీటము భక్తి. కావున భక్తిచేత నతడు లభ్యుడు-అని చెప్పబడినది. ఇది శ్రీ అరవింద వివరణము.

మఱియు నీ పరమపురుషుడు ద్రష్ట, స్రష్ట, శాసకుడు (8-9) ఇట్లు ఇతడు మన భ్రమలకు దూరముగా నుండు కేవలుడుగాడు, అతడు సర్వమును-"వాసుదేవః సర్వం" (7-19). అతడు అతీతుడయ్యును, అదే సమయమున సర్వమును: ఇదియే అతని ఉత్తమరహస్యము.

ఆ ఉత్తమరహస్యములో నొక భాగ మేమన,హృదయము అంతరాత్మయొక్క వెలుపలి ముఖము ఇక నీ అంతరాత్మ భగవదంశము-భగవంతుడే పరప్రకృతిచేత అంతరాత్మయై, నిమ్నప్రకృతిలో నివసించుచు, నిమ్నప్రకృతికి, తన అతీతరూపమునకు మధ్య సేతువుగా నుండును. ఇట్లు భగవంతుడు విడిగా నున్నను వేఱుగాలేడు హృదయముద్వారా అంతరాత్మను, అంతరాత్మద్వారా పరమాత్మను మనము బొందవచ్చును.

అవతారిక : ఇపుడు యోగికి అపునరావృత్తిని, పునరావృత్తిని - జన్మరాహిత్యమును, జన్మను-గల్గించు కాలవిశేషములు చెప్పబడును.

యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ. 23

అర్జునా ! ఏ కాలమున శరీరమునుంచి ఉత్క్రమించిన జన్మరాహిత్యమును, ఏ కాలమున జన్మను యోగులు బొందుదురో, ఆ కాలములను జెప్పెదను.

విశేషార్థము : ఈ కాలనిర్దేశమునందు ఎంత సత్య మున్నదో గాని, ఇది ఉపనిషత్తులనుండి గీత యథాతథముగా స్వీకరించిన విషయము-అని శ్రీఅరవిందుడు. శ్రీ శంకరునికి ఈ సత్యముపట్ల అనుమాన మున్నట్లు గన్పించదు గాని, ఇది క్రమముక్తినిమాత్రమే బొందగల రెండవ తరగతి యోగులకు జెప్పబడిన మార్గమని ఆయన చెప్పును అనగా ఈ యోగులు శరీరమును విడిచిన వెంటనే కాక తర్వాత

ఆయా లోకాలలో నివసించుచు, పైకి బోయి, కాలాంతరమున వారు ముక్తి నొందుదురు. పోతే, పునరావృత్తి మార్గము అపునరావృత్తి మార్గమును స్తోత్రము చేయుటకు మాత్రమే చెప్పబడిన దని ఆయన అభిప్రాయము.

మఱియు, ఈ అధ్యాయమున చెప్పబడిన యోగు లందరు క్రమముక్తి యోగులే యని శ్రీ శంకరుడు దలంచును. ఇది నిజము కాదు. ఏలన ఎల్లప్పుడు నన్ను స్మరించుచు వచ్చి, అంత్యకాలమున సైతము నన్ను స్మరించిన వారు నన్ను నిస్సంశయముగా బొందుదురు(8-5)-అని చెప్పబడెనుగదా. (2-72)కూడ ఈ (8-5)ను బలపఱచును.

అగ్నిర్జ్యోతి రహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణం,
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. 24

అగ్ని, ప్రకాశము, పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణములోని ఆఱు మాసములు-ఈ కాలమున దేహమును విడిచి చనిన బ్రహ్మవిదులు బ్రహ్మను బొందుదురు.

ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనం,
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే. 25

పొగ, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనములోని ఆఱు మాసములు - ఈ కాలమున దేహమును విడిచిన యోగి 'చంద్రునియొక్క వెన్నెలను' బొంది,మఱల భూమియందు జన్మకు వచ్చును.

విశేషార్థము : మానవుని లోపల ప్రకాశ శక్తులకు, అంధకారశక్తులకు సంతత సమరము జరుగుచుండును. మఱియు ప్రకాశ శక్తులకు పగటి వేళ బలము హెచ్చును, అటులే అంధకారశక్తులకు రాత్రివేళ. ఇది సర్వథా వర్తించకపోయినను, ఇందులో సత్య మున్న దని యోగుల అనుభవము జెప్పును. అంధకారశక్తులపై నిశ్చిత, చరమ విజయము ప్రాప్తించువఱకు - కనీస మప్పటివఱకు - కాలభేదము వలన గలుగు భేదము గన్పించు నని శ్రీ అరవిందుడు.

మఱియు ఉపనిషత్తుల నాటి యోగులు రహస్యయోగులు, వారు సూటిగా గాక, సంకేతముద్వారా మాత్రమే సత్యమును సూచింతురు. కనుక (8-24) లోని ప్రకాశము జ్ఞానమునకు, అగ్ని ఆధ్యాత్మిక శక్తికి సంకేతములు గావచ్చును - అని

శ్రీ అరవిందుడు. ఈ సంకేతవిధానమును తన 'వేదరహస్యము'లో శ్రీ అరవిందుడు అపూర్వ ప్రతిభతో విపులీకరించును.

ఆధ్యాత్మిక జగత్తున మహాపురుషు లెందరో రాత్రివేళ వెళ్లిపోయినవా రున్నారు వారందరు అవశ్యముగా తిరిగి జన్మించవలసినదేనా ? ఇది సందేహాస్పదము అందుచేతనే పై ప్రతిపాదనయందు శ్రీ అరవిందుడు సంకేతార్థ ముంచవలె నని అనుమానించుచున్నారు.

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే,
ఏకయా యా త్యనావృత్తిం, అన్య యావర్తతే పునః. 26

ఈ శుక్లకృష్ణ (తెల్ల, నల్ల) మార్గములు రెండును జగత్తునకు—జగత్తు నందలి తత్త్వదర్శతగల యోగులకు — శాశ్వతము అని నిశ్చితాభిప్రాయము. ఒక దానిచేత అపునరావృత్తిని, రెండవ దానిచేత పునరావృత్తిని యోగి పొందును.

నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్ సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున. 27

ఈ మార్గము లెఱిగిన యోగి ఎవ్వడును మఱి మోహమునకు లోనుగాడు కావున, అర్జునా, సర్వకాలములందును యోగయుక్తుడవు గమ్ము !

విశేషార్థము : ఈ శుక్ల కృష్ణ మార్గములందు ఎట్టి మానసిక—భౌతిక సత్య మున్నను, అది గాక, ఈ ప్రకరణముద్వారా గీత మనల నే మలుపునకు తీసికొని వచ్చినదో, అదియే మనకు పరమ ముఖ్యము. ఇక నా మలు పేమన, "కావున సర్వకాలములందును యోగయుక్తుడవు గమ్ము" —— అని శ్రీ అరవిందుడు.

యోగయుక్తుడు = సమాహితుడు, శాంతచిత్తుడు—అని మాత్రము శ్రీ శంకరుడు చెప్పగా, యోగయుక్తుడు = భగవంతునితో యోగమునం దున్నవాడు — అని శ్రీ అరవిందుడు చెప్పెను.

కాని సదా యోగమునం దుండుట ఎట్లు సంభవమగును ? యుద్ధము నందు (8-7)—జీవితయుద్ధమునందు సైతము అవిచ్ఛిన్నముగా నెట్లు స్మరించగలము? ఎట్లన,చేతనయందు మనము ఏకాత్మను దర్శించవలెను;అపు డా ఆత్మ భగవంతుడుగా గన్పించును ఇక నింద్రియముల విషయమున, సామాన్య చక్షువునకు రూపము తనలో నున్న భగవంతుని మఱుగుపఱచును. కాని జ్ఞానదీప్త చక్షువునకు ఆ

రూపమే లోనున్న భగవంతుని వ్యక్తముచేయును. ఇట్టి చక్షువుతో మనము సర్వమును భగవంతునిగనే చూడవలెను. (భగవంతుడు అతీంద్రియుడు, అదృశ్యుడు - అను సిద్ధాంతము శ్రీ అరవిందునిచే నెట్లు ఇచ్చట ఎగురగొట్టివేయబడినదో, గమనించదగును.) తర్వాత మన ఇచ్ఛను భగవదిచ్ఛతో నేకముచేయవలెను. అపుడు మన కర్మ భగవదిచ్ఛనుండియే వచ్చుచున్న దనియు, దానియొక్క ఒక క్రియయే (movement) యనియు, అదియే యనియు మన కనుభూత మగును కనుక కర్మ భగవంతుని మఱుగుపఱచకపోగా, మఱింత వ్యక్తముచేయును. ఇట్టియెడ ఈశ్వర స్మరణ అపుడపుడు జరుగు ఒక మనఃక్రియగా నుండదు, అది మన కార్యకలాపముల మూలనియమమే యగును, అనగా ఆ స్మరణ లేనపుడు కర్మ అసంభవమగును, ఒక విధముగా నపుడు ఈశ్వరస్మరణ మనచేతనయొక్క సారపదార్థమే యగును. అపుడు జీవునికి ఈశ్వరునితో తన సహజ, సముచిత ఆధ్యాత్మిక సంబంధ మేర్పడును. అపుడు జీవన మంతయు ఒక యోగమే (all life is a yoga), ఒక సిద్ధ, అయినను సదా స్వయంసాధక ఏకతయే యగును. ఇదిగో "యోగయుక్త" పదమున శ్రీ అరవిందున కిట్లు ఇంత అర్థము గోచరించును: దానియందు జీవన మంతయు యోగమే యను మహావాక్యము గన్పించును: "సర్వం ఖల్విదం బ్రహ్మ" యొక్క పూర్ణార్థము గోచరించును, అనగా భగవంతుడు ఆత్మ రూపమున ప్రపంచసత్త మాత్రమే గాక, తన క్షరపురుష రూపమున కర్తయు దానే.

అవతారిక : యోగి ఇట్టి యోగయుక్తుడు గావున —

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం,
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యం. 28

పురుషోత్తమునితో తనకు గల ఈ ఆధ్యాత్మిక సంబంధము నెఱింగిన యోగిపుంగవుడు వేదములందును, యజ్ఞములందును, తపస్సులందును, దానములందును ఏ పుణ్యఫలము చెప్పబడినదో, దాని నంతను అతిక్రమించి, సర్వోన్నతము, సర్వప్రథమము నగు స్థానమును బొందును.

**విశేషార్థము :** "ఎఱింగిన యోగిపుంగవుడు పొందును"—అని నపుడు ఈ యోగము జ్ఞానపూర్వ మని తెలియుచున్నది గదా. అయినపుడు ఈ అధ్యాయమున చెప్పబడిన యోగులందరు సద్యోముక్తిని గాక, కాలాంతర ముక్తిని బొందు వందాధికారులని శ్రీ శంకరుడు చెప్పిన దెట్లు సమంజస మగును? పైగా ఈ యోగము ముక్తి మాత్రమేగాదు. ముక్తి మించిన, ముక్తికి గర్భితమగు భగవంతునితో సంయోగము.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే
అక్షరబ్రహ్మయోగో నామ అష్టమోఽధ్యాయః





# శ్రీ గీ తా యో గ ము

## అథ నవమోఽధ్యాయః

## రాజవిద్యారాజగుహ్య యోగః

ఒక పరిశీలన : అజ్ఞానదశయందే మానవుడు కర్మచేయును, కర్మ అజ్ఞాన లక్షణము – అని శ్రీ శంకరుడు పట్టుబట్టును పోతే, అజ్ఞానముచేతనే, దానినుండి జనించిన మోహముచేతనే, అర్జునుడు కర్మవిముఖు డయ్యెను, నిర్వీర్యుడై ధనుర్బాణములను జారవిడిచెను – అని శ్రీ అరవిందుడు వివరించును. అతనిని తిరిగి కర్మ ప్రవృత్తుని గావించుటకే భగవానుడు స్వవిషయమగు సమగ్రజ్ఞానము నుపదేశించెను. వీనిలో నేది సత్యము ? గీతనే అడిగి చూతము ——

"నీ అనుగ్రహముచేత, నో అచ్యుతా, నాకు మోహము నశించినది, జ్ఞానము లభించినది, మఱియు (నన్ను నిర్వీర్యుని జేసిన) సందేహములు గతించినవి. కావున నీ ఆదేశమును పాలించుటకు నడుముకట్టి నిలబడియున్నాను." (18–73)–అని అర్జునుడు దృఢముగా బలుకును. దీనిని బట్టి కర్మ జ్ఞానఫలిత మనియు, జ్ఞానము కర్మసాధకమే గాని, శంకరాచార్యుడు వాదించు నట్లు, కర్మబాధకము గాదనియు తెలియుచున్నది.

అయితే శ్రీ శంకరుని వాదమునందు సత్య మేమియు లేదా ? ఉన్నది. అసమగ్ర జ్ఞానఫలితము అనగా కేవలాత్మజ్ఞానఫలితము కర్మసన్యాసము. కాగా సమగ్ర జ్ఞానఫలితము అనగా పురుషోత్తమజ్ఞానఫలితము కర్మానుష్ఠానము, ఈశ్వరాదేశపాలనము. ఈ సమగ్రజ్ఞానమే కర్మసమస్యను బరిష్కరించగలదు పోతే అసమగ్రజ్ఞానము కర్మనుండి పాఱిపోవును, అది కర్మసమస్యకు పరిష్కారమే కాదు.

కనుక కర్మసమస్యను బరిష్కరించుటకు తన ఉపదేశము నారంభించిన గీతామాత ఆ సమగ్రజ్ఞానమును మెట్టుమెట్టుగా మనకు బ్రకటించుచున్నది. ఆ మహాజ్ఞానముయొక్క ఒకొక్క పార్శ్వమునే మన కావిష్కరించుచున్నది. ఇక నీ నవమాధ్యాయమున గీత ఆవిష్కరించు పార్శ్వ మేమన –

భూతములు భగవంతునిలో నున్నవి గాని, భగవంతుడు భూతములలోలేడు, వానిలో చిక్కుకొని లేడు కారణము, అతనినుంచియే భూతములు వెడలుచున్నవి, అందుచేత అతడు వానికంటె నధికుడు మఱియు నతీతుడు (9-4). సర్వము నతని అనంత సత్తయందు ఒక గతిగా, ఒక సంభూతిగా నున్నది. కనుక నీ జ్ఞానము 11-వ అధ్యాయము నందలి విశ్వరూపదర్శనమునకు దారితీయును. ఒక్క పరమపురుషునియందే సమస్తము గల (11-7)దని అక్కడ నర్జునుడు ప్రత్యక్షముగా జూచును. నేను భగవంతునియందు మాత్రమే వర్తించుచున్నాను, అతనిలోని శక్తి చేతనే నేను కర్మచేయుచున్నాను, నా కర్మాచరణము అతని క్రియకు ఒక ఉపకరణత్వము మాత్రమే - అని అర్జును డీ అధ్యాయము నందలి ఈ జ్ఞానముపలన దెలిసికొనవలెను. ఇట్టి జ్ఞానము 11-వ అధ్యాయమున స్పష్టముగా గానవచ్చు "నిమిత్తమాత్రత్వమునకు(11-33) మార్గము నేర్పఱచును. కనుక నిది దివ్యకర్మను సాధించును గాని, సన్న్యాసమున పర్యవసించదు.

ఈ అధ్యాయనామము రాజవిద్యా రాజగుహ్యము. రాజగుహ్య మన రహస్య రాజము, రహస్యములకు రహస్యము. ఇది ఎట్లు సార్థకనామమో, దానిని శ్రీ అరవిందుడు మాత్రమే వివరించెను.

ఈ విశ్వమునందు ప్రతి వస్తువు ప్రవాహాత్మకము, ఒక ప్రవాహము; సూక్ష్మముగా పరిశీలించిన, పరివర్తనల - మార్పుల - పరంపరయే వస్తువని తేలును - అని బుద్ధుడు చెప్పుటయే కాక, ఇప్పటి వైజ్ఞానికులును చెప్పుచున్నారు. ఉదాహరణకు, అణువిచ్ఛేదము గావించి, వైజ్ఞానికులు వస్తువుగా గన్పించు అణువు నిజానికి శక్తియొక్క - చలనాత్మకమగు శక్తియొక్క ఒక అవస్థ మాత్రమే యని కనిపెట్టిరి. ఇంతవఱకు నిది నిజమే. వాస్తవానికి శక్తియే నానారూపములు ధరించిన దని మహర్షులెపుడో చెప్పియున్నారు కావున విశ్వము సంతత పరివర్తనాత్మకమగు ఒక మహాదృశ్యము గావలెను.

అవును గాని, ఇది విశ్వముయొక్క బాహ్య సత్యము మాత్రమే. ఈబాహ్య చలనము వెనుక దాని కాధారముగా నొక అచల వస్తువున్నది; అది అవికార్యము, అవ్యయము, సనాతనము మఱియు స్వయం-సిద్ధము; అదియే అక్షరాత్మ; అదియే ఏ వైజ్ఞానికుని యంత్రములకు నందని నిగూఢ వస్తువు. కావున నది రహస్యము- అని శ్రీ అరవిందుడు. పైగా నిది లేనిచే విశ్వమునకు ఆధారమే లేదు, అస్తిత్వమే లేదు గనుక ఇది విశ్వములోని రహస్యము.

ఈ ఆత్మద్వారా ప్రాప్యము, ఈ ఆత్మకంటెను పరము (15-17), విశ్వమునకు మూలము (7-6), విశ్వమును శాసించునదియు నగు పఱియొక గుహ్యతమ సత్యము గలదు :- అదియే పరమపురుషుడు, భగవంతుడు (8-22, 9-4). ఇతడు రహస్యమగు ఆత్మకంటెను రహస్యము గనుక, ఇతడు రహస్యమునకు రహస్యము రాజగుహ్యము ఇతనికి సాధనము గాన, ఈ అధ్యాయము రాజగుహ్యయోగము.

ఇపు డొక జటిల విషయమును మనము పరిష్కరించుకొనవచ్చును. "న తస్య ప్రాణా ఉత్క్రామంతి, బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి"(బృ.ఉ.),దీని అనువాదము- అతని ప్రాణములు ఉత్క్రమించవు (అంత్యక్షణమున) అతడు (తన జ్ఞానమువలన) ఇపుడు బ్రహ్మగనే ఉన్నాడు గావున, బ్రహ్మలో లీనమగును. కనుక "శరీరమును విడిచి ఎవడు వెళ్ళునో...."(8-13)-అని నాడీద్వారేణ ఏ ఉత్క్రమణము 8-వ అధ్యాయమున చెప్పబడినదో, అది సద్యోముక్తి గాదు, కాలాంతరముక్తికి ఒక యోగ ప్రక్రియ మాత్రమే యని శ్రీ శంకరుడు ఇక్కడ గాకపోయినను, తన ఉపనిషద్భాష్యమున వక్కాణించును దీనికి తిరుగులే దనిపించును. కాని ఇవ్విషయమున శ్రీ అరవిందు డేమి చెప్పును ?—

ఆత్మ నిర్వ్యక్తికము, నిజమే. అంతరాత్మ ఆత్మలోనికి పయనించినపుడు అదియు నిర్వ్యక్తిక మగును, ఇదియు నిజమే. ఇచ్చట రెండు ప్రత్యామ్నాయములు గలవు, రెండు పర్యవసానములకు అవకాశము గలదు. 1. 'నేతినేతి' సాధనద్వారా ఆత్మలోనికి వెళ్ళిన సాధకుడు, ఆ నిర్విశేషమగు ఆత్మలో లీనము కాగోరిన, అట్లు చేయవచ్చును. అనగా అతనికి ఉత్క్రమణ మందడు. పోతే కర్మజ్ఞానభక్తి రూపమగు సమగ్ర సాధనచే ఆత్మలోనికి వెళ్లినవాడు అక్కడ తన అహంకార వ్యక్తిత్వమును మాత్రమే లీనమొనరించుకొనును. పిమ్మట నిరహంకారుడై ఆత్మకు పైనున్న భగవంతు నారాధించి, ఆ భగవంతునియందు, సర్వమునకు మూలమగు నా భగవంతునియందు, తన సనాతన ఆధ్యాత్మిక వ్యక్తిత్వమును (15-7) తిరిగి పొందును. ఇపు డతడు నిర్వ్యక్తిక వ్యక్తియగును. అనగా పరిచ్ఛేదకమగు అహంకారము గతించినది గాన, అఖండవ్యక్తిత్వమును పొందును. ఇదియే గీతామతము

బ్రహ్మయందు జ్ఞాని లీనమగును – అనునది గీతామతము కాదు. గీత చెప్పునట్లు, జీవుడు సనాతను (15-7) డైనపుడు, అత డెట్లు రూపు మాసిపోవును ? లీన మగునని గీత చెప్పలేదు సరికదా, సంసిద్ధియందు జీవుడు భగవంతునియందే నివసించును (12-8), భగవంతునియందే వర్తించును (6-31) – అని కూడ నిస్సంశయ

ముగా జెప్పుచున్నది. పైగా బ్రహ్మ అయిన (18-54) జీవుడు సైతము ఇట్లు చేయును అని చెప్పినది గాన, 'బ్రహ్మలో లీనమగును' - అను ఉపనిషత్పదము కర్థము, బ్రహ్మలో అజ్ఞానకార్యమగు అహంకారాదికము మాత్రమే లీనమగును - అని కావలెను.

ఇది యంతయు రాజగుహ్యము - రహస్యములకు రహస్యము - అను పదము నుండి వెలువడిన ప్రకాశము ఈ రాజగుహ్యమును గుఱించి ఇపుడు మఱికొంత - ఒక నూతన పార్శ్వమును - దెలిసికొందము.

శ్రీ భగవా నువాచ -

ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 1

విజ్ఞానసహితమగు నే రహస్యతమ జ్ఞానము గలదో, దానినే అర్జునా, అసూయారహితుడవగు నీ కిపుడు వెల్లడించెదను. (కావున సావధానుడవై వినుము). ఈ జ్ఞానము పట్టువడి నపుడు, అశుభమునుండి నీవు విముక్తుడ వయ్యెదవు.

విశేషార్థము : అశుభము = మన ఇప్పటి జీవనము యొక్క ప్రథమ, వ్యావహారిక సత్యములు, అనగా దాని దుఃఖము, దాని బాధ, దాని అనర్థము, దాని లోపము, దాని భ్రమప్రమాదములు, ఒక్క మాటలో, నిమ్న ప్రకృతియొక్క అనర్థములు మఱియు అపూర్ణతలు - అని శ్రీ అరవిందుడు అశుభము = సంసార బంధనము - అని శ్రీ శంకరుడు. జీవనమే అశుభ మని శ్రీ శంకరుని తాత్పర్యము. పోతే, నిమ్న ప్రకృతియు పరప్రకృతి ప్రసవమే గాన, పరప్రకృతి శక్తిచేత దానిని శుభములోనికి సైతము రూపాంతరము పొందించవచ్చు నని శ్రీ అరవిందుడు సమాధానించును, అనగా ఇప్పటి అదివ్యజీవనమును దివ్యజీవనములోనికి మార్చుకొన వచ్చును. దానికొఱకే ప్రకృతిప్రయాస మంతయు.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమం,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయం. 2

మఱియు నేను చెప్పబోవు ఈ జ్ఞానము విద్యలలో రాజు, రహస్యములకు రహస్యము, పవిత్రము, సర్వశ్రేష్ఠము, ఇంకను అది ప్రత్యక్షముగా తెలియదగినది, ధర్మయుక్తము, అనుష్ఠించుటకు సుఖవు మఱియు నాశరహితము.

విశేషార్థము : 'అనుష్ఠించుటకు సుళువు'—ఎందుచేత ? ఈ విద్య నిత్యానిత్య వస్తు-వివేచనాత్మకము. కనుక రత్నవివేచనము వలె నది సుళువు. అని శ్రీ శంకరుడు. ఇచ్చట సాధకుని స్వప్రయత్నము మాత్రమే గన్పించును. పోతే, శ్రీ అరవిందుడు చెప్పున దేమన, ఇచ్చట భగవంతుడే, సాధకుడు చేయవలసిన పని చేయును గాన, అది సుళువు. భగవంతుడే "ఉజ్జ్వలమైన జ్ఞానదీపముచే" (10-11) సాధకుని అంతఃకరణములోని అంధకారమును దొలగించును. అతడు సాధకుని మలిన, అజ్ఞానమయ ప్రకృతిని చేపట్టి, దానిని తన తేజోవిశాలతలోనికి మార్చి వేయును, ఒక్క మాటలో సాధకుని దివ్యజన్మను సాధించును. కాని భగవంతు డట్లు చేయగలుగుటకు ముందు అహంకారావిష్టములైన మనః ప్రాణములు అతని చేతులలోనికి తమను దా మర్పించుకొనవలెను (10-9). ఇది భక్తి యోగము, సమర్పణవఱకే భక్తుని స్వప్రయత్నము, తక్కిన దంతయు భగవంతునికృషి (18-66). దీనిని గీత 'సర్వగుహ్యతమము' - అని పలుకును (18-64). 'రత్నవివేచనమును' ప్రస్తావించిన శ్రీ శంకరుడు దీనిని పాటించినట్లు లేదు.

అవతారిక : సమర్పణతో బాటు శ్రద్ధయు నావశ్యకము —

అశ్రద్ధధానాః పురుషా ధర్మ స్యాస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని.　　3

ఈ ధర్మమునందు విశ్వాసము లేని నరులు, ఓ అర్జునా, నన్ను పొందజాలక మృత్యుగ్రస్తమైన సంసారమార్గమునందే తిరుగుచుందురు.

విశేషార్థము : ఊర్ధ్వగమనము మన సత్తయొక్క ధర్మము. అందుచే మన జన్మ. మఱియు ఈ ఊర్ధ్వగమనము, నేను దేహముకంటె వేఱు — అని తెలుపు ప్రకాశముచేత సాధ్యమగును. కాని ఇట్టి ప్రకాశము అంకురించినపు డెల్ల, దానిని మనము విశ్వసించకపోయిన అది పెరగదు, మనము పైకి పోలేము, మన అమరమగు ఆత్మను, పరమాత్మను గుర్తించజాలము, ఇది 'విశ్వాస' పదమునకు సాధనాపరముగా జేసిన శ్రీ అరవిందుని వ్యాఖ్య.

అవతారిక : ఇట్లు అర్జునుని మనస్సు నాకర్షించి, భగవానుడు తన జ్ఞానమును (9-1) ప్రకటించును —

మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా,
మత్స్థాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః.　　4

జగత్తంతయు అవ్యక్తరూపుడనగు నాచే విస్తరించజేయబడినది. భూతములు నాయందున్నవి, కాని నేను భూతములయందు లేను.

విశేషార్థము : 'అవ్యక్తరూపుడు' - భగవంతుని పరమసత్త అభివ్యక్తి కతీతము. అందుచేత అతని పరమ సనాతన రూపము ద్రవ్యమునందు ప్రకటము గాదు, దానిని ప్రాణము పట్టుకొనలేదు; మనస్సు చింతించ లేదు. కావున పరమ పురుషుడు 'అచింత్యరూపుడు' (8-9), అవ్యక్తమూర్తి (9-4). శంకరుడు చెప్పి నట్లు అతడు రూపరహితుడు గాడు; అతనికి 'స్వరూపము' ఒక టున్నది; కాని అది చింత్యము గాదు.

(10-42) చెప్పి నట్లు విశ్వ మంతయు భగవంతుని ఒక చిన్న అంశము. కనుక భగవంతుడు విశ్వములో నున్నను, దానిలో ఇమిడి లేడు. మఱియు తన, ఆత్మరూపమున ఉన్నాడు (9-5) గాని, తాను స్వయముగా లేడు. 'నేను భూతముల యందు లేను' అనుట కర్థ మిదియే. దీనినే, భూతములు భగవంతుడే గాని, భగవంతుడు భూతములు గాడు—అని చెప్పవచ్చును.

కాని శ్రీ శంకరునికి భగవంతు డన ఆత్మయే మఱియు ఈ ఆత్మ అసంగము. అందుచేత నది భూతముల కాత్మగా నున్నను, భూతములలో నున్న దని చెప్ప గూడదు—అని శ్రీ శంకరుడు భగవంతుడు అతీతుడు గాన, భూతములలో లేడు — అను గీతార్థము ఇచ్చట వ్యక్తము గాలేదు.

అవతారిక : భగవంతుని గుహ్యతయొక్క మఱియొక పార్శ్వ మేమన —

**నచ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరం,**
**భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః. 5**

మఱియు, భూతములు నాయం దున్న వని చెప్పుటయు పూర్ణసత్యము గాదు : ఈశ్వరుడనగు నా ఈ యోగమహిమను గనుము. నా ఆత్మ భూతములను బుట్టించును; దానియందు భూతము లుండును గాని, అది భూతములం దుండదు.

విశేషార్థము : భగవానుడు తన సమగ్రజ్ఞానము నిచ్చుటకు బూనుకొని యున్నాడు గదా (7-1. 9-1). ఆ సమగ్ర జ్ఞానమును శ్రీ అరవిందు డెట్లు వెలికి దీయుచున్నాడో, అసమగ్ర జ్ఞానమునే సమగ్రజ్ఞానముగా శ్రీ శంకరు డెట్లు చూపు చున్నాడో మన కీ శ్లోకము క్రింద స్పష్టముగా దెలియవచ్చును.

4-వ శ్లోకమున, భూతములు నాయం దున్న వని చెప్పి, మఱల నిదియు పూర్ణ సత్యము గాదు, నిజానికి భూతములు నాయందు లేవు - అని భగవాను డీ శ్లోకమున నెందుకు జెప్పుచున్నాడు ? ఎందుకన భగవంతుడు స్వస్వరూపమున దేశాతీతుడు, కాలాతీతుడు. కనుక దేశమునకు, అనగా అవకాశమునకు, సంబంధించిన పదములు అతనికి వర్తించవు. సంతోష మింత బరువుగా నున్న దని ఎట్లు చెప్ప జాలమో, అట్లే భగవంతుడు దేశ (అవకాశ)రహితుడు గాన, అతనియందు భూతము లున్న వనియు చెప్పుట తగదు.

పోతే, దేశము (space) నందు అభగవంతుని ప్రథమవిస్తారము (extension) ఆత్మ. భగవంతుడు దేశరహిత అనంతముకాగా, భగవదాత్మ దేశసహిత (extended) అనంతము. ఈ ఆత్మ భగవంతునియొక్క స్వయంస్థిత సత్త (self-being). ఈ ఆత్మయే సర్వ భూతములను (self-becomings) బహిర్గతము గావించును. ఈ భూతములు ఆత్మసత్తపై నాధారపడును, ఆత్మయం దుండును. ఇట్లు భూతములు సరాసరి భగవంతునియందు గాక, అతని ఆత్మయం దుండును.

ఇట్లు భగవంతుడు విశ్వాతీతు డయ్యును, కేవలము విశ్వ బాహ్యుడు (extracosmic) గాడు - తన ఆత్మరూపమున అతడు విశ్వమునందును ఉన్నాడు గాన. ఇదియే అతని ఐశ్వరయోగము, యోగ మాయామహిమ - అని శ్రీ అరవిందుడు.

పోతే, "మమాత్మా" = నా ఆత్మ (9-5) - అనుట నిజానికి సరిగాదు. ఏలన, భగవంతుడు ఆత్మయేగనుక, మమ ఆత్మా-ఆత్మకు ఆత్మ-యనుట పొసగదు. మూఢులు దేహమే తా మనుకొని, 'నా ఆత్మ' - అని అందురు. అట్టి ప్రయోగము లోకమునం దుండుటచే, భగవానుడు 'నా ఆత్మ' - అనెను గాని, జ్ఞానుల దృష్ట్యా గాదు - అని శంకరుడు వ్యాఖ్యానించును. తన యోగమాయచేత ఏ పరమపురుషుడు ఆత్మ మఱియు భూతములు-రెండింటిని అభివ్యక్తము గావించి, వాని విరోధమును దొలగించుచు, వానికి పైన, వాని సంగమస్థానముగా నున్నాడో, ఆ పరమపురుషుని శ్రీ శంకరుడు ఆత్మమాత్రముగా జమకట్టును ఇది అసమగ్రజ్ఞానము కాదా ?

ఈ అసమగ్ర జ్ఞానము కారణముగానే, 'నా-ఆత్మ'- అను పదమునకు శ్రీ శంకరుడు స్పష్టార్థము చెప్పలేకపోయెను. పైగా, భూతములు భగవంతునియందు లేవు "న చ మత్స్థాని భూతాని" దీనికిని సరియైన అర్థము చెప్పజాలక పోయెను.

అవతారిక : పై అర్థమును దృష్టాంతముచేత సుగమము చేయును.

యథాऽऽకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ. 6

ఎట్లు సర్వవ్యాపి యగు మహా వాయుతత్త్వము ఆకాశమునం దున్నదో, అటులే సర్వభూతములు నాయం దుండుటను నీ వూహించుకొనవలెను.

విశేషార్థము : ఇచట 'నాయందు అన, పైన చూపినట్లు, ఆత్మయం దని అర్థము. ఆత్మయొక్క విస్తారము (extension) ఆధ్యాత్మికము కాగా, ఆకాశము యొక్క విస్తారము భౌతికము అయినను, అంతకంటెను ఎక్కువ సన్నిహితమగు దృష్టాంతము దొరకక, గీత ఆకాశదృష్టాంతము నిచ్చుచున్న - దని శ్రీ అరవిందుడు.

అయినను అనేక సాదృశ్యములు గలవు. ఉదాహరణకు, ఆకాశమువలె ఆత్మయు ఏకము, అచలము మఱియు వాయువువలె భూతములును అనేకము, చలము. ఒకటి ఆధారము. రెండవది ఆధేయము.

అవతారిక : ఇట్లు స్థితికాలమున నాయం దున్న భూతములు –

సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికాం,
కల్పక్షయే, పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహం. 7

అర్జునా! సర్వభూతములు కల్పాంతమునందు – ప్రళయకాలమున – నా ప్రకృతిని బొంది, అం దడగియుండును. తిరిగి మఱియొక కల్పముయొక్క ఆది యందు–సృష్టికాలమున వానిని నేను సృజింతును.

విశేషార్థము : 'నా ప్రకృతి'= నా స్వీయ దివ్యప్రకృతి-యని శ్రీ అరవిందుడు జీవునియొక్క మూలప్రకృతి, పరప్రకృతియే (7-5). సృష్టికాలమున ఈ యా వ్యక్తిత్వములను ధరించు జీవుడు ప్రళయకాలమున తన స్వభావమేయగు పరప్రకృతిని బొందును. ఆ స్వభావము ననుసరించియే, తనకు తెలిసినను, తెలియకపోయినను, జీవుడు పురోగమించుచుండును – తెలియ నపుడు అవశముగాను, తెలిసి నపుడు స్వవశముగాను, అనగా ప్రకృతిపై ప్రభుతతో (9-8).

పోతే, 'నా ప్రకృతి'= నా త్రిగుణాత్మక నికృష్టప్రకృతి–యని శ్రీ శంకరుడు. పరప్రకృతిని బొందిన జీవుని కిక జన్మయుండదు గాన, జీవుడు పొందునది అపర ప్రకృతి యని బహుశః శంకరుని భావము. కాని పరప్రకృతినే, మనము మన నిద్రలో

వలె, జీవుడు తెలియక పొందినపుడు, అతని కెందుకు జన్మ యుండగూడదు. అంతే కాదు. తెలిసి పొందినపుడు మాత్ర మెందు కుండగూడదు? అపుడు ప్రకృతికి వశుడై కాక, భగవంతునివలె ప్రకృతిని వశము చేసికొని (4-6) అతడు లోక సంగ్రహార్థము జన్మించవచ్చును.

ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః,
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్. 8

(అజ్ఞానమువలన) స్వభావమునకు వశమైయుండుటచే అస్వతంత్రమగు నీ సమస్త భూతసముదాయమును నా ప్రకృతి నదిమి పట్టి - బలాత్కరించి-తిరిగితిరిగి సృజింతును.

విశేషార్థము: పైశ్లోకము క్రింద చూడవలెను. సృష్టి భగవంతుని ఆశయ పరిపూర్తికి. కావున ప్రతిజీవుడు సృష్టిచక్రమున పురోగమించుచు, తనకు నియుక్తమైన కార్యమును నెరవేర్చవలసియుండును. కావున జీవుని కిష్టము లేకపోయినను ఈశ్వరు డతనిని బలాత్కారముగా బుట్టించును. కావున నిచ్చట, 'అవష్టభ్య' = బలాత్కరించి-అను పదమను ప్రయోగించెను కాని జీవుడు అజ్ఞానమునుండి వెలువడి, పరప్రకృతిలోనికి ఉద్గమించి నపుడు, అతనికి భగవదాశయము తెలియును. మఱియు అతడు దానిని నెరవేర్చుటకుఇష్టముతోనే జన్మించును. ఇచ్చట బలాత్కారమునకు బనిలేదు. అందుచేత నతడు భగవంతునివలె తానే స్వయముగా తన ప్రకృతిని వశము చేసికొని జన్మించును. అందుచేత (తన ప్రకృతిని) 'అధిష్ఠాయ' = వశము చేసికొని (4-6) అను పదము ప్రయోగింపబడినది - అని శ్రీ అరవిందుడు సూక్ష్మ వివేచన చేయును.

అవతారిక: ఇట్టి సృష్టికర్మలు భగవంతుని బంధించునా? —

నచ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు. 9

మఱియు, నర్జునా, ఆ సృష్టికర్మల విషయమున నేను ఉదాసీనునివలె నుందును. కావున నా కర్మలయందు నే నసక్తుడను, అందుచేతనే ఆ కర్మలు నన్ను బంధించవు.

విశేషార్థము : ఇచ్చట 'నేను. నన్ను' - అని చెప్పుచున్న భగవంతుని శ్రీ శంకరుడు ఆత్మమాత్రముగనే పరిగణించును. మఱియు ఆత్మ అవిక్రియము గనుక, అది ఉదాసీనము, అనగా ఉపేక్షకము - అది సర్వమును ఉపేక్షించును గాని, దేనిని పట్టించుకొనదు. ఇంకను ఆత్మ అకర్త గాన, నేను చేయుచున్నా - నను అభిమానము దాని కుండదు గాన, అది ఆ కర్మలయందు అసక్తము. అది సాక్షిగా చూచుచుండగా, ప్రకృతియే కర్మల జేయును. దీనిని బట్టి, నేను సృజించుచున్నాను - అని చెప్పిన భగవంతుని పాత్ర సాక్షిత్వము మాత్రమే.

కాని అరవిందు డేమి చెప్పును ? సృష్టిచక్రమును జీవునివలె ఈశ్వరుడును అనుగమించును. అయితే అతడు ఆ సృష్టిలో అంతర్వర్తి పురుషుడుగనే యుండి, దానిని నడుపును గాని, దానికిఅధీనుడు గాడు; అతని సత్తయంతయు దానిలో మునిగి పోదు, అతని సచ్ఛాశక్తి దాని ననుగమించి నడుపుచుండును. అనగా, నతడు తన ప్రకృతిక్రియకు పైన,దానికి 'అధ్యక్షుడుగా'(9-10)నుండి,ఆ క్రియను నియమించును. కనుక, ఉదాసీనుడు = ఉత్ + ఆసీనుడు, పైనున్నవాడు, పైనుండి నడుపువాడు, అధ్యక్షుడు. కనుక ఉదాసీనుడు, శ్రీ శంకరుడు చెప్పు నట్లు, సాక్షి గాడు. భగవంతుని పాత్ర సాక్షిత్వము మాత్రమే గాదు, సక్రియనియామకత్వము. అయినను అతడు సక్తుడు గాకపోవుటకు కారణము - అతడు ప్రకృతిలో నుండియు, ప్రకృతి కతీతుడు (అధ్యక్షుడు).

మ యాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరం,
హేతు నానేన కౌంతేయ జగ ద్విపరివర్తతే. 10

నేను అధ్యక్షుడనై యుండుటచేత, ప్రకృతి చరాచర జగత్తు నంతను ప్రసవించుచున్నది, తనలోనుంచి అభివ్యక్తముచేయుచున్నది. ఈ నా అధ్యక్షతయే జగత్తు నానావస్థలయందు పరివర్తన జెందుటకు గారణము.

విశేషార్థము : ఆత్మకు సంకల్పము లేదు, కాని భగవంతునికి సంకల్పము (will) గలదు ఈ సంకల్పమే సృష్టిక్రియకు మూలము. కనుక సృష్టిక్రియ యందు భగవంతుని పాత్ర సాక్షిత్వముమాత్రమే గాదు. అతడు తన ఆత్మరూప మున సాక్షిగా నుండును, నిజమే. మఱియు నీ సాక్షిత్వము మంచిని, చెడును - రెంటిని-సమముగా ధరించును, అదియు నిజమే. కాని దీనికి పైన, చెడునుంచి మఱలించి, మంచియొక్క మార్గమున జగత్తును నడిపించు ఈశ్వరుని అధ్యక్ష సంకల్ప మొక టున్నది

అవతారిక : శరీరమునం దున్న భగవంతుడును పైనున్న ఈ భగవంతుడే యని తెలియక -

**అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం,**
**పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరం. 11**

సర్వభూతములయొక్క మహేశ్వరరూపమున నుండు నా పరమ తత్త్వము నెఱుంగక, మానవతనువు నాశ్రయించి వ్యవహరించుచున్న నన్ను అవమానించువారు మూఢు లగుదురు.

విశేషార్థము : ఈ సృష్టి క్రియ భగవంతుని పరప్రకృతి క్రియ గాన, మఱియు పరప్రకృతి భగవంతునినుండి ఎప్పుడును విడివడి యుండదు గాన, ఆమె సృష్టించు ప్రతివస్తువునందును భగవంతుడు అంతర్వర్తిగా నుండును. కాని ఆ వస్తువుయొక్క బాహ్యరూపములచే వంచితులైన మూఢులు ఆ వస్తువునే తృణీకరింతురు. అట్లు తృణీకరించువారు దానిలోని భగవంతు నెప్పటికిని గుర్తించలేరు. అవతారదేహమునం దున్న భగవంతుడు తన పరభావమును - సృష్టి కతీతమగు తన భావమును - ఎఱింగియుండును. పోతే సామాన్య మానవదేహము నందలి భగవంతునికి ఈ ప్రజ్ఞ యుండదు, ఇచ్చట అదే భగవంతుడు నిప్పుమాయచేత ఆవరింపబడియుండును.

ఇట్లు ఈ శ్లోకము నందలి 'మానవతనువును' సర్వమానవుల తనువుగా వ్యాఖ్యానించినవారు శ్రీ అరవిందు డొక్కడే. దీనిని బట్టి - నేను సర్వమానవ తనువులలోను ఉన్నాను. మానవతనువును జూచి మోసపోయి, మానవు డా తనువు మాత్రమే నని అతని నవమానించరాదు. అట్లు లోనికిజూడక, అవమానించిన వారు లోన గుప్తముగా నున్న భగవంతు నెప్పటికి దెలియజాలరు - అని శ్రీ కృష్ణుడు చెప్పినట్లయ్యెను.

పోతే, శ్రీ కృష్ణుని మానవతనువును జూచి, అతని పరమభావ మెఱుంగక, మూఢు లతని నవమానింతు రని ఇతరవ్యాఖ్యానము.

మఱియొక సూక్ష్మాంశము: మూఢు లవమానింతు రని ఇతరులు అనువదించగా, అవమానించినవారు మూఢు లగుదు రని శ్రీ అరవిందు డనువదించెను సర్వమానవ తనువును దీసికొని నప్పు డిదియే సరియైనది.

అవతారిక : ఎందుచేత అవమానింతురు ? ఎట్లు మూఢు లగుదురు ?—

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. 12

మోహకరమగు రాక్షసుల మఱియు నసురుల స్వభావము నాశ్రయించిన వారి ఆశలు వ్యర్థము, వారి కర్మలు వ్యర్థము, వారి జ్ఞానము వ్యర్థము, వారు బుద్ధి హీనులు, అనగా వారి ఆత్మవిషయక బుద్ధి నశించిపోవును.

అవతారిక : దీనికి ప్రతిగా దైవప్రకృతి నాశ్రయించిన వారు –

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః,
భజం త్యనన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయం. 13

పోతే, దైవప్రకృతి నాశ్రయించిన మహాత్ములు (విశాలహృదయులు), పార్థా నన్ను భూతములకు మూలముగను, (అయినప్పటికీ) అవ్యయునిగను దెలిసికొని, అనన్యమనస్సుతో నన్ను భజింతురు

విశేషార్థము : తెలిసికొనుచు భజింతురు, భజించుచు, తెలిసికొందురు. దేనిని దెలిసికొందురు ? మానవునియందు నిగూఢముగా నుండి, మానవస్వభావము చేత పరిమితమై నట్లు గన్పించు మానవునిలోని భగవంతుడు, మానవునికి వెలుపల ఏ పరమపురుషుని మనము భగవంతునిగా భజించుచున్నామో, ఆ పరమపురుష రూపమగు అనిర్వచనీయ మహతేజమే యని తెలిసికొందురు–అని శ్రీ అరవిందుడు. ఇతరులు తెలిసికొని భజింతు రని మాత్రమే చెప్పిరి.

మఱియు వీరు మహాత్ము లెట్లైరి ? అహంకార కారాగారములో బంధింప బడక, హృదయస్థితుడగు భగవంతునికి వికసించుటచేత. వీరు సర్వమునగు వాసుదేవుని తమ హృదయములో నిముడ్చుకొనగలిగిన మహాత్ములు (7-19). జ్ఞానులు గాన మహాత్ములు, మహాత్ములు గాన భక్తులు. అటులే భక్తులుగాన జ్ఞానులు, జ్ఞానులు గాన మహాత్ములు. ఇట్లు భక్తి మొదలు తుదియు గూడ.

అవతారిక : ఈ మహాత్ముల భజనస్వరూపము ?

సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః,
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. 14

ఈ మహాత్ములు నన్ను సతతము కీర్తింతురు, దైవసంపత్తిసంవర్ధనముకొఱకు యత్నము చేతురు, భక్తివిషయక మగు దృఢవ్రతముల నవలంబింతురు మఱియు వారు నమస్కరింతురు. ఇట్లు భక్తిచేత నాతో నిత్యయోగమునం దుండి, వారు నన్ను ఆరాధింతురు.

విశేషార్థము : 'ఉపాసతే' = సేవింతురు, ఆరాధింతురు – అని సామాన్యముగా నర్థము చెప్పుదురు. కాని, ఉపాసతే = ఉప + ఆసతే = సమీపమున కూర్చొని యుందురు, సన్నిధిలో నుందురు, నానుండి వారికి భావమున ఎడబాటు ఉండదు (6-30) ఈ ముఖ్యార్థమే 'నిత్యయుక్తులు'-అను పదమునకు అనురూపమైన అర్థము.

అవతారిక : ఈ భగవదుపాసకులలోనే మఱికొందరు –

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖం. 15

మఱికొందరు జ్ఞానయజ్ఞముచేత నన్ను ఆరాధించుచు నుపాసింతురు. వీరు ఏకముగాను, వేఱువేఱుగాను, విశ్వరూపమునను నున్న నన్ను అనేక విధములుగా నుపాసింతురు.

విశేషార్థము : 'మఱికొందరు' అనగా క్రిందటి శ్లోకములో 'భక్తితో నుపాసింతరు'-అని చెప్పిన భక్తులకంటె అన్యులని గాదు, జ్ఞానసహితభక్తు లనియే దాని అర్థము (7-17).

జ్ఞానయజ్ఞము = జ్ఞానరూపయజ్ఞము, అనగా జ్ఞానమే యజ్ఞము. ఎట్లు? జ్ఞానముదయించి నపుడు, విశ్వక్రియ యంతయు భగవంతుని కర్పించబడుచున్న యజ్ఞమే యని మనము గాంతుము, మఱియు దానిలో మనముపాల్గొందుము (4-24).

'ఏకత్వేన' – ఇది విశ్వగతమైన భగవంతుని ఏకత్వము; విశ్వాతీతమైన భగవంతుని ఏకత్వము 'భూతాదిం' – అని 13-వ శ్లోకమున జెప్పబడినది – అని శ్రీ అరవిందుడు. అభివ్యక్తియందు నైతము అనేకతకు ఏకత ఆధారముగా లేనిచో, ఆ అనేకత మనజాలదు. ఈ ఏకుడు వాసుదేవుడు – "వాసుదేవః సర్వం" (7-19). కోతే విశ్వాతీత ఏకుడు సర్వము గాడు, సర్వమూలం – "భూతాదిం" (9-13). శ్రీ శంకరు డీ వివేచన చేయలేదు.

భగవంతుడు సృష్టిక్రియకు ఏకకాలమున అవశ్యకమగు మూడు శాశ్వత రూపములను ధరించియున్నాడు – 1 విశ్వాతీతుడు, 2. విశ్వగతుడు, 3. వ్యక్తి గతుడు. ఇది శ్రీ అరవిందుని యొక ముఖ్యభావన. 13, 15 – శ్లోకాలలో నీ మూడు రూపములు మనకు గన్పించును శ్రీ శంకరునికి ఇందలి 2, 3 – రూపములు వ్యావహారికముగా మాత్రమే యున్నవి. కాని అవియు సత్యమే యని గీత యిట్లు చెప్పును —

అహం క్రతు రహం యజ్ఞః స్వధాఽహ మహ మౌషధం,
మంత్రోఽహ మహమే వాజ్య మహమగ్ని రహం హుతం.16

శ్రౌతక్రతువు నేనే, స్మార్తయజ్ఞము నేనే, పితరుల కర్పించు అన్నము నేనే, సర్వసాధారణ అన్నమును నేనే, అటులే మంత్రము, ఆజ్యము, అగ్ని, హవన క్రియ – అన్నియు నేనే చూ. (4–24)

విశేషార్థము : భగవంతుని ప్రకృతియే విశ్వమునందలి సర్వము నయ్యెను గాన, ఆ విశ్వమునందలి ప్రతి వస్తువును తన అంతర వాస్తవము (fact) నందు భగవంతుడే యని శ్రీ అరవిందు డీ శ్లోకము వెనుక నున్న ఉపపత్తిని (rationale) జూపును. భగవంతుని సమగ్రజ్ఞానము (7-1) నందు ఇది యొక ముఖ్యభాగము – విజ్ఞానము.

భక్తిజ్ఞానకర్మలు, మూడును ఒకదానిలో నొకటి అంతర్గతముగా నున్నను, స్థూలముగా (9–14) భక్తియోగమును, (9–15) జ్ఞానయోగమును, (9–16) కర్మ యోగమును ప్రతిపాదించుచున్నవి. జ్ఞానయోగమున స్వభావసిద్ధముగా, తనకుదానే, జరుగుచున్న కర్మను యజ్ఞముగా జూతుము. కాగా కర్మయోగమున ఇచ్ఛా పూర్వకముగా జేయబడు కర్మను కర్మయోగముగా జూతుము. ఇచ్చట మన సంకల్పము మఱియు దాని కర్మకలాపము పురుషోత్తమునికి జేయబడు ఒక పూర్ణాహుతిగా గన్పించును. ఇట్లు కర్మయోగమును ఆత్మసమర్పణరూపమగు ఒక ఆరాధన మఱియు భక్తియే యగును.

అవతారిక : ఈ సమర్పణాయోగికి భగవాను డెట్లు గన్పించును ? —

పితాఽహ మస్య జగతో మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామయజు రేవచ. 17

నే నీ జగత్తునకు పితను, మాతను, తాతను, (ఆది స్రష్టను), ధాతను (కర్మ ఫలవితరణకర్తను), అటులే వేద్యవస్తువు, పవిత్రవస్తువు, ఓంకారము మఱియు ఋక్కు, సామము, యజస్సు—అను వేదమంత్రములును నేనే.

విశేషార్థము : భగవాను డిట్లు చెప్పుటయే గాదు, భగవానుని కెవడు ఆత్మ సమర్పణము గావించుకొనెనో, భగవాను డతనికి తనను పోషించి, పెంచి కాపాడు తండ్రిగా తెలియవచ్చును. మఱియు నా భగవానుడు అతనిని తన ఒడిలో లాలించుచు, తన ప్రేమమాధుర్యము నతనిపై వర్షించు దివ్యజననిగా నెఱుంగబడును. ఇట్లు ఈ పితృత్వమాతృత్వములు, కేవలాద్వైతులు దలంచు నట్లు, ఉపాసనకొఱకు బ్రహ్మపై నారోపించబడిన భావనలు గావు, అవి అనుభవసత్యములు. వారు చెప్పు నట్లు, నిర్విశేష బ్రహ్మమే చరమతత్త్వ మగుచో, అపు డీ భావనలు ఆరోపణ లగును. కాని నిర్విశేష బ్రహ్మము గాక, పురుషోత్తముడే చరమ తత్త్వము.

గతి ర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్,
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజ మవ్యయం. 18

మఱియు సమగ్రయోగి గనున దేమన, భగవంతుడే తన పరమ గమ్యము, తన సత్తకును, సర్వసత్తకును ప్రభువు, తన ప్రకృతికి భర్త, తన తలపులు మఱియు క్రియలకు అంతరసాక్షి అటులే భగవంతుడు తనకు గృహము, తన ఆకాంక్ష కామనలకు శరణము, సర్వభూతములకు దయామయ మిత్రుడు. పునరావృత్తిశీలమగు జగత్తునకు జన్మస్థాన, స్థితిస్థాన, లయస్థానములు, మూడును భగవంతుడే. ఇంకను విశ్రాంతిస్థానమును, అవ్యయబీజమును భగవంతుడే యని అతనికి గోచరించును

విశేషార్థము : పరమాత్మకు తనను సమర్పించుకొన్న వానికి విధి (fate), మఱియు సందిగ్ధ పర్యవసానము భయకారణములు గావు, అటులే దుఃఖము మఱియు పాపముల సమస్య అతనిని వ్యాకులపెట్టదు. ఏలన గమ్యము భగవంతుడు మఱియు దుఃఖపాపములు మార్గమున గన్పించు ఆగంతుక ఆభాసములు మాత్రమే — అని శ్రీ అరవిందుడు.

తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామిచ,
అమృతం చైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున. 19

సూర్యుని వేడియందు వెలుగువాడను నేనే; వర్షమును వదలువాడను, బిగబట్టువాడను నేనే; అమృతమును, మృత్యువును నేనే; సత్తును, అసత్తును నేనే.

విశేషార్థము : మృత్యువు నా ముసుగు, అమృతము నా స్వరూపావిష్కరణము - అని శ్రీ అరవిందుడు మర్త్యుల మృత్యువును నేను, అమరుల అమృతత్త్వమును నేను - అని శ్రీ శంకరుడు

దేనిని మనము 'ఉన్నది' అందుమో, అది సత్తు, ఆ సత్తు నేను; దేనిని మనము 'లేదు' అందుమో, అది అసత్తు. ఆ అసత్తు నేను ఈ అసత్తు కేవలము అసత్తు గాదు, మన బుద్ధికి మాత్రమే అది అసత్తు. అనిర్వచనీయ మూలతత్త్వము యొక్క అగోచరభావమునందు ఆ అసత్తు మనకు దెలియని విధముగా నుండును. ఇచ్చట శ్రీ శంకరారవిందు లిరువురు నిట్లే చెప్పుచున్నారు.

ఈ ప్రకరణమునందు ముఖ్య భేద మేమన, కొందరు ఏకత్వముచేతను, కొందరు బహుత్వముచేతను భగవంతు నుపాసింతు రని శ్రీ శంకరుడు చెప్పగా, ఏకత్వముచేతను, బహుత్వముచేతను-ఉభయథా పూర్ణజ్ఞానులు భగవంతు నుపాసింతు రని శ్రీ అరవిందుడు చూపెను.

అవతారిక : ఈ ఆంతర జ్ఞానమును గాక,బాహ్య మతము నవలంబించువారు-

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే,
తే పుణ్య మాసాద్య సురేంద్రలోకం
అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్.

వేదములయొక్క బాహ్యార్థమును మాత్రమే ఎఱింగి, కర్మకాండపరుడై, సోమరసపానము ద్వారా స్వర్గప్రాప్తి కడ్డువచ్చు పాపమును క్షీణింపజేసికొని, నాకు (నా దేవతారూపములకు) యజ్ఞము గావించి, స్వర్గగమ్యమును బ్రార్థింతురు. ఇట్లు పుణ్యఫలమగు దేవేంద్రలోకమున కేగి, అచ్చట దివియందు దివ్యమగు దేవభోగములను ననుభవింతురు.

విశేషార్థము : మన పార్థివ జీవనము మఱియు పార్థివ వ్యాపారమే మన సంభూతి (పరిణామము) యొక్క సమస్త క్షేత్రమును గాదు. విశాలతర సుఖము నీయగల స్వర్గాదిలోకములును గలవు. ఆయా నియమములను బాటించిన ఆయా లోకములను బొందవచ్చును; ఇదియే శ్రీ అరవిందుడు ఆధునికులకు జెప్పిన మాట, పోతే, ఆ నియమములందు ప్రథమ నియమము విశ్వాసము.

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే. 21

వారా విశాలమగు స్వర్గలోకసుఖముల ననుభవించి, ఆ అనుభవముచేత తాము చేసిన పుణ్యము క్షీణించిపోగా తిరిగివచ్చి భూలోకములో ప్రవేశింతురు ఇట్లు వేదముల బాహ్యధర్మము నాశ్రయించినవారు, అనగా కామపరాయణులు స్వర్గ భూలోకముల మధ్య తిరుగుచుందురు.

విశేషార్థము : పుణ్యము క్షీణించి నపుడు భూలోకమునకే ఏల రావలెను ? మఱల పుణ్యము సంపాదించుట కని వేదవాదరతులు (2-42) జవాబు చెప్పవచ్చును. అదియు కామకాముల పట్ల కొంతవరకు నిజమే. కాని మూలకారణ మేమన, భూలోకజీవనముయొక్క వాస్తవ లక్ష్య మింకను గుర్తించబడలేదు, పొందబడలేదు, మఱియు నా లక్ష్యము ఈ మర్త్యలోకమున మాత్రమే పొంద శక్యము. ఆ లక్ష్య మేమన, అపూర్ణ మానవ భౌతిక ప్రకృతిలోనుండి అంతరాత్మ యొక్క దివ్య ప్రకృతిని వికసింపజేయుట. ఇది సిద్ధించువఱకు పునర్జన్మ మనపై వచ్చిపడుచునే యుండును - అని శ్రీ అరవిందుడు. ఈ లక్ష్యసిద్ధికి పర్యాప్త సాధనము ? —

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహం. 22

ఏ జనులు అనన్యులై, అనగా నాతో అభేదమునం దుండి, నన్ను గుఱించి చింతింతురో, మఱియు అనుక్షణము నాతో యోగమునం దుందురో, మఱియు సర్వ భూతములయందు నన్ను ప్రేమింతురో, అదిగో, వారి యోగక్షేమములను నేను వహింతును.

విశేషార్థము : 'అనన్యులు' = ఇతర విషయములపై మనస్సును పోనీయని వారు-అని కొందరు వ్యాఖ్యానము ఇది చాల స్థూలార్థము, మఱియు సందర్భమునకు సరిపోదు. పోతే, అనన్యులు = భగవంతునితో ఏకాత్మకులు - అని శ్రీ శంకరుడు. ఇది చాల మెఱుగు, కానిఇదియు నపూర్ణమే. అనన్యులు = భగవంతునితో అభిన్నులు-అని శ్రీ అరవిందుడు. అభిన్నులు అనగా, ఆత్మయందు భగవంతునితో ఏకాత్మకులు, ప్రకృతియందు భగవంతునితో సమధర్ములు - 'సాధర్మ్యమాగతాః' (14-2)-అని అర్థము. ఇట్లు శ్రీ శంకరుడు తాదాత్మ్యమును జెప్పగా, శ్రీఅరవిందుడు పూర్ణతరమగు సాయుజ్యమును (= తాదాత్మ్యము - సాధర్మ్యమును) జెప్పుచున్నారు. ఈ సాయుజ్యము భగవంతునితో కేవల ఏకత్వము గాదు, కేవల ఏకత్వమే అయితే ఉపాసనయే యుండదు. అది భగవంతునితో భేదాభేదము. అందుచేతనే గీత ఏకమనకుండ అనన్య మను చున్నది — "అనన్యా శ్చింతయంతః"

శ్రీ శంకరునికి ప్రకృతి మిథ్య గనుక, కేవల ఏకత్వమే మిగులునది. కావున "ఏ జనులు ఉపాసింతురో" అని చెప్పిన గీతా వచనమును హఠాత్తుగా "ఏ సన్యాసి జనులు...."అని మార్చివేసినారు!

ఇది 'పర్యుపాసతే' పదమునకు విరుద్ధము. ఎట్లన, పర్యుపాసతే = పరి + ఉపాసతే; పరి = అంతటను, అన్నింటియందును, ఉపాసతే = భగవంతుని ప్రేమించును, అన్నింటియందును భగవంతుని ఆహ్లాదమును బొందును. కాగా ప్రకృతి మిథ్యయే యగుచో, ప్రకృతి ధరించిన రూపములే అయిన అన్నింటియందును భగవంతుని పర్యుపాసించుట ఎట్లు సంభవమగును?

ఈ 'పర్యుపాసతే' అను పదముచేత మన కింకను దెలియున దేమన, తన భగవద్దర్శనము భక్తుని జీవనమునుండి వేఱుచేయదు; అంతే కాదు, పూర్ణజీవనము యొక్క ఏ అంశమును అతడు పోగొట్టుకొనడు. ఏలన భగవంతు డతనికి సర్వ శుభముల సహజప్రదాత యగును మఱియు నతని ఆంతర మఱియు బాహ్య-సమస్త యోగక్షేమములను వహించును.

భగవంతుడు భక్తుని యోగక్షేమములను వహించు ననగా, అతని బాహ్యావసరములను దీర్చును, అతనికి అన్నపానములను సమకూర్చును - అను భావముతో నితరులు వ్యాఖ్యానింతురు. కాగా, ఆంతర మఱియు బాహ్య యోగక్షేమములను సమకూర్చునని చెప్పి, శ్రీ అరవిందుడు ఆంతరమునకు ప్రాముఖ్య మిచ్చుచున్నారు. ఆంతరయోగ

క్షేమములను వహించు నన, భగవంతుడు భక్తునకు బుద్ధియోగము నిచ్చును(10-10), జ్ఞానదీపముచేత లోని అంధకారమును రూపుమాపును (10-11)

ఇంత చెప్పినను, ఈ దశలోని భక్తునకును, భగవంతునికి గల పూర్ణ సంబంధము మన కింకను అవగతము కాలేదు. ఆ సంబంధమును శ్రీ అరవిందుడు తన అనుభవమునుండి ఇట్లు వ్యక్తము చేయును — "భక్తుడు భగవంతునిలోనికి పెరుగును, కాగా భగవంతుడు గూడ తన అనంత సత్తయొక్క సమస్త ప్రకాశము, శక్తి మఱియు ఆనందములతో వెలువడి అతనిపైకి ప్రవహించును. ఇట్టి తఱి భూలోక స్వర్గలోక సుఖ మంతయు అతని మహాసంపత్తియొక్క ఒక స్వల్పచ్ఛాయా మాత్రమే యగును"

అవతారిక : ఇతరదేవతాభక్తులకు, నాకు గల సంబంధము ? —

యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మామేవ కౌంతేయ యజం త్యవిధిపూర్వకం. 23

ఇతర దేవతలను శ్రద్ధతో నారాధించు నే ఇతరదేవతాభక్తులు గలరో, వారును, కౌంతేయా, నన్నే ఆరాధించుచున్నారు, అయితే క్రమము తప్పి. అవిధిపూర్వకముగా.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ,
నతు మా మభిజానంతి తత్త్వే నాత శ్చ్యవంతి తే. 24

వారు నన్నే ఏల నారాధించుచున్నా రనగా, నేనే సర్వయజ్ఞములకు భోక్తను మఱియు ప్రభువను (5-29. 8-4). కాని వారు యథార్థముగు నా అభివ్యక్తి - తత్త్వమున నన్నెఱుంగుట లేదు. కావుననే వారు పతనము నందుచుందురు

విశేషార్థము : 'తత్త్వేన' = అభివ్యక్తితత్వమున 'నేను జలమునందు రసమును' (7-8). అనగా రసము జలముయొక్క అభివ్యక్తితత్వము అటు భగవంతుడు యాదవకులమునందు అవతరించి నపుడు, ఆ మానవదేహములోనిదే భగవత్తత్త్వము అభివ్యక్తితత్త్వము. అటులే దేవతల రూపమున ఏ భగవత్స్వరూపము గలదో, అది దేవతల విషయమున అభివ్యక్తితత్త్వము. వారి యజ్ఞము, లోని ఈ తత్త్వముపై నాధారపడక, బైటి దేవతారూపముపై నాధారపడుచున్నది. అందుచేత వారి యజనము అవిధిపూర్వకము. ఈ యజనముయొక్క విషయముగు దేవత అల్పము, దాని ఫలిత మల్పము, కావుననే వారికి పతనము.

అవతారిక : ఆ ఫల మెట్లు అల్పమో, ఇపుడు చూచెదము –

**యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః,**
**భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మాం.** 25

దేవతల భక్తులు దేవతలను, పితరుల భక్తులు పితరులను, భూతముల భక్తులు భూతములను బొందునట్లే, నా భక్తులు గూడ నన్నే పొందుదురు.

విశేషార్థము : భూతము లనగా మానవుల నావేశించి, పీడించునట్టి ప్రేతముల వంటి సత్త్వములు గావు ప్రకృతిలో నే ప్రకృష్ట వస్తువులు గలవో, వాని అధిష్ఠాన దేవతలే ఇక్కడ భూతము లను పదమున కర్థము. ఉదాహరణకు, మనకు దేదీప్యమానముగా గన్పించు సూర్యగోళముయొక్క ఆత్మ సూర్యభూతము. ఈ భూత భజనము అహంకారమునుండి బైటబడుటకును, పరమపురుషునితో ప్రథమపరిచయ మేర్పఱచుటకును దోడ్పడును గాన, అదియు నింద్యము గాదు – అని శ్రీ అరవిందుడు.

అవతారిక : ఆత్మసమర్పణరూపమగు (9-22) ఈ భక్తి మహిమ ఎట్టి దనిన –

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,**
**తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.** 26

ఎవడు నాకు భక్తితో ఆకును, పూవును, పండును లేక జలము నైనను అర్పించునో, అది నాకు భక్తితో నివేదించబడినది గాన, ప్రియమగును. కావున పరిశుద్ధబుద్ధియగు అతని ఆ నివేదనను నేను స్వీకరింతును.

విశేషార్థము : శుద్ధబుద్ధి యన నేమి? ఏకమాత్ర సంకల్పముగలిగి (2-41) కామవిక్షేపములు లేని బుద్ధి యని ప్రథమార్థము. ఆత్మసమర్పణాత్మకమగు భక్తి చేత భగవంతునితో యోగము సిద్ధించును. ఆ యోగమునందు బుద్ధికి భగవంతుని సంకల్పమే తన సంకల్పమగును. ఇట్టి బుద్ధి శుద్ధమే కాక, పరిశుద్ధము. ఈ బుద్ధి అనన్యభక్తిని దెలుపును. చూ. (9-22) యొక్క విశేషార్థము.

అవతారిక : ఇట్టి భక్తితో –

**యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,**
**యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం.** 27

అర్జునా : నీవు దేనిని చేతువో, దేనిని తిందువో, దేనిని యజ్ఞమున వేల్తువో దేనిని దానముగా నిత్తువో, ఏ తపస్య చేతువో, దాని నెల్ల నాకు జేయబడిన ఒక నివేదన (offering) గావించుకొనుము.

విశేషార్థము : ఈ భక్తియందు ఎట్టి సామాన్య సందర్భమైనను ఒక దివ్య మూల్యమును సంతరించుకొనును. అది భగవంతుని కొరకు ఆమోదయోగ్య నివేదన యగును; భక్తుని ఆత్మను, ప్రాణమును తన కధీనము చేసికొనుటకు భగవంతు డీ నివేదన నొక సాధనము గావించుకొనును. ఇదియే ఆ నివేదనయొక్క దివ్య మూల్యము-అని శ్రీ అరవిందుడు. ఇట్లు కర్మను విడువ నవసరము లేదు, దాని కొరకు దివ్యమూల్యమును గల్పించవలెను. అట్టి కర్మ జీవనమును దివ్యజీవనములోనికి మార్చును

అవతారిక : ఈ 'మదర్పణ' ఫలితమును వినుము!-

శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః,
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి. 28

ఇట్లు చేయుచు దంతయు మదర్పణము గావించుము, శుభాశుభఫలముల నిచ్చు కర్మబంధనముల నుండి నీవు విముక్తుడవయ్యెదవు. ఇక నీ సంన్యాసయోగముచే విముక్తుడవైన నీవు నన్ను బొందెదవు.

విశేషార్థము : సంన్యాసయోగము = సంన్యాసము + యోగము, భగవంతునికి సమర్పించుటచేత సంన్యాసము మఱియు కర్మ నాచరించుటచేత యోగము - అని సందర్భమును బట్టి శ్రీ శంకరుడు గూడ, తన సిద్ధాంతమునకు వ్యతిరేక మైనను, ఉన్న దున్నట్లు వ్యాఖ్యానించెను.

'నీ వేమి చేయుదువో నా కర్పించుము' (9-27) అని చెప్పుటను బట్టి నీవు కర్మఫలమునే కాక, నీ కర్మనే నాకు సమర్పించుము (3-30)-అని చెప్పి నట్లైనది. అనగా ఈ సంన్యాసయోగము = అంతర కర్మసంన్యాసము + బాహ్యకర్మాచరణము.

పోతే, భగవంతునికి కర్మ సమర్పించుట యన, నిజానికి ఏ భగవన్మూలము నుండి కర్మ వెలువడు చున్నదో, ఆభగవంతుడే వాస్తవానికి కర్మ కర్తయని, ఆ కర్మకు మనము ఉపకరణము మాత్రమే యని గాంచుట. భగవంతుని సమగ్రజ్ఞాన మున్నపుడు, మనము దీనిని గాంచగలము. కనుక అంతర సంన్యాస మన జ్ఞానమే, అంతరసంన్యాసము మఱియు బాహ్య కర్మాచరణ మన జ్ఞానకర్మసముచ్చయమే. కాని

శ్రీ శంకరసిద్ధాంతము జ్ఞాన కర్మ సముచ్చయము అసాధ్య మని వాదించును. ఇట్లు కనుక నీ సందర్భమునందు ఆయన తన సిద్ధాంతమునకు వ్యతిరేకముగా తానే గీతార్థమును వ్యాఖ్యానించవలసివచ్చెను!

'విముక్తుడవై నన్ను బొందెదవు', అనగా విముక్తియే పరాకాష్ఠ గాదు, ఆ ముక్తి ఆధారముగా, ఆ ముక్తిద్వారా నన్ను బొందుటయే పరాకాష్ఠ—యని ఈ మూడు మాటలచేత మనకు తెలియవచ్చును.

విముక్తి యన, నేను చేయుచున్నా—నను అహంకారవిముక్తి. ఇది నిరహంకారము, నిర్వ్యక్తికము నైన అక్షరాత్మయందు మనకు సిద్ధించును. కనుక 'విముక్తుడవై నన్ను బొందెదవు' అన, ముందు అక్షరాత్మను బొంది, తర్వాత పరమాత్మ నగు (15-17) నన్ను బొందెదవు — అని అర్థము

మన ప్రయాణము అక్షరాత్మతో, నిష్క్రియమగు నక్షరాత్మతో నాగిపోయిన అప్పుడు శ్రీ శంకరుని సిద్ధాంతము సత్యమగును; అనగా జ్ఞానకర్మసమన్వయము అసంభవ మగును. కాని అనన్యభక్తి నాశ్రయించి (9-22) మనము పరమాత్మ పరమగమ్యమును చేరుకొని, జ్ఞానకర్మసమన్వయమును సాధించుకొని, పూర్ణులము గావచ్చును—అని గీత సూచించగా శ్రీ అరవిందుడు పదే పదే దానిని స్పష్టము చేయును.

అవతారిక : భక్తి ద్వారము తెఱచును గాన -

**సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,**
**యే భజంతితు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం. 29**

నేను సర్వులయందును సమముగా నున్నాను. కనుక నా కెవడును ప్రియుడును గాడు, అప్రియుడును గాడు అయినను ఎవరు నన్ను భక్తితో భజింతురో, (ఆ భక్తి కారణముగనే) వారు నాయం దుందురు, నేను వారియం దుందును.

విశేషార్థము : భగవంతు డందరికి తల్లి మఱియు తండ్రి (9-17). కనుక ఆయన ఎవనిని ద్వేషించడు ఎవనిని వదలి వేయడు, ఎవనికి శాశ్వతనరకము విధించడు. చివరి కందరు ఆ భగవంతునే బొందుదురు — భగవంతుడు సము డను పదములో శ్రీ అరవిందు డింత అర్థమును జూచుచున్నాడు. మా మతములోనికి రాక పోతే, మీకు శాశ్వత నరక మని చెప్పు మతము భగవత్స్వభావమున కెంత విరుద్ధమో గమడు

అయితే చివరి కందరు భగవంతు నెట్లు బొందుదురు? భక్తిచేత. భక్తి భగవంతునికి, మనకు మధ్యనున్న ఒక మూసివేసిన ద్వారమును తెఱచును. ఆ భక్తిద్వారముద్వారా వెళ్లి, మనము భగవంతునిలో నివసింతుము, భగవంతుడు దాని ద్వారా దిగి, మనలో నివసించును; అనగా మానవుడు భగవంతునిలో పూర్ణు డగును, భగవంతుడు మానవునిలో పూర్ణు డగును, మానవునిలో భగవంతుని పూర్ణాభివ్యక్తి సిద్ధించును. ఈ ఉభయపూర్ణతయే సృష్టి లక్ష్యమని శ్రీ అరవిందుని మార్మిక ఋషి వచనము.

అగ్ని అందరి పట్లను సమమే అయినను ఎవ రెక్కువ అగ్నిసమీపమునకు వెళ్లుదురో, వారి చలినే ఆ అగ్ని పోగొట్టును. అట్లే భగవంతుడు నని శ్రీ శంకరుడు. అయితే ఈ దృష్టాంతము చక్కగా నున్నను, అంత సరియైనది మాత్రము గాదు. ఏలన, అగ్ని నిర్వ్యక్తికము (impersonal), దాని సమత్వము నిర్వ్యక్తిక సమత్వము. కాని భగవంతుడు నిర్వ్యక్తికుడు గాడు, ఆయన సమత్వము తండ్రికి తన బిడ్డల పట్ల నుండు సమత్వము. అనుగ్రహపదము జడమగు అగ్నికి వర్తించదు, పరమపురుషుడగు భగవంతునికి వర్తించును అయితే భగవంతుడు అందరను సమముగా ననుగ్రహించును అనగా భగవంతుడు నిర్వ్యక్తిక పురుషుడు(impersonal person), శ్రీ అరవిందుని ఈ భావనను మనము మనస్సునకు బట్టించుకొందుము గాక!

అవతారిక : అనన్యభక్తి మాహాత్మ్యము నింకను ఇట్లు వర్ణించును —

**అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్,**
**సాధురేవ స మంతవ్యః సమ్యగ్ వ్యవసితో హి సః. 30**

ఒక చెంతటి దురాచారవంతు డైనను, నా వైపునకు దిరిగి, అనన్య భక్తితో నన్ను భజించు నేని, అతనిని సాధువనియే తలంపవలెను: ఏలని అతని అనన్య భజనసంకల్పము సమీచీనము (right) మఱియు సంపూర్ణము.

విశేషార్థము : 'సమ్యక్' = సరియగునది, సంపూర్ణమగునది. సంకల్పము సరియైనంత మాత్రాన, అది సంపూర్ణము గానియెడల, కార్యకారి గాజాలదు. అనగా దురాచారుడు భగవంతునికి దిరుగవలెను, అతనిని భజించవలెను, సంపూర్ణముగా — అనన్యముగా — భజించవలెను.

ఈ అనన్యభక్తియే, సంపూర్ణ ఆత్మసమర్పణమే, ఏకైక నియమము. ఇది యుండునేని, కుల గోత్ర భేదాలతో, స్త్రీ పురుష భేదాలతో, పుణ్య పాప భేదాలతో

ప్రమేయమే యుండనవసరము లేదు, ఉండదు. అనుగ్రహ కవాటము అందరికిని తెఱువబడును. ఇది గీత అందరికిని అందించు ఆశాసందేశము, ఇది గీతయొక్క మాతృహృదయము.

వైయక్తిక ఆధ్యాత్మిక సాధనమే గాని, భారతీయ మతమునందు సామూహిక సాధన గన్పించదు - అను విమర్శ యొకటి గలదు కాని సదురాచారులకు గూడ స్త్రీలకు, శూద్రులకు, చండాలురకు గూడ ద్వారము తెఱచు ఈ గీతాసాధన నే మనెదము ? కొందరిలోని స్వార్థము, సన్యాసముపై పట్టు - ముఖ్యముగా నివియే సాధనను సంకుచితపఱచినవి. దానిని సరిచేయుటకే గీత ఉద్భవించినది.

అవతారిక : అతనిని సాధు వని ఏల దలంపవలెను ? -

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి,
కౌంతేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి. 31

ఏలన ఆ సాధుసంకల్పుడు శీఘ్రముగా ధర్మాత్ము డగును మఱియు శాశ్వత శాంతిని బడయును. అర్జునా! నా భక్తుడు నశించడు, నశించడు : ఇది నా ప్రతిజ్ఞా వచనము.

విశేషార్థము : మంచిది, కాని అత డెట్లు ధర్మాత్ము డగును ? మఱియు శీఘ్రముగా నెట్లగును ? ఈ ప్రశ్నలకు సమాధానముగా శ్రీ అరవిందుడు అనన్య భక్తిసాధనలోని రహస్యమును వెల్లడించును -

అనన్యభక్తిసంకల్ప మన సమగ్ర ఆత్మసమర్పణసంకల్పము. ఈసంకల్పము పరమాత్మకవాటము లన్నింటిని పూర్తిగా తెఱచివైచును, మఱియు నపుడు ఆసంకల్ప మునకు సమాధానముగా భగవంతుడు పూర్తిగా మానవసత్తలోని కవతరించి, మానవ సత్తకు తన సంపూర్ణ ఆత్మసమర్పణ గావించుకొనును.

ఇది శ్రీ అరవిందుని పరమవచనములలో నొకటి : మనము భగవంతుని కాత్మసమర్పణ గావించుకొన్నపుడు, భగవంతుడు మన కాత్మసమర్పణ గావించు కొనును : అస్తు.

ఇక మనలోనికి దిగిన ఆ భగవదవతరణము మన నిమ్నప్రకృతిని ఆధ్యాత్మిక ప్రకృతిలోనికి శీఘ్రముగా రూపాంతర మొందించుచు, మనలోని ప్రతి అంశమును మలచి, భగవద్భావనియమముతో నేకరూపము గావించును. ఇదియే అనన్యభక్తుడు శీఘ్రముగా ధర్మాత్ముడగుటకు వెనుకనున్న ప్రక్రియ.

ఇట్లు భక్తియందు సాధకుడు భగవంతుడే: ఇది శ్రీ అరవిందుని మఱియొక సూత్రవాక్యము. కావున భక్తిసాధన సులభము. అంతేకాని, భక్తుడు సాకార భగవంతుని ఉపాసించును, అందువలన భక్తిసాధన సులభము — అనునది బాహ్య సత్యము మాత్రమే. భగవంతుడు భక్తునికి సాకార నిరాకారములను, రెంటిని ఆవిష్కరించును. అందుచేత నిరాకారము భక్తికి బాహ్యము గాదు.

అవతారిక : ఎవరును నా ప్రేమకు బాహ్యులు కారు —

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిం. 32

ఎవరు పాపజన్ములో, వారును, అటులే స్త్రీలు, వైశ్యులు, శూద్రులును నన్ను ఆశ్రయించి నపుడు పరమగతిని బొందుదురు.

విశేషార్థము : ఇచ్చట ఆశ్రయము ముఖ్యము (18.66) ఇట్లు ఆశ్రయించిన పాపులను భగవంతుడే తన పాపములనుండి విముక్తముచేయును (18–66), అజ్ఞులకు ఆ భగవంతుడే దివ్యజ్ఞానముయొక్క వెలుగునిచ్చును (10.11), దుర్బలులకు తన ఇచ్ఛయొక్క బలము నిచ్చును (7–11), దుఃఖితులకు అనంతమగు ఆధ్యాత్మికానందము నిచ్చును.

పోతే, ఈ ఆశ్రయము ఘనులకంటె సామాన్యులకే తఱచుగా సులభతరము. ఏలన ఘనులకు ప్రాయః అహంకారము ఘనముగనే యుండును. ఇట్లు భక్తి అల్పులకు ఒక అమోఘమార్గమును తెఱచుచున్నది. అయితే ఘను లందరు ఇట్టివారే గానవసరము లేదు, అహంకారము లేని ఘనులును ఉందురు. అట్టివారికి నన్ను ఆశ్రయించుట మఱింత సులభము గాన —

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా,
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మాం. 33

(ఇట్లు పాపాత్ములే నన్ను ఆశ్రయించి పరమగతిని బొందుచు) నున్నపుడు, పుణ్యాత్ములగు బ్రాహ్మణులు, అటులే భక్తవర్యులగు క్షత్రియుల మాట జెప్పనేల ? 'కావున' అనిత్యము మఱియు నసుఖము నగు ఈ లోకములోనికి వచ్చి, నన్ను భజింపుము.

విశేషార్థము : 'కావున' అనగా నేమి? ఈ లోకము స్వతః అనిత్యము అసుఖము. కాన ఇది వాసయోగ్యము కాదు. అయినను ఇచ్చటి మానవజన్మ పురుషార్థసాధనకు చాల అనుకూలము. 'కావున' కామముల వెంట బడక, సాధన చేసి, జన్మరాహిత్యమును బొందుము. ఇదియే పురుషార్థము—అని శ్రీ శంకరుడు.

నీవు నిమ్న ప్రకృతియొక్క గుణమాయకు వశుడవై నిమ్న జీవనమును గడపుచున్నావు, అందుచేత ప్రపంచము సంఘర్షమయము, దుఃఖమయముగా నున్నది. 'కావున' నీవు నన్నాశ్రయించి, ఊర్ధ్వ ప్రకృతిలోని కెగయుము(7-29), అపుడు నీకు ఎల్లెడల భగవంతుడే గోచరించును, అపుడు సంఘర్షస్థానమున ఆత్మతత్వముయొక్క ఏకతయే నీ కెల్లెడల గోచరించును, ప్రపంచము ఆనందమయము, లీలామయము నగును – అని ఈ విధముగా 'కావున' పదమును శ్రీ అరవిందు డన్వయించును. కాగా ఊర్ధ్వ ప్రకృతిలోని కెగయుటకు చివరి శ్లోకము సమగ్ర మార్గమును జూపును.

అవతారిక : అయితే భగవంతు నెట్లు భజించవలెను ? —

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః.

నా చేతనతో నీ మనస్సు నేకము చేయుము, నా భక్తుడవు గమ్ము, నీ కర్మ లన్నింటిని నా కొరకు యజ్ఞము గావించుము, నన్ను ఆరాధించుము. ఇట్లు మత్పరుడవై — నా యందు మునిగి-సర్వాత్మను నాతో యోగయుక్తము గావించి, నన్నే పొందెదవు.

విశేషార్థము : 'మన్మనా భవ' = నీ మనస్సు నాయందుంచుము – అని శ్రీ శంకరుడు, ఇతరులు. కాగా, 'మన్మనా భవ' = నీ మనస్సును నా చేతనతో ఏకముచేయుము – అని శ్రీ అరవిందుడు. ఎంత వ్యత్యాసము ! అటులే 'ఆత్మానం యుక్త్వా = చిత్తమును సమాహితము గావించి – అని శ్రీ శంకరుడు చెప్పగా, 'ఆత్మానం యుక్త్వా' = సర్వసత్తను భగవంతునితో యోగమున స్థాపించి – అని శ్రీ అరవిందుడు. అటులే 'నా భక్తుడవు గమ్ము' = నీ హృదయము నంతను సర్వమునందు నున్న నా యెడ ఏకమాత్ర ప్రేమవృత్తిని గావించుము; ఇంకను నీ కర్మల నన్నింటిని నా కొరకు యజ్ఞము గావించుము. అనగా నీ జ్ఞానశక్తిని, నీ ప్రేమశక్తిని, నీ కర్మశక్తిని నాలోని కుద్ధరించి, నాతో నేకము చేయుము – అని శ్రీ అరవింద వ్యాఖ్యానము.

పార్థివ జీవనమునుండి వెలువడి దివ్యజీవనములోని కెగయుటకు ఈ సమగ్ర మార్గ మొక్కటియే మనకు సాధనోపాయము. అపుడు—అట్లు ఎగసి నపుడు—ప్రపంచము ప్రపంచజీవనము తన స్వరూపమునే మార్చివేసికొనును — అవి ఆనందనిలయము, లీలామయము నగును.

ఇదిగో, ఇదియే గీతా-భక్తియోగము; ఈ భక్తియోగమునందు జ్ఞానము, కర్మ మఱియు ప్రేమ ఒక పరమ ఏకీకరణమునందు ఏకమగును, మూడును గలిసి ఒక విశాల, అభేదాత్మక వృత్తి యగును. సర్వమునకును మూలము, ఏకము నగు పురుషోత్తముని సమగ్ర జ్ఞానమును గత అధ్యాయత్రయమునందును ఆవిష్కరించి, ఆ పురుషోత్తమునికి కర్మ భక్తి జ్ఞానములను లేవనెత్తి అక్కడ గీత వాని ఏకీకరణమును సాధించును.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే
రాజవిద్యారాజగుహ్యయోగో నామ నవమోఽధ్యాయః





# శ్రీ గీతా యోగము

## అథ దశమోఽధ్యాయః

## విభూతి యోగః

ఒక పరిశీలన : అవి వివేకానందుడు రామకృష్ణపరమహంసను దర్శించుచున్న ప్రథమదినములు. వివేకానందుడు తన దగ్గఱకు వచ్చినప్పుడెల్ల, శ్రీరామకృష్ణుడు ప్రేమతో వివశుడగును, ఆయనకు మాట గూడ సరిగారాదు – నరేంద్ర అని పూర్తి పేరు నుచ్చరించజాలక నరేన్....న న న – అని కష్టముతో అనును. ఈ అవస్థను గాంచి, ఒక పర్యాయము, "మహాశయా! నాయందు మీకు గల ఈ మమకారముచేత, మీకును, లేడిపిల్లయందు మమకారమును పెంచుకొనిన జడభరతుని గతి పట్టదు గదా!" అని యువవివేకానందుడు అనాలోచితముగా ననెను. అది విని గంభీరవదనుడై ఇట్లు పలికెను– "చూడు నరేన్, నీయందు దేవిని జూచుచున్నాను, అదియే నా ప్రేమవివశతకు గారణము. అది నీ శరీరమును జూచికాదు, కానేకాదు."

దీనివలన మనకేమి తెలియును? ఇతరులలో గన్పించనంతగా, వివేకానందునిలో శ్రీ రామకృష్ణునికి దేవి, భగవంతుని పరప్రకృతి, గోచరించెను దేవియొక్క విభవము అక్కడ విశేషముగా గోచరించెను అట్టి మానవుని లేక ప్రాణిని లేక వస్తువును భగవంతుని విభూతి యందుము.

భగవంతుడే తన ప్రకృతిచేత చరాచర ప్రపంచమంతయు నయ్యెను (7-6) కనుక భగవంతుడును, తన పరప్రకృతియు ప్రతివస్తువునందును గలవు. నిజానికి అటు అంతర్వర్తియై యున్న ఆ పరప్రకృతియే అపరప్రకృతి నిర్మాణము నంతను ధరించుచున్నది (7-5). పైగా ఆ పరప్రకృతి అపరప్రకృతిద్వారా తనను దాను వ్యక్తము జేసికొనుచున్నది ఈ వ్యక్తీకరణము కాలక్రమమున జరుగుచున్నదిగాన, కొందరియందు భగవంతుడును, పరప్రకృతియు కన్పించనంత తక్కువగా నుండగా, కొందరియందు కొట్టవచ్చినట్లు గన్పించును. సామాన్య మానవులకును, విభూతి మానవులకును ఉన్న భేద మిదియే. ఇది అంశభేదమే గాని, స్వరూపభేదము గాదు.

కావున ఒకనాటికి మనమును విభూతిమానవులము కాగలము — అను ఆశకును, ఉత్సాహమునకును ఈ విభూతిసత్యము ఆస్పదమగును

ఇట్లు విభూతిమానవులము కాగలిగినపుడు, భగవంతుని పరమ రహస్యమును స్వీకరించుటకు మన కర్హత ఏర్పడును. అర్జునుడు స్వయముగా విభూతిమానవుడు. కావున భగవంతుడు తన రహస్యము నతనికి వెల్లడించెను. "అర్జునా ! నీవు నాకొక ప్రకృష్ట ఉపకరణమాత్రుడవు (11-33) నిజానికి నా దివ్యేచ్ఛయే నీ ద్వారా పనిచేయుచు, నా దివ్యకార్యమును సాధించుచున్నది." — అనునదియే భగవంతుడు వెల్లడించిన రహస్యము. ఇది విభూతిసిద్ధాంతములో నంతర్గత సత్యము. ఈ రహస్యము నెఱిగినపుడు, అర్జునునకు కర్మ విషయకమగు అన్ని శంకలు అంతరించగా, అతడు సర్వోత్సాహముతో ఆ 'భగవంతుని' కార్యముగా 'తన' కార్యమును చేయగలుగును. అట్లు చేయగలిగినవాడే దివ్యమానవుడని శ్రీ అరవిందుడు.

విభూతియోగమున భగవాను డీ జ్ఞానము నిచ్చును, తర్వాతి విశ్వరూపయోగమున భగవాను డీ దర్శనము ననుగ్రహించును. ఆ విశ్వరూపముయొక్క శతసహస్ర ముఖములనుండి, "లెమ్ము ! నా ఉపకరణముగా యుద్ధము చేయుము !" — అను అప్రతిహత కర్మాదేశము వెలువడును. ఇట్లే విభూతియోగము ఆ దివ్యాదేశమునకు అర్జునుని సిద్ధముచేయును. నిజానికి 7, 8, 9, 10 — అధ్యాయములు, నాలుగును ఈ దివ్యాదేశమునకు ఒక సన్నాహము మాత్రమే — అని చెప్పి, ఈ సంబంధమును మనకు శ్రీ అరవిందుడు మాత్రమే చూపును.

శ్రీ భగవా నువాచ -

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః,
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా. 1

ఓ మహాబాహూ, అర్జునా! నీకు నా యందు ప్రీతి పెరుగుటను గాంచి, నీకు హితము గావించు సంకల్పముతో నేను చెప్పబోవు పరమవచనమును మఱల వినుము.

విశేషార్థము : హృదయమునకు భగవంతునియందు గల ప్రీతియే భక్తి సమస్తమును, భక్తిసారమును. అట్టి ప్రీతి భగవంతుని ప్రత్యేకముగా నాకర్షించుకొనును, భగవాను డతనికి సమస్తము నిచ్చును — "దదామి...... ......భజతాం ప్రీతిపూర్వకం" (10-10).

భగవంతుడు తన సర్వసమమగు ఆత్మరూపమున అందరిపట్లను సముడు. అందరకు తమతమ ప్రకృతిని బట్టి సమముగా నిచ్చును కాని భగవంతుడు పరమ పురుషుడగు పురుషోత్తమరూపమున ప్రీతిగల భక్తునిపట్ల ప్రత్యేక వైయక్తిక సంబంధమును గలిగియుండును ఆ సంబంధమునే ఈ శ్లోకము వ్యక్తముచేయు చున్నది-అని శ్రీ అరవిందుడు. శ్రీశంకరునికి భగవంతు డాత్మమాత్రుడు గనుక, ఈ ప్రత్యేక సంబంధమునకు అవకాశము లేదనియే చెప్పవలెను.

అవతారిక : ప్రతిజ్ఞాతమైన ఆ పరమవచన మేది యన –

**నమే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః,**
**అహ మాదిర్హి దేవానాం మహర్షీణాంచ సర్వశః.** 2

దేవతలు గాని, మహర్షులు గాని నా జన్మ నెఱుంగరు. ఏలన నేను సర్వ విధముల దేవతలకును, మహర్షులకును మూలమను.

విశేషార్థము : 'నా జన్మ నెఱుంగరు' – అనగా, నా జన్మ వారి జన్మకంటె పూర్వము గనుక, దానిని వా రెఱుంగరు – అని అర్థముకాదు; నాకు జన్మ యున్నదని ఎఱుంగరు, అనగా నాకు జన్మ లేదని ఎఱుంగుదురు – అనియే దాని అర్థము. కావుననే, 'నా జన్మ నెఱుంగరు' = నా కెట్టి జన్మయు నెఱుంగరు-అని శ్రీ అరవిందు డనువదించెను. "నన్నెవడు 'అజునిగా' నెఱుంగునో" – అను తర్వాతి శ్లోకములోని మాట కూడ దీనినే పోషించును.

అవతారిక : ఈ జ్ఞానముయొక్క ఫలము ? —

**యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరం,**
**అసమ్మూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే.** 3

ఎవడు నన్ను అజునిగను, ఆదిరహితునిగను, సర్వలోక మహేశ్వరునిగను ఎఱుంగునో మర్త్యమానవులయందలి అట్టి మానవుడుమాత్రమే అజ్ఞానము కల్పించు సర్వమోహములనుండియు విముక్తుడగును, సర్వ పాపములనుండియు సర్వథా ముక్తు డగును.

విశేషార్థము : సృష్టిరహస్య మంతయు గీతయొక్క ఒక ప్రధాన భావనపై నాధారపడి యున్నది; అది యేది యన, భగవంతుడు సృష్టికి ఆది (10-2), అనగా మూలము, జన్మస్థానము. ఇట్లు అతనినుండియే దేశము, కాలము, సర్వము జనించు

చున్నవి గనుక, అతడు దేనినుండియు జనించినవాడు గాడు, అతడు అజుడు, కాలాతీతుడు, విశ్వాతీతుడు. కనుక విశ్వము నందలి పుణ్యాపాపము లతనిని బంధించవు.

కాని అతడే సర్వ మయ్యేను గాన, అదే సమయమున అతడు విశ్వమునందును, విశ్వముగాను ఉన్నాడు కనుక అతని విశ్వాతీతభావమును. విశ్వభావమును—రెండును సత్యములే, మఱియు రెంటికి ఆదానప్రదానము లున్నవి, రెంటి మధ్య అభావ మేమియు లేదు. అందుచేత యోగముద్వారా అతనిలోనికి వెళ్లి, అక్కడ ప్రతిష్ఠితులమై, అతనివలెనే సృష్టి కతీతులము కాగలము, అతని 'సర్వలోకమహేశ్వరత యందు' (10-3) పాలు పంచుకొనగలము; అటుల పాలుపంచుకొని పుణ్యాపాపముల నుండి ముక్తుల మగుటయే కాక, వానిని శాసించుచు, పరప్రకృతిశుద్ధతలోనికి సైతము వానిని మార్చగలుగుదుము

ఫలితముగా, విశ్వసత్తయే సమస్త సత్త గాదు, విశ్వాతీత సత్తయు గలదు మఱియు "ఇట నున్నదే అట నున్నది, అట నున్నదే ఇట నున్నది" (క. ఉ.) — అను నదియే సృష్టిరహస్యము. ఈ రహస్యముయొక్క జ్ఞానమే మన పుణ్యాపాప విముక్తికిని, పిమ్మట విముక్త దివ్యజీవనమునకును గారణము; ఇదియే ప్రధాన గీతాభావన.

పోతే, శ్రీ శంకరునియొక్క, అంతకంటెను ఎక్కువగా శ్రీ గౌడపాదునియొక్క సిద్ధాంతమునందు, వాస్తవమారయ, ముక్తిపదమున కర్థమే లేదు. ఏలన, ఇచ్చట ఏ గుణమయ ప్రకృతినుండి ముక్తి బొందవలెనో, అది మిథ్య, ఏ జీవుడు ముక్తి బొందవలెనో, అతడు మిథ్య, మఱియు నందుచేత ముక్తియు మిథ్యయే. ముక్తి యందు జీవు డదృశ్యు డగును కనుక, ముక్తజీవనము, ముక్తకర్మ నుండదు. కర్మ అపేక్షించు కర్తృకర్మాది కారకభేద మచ్చట యుండదు గాన, కర్మ అసంభవము గూడను. శ్రీ శంకరునికి ఆదర్శప్రాయుడైన శ్రీ గౌడపాదుని సిద్ధాంత మేమన — "న ముముక్షు ర్నవై ముక్త, ఇత్యేషా పరమార్థతా" అనగా, ముముక్షువును లేడు, ముక్తుడును లేడు. ఇదియే పరమార్థజ్ఞానము.

అవతారిక : కాని గీత ననుసరించి సర్వము భగవంతునినుండియే వెడలు చున్నది గాన, భగవంతునికిని, సర్వమునకు విరోధము లేదు. పైగా సర్వము భగవంతునియందు తన తన పూర్ణరూపము కనుగొనును .—

బుద్ధిర్ జ్ఞాన మసంమోహః క్షమా సత్యం దమశ్శమః,
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయ మేవచ. 4

అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః,
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః. 5

బుద్ధి, జ్ఞానము, సంమోహమునకు వశముగాని, స్థితి, క్షమాగుణము, సత్యము ఇంద్రియనిగ్రహము, మనశ్శాంతి, సుఖము మఱియు దుఃఖము, పుట్టుట మఱియు గిట్టుట, భయము మఱియు అభయము; అటులే అహింస, సమత, తుష్టి, తపము, దానగుణము, యశము మఱియు అయశము—భూతముల ఈ వివిధ మానసిక భావము లన్నియు నానుండియే పుట్టుచున్నవి.

విశేషార్థము : ఇట్లు భూతములే గాక, భూతముల మానసిక భావములును భగవంతునినుండియే కలుగుచున్నవి—అహింస, సమత, మున్నగు మంచిభావములే కాదు, దుఃఖము, భయము మున్నగు చెడుభావములును.

మఱియు, 'భవంతి' = అగుచున్నవి—అను మాట మనకు తెలుపున దేమన, ఈ ప్రక్రియ తాడు పాముగా గన్పించుట యను 'వివర్తము' గాదు, మట్టి కుండ యగుట – అను వాస్తవ సంభూతి కనుక సత్తకును (Being), సంభూతికిని (Becoming) గల విభేదమును గీత ఒత్తి చెప్పుచున్నను, ఆవిభేదమును శ్రీశంకరుని వలె, ఒక విరోధములోనికి మార్చదు ఇట్లు సత్త మఱియు సంభూతి, అనగా, ఏకము మఱియు అనేకము, రెండును వాస్తవమే గాన, ముక్తి మఱియు ముక్త జీవనము, రెండును వాస్తవమే.

అవతారిక : ఇప్పుడు భూతభావములను గాక, తన సాక్షాద్ భావములను చెప్పును –

మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవస్తథా,
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః. 6

ఏడుగురు పూర్వ మహర్షులు, అటులే నలుగురు (పూర్వ) మనువులు నా మానస భావములుగా బుట్టియున్నారు ఈ ప్రజ అందరు వారి సంతతియే.

విశేషార్థము : 'పూర్వ' మహర్షు లన, మన తండ్రులు తాతల వలెనే, మానవజాతికే మూలపురుషులై యుండి, ఇప్పుడు లేనివా రని తలంతుము పూర్వులన

గతకాలముతో సంబంధము గలవారని శ్రీ శంకరుడు చెప్పగా, పూర్వులు = పురాణ పురుషులు, శాశ్వతులు - అని శ్రీ అరవిందుడు. ఈ మహర్షులును, మనువులును, పరమపురుషుని యొక్క నిత్యనిరంతర (perpetual) భావములు (becomings), కనుక ఈ మహర్షు లిపుడును ఉన్నారు.

మహర్షులు భగవంతుని మూలప్రజ్ఞయొక్క సప్తవిధ శక్తులు, కాగా మనువులు అతని క్రియాశక్తియొక్క చతుర్విధ రూపములు. కనుకనే వారి సంతతి యగు మానవస్వభావము చతుర్విధము (4 13) సామాన్యముగా మనువులు పదు నలుగురు అని చెప్పుదురు ఇపుడు మనము ఏడవవాడగు వైవస్వత మన్వంతర ములో నున్నాము. ఈ వైవస్వత మనువును గీతయే మఱియొక చోట పేర్కొనును (4-1). కాని ఇక్కడ గీత మనువులు నలుగు రనుచున్నది. ఇందు వల్లనే మానవజాతి చతుర్విధ మని శ్రీ అరవిందుడు ప్రకాశమయ వ్యాఖ్య చేయు చున్నారు. ఈ విషయము, కాన, పరిశోధనార్హము.

ఏతాం విభూతిం యోగంచ మమ యోవేత్తి తత్త్వతః,
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాఽత్ర సంశయః. 7

ఈ నా ప్రభుతావిస్తారమును, యోగమును వాని సరియగు తత్త్వము లందెవడు తెలిసికొనునో, అతడు, చలించని యోగముతో యుక్తుడగును, సందియములేదు.

విశేషార్థము : యోగము = యోగమువలన గలిగిన సర్వజ్ఞత్వాదికము - అని శ్రీ శంకరుడు. కాని అసలు యోగ మన నేమి ? యోగము = యుక్తి, ఘటనము, (ఈశ్వరుని) చేత - అని ఆయన చెప్పును. కాగా, యోగము = ఐశ్వర యోగము (9-5). ఈ యోగముచేత-యోగశక్తిచేత - విశ్వాతీతుడగు ఈశ్వరుడు విశ్వమునందలి సమస్త వస్తువులకంటెను అధికుడయ్యు, వానితో సంయోగమునం దుండును, వానితో ఏకముగా నుండును మఱియు వానిలో నివసించుచునే, వాని నన్నింటిని తన స్వీయ ప్రకృతియొక్క పరిణామభావములుగా తనలో ధరించి యుండును - అని శ్రీ అరవిందుడు వివరించును. ఈ నిర్వచనమువలన ఈశ్వరునికి మనకు మధ్య, అజ్ఞానము తప్ప మఱే అడ్డుగోడ లేదని తెలియును. ఈశ్వరుడు ఒక రాజు లాగున ఎక్కడో ఉండి, మనలను పాలించుట లేదు. మనలోనే యుండి మనలను నడుపుచున్నాడు (18-61).

మఱియు, ఈశ్వరునివలెనే ఈశ్వరజ్ఞానమును మనకు దూరముగా నుండదు. ఏలన ఈశ్వరుని మనము దూరముగా నున్న ఒక వస్తువుగా గాక, మన ఆత్మగానే, మనముగానే తెలిసికొనవలెను, అది ఒక్కటే ఆయనను తెలిసికొను విధానము. కనుక ఈశ్వరజ్ఞానము తన స్వభావముచేతనే ఈశ్వరయోగములోనికి పెరుగును, ఈశ్వరానుభవములోనికి పెరుగును. ఇదిగో, ఇట్లు సమగ్రజ్ఞానముచేత ఫలించిన యోగము 'అవికంపము' (10-7), అనగా విశ్చలము, స్థిరము.

ఈ యోగ మేల అవికంప మనిన, ఈశ్వరుని మనము మన ఆత్మగా ఆధ్యాత్మికచేతనచేత తెలిసికొందుము, భౌతికచేతనచేత గాదు భౌతిక చేతనకు మాత్రమే భగవంతుడు ఒక అస్పష్ట భావనగా దోచును. పోతే భౌతిక చేతన ద్రవ్యము నెంత స్పష్టముగా, నెంత ప్రత్యక్షముగా జూచునో, ఆధ్యాత్మిక చేతన భగవంతుని అంత స్పష్టముగాను, అంతకంటె నెక్కువ స్పష్టముగాను, అంత ప్రత్యక్షముగాను, అంతకంటె నెక్కువ ప్రత్యక్షముగాను చూచును. అది భగవంతుని చూచును, అనుభవించును, చింతించును మఱియు స్పృశించును ఏలన ఆధ్యాత్మిక చేతనకు ప్రపంచ మంతయు ఆత్మగానే కన్పించును, ద్రవ్యముగాను గాదు, ప్రాణమునుగాను గాదు, చివరకు మనస్సుగాను గాదు. పోతే, ద్రవ్యము ఆకృతి ధరించిన భగవంతుడుగను, ప్రాణము శక్తిరూపమున నున్న భగవంతుడుగను. మనస్సు భావరూపమునున్న భగవంతుడుగను గన్పించును – అని శ్రీ అరవిందుడు తన అనుభవమును ప్రకటించును ఎట్లు వర్తించినను భక్తుడు భగవంతునియందే వర్తించును (6-31) – అని గీత చెప్పిన దాని అర్థ మిదియే. కావుననే అతని యోగ మవికంపము.

శ్రీ అరవిందుడు చేతనయందు అనేక స్తరములను గనిపెట్టెను – భౌతిక మనస్సు, ఉన్నత మనస్సు, దీప్త మనస్సు, స్ఫూర్తి మనస్సు, అధిమనస్సు, అతిమనస్సు. వీనిలో ఒకొక మనస్సుతో భగవంతుని జూచి నప్పుడు, అత డొకక విధముగా గన్పించును.

భౌతిక మనస్సునకు భగవంతుడు 'నేతినేతిగా', అనగా ఇది కాదు, ఇది కాదు– అని కన్పించును, పోతే అతిమనస్సునకు 'ఇతి ఇతిగా', అనగా ఇది భగవంతుడే, ఇది భగవంతుడే – అని కన్పించును ఈ వివరణను బట్టి శంకరవాదమునకు, అరవిందానుభవమునకు గల భేదమునకు మూల మేదో మనము గ్రహించవచ్చును.

అవతారిక : ఈ అవికంపయోగమునకు సోపానములు —

అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః. 8

నేను సర్వమునకు జన్మస్థానము, నానుండియే సర్వము జన్మించి, క్రియావికాసములోనికిని, గతివిస్తారములోనికిని ప్రవర్తించుచున్నది-అని తలంచి, బుద్ధిమంతులు నన్ను భజింతురు.

అవతారిక : ఏయే ప్రకారముల భజింతురు ?-

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరం,
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతిచ రమంతిచ. 9

ఆ బుద్ధిమంతుల చిత్తము నాయం దుండును, వారి ప్రాణమే నే నగుదును. వారు నా మాహాత్మ్యమును పరస్పరము బోధించుకొనుచు, నన్ను గుఱించియే చెప్పుకొనుచు, సంతుష్టి నొందుదురు మఱియు నాయందే రమింతురు.

విశేషార్థము : భక్తియందు ఈ రతి లేక ప్రీతిస్థాయికి చేరుకొన్నపుడు, భక్తి సహజము, స్వయంవర్ధకము నగును

అవతారిక : భక్తియందలి ఈ ప్రీతి భగవదనుగ్రహము నాకర్షించుకొనును.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే. 10

సతతము నాతో యోగయునం దుండి, ఇట్లు ప్రీతితో నన్ను భజించు వారికి బుద్ధియోగము ననుగ్రహింతును. కాగా వారా బుద్ధియోగముచేత నన్ను బొందుదురు.

విశేషార్థము : ఇతః పూర్వము, 'నిత్యాభియుక్తులగు' వారి యోగక్షేమములు నేను వహింతును (9-22)-అని చెప్పియుండెను. ఇపుడు, 'సతతయుక్తులగు' వారికి బుద్ధియోగము ననుగ్రహింతును-అని చెప్పుచున్నాడు, భగవానుడు. కనుక యోగక్షేమము లన బాహ్యజగత్తులోని అన్నపానాదులే కాక, అంతరజగత్తులోని భక్తిజ్ఞానాదులు కూడ నని తేలును. దీని నక్కడ శ్రీ అరవిందుడు తన వ్యాఖ్యలో చెప్పనేచెప్పెను.

బుద్ధియోగము = బుద్ధిశక్తులగు జ్ఞానసంకల్పములచేత యోగము. ఈ యోగము నకు బిమ్మట దీనిద్వారా మనోయోగము, ఇంద్రియయోగము - ఇత్యాది సర్వచేతనా యోగము సిద్ధించును. 'మచ్చిత్తః' (18.57) - అను పదము ఈ సంపూర్ణయోగమునే చెప్పును ఏలన, చిత్తము = చేతన, సమస్తచేతన - అని శ్రీ అరవిందుడు పోతే, బుద్ధి = సమ్యగ్దర్శనము, దానిచేత యోగము = బుద్ధియోగ - మని శ్రీ శంకరుడు. కాని సమ్యగ్దర్శనము బుద్ధియోగ పరిణామము గాని బుద్ధియోగము గాదు. మఱియు శ్రీ అరవిందు ననుసరించి, గీత ననుసరించి కూడ(2-41), కర్మమూలమగు సంకల్పము సైతము బుద్ధిలో నంతర్గతము గావున, బుద్ధియోగ మన కర్మయోగము గూడను.

తర్వాత, ప్రీతితో భజించిన వారికే ఎందుకు బుద్ధియోగము నిచ్చును? మానవుడు తనను గొనియాడిన వారికి ఆర్థికాది సాహాయ్యము చేయును భగవంతు డును అటులే చేయునా? కాదు మఱి ఎందుచేత బుద్ధియోగము నిచ్చును? భగవంతుని యందు మనకు ప్రీతి ఉదయించి నప్పుడు. ఆ ప్రీతి ఉభయులకు మధ్య నున్న కవాటములను తెఱచివేయును. ఆ కవాటముల ద్వారా బుద్ధి భగవంతునిలోనికి ఎక్కగలుగును, భగవంతుడు బుద్ధిలోనికి, తర్వాత మన ప్రకృతి అంతటిలోనికి దిగి రాగలుగును. ఇట్లు ప్రీతి అనుగ్రహమునకు మార్గము నేర్పఱచును, భగవంతుని కవకాశ మిచ్చును గాన, తనయందు ప్రీతిగలవారి కతడు బుద్ధియోగము నిచ్చును, అంతేకాని తనను స్తోత్రముచేసినందుచేత గాదు.

అవతారిక : బుద్ధియోగము నిచ్చి, అనుగ్రహ మింకేమి చేయును?

**తేషామే వానుకంపార్థ మహ మజ్ఞానజం తమః,**
**నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా.** 11

వారియందు గల దయాహేతువుచేతనే వారి అంతఃకరణమునందు అవస్థితు డనై, అజ్ఞానమునుండి బుట్టి, అంతఃకరణము నావరించియుండు తమస్సును ఉజ్జ్వల మగు జ్ఞానదీపముచే నాశముచేతును.

విశేషార్థము : ప్రీతివలన ఏర్పడిన మార్గముద్వారా అంతఃకరణములోనికి తన దివ్యతేజముతో దిగి, అక్కడి అజ్ఞానాంధకారమును పటాపంచలుచేయును.

బుద్ధియోగము నిచ్చుట యన ఈ ప్రకాశము నిచ్చుటయే యని శ్రీ శంకరుడు చెప్పినా, బుద్ధియోగము నిచ్చి, దానిద్వారా దిగివచ్చి, అంతఃకరణము మఱియు తక్కిన

ప్రకృతిభావ మంతటిలోని అంధకారమును నాశముచేసి,దాని పరివర్తనమును సాధించు నని శ్రీ అరవిందుడు.

సాధకుని సాధన భగవంతుడే చేయును. సాధకుడు ఆత్మసమర్పణ ద్వారా అవకాశ మిచ్చును, అంతే – అని చెప్పు శ్రీ అరవిందుని సిద్ధాంతమున కీ శ్లోకము స్పష్ట నిదర్శనము. కాగా సాధకుడు స్వయముగనే సాధించవలె నని మొత్తముమీద శ్రీ శంకరమతము చెప్పును.

అవతారిక : భగవంతుని పరమవచనమును (10–1) విని, దాని నామోదించి, అర్జును డిట్లు పలుకును —

**అర్జున ఉవాచ –**

పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్,
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుం. 12

అహు స్త్వాం ఋషయః సర్వే దేవర్షి ర్నారద స్తథా,
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే. 13

అర్జునుడు చెప్పెను – హే కృష్ణా! (విశ్వానికి విశ్వాతీత మూలమగు) పర బ్రహ్మవు నీవు; (సంసిద్ధి బొందిన అంతరాత్మకు ఆవాసమగు) పరంధామము నీవు; (విశ్వాతీతుడవు గనుక) పరమపవిత్రతవు నీవు; శాశ్వత దివ్యపురుషుడవును నీవే; అటులే నీ వాదిదేవుడవు, మఱియు నంతట వ్యాపించుటచే విభుడని చెప్పబడు అజుడవు నీవు.

ఇట్లు ఋషు లందరును, విశేషించి దేవర్షియగు నారదుడును, అసితుడును, దేవలుడును, వ్యాసుడును చెప్పుచున్నారు, నీ విపుడు స్వయముగాగూడ చెప్పుచున్నావు.

విశేషార్థము : ద్వంద్వసంకులమునుండి అర్జును డిపుడు బైటబడెను. దీనికి కారణము ద్వంద్వములవెనుక, ద్వంద్వము క్షముగు భగవంతుని స్వరూపావిష్కరణము. అర్జును డిపుడు విషాదగ్రస్తుడు గాడని అతని ఇచ్చటి స్వరమే తెలుపుచున్నది.

ఈ సత్యములను సాక్షాత్తుగా దర్శించిన ఋషులును, భగవంతుడును మాత్రమే సాధికారముగా నావిష్కరించగలరు.

అర్జునుడు క్రమముగా బేర్కొనిన దివ్యతత్త్వములు తాను స్వీకరించినది సమగ్రజ్ఞాన మని తెలుపును.

సర్వ మేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ,
నహి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా న దానవాః. 14

నిన్ను గుఱించి, భగవాన్, నీవు నాకేమి చెప్పుచున్నావో, అది యంతయు నిజమే నని తలంచుచున్నాను. నీవు చెప్పు నట్లే (10-2), దేవదానవులలో నెవరును నీ పుట్టక నెఱుంగరు.

విశేషార్థము : ఒక గుహ్యజ్ఞానము ఆవిష్కరించబడినపుడు, అది మనస్సు యొక్క అంగీకారముచేతను, సంకల్పముయొక్క సమ్మతిచేతను హృదయము యొక్క ప్రీతిచేతను ఆమోదించబడవలెను. ఈ మూడును సంపూర్ణ మానసిక శ్రద్ధయొక్క మూడు అంశములు అర్జును డీ సంపూర్ణామోదమును ప్రకటించెను. 'తలంచుచున్నాను'-అని ఇక్కడ తెలిపిన మానసిక అంగీకారము పూర్ణామోదము యొక్క ఉపలక్షణము మాత్రమే-అని శ్రీ అరవిందుడు

అయితే ఈ మానసిక శ్రద్ధయే వాస్తవ సాక్షాత్కారము కాదు. భగవంతుని వాస్తవ సాక్షాత్కారము భగవచ్చేతనచేతనే పొందవలెను -

స్వయ మే వాత్మ నాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ,
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే. 15

ఓ పురుషోత్తమా! నీవే స్వయముగా నిన్ను నీచేతనే తెలిసికొందువు. కారణము, నీవు సర్వభూతములకు ఆదివి, వాని కీశ్వరుడవు, దేవతలకును మూలమగు దేవదేవుడవు, జగన్నాథుడవు.

విశేషార్థము : ఇది సాధనకు సంబంధించిన అతిముఖ్యవిషయము - ఆత్మను గాని, భగవంతుని గాని, భౌతిక విషయములను విషయములుగా తెలిసికొను భౌతిక చేతనచేత తెలిసికొనజాలము. ఆత్మను ఆత్మచేతనచేతను, భగవంతుని భగవచ్చేతన చేతను, అనగా ఆ తత్త్వములతో తాదాత్మ్యము చెంది మాత్రమే తెలిసికొనగలము.

మఱియు, భగవంతుడే భగవంతుని తెలిసికొనును-అని చెప్పినపుడు, మనము భగవంతుని తెలిసికొననే లేమని అర్థము గాదు; మనము మనముగా నుండి తెలిసికొన లేమని మాత్రమే దాని అర్థము.

అవతారిక : భగవంతుని తెలిసికొనుటకు ఉపాయముగా, 'విభూతులను చెప్పుము, కృష్ణా!' - అని అర్జును డడుగుచున్నాడు —

వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః,
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి.16

ఏ విభూతులచేత ఈ లోకము లన్నింటిని నీవు వ్యాపించి యున్నావో, అట్టి దివ్యమగు నీ ఆత్మవిభూతులను అశేషముగా చెప్పవలెను.

విశేషార్థము : "వాసుదేవుడే సర్వము" (7-19), కాని అతడు ఎట్లు సర్వము నయ్యెను? చూడుడు : "జలములో రసమును నేను" (7-8). రసము వాసుదేవుని ఒక విభూతి. మఱియు జలము జలన్మాత్రమగు రసముయొక్క స్థూలరూపమే గాన, రసమే జలము. ఇక వాసుదేవుడే రసము గాన, వాసుదేవుడే జలము ఇటులే వాసుదేవుడు తన విభూతులద్వారా సర్వము నయ్యెను. కనుక వాసుదేవుడే సర్వ మని తెలిసికొనుటకు వాసుదేవుని విభూతులు ఒక ఉపాయముగా, ఒక అవాంతర సోపానముగా నుండును.

విభూతి యన భగవంతుని విశేషప్రకటనము. కనుక విభూతిద్వారా భగవంతుని ప్రథమ పరిచయ మగును ఉదాహరణకు, శ్రీ అరవిందుని జూచి నప్పుడు, మనకు భగవంతుని పరిచయ మగును. సామాన్యమానవుని వాసుదేవునిగా మన మంగీకరించ లేకపోయినను, శ్రీ అరవిందునట్లు అంగీకరించగలము. ఇదియే విభూతియోగ సిద్ధాంతము.

కథం విద్యా మహం యోగిం స్త్వాం సదా పరిచింతయన్
కేషుకేషుచ భావేషు చింత్యోఽసి భగవన్మయా  17

నిన్ను, ఓ యోగీ, శ్రీకృష్ణా, సర్వత్ర, సదా చింతించుచు, నే నే ప్రకారమున తెలిసికొనగలను? మఱియు నేయే ప్రముఖభావములందు నేను నిన్ను చింతించవలెను?

విశేషార్థము : 'ఏ ప్రకారమున తెలిసికొనగలను?'- ఇచ్చట 'ఏ ప్రకారమున' ననగా నేమి? ఉదాహరణకు, "మృగములందు నేను సింహమును" (10-30)- ఇత్యాది ప్రకారమున తెలిసికొనుము-అని అర్థము 'యోగీ!- అని అర్జునుడు సంబోధించెను: దీని భావ మేమి? నీవు, ఓ కృష్ణా! విశ్వాతీతుడ వయ్యును, విశ్వముతో యోగమునందును ఉన్నావు, విశ్వమునందు విభూతుల రూపమున సర్వత్రవ్యాపించి యున్నావు. అట్లు సర్వమగు వాసుదేవుడవుగా నున్నావు - అని యోగిపదము తెలుపును-అని శ్రీ అరవిందుని వ్యాఖ్యానుండియే మనకు తెలియును.

విస్తరేణాత్మనో యోగం విభూతించ జనార్దన,
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతం.

నీ యోగమహిమను, నీ విభూతిస్థానమును, ఓ కృష్ణా, నాకు సవిస్తరముగా మఱల జెప్పుము. ఏలన అమృతప్రాయమగు నీ విభూతియోగముల నెంత వినినను, నాకు తృప్తి గలుగుట లేదు.

విశేషార్థము : 'అమృతం' = భగవంతుని వాక్యామృత-మని శ్రీ శంకరుడు 'అమృతం' = అమృతముపలె నమరత్వము నొసంగు విభూతికథనమని శ్రీఅరవిందుడు. అయితే అది అమృతత్వము నెట్లు కల్గించును? 'వాసుదేవః సర్వం' - అను ఏకత్వదృష్టికి ఉపాయమై అమృతత్త్వము నొసంగును.

అవతారిక : భగవంతుడు భక్తుని కోర్కెను మన్నించును —

శ్రీ భగవానువాచ -

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః,
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే. 19

శ్రీ భగవానుడు పలికెను - మంచిది, అర్జునా! కురుశ్రేష్ఠా, దివ్యమగు నా ఆత్మవిభూతులందు ప్రధానమగు కొన్నింటి నిపుడు చెప్పెదను. కొన్నింటినే ఏలయన నా విభూతివిస్తారమునకు అంతము లేదు.

విశేషార్థము : విశ్వ మనంతము, విశ్వములోని వస్తువు లనంతము. మఱియు ప్రతి సాంతవస్తువునందును అనంతభగవంతుని సూచించు విభూతిరూప సంకేత మొకటి గలదు. కావున విభూతులకు అంతము లేదు.

"ఆత్మవిభూతయః" = ఆత్మయొక్క విభూతులు, లేక నా విభూతులు. ఏలన, ఆత్మ = నా. మఱియు ఆత్మ భగవంతుని ఆత్మ (9-5)గనుక, పై రెండుఅర్థములను గలిపి, ఆత్మవిభూతయః = నా (భగవంతుని) ఆత్మవిభూతులు-అని శ్రీ అరవిందుని అనువాదము.

అవతారిక : అర్జునా! ముందు సర్వప్రధాన విభూతిని వినుము —

అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః,
అహ మాదిశ్చ, మధ్యంచ భూతానా మంత ఏవచ. 20

అర్జునా : నేను సర్వభూతముల హృదయమునందు (దాగి) యున్న ఆత్మను, మఱియు నీ ఆత్మరూపమున సర్వభూతములకు నేను ఆది, మధ్యము మఱియు అంతమును.

విశేషార్థము : ఆత్మ భగవంతునియొక్క ప్రథమ అభివ్యక్తి. కావున తక్కిన అభివ్యక్తులకంటెను గూడ ఎక్కువ ఘనిష్ఠముగా భగవంతు డాత్మ యగును. కనుకనే ఇక్కడ భగవంతుడు ఆత్మను తానుగా జెప్పుకొనుచున్నాడు. ముందుకు వెళ్లి (18-61), హృదయము నందలి ఈశ్వరుడను నే నని భగవంతుడు చెప్పుకొనును దీనిని బట్టి హృదయమునందు ఆత్మ, ఆత్మయందు భగవంతుడు – అని మనము అర్థము చేసికొనవలసి వచ్చును. ఈ అర్థమున, హృదయ పదము మనస్సునకు గూడ వర్తించును. దీనిని శ్రీ అరవిందు డొక్కడే చెప్పును. ఇట్లు, 'ఆశయము' = హృదయము + మనస్సు.

(భూతముల) 'అంతము' = ప్రళయము – అని శ్రీ శంకరుడు; 'అంతము' = పర్యవసానము, అత్యున్నతరూపము (సంసిద్ధియందు), లేక ప్రళయస్థానము (విరామ లేక వినాశస్థితియందు) - అని శ్రీ అరవిందుడు. అనగా, గీతాసంసిద్ధియందు జీవుడు దేవత్వము నందగా, మాయావాదము యొక్క ముక్తియందు జీవుడు అసలు లేకుండ బోవును.

ఆదిత్యానా మహం విష్ణుర్ జ్యోతిషాం రవి రంశుమాన్,
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ.　　21

నేను ద్వాద శాదిత్యులందు విష్ణు వను ఆదిత్యుడను, జ్యోతిస్సులలో ఉజ్జ్వలు డగు సూర్యుడను, సప్తమరుత్తులందు మరీచిని, నక్షత్రములందు నేను చంద్రుడను.

విశేషార్థము : ఈ విభూతులు పైకి ఒక క్రమము లేకుండ జెప్పబడినట్లు గన్పించును. కాని అది సరికాదు. 'ప్రాధాన్యతః' (10-19), అనగా మొత్తము మీద ప్రాధాన్యత ననుసరించి పరిగణింపబడినవి.

పోతే, వైజ్ఞానికముగా చంద్రుడు నక్షత్రముకంటె చాలతక్కువ అయినపుడు నక్షత్రములలో నేను చంద్రుడ-ననుట తప్పు కాదా ? కాదు, ఏలన చంద్రుడే ఇచ్చటి ఓషధులకు ఎక్కు పుష్టిహేతువు (15-13) మఱియు చంద్రుడే భగవంతుని చల్లదనమునకు, ఆనందమునకు, సౌందర్యమునకు నక్షత్రములకంటెను ఎక్కువ సన్నిహితసంకేతము.

వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః,
ఇంద్రియాణాం మన శ్చాస్మి, భూతానా మస్మి చేతనా. 22

వేదములలో సామవేదము నేను, దేవతలలో ఇంద్రుడు నేను, ఇంద్రియము లలో మనస్సు నేను, మఱియు భూతములందు గల చేతన నేను.

విశేషార్థము : ఏకాదశ ఇంద్రియములలో మనస్సు నేను - అని శ్రీ శంకరుడు వ్యాఖ్యానించును. మన హస్తమునకు అయిదు వ్రేళ్లు ఎట్టివో, మనస్సునకు జ్ఞాన - ఇంద్రియము లైదు నట్టివి. అటులే ప్రాణతత్త్వమునకు, కర్మేంద్రియము లకు సంబంధము. మఱియు మనస్సుతో ఇంద్రియము లాఱు (15-7) - అని గీతయే తర్వాత చెప్పును అందుచేత నిచ్చట ఆఱు ఇంద్రియములలో మనస్సు నేను - అని చెప్పుట ఎక్కువ సమంజస మగును.

రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్షరక్షసాం,
వసూనాం పావక శ్చాస్మి మేరు శ్శిఖరిణా మహం. 23

ఏకాదశ రుద్రులలో శంకరుడు నేను. యక్షులు మఱియు రాక్షసులందు కుబేరుడు నేను. వసువులలో అగ్ని నేను, పర్వతములలో మేరుపర్వతము నేను.

పురోధసాంచ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిం,
సేనానీనా మహం స్కందః సరసా మస్మి సాగరః. 24

పార్థా! పురోహితులలో ముఖ్యుడగు బృహస్పతి నేను, సేనానాయకులలో కుమారస్వామి నేను, సరస్సులలో సముద్రము నేను.

మహర్షీణాం భృగు రహం గిరా మ స్మ్యేక మక్షరం,
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి, స్థావరాణాం హిమాలయః. 25

మహర్షులలో భృగుమహర్షి నేను, వాక్కులలో ఓంకారము నేను, యజ్ఞము లలో జపయజ్ఞము నేను, స్థిర(కదలని) వస్తువులలో హిమాలయపర్వతము నేను.

విశేషార్థము : సర్వవేదములందు ఓంకారము నేను (7-8) - అని పూర్వము చెప్పి, ఇచ్చట ఇంకను వ్యాపకపరిధిలో, సర్వవాక్కులందు ఓంకారము నేను - అని చెప్పుట జరిగెను.

నేను ఓంకారమును గావున, ద్రవ్యయజ్ఞముకంటెను ఓంకార జపరూపమగు జపయజ్ఞము ఎక్కువ త్వరగా నన్ను జేర్చును. ఇది ద్రవ్యయజ్ఞమునకు జ్ఞాన యజ్ఞమునకు (4-33) మధ్యనుండు యజ్ఞము.

పోతే, హిమాలయము ప్రపంచమున అత్యున్నత పర్వతమే యైనను, ఆధునిక పరిశోధనల ప్రకారము నిజానికది స్థావరమే కాదు. ఏలన అది ఇంకను పెరుగుచునే యున్నది, అది కొన్ని పర్వతములంత ప్రాచీనము కాదు, అది - దాని క్రింది భాగ - మింకను బిగియలేదు. కనుక స్థావరము లనిన పర్వతము లనియు, ఆ పర్వతములలో హిమాలయ మత్యున్నతము గావున, అది నే-ననియు దీసికొనవలెను.

అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః,
గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః. 26

వృక్షము లన్నింటిలోను రావిచెట్టు నేను, దేవర్షులలో నారదుడు నేను, అటులే గంధర్వులలో చిత్రరథుడు నేను. సిద్ధులలో కపిల మునీంద్రుడను నేను.

ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవం,
ఐరావతం గజేంద్రాణాం నరాణాంచ నరాధిపం. 27

గుఱ్ఱములలో అమృతమథనసమయమున బుట్టిన ఉచ్చైశ్శ్రవ మను అశ్వ రాజము నే నని ఎఱుంగుము. అటులే శ్రేష్ఠగజములలో ఐరావతము నేను మఱియు నరులందు రాజు నేను.

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్,
ప్రజన శ్చాస్మి కందర్పః సర్పాణా మస్మి వాసుకిః. 28

ఆయుధములలో వజ్రాయుధము నేను, పాడియావులలో కామధేనువు నేను, అటులే జననహేతువగు మన్మథుడు నేను, ఇంకను ఒకజాతి సర్పములందు వాసుకి నేను.

అనంత శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహం,
పితౄణా మర్యమా చాస్మి యమః సంయమతా మహం.

నాగజాతి సర్పములలో నే ననంతుడను, జలదేవతలలో వరుణుడను, పితృదేవతలలో అర్యముడను మఱియు శిక్షించువారిలో యముడను.

విశేషార్థము : యముడు మన కెంత అప్రియుడైనను, ఆ రూపమున మనలను శిక్షించి, ప్రగతిమార్గమున తిరిగి పెట్టువాడును భగవంతుడే.

ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహం,
మృగాణాంచ మృగేంద్రో౽హం వైనతేయశ్చ పక్షిణాం. 30

దైత్యులందు నేను ప్రహ్లాదుడను, గణికులలో కాలము నేనే, మృగములలో సింహము నేనే, అటులే పక్షులలో గరుత్మంతుడు నేనే.

విశేషార్థము : లోకములను నాశముగావించు కాలమును నేను (11-32)-అని తర్వాతి అధ్యాయమున భగవానుడు చెప్పును. కనుక ఎవరెవరిని హరించివేయ వలెనో - అని గణించువారిలో కాలుడు సర్వప్రథముడు

పవనః పవతా మస్మి రామః శస్త్రభృతా మహం,
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ. 31

పావనము చేయువానిలో పవనము(వాయువు)నేను,ఆయుధధారులలో శ్రీరాముడను నేను,జలచరములలో మకరము నేను, మఱియు నదులలో గంగానదిని నేను.

విశేషార్థము : ఈ పరంపరయందు విభూతులు గణింపబడుచున్నవి మఱియు విభూతులు సాధారణముగా అవతారములు గావు; ఇంకను, విభూతులకు జ్ఞానుల ఆత్మ జ్ఞానము సైతము నుండకపోవచ్చును. కావున శ్రీరాముడును అర్జునునివంటి ఒక విభూతియేనా ? ఆయన అవతారము కాదా ? విభూతిపరంపరలో శ్రీరాముడు పేర్కొన బడినంత మాత్రాన, ఆయన అవతారము గాదని చెప్పజాలము. ఏలన విభూతి యనుటకు ఆవశ్యకమగు శక్తివిశేషముతో బాటు ఆయనయందు, నేను పరమ పురుషుడ - ననే జ్ఞానము గూడ నుండవచ్చును.

సర్గాణా మాది రంతశ్చ మధ్యంచైవాహ మర్జున,
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహం. 32

సృజింపబడిన విశ్వములకు, అర్జునా, నేను ఆది, అంతము, మధ్యము గూడను. విద్యలయందు నే నధ్యాత్మవిద్యను, వాదకుశలురయం దలి వాదశక్తిని నేను.

విశేషార్థము : వెనుక (10-20) చెప్పినట్లు సృష్టియందలి భూతములనే కాక, సృష్టులకే నేను ఆదిమధ్యాంతమను. మఱియు పరమపురుషార్థమును అధ్యాత్మ విద్యమాత్రమే సాధించగలదు గాన ఆ విద్యకు అగ్రస్థానము ఈయబడినది.

అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వః సామాసికస్యచ,
అహమే వాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః. 33

అక్షరములలో అ-కారము నేను, సమాసములలో ద్వంద్వసమాసము నేను, క్షీణించని కాలము నేనే, అటులే ఎల్లెడల తన ముఖములను గలిగియున్న సృష్టి కర్తను (8-9)నేను.

విశేషార్థము : తేపు అనగానే ఎల్లుండి ఉన్న దనియే అర్థము గాన, తేపు కాలము అంతమగు నని చెప్పజాలము. కనుక అది అనంతము. అయితే ఈ అనంతత సాపేక్షము, అనగా మనస్సును బట్టి మాత్రమే అది అంతము. ఏలన అదియు సృష్టితోబాటు జనించినదే. కాగా దేనినుండి కాలము జనించినదో, ఆ పర తత్త్వము నిరపేక్ష అనంతము

మృత్యుః సర్వహర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతాం,
కీర్తిః శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా. 34

సర్వమును హరించు మృత్యువు నేనే, అటులే పుట్టబోవువారి పుట్టుకయు నేనే. మఱియు స్త్రీలయందు విశేషముగా నుండు కీర్తి, అందము, వాక్పటుత్వము, జ్ఞాపకశక్తి, మేధాశక్తి, ధారణశక్తి (18-33), సహనశక్తి - ఇవి యన్నియు నేనే.

విశేషార్థము : స్త్రీ శక్తిస్వరూపిణి మఱియు పైగుణము లన్నియు శక్తి గుణములు. కనుక నివి స్త్రీగుణములు. ఒకానొకప్పుడు ఇవి పురుషులతో నెక్కువ గన్పించుచున్నవి గదా - అని సందియము పొందిన. పురుషునియందు గల స్త్రీతత్త్వము యొక్క గుణము లనియు చెప్పవలెను. పురుషు లందరును అర్ధనారీశ్వరులే, కావున పురుషులందును స్త్రీతత్త్వ ముండును.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహం,
మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః. 35

సామవేద గేయమంత్రములలో బృహత్సామము నేను, ఛందస్సులలో గాయత్రీఛందస్సు నేనే, మాసములలో మార్గశిరమాసము నేను. మఱియు ఋతువులలో వసంతఋతువు నేను.

ద్యూతం ఛలయతా మస్మి తేజస్తే జస్వినా మహం,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి స త్త్వం స త్త్వవతా మహం.

మోసగాండ్రకు జూదమునందు గల తెలివిని నేను, తేజోవంతులయొక్క తేజము నేను, జయశీలురయొక్క జయము నేను, దృఢనిశ్చయము గలవారియొక్క దృఢనిశ్చయము (2-41) నేను, మఱియు సాత్త్వికుల సత్త్వగుణము నేను

విశేషార్థము : జ్ఞానియొక్క జ్ఞానము (10-38) భగవంతుడు కావచ్చును, గాని, వంచకుని వంచన భగవంతు డెట్లగును? కనుక 'నేతినేతి' యని దీనిని కొట్టివేయవలదా ? అవసరము లేదు. ఏలన వంచకుడు మఱియు వంచన - వీనికి గూడ భగవంతుడే మూలము గాన, బాహ్యరూపములకు మోసపోక, వివేచించి చూడగల కంటికి, ఇవియు భగవంతుడుగానే కన్పించును. కనుక అట్టి కంటికి వంచకవంచనలు, రెండును గూడ 'ఇతి ఇతి' క్రిందకే వచ్చును. వంచనస్వరూపము గూడ తెలివియే గాన, మఱియు తెలివి భగవంతుడే గాన, వంచనయు భగవంతుడే. పోతే, వంచన ఒక స్థిరభావము గాదు. అహంకారము క్షీణించిన కొలది పరవంచన పరోపకారములోనికి మాఱును. ఇట్లువంచన స్వరూపము (తెలివి) దివ్యభావ మగుటయేకాక, వంచనరూపమును దివ్యభావ మగును

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః,
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః. 37

వృష్ణివంశీయులలో వసుదేవ పుత్రుడగు వాసుదేవుడను నేను, పాండవులలో అర్జునుడను నేను అటులే మునులలో నేను వ్యాసమునిని, కవులలో శుక్రాచార్యుడను.

విశేషార్థము : ఇపుడు అర్జునునకు తన విభూతులను వెల్లడించుచున్నవాడు వసుదేవ సుతుడు, వాసుదేవుడు గాదు, సర్వము తానే యైన వాసుదేవుడు (7-19) వసుదేవసుతుడు ఈ వాసుదేవునియొక్క ఒక విభూతి మాత్రమే, అథవా ఈ వాసుదేవునియొక్క ఒక అవతారము మాత్రమే.

మంచిది, కాని అవతారమునకు నేను సర్వమునగు వసుదేవుడ నను జ్ఞాన ముండును గదా ? అయినపుడు వసుదేవ సుతునే ఈ వాసుదేవు డేల కనరాదు ? ఏల కనరా దనిన, అవ్యక్తము అపరిమితము కాగా, వ్యక్త మెపుడును, అది ఎంత అధిక మైనను, పరిమితమే, శక్తియందు (7-24). కనుక వసుదేవసుతునికి, అతడే

నే-నను జ్ఞాన మున్నను, వసుదేవసుతుడు శక్తియందు అతని అంశము మాత్రమే - అని శ్రీ అరవిందుడు ప్రకాశమయ వివరణ నిచ్చును

దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతాం,
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహం. 38

దండించువారియొక్క దండనశక్తిని నేను, జయింపగోరువారి యొక్క జయోపహామగు నీతిని నేను, రహస్యములలో మౌనము నేను, జ్ఞానుల జ్ఞానము నేను.

విశేషార్థము : మౌనమే ఒక రహస్యమా; లేక అది ఒక రహస్యసాధనమా? రెండును. మౌనమునందు ఆత్మ ప్రకాశించును. కాన మౌనము సాధనము. శ్రీ అరవిందుని రచన లెట్లు జరిగినవో తెలియునా? తన మనస్సునందలి తలపుల నన్నింటిని తొలగించి, మనస్సును మౌనముతో నింపును, ఆ మౌనముద్వారా పైనుండి ఆయన రచనలు దిగివచ్చును। పోతే, అది రహస్యము గూడ నెందుచేత ననిన ఆధ్యాత్మిక మౌనస్వరూపము నెఱుంగుట కడుంగడు కష్టము ఈ మౌనము ఆత్మ స్వరూపము, కాన దాని నెఱుంగుట కష్టము, అందుచేత నది రహస్యము.

అవతారిక : ఇట్లు కొన్ని ప్రముఖ విభూతులను వర్ణించి, ఇప్పుడు సర్వ భూతములకు వర్తించగల తన విభూతిని ఒక్క మాటలో చెప్పుచున్నాడు -

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున,
న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరం. 39

మఱియు నర్జునా, సర్వభూతములకు నేది బీజమో, అది నేనే. వేయేల చరాచర భూతములలో నేదియు నేను లేక లేదు.

విశేషార్థము : బీజము = స్వభావము, ఏలన బీజమునుండి వృక్షము వలె, ఈ స్వభావమునుండియే ప్రతిభూతము నేర్పడును. ఇక, స్వభావము = స్వ + భావము భగవంతుని భావమే, భగవంతుని సత్తయొక్క సంభూతియే. ఇట్లు సర్వము ఆద్యంతములందే కాక, మధ్యమునందును భగవంతుడే (10 32) భగవంతుడే, స్వభావము, ఆ స్వభావమే భౌతికభావము.

నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. 40

నా దివ్య విభూతులకు, అర్జునా, అంతమే లేదు. నేను నీకు జెప్పిన విభూతి వివరములు కేవల సూచనామాత్రములు.

విశేషార్థము : ప్రతివానియందును ఒక ప్రత్యేక స్వభావ ముండును. కాని ప్రతివానియందును, అది దివ్య-మనిపించు మేరకు వికసించియుండదు. ఆ మేరకు బైన ఆ స్వభావమును విభూతి యందుము.

అవతారిక : ఏవి విభూతులో తెలిసికొనుటకు ఒక సూత్రము.

యద్యద్ విభూతిమత్ సత్త్వం శ్రీమ దూర్జిత మేవవా,
తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవం. 41

ఈ లోకమున ఏయే వస్తువునందు వైభవము, సౌందర్యము, ఉత్సాహము గన్పించునో, ఆయా వస్తు వెల్ల, నా తేజస్సుయొక్క ఒక స్వల్పాంశమునుండి బుట్టిన దని గ్రహింపుము

విశేషార్థము : ఒకే ఆద్యశక్తి ఈ సర్వరూపములు ధరించినది గావున, వైభవము, సౌందర్యము, ఉత్సాహము, అటులే జ్ఞానము, ఇచ్ఛ, క్రియ – ఇవి యన్నియు శక్తి విశేషములే శక్తియొక్క అంశములే

ఈ విభూతులు పరమార్థమునకు మెట్లు. కావున విభూతి మానవులపట్ల సముచిత గౌరవాదరాలు చూపుచు, మనమును వారి అంతస్థల నందుకొనవలెను.

అవతారిక : ఇపుడు, చివరకు, విశ్వ మంతయు నొక విభూతియే, అదియు 'నా' ఒక స్వల్పాంశమే-యని ముగించుచున్నాడు –

అథవా బహు నైతేన కిం జ్ఞాతేన త వార్జున,
విష్ట భ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. 42

లేక, అర్జునా, ఇట్లీ బహు విభూతులను దెలిసికొనుటవలన నేమియు గాదు (అనగా, ఈ తెలిసికొనుటకు అంత ముండదు) (కావున నొక్క మాటలోజెప్పెదను) నే నీ జగత్తు నంతను నా ఒక అంశముచేత ఆవేశించి, దానిని దృఢముగా నిలిపి యున్నాను.

విశేషార్థము : అతీతముగానున్న భగవానుడు జగత్తు నావేశించి,అంతర్వర్తిగా గూడ నుండిననే కాని, ఆ జగత్తు నిలబడదు. కాని ఇట్లావేశించుటకు తన

ఒక్క అంశము మాత్రమే చాలును — "పాదోఽస్య విశ్వా భూతాని" (ఋగ్వేదము : 10-90-3).

ఇట్లు అభివ్యక్తమైన ప్రపంచ సంతతియు అభివ్యక్తికి పైనున్న భగవంతుని యొక్క ఒక అంశము. అందుచేత అతడు ప్రపంచమునం దుండియు దానియందు చిక్కుకొనడు. కనుక మనమును తిరిగి భగవంతునిలో జన్మించి, అక్కడ నెలకొని నపుడే, విముక్తులమై, విముక్త జీవనమును గడుపగలము (6-31).

ఈ అద్భుత సత్యమును భగవాను డెందుకు ప్రకటించెను? తన ఘనతను చాటుకొనుటకా? కాదు, తనయందు నెలకొని నపుడే, మనకు సంసిద్ధి సిద్ధించు నని చూపుటకు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే

విభూతియోగో నామ దశమోఽధ్యాయః





# శ్రీ గీ తా యో గ ము

## అథ ఏకాదశోఽధ్యాయః

## విశ్వరూపసందర్శనయోగః

ఒక పరిశీలన : క్రిందటి అధ్యాయమున భగవానుడు ముందు తన వేయు వేయు విభూతులను జెప్పి చివరకు తన మహావిభూతి నిట్లుతెలిపెను – "ఈ జగత్తు నంతను నేను నా ఒక అంశమాత్రముచేత ఆవేశించి నిలిపియున్నాను." (10-42). ఈ అద్భుత వచనము అర్జునుని పరమాసక్తిని రేకెత్తించగా అత డిప్పు డా మహా విభూతినే, అనగా ఈశ్వరుని జగతాత్మరూపమును, విశ్వరూపమును జూడగోరు చున్నాడు (11-3)

నిజానికి క్రిందటి అధ్యాయములోని చివరిమాటయే కాక, విశేషించి 7-10 అధ్యాయములు, నాలుగును ఈ విశ్వరూపమునకే దారితీసినవి. ఎట్లన ఈ అధ్యాయము లందు అర్జునుడు మన 'జీవనముయొక్క' పరమ ఆధ్యాత్మిక రహస్యమును విని యున్నాడు. అది యేమన– అంతయు భగవంతుని నుండియే (10-8), కావున అంతయు భగవంతుడే (7-19), అన్నింటియందును భగవంతుడు నివసించు చున్నాడు (10-39), మఱియు ప్రతి పరిమితరూపమునను గుప్తముగా నున్న భగవంతుడు ఒకనాటికి వ్యక్తము కాగలడు (4-24) (6-31), (10-11).

ఈ పరమ రహస్యమును వినుటచేత అర్జునుని మోహము విడిపోయినది (10-1). ఏమి టీ మోహము? వస్తువులు తమకుదామే తమకొఱకే వర్తించుచున్నవి, వానికి భగవంతునితో ప్రమేయము లేదు, అనగా నవి భగవంతునినుండి ఉద్భవించలేదు, వానిని ధరించి, పాలించు భగవంతుడు (కన్పించడు గాన) లేడు, మఱియు నవి భగవదిచ్ఛ ననుసరించి, భగవత్సంకల్పమును, సాధించుటకు గాక, తమ ప్రయోజన మునకే ప్రవర్తించుచున్నవి – ఇదిగో ఇదియే మోహము, ఇదియే మానవుని ఇంద్రియ మనస్సులకు దయ్యములాగున పట్టి పీడించుచున్న భ్రాంతి (illusion) – అని శ్రీ అరవిందుడు. శ్రీ శంకరుడు చెప్పినట్లు, జగత్తు భ్రాంతి గాదు; జగత్తు

తనకు దానే వర్తించుచున్న దను భావమే భ్రాంతి. ఈ భావమే మోహముగా మాఱి, ఆదిలో అర్జునుని సందేహమునకును, సమ్మోహమునకును, కర్మనిరాకరణము నకును గారణమయ్యెను.

ఈ పరమ రహస్యము వినుటచేత అర్జునుని మోహము అతని 'మనస్సు నుండి' తొలగిపోయినది, మనస్సునందు తెలివి ఏర్పడినది. ఈ తెలివి ద్వారా ఆ రహస్య మింకను అతని సత్తిలోని కింకవలసి యున్నది. అది ఆ రహస్యమును 'చూచుటచేత' జరుగును. ఇట్లు చూచుటచేత తన సత్తిలోని కింకి, అందులో భాగమై నపుడే, ఆ వినిన రహస్యము కార్యకారి యగును, అర్జును డపుడు యుద్ధముచేయు టకు నడుముకట్టును. కనుక భగవాను డర్జునునకు విశ్వరూపమును చూపించవలసిన ఆవశ్యకత కలదు.

ఇచ్చట నొక రహస్యము : అర్జునుడు విశ్వరూపము చూడగోరినట్లు పైకి గన్పించును (11-3); కాని నిజానికి, తన విశ్వరూపమును చూపించవలసిన ఆవశ్యకత కలదు గాన, ఆ కోరికను ప్రేరేపించినవాడు భగవంతుడే — యని శ్రీ అరవిందు డొక్కడు మాత్రమే చెప్పుటను మనము గమనించదగును. ఇట్టిదే మఱియొక రహస్య మేమన —

సర్వసాధారణముగా, పరమార్థపథమున ఆకాంక్ష మనది. దానిని పూరించు వాడు భగవంతుడు — అని అనుకొందుము. ఇదియు నొక భ్రాంతియే భ్రాంతి యని మనకు దెలియక పోయినను భ్రాంతియే ఏలన నిజానికి ఆకాంక్షను రేకెత్తించు వాడును భగవంతుడే. అస్తు.

అట్లు అర్జునునిచేత అడిగించుకొని, తన విశ్వరూపమును జూపి, ఆ విశ్వ రూపముయొక్క శత సహస్రముఖములనుండి అర్జునునికి కర్మాదేశ మిచ్చును — "యుధ్యస్వ, జేతాసి రణే సపత్నాన్" (11-34) ఇదియే కర్మాదేశమును వినిపించ వలసిన, స్వీకరించవలసిన పరమ విధానము. కర్మాదేశము నిట్లు స్వీకరింపజేయుటయే విశ్వరూప దర్శనముయొక్క 'ప్రయోజనము'.

గీతయం దీ విశ్వరూప — అధ్యాయము సుప్రసిద్ధము మఱియు దాని కవితా ప్రభావము హృదయమును బలముగా నాకట్టుకొనును, కాని బుద్ధియందు దానికి గల స్థానము పైకి పూర్తిగా కన్పించదు, అనగా పైన పేర్కొనబడిన ప్రయోజనము బుద్ధితో లోతుగా విచారించిననే కాని కన్పించదు—అని శ్రీఅరవిందుడు వివేచించును. కాగా నితడు ఈ ప్రయోజనమును వేఱుచేసి చూపలేదు.

విశ్వరూపమునకు ప్రయోజనముతోబాటు, ఒక ఆంతర్యమును, ఒక అర్థమును ఒక లక్ష్యమును గూడ గలవు; ఇవియు ప్రయోజనమువలె బుద్ధిగమ్యములే కాని, హృదయగమ్యములు గావు. ఇపు డీ మూడింటిని జూతము.

"అర్జునా! ఈ నా శరీరమునందు 'ఏకీకృత'మై యున్న 'సమస్త' చరాచర జగత్తును నీ విప్పడు దర్శించుము" (11-7). ఇదియే విశ్వరూపసందర్శనముయొక్క ప్రధాన స్వరము, కేంద్రభూత ఆంతర్యము. ఇచ్చట వలెనె అచ్చటను అర్జును డనేకమును జూచును. కాని అచ్చటి పరమ విశేష మేమన, అచ్చట ఆ అనేక మును ఏకమునందు జూచును, ఆ అనేకమునందు ఏకమును జూచును, మఱియు నా అనేకమును ఏకముగా జూచును. అటులే భగవంతుని భయంకరునిగాను, ప్రియునిగాను జూచును (10-36), మఱియు స్రష్టగాను (11-37), సంహర్త గాను(11-32) జూచును. ఇట్లు మోహకారణమగు ద్వంద్వము లన్నియు నచ్చట ఏకతనందును మఱియు నన్యోన్యముగా గన్పించును. ఇదియే విశ్వరూప దర్శనము యొక్క 'ఆంతర్యము'.

మఱియు నచ్చట కాలస్వరూపుడు సంహర్తయేకాక స్రష్టయు నని కన్పించును. అనగా వినాశము వినాశముకొఱకు గాదు, 'పూర్వాధిక' సృష్టికొఱకు. ఇది విశ్వరూప దర్శనముయొక్క 'అర్థము'. ఈ అర్థమును గ్రహించి నపుడు, అట్టి వినాశమున అర్జునుడు నిశ్చింతగను, ఉత్సాహముగను పాల్గొనును.

ఇట్లు పురోగమించుచు, సృష్టి దివ్యత్వమును జేరుకొనుచున్న దని విశ్వరూప మున విశదమగును. సృష్టియొక్క ఈ లక్ష్యమును గోచరింపజేయుటయే విశ్వరూప దర్శనముయొక్క లక్ష్యము.

ఈ అంశములను మనస్సులో నుంచుకొని, అర్జునుని వెనుక మనమును విశ్వరూపమును జూతము —

అర్జున ఉవాచ -

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితం,
యత్త్వ యోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. 1

అర్జునుడు చెప్పెను - నన్ను అనుగ్రహించు నిమిత్తము, హే కృష్ణా, అధ్యాత్మ-మను పేరుగల, అత్యున్నత మఱియు నతిరహస్యమగు నే యుపదేశ మును జేసితివో, దానివలన నా మోహము గతించిపోయినది.

విశేషార్థము : ఈ ఉపదేశసంగ్రహము, ఈ మోహస్వరూపము 'పరిశీలనలలో' జూడదగును.

అధ్యాత్మము = స్వభావము (8-3). కాని స్వభావము అధ్యాత్మమునందు ఒక భాగము మాత్రమే. అధ్యాత్మ మన స్వభావవిషయమే కాక, 'స్వ' విషయము గూడ నగును, అనగా అధ్యాత్మపదము అంతరాత్మ, సర్వాత్మ, పరమాత్మల మూడింటిని పరామర్శించును కావుననే అధ్యాత్మము 'పరమము' మఱియు 'గుహ్యము' (11-1).

అవతారిక : మోహ మెందుచేత గతించిన దన -

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయం. 2

ఓ కమలాక్షా, కృష్ణా! నీవలన నేను భూతముల ఆదిని, అంతమును, మఱియు నీ అవినాశి మాహాత్మ్యమును వినియున్నాను.

విశేషార్థము : భూతములు తమకు దాము మనుచున్న మను భావమే మోహ కారణము. ఇపుడు, భూతముల కాద్యంతములు గల వనియు, అవి భగవంతుని మాహాత్మ్యముయొక్క రూపములు మాత్రమే యనియు దెలిసికొనుటచేత మోహము పోయినది.

ఏవ మేత ద్యథాత్థ త్వ మాత్మానం పరమేశ్వర,
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ. 3

నీ వేమి చెప్పుచున్నావో, పరమేశ్వరా, కృష్ణా, అది యంతయు నిజమే. కావున, నో పురుషోత్తమా, నీ స్వకీయ ఈశ్వరరూపమున - విశ్వరూపమున - ఆ నిజము నిపుడు నేను చూడగోరుచున్నాను.

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో,
యోగేశ్వర తతో మే త్వం దర్శ యాత్మాన మవ్యయం. 4

ప్రభూ, కృష్ణా! నే నా రూపమును జూడగల నని నీవు తలంతు వేని, యోగేశ్వరా, నీ అవినాశి ఆత్మను నా కిపుడు జూపుము.

విశ్వరూపమునకు ప్రయోజనముతోబాటు, ఒక అంతర్యమును, ఒక అర్థమును ఒక లక్ష్యమును గూడ గలవు; ఇవియు ప్రయోజనమువలె బుద్ధిగమ్యములే కాని, హృదయగమ్యములు గావు. ఇపు డీ మూడింటిని జూతము.

"అర్జునా! ఈ నా శరీరమునందు 'ఏకీకృత'మై యున్న 'సమస్త' చరాచర జగత్తును నీ విపుడు దర్శించుము" (11-7). ఇదియే విశ్వరూపసందర్శనముయొక్క ప్రధాన స్వరము, కేంద్రభూత అంతర్యము. ఇచ్చట వలెనె అచ్చటను అర్జును డనేకమును జూచును. కాని అచ్చటి పరమ విశేష మేమన, అచ్చట ఆ అనేక మును ఏకమునందు జూచును, ఆ అనేకమునందు ఏకమును జూచును, మఱియు నా అనేకమును ఏకముగా జూచును. అటులే భగవంతుని భయంకరునిగాను, ప్రియునిగాను జూచును (10-38), మఱియు స్రష్టగాను (11-37), సంహర్త గాను(11-32) జూచును. ఇట్లు మోహకారణమగు ద్వంద్వము లన్నియు నచ్చట ఏకతనందును మఱియు నన్యోన్యముగా గన్పించును. ఇదియే విశ్వరూప దర్శనము యొక్క 'అంతర్యము'.

మఱియు నచ్చట కాలస్వరూపుడు సంహర్తయేకాక స్రష్టయు నని కన్పించును. అనగా వినాశము వినాశముకొఱకు గాదు, 'పూర్వాధిక' సృష్టికొఱకు. ఇది విశ్వరూప దర్శనముయొక్క 'అర్థము'. ఈ అర్థమును గ్రహించి నపుడు, అట్టి వినాశమున అర్జునుడు నిశ్చింతగను, ఉత్సాహముగను పాల్గొనును.

ఇట్లు పురోగమించుచు, సృష్టి దివ్యత్వమును జేరుకొనుచున్న దని విశ్వరూప మున విశదమగును. సృష్టియొక్క ఈ లక్ష్యమును గోచరింపజేయుటయే విశ్వరూప దర్శనముయొక్క లక్ష్యము.

ఈ అంశములను మనస్సులో నుంచుకొని, అర్జునుని వెనుక మనముమ విశ్వరూపమును జూతము —

**అర్జున ఉవాచ –**

**మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితం,**
**యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. 1**

అర్జునుడు చెప్పెను - నన్ను అనుగ్రహించు నిమిత్తము, హే కృష్ణా, అధ్యాత్మ-మను పేరుగల, అత్యున్నత మఱియు నతిరహస్యమగు నే యుపదేశ మును జేసితివో, దానివలన నా మోహము గతించిపోయినది.

విశేషార్థము : ఈ ఉపదేశసంగ్రహము, ఈ మోహాస్వరూపము 'పరిశీలనలలో' జూడదగును.

అధ్యాత్మము = స్వభావము (8-3). కాని స్వభావము అధ్యాత్మమునందు ఒక భాగము మాత్రమే. అధ్యాత్మ మన స్వభావవిషయమే కాక, 'స్వ' విషయము గూడ నగును, అనగా అధ్యాత్మపదము అంతరాత్మ, సర్వాత్మ, పరమాత్మల మూడింటిని పరామర్శించును కావుననే అధ్యాత్మము 'పరమము' మఱియు 'గుహ్యము' (11-1).

అవతారిక : మోహ మెందుచేత గతించిన దన -

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయం.　　2

ఓ కమలాక్షా, కృష్ణా ! నీవలన నేను భూతముల ఆదిని, అంతమును, మఱియు నీ అవినాశి మాహాత్మ్యమును వినియున్నాను.

విశేషార్థము : భూతములు తమకు దాము మనుచున్న వను భావమే మోహ కారణము. ఇపుడు, భూతముల కాద్యంతములు గల వనియు, అవి భగవంతుని మాహాత్మ్యముయొక్క రూపములు మాత్రమే యనియు దెలిసికొనుటచేత మోహము పోయినది.

ఏవ మేత ద్యథాత్థ త్వ మాత్మానం పరమేశ్వర,
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ.　　3

నీ వేమి చెప్పుచున్నావో, పరమేశ్వరా, కృష్ణా, అది యంతయు నిజమే. కావున, నో పురుషోత్తమా, నీ స్వకీయ ఈశ్వరరూపమున - విశ్వరూపమున - ఆ నిజము నిపుడు నేను చూడగోరుచున్నాను.

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో,
యోగేశ్వర తతో మే త్వం దర్శ యాత్మాన మవ్యయం.　4

ప్రభూ, కృష్ణా ! నే నా రూపమును జూడగల నని నీవు తలంతు వేని, యోగేశ్వరా, నీ అవినాశి ఆత్మను నా కిపుడు జూపుము.

విశేషార్థము : 'ఆత్మానం దర్శయ'= ఆత్మను జూపుము - ఇది సరియైన అనువాదము. శ్రీ శంకరుడు 'ఆత్మానం దర్శయ'-అను మాటలకు అర్థము కూడ చెప్పకుండ విడిచివేసెను. పోతే, ఇతరులు, 'ఆత్మానం దర్శయ'-నీ రూపమును జూపుము-అని అనువదించి, ఆత్మపదమునకు నీ - అను అర్థమును చెప్పినారు. కారణము, ఆత్మను చూచుటకు వీలులేదు, అది చూడబడు వస్తువు కాదు-అని వారి అభిప్రాయము.

మంచిది, కాని ఆత్మ నసలు చూడలేకపోయిన, ఆత్మనుండి భూతముల ఉత్పత్తి - అను నిజము నెట్లు కనులార గాంచగలము ? అట్లు గాంచుటకే కదా అర్జునుడు ఈశ్వర రూపమును జూడగోరుచున్నాడు

ఇచట శ్రీ అరవిందు దేమి తెలుపును ? 'ఆత్మానం దర్శయ' = ఆత్మను జూపుము - అని ఉన్నదున్నట్లే ఆయన అనువదించెను, అనువదించి ఇట్లు చెప్పెను - ఆత్మకు గూడ నొక రూపము గలదు. దాని నీ కంటితో జూడజాలము, అది 'అచింత్యరూపం' (8-9). దానిని జూచుట కొక దివ్యచక్షువు (11-8) గలదు. దానిని 'యోగేశ్వరుడగు' (11-4) కృష్ణుడు మన కివ్వగలడు - అని శ్రీ అరవిందుని వ్యాఖ్యానము.

యోగేశ్వరుడు = యోగశక్తికి ఈశ్వరుడు. యోగము = ఆత్మరూపమును జూపగల ఆత్మశక్తి (11-47) - అని శ్రీ అరవిందుడు. (9-5) శ్లోకముయొక్క-విశేషార్థమును గూడ జూడదగును. పోతే, యోగేశ్వరుడు = యోగుల యోగములకు ఈశ్వరుడు - అని శ్రీ శంకరుడు.

శ్రీ భగవా నువాచ -

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. 5

శ్రీ భగవానుడు పలికెను-నానావిధములుగ నుండి, నానావర్ణములు, నానాకారములు గల, వందలకొలది, వేలకొలది, పార్థా, నా దివ్యరూపముల నిపుడు చూడుము.

విశేషార్థము : అడిగినదే తడవుగా అర్హతగల భక్తునిపై భగవానుడు తన అపరూప అనుగ్రహము నెట్లు వర్షించునో, ఇచ్చట కాననగును:

అవతారిక : 'నానావిధము' లన నేమి ? వినుడు —

**పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుతస్తథా,**
**బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత. 6**

**అర్జునా :** ఆదిత్యులను జూడుము, వసువులను జూడుము, రుద్రులను, అశ్వినీ కుమారులను మఱియు మరుత్తులను జూడుము. ఇంకను నీ వింతకు ముందెన్నడు చూడని అనేకానేక ఆశ్చర్యములను జూడుము.

విశేషార్థము : విశ్వరూపమున మానవలోకమే కాక, ఎన్నో అధిమానవ లోకము లుండును కనుక మానవలోకమున లేని ఎన్నో అద్భుతము లచ్చట గాన్పించును.

రష్యాకు జెందిన ప్రథమ వ్యోమగామి, యూరీగెగారిన్, "నేను సుదూరా కాశములో పరిభ్రమించి వచ్చాను, నా కెక్కడను స్వర్గము గోచరించలేదు." అని హేళన చేసెనట. అతనికి విశ్వరూపము జూచు భాగ్యము గలిగిన, మఱియొక అర్థమున అర్జునుడు బొందిన తీవ్రపశ్చాత్తాపమునే (11-41. 42) అతడును బొందును.

అవతారిక : ఇపుడు ఆశ్చర్యములలో నెల్ల ఆశ్చర్యమును ఏకత్వమును - గనుము -

**ఇహైకస్థం జగత్ కృత్స్నం పశ్యాద్య సచరాచరం,**
**మమ దేహే గుడాకేశ యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి. 7**

**అర్జునా :** ఇచ్చట నా శరీరమునం దేకీభూతమై యున్న సచరాచర జగత్తు నంతను అలోకించుము; ఇంకను దేనిని జూడగోరుచున్నావో, దానిని గూడ దర్శింపుము.

విశేషార్థము : 'ఏకస్థం = ఏకమునం దున్నది-అని శ్రీ శంకరుడు. ఏకస్థం = ఏకీభూతమయినది - అని శ్రీ అరవిందుడు. ఆకాశమునందు అన్నియు నున్నట్లు జగత్తు భగవంతుని యం దున్న - దని శ్రీ శంకరుని వ్యాఖ్య సూచించుచుండగా, కొమ్మలు చెట్టునందువలె జగత్తు భగవంతునియం దున్న - దని శ్రీ అరవిందుని అను వాదము తెలుపును ఇట్లు ఏకమునందు అనేకమును, అనేకమునందు ఏకమును జూపుటయే విశ్వరూపదర్శనము యొక్క అంతర్యము (significance) - అని శ్రీ అరవిందుడు. ఈ అంతర్యమును ఇతరు లెవ్వరును విడదీసి చూపలేదు.

'ఇంకను దేనిని జూడగోరుచున్నావో': "యద్వా జయేమ యదివా నో జయేయుః" – (2-6) అనగా మేము జయించెదమో, లేక వారు జయించెదరో – అను నీ సందేహమును గూడ, అర్జునా! విశ్వరూపమును జూచి, తీర్చుకొనుము–అని శ్రీ శంకరవ్యాఖ్యానము. ఇచ్చట పై ఉదాహరణకు అనగా, (2-6)కు, శ్రీశంకరుడు చేసిన అనువాదమే అసలు తప్పు. దాని సరియైన అనువాదమే మనిన- "మేము జయించవలెనో, లేక వారు జయించవలెనో", అనగా మేము జయించుట మాకు శ్రేయస్కరమో, లేక వారు జయించుట మాకు శ్రేయస్కరమో (మాకు దెలియకున్నది). చూడుడు: శ్లోకము (2-6) యొక్క పూర్తి అనువాదము.

పోతే, ఇవ్విషయమున శ్రీ అరవిందు దేమి చెప్పును? విశ్వరూపదర్శనము సర్వమునకు సంబంధము కల్పించు, సర్వమును ఏకముచేయు దర్శనము. కనుక నిదియే ఒక మహావిష్కారము. ఈ మహావిష్కారమునుండి పరిపూర్ణావిష్కారమునకు అంతరాత్మ పోవచ్చును. ఆ పరిపూర్ణ ఆవిష్కారమునకు సంబంధించిన ఇతర సత్యములను గూడ అర్జును డిపుడు చూడవచ్చును–అని శ్రీ అరవిందుడు.

నతు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుసా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరం. 8

కాని, అర్జునా, నీ యిప్పటి స్వచక్షువుచేతనే - మానవచక్షువుచేతనే - నా విశ్వరూ పమును జూడజాలవు. కావున నీకు దివ్యచక్షువును ప్రసాదించుచున్నాను, దానితో నా ఈశ్వరయోగము నీక్షింపుము.

విశేషార్థము: మానవనేత్రము వస్తువుల బాహ్యరూపమును మాత్రమే చూడగలదు, అథవా అత్యధికము, ఆ రూపసంకేతముల ద్వారా సనాతన గుహ్యము యొక్క ఒకటి, రెండు పార్శ్వముల ఛాయలను మాత్రము గ్రహించును. దీనికి భిన్నముగా నొక దివ్యనేత్రము గలదు, ఇది అంతరతమ, 'అచింత్య రూపమును' (8-9) గూడ చూడగలదు, అనగా పరమేశ్వరుని తన యోగశక్తియందు చూడగలదు. ఆ శక్తి ఎట్టి దనిన, మానవమాత్రునికి ఆ దివ్యనేత్రమును క్షణములో ప్రసాదించగలదు.

'యోగమును ఈక్షించుము': ఈశ్వరుని యోగశక్తియే విశ్వరూపము ధరించినది. ఇట్లు విశ్వము యోగమే కావున, 'యోగమును' జూడు మనుచున్నాడు.

సమస్త ఘటము ఈ యోగశక్తి యొక్క ఫలితము మఱియు ప్రకటనలు మాత్రమే – **అని శ్రీ అరవిందుడు.**

**సంజయ ఉవాచ –**

ఏవ ముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః,
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరం. 9

సంజయుడు చెప్పెను–ఇట్లు వచించి, అనంతరము, ఓ ధృతరాష్ట్రమహారాజా, మహాయోగేశ్వరుడగు హరి పార్థునకు తన సర్వోత్కృష్ట ఈశ్వర రూపమును జూపెను.

విశేషార్థము : శక్తి స్వయముగా నుండదు, శక్తిమంతు డొక డుండును, ఆ శక్తిమంతుడు శక్తికి ఈశ్వరుడు.

ఆ శక్తిచేత శక్తిమంతుడగు ఈశ్వరుడు ప్రపంచమును సృజించి, దానితో యోగము (సంయోగము)నం దుండును. కనుక నది యోగశక్తి. యోగము ఈ శక్తి స్వరూపలక్షణము గాన, ఈ శక్తిని 'యోగ' మందురు. పోతే, ఈ యోగమునకు ఈశ్వరుడు యోగేశ్వరుడు

ఈ యోగశక్తిలో నొక అంశముచేత సాధకుడు భగవంతునితో యోగమును పొందును, మఱియు నతని 'యోగమున' పాలుపంచుకొనును. ఇట్టి సాధకుడు యోగి యనబడును, ఇట్టియోగులలో శ్రేష్ఠుడు యోగీశ్వరుడు. యోగేశ్వరునికి యోగీశ్వరునికిని గల ఈ సూక్ష్మభేదమును మనము గమనించదగును.

అవతారిక : ఆ ఈశ్వరరూప మెట్టి దనిన –

అనేకవక్త్రనయనం అనేకాద్భుతదర్శనం,
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధం. 10

దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనం,
సర్వాశ్చర్యమయం దేవం అనంతం విశ్వతోముఖం. 11

ధృతరాష్ట్రమహారాజా ! ఆ పరమ రూపమునకు అనేక వక్త్రములుమఱియు నేత్రములు గలవు అది అనేక అద్భుతరూపములతో నిండియున్నది, అది అనేక దివ్యాభరణములను ధరించి, అనేక దివ్యాయుధములను ఎత్తిపట్టియున్నది. అటులే

దివ్యమాలలను, వస్త్రములను ధరించి, దివ్య గంధములను బూసికొనియున్నది. అది సర్వాశ్చర్యమయము, అది దేదీప్యమానము. ఎల్లెడల ముఖములు గలిగియున్న అది అనంతము.

విశేషార్థము : దేవతలు గూడ చూడ నోచుకొనని ఏ విశ్వరూపమును శ్రీకృష్ణప్రసాదముచేత అర్జునుడు చూచెనో, అదే విశ్వరూపమును వ్యాసప్రసాదము చేత (18-75) సంజయుడు చూచెను ; ఈ పై వర్ణన సంజయుడు చేసిన విశ్వరూప వర్ణన యని మనము గుర్తించుకొనవలెను. ఆధ్యాత్మిక ప్రపంచములోని పెద్దల అనుగ్రహ మేమి చేయగలదో. ఈ సంజయదృష్టాంతముచేత మనకు దెలియును.

అవతారిక : ఆ రూప మెంత 'దేదీప్యమాన' మనిన –

దివి సూర్యసహస్రస్య భవే ద్యుగపదుత్థితా,
యది భాః, సదృశీ సాస్యా ద్భాస స్తస్య మహాత్మనః. 12

ఆకసమున ఒకే పర్యాయము వేలకొలది సూర్యుల ప్రచండతేజము పైకి లేచి ప్రసరించినచో – అదిగో, ఆ తేజము ఆ జగదాత్మరూపుని తేజమును బోలి యుండును.

అవతారిక : మఱియు నట నే ఆధ్యాత్మిక సత్యమును గాంచెను?–

తత్రైకస్థం జగత్ కృత్స్నం ప్రవిభక్త మనేకధా,
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా. 13

శతసహస్రవిధముల ప్రవిభక్తమై సర్వాటికి, అచ్చట ఆ దేవదేవుని శరీరమున ఏకీభూతమై యున్న సమస్త జగమును అర్జును డపుడు గాంచెను.

విశేషార్థము : విశ్వాతీతపదమునందే కాక, విశ్వభావమునందును ఏకత గలదు. అనేకతకు ఈ ఏకత ఆధారముగా లేనిచో, ప్రపంచముయొక్క అనేకత నిలువనేనిలువదు ఉభయము సత్యమే అయినను, ఈ ఏకత అధికతర సత్యము. కాగా అనేకతయొక్క అల్పతర సత్యమును విపరీతముగా ఒత్తిచెప్పుచు, మాయా వాదము ముందు దానిని వ్యావహారిక సత్యముగాను, చివరకు మిథ్యాదృశ్యముగాను నిర్ణయించును. కాని ఇది సరికాదు. ఏలన అనేకత ఏకతనుండి వెడలి, ఆ ఏకతను అధికాధికముగా వ్యక్తముచేయుచున్నది. అనేకత మిథ్యయే యగుచో, అది అట్లు చేయజాలదు – అని శ్రీ అరవిందుడు.

తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత. 14

అట్లు చూచిన అర్జునుడు ఆశ్చర్యచకితుడై, రోమాంచయుతుడై, ఆ దేవ దేవునికి తలవంచి నమస్కరించి, పిమ్మట అంజలి జోడించి ఇట్లు పలికెను –

విశేషార్థము : ఆశ్చర్యమునకు గారణము ? ఇంటిదగ్గర పిల్లిని మాత్రమే చూచినవానికి జంతుశాలలో పులిని చూచినపుడు ఆశ్చర్యము గలుగును. తర్వాత మునుల ఆశ్రమములో అన్యోన్యముగా నున్న పులిని మేకను జూచి మరింత ఆశ్చర్యము ఆవేశించును. అటులే అర్జునుడును అచ్చట అనేక అద్భుతములను చూచి ఆశ్చర్యము నందెను సరే: అంతకంటెను ఎక్కువగా, మనకు పరస్పర విరుద్ధముగా గన్పించు అనేక భావములు అచ్చట ఏకతనందుటను చూచి, ఆశ్చర్య చకితు డయ్యెను. ఉదాహరణకు ఆ విశ్వరూప భగవంతుడు సుందరముగు ఆభరణములను ధరించియుండుటే కాక, భయంకరములగు ఆయుధములను గూడ ఎత్తిపట్టియుండెను అతడు సుందరుడు, అదే సమయమున భయంకరుడు; అతడు తనయందు వ్యక్తముచేసిన ప్రపంచము అరణ్యసదృశము, అదే సమయమున క్రమబద్ధము.

అవతారిక : ఇప్పడు అర్జునుని ముఖమునుండి నిర్గమించిన ప్రబల కవితా ధారను పానము చేతము —

అర్జున ఉవాచ –

పశ్యామి దేవాంస్తవ దేవదేహే
సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్,
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్. 15

అర్జునుడు పలికెను – ఓ దేవదేవా ! నీ శరీరమునందు సమస్త దేవతలను వీక్షించుచున్నాను; వివిధ భూతసంఘములను, పద్మమునందు గూర్చొనియున్న సృష్టికర్త, బ్రహ్మదేవుని, సకల ఋషులను, దివ్యసర్పములను వీక్షించుచున్నాను.

విశేషార్థము : 'నీ నాభినుండి వెలువడిన పద్మమునందు....' అని చెప్పిన ఆ వర్ణనపూర్తి యగును. పురాణములయందు ఏది చెప్పబడెనో, దాని నిక్కముగ అర్జునుడు ప్రత్యక్షముగా జూచుచున్నాడు.

మూలశ్లోకములో నున్న ధ్వనిని అనువాదములోనికి దెచ్చుట సాధ్యముకాదు. ఆ ధ్వనితరంగములు మనలో లోతునకు జొచ్చుకొనిపోవును, ఆ ధ్వని అట్టిది :

అనేక బాహూదర వక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపం,
నాంతం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప. 16

హే విశ్వేశ్వర! విశ్వరూప! నీయొక్క అసంఖ్యాక బాహువులను, ఉదరములను, నోళ్ళను, నేత్రములను జూచుచున్నాను, అన్నివైపుల నీ అనంతరూపములను గాంచు చున్నాను. కాని నీకు ఆదిగాని, మధ్యము గాని, అంతము గాని నాకుగన్పించుటలేదు.

విశేషార్థము : అతడే ఒకే సమయమున విశ్వరూపుడు మఱియు విశ్వాతీతు డగు విశ్వేశ్వరుడు. లేనిచో అతడు విశ్వమునందు బద్ధుడగును. అపుడు అతనికి గాని, మనకు గాని ముక్తి యుండదు.

అవతారిక : మఱియు —

కిరీటినం గదినం చక్రిణంచ
తేజోరాశిం సర్వతోదీప్తిమంతం,
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా
దీప్తానలార్కద్యుతి మప్రమేయం. 17

దేవా ! గదాచక్రములను ధరించి, నీవు కిరీటముతో నొప్పారుచున్నావు. నీవు ఎల్లెడల నుండుచున్న తేజోరాశివి, అందుచేతనే నిన్ను జూడశక్యముగాకున్నది ఉజ్జ్వలమగు అగ్ని మఱియు సూర్యులవంటి తేజముతో నన్ను ఆవరించియున్న అప్రమేయుడవు నీవు.

అవతారిక : ఇపుడు విశ్వరూపుని విశ్వాతీతతత్వ దర్శనము—

త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానం,
త్వ మవ్యయః శాశ్వతధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే. 18

తెలియదగిన అక్షర పరబ్రహ్మవు నీవు; నీ వీ విశ్వముయొక్క సమున్నత ఆధారము (15-1) మఱియు నివాసము, నీవు సనాతన ధర్మముయొక్క అవ్యయ రక్షకుడవు, మఱియు నీవు ప్రకృతియందలి సనాతన పురుషుడవు—అని నా (అర్జునుని) నిర్ణయము.

విశేషార్థము : 'అని నా నిర్ణయము' - అను భాగమును శ్రీ అరవిందుడు తన అనువాదమున విడిచిపేసెను. అనగా ఈ శ్లోకమున అర్జునుడు పలికిన దంతయు అతని దర్శనమే (4-34) గాని, కేవల అభిప్రాయము గాదని శ్రీ అరవిందుని ఆశయము. పోతే, పై శ్లోకమున భగవానుడు 'అప్రమేయుడుగా' గోచరించెను గాన అతడు అక్షరపరబ్రహ్మ కావలె - నని అర్జునుడు నిర్ణయించుకొనెను - అని శ్రీ శంకరుడు

అక్షరునికి గూడ ఒక ఆధ్యాత్మిక రూప ముండును (8-9), దానిని తనచే ప్రసాదించబడిన దివ్యచక్షువుతో అర్జునుడు చూచెను - సాక్షాత్తు చూచెను - అని శ్రీ అరవిందుని సమాధానము.

ఇట్లు భగవంతుడు విశ్వవినాశకుడు (11-32) మాత్రమే కాడు. అతడు విశ్వమునకు 'ఆధారము' మఱియు విశ్వధర్మముల 'శాశ్వతరక్షకుడును'.

అవతారిక : ఇపు డతని భయంకర రూపము —

అనాది మధ్యాంత మనంతవీర్యం
అనంతబాహుం శశిసూర్యనేత్రం,
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపంతం. 19

ప్రభో ! నీ వాదిమధ్యాంతములు లేని అప్రమేయుడవు, నీ బాహువు లసంఖ్యాకములు, సూర్యులు మఱియు చంద్రులు నీ నేత్రములు; జ్వలించుచున్న అగ్నివలె నీ నోరు భయంకరము. విశ్వము నంతను స్వతేజముచే తపింపజేయుచున్న ఇట్టి నీ భీకరరూపమును గాంచుచున్నాను.

విశేషార్థము : సూర్యుడు స్వయంజ్యోతి యని భౌతిక విజ్ఞానము చెప్పును. కాని సూర్యునిగూడ తపింపజేయువా డొక డున్నాడని ఇక్కడ మనకు తెలియును — "తస్య భాసా సర్వ మిదం విభాతి" (క. ఉ.)—అతని ప్రకాశముచేత ఇది యంతయు వివిధముగా ప్రకాశించుచున్నది — అని ఉపనిషత్తు గూడ చెప్పును.

ఇట్లు భౌతికమునకు, భగవంతునికి మధ్య నెన్నియో అంతస్తు లున్నవి. మూలముతో బోల్చినపుడు భౌతికము వెలవెలబోవును. కావున భౌతికావిష్కరణలు స్వయముగా గొప్పవే యైనను, ఆధ్యాత్మిక సత్యములతో బోల్చినపు డవి పిల్లల ఆటవస్తువుల వంటి - వని శ్రీ అరవిందుడు వేఱొక చోట ప్రస్తావించును.

ద్యావాపృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః,
దృష్ట్వాద్భుతం రూప ముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్. 20

హే మహాత్మా, విశ్వరూపా! దివికిని, భువికిని మధ్య గల ఈ ప్రవేశ మంతయు, అటులే దిశ లన్నియు నీ యొక్కనిచేతనే వ్యాప్తములై యున్నవి. కావుననే నీ రూప మద్భుతము మఱియు దారుణము. అట్టి నీ దారుణరూపమును జూచి, ముల్లోకములును భీతిగ్రస్తము లైనవి.

అవతారిక : ఎట్లన -

అమీ హి త్వాం సురసంఘా విశంతి
కేచిద్ భీతాః ప్రాంజలయో గృణంతి,
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః. 21

అదిగో, ప్రభూ, ఆ సురసంఘములు నీలో బ్రవేశించుచున్నవి, వారిలో కొందరు భయభీతులై, చేతులు జోడించి, స్తోత్రరూపమున నేదియో గొణుగుచున్నారు. అయితే, మహర్షులు మఱియు సిద్ధులసంఘములు 'శాంతిశుభములు గలుగుగాక!' యని పుష్కలమగు స్తుతులచే నిన్ను స్తోత్రముచేయుచున్నారు.

విశేషార్థము : సాక్షాత్తు సురసంఘములు గాక, భీష్మద్రోణాది రూపమున నున్న (11-26) సురలు భగవంతుని ఆ దారుణరూపములో 'బ్రవేశించుచున్నా' రని శ్రీ శంకరుడు అంతరార్థమును జెప్పగా, శ్రీ అరవిందుడు యథాతథముగానే అనువదించెను. 'వారిలో కొందరు భీతులై గొణుగుచున్నారు' - అను రెండవ పాదము శ్రీ అరవిందునే సమర్థించుచున్న ట్లున్నది.

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ,
గంధర్వ యక్షాసుర సిద్ధసంఘా
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే. 22

మఱియు రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినీ కుమారులు, వాయుదేవతలు, పితృదేవతలు, గంధర్వులు, యక్షులు, అసురులు, మఱియు సిద్ధులసంఘము లేవి గలవో, ఆ సంఘము లన్నియు నిన్ను దిగ్భ్రాంతి జెంది జూచుచున్నారు.

అవతారిక : దిగ్భ్రాంతికి గారణ మేమన -

రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదం,
బహూదరం బహుదంష్ట్రాకరాలం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాహం. 23

ఓ మహాబాహూ, విశ్వరూప కృష్ణా! అనేకానేక ముఖ్యములతోను, నేత్రములతోను, అనేకానేక బాహువులు, తొడలు మఱియు పాదములతోను అనేకానేక ఉదరములతోను, అనేకానేక దంష్ట్రల (కోఱల) తోను భీకరమైన నీ ఈ మహారూపమును వీక్షించి, ప్రాణిసమూహమును, నేనును భయముతో వడకిపోచున్నాము.

అవతారిక : అర్జునుడు తన అవస్థను విశేషించి విన్నవించుకొనుచున్నాడు -

నభః స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్త విశాలనేత్రం,
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమంచ విష్ణో. 24

అనేక వర్ణములతోను, తెఱచిన నోటితోను, ఉజ్జ్వలము విశాలము నగు నేత్రములతోను గూడి, ఆకాశము నంటుచు అగ్నివలె మండుచు దర్శన మిచ్చుచున్న నిన్ను జూచినంతనే నా అంతరాత్మ భయముతో కంపించుచున్నది, ఓ విష్ణుమూర్తీ! నాకు స్తిమితము లేదు, నాకు ఉపశాంతి లేదు

విశేషార్థము : అర్జును డింకను తాను దేనిని జూచుచున్నాడో, దానికి దూరముగనే యుండి, దానిని జూచుచున్నాడు. ఆ దూరమే అతని భయమునకు, కలతకు గారణము. అతడు భగవంతునితో యోగమునం దుండిన అట్లు కంపించడు, పైగా హర్షమును, అనురాగమును (11-36) బొందును. భగవంతునితో యోగము నందున్న మహర్షులట్లే హర్షించుచు, అనేకవిధముల ఆ దేవదేవుని స్తుతించుచున్నారు (11-21). ఏలన భగవదిచ్ఛయు, భగవదాశయమును వారికి దెలియును, భగవంతుని కూ్రరముగా గన్పించు క్రూరచర్యలోని అర్థము వారికి దెలియును, అనగా సంహారమును భగవంతుని చేతిలో దివ్యతర సృష్టికి ఒక సాధనమే యని వారికి దెలియును. దివ్యరూపమును జూచిన అర్జునుని భయమునకు, రాక్షసుల పలాయనమునకును, రెండవ వైపున సిద్ధసంఘముల సంతోషమునకును గల పై కారణమును శ్రీ అరవిందుని వ్యాఖ్యానమునందు మాత్రమే మనకు లభించును.

దంష్ట్రాకరాలాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని,
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస. 25

పెద్దపెద్ద కోఱలచే భయంకరములును, ప్రళయాగ్నివలె మండుచున్నవియు నగు నీ ముఖములను చూచినంత మాత్రమున నాకు దిక్కులు దెలియుట లేదు, సుఖము దూరమైపోయినది. కావున, సర్వేశ్వరా, జగన్నివాసా! ప్రసన్నుడవు గమ్ము !

అవతారిక : ఏ మహావీరులను అర్జునుడు యుద్ధమున చంపవలెనో, అతడు చంపక పూర్వమే వారు ——

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసంఘైః,
భీష్మో ద్రోణః సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః. 26

వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రాకరాలాని భయానకాని,
కేచిద్ విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః. 27

తమ పక్షమున పోరాడగోరి వచ్చిన రాజసమూహములతో బాటు ఆ ధృతరాష్ట్రపుత్రు లందరును, అటులే భీష్మ ద్రోణ కర్ణులును, ఇంకను మన పక్షమునం దున్న యోధ ముఖ్యు లందరును – వీ రందరును కోఱలతో వికటములు, భయంకరములు నగు నీ ముఖములలోనికి వేవేగముగా ప్రవేశించుచున్నారు. పోతే వారిలో కొందరు నీ కోఱలలో జిక్కుకొని, పొడుము పొడుము గావించబడిన తమ తలలతో గన్పించుచున్నారు.

విశేషార్థము : ఈ దర్శనమువలన, తాను గాక, నిజానికి భగవానుడే సంహారకర్త యని అర్జునునకు దెలిసిపోవును. ఇందునిమిత్తము గూడ విశ్వరూపము జూపబడెను.

అవతారిక : వా రందరు ఎట్లు ప్రవేశించుచున్నారు ? —

యథా నదీనాం బహవోఽంబువేగాః
సముద్రమే వాభిముఖా ద్రవంతి,
తథా తవామీ నరలోక వీరా
విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి. 28

అనేక నదులయొక్క అనేక జలప్రవాహములు ఒకే సముద్రము దిశగా నెట్లు పరుగులుపెట్టునో, అటులే నరలోకములోని ఈ వీరు లందరు నలువైపుల తీక్ష్ణముగా మండుచున్న నీ యొక్కని ముఖములలో (వివశముగా) ప్రవేశించుచున్నారు.

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశంతి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః. 29

మండుచున్న అగ్నియందు మిడత లెట్లు వేగముగా, మఱింత వేగముగా వచ్చిపడునో, సరిగా నటులే జను లందరు తమ నాశమునిమిత్తము ఇనుమడించుచున్న వేగముతో నీ నోళ్లలోనికి వచ్చి పడుచున్నారు.

విశేషార్థము : ఇనుమడించుచున్న వేగముతో: దీన భావ మేమన. ఏదియో యొక మహావేగము వారిని లాగివేయుచున్నది. నిరోధించదలంచినను, వారు దానిని నిరోధించలేరు. వా రిచ్చట వివశులు. అనగా, ఒకవేళ అర్జునుడు యుద్ధముచేయ నిరాకరించినను, ఈ యుద్ధ మాగదు. నాశము సంభవించితీరును (11-32) కనుక నాశమునకు వెఱచి, అతడు వెనుదీయగూడదు.

లేలిహ్యసే గ్రసమానః సమంతా
ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః,
తేజోభి రాపూర్య జగత్ సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో. 30

ఓ ఉగ్రస్వరూపా ! జ్వలించుచున్న నీ నోళ్ళతో సమస్త లోకములను సమస్త దిశలయందును మ్రింగివేయుచు చప్పరించుచున్నావు ! నీ ఉగ్రప్రభలు తమ తేజములతో సమస్త జగత్తును పూరించి, తీవ్రముగా తపింపజేయుచున్నవి.

అవతారిక : ఇంత మహోగ్రముగా గన్పించు నీ వెవ్వడవు ?

ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర ప్రసీద,
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిం. 31

ఉగ్రరూపము ధరించిన నీ వెవ్వడవో దయచేసి చెప్పుము. దేవదేవా ! నీ కిదే నమస్కారము. ప్రసన్నుడ వగుము నీ కర్మప్రవృత్తి నా కంతుబట్టుటలేదు. కావున, ప్రభో, ఆదినుండియు నున్న నిన్నెఱుంగగోరుచున్నాను.

విశేషార్థము : 'నీ ప్రవృత్తిని' = నీ చేష్టను (దెలియజాల కున్నాను)–అని శ్రీ శంకరుడు పోతే, 'నీ ప్రవృత్తిని' = నీ కర్మసంకల్పమును – అని శ్రీ అరవిందుడు. అర్జునుని భావ మేమన, నీవు లోకమునకు మాతాపితలవు. అయినపుడు నీ విటుల

క్రూరముగా నీ బిడ్డల నేల నాశము చేయుచున్నావో, నా కంతుబట్టకున్నది – అని అర్జునుడు మొఱబెట్టుకొనును.

శ్రీ భగవానువాచ –

కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 32

శ్రీ భగవానుడు పలికెను – ఇపుడు లోకములను పుట్టుపెట్టి, సంకల్పించి విజృంభించిన సంహారకారియగు కాలస్వరూపు డను నేను. అర్జునా! నీవు లేకపోయినను (నీవుయుద్ధముచేయకపోయినను), ప్రతిపక్ష సైన్యములందు నిలిచియున్న యోధు లెవ్వరును ప్రాణములతో బైటబడరు.

విశేషార్థము : అర్జునా! నే నేల సంహరించుచున్నానో, వినుము; సృష్టికర్త యగు బ్రహ్మదేవుని (11-15) నీవు నాలో జూచియున్నావు గదా; ఇట్లు నేను సర్వదా సృజించువాడను. మఱియు నేను విష్ణువుగా (11-24) జగత్తునకు ఆధారము నివాసము (11-25)-నని చూచుచున్నావు గదా; ఇట్లు నేను సర్వదా జగత్తును పాలించుచు, నిలబెట్టువాడను, ధర్మరక్షకుడను (11-18). ఇంకను, నీవు నన్ను సంహారకర్తగా జూచి వడకిపోవుచున్నావు గదా; ఇట్లు సర్వదా నాశము చేయువాడను. ఇక నీ మూడును నా రూపములే గాన, నా సంహారక్రియ కేవల సంహారమునకే గాదు, అది భవిష్యత్తరమగు నూతన సృష్టికిని, నూతన స్థితికిని-అని నీవు తెలియవలెను కనుక నీ వెఱుంగ గోరిన, నా సంహారము వెనుక నున్న సంకల్ప మిదియే-అని శ్రీ అరవిందుడు మాత్రమే వివరించెను. సృష్టి స్థితి సంహార-ముఖములను మూడింటిని జూపగోరియే, తదాశయముతోనే, భగవాను డర్జునునకు విశ్వరూపమును జూపెను-అనియు శ్రీ అరవిందుడు నిర్దేశించెను.

మన మీ లోకమున ఎదుర్కొను తుఫాను మఱియు ఉప్పెన, కారుచిచ్చు మఱియు వరదలు, భూకంపము మఱియు విధ్వంసము, విప్లవము మఱియు విక్షోభము కఱవు మఱియు కాటకము–ఇత్యాదు లన్నియు భగవంతుని యొక్క రౌద్రరూపము, కాళీముఖము. దుర్బలమగు మానవ హృదయము దీనిని జూడగోరక కండ్లుమూసి

కొనును; తాను ఆ ముఖము జూడని యెడల, పాపము ! అదియు తనను జూడ దని దాని ఆశ కాబోలు !

ఆపక్వ మతమును దుర్బలమానసముయొక్క ఈ భ్రమను బోషించును. అదియు కఠోరమగు సత్యపార్శ్వమును జూడనొల్లదు, భగవంతుడు ప్రియదర్శనుడు, ప్రేమమయుడు — అని మాత్రమేచెప్పును. పైగా ఈభ్రమలో పాల్గొనందుకు అది భారతీయమతమును నిందించును.

కాని భారతీయమతము వెనుక గంభీరము, విశాలము నగు సుదీర్ఘ విజ్ఞానము గలదు, అటులే ఆధ్యాత్మికానుభవముగలదు. అందుచేతనే అది భగవంతుని సమగ్ర (7-1) సత్యములో సుందరముతోబాటు రౌద్రమును గల దని చెప్పును మఱియు యుద్ధరూపమగు రుద్రుని ఋణము చెల్లించనిచో, పరమ సుందరమును బొందజాలమనియు, నిజానికి రౌద్రము సుందరముయొక్క బాహ్యముఖము మాత్రమే యనియు జెప్పును - అని శ్రీ అరవిందుడు ఘాటుగా పలుకును.

కురుక్షేత్రమును ధర్మక్షేత్రముగా నెందుకు వర్ణించెనో (1-1), భగవానుడర్జునుని ఘోరకర్మయందు ఎందుకు నియోగించుచున్నాడో (3-1), మన కిపుడు దెలియును — యుద్ధము ధర్మమునకు — నవ్యతర ధర్మమునకు దారిని నిష్కంటకము చేయును, కావుననే అర్జునుని భగవాను డా యుద్ధమునందు నియోగించుచున్నాడు, కావుననే ఇట్టి సందర్భమున కొన్ని మతములు, కొందరు వ్యక్తులు ప్రోత్సహించు 'హృదయదౌర్బల్యమును', 'ఆత్మనిర్వీర్యతను' (2-3) భగవానుడు తీవ్రముగా నిందించెను.

అవతారిక : నీవు లేకపోయినను వారు చచ్చియే తీరెదరు గాన —

తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం,
మయై వైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33

కావున నో అర్జునా ! నీవు లేచి యుద్ధము చేయుము, శత్రువులను జయించి కీర్తిని చూరగొనుము. మఱియు సుసంపన్న రాజ్యభోగము సనుభవింపుము. వీరందరి ప్రాణములను నేనే ఇంతకు బూర్వమే హరించివేసితిని, కాన అర్జునా, నీవు నిమిత్తమాత్రముగా నుండుము.

విశేషార్థము : 'నిమిత్తమాత్రముగా' (11-33) యుద్ధము చేయుము(11-34): ఇదియే భగవదుపదేశమునకు పరాకాష్ఠగా వెలువడిన భగవదాదేశము.

శ్రేష్ఠమానవుడు (3-21), దివ్యయోధుడు (8-7) ఏమి చేయవలెనో మన కిచట తెలియును: భగవంతుడే ఇచ్చించి, భగవంతుడే నడుపుచున్న ఒక మహా సంహారము సంప్రాప్తమైనపుడు దివ్యయోధుడు సంకోచించక, సర్వోత్సాహముతో భగవదిచ్ఛకు ఉపకరణముగా దానియందు తన పాత్రను నిర్వహించవలెను.

'భుంక్ష్వ' = భోగము ననుభవింపుము. ఇది దివ్యరాజ్యముయొక్క ఒక ప్రధాన లక్షణము. ఇచ్చట సంన్యాసచ్ఛాయ యేమియు లేదు, పైగా రాజభోగ మున్నది. అయితే ఇది అహంకారిక భోగము గాదు, అహంకారమును త్యజించి, భగవంతునితో యోగమునం దున్నపుడు అనుభవించు మహాభోగము — "తేన త్యక్తేన భుంజీథాః" (ఈ. ఉ.) ఈ యోగమున కర్మ ఎటుల బంధంచదో (4-14), అటులే భోగమును బంధించదు (6-31. 11-33)

అర్జునుడు యుద్ధమునకు వాస్తవ కారణము గాడు; వాస్తవ కారణము భగవదిచ్ఛ. పోతే, అర్జునుడు యుద్ధమునకు నిమిత్తకారణము, ఒక మానవసందర్భము మాత్రమే. ఎటుల గీతోపదేశము అతని నిమిత్తముగా మన కందరికి చేయబడెనో, అటులే అతనిని నిమిత్తము చేసికొని, అనగా అతనిని పురస్కరించుకొని, లోక సంగ్రహార్థము యుద్ధమును చేయబడెను కనుక, నిమిత్తము = సందర్భము. రెండవ అర్థము, నిమిత్తము = ఉపకరణము. ఈ రెండవ అర్థము మనకు స్పష్టమే. శ్రీ అరవిందు డీ రెండు అర్థములను జూపును.

ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్,
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్. 34

నాచేత చంపబడియే యున్న ద్రోణుడు, భీష్ముడు, జయద్రథుడు, కర్ణుడు మున్నగు వీరయోధుల నందరిని అర్జునా, నీ విపుడు చంపుము; లెమ్ము, యుద్ధము చేయుము, నీ శత్రువులను గెలిచెదవు.

విశేషార్థము : ఇట్లు 'గెలిచెదవు'—అని చెప్పి, మహత్తరము, భయంకరము నగు కార్యముయొక్క ఫలము ముందుగనే సూచించబడినది. ఇది అర్జునుడు

కామ్షించిన ఫలము గాదు. ఇది భగవదిచ్ఛ అతని కొసంగిన ఫలము, ఇది భగవత్కార్యమును నిర్వహించుటచేత స్వయముగా గలుగు మహాయశము.

ఒకొకప్పుడు ఈ భగవత్కార్య నిర్వహణయందు అపజయమును రావచ్చును. కాని అది అపజయవేషములో నున్న జయమే. ఏలన అట్టి అపజయము గూడ అంతిమజయమునకు ఒక సాధనమే. కనుక దివ్యయోధుడు విజయయశమును బొందును, లేదా అపజయవేషము ధరించిన విజయయశమును బొందును. భగవదిచ్ఛకు అపజయము లేనేలే దని తెలిసిన ఆ దివ్యయోధునికి రెండును యశమే యగును-అని శ్రీ అరవిందుడు. ఇది శ్రీ అరవిందుని వ్యాఖ్యానమే కాదు, వారి జీవనము గూడను. ఏలన, నా దివ్యజీవనకార్యమునందు అపజయము స్పష్టముగా నా కంటిముందు గన్పించుచున్నను, నే నా కార్యమును విడువను - అని ఒక తూరి శ్రీ అరవిందుడు తన కార్యసంకల్పమును వ్యక్తము చేసెను.

ఇట్టి అధ్యాయముయొక్క పూర్వార్థమున అర్జునుడు విశ్వరూపమును జూచి, భగవానుడు దాని సత్యమును ప్రయోజనమును వివరించగా, అత డామోదించెను. ఇపు డిక ఉత్తరార్థమునందు అర్జునుడు తన ఆమోదమును దెల్పును.

సంజయ ఉవాచ -

ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ,
నమస్కృత్వా భూయ ఏ వాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య. 35

సంజయుడు చెప్పెను—భగవానుని ఈ వాక్యములను విని, అర్జునుడు వడకుచు, చేతులు జోడించి ఆ దేవదేవునకు నమస్కరించి, భయపడుచు, వినమ్రుడై గద్గద స్వరముతో మరల శ్రీ కృష్ణునితో నిట్లు పలికెను.

అర్జున ఉవాచ -

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ ప్రహృష్య త్యనురజ్యతేచ,
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతిచ సిద్ధసంఘాః. 36

అర్జునుడు దెలిపెను — హే కృష్ణా! నీ మాహాత్మ్యము కీర్తించుచు (11-21) లోకము మిక్కిలి హర్షించుచున్నది, మఱియు ప్రీతిని బొందుచున్నది: ఇది యెంతయు ఉచితము. రాక్షసులు భయభీతులై దూర దూరముగా పాఱిపోవుచుండగా, సిద్ధ సమూహము లన్నియు నీకు (నిర్భయముగా, సంతోషముగా) నమస్కరించుచున్నవి: ఈ వ్యత్యాసము గూడ నెంతయు ఉచితము.

విశేషార్థము: భయంకర దర్శనముయొక్క ప్రభావ మింకను అర్జునునిపై గన్పించుచున్నను, అతని ఇప్పటి ప్రథమవచనములు సైతము ఆ భయంకర ముఖము వెనుక నున్న ఒక సముద్ధారక, సౌమ్యతర సత్యమును మనకు పరిచయపఱచును. అర్జునుని స్వరమునందే ఇది స్పష్టముగా వ్యక్తమగుచున్న — దని శ్రీ అరవిందుడు.

తప్పుచేసినపుడు, కండ్లు ఎఱ్ఱచేసిన తన తండ్రి ముఖమును జూచి, పిల్లవాడు పాఱిపోవును; కాని ఎక్కడికి పాఱిపోవును? అంతే ఈ రాక్షసుల విషయముగూడను. చూడుడు: (11-24) యొక్క విశేషార్థము.

అవతారిక: సిద్ధాదులు నమస్కరించుట ఏల నుచిత మనిన —

కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే,
అనంత దేవేశ జగన్నివాస
త్వ మక్షరం సదసత్ తత్పరం యత్. 37

మఱియు, మహాత్మా! వారు నీ కేల నమస్కరించకుందురు? నీవు ఆది స్రష్టవు, కర్తవు నగుటచేత, స్రష్టయగు బ్రహ్మదేవునికంటె నధికుడవు గదా! ఓ అనంతా, దేవేశా, జగన్నివాసా! నీవే అక్షరము, నీవే సత్తు, నీవే అసత్తు, నీవే సదసదతీతమగు పరమును.

విశేషార్థము: 'ఆది కర్త్రే': ఇచ్చట ఆదికర్త యన ఆదిస్రష్ట యని శ్రీ శంకరుడు చెప్పగా, ఆది స్రష్ట మఱియు ఆది కర్మకర్త యని శ్రీ అరవిందుడు చెప్పను.

భగవంతుడు పరమార్థతః సదసత్తులకు పైన నుండు అక్షరము. అనగా అక్షరతత్త్వము. పోతే పాత్రధారికి రాజవేషము ఏలాగున ఒక ఉపాధియో,

ఆ లాగుననే సదసత్తులు ఈ అక్షరమునకు ఉపాధులు. ఆ ఉపాధులను బట్టి అక్షరము సత్తనియు, అసత్తనియు చెప్పబడుచున్నది గాని, నిజానికి ఈ అక్షరము ఏదియుగాదు; అది నేతినేతి – గమ్యము – అని శ్రీ శంకరుడు.

అయితే శ్రీ అరవిందు డేమి చెప్పును ? – భగవంతుడు అక్షరమే గాని, అక్షరము మాత్రమే గాడు. అక్షరమునకు గూడ నతడు పరుడు. అటులే అతడు సత్తు మఱియు నసత్తు, అయినను అతడు సదసత్తులు మాత్రమే గాడు, వానికి పరుడు. అక్షరము మఱియు సదసత్తులు ఆ పరుని అభివ్యక్తులే గాన, అతడు వాస్తవముగానే అవి యన్నియు నగును.

పోతే, శ్రీ శంకరుడు అక్షరుని గుఱించి పైన చెప్పిన దంతయు ఒక విధముగా నిజమనుకొనవచ్చును గాని, తాను అక్షరమున కిచ్చిన ఈ అర్థమున, అక్షరమే భగవంతు – డని ఆయన చెప్పినది సరికాదు. 'అనంత, దేవేశ, జగన్నివాస'–అను విశేషణములును, తర్వాతి శ్లోకమును భగవంతుడు అక్షరము మాత్రమే గాడని మనకు దెలుపును.

త్వ మాదిదేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానం,
వేత్తాఽసి వేద్యంచ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనంతరూప. 38

దేవా! నీవు మూలభూత మఱియు ప్రథమ దేవుడవు, నీవు పురాణపురుషుడవు, నీవు సమస్తమునకు పరమ విశ్రాంతిస్థానమవు. మఱియు తెలిసికొనువాడవును నీవే, తెలియబడునదియు నీవే, సర్వోన్నత స్థితియు నీవే. ఓ అనంతరూపా ! ఈ అనంత విశ్వము నీ చేతనే విస్తారితమై యున్నది.

విశేషార్థము : 'త్వయా తతం' = (విశ్వము) నీ చేత వ్యాప్తమైనది – అని శ్రీ శంకరుడు. 'త్వయాతతం' = నీ చేత విస్తారితమైనది – అని శ్రీ అరవిందుడు. 'వేద్యం' గూడ నీవే – యని చెప్పబడినది గాన, శ్రీ అరవిందుని అర్థమే సరియైనదని అనుకొనవలెను.

వాయు ర్యమోఽగ్ని ర్వరుణః శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ,
నమో నమ స్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమోనమ స్తే. 39

వాయుదేవుడు, యముడు, అగ్నిదేవుడు, వరుణుడు, చంద్రుడు, ప్రజలకు పితయగు ప్రజాపతి, ఆ ప్రజాపతికి ప్రజాపతి - అందరును, ఓ దేవా, నీవే. నీకు నమస్కారము, వేలకువేల నమస్కారములు, తిరిగి నీకు నమస్కారము, మఱల నీకు నమస్కారము

విశేషార్థము : భగవంతుని మహత్త్వమును గనిన అర్జునునకు అప్రయత్నముగా హృదయమునుంచి నమస్కారములు అనంతముగా పొంగుచున్నవి: ఆ మహత్త్వము మనకు తెలియకపోవుటచేతనే మన మట్లు చేయుట లేదు.

అవతారిక : అటులే ___

నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ,
అనంతవీ ర్యామితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః. 40

దేవా ! నీకు ముందునుంచి నమస్కారము, అటులే వెనుకనుంచి నమస్కారము, ఇంకను అన్ని వైపులనుండియు నమస్కారము. ఏలన నీవే ప్రతివస్తువు, నీవే సర్వవస్తువు. నీ సామర్థ్య మనంతము, నీ పరాక్రమ మమితము. నీవు సర్వమును వ్యాపించియున్నావు గాన, నీవే సర్వము.

విశేషార్థము : నీవు, దేవా, నీ ఏకాత్మచేత సర్వమును వ్యాపించియున్నావు గనుక, నీవు సర్వము - అని శ్రీ శంకరుడు. పోతే శ్రీ అరవిందుడు అచ్చటచ్చట చెప్పినదాని వలన మనకు తెలియున దేమన, భగవంతుడు అక్షరాత్మ ద్వారా నిర్వ్యక్తికముగా నంతను వ్యాపించుటయే కాక, క్షరపురుషరూపమున సైతము సవ్యక్తికముగా నంతను వ్యాపించి యున్నాడు, ఇట్లు వ్యాపించి, సర్వమును అనుగమించుచు, సర్వముతో మాఱుచు, సర్వమును తన ఇచ్ఛతో నడుపుచున్నాడు. అట్లు

చేయనిచో, సర్వము తన పరిణామమునందు కొనసాగజాలదు. అయితే ఈ క్షరపురుషుడు పరమపురుషునితో ఏకముగా నుండునుగాన, ఇతడు మాఱుచునే మాఱనివాడు (4-13). మఱియు పరప్రకృతియే ఈ క్షరపురుష డయినదిగాన, భగవంతుడు ఆత్మచేతనేకాక, తన పరప్రకృతిచేతను సర్వమును వ్యాపించియున్నాడు (మఱియు నీ పరప్రకృతి యొక్క ఉత్పత్తియే సర్వము) కావున భగవంతుడు సర్వము. 'అనంత సామర్థ్యము'- అను పదమును శక్తిద్వారా - పరప్రకృతిద్వారా - ఈ వ్యాప్తినే సూచించును.

అవతారిక : ఈ పరమ సత్యము ఇతఃపూర్వము తెలియదు గాన-

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ హే యాదవ హేసఖేతి,
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ ప్రణయేన వాపి. 41

యచ్చావహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు,
ఏకోఽథవాఽప్యచ్యుత తత్సమక్షం
తత్ క్షామయే త్వా మహ మప్రమేయం. 42

హే మహానుభావ! నీ ఈ మహిమ తెలియనందున, నీ వొక సఖుడ వను కొని, పొరపాటుచేత గాని, చనవుచేత గాని, ఓ కృష్ణా, ఓ యాదవా! ఓ సఖా - యని నే నెంతో అమర్యాదగా పలికితిని. మఱియు పరిహాసముకొఱకు - విహారము చేయునపుడును, పరుండి లేక కూర్చుండి యున్నపుడును, భోజనము చేయునపుడును ఏకాంతమున లేక నలుగురిలో, ఓ అచ్యుతా! అప్రమేయ మహత్త్వముతో నొప్పారు నీకు అపచారము గావించితిని. దాని నంతను, ఓ దయామయా, క్షమింపవేడు చున్నాను.

విశేషార్థము : ఇచ్చట శ్రీ అరవిందుడు తన ప్రకాశమయ పరిశీలనానుభవ ములను విపులముగా వెల్లడించును; అట్లు చేసినవా డాయన ఒక్కడే. వాని నిప్పుడు మాత్రప్రాయముగా చూతము.

విశ్వరూప ప్రసంగమునందు మన హృదయముపై నొకదాని ఫలితముగా నొకటి చొప్పున మూడు సూచనలు హత్తుకొనును.

ఒకటి—అర్జునుడు తన మానవసఖుడగు శ్రీకృష్ణుని మానవదేహమున తాను ఊహించను గూడ ఊహించని మహావిశ్వమును జూచెను మఱియు విశ్వాతీతమును జూచెను. ఈ విశ్వపురుషుడు ఒక వస్తువుకంటె నెంత గొప్పవాడైనను అతనికి ప్రతివస్తువు ఒక గృహము. ఏలన అతడు అనంతుడే కాక, సముడును; అందుచేత అతడు సమష్టియందును, వ్యష్టియందును సమముగా గలడు. ఇట్లు, అర్జునుడు చూడక ముందు సైతము శ్రీకృష్ణుని దేహమందు విశ్వమంతయు నెట్లు సదా గుప్తముగా నుండియే యుండెనో, అటులే మనలో ప్రతివానియందును ఆ విశ్వరూపము గుప్తముగా నున్నదని మనకు సూచనగా దెలియును. ఇదియే ప్రథమ సూచన.

లోపల దాగియున్న ఈ దివ్యతయే మానవునికిని, మానవజాతికిని, సమస్త సృష్టికిని ఒక మహనీయార్థము నిచ్చుచున్నది, ఒక పరమ భవితవ్యమును జూపుచున్నది. ఇట్లు విశ్వరూపదర్శనము విశ్వమునకు గల అంతర్యమును, అర్థమును, భవితవ్యమును మనకు వ్యక్తము చేయుచున్నది. ఏ భౌతికవాదము దీనిని పసికట్టజాలదు, పైగా అంగీకరించనుగూడ అంగీకరించదు.

పోతే, రెండవ సూచన — శ్రీకృష్ణుని మానవదేహమున అర్జునుడు విశ్వరూపమును జూచెను. కనుక మానవదేహమునకును, లోపలిదివ్యతకును సంబంధముండవలెను: ఇదియే రెండవ సూచన. ఈ సూచన సత్యము గూడను ఏలన ఇట్టి సంబంధమే లేనిచో, అవర ప్రకృతియందు మునిగియున్న అంతరాత్మకును, విశ్వరూపముయొక్క మహాతేజమునకును మధ్యగల అఖాతము దాటరానిది యగును; పరిమిత, ప్రాకృత, వైయక్తిక మానవునకా తేజము భరింపరానిది యగును అటులే మనలోపల నున్న భగవంతుడును మన అంతరాత్మయందు నివసించుచు, మన మానవ మనస్సును, మన మానవ రూపమును లాగుకొని, వానిని ఒక పరిధానము (వస్త్రము)గా ధరించును. అట్లు కానిచో, లోని భగవంతుని మనము చేరుకొనజాలము, చూడను గూడలేము.

ఇక, మూడవ సూచన - అర్జునుడు విశ్వరూపము నైతే చూచెను గాని, అతడు భయముతో గడగడ వడకిపోయెను. విముక్త మానవుని బలవీర్యములు మాత్రమే దాని ప్రభావప్రాభవములను తట్టుకొని, లాభము పొందగలవు గాని, సామాన్య మానవున కది దుర్భరము, భయావహము, నిరుపయుక్తము.

కనుక సామాన్య మానవుడు అదే సత్యమును ఆ భీకరరూపముద్వారా కాక, మఱియొక రూపముద్వారా గ్రహించవలెను. పోతే, సామాన్య మానవరూపము-కృష్ణుని సామాన్య మానవరూపము-ఇందులకు ఉపయుక్తముగాదు. దానివలనఅర్జునుడు కేవలము చూడగలిగెనే కాని, లాభము బొందలేకపోయెను. కాగా ఆ "మఱియొక రూప" మేది యన నారాయణరూపము, దివ్య నారాయణుని ప్రసన్న, మధ్యవర్తి రూపము. ఈ నారాయణుడు మానవునికి మిక్కిలి సన్నిహితముగాను, మానవుని లోను ఉండును; ఇతడే మానవులకు తమ ప్రగతియాత్ర యందు యుద్ధసారథిగ, మరియు ప్రయాణసారథి. ఇతడు సహస్రబాహు విశ్వరూపుడు గాడు, ఇతడు చతుర్బాహువగు నరుని సఖుడు, నారాయణుడు. ఇతని నాలుగు చేతులు ఉపకార మఱియు ఉద్ధరణపరములు. ఇతడు భగవంతునియొక్క మానవరూప సంకేతము ఈ రూపము మనకు భయమును గాక, ధైర్యము నిచ్చు సత్యమునకు సంకేతము. కావున ఈ నారాయణ చతుర్బాహు, ప్రసన్నరూపము సువిశాల ఆధ్యాత్మికానందమును సన్నిహితము మఱియు సజీవము, దర్శనయోగ్యము మఱియు అనుభవయోగ్యము గావించును.

ఇట్లీ 46-వ శ్లోకమున ప్రస్తావించబడిన చతుర్భుజరూపము నరనారాయణులోని నారాయణరూప మని చెప్పి, అపూర్వముగను, అద్భుతముగను వ్యాఖ్యానించిన వారు శ్రీ అరవిందు లొక్కరే.

"తేనైవ రూపేణ చతుర్భుజేన" (11-46) – ఆ చతుర్భుజరూపమున, అని ఆ చతుర్భుజరూపము తనకు పరిచిత మైనదే అయినట్లు అర్జునుడు పలుకును కాని, మానవ కృష్ణునికి రెండు భుజములే యుండి నప్పుడు, ఆ చతుర్భుజరూప మెట్లు అర్జునునకు పరిచితము? ఎట్లన, నరనారాయణులలో అర్జునుడు నరుడు గనుక, ఆ నారాయణ చతుర్భుజ రూపము అతనికి పూర్వపరిచితమే యని మన మనుకొనవలెను.

పోతే, 'చతుర్భుజు డగు వసుదేవపుత్ర రూపమున' – అని మాత్రము శ్రీ శంకరుడు చెప్పి విడిచిపేయును. కాని వసుదేవపుత్రు డగు కృష్ణునికి రెండు చేతులే గాన, ఈ వ్యాఖ్యానము ఎట్లు సరియైన దగును?

ఇక శ్రీ రామానుజుడు-శ్రీ కృష్ణునకు సహజముగా నాలుగు భుజము లుండెను. కాగా కంసునికి వెఱచిన వసుదేవుని ప్రార్థనచే, కంససంహారము వఱకు శ్రీ కృష్ణుడు తన రెండు భుజములను ఉపసంహరించి, తర్వాత మఱల చతుర్భుజు డయ్యెను – అని

శ్రీ రామానుజుడు చెప్పెను. ఇది వినుటకు చమత్కారముగానే యున్నది గాని, భాగవతమునం దెచ్చట గన్పించదు. పైగా నాలుగు భుజములు గల కృష్ణుడు లీలామానుష విగ్రహుం డెట్లగును ?

చివరకు, విశ్వరూపమున అర్జునుడు కృష్ణుని విష్ణువుగా జూచెనుగదా, కావున ఆ విష్ణుదేవుని, మఱియొక రూపము చూపింప యాచించెను - అని మఱియొక రూపమును చూచుట అర్జునునకు సమ్మతముగనే యున్నను, విశ్వరూపమును దర్శించినంతమాత్రమున కృష్ణుని (విష్ణుని) చతుర్భుజరూపము అర్జునునకు పరిచిత రూపమెట్లగును ? కనుక శ్రీ అరవిందుని వ్యాఖ్యయే సర్వాధికముగా సత్యము నావిష్కరించుచున్న దనిపించును.

అవతారిక : నీవు పితవు గనుక -

పితాఽసి లోకస్య చరాచరస్య
త్వ మస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్,
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ. 43

ఈ చరాచర లోకమున కంతటికిని, దేవా, నీవు తండ్రివి మఱియు సర్వాధికు డగు గురుడవు, కావుననే పరమ పూజ్యుడవు. నీకు సముడే లేడు నవు డిక అధికు డెట్లుండును ? ఈ లోకత్రయమునందు నీ ప్రభావమునకు సాటియే లేదు ।

తస్మా త్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యం,
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుం. 44

కావున నో పితః । నీకు సాష్టాంగ నమస్కారము సేయుచు, ఈశ్వరుడవు, స్తుతిపాత్రుడవు నగు నిన్ను ప్రసన్నుడవు కమ్మ-అని వేడుకొనుచున్నాను. పుత్రునియొక్క అపరాధమును పితవలెను, ఒక సఖునియొక్క అపరాధమును అతని సఖునివలెను, ప్రియురాలియొక్క అపరాధమును ప్రియునివలెను, నా అపరాధముల నన్నింటిని నీవు మన్నించి క్షమించవలెను.

విశేషార్థము : ఈ ప్రార్థనవలన భగవంతునికి, మానవునికి మధ్య గల సంబంధములలో సఖ్య మొకటి యని తెలియును. విశ్వరూపదర్శనమునుండి లభించిన ఒక సూచనగా, శ్రీకృష్ణుని మానవదేహమునకును, ఆ దేహములోని దివ్యాత్మకును సంబంధ మండవలె నని మనము చూచితిమి (11-42) కనుక ఆ దేహముతో అర్జునునకు గల సఖ్యసంబంధము ఆ దేహములోని దివ్యకృష్ణునితో గూడ గలదు. అందుచేత దివ్యకృష్ణుని సైతము సఖా!- అని సంబోధించుట, అర్జును డపుడు దలంచి నట్లు, నిజానికి నేరము కాదు. అయితే మానవమాత్రు డనియే "అజానతా" (11-41) – అర్జును డట్లు సంబోధించెను గాన, అది అతనికి అపరాధ ముగా దోచెను.

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేనచ ప్రవ్యథితం మనో మే,
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస. 45

మున్నెన్నడు చూడబడని తేజోమయరూపమును జూచి, హర్షము నందితిని, కాని, నా మనస్సు భయముచే పీడింపబడుచున్నది. కాన, నో దేవదేవా, ఆ పూర్వ (సౌమ్య) రూపమునే తిరిగి చూపుము. దేవాధిప! జగన్నివాస! ప్రసన్నుడవుకమ్ము.

విశేషార్థము : ఒకే వ్యక్తికి ఒకే దర్శనముచేత హర్షము, భయము – రెండును ఎట్లు కలుగును ? ఎట్లన, అర్జునుడు గాని, మనము గాని నిజముగా ఒకే వ్యక్తిమి గాము. ప్రతివానియందును అనేక పురుషులు గలరు. ప్రస్తుత విషయ మున, అర్జునుని అంతరాత్మపురుషునికి హర్షమును, ఆతని మనోమయపురుషునికి భయమును గలిగినవి. అంతరాత్మజ్ఞాన మావిర్భవించి, ఈ పురుషు లందరు అంతరాత్మతో ఏకమై యున్నపు డిక ఇట్టి భయము కలుగదు.

అవతారిక : ఆ పూర్వరూప మెట్టి దన –

కిరీటినం గదినం చక్రహస్తం
ఇచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ,
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే. 46

పూర్వము వలెనే కిరీటము, గదా చక్రములు ధరించియున్న నిన్ను దర్శింప గోరుచున్నాను. కావున నో సహస్రబాహూ! విశ్వరూపా! (నీ సహస్రబాహు రూపము నుపసంహరించి) ఆ చతుర్బాహు రూపముతోనే తిరిగి దర్శనమిమ్ము.

విశేషార్థము : చతుర్భుజరూప మేదియో, (11-42) క్రింద చూడదగును.

అవతారిక : భక్తుని ఈ ప్రార్థనను మన్నించుచు —

శ్రీ భగవా నువాచ -

మయా ప్రసన్నేన త వార్జు నేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్,
తేజోమయం విశ్వ మనంత మాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వం. 47

అర్జునా! నేను నీ యెడ ప్రసన్నుడ నగుటచేత (11-8) నా యీ పరమ ఆత్మరూపమును ఆత్మయోగముచేత నీకు జూపితిని. ఈ పరమరూపము తేజోమయ-శక్తి రూపము ; ఇది జగదాత్మకము ; ఇది అనంతము ; ఇది సర్వప్రథమరూపము ; నీ చే గాక, మఱి ఎవ్వరిచేతను ఈరూప మింతకు ముందు చూపబడి యుండలేదు ;

విశేషార్థము : ఇది ఆత్మరూపము, అనగా దిక్కాలములందు పరమాత్మ స్వయముగా ధరించిన రూపము. ఈ ఆత్మరూపము, అర్జునా! ఆత్మసామర్థ్యము చేతనే చూపించబడగలదు. కావున నట్లే నా ఆత్మయోగముచేత దీనిని నీకు జూపితిని — అని శ్రీ అరవిందుడు. పోతే శంకరునికి ఆత్మ ప్రపంచముగా మాఱి, ఒక రూపము ధరించుట యనునది లేనేలేదు.

ఈ తేజోమయరూపమునకు అగణ్య ఆంతర్యము (అంతరార్థము) గలదు గావున, దానిని ఉపసంహరించక పూర్వము, దానిని మఱియొకసారి భగవానుడు స్వయముగా ప్రస్తుతించెను — (11-47) అని శ్రీ అరవిందుడు.

అవతారిక : ఈ రూపమును జూచుటకు సామాన్య సాధనలు చాలవు —

న వేదయజ్ఞాధ్యయనై ర్న దానై ర్
న చ క్రియాభి ర్న తపోభి రుగ్రైః,
ఏవంరూపః శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర. 48

(మదనుగ్రహముచేత), అర్జునా, ఇట్టి విశ్వరూపుడనగు ఏ నన్ను నీ విపుడు చూచి యున్నావో, ఆ నన్ను వేదాధ్యయనము మఱియు యజ్ఞాధ్యయనముల చేత గాని, దానములచేత గాని, అగ్నిహోత్రాది క్రియలచేత గాని, ఘోరమగు తపస్సుల చేత గాని ఈ నరలోకమున జూచుట ఇతరు లెవ్వరికిని సాధ్యము గాదు.

విశేషార్థము : ఈ సాధనలచేత సాధ్యము కాకపోవుటయు వ్యతిరేక విధానమున (in a negative way) ఈ విశ్వరూపముయొక్క అగణ్య మహత్వమునే చాటును. ఈ విశ్వరూపదర్శనానికి అర్హమగు సాధన చివరి రెండు శ్లోకములలోను చెప్పబడును (11-54, 55).

అవతారిక : భగవంతుడు భక్తుని భయము నెట్లు పాపునో కననగును —

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృ ఙ్మమేదం,
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య. 49

ఘోరమగు నా ఇట్టి రూపమును జూచుటవలన నిన్ను ఆవహించిన సంక్షోభము గాని, సంమోహముగాని ఇక నీకు, అర్జునా, లేకపోవుగాక : ఇపుడు భయరహితుడవై, సంప్రీతమనస్కుడవై ఆ యీ నా పూర్వరూపమును తిరిగి తిలకించుము.

సంజయ ఉవాచ —

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః,
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పునః సౌమ్యవపు ర్మహాత్మా. 50

సంజయుడు చెప్పెను — వాసుదేవు డిట్లు అర్జునునితో జెప్పి, తన స్వీయ రూపము నతనికి తిరిగి చూపెను, మఱియు నిట్లు ఆ మహాత్ముడు తిరిగి సౌమ్యరూపుడై భయముతో కలతనందియున్న అర్జునుని ఊరడించెను.

విశేషార్థము : 'స్వకం రూపం' — వసుదేవుని గృహమునందు జనించిన రూప — మని శ్రీ శంకరులు. శ్లోకముయొక్క ప్రథమ చరణములో వాసుదేవు డను

పదము గలదు. ఆ వాసుదేవుడు తన స్వీయరూపమును జూపెను. కనుక వసుదేవుని పుత్రుడు వాసుదేవుడు — అని మనము అర్థము చెప్పుకొన్నచో, శ్రీ శంకరుని అర్థము సరియైనదే అగును. (11-46) నందును ఈయన ఇట్లే చెప్పెను.

పోతే, "వాసుదేవః సర్వం" (7-19)—అను మఱియొక వాసుదేవు డున్నాడు. ఇతడు వసుదేవ పుత్రుడు గాడు, ఇతడు సర్వము తానే యైనవాడు. "మహాత్మా వాసుదేవః" (11-50) — అని యున్నది గాన, ఈ శ్లోకము నందలి వాసుదేవుడు మహాత్ముడు, అతడు వసుదేవ పుత్రుడు గాడని మనకు తెలియును. పోతే ఈ వాసుదేవునియొక్క స్వీయరూపము — 'స్వకం రూపం' — చతుర్భుజ నారాయణ రూపము — అని మనము స్వీకరించవచ్చును. కనుకనే 'స్వకం రూపం' — నారాయణ రూపము — అని శ్రీ అరవిందుడు.

శ్రీ కృష్ణుడు తన మానవరూపమునందు నిత్యము నాలుగు చేతులను గలిగి, యుండినచో, శ్రీ శంకరుని అర్థమును మనము స్వీకరించవచ్చును. కాని అట్లు కలిగి యున్నట్లు మన కాధారము కానరాదు. (11-42) విశేషార్థమును గూడ జూడదగును.

అర్జున ఉవాచ —

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన,
ఇదానీ మస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః. 51

అర్జునుడు పలికెను — ఓ జనార్దనా, కృష్ణా! సౌమ్యమగు (ప్రసన్నమగు) నీ ఈ మానుషరూపమును జూచి, నా తెలివి తిరిగి వచ్చినది, నేను స్వస్థుడ నైతిని.

విశేషార్థము : ధ్యానమునందు మనకు ఒక విశిష్ట అనుభూతి కలుగును, దానివలన ఆనందము కూడ జనించును. కాని అదే సమయమున అది ఆగిపోయి, ధ్యానమునుండి బైటబడిన బాగుండును — అని బాధ నొందుచు నసుకొను మఱియొక భాగము కూడ మనలో నుండును. ఇదిగో, మన ఇట్టి అనుభవమువలన అర్జునుని అవస్థను సూత్రప్రాయముగా మన మర్థము చేసికొనగలము. దీనివలన మనకు తేలిన దేమన, భగవంతుని అడుగుటకు ముందు, దానిని స్వీకరించుటకు తగినఅర్హతను సంపాదించవలెను.

తర్వాత, ఈ శ్లోకమున 'మానుషం రూపం' — అని ఉన్నది గదా. కను పై శ్లోకమున శంకరుడు చెప్పినదే సరియైన అర్థ మగునా ? చెప్పజాలము. ఏలన

చతుర్భుజ నారాయణ రూపమును మానుషాకారములోనే యుండును. ఈ మధ్యవర్తి (mediating) రూపము "భగవంతునియొక్క మానుషీకృత సంకేతము" - అని శ్రీ అరవిందుడు. ఇట్లు భగవంతునికి మూడు రూపములు గలవు - 1. ద్విబాహు మానుషరూపము, 2. చతుర్బాహు మానుషరూపము, 3. సహస్రబాహు విశ్వరూపము (11-46)

శ్రీ భగవానువాచ -

సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః. 52

శ్రీ భగవానుడు వక్కాణించెను - అర్జునా ! నీ విపుడు చూచియున్న నా పరమ రూపము చూచుట కత్యంత కష్టమైనది. (అత్యున్నత వ్యక్తులు మాత్రమే దీనిని చూడగలరు). దేవతలు స్వయముగా దానిని దర్శింప నిత్యము కాంక్షింతురు.

విశేషార్థము : 'దేవా అపి'=దేవతలు గూడ – అని శ్రీ శంకరుడు. దీని భావ మేమన, దేవతలకు గూడ నిది చూడ శక్యము గానిది. పోతే,'దేవా అపి' = దేవతలు స్వయముగా - అని శ్రీ అరవిందుడు. దీని భావ మేమన, ఈ రూపము అత్యున్నత విరళ వ్యక్తులకు మాత్రమే చూడ శక్యము. కావున అట్టి దేవతలు దీనిని నిత్యము జూడ కాంక్షింతురు.

అవతారిక : చూచుట కేల కష్ట మనిన –

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. 53

అర్జునా ! నీవు న న్నిపుడు ఎవ్విధముగా జూచియున్నావో, అటువంటి నేను వేదాధ్యయనముచేత గాని, తపశ్చరణముచేత గాని, దాన క్రియచేత గాని, యజ్ఞానుష్ఠానముచేత గాని చూడ శక్యము గాని వాడను.

విశేషార్థము : ఎందుచేత ఈ రూపమును జూచుట ఇంత కష్టము ? దీని విశిష్టత దేనిలో నున్నది? ఆధ్యాత్మిక సాధనయొక్క అంతరతమ తపస్యకు(11-53) గూడ నది ఎందుకు అందుటలేదు ? వినుము ; వేదాది సాధనలచేత భగవంతుని ఈయా ప్రత్యేక (exclusive) పార్శ్వములనే మానవుడు తెలిసికొనగలడు, అనగా

భగవంతుని వ్యక్తిగత పార్శ్వమును గాని, విశ్వగత పార్శ్వమునుగాని, విశ్వముతో సంబంధము లేని ఇతర పార్శ్వములనుగాని - ఒక్కొక్క దానిని మాత్రమే తెలిసికొనగలడు కాని మన ప్రస్తుత విశ్వరూపమునందు భగవంతుని అతీత, విశ్వగత, వ్యక్తిగత పార్శ్వములు మూడును, మఱియు పురుషప్రకృతులు, అనంత-సాంతములు, దేశ, కాల, కాలరాహిత్యములు, అటులే సత్తాసంభూతులు – ఇంతెందుకు? భగవంతుని గుఱించి మనము తెలిసికొన ప్రయాసపడు సమస్తము (11-7) ఈ విశ్వరూపమున నొక అవర్ణనీయ ఏకతయందు అద్భుతముగా నావిష్కరింపబడినది! ఇది ఈ విశ్వరూపముయొక్క విశిష్టత మఱియు నద్వితీయత.

అవతారిక : అయితే ఈ అద్వితీయరూపము నెట్లు చూడవచ్చును ?-

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన, ప్రవేష్టుంచ పరంతప. 54

(ఇతర పాక్షిక సాధనలచే గాక) అనన్య భక్తిచేత మాత్రమే, అర్జునా! ఇట్టి నన్ను దెలిసికొనుటకును, తత్త్వతః దర్శించుటకును, ఇట్టి నాలో ప్రవేశించుటకును సాధ్యమగును.

విశేషార్థము : 'అనన్య భక్తి = భగవంతునికంటె అన్యముగా నుండని భక్తి, ఏ భక్తిచేత ఇంద్రియము లన్నింటికి వాసుదేవునికంటె అన్యముగా నేదియు ఉపలబ్ధము కాదో (7-19), ఆ భక్తి - అని శ్రీ శంకరుడు. ఇది సమగ్రమైన భక్తి నిర్వచనము. ఇచ్చట శ్రీ శంకరుడు శ్రీ అరవిందునికి మిక్కిలి సమీపముగా వచ్చినాడు. కాని ఆయన ఈ భక్తినిర్వచనమును దాని పరమగమ్యమునకు గొనిపోలేదు. ఎట్లన, "నాలో ప్రవేశించుటకును' = మోక్షము పొందుటకు- అని తన పాత పద్ధతిలోనే అర్థము చెప్పెను.

కాని భక్తిఫలితము ఇట్టి నిష్క్రియ మోక్షమే కాదు మఱి యేమన, ఈ భక్తి ఒక పరమ ప్రేమ, ఒక ఘనిష్ఠ ఏకత; కర్మజ్ఞానములు తమ పరిపాకమునందు ఈ భక్తిలోని కెగసి ఏకమగును; ఈ భక్తి వాని పూర్ణతపై విలసిల్లు దివ్యకిరీటము అని శ్రీ అరవిందుడు. అనగా నీ భక్తి ఒక ప్రత్యేక సాధన గాదు: అది యొక పరమ ఏకీకర చేతన. దీనిద్వారా భక్తుడు పరాత్పరుని వైభవములో ప్రవేశించి, అట నుండి అక్షరాత్మ మఱియు క్షరప్రపంచము నంతటిని తనలో నిముడ్చుకొనవచ్చును; వేయిమాటలలో, ప్రపంచములో చిక్కుపడక, ప్రపంచమునకు పై నుండు

చునే, ప్రపంచముతో నేకముగానుండి, ప్రపంచము నాలింగనము గావించుకొన వచ్చును (6-31). ఇట్లు 'నాలో ప్రవేశించుట' యన నిష్క్రియ మోక్షము గాదు, అది మాత్రమే కాదు; 'నాలో ప్రవేశించుట' యన అన్ని స్తరములలోను భగవంతునితో నేక మగుట యగును, ముక్తి ననుభవించుచు, ప్రపంచమున విముక్త, విశాల జీవనమును గడుపుట యగును, దివ్యకర్మలు చేయుట యగును.

'తత్త్వేన జ్ఞాతుం' = తత్త్వతః, సమస్త తత్త్వములందు భగవంతుని తెలిసికొనుటకును; 'తత్త్వేన ద్రష్టుం' = సమస్త తత్త్వములందు భగవంతుని దర్శించుటకును; తెలిసికొని మఱియు దర్శించి, 'తత్త్వేన ప్రవేష్టుంచ' = సమస్త తత్త్వములందు భగవంతునిలో ప్రవేశించుటకును (భక్తుడు సమర్థు డగును. ఇట్లు 'తత్త్వేన' - అను పదము భగవంతునితో భగవంతుని సమస్త తత్త్వములందును - సక్రియ, నిష్క్రియ సమస్త తత్త్వములందును - ఏకీభావమును దెలుపును. కనుక ఈ భక్తిగమ్యము నిష్క్రియ మోక్షము మాత్రమే గాదు.

అవతారిక : మనఃశరీరములలో బద్ధుడైన మానవునికి సమగ్రభగవంతుని బొందుట మిక్కిలి కష్టమే కాని —

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సంగవర్జితః,
నిర్వైరః సర్వభూతేషు యః స మామేతి పాండవ. 55

అర్జునా ! నా కర్మలను జేయుము; నన్నే పరమపురుషునిగను, పరమగమ్యముగను స్వీకరింపుము; నా భక్తుడ వగుము; సంగము లేక యుండుము; అటులే సర్వ భూతములందును వైరము లేక యుండుము. ఏలన అట్టి మానవుడు నన్ను జేరును.

విశేషార్థము : ఇదిగో, ఇదియే భగవంతుని సమగ్రముగా(7-1)బొందుటకు చూపబడిన సమగ్ర మార్గము.

ఈ శ్లోకమునందు గీతార్థ మంతయు సారభూతముగా నున్న-దని శ్రీశంకరుడును జెప్పును. కాని దీని ఫలము 'నిః శ్రేయసము'(మోక్షము)-అని ఆయన ముగించును. పోతే, శ్రీ అరవిందుడును దీనియందు గీతాయోగముయొక్క సార మంతయు నున్నదని చెప్పును గాని, ఆ సారము నిట్లు వివరించును —

నిమ్న ప్రకృతిపై ఆధిక్యము-"సంగవర్జితః"-సర్వభూతములతో అయిక్యము-"నిర్వైరః సర్వభూతేషు"-, విశ్వరూప భగవంతునితోను, విశ్వాతీతపురుషునితోను ఏకత్వము-"మత్పరమః"-విశ్వాతీతుడగు ఏకునియందును, అన్నింటియందును గల

భగవంతుని యందును అఖండ ప్రేమ-"మద్భక్తః"-, కర్మలయందు భగవదిచ్ఛతో తన ఇచ్ఛయొక్క ఏకత్వము- "మత్కర్మకృత్" ఇదిగో, ఇట్టి సమగ్రమార్గమే విశ్వరూపమున సూచించబడిన (11-53) సమగ్రసిద్ధికి సమర్థవిధానము, దీనివల్లనే పరిపూర్ణ, ఆధ్యాత్మిక స్వాతిక్రమణమును(స్వ+అతిక్రమణము=(self-exceeding) ఊహించరాని పరివర్తనమును సిద్ధించును. నిఃశ్రేయసముగాక, ఇదియే గీతాయోగము యొక్క గమ్య మని శ్రీ అరవిందుడు.

యోగ మన భగవంతునితో యోగము. ఇట్టి యోగమునందు నిఃశ్రేయసమే కాక, పైసర్వము సిద్ధించును. ఉదాహరణకు, ఈ యోగముయొక్క ఒక అంశమును జూతము మత్కర్మకృత్=భగవంతునితో యోగమునం దుండి, భగవదిచ్ఛను తన ఇచ్ఛగా జేసికొని భగవంతుని కర్మనే చేయువాడు - అని శ్రీ అరవిందుడు. పోతే, మత్కర్మకృత్ = భగవంతునికొఱకు కర్మచేయువాడు - అని శ్రీ శంకరుడు చెప్పిన దానియందు భగవంతునితో సమగ్రయోగము గన్పించదు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే
విశ్వరూపసందర్శనయోగో నామ ఏకాదశోఽధ్యాయః





# శ్రీ గీ తా యో గ ము

## అథ ద్వాదశోఽధ్యాయః

## భ క్తి యో గః

ఒక పరిశీలన : క్రిందటి, పదునొకండవ అధ్యాయమునందు గీతాబోధన యొక్క ప్రయోజనము సిద్ధించినది ప్రథమాధ్యాయమున ఏ కర్మచేయ అర్జునుడు నిరాకరించెనో, సరిగా ఆ కర్మాదేశమే ఏకాదశాధ్యాయమున అర్జునున కివ్వబడెను (11-33) మఱియు నత డా ఆదేశము శిరసావహించెను (18-73) ఇదియే గీతాబోధనయొక్క ప్రయోజనము. ఇట్లు అర్జునునియందు ఎంతో మార్పు సంభవించెను.

సామాన్య మానవుని బాహ్యమగు ఏ కర్మప్రాతిపదిక గలదో, ఏ ప్రాతిపదిక అర్జునుని సంకటసమయమున భంగపుచ్చెనో (2-9), నేను చేయుచున్నా ననుకొను ఏ అహంకారిక చేతన గలదో. దానినుండి అర్జునుడు ఒక దివ్యతర చేతనలోనికి లేవనెత్తబడెను ఇపు డతడు భగవదిచ్ఛకు ఒక ఉపకరణముగా (11-33), భగవంతుని శక్తితో, భగవత్కార్యమును గావించును. కావున అతని కిపుడు ఏ పుణ్యపాపభయమును లేదు. ఇదియే అతనిలో వచ్చిన పెద్ద మార్పు.

ఈ మార్పును పూర్తిగా ప్రకటించవలె ననిన, మఱికొంత వివరించుటావశ్యకము విశ్వరూపమున నే సమగ్ర భగవంతుని అర్జునుడు గాంచెనో, ఆ భగవంతుని సమగ్ర జ్ఞానము, సమగ్ర దర్శనమే అర్జునుని అహంకారిక మోహమును విడగొట్టి, అతనిలో ఆ మార్పు గొనివచ్చెను. కనుక ఈ సమగ్ర భగవంతునికిని, అక్షరబ్రహ్మకును గల అంతరమును జూపిననే కాని, ఈ మార్పు నందలి ఆంతర్యమును మనము పూర్తిగా తెలిసికొనజాలము. అందుచేత ఈ అంతరమును గుఱించి ప్రశ్నించు నట్లు చేసి, పండ్రెండవ అధ్యాయమున భగవాను డా అంతరమును ప్రస్తావించి, తక్కిన ఆఱు అధ్యాయములందును దానిని పూర్తిగా వివరించును-అని శ్రీ అరవిందుడు తన అవగాహనను దెలుపును.

"నేను, నాది" (10-8,11) - యని భగవానుడు పలికి నపు డెల్లను ఈ అంతరము గర్భితముగా సూచింపబడుచునే వచ్చెను. "ఆత్మని అథో మయి"(4-35) అని నపుడు అది మఱికొంత స్పష్టము చేయబడెను. కాని ఇక ముందు మాత్రమే అది ఇదమిత్థముగా వర్ణింపబడును (12-2,....).

"ఆత్మని అథో మయి", అనగా ఆత్మయందును తర్వాత నా యందును" (తత్త్వదర్శి సర్వభూతములను జూచును); ఇచ్చట ఆత్మకంటెను 'మయి' పదముచే చెప్పబడు భగవంతుడే ఎక్కువని మనకు స్పష్టముగా తెలియుచునే యున్నది. కాని శ్రీ శంకరు డీ ఆధిక్యమును తాఱుమాఱుచేయును -

2-వ అధ్యాయము మొదలుకొని 11-వ అధ్యాయమువఱకు ఉపాధిరహితుడైన నిర్విశేష బ్రహ్మముయొక్క ఉపాసన చెప్పబడినది, మఱియు నచ్చటచ్చట (అప్రధానముగా) సత్త్వోపాధిసహితుడైన ఈశ్వరునియొక్క ఉపాసన చెప్పబడినది. మఱియు విశ్వరూప అధ్యాయమున కేవలము (సాకార) ఉపాసనకొఱకు ఈశ్వరుని యొక్క విశ్వరూపము చూపబడెను - అని శ్రీ శంకరుడు 12-వ అధ్యాయమునకు అవతారికగా జెప్పును. మానవులు దేవతామూర్తుల నెట్లు ఉపాసింతురో (పూజింతురో) అటులే విశ్వరూపమును ఉపాసనకొఱకు మాత్రమే చూపబడెను. గీతాతాత్పర్యము దానియందు లేదు. గీతాతాత్పర్యము అక్షరబ్రహ్మము నను సంధించుటయందే గలదు-అని శ్రీ శంకరుని అభిప్రాయము. ఇది "ఆత్మని అథో మయి" లోని క్రమమును తాఱుమాఱుచేయుటయే గదా!

ఇట్లు ఇందలి క్రమమును తాఱుమాఱుచేయవచ్చును - అను భయముచేత గీతామాతయే ఈ క్రమము నిపుడు మఱింత వివరించును, అనగా అక్షరతత్త్వముతో పోటీపెట్టి చూపిననే కాని, పురుషోత్తమతత్త్వముయొక్క ఆధిక్యము స్పష్టముగా తెలియదని అట్లే చేయును. అటులే శ్రీ శంకరునితో పోటీపెట్టి చూపిననే కాని, శ్రీ అరవిందుని వ్యాఖ్యానము నందలి విశిష్టత మనకు స్పష్టపడ దను ఉద్దేశ్యము తోనే మనమును అటులే చేయుచున్నాము.

ఇపు డిక నిష్పక్షపాతముగా గీతార్థమును జూతము -

అర్జున ఉవాచ -

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే,
యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః. 1

అర్జునుడు ప్రశ్నించెను — ఇట్లు (11-55) నీతో సంతతము యోగమునం దుండి, ఏ భక్తులు నిన్ను బొందగోరుదురో మఱియు నెవ్వరు అవ్యక్తమగు అక్షరమును బొందగోరుదురో – ఈ యుభయులలో, కృష్ణా, యోగజ్ఞాన మెవరి కెక్కువగా గలదు ?

విశేషార్థము : అర్జునుని ప్రశ్నయొక్క ఆశయ మిది : నేను నీ విశ్వరూపమున జూచి నట్లు, నీవు సర్వభూతములకు అతీత మూలమవు. అయినను స్వీయ ప్రపంచ-యోగముయొక్క మహాబలముచేత నీవు ప్రపంచమునందు వ్యక్తమై యున్నావు, నీ విభూతులయందు దర్శన మిచ్చుచున్నావు, హృదయమునం దుండి సర్వభూతములను నడుపుచున్నావు (18-61) పోతే రెండవ వైపున, సనాతన అక్షరాత్మ గలదు, అది యే రూపమును ధరించదు. అది ప్రపంచమున దేనితోను ఎట్టి సంబంధమును బెట్టుకొనదు, అది శాశ్వతముగా నీరవము, నిర్వ్యక్తికము, నిశ్చలము-ఒక్క మాటలో నది 'అవ్యక్తము'. మఱియు, అర్జును డింకను చెప్పును, ఇప్పటి భావములను బట్టి వ్యక్తము గాక, అవ్యక్తమే అధికతర తత్త్వము, అదియే సనాతన బ్రహ్మము. అయినపుడు వ్యక్తము నుపాసించువారి జ్ఞానము అధికతర మెట్లు కాగలదు ?

శ్రీ భగవా నువాచ -

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. 2

శ్రీ భగవానుడు చెప్పెను — ఎవరు నాయందు దమ మనస్సును గీలించి, నాతో నిత్యయోగమునం దుండి, పరమ విశ్వాసముతో గూడినవారై నన్ను అన్వేషింతురో, వారు పరిపూర్ణముగా నాతో యోగమునం దున్నారని నా (భగవంతుని) అభిప్రాయము

విశేషార్థము : ఏ విశ్వాసము సర్వమునందును భగవంతుని జూచునో, దేని కంటికి అవ్యక్తము మఱియు వ్యక్తము – రెండును ఒకే భగవానుడో, అదియే పరమ విశ్వాసము. కావున అట్టి విశ్వాసమునందలి యోగము అవ్యక్తయోగము కంటెను అధికము. అందుచేత నట్టి యోగులు యుక్తతములు – అని భగవానుడు నిర్ద్వంద్వముగాను, బలముగాను వక్కాణించును.

దీనిని కొంచెము వివరించుకొందము : అవ్యక్తము నుపాసించువారు భగవంతుని సత్తతో మాత్రమే, అందునను అతని అవ్యక్త ఆత్మసత్తతో మాత్రమే యోగము

నందుదురు. అది 'సాయుజ్యముక్తి' మాత్రమే. ఇచ్చట యోగి నిరవ బ్రహ్మ మగును–"బ్రహ్మభూతః" (18-54) ఇది గాక, పరమ పురుషుని పరమ ధామము నందు ఆనందపారవశ్యమున శాశ్వతముగా నివసించుట - అదే సమయమున నివసించుట - అనునదియు గలదు - "నివసిష్యసి మయ్యేవ" (12-8) ఇది 'సాలోక్యముక్తి' భగవంతుని లోకమునం దుండుటయేగాక; విముక్త అంతరాత్మకు భగవంతుని శాశ్వత ప్రేమాలింగనమునం దుండుట యను 'సామీప్యముక్తి'యు గలదు అంతరాత్మ విముక్తి ప్రకృతికి భగవంతుని ప్రకృతితో సాదృశ్యప్రాప్తి యను 'సాదృశ్యముక్తి'యు గలదు. ఏలన భగవంతునివలె నగుటయే - "మమ సాధర్మ్య మాగతాః" (14-2), "మద్భావ మాగతాః" (4-10) - విముక్తాత్మయొక్క పరిపూర్ణస్థితి.

ఇట్లు అక్షరయోగమునందు ఒక సాయుజ్యము మాత్రమే ప్రాప్తించుచుండగా, భగవద్యోగమునందు సాయుజ్యము, సాలోక్యసామీప్యములు మఱియు సాదృశ్యము-నను సర్వమును సిద్ధించును - పూర్ణయోగము నందలి జ్ఞానముచేత సాయుజ్యమును, భక్తిచేత సాలోక్యసామీప్యములును, కర్మచేత సాదృశ్యమును సిద్ధించును. కనుకనే భగవద్యోగులు "యుక్తతములు" (12-2).

ఈ పూర్ణయోగమునందు అంతరాత్మకు ముక్తియు, అంతరాత్మ ప్రకృతికి పరిపూర్ణతయు సిద్ధించుచుండగా, కేవలసాయుజ్యమునందు అంతరాత్మ తన ప్రకృతిని విడిచివేసి, నిర్విశేషబ్రహ్మమునందు లయమునందును.

అవతారిక : అక్షరోపాసనకు ఫలము లయమేనా? —

యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగ మచింత్యంచ కూటస్థ మచలం ధ్రువం. 3

సంనియ మ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః. 4

పోతే, అర్జునా, ఎవరు ఇంద్రియము లన్నింటిని సంపూర్ణముగా నియమించి, అందరియందును, అన్నింటియందును సమబుద్ధి గలిగి, ఇట్టిదట్టిదని నిర్దేశింపరానిదియు, వ్యక్తము కానిదియు సర్వత్ర వ్యాపించియుండునదియు, చింతింప నలవికానిదియు, వికారములు లేనిదియు, చలించనిదియు, నిత్యమైనదియు నగు అక్షరబ్రహ్మము

నుపాసింతురో, వారును, సర్వభూతముల హితమును గామించుచు నన్నే పొందుదురు (కనుక అక్షరోపాసనకు ఫలము లయమే కానవసరము లేదు).

విశేషార్థము : అక్షరోపాసకులును నన్నే పొందుదు రన, అక్షరోపాసన ద్వారా ప్రాప్తించు అక్షరాత్మ నన్ను బొందుట కొక ద్వార మని అర్థము కాని సామాన్యముగా, కఠోరమగు నేతినేతి-సాధనద్వారా అక్షరమును జేరినవారు దానిలో లయము నొందుటయే ప్రాయఃసంభవించును. అయితే ఏ అక్షరోపాసకులకు అహంకారము మాత్రమే అక్షరములో లయము నంది శుద్ధమగు అంతరాత్మ మిగిలి యుండునో, వారికి నాయందు శుద్ధభక్తి ఉదయించును, అప్డు ఆ భక్తిద్వారా వారును 'నన్నే' బొందుదురు (18-55) - అని శ్రీ అరవిందుడు వ్యాఖ్యానించును.

పోతే, 'నన్నే పొందుదురు'-రన, వారు నన్ను బొందుదు రని వేఱుగా జెప్ప వలసిన పనిలేదు, ఏలన, 'జ్ఞాని ఆత్మయనియే నా అభిప్రాయము' (7-18)-అను వచనమును బట్టి జ్ఞాని భగవంతుని ఆత్మయే, స్వరూపమే; కనుక అతడు నన్ను బొందునని చెప్పవలసిన పని ఏమి? మఱియు భగవత్స్వరూపులైన వారికి యుక్తతమత్వముగాని, అయుక్తతమత్వముగాని చెప్పుట పొసగదు -అని శ్రీ శంకరుడు యుక్తతములగు భక్తులకంటెను గూడ జ్ఞాని మిన్న యని శ్రీ శంకరుని భావము.

కాని శ్రీ శంకరుడు తాను ఉదాహరించిన (7-18) శ్లోకమునకు పై శ్లోకములోని 'జ్ఞాని నా ఏకాంతభక్తుడు' (7-17) - అను మాటను చల్లగా జాఱవిడిచినారు. ఇక్కడ పోటీ జ్ఞానికిని, భక్తునకును గాదు, ఇక్కడ (12-1) పోటీ కేవల అక్షరాత్మజ్ఞానికిని, సమగ్రజ్ఞానముతో గూడిన భక్తునకును. ఇట్టి భక్తుడు శ్రీ శంకరుని కేవల జ్ఞానికంటె నిశ్చయముగా యుక్తతముడు. ఏలన ఈ జ్ఞాని భగవంతుని ఆత్మతో మాత్రమే యోగమునం దుండగా, ఈభక్తుడు భగవంతుని ఆత్మతోను, భగవంతుని ప్రకృతితోను, ఈ రెండింటిని రెండు పార్శ్వములుగా గలిగి, రెండింటికంటెను గూడ అనంతముగా అధికమగు సాక్షాద్ భగవంతునితోను పూర్ణయోగమునం దుండును (18-55).

అవతారిక : కేవల జ్ఞానమార్గము కష్టభూయిష్టము —

క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసాం,
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే. 5

కాని ఇట్లు (12-4) అవ్యక్త బ్రహ్మము యొక్క మార్గ మవలంబించువారు ఎంతో ఎక్కువ కష్టమునకు గుఱియగుదురు. ఏలన మానవులు దేహధారులు, కావున వారికి అవ్యక్త గమ్యము కడుంగడు కష్టసాధ్యము.

విశేషార్థము : అక్షరోపాసన ఎందుచేత క్లేశమయమో, శ్రీ అరవిందుడు మనకు పండు ఒలిచి చేతిలో పెట్టినట్లు వివరించుచు అవ్యక్త బ్రహ్మమును పొందుటకు విశ్వము నందలి వ్యక్తమగు అక్షరము ద్వారము. (అక్షరమునకు గూడ రెండు స్తరము లుండును-1. విశ్వాతీతమగు అవ్యక్త అక్షరము, 2. విశ్వగతమగు వ్యక్త అక్షరము ఇది శ్రీ అరవిందుని అపూర్వ వివేచన) కాగా ఈ వ్యక్త అక్షరము భగవంతునియొక్క సర్వవ్యాపి, నిర్వ్యక్తిక మఱియు నీరవ తత్త్వము. ఇది దేహధారి మానవుని వ్యక్తిత్వముయొక్క క్రియకు ఆధారముగా నుండును గాని, ఆ క్రియలో పాల్గొనదు; దానియందు మనస్సున కే ఆలంబనము నుండదు. కాగా నది ఏ కదలికయు లేని ఒక ఆధ్యాత్మిక నిర్వ్యక్తికత మఱియు నీరవతచేతనే పొంద శక్యము కనుక నిట్టి అక్షరము నుపాసించువారు తమ మన ఇంద్రియములను పూర్తిగా స్తంభింపజేయవలెను మఱియు వానిని లోనికి ఉపసంహరించి వేసికొనవలయును గూడ. ఇంద్రియముల యొక్క పరిశుద్ధ (7-11) సంతృప్తికి గూడ ఈ అక్షరోపాసకులు అవకాశ మీయరాదు, వాని ఊర్ధ్వముఖ ఆకాంక్షలను గూడ కత్తిరించివేయవలెను. ఏలన ఇచ్చట ఎట్టి చలనము పనికి రాదు, ఎట్టి వ్యక్తిత్వము పొడసూపరాదు. కావున వారు సంతతము తమ ప్రకృతియొక్క బహువిధ అవసరములతో పోరాడుచు సంఘర్షమునకును, క్లేశమునకును గుఱియగుదురు

పోతే, భగవదుపాసకుల సజీవ విధాన మేమన, వారు తమ సత్తయొక్క మిక్కిలి ప్రగాఢమగు ఊర్ధ్వప్రవృత్తిని కనుగొని, దానిని భగవదభిముఖము గావించి, దానిని ఒక నిచ్చెన చేసికొని, తమ సమస్త ప్రకృతితోను పై కెక్కుదురు. ఇచ్చట ప్రకృతియొక్క దమనము (అడచివేత) లేదు, అదియు ఊర్ధ్వ ప్రవృత్తిలో పాల్గొని దివ్యపరివర్తనము నందును. కనుక ఇందు సంఘర్షము లేదు, క్లేశము తక్కువ

అవతారిక : ఈ సజీవ గీతావిధాన మిపుడు వివరింపబడును —

యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. 6

తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి నచిరాత్ పార్థ మయ్యావేశితచేతసాం. 7

పోతే, అక్షరోపాసకులవలె గాక, ఎవరు తమ కర్మల నన్నింటిని నాయందు సన్న్యసించి, నన్నే పరమగతిగా నెంచుకొని, నన్ను దప్ప మఱి దేనిని జూడని అనన్యయోగముచేత నన్నుధ్యానించుచు నుపాసింతురో, అట్లు తమ చేతస్సునంతను నా యందు ప్రవేశపెట్టిన వారిని అచిరకాలములోనే మృత్యురూప సంసారసాగరము నుండి (నా అమరధామములోనికి) ఉద్ధరింతును.

విశేషార్థము : ఇతర విధానమందు, ఉపాస్యవస్తువు నిష్క్రియము గాన, ఉపాసనయు నిష్క్రియము గావలెను. కనుక ప్రకృతి సహజమగు కర్మలను సైతము వారు బలాత్కారముగాను, బాహ్యముగాను సన్యసింతురు. పోతే, ఇచ్చట యథార్థ కర్మకర్త భగవంతు డని గుర్తించి, కర్మలను భగవంతుని యందు—'మయి' సన్న్యసింతురు. ఈ సన్న్యాస మాంతరము గనుక, ఇచ్చట ప్రకృతి అడచిపేతలేదు, కనుక అడచిపేతవలన గలుగు క్లేశము లేదు. ఇట్లు మన కర్మ యోగము నతడే చేయును ;

మఱియు 'అనన్యముగా' నతనినే ధ్యానించు నపుడు, అతడు లోపల జ్ఞాన దీపము వెలిగించి (10-11), అంతరంగమును ఉద్భాసిత మొనర్చును, అపుడు ఆయననే సర్వత్ర, శతసహస్రముఖములందు గాంతుము. ఇట్లు మన జ్ఞానయోగము నతడే చేపట్టును.

చివరకు, మనము ప్రేమయొక్క సమున్నత సంవేగమునందు మన 'చేతనా హృదయమునంతము' అతనిలోనే ప్రవేశపెట్టినపుడు,మన హృదయ,మనః శరీరముల సుఖమయ ఆలింగనముద్వారా మనను నిమ్నప్రకృతినుండి పరప్రకృతిలోనికి లేవ నెత్తును. ఇట్లు ఆలింగనముద్వారా మన ప్రేమను పరిపుష్టము గావించుచు, మన భక్తి యోగమును గూడ నతడే స్వీకరించును.

ఇంతకు మనకు తేలినదేమన, అక్షరోపాసకుడు తన పరిమిత శక్తిపైననే తా నాధారపడవలసి యుండగా, భగవదుపాసకునికి భగవంతుని అనంతశక్తి తన పని చేసిపెట్టును. భగవదుపాసన సులభము, సుఖమయము నగుటకు ఇదియే ప్రధానకారణము. ఇట్లు భగవదుపాసనామార్గము శీఘ్రతమము, విశాలతమము. మహత్తమము.

అవతారిక : నేను నిన్ను ఉద్ధరించగలిందులకు —

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. 8

ఓ అర్జునా! నాయందే నీ మనస్సును విశ్రమింపజేయుము, నాయందే నీ బుద్ధిని స్థాపింపుము. అట్లు చేసిన, సందియము లేదు, ఈ శరీరపతనానంతరము నీవు నాయందే నివసించెదవు.

విశేషార్థము : 'నాయందే నివసించెదవు'=నా ఆత్మరూపమున నాయందే నివసించెదవు-అని శ్రీ శంకరుడు భగవంతుడు కేవలము ఆత్మయే యగుచో, ఆత్మ రూపమున భక్తుడు భగవంతునియందు ఎట్లు నివసించగలడు? నివసించజాలడు. కావున సాయుజ్యముక్తినే కాక, ఇతర ముక్తులను గూడ (చూ. 12-2 క్రింద) శ్రీ శంకరుడు ఆమోదించక తప్పలేదు. అయినను ఇది ఆయన సిద్ధాంతమునకు విరుద్ధము.

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరం,
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ. 9

ఇక నట్లు, అర్జునా, నీ చిత్తమును నాయందు స్థిరముగా నిలువజాల వేని, అపుడు అభ్యాసయోగముచేత నన్ను బొంద బ్రయత్నించుము.

విశేషార్థము : అక్షరోపాసన కష్టతర (12-5) మనినపుడు, భగవదుపాసన కష్టమని అర్థముగాని, ఇందు కష్టమేలేదని అర్థము గాదు. భగవదున్ముఖ ప్రవృత్తిని నిమ్నప్రకృతిలోని రజస్తమోగుణములు క్రిందికి లాగివేయుచుండును. అందుచేత అద్భుత లేక ప్రశాంత క్షణములందు దివ్యచేతనను మనము కనుగొనగలిగినప్పటికి, దానియందు మనస్సును స్థిరపఱచుట సాధ్యము కాదు అట్లు స్థిరపఱచుటకు చేయు నిత్యప్రయత్నమే అభ్యాసము, మఱియు నిట్టి అభ్యాసముచేత ప్రాప్తించు (భగవంతునితో) యోగము అభ్యాసయోగము ఈ స్థిరత లభించిన పిమ్మట దీర్ఘకాల మా స్థితియం దుండుట 'ఆసనం' – ఉపాసనము (12-2) – అనబడును.

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ,
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి. 10

ఇక, నర్జునా, అభ్యాసమునుగూడ చేయజాల వనుకొనుము, అపుడు నాకర్మలను జేయుటయందు తత్పరుడవు గమ్ము. నాకొఱకు గర్మలను జేయుచును గూడ, నీవు సిద్ధిని బొందగలవు.

విశేషార్థము : 'మత్కర్మ'-నాకర్మ, భగవంతుని కర్మ-అని శ్రీ అరవిందుడు. భగవంతుడు కర్మప్రభువు సర్వకర్మలు భగవంతునినుండియే వెలువడి, భగవంతుని లోనికే తిరిగి యజ్ఞరూపమున జేరును. కనుక సర్వ కర్మలను భగవంతునికొఱకు జేయవలెను. ఇట్లు మనస్సుయొక్క ప్రతి బహిర్ముఖ వృత్తియు కర్మయొక్క ఈ ఆంతర - ఆధ్యాత్మిక సత్యముతో సంబంధము కలిగియుండును, అనగా బహిర్ముఖత యందు సైతము మనస్సు ప్రతిక్షణము లోనికి పిలువబడుచుండును, భగవంతుని స్మృతి కలిగియుండును. ఈ స్మృతివలన భగవంతుని సన్నిధి ప్రాకృతమానవునిపై పెరుగుచు, పెరుగుచు రాగా, చివరి కతని ప్రాకృతత్వము ఆధ్యాత్మికతలోనికి మాఱి, అతడొక ఆధ్యాత్మిక పురుషు డగును, మఱియు మానవాత్మయొక్క జీవనమంతయు భగవద్భావము (13-19) నంది పరిపూర్ణ మగును. శ్లోకము నందలి 'సిద్ధి' యన నిదియే కాని, కేవల మోక్షము గాదు - సిద్ధి = మోక్షము + ఆధ్యాత్మికత + పరిపూర్ణత. ఈ సిద్ధి కర్మయోగముచేత సిద్ధించును మఱియు సిద్ధియందు కర్మలు కొనసాగుచునే యుండును.

పోతే శ్రీ శంకరుడేమి చెప్పును ? - 'మత్కర్మ' = నాకొఱకు చేయబడు కర్మ. అనగా మానవుడు తనకొఱకు చేయు కర్మలు కొన్ని, భగవంతునికొఱకు చేయు కర్మలు కొన్ని గలవు. ప్రధానముగా భగవత్కర్మలను చేయుటవలన, చిత్తశుద్ధి కలుగును. దానివలన యోగము, అనగా ధ్యానసామర్థ్యము కలుగును, దానివలన జ్ఞానము కలుగును, దానివలన మోక్షము లభించును ధ్యానదశయందు కర్మలు చాలవఱకు ఆగిపోవును, మోక్షమునందవి యుండనే యుండవు - ఇచ్చట కర్మలు భగవంతునినుండి వెలువడు భగవత్కర్మలు, అవి ఆగిపోనవసరములేదు, ఆగిపోవు-అను భావచ్ఛాయ గూడ గన్పించదు.

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః,
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. 11

కాని ఇట్లు నాతో యోగమునందుండి నా కర్మలు చేయుటయు నీకు శక్యము గాదేని, అపుడు కర్మయందు నీ నిమ్నాత్మను నియమించి, ఫల మాశించక కర్మ చేయుము.

విశేషార్థము : కర్మచేయు సమయముననే, కర్మమూలమగు భగవంతుని స్మరించుట శక్యముగా నపుడు, ఈ శ్లోకమునందలి ఉపాయము చూపబడినది. ఈ ఉపాయముద్వారా ప్రతిబంధము క్రమముగా తగ్గి, త్వరగా చూపుమాసిపోవును,

అపుడు దివ్యచేతనలో నెలకొని, దాని స్వేచ్ఛయందు కర్మచేయుచునే భగవంతుని స్మరించగలుగుదుము (8-7).

అవతారిక : ఇపు డా కర్మఫలత్యాగమును ప్రశంసించును.—

**శ్రేయోహి జ్ఞాన మభ్యాసాజ్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే,**
**ధ్యానాత్ కర్మఫలత్యాగస్ త్యాగా చ్ఛాంతి రనంతరం. 12**

చూడు మర్జునా: ఒక విధానముయొక్క అభ్యాసము లేక ఒక అనుభవము యొక్క పునరావర్తనము : ఇదియు నొక శక్తిశాలి వస్తువే. కాని దీనికంటెను బాహ్యరూపముల వెనుకనుండు పరమ సత్యమునకు దిరిగియుండు ఏ బుద్ధిజ్ఞానము గలదో, అది శ్రేష్ఠము. ఈ జ్ఞానముకంటెను ఈ జ్ఞానవిషయమగు ఆ పరమ సత్యమును ధ్యానించుట శ్రేష్ఠతర మగును. ఏలన ఈ ధ్యానమువలన మనస్సుచివర కా సత్యమున నివసించగలుగును. కాని ఈ ధ్యానముకంటెను శక్తిమత్తరము కర్మఫలత్యాగము ఏలన అది తత్క్షణమే శాంతిని గొనివచ్చును.

విశేషార్థము : కామము కలతకు గారణము, మఱియు కామ మన ఫల కామమే. కావున ఫలత్యాగము కలతను దొలగించి, సహజముగనే అంతఃశాంతిని నైర్మల్యమును గలిగించి, రక్షించును. ఈ శాంతినైర్మల్యములే ఆధ్యాత్మిక సాధము నకు మూలాధారము. ఈ ఆధారమునందు చేతన హాయిగా నుండి సుఖముగా భగవంతునియందు నెలకొని, నిష్కంటకముగా పరిపూర్ణతలోని కెగయును. అందుచేత ఫలత్యాగము సర్వశ్రేష్ఠము—అని శ్రీ అరవిందుడు; అనగా సుదృఢ ఆధారముగా సర్వశ్రేష్ఠము.

పోతే, కర్మఫలత్యాగము సర్వశ్రేష్ఠ మని చెప్పుట దానిని స్తుతించి, ప్రోత్స హించు నిమిత్తమే గాని, ఆ మాట నిజముగా నిజముగాదు — అని శ్రీ శంకరుడు. ఈ మార్గము అజ్ఞులకు, అస్వతంత్రులకు: వీరు అస్వతంత్రులు గావుననే, భగవంతుడు తమను ఉద్ధరించుటపై నాధారపడుదురు (12-7). పోతే, అక్షరోపాసన సర్వశ్రేష్ఠము, అక్షరోపాసకులు జ్ఞానులు మఱియు స్వతంత్రులు: వీరు తమకుదామే, స్వతంత్రము గనే గమ్యమును చేరుదురు. గీతనుగూడ లక్ష్యపెట్టక, శంకరుడుచేయు ఈ విపరీత వాదనకు (12-7) క్రింద సమాధాన మివ్వబడియే యున్నది

అవతారిక : ఇపుడిక "యుక్తతములగు" (12-2) భగవదుపాసలు అందు కొనిన భగవంతుని దివ్యచేతనయొక్క లక్షణములు వర్ణించబడును —

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ. 13

సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్తః సమే ప్రియః. 14

దేనియందును ద్వేషము లేనివాడు, పైగా సర్వభూతముల యెడ స్నేహము మఱియు కరుణ గలవాడు, అహంకారము గాని, మమకారము గాని లేనివాడు, సుఖ దుఃఖములందు సమచిత్తుడు, క్షమాశీలుడు, (లభించిన దానితో) సదా సంతుష్టుడు, ఆత్మసంయమము కలిగి, దృఢనిశ్చయముతో సర్వదా యోగమునం దుండువాడు, మఱియు తన మనోబుద్ధులను నా కర్పించివేసిన ఏ భక్తవర్యుడు గలడో, అతడు నాకు ప్రియుడు

విశేషార్థము : ఇచ్చట అహంమమతలనుండి విముక్తి గలదు: ఈ విముక్తి వలన అతనిచేతన విస్తరించి, విశ్వచేతన యగును. అందుచేతనే అతనికి విశ్వప్రేమ. తర్వాత సంతుష్టి వచ్చును, కామము లేనపుడు చేతన ప్రశాంతముగను, ప్రసన్నము గను ఉండు స్థితియే సంతుష్టి ఈ రెండింటి ఫలితముగా సర్వసమత. ఈ సమత యున్న వ్యవహారమునందును చేతన నిమ్నప్రకృతిలోనికి దిగజాఱదు. విముక్తి, సంతుష్టి, సమత – భగవచ్చేతనతో యుక్తమైన భక్తుని చేతనయందు వచ్చిన ప్రధాన పరివర్తనము లీ మూడును. వీనిని గీత పదే పదే వత్తిచెప్పుటకు వీని ప్రాధాన్యమే కారణము – అని శ్రీ అరవిందుడు.

పోతే, 'అద్వేష్టా' మున్నగున వన్నియు అక్షరోపాసకుని లక్షణము లని శ్రీ శంకరుడు నిర్దేశించును. అక్షరాత్మకు ఎవనితోను, దేనితోను ఎట్టి సంబంధము నుండదు. దేనికి దేనితోను వైయక్తిక సంబంధ ముండదో, దానియందు భక్తి ఎట్లు ఉత్పన్నము కాగలదో, శ్రీ శంకరుడే చెప్పవలసియున్నది. కనుక ఇవి భగవదుపాసకు డగు భక్తుని లక్షణములు గాని, కేవల అక్షరోపాసకుని లక్షణములుగావు. అఱ, భక్తుని పరభక్తిని అక్షరాత్మ విశుద్ధ ఆధారము గాన, ఈ భక్తునికి అక్షరాత్మ లక్షణము లగు సమతాదులును ఉండును. అంతమాత్రముచేత భక్తుడు అక్షరోపాసకుడు మాత్రమే కాడు.

యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతేచ యః,
హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో యస్సచ మే ప్రియః.

ఎవనివలన లోకము సంతాపము బొందదో, ఎవడు లోకమువలన సంతాపము బొందడో, హర్ష క్రోధములు మఱియు భయసంతాపములనుండి ముక్తుడగు నట్టి మానవుడు నాకు ప్రియుడు.

విశేషార్థము : ఇది విశేషించి అభావాత్మక లక్షణము. శంకరాచార్యుడు చెప్పినట్లు, ఇది అక్షరోపాసకుని స్వభావమగును. అయితే ఇదియు భక్తుని పరమార్థ సంపత్తిలో నొక అంశమే.

**అనపేక్షః శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః,**
**సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్తః సమే ప్రియః. 16**

ఏ నా భక్తుడు తన అపేక్షల నన్నింటిని నాకు సమర్పించివేసెనో, శుచియు మఱియు నిశ్చలుడో, (కర్మ) కుశలుడో, ఏది ప్రాప్తించినను, దానిపట్ల ఉదాసీనుడో, ఏది సంభవించినను, దానిని గుఱించి కలత జెందడో, మఱియు తనకు దానుగా నే కర్మను ఆరంభించడో, ఆ నా భక్తుడు నాకు ప్రియుడు.

విశేషార్థము : సర్వారంభ పరిత్యాగీ-తానుగానే కర్మను ఆరంభించని వాడు అనగా భక్తుని కర్మకు హేతువు, సామాన్య మానవుని కర్మకువలె, అహంకారిక, వైయక్తిక మఱియు మానసిక కామము కాదు. అతనికి అహంకారములేదు (12-13) గావున, అతనికి కామము లేదు. అంతమాత్రమున అతనికి కర్మ సైతము లేదని అర్థము గాదు. అతనికి కర్మ గలదు, అయితే దానికి హేతువు భగవదిచ్ఛ. అతడు భగవదిచ్ఛను తనద్వారా స్వేచ్ఛగా కర్మరూపమున ప్రవహింపనిచ్చును; తన అభిరుచులు, ఆకాంక్షలచేత దానిని వికృతపఱచడు. సరిగా నందుచేతనే తన కర్మల యందు అతడు అత్యంత 'దక్షుడు'-భగవదిచ్ఛతో తనకు గల సంపూర్ణ సంయోగమే కర్మలయందు అతనికి గల పరమ కౌశలమునకు గారణము-అని శ్రీఅరవిందుడు.

పోతే, ఆరంభము = కర్మ, సర్వారంభపరిత్యాగీ - సర్వకర్మలను పరిత్యజించు అనగా సన్న్యసించువాడు-అని శ్రీ శంకరుడు. ఈయన ఇట్లు చెప్పుటకు సిద్ధాంత పరమగు కారణ మేమన, అక్షరాత్మపైన కర్మలను సంకల్పించు ఈశ్వరుడు మఱి యొకడు లేడు కనుక అహంకారమును విడిచి, అక్షరాత్మలోని కేగిన సాధకునకు, కర్మను సంకల్పించున దేదియు నుండదు గాన, కర్మ లాగిపోవును.

కాని ఈశ్వరు డున్నాడు. అందుచేతనే జ్ఞానులకు సైతము, ఉదాహరణకు, శ్రీ శంకరునికి సైతము,కర్మ లాగిపోవు. కావున అనేక పర్యాయములు అక్షరాత్మయే

ఈశ్వరుడు (9-10), (12-20) – అని శ్రీ శంకరాచార్యుడు చేయు వ్యాఖ్యానము సరియైనది గాదు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యః స మే ప్రియః. 17

ఎవడు ప్రియమును కాంక్షించడో, మఱియు నది లభించినపుడు హర్షించడో, అటులే అప్రియమును ద్వేషించడో, మఱియు నది ప్రాప్తించి నపుడు శోకించడో, శుభాశుభఘటనలకు గల విభేదము నట్లు పరిత్యజించు శీలముగల భక్తిమంతుడు, అర్జునా, నాకు ప్రియుడు.

విశేషార్థము : 'శుభాశుభపరిత్యాగీ' : శుభము మఱియు నశుభము – రెండును తన ప్రేమికుడు మఱియు స్వామి యగు భగవంతునినుండియే వచ్చుచున్న వని చెప్పి, అతని భక్తి వానిని సమముగా స్వీకరించును, వాని మధ్య విభేదమును పాటించదు – అని శ్రీ అరవిందుడు. పోగా, శుభాశుభ కర్మలను రెంటిని భక్తుడు పరిత్యజించును – అని శ్రీ శంకరుడు. ఈయన శుభాశుభములకు మూలములో లేని కర్మను దగిలించి, కర్మసన్యాసమును జెప్పినారు శ్లోకముయొక్క ప్రథమ పంక్తిలో అశుభమును ద్వేషించడనియే యున్నది గాని, దానిని విడిచివేయు నని లేదు. కావున శ్రీ శంకరుని నిర్ణయము సరియైనది కాదు.

సమః శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః,
శీతోష్ణ సుఖదుఃఖేషు సమః సంగవివర్జితః. 18
తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః. 19

నన్ను ప్రేమించువాడును,నాకు ప్రియుడు నగు మానవుడు శత్రుమిత్రులయందు సముడు, అటులే మానావమానములయందు సముడు, శీతోష్ణసుఖదుఃఖములయందు సముడు, నిందాస్తుతులయందు సముడు,ఎవనితోను,దేనితోను అతనికి సంగ ముండదు. అతడు సదా మననశీలుడు, అతడు దేనితో నైనను సంతుష్టిని సంతృప్తిని బొందును. అతనికిగృహముతో నైతము సంగ ముండదు. అతని బుద్ధి సదా స్థిరముగా నుండును.

విశేషార్థము ; 'అనికేతః' = నియత నివాసము లేనివాడు, సన్యాసి–అని శ్రీ శంకరుడు అనికేతః - ఇది నా యిల్లని చెప్పి, ఇంటితో నైతము సంగము లేనివాడు. అతనికి భగవంతుడే స్వగృహము (12-8)–అని శ్రీ అరవిందుడు.

"స్థిరమతిః" అతని బుద్ధి పరమాత్మయందే సదా నెలకొనియుండును గాన, అది అన్నింటియందు స్థిరముగా నుండును, విషయముల వెంటపరుగు లెత్తదు (2-41).

అవతారిక : పై భక్తులు నాకు ప్రియులు కాగా, ఇపుడు నా కత్యంత ప్రియు లెవరో, చెప్పెదను —

యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః. 20

కాని సంపూర్ణ శ్రద్ధావంతులై, నన్నే పరమగమ్యముగా నెంచుకొని, ఆ పరమగమ్యమును బొంద, ఇంతదనుక వర్ణించబడిన అమృత ధర్మము నే భక్త శిఖామణు లనుష్ఠింతురో, అదిగో, వారు నాకు అత్యంత ప్రియులు.

విశేషార్థము : ఇంతవఱకు అభివర్ణించబడిన ధర్మము పరమ ఆధ్యాత్మిక సంసిద్ధికి ఆధారము, నియమము(condition)మఱియు సాధనము. దీని నేమాత్రము కలిగియున్న భక్తులైనను, నాకు ప్రియులే (12-9) కాని ఈ ధర్మమును సాధనము చేసికొని, ఏ భక్తవర్యులు నన్ను సంపూర్ణముగా బొంద ప్రయత్నింతురో, అనగా సంసిద్ధిని సాధింతురో, వారికి నాయందుగల ప్రేమ పరిపూర్ణమగును అట్లు పరిపూర్ణ ప్రేమవంతులైన భక్తిపుంగవులు నాకు పరమ సన్నిహితులు మఱియు అత్యంత ప్రియులు — అని శ్రీ అరవిందుడు.

నన్ను బొందగోరు నా భక్తుడు ముందు, తన భక్తిని కలుషితము చేయు అహంకారమునుండి తనను దాను విడిపించుకొనవలెను. అందు నిమిత్త మతడు నిమ్న ప్రకృతినుండి వెలువడి, నిరహంకారము, సర్వసమము నగు అక్షరాత్మయొక్క నిర్మల శాంతియందు ప్రవేశించును. ఈ శాంతినుండి అతడు నన్ను(పురుషోత్తముని) బొంద ఆకాంక్షించును—ఈ పురుషోత్తముడు అక్షరునికంటె నితరుడు, అక్షరునికంటె ఉత్తముడు ('5-17) మఱియు నీ ఆకాంక్ష పరిపూర్ణ ఆత్మసమర్పణద్వారా పైకి జ్వలించును .ఈఆకాంక్షయొక్క బలము అతనిని పురుషోత్తమునిలోనికి గొనిపోవును.

భక్తు డిట్లు అక్షరాత్మలోని కెగసి నపుడు, అతనికి విముక్తి, శాంతి, సమత మున్నగు ధర్మములు సిద్ధించును. ఇంతతోనాగక, ఆ భక్తు డా శాంతినుండి పరమాత్మ నాకాంక్షించుచు, పరమాత్మను బొంద ఆ ధర్మములను సాధనముగా చేసికొనిన,అతడు అత్యంత ప్రియు డగును- ఇది శ్రీ అరవిందుని వివరణము.

పోతే, శ్రీ శంకరుడు, అక్షరాత్మయే ఇచ్చట నేను-వాచ్యుడగు భగవంతుడు, మఱియు ఇచ్చటి భక్తియొక్క లక్షణము జ్ఞానము-అని చెప్పును కనుక 'మత్పరు' డన అక్షరాత్మపరుడే,మఱియు భక్తు డన జ్ఞానియే. ఈజ్ఞాని'నాకు' అత్యంత ప్రియుడు- అని ఆయన నిర్ధారించును, మఱియు 'నాకు జ్ఞాని' అత్యంతప్రియుడు' (7-17)-అని ఉదాహరణ నిచ్చును.

కాని ఈ ఉదాహరణలోని జ్ఞాని కేవల అక్షరాత్మజ్ఞాని కాడు. అక్షరాత్మ జ్ఞానముతో గూడిన పరమాత్మ భక్తుడు - "ఏలన నాతో యోగమునం దున్న ఆ జ్ఞాని నన్నే సర్వోత్తమగతిగా నెంచి, పొంద ప్రవృత్తుడై యున్నాడు" (7-18)-అని అచ్చట చెప్పబడియే యున్నది. కనుక భగవంతుడు అక్షరాత్మయే యని చెప్పిన శ్రీ శంకరుని అర్ధ మిచట అన్వయించదు, సరికాదు. భక్తి అక్షరాత్మవిషయకము గాక, పరమాత్మ విషయక మని చెప్పినచో; అపుడు ఆ 'భక్తికి జ్ఞానము లక్షణము' అని ఆయన చెప్పిన మాట ఆమోదయోగ్యమగును.

చివరకు ఇచ్చటి 'అమృత ధర్మమును గుఱించి ఒక మాట ; గీతాభాష యందు ధర్మమన సత్తయొక్కయు, దాని కర్మలయొక్కయు స్వభావసిద్ధ నియమము (law), మఱియు ఆ నియమముచేత నియతమైన కార్యకలాపము-"స్వభావనియతం కర్మ" (18-47). ఈ ధర్మము ఏకము. కాగా మనఃప్రాణశరీరముల నిమ్న, అజ్ఞానమయ చేతనయందు అనేక ధర్మములు, అనగా అనేక విధులు, అనేక ప్రమాణములు, అనేక నియమములు నుండును. ఏలన మానసిక ప్రాణిక మఱియు భౌతిక ప్రకృతియొక్క నిర్ధారణలు, ఆదర్శములు దేశకాలమును బట్టి మాఱుచుండును.

ఈ ఏకమాత్ర ధర్మమే అమృత ధర్మము. ఇతర ధర్మములను విడిచి దీనినే మన మవలంబించవలెను (18-66), ఈ ధర్మమును విపులీకరించుటకే తక్కిన గీతాఽధ్యాయములు వినియోగించబడును-అని శ్రీ అరవిందుడు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే
భక్తియోగో నామ ద్వాదశోఽధ్యాయః





# శ్రీ గీతా యోగము

## అథ త్రయోదశోఽధ్యాయః

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగః

ఒక పరిశీలన ; పూజ్యులగు భీష్మాదులను నేనెట్లు చంపగలను ? (2-4) - అని ఆదిలో అర్జునుడు మొఱపెట్టుకొనును. అతని భయసంకోచములను బాపుటకు - భీష్మాదులు చంపబడు శరీరములు గారు, వారందరు శరీరములు ధరించిన శరీరియగు అక్షరాత్మ (2-18) - అని భగవానుడు బోధించును అనగా అజ్ఞానముచేత దేహ నిమగ్నమగు అంతరాత్మకును, దేహాతీతమగు అక్షరాత్మకును గల విభేదమును విస్పష్టముగా జూపును. స్థూలముగా, మొదటి ఆఱు అధ్యాయములందును ఈ విభేదవివేచనకు ఆవశ్యకమగు జ్ఞానప్రతిపాదనకే ప్రాధాన్య మీయబడినది. అయితే కర్మను యజ్ఞముగా జేయుటకు యజ్ఞేశ్వరు డుండవలయును గదా, కావున ప్రథమ షట్కమునందు యజ్ఞేశ్వరుడగు పరమపురుషుని ప్రస్తావనయు వచ్చును (5-29).

తర్వాత, ద్వితీయ షట్కమునందు, అనగా రెండవ ఆఱు అధ్యాయములందు, ఈ పరమపురుషుని జ్ఞానమునకు ప్రాధాన్యమిచ్చి, దానిని గీత స్పష్టముగాను (7-6), ప్రముఖముగాను (9-4) ప్రతిపాదించును. ప్రతిపాదించుటయే కాక, సర్వము అతని ఒక్కనియందే ఏకీభూతమై యున్నది (11-7) - అని విశ్వరూపమునందు సాక్షాత్తు అర్జునునకు జూపును.

అయితే ఇక మిగిలిన దేమిటి ? జీవన మంతయు పురుషప్రకృతుల మధ్య నిరంతరము సాగుచుండు నొక పరస్పర వ్యవహారము (13-27) కావున ప్రకృతి యొక్క క్రియయందు పరమ పురుషునికిని, అక్షర పురుషునికిని, క్షరపురుష డగు జీవునకును, ప్రకృతికిని ఏ యథార్థ సంబంధములు గలవో, వానిని కచ్చితముగా దెలిసికొనుట జీవనసాఫల్యమున కావశ్యకము. ఇపుడు మిగిలియున్న దీ సంబంధముల స్పష్టతర జ్ఞానమే మఱియు నీ జ్ఞాన వివరణముకొఱకే తృతీయ షట్క మంతయు వినియోగింప బడును.

అందుచేతనే ఈ షట్కముయొక్క ప్రారంభమున ప్రకృతిపురుషులను, క్షేత్ర క్షేత్రజ్ఞులను, జ్ఞానజ్ఞేయములను, హే కృష్ణా, నేను దెలియగోరుచున్నాను (13-1) - అని అర్జునునిచేత భగవానుడు ప్రశ్న వేయించును. (అర్జునుడు ప్రశ్న వేయును-గాదు, అర్జునునిచేత ప్రశ్న వేయించును. అటులే, మున్ముందు అర్జునునకు విషాదము కల్గెను - గాదు, అతనికి భగవానుడు కల్గించెను - అని శ్రీ అరవిందుడు మాటల వెనుక నున్న యథార్థసత్యమును జూపును అస్తు.) సాధనలకు గావలసిన జ్ఞానసార మంతయు ఈ ప్రశ్నలకు భగవాను డిచ్చు సమాధానములందు వచ్చివేయును, అనగా ఈ జ్ఞానము చేత అంతరాత్మ తనకు ఇతర తత్త్వములతో గల యథాభూత సంబంధములను దెలిసికొని, వాని నవలంబించి, నిమ్న ప్రకృతియొక్క బంధనమునుండి వెలువడి, అక్షరాత్మద్వారా పరమాత్మలోని కెగయగలుగును. ఇట్లు తృతీయ, షట్కము పరమ పురుషుని సాధనకు అగ్రప్రాధాన్య మిచ్చును. సర్వ సమర్పణమే ఆసాధనాసారము ఆ సమర్పణమునే గీత తన చరమ సందేశముగా, తన మహావాక్యముగా (18-64), తన చివరి శ్లోకమున (18-66) మనకు ప్రసాదించును.

విశేషించి, ఈ అధ్యాయమున క్షేత్రలక్షణమగు, అనగా క్షేత్రమును లక్షణ ముగా గలిగిన, అపర ప్రకృతిని క్షేత్రజ్ఞలక్షణమగు పరప్రకృతిని ప్రకారాంతరముగా వర్ణించి, అంతరాత్మ అపర ప్రకృతినుండి పరప్రకృతిలోని కెగసి నపుడు దాని స్థితి యందును, అనుభవమునందును ఎట్టి మార్పులు వచ్చునో (13-28....), అని వర్ణించబడును.

అర్జున ఉవాచ -

ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ,
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయంచ కేశవ. 1

అర్జును డడిగెను - ప్రకృతిపురుషులను గురించియు, క్షేత్రక్షేత్రజ్ఞులను గురించియు, అటులే జ్ఞానజ్ఞేయములను గురించియు, ఓ కేశవా, నీనుండి నే నిపుడు తెలియగోరుచున్నాను.

విశేషార్థము : ప్రకృతియం దున్నవాడు. అది అపర ప్రకృతిగావచ్చును, లేక పరప్రకృతి గావచ్చును-పురుషుడు. అపరప్రకృతిలో నున్న ఈ పురుషుడే పరప్రకృతిలోని కారోహించి నపుడు, అతనికి తనువిష్టు కలుగును. అతడు

'నేను ప్రకృతిబద్ధుడనుగాను, ప్రకృతిక్రియల కతీతముగా నుండి, ప్రకృతిని తెలిసికొను క్షేత్రజ్ఞుడను' – అని గ్రహించును. అపు డతనిని క్షేత్రజ్ఞు డందురు.

శ్రీ భగవా నువాచ -

ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే,
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. 2

శ్రీ భగవానుడు చెప్పెను – అర్జునా! ఈ శరీరమునే క్షేత్ర మని చెప్పుదురు. పోతే దీని నెఱుంగు వా డెవడు గలడో, అతనిని తద్విజ్ఞానము గల విజ్ఞులు క్షేత్రజ్ఞు డని పలింతురు.

అవతారిక : ఇది క్షేత్రక్షేత్రజ్ఞుల సంబంధము. అయితే క్షేత్రజ్ఞ ఈశ్వరుల సంబంధము ? —

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తజ్ జ్ఞానం మతం మమ. 3

అర్జునా! సర్వ క్షేత్రములందును నే నొక్కడనే క్షేత్రజ్ఞుడను - అనియు నీ వెఱుంగుము. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల జ్ఞాన మేది గలదో, అదియే వాస్తవ జ్ఞానమని నా అభిప్రాయము.

విశేషార్థము : ప్రతి క్షేత్రమునందును ఏ జీవుడు గలడో, అతడు పరప్రకృతి లోని కారోహించి, తనను ఈశ్వరునిగా నెఱుంగును. అభివ్యక్తియందు జీవుడు ఈశ్వరాంశ(15-7)మైనను, వస్తుతః అతడు ఈశ్వరుడే–"బ్రహ్మభూతః" (18-54). వేఱు మాటలలో ఒకే ఈశ్వరుడు అనేక రూపములను ధరించి క్షేత్రజ్ఞుడుగా వ్యవహరించుచున్నాడు–"ఈశావాస్యం సర్వం" (ఈ. ఉ.). ఇట్లు క్షేత్రక్షేత్రజ్ఞులకు గల సంబంధము భేదములోని అభేదము, అనగా భేదాభేదము; ఇది శ్రీ అరవిందుని వ్యాఖ్యానము.

పోతే, జీవునకు ఉపాధి యున్నంతా కాలము భేదము, ఉపాధి వదలినపిమ్మట ఈశ్వరునితో ఏకత – అని శ్రీ శంకరుడు. దీని అర్థమేమి యగును ? జీవించుటకు ఉపాధి అవశ్యకముగాన, జీవనము, సమస్తజీవనము, భేదమయము, బంధనాత్మకము కాక తప్పదు – అని దానిఅర్థము. కాని ఇది సరికాదు. ఏలన, ఈశ్వరుడు ఉపాధియం దున్నను, ఉపాధికి అతీతమగు తన పరమస్థానమునందు సైతము అదే సమయమున

అవస్థితుడై యుండునుగాన, అతడు తన జ్ఞానము గోల్పోడు, మఱియు బద్ధుడుగాడు. అందుచేత జీవనమంతయు అజ్ఞానమయము గా నవసరము లేదు- అని శ్రీఅరవిందుడు.

మఱియు సాంప్రదాయిక అద్వైతులు జీవేశ్వరుల ఏకతను సాధించుటకు జహదజహల్లక్షణమును ప్రయోగింతురు, అనగా ఈశ్వరుని సర్వజ్ఞత్వ ఉపాధిని, జీవుని కించిజ్జ్ఞత్వ ఉపాధిని విడిచివేసి చూచినపుడు, శేషించిన నిర్విశేష వస్తువు నందు ఉభయులు ఒకటి యగుదురు – అని వారు చెప్పుదురు. ఇదియు సరి కాదు, ఏలన జీవుని మూలభూత ఉపాధి పరప్రకృతియే (7–5) కనుక ఉపాధియందు సైతము జీవేశ్వరు లొక్కటియే–"సాధర్మ్య మాగతాః"(14-2)అని శ్రీ అరవిందుడు

పోతే, క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞాన మనగా నేమి? క్షేత్రక్షేత్రజ్ఞుల విడివిడి జ్ఞానము కాదు. క్షేత్రమునుండి దృష్టిని మఱల్చి, క్షేత్రజ్ఞుడు తనను తెలిసికొన లోనికి వెళ్లిన కొలది, ఉభయముయొక్క బాహ్యరూపముల వెనుక నున్న యథార్థ జ్ఞానము భాసింప నారంభించును. ఉభయము, అనగా క్షేత్రక్షేత్రజ్ఞు లిరువురు, ఆత్మ ప్రపంచములు రెండును, బ్రహ్మమందు ఏకత నందును (13–31). వానియొక్క ఈ ఏకతాజ్ఞానమే వానిని గుఱించిన యథార్థ జ్ఞానము–అని శ్రీ అరవిందుని అనన్య వ్యాఖ్యానము. ఇతరు లెవ్వరు ఇట్లు చెప్పలేదు.

తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్
సచ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. 4

ఇపుడు, ఓ అర్జునా! ఆ క్షేత్రము వస్తుతః ఏదియో, గుణతః ఎట్టిదో, దాని వికారము లేవియో, దేనినుండి ఏది కార్యరూపమున ఉత్పన్న మైనదో, మఱియు క్షేత్రజ్ఞుడు స్వరూపమును బట్టి ఎవడో, ప్రభావమును బట్టి ఎట్టివాడో, దాని నంతను ఇపుడు నానుండి సంక్షేపముగా వినుము.

విశేషార్థము: ఈ ప్రశ్నలకు సమాధానము లీ అధ్యాయమునందే రావు. కొన్ని తర్వాతి అధ్యాయములలో వచ్చును. ఉదాహరణకు, క్షేత్రజ్ఞుడు స్వరూపమును బట్టి నేనే (13-2), ప్రభావమును బట్టి నా అంశము (15–7).

ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః. 5

ఈ క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానమును, అర్జునా, ఋషివర్యులు వేదోపనిషత్తులయందు వివిధ మంత్రములచేత వివరముగాను, విపులముగాను గానము చేసియున్నారు. మఱియు హేతుయుక్తములు, నిశ్చయబుద్ధి ప్రదములు నగు బ్రహ్మసూత్రపదం పదయు ఈ జ్ఞానమును సమకూర్చును.

విశేషార్థము : ఋషులు క్షేత్రక్షేత్రజ్ఞరూప సృష్టియొక్క అంతఃస్ఫురిత (intuitive)జ్ఞానమును మనకందించగా, బ్రహ్మసూత్రములు దానిని హేతుబద్ధముగా ప్రతిపాదించి, మన బుద్ధికి అర్థమగునట్లు చేయును గీతయందు ఈ జ్ఞానము సంక్షిప్తముగా నున్నది గనుక, దీని విస్తారముకొఱకు మనము ఉపనిషత్తుల నాశ్రయించవలెను-అని ఈ శ్లోకముయొక్క అభిప్రాయము, కాకే, ఋషులు సైతము దీనిని గానము చేసి రని ప్రశంసించుట శ్రోతయొక్క దృష్టి నాకర్షించుట-కని శ్రీశంకరుడు,

అవతారిక : 4-వ శ్లోకములోని ప్రతిజ్ఞ ననుసరించి క్షేత్రము వివరించబడును

మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ,
ఇంద్రియాణి దశైకంచ పంచ చేంద్రియగోచరాః. 6

ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః,
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతం. 7

పంచ మహాభూతములు, అహంకారము, బుద్ధి మఱియు అవ్యక్తము, అటులే మనస్సుతో గలిసి పదునొకండు ఇంద్రియములు. మఱియు నింద్రియవిషయము; ఇంకను ఇచ్ఛాద్వేషములు. సుఖదుఃఖములు, చేతన(తెలివి) క్షేత్రావయవములను విడిపోనీయక పట్టియుంచు చేతనాశక్తి (=సంఘాతము)మఱియు ధృతి(=బాహ్యాభ్యంతర విషయాలతో చేతనా సంబంధములయొక్క స్థిరత)-ఇదిగో ఇదియు, దీని వికారము లును గలిసి సంక్షిప్తముగా క్షేత్ర మనబడును.

విశేషార్థము : అవ్యక్తము = అవ్యాకృతమగు అవ్యక్త శక్తి (energy). అవ్యాకృతమునకు ఒక దృష్టాంతము మట్టి; ఆ మట్టినుండి అవయవములతో నేర్పడిన కుండ వ్యాకృతము. ఈ అవ్యక్తమునుండియే విషయగత (objective) మహాభూతములును, విషయిగత అహంకార, బుద్ధి, ఇంద్రియములును పరిణామముద్వారా రూపొందును.

ఈ శరీరమే క్షేత్రము (13–2) – అని చెప్పబడియున్నది గదా. కాగా ఈ క్షేత్రమునందు అహంకారాదులును గలవు గాన, శరీర మన బాహ్యశరీరమేకాక, భౌతిక, ప్రాణిక, మానసిక, బౌద్ధిక, ఆనందమయ పంచకోశములు నని గ్రహించ దగును. వేఱు మాటలలో, ఏది సత్తయో, అది ఆత్మ, ఏదియు సంభూతియో, అది శరీరము. మఱియు క్షేత్రము వ్యష్టిగతము మాత్రమేకాక, సమష్టిగతమును, అనగా విశ్వాత్మకమును. ఏలన, సమస్త క్షేత్రములలో నున్నవాడు ఒకే క్షేత్రజ్ఞుడు (13–3).

పోతే, సుఖదుఃఖాదికమగు మనోధర్మము లన్నియు ఈ క్షేత్రముయొక్క వికారములు. ఒకే దివ్యానందము ప్రకృతి సంపర్కముచేత ప్రాణేంద్రియములందు సుఖదుఃఖవికారములను బొందును – అని శ్రీ అరవిందుడు.

క్షేత్రమునందు ప్రవేశించి, దానిని ఉద్భాసితము గావించు సామాన్యచేతన ఇచ్చటి 'చేతన' శర్థ మని శ్రీ అరవిందుడు చెప్పగా, అది అంతఃకరణమునందు ప్రతిబింబించిన చేతనాభాసము (చేతనయొక్క నీడ) – అని శ్రీ శంకరుడు.

అవతారిక : ఈ క్షేత్రము జ్ఞేయముయొక్క బాహ్యరూపము మాత్రమే. ఆ జ్ఞేయమును జెప్పదలంచి, దానికి సాధనమగు 'జ్ఞానము' నిపుడు చెప్పను —

అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవం,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః. 8

స్వాభిమాన రాహిత్యము, (తన గొప్పను ప్రకటించుకొను) దంభరాహిత్యము. అహింస, సహించి క్షమించుట,శుద్ధ వర్తనము, గురుభక్తి, బాహ్యాభ్యంతర పవిత్రత, ప్రశాంత స్థిరత్వము, ఆత్మసంయమము, మఱియు ప్రకృతినిగ్రహము –

విశేషార్థము : ఇది జ్ఞేయమునకు మొదటి మెట్టగు నైతిక నియమము, నిష్పక్షపాతయొక్క సాత్త్విక పాలనము.

అవతారిక : మఱియు —

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ,
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనం. 9

ఇంద్రియవిషయములగు శబ్దస్పర్శాదులయందు విరక్తి, అహంకారము లేకుండుట జననమరణములందును, జరావ్యాధుల యందును, తదితరదుఃఖము లందును గల అనర్థమును ఆలోచించుట —

అసక్తి రనభిష్వంగః పుత్రదార గృహాదిషు,
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు 10

పుత్రులు, భార్య, గృహాదులయందు ప్రీతి మఱియు బంధము లేకుండుట, ఇష్టానిష్ట ఘటనలపట్ల చిత్తమునందు సదా సమముగా నుండుట —

విశేషార్థము : 8-వ శ్లోకమునందు ప్రథమ సోపానమగు నైతికనిష్ఠను జెప్పి, 9, 10 — శ్లోకములందు అంతకంటెను ఉదాత్తము, స్వేచ్ఛాయుతము నగు అసక్తిని, సమతను జెప్పినారు.

మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్తదేశ సేవిత్వం అరతి ర్జనసంసది. 11

మఱియు నాయందు ఇతరమగు దేనిపైకిని వ్యభిచరించని అనన్య భక్తి యోగము, ఏకాంతవాసము, జనసమూహమునందు అప్రీతి —

అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనం,
ఏతజ్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం య దతోఽన్యథా. 12

ఆంతరమగు ఆధ్యాత్మిక జ్ఞానము మఱియు ప్రకాశములందు సదా నిలిచి యుండుట, చివరకు సృష్టిభావము మఱియు తత్త్వములయొక్క తాత్త్వికదర్శనము — ఇదిగో, దీని నంతను 'జ్ఞాన' మందురు, అటులే దీనికి విరుద్ధమగు దానిని అజ్ఞాన మందురు.

విశేషార్థము : 9, 10 — శ్లోకాలలో అసంగమును, సమతను జెప్పి, మిగిలిన 11, 12 — శ్లోకాలలో అసంగసమతల ఫలితమగు లోనికి దిరుగుటను చెప్పినారు — జీవితమునకు నిజముగా ముఖ్యమగు, సృష్టియొక్క లోని విశాలతత్త్వములు మఱియు భగవంతునివైపునకు మనస్సిపుడు తిరుగును.

తత్త్వజ్ఞాన మన ఆత్మజ్ఞానము, దాని 'అర్థ' మన మోక్షము -అని శ్రీశంకరుడు. తత్త్వజ్ఞాన మన సృష్టియొక్క యథార్థ జ్ఞానము, దీని 'అర్థ' మన ఎందుకు సృష్టి సృష్టింపబడినది - అను సృష్టియొక్క ఆశయము. ఈ ఆశయము మోక్షము గాదు, ఈ ఆశయము దివ్యజీవన - మని శ్రీ అరవిందుడు. మఱియు ఈ తత్త్వజ్ఞానమునకు బిమ్మట భగవంతునియందు అనన్యభక్తియని శ్లోకములందు గన్పించు క్రమమును శ్రీ అరవిందుడు మార్చి చెప్పును.

జ్ఞాన మన నిచ్చుట జ్ఞానసాధనము అని శ్రీ శంకరుడు మఱియు జ్ఞాననిబంధన అని శ్రీ అరవిందుడు. నిబంధన లన, ఇవి యున్నపుడే జ్ఞేయజ్ఞానము లభించును.

అవతారిక :: ఇపుడు జ్ఞానగమ్యమగు జ్ఞేయస్వరూపము -

**జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి యజ్ జ్ఞాత్వాఽమృత మశ్నుతే,**
**అనాదిమత్ పరం బ్రహ్మ న సత్ త న్నాస దుచ్యతే. 13**

ఇపుడు, అర్జునా, ఏది తెలియదగిన పరమవస్తువో, దేనిని తెలిసికొనిన మానవుడు అమృతత్వమును చూరగొనునో, దానిని నీకు దెలిపెదను. దేనికి ఆది లేదో, దేనిని సత్తు అని గాని, అసత్తు అని గాని, చెప్పుట సరిగాదో, ఏది ప్రపంచమునకు అతీతమో-'పరమో' - అట్టి బ్రహ్మయే జ్ఞేయము.

విశేషార్థము : ఏది విశ్వాతీతమో, అదే సమయమున ఏది విశ్వగతము మఱియు విశ్వమో-"సర్వం ఖల్విదం బ్రహ్మ" -అది బ్రహ్మము. దీని అర్థ మేమన ఇవి నా రూపములు, వీనికి నేను అతీతుడను, నేను ధరించిన ఈ రూపములు నశించుచున్నను, వీనితోబాటు నేను నశించుట లేదు నేను సనాతుడను, అమరుడను అను ప్రజ్ఞ బ్రహ్మకుండును. అదియే అమరత్వము; అంతే కాని, జననమరణ రాహిత్యము అమృతత్వముయొక్క పూర్ణార్థము కాదు - అని శ్రీ అరవిందుడు. ఈ అమృతత్వమే బ్రహ్మనిష్ఠుడగు జీవునకు ప్రాప్తించును. పోతే, జననమరణ రాహిత్యము లేనిదే అమృతత్వము సిద్ధించ దని శ్రీ శంకరుడు.

బ్రహ్మ సత్తు గాదు, అసత్తును గాదు : దీని అర్థ మేమి ? సత్తుకార్యావస్థ, ఉదాహరణకు, వృక్షము, అసత్తు కారణావస్థ, ఉదాహరణకు, వృక్షబీజము. బీజమునందు వృక్షము గన్పించదు గాన, వృక్షదృష్ట్యాబీజము నసత్తు అందుము. బ్రహ్మ ఇట్టి సత్తును గాదు, మఱియు అసత్తునుగాదు, అనగా బ్రహ్మము వీనికి అతీతమని శ్రీ అరవిందుడు. ఇవియు బ్రహ్మమే కాని బ్రహ్మము వీనికి పరిమితము గాదు. బ్రహ్మము వీనియందు వీనికి ఆధారముగాను, వీని వెనుక ఏకత్వముగాను ఉండును. పోతే, బ్రహ్మము ఇవి కానేకాదు, బ్రహ్మము 'నేతినేతి' యని శ్రీ శంకరుడు.

ఇక రెండవ అర్థ మేమన, అక్షరము సత్తు, క్షరము అసత్తు. బ్రహ్మము, అనగా 'పరబ్రహ్మము' ఈ క్షరాక్షరములకు అతీతము. క్షరాక్షరములు రెండును పరబ్రహ్మమునందు ఏకమగును. ఈ అర్థమును శ్రీ శంకరునికి సమ్మతము గాదు.

ఏలన ఆయనకు బ్రహ్మ మన అక్షరమే (8-3). నిజమే కాని, ఇచ్చట ప్రసక్త మైనది అక్షరబ్రహ్మముకాదు, ఉత్తమ (15-17) బ్రహ్మము, అనగా పరబ్రహ్మము - "పరం బ్రహ్మ" (13-13). అయితే శ్రీ శంకరునికి నిర్విశేషమగు అక్షరబ్రహ్మమే కలదు గాని, విశేషసహితమగు క్షరమునకు గూడ మూలమగు పరబ్రహ్మము లేదు. కావున శ్రేష్ఠతరమగు ఈ రెండవ అర్థమును గూడ ఆయన అంగీకరించరు.

ఈ రెండవ అర్థమున "పరం బ్రహ్మ", అనగా పురుషోత్తముడు బ్రహ్మము నకు గూడ పరుడు. అందుచేత బ్రహ్మము పురుషోత్తమపరము-"మత్పరం" (13-13). అపుడు తృతీయపాదమునందు పదవిచ్ఛేద మిట్లుండును: "అనాది, మత్పరం, బ్రహ్మ". కాని శ్రీ శంకరుడు, "అనాదిమత్, పరం బ్రహ్మ" - అని పదవిచ్ఛేదము చేయును; 'అనాదిమత్' - అనినపుడు మత్-ప్రత్యయము వ్యర్థ మగును, ఏలన, 'అనాది' - పదమే 'అనాదిమత్' పదముయొక్క అర్థమునిచ్చుటచేత. అయినను ఆయన ఇట్టి పదవిచ్ఛేదము నేల చేసె నన, అప్పుడు మాత్రమే బ్రహ్మ నిష్క్రియ, నిర్విశేష మనియు, బ్రహ్మపైన మఱేదియు లేదనియు అర్థము వచ్చును.

**సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షిశిరోముఖం,**
**సర్వతః శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి. 14**

మఱియు-ఆ బ్రహ్మమునకు అంతటను చేతులును, కాళ్లును గలవు, అటులే అంతటను నేత్రములు, శిరములు, ముఖములు గలవు. అంతటను చెవులు గలవు. అది లోకమునందు సర్వమును, (లోకమును) ఆవరించియుండును.

విశేషార్థము: శ్రీ శంకరు ననుసరించి బ్రహ్మమున కే క్రియయు నుండ గూడదు. కాని దాని లేక అతని నేత్రములు అంతటను గల వని చెప్పబడినది. అనగా చూచునది అదియే, నేత్రములు ఉపకరణముమాత్రము. మఱియు 'అంతటను'- అనుటవలన సర్వక్షేత్రములలోను చూచునది అది యొక్కటియే (13-3) - అని తేలును. ఇట్లు అది క్రియాతీత (13-3) పైనను, క్రియలోను, క్రియగానుగూడ నుండును. ఇట్టిది విశ్వాతీతమును, విశ్వగతమును, విశ్వమును.

పోతే, మన నేత్రములే బ్రహ్మకును నేత్రములా, లేక అతనికి నేత్రము లదనముగా గలవా? మనము చూడ లేనిది గూడ నతడు చూచును గాన, మఱియు జడములో సైతము అతనికి నేత్రములు గలవుగాన, అతనికి దివ్యచక్షువును(11-8) గల దని మన మెఱుంగవలెను. అతని చెవి కాలాతీత సత్తయొక్క మౌనమును (silence), లోకములయొక్క సంగీతమును - రెంటిని విను నని శ్రీ అరవిందుడు.

సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వర్జితం,
అసక్తం భూతభృచ్చైవ నిర్గుణం గుణభో క్తృచ. 15

మఱియు—బ్రహ్మ సర్వేంద్రియముల గుణములచేత భాసించును, అయినను అది సర్వేంద్రియరహితము. అటులే అది దేనియందును సక్తము గాదు, అయినను అది సర్వమును భరించును (9-5). అది ఏ గుణములచేతను పరిచ్ఛిన్నము గాదు, అయినను అది గుణముల (క్రియ) నుపభోగించును.

విశేషార్థము: ఇంద్రియవిషయములు. ఉదాహరణకు, శబ్దము: ఇదియు ఒక క్రియయే. భగవంతుని ప్రకృతియొక్క ఈ క్రియను దెలుపునది శ్రోత్రము. ఇట్లు ఇంద్రియములు భగవత్ ప్రకృతిని దెలుపు ఉపాయములు. ఇక భగవంతుడు స్వయముగా ఇట్టి ఇంద్రియములు విధించు పరిమితికి అతీతుడు. అతడు సర్వవస్తువులను జూచును, అయితే చర్మచక్షువుతో గాదు. అటులే సర్వవస్తువుల నెఱుంగును, అయితే పరిచ్ఛేదక మనస్సుతో గాదు. ఇట్లు ఇంద్రియగుణములు అతని ప్రకృతి క్రియను దెలుపును గాన, అతడు ఇంద్రియగుణములచే భాసించును - అని చెప్పబడినది, మఱియు నతడు చూచుట చర్మచక్షువుచే గాదు కనుక, అతడు ఇంద్రియ వర్జితు డని చెప్పబడినది: అని శ్రీ అరవిందుడు.

పోతే, సర్వేంద్రియగుణములను అనుకరించు శక్తి బ్రహ్మమున కున్నది. ఈ శక్తిచే, అతడు ఇంద్రియరహితుడైనను, రూపాదులను చూచును, కాదు చూచునట్లు కన్పించును—"ధ్యాయతీవ, లేలాయతీవ" [బృ. 4-3-7]- అని శ్రీ శంకరుడు. బ్రహ్మమునకు కనీస మీ శక్తి యున్న దని శ్రీ శంకరు డంగీకరించక తప్పలేదు. బ్రహ్మమునకు ఈ శక్తి గాని, ఆ శక్తి గాని ఉన్న దని చెప్పుటకు వీలు లేదు. బ్రహ్మము నిర్విశేషము—అని ఆయన మూలవాదము.

నిర్గుణుడు = గుణాతీతుడు; గుణభోక్త = గుణాతీతుడు గనుక, గుణములచే పరిచ్ఛిన్నుడు గాక, గుణవ్యాపారము నుపభోగించువాడు—అని శ్రీ అరవిందుడు. ఇక శ్రీ శంకరునికి, బ్రహ్మము గుణరహితము, ఆ బ్రహ్మము గుణములను భోగించుచున్నట్లు కేవలము గన్పించును.

బహిరంతశ్చ భూతానాం అచరం చరమేవచ,
సూక్ష్మత్వాత్ త దవిజ్ఞేయం దూరస్థం చాంతికేచ తత్. 16

మఱియు - ఆ బ్రహ్మము భూతములకు వెలుపలను, లోపలను గలదు. అంతే కాదు, చరాచర భూతము లన్నియు గూడ దానే అయినను అది సూక్ష్మ మగుటచేత మనస్సుచేత తెలియబడదు. అజ్ఞుల కది ఎంతో దూరము, కాని విజ్ఞుల కెంతో దగ్గర.

విశేషార్థము : త్రాడు తన ఆభాసమైన సర్ప మని చెప్పబడు నట్లే, బ్రహ్మమును చరాచరభూతము లని చెప్పబడు చున్నది-అని శ్రీ శంకరుడు. కాని, బ్రహ్మము తన శక్తిద్వారా స్వయముగా చరాచర భూతము లయ్యె-నని శ్రీ అరవిందుడు. అయినను దాని ఏకత్వమునకు ఎట్టి భంగము లేదు -

అవిభక్తం చ భూతేషు విభక్త మివచ స్థితం,
భూతభర్తృచ తజ్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ. 17

మఱియు-అది ఏకము మఱియు అవిభాజ్యము. కాని వేఱువేఱు భూతము లందు విభక్తముగా నున్నట్లు కన్పించును. అది సదా భూతములను తననుండియే పుట్టించుచు, వానిని తన సనాతన సత్తయందు ధరించుచు, తిరిగి తన ఏకతలోనికే స్వీకరించును.

విశేషార్థము : మన మందరము గుణమయ ప్రకృతినుండి వెనుకకు తగ్గి ఆత్మయందు మన ఏకత్వమును చూచుకొనగలము. అనుభవరీత్యా ఈ శ్లోకార్థ మిట్లు ప్రమాణితమగును. పోతే, తర్కరీత్యా ఏకమగు అక్షరుడును, అనేకమగు క్షరుడును రెండును ఏకకాలమున అయిన పురుషోత్తము డొక డున్నాడు (15-18). కనుక నతడు ఏకకాలమున విభక్తుడు మఱియు నవిభక్తుడు.

అయితే శ్రీ శంకరునికి ఆ పురుషోత్తముడు సిద్ధాంతరీత్యా లేడు. కనుక ఏకత్వము సత్యము కావలె ననిన, అనేకత్వ ముండరాదు. కనుక ఆయన ప్రపంచ మును ఆభాసము, అనగా మిథ్యారూప మగును. నిజానికి శంకరుని అద్వైతము అద్వైతము గాదు, అది ద్వైతము. ఏలన ఆయన మతమునందు ఆత్మ వేఱు, ప్రకృతి వేఱు ఆయన సిద్ధాంతమందు వీని సమన్వయము లేదు.

జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితం. 18

చివరకు,అదివెలుగులకు వెలుగు, మన అజ్ఞానాంధకారమున కావల సదా వెలుంగు చుండును గాన, అది 'తమసః పర' మని చెప్పబడును. అదియే జ్ఞానము, జ్ఞేయము,

అనగా జ్ఞానవిషయము మఱియు జ్ఞానముచేత బొందదగిన జ్ఞానఫలము ఇట్లు సర్వము నగు ఈ బ్రహ్మము ప్రతి ప్రాణి హృదయమునందును ప్రతిష్ఠితమై యున్నది.

విశేషార్థము : అది జ్యోతులకు జ్యోతి, అనగా మూలజ్యోతి. కనుక దానికి జ్యోతికి ప్రత్యర్థియగు నంధకారము లేదు అందుచేతనే తమస్సునకు పరము. ఈ పరంజ్యోతి ఒక్కటియే ప్రతి ప్రాణి హృదయమునందును వెలుగుచుండును, ఇదియే క్షేత్రమును తెలిసికొను క్షేత్రజ్ఞుడు (13-3).

జ్ఞానము = అమానిత్వాది జ్ఞానసాధనములు (13-12) - అని శ్రీ శంకరుడు. అవి జ్ఞానసాధనములు గాన, లక్షణార్థమును బట్టి, వానిని జ్ఞాన మనిరి గాని, నిజానికి అవి జ్ఞానము గావు, జ్ఞాన నిబంధనలు మాత్రమే - అని శ్రీ అరవిందుడు. పోతే, జ్ఞాన మన జ్యోతిరూపమున అభివ్యక్తమగుచున్న బ్రహ్మమే ఈ జ్ఞానజ్యోతియే శక్తికార్యములచేత నావరింపబడియున్న భగవదంశమగు అంతరాత్మకు తనను దాను వ్యక్తముచేసికొనును. అట్లు వ్యక్తచేసికొనుటకు ముందు ఆ జ్ఞానజ్యోతి తన కాంతి వెల్లువలో ప్రదీప్తమనస్సును ముంచెత్తి దానిని పరివర్తితము గావించును. ఈ జ్ఞానమే ఆధ్యాత్మిక అతిమానస జ్ఞానము - ఇట్లు శ్రీ అరవిందయోగమునందు సర్వ ప్రముఖమగు అతిమానస జ్ఞానము, దానివలన మాత్రమే సాధ్యమగు ప్రకృతి పరివర్తనము : ఈ రెండింటియొక్క ఉల్లేఖనము ఇచ్చట మనకు సూచనా ప్రాయముగా గన్పించును.

అవతారిక : భక్తివలన సమ్యగ్ జ్ఞానము—

**ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః,**
**మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే. 19**

ఇట్లు, అర్జునా, క్షేత్రము, జ్ఞానము మఱియు జ్ఞేయము నీకు సంక్షిప్తముగా చెప్పబడినవి. నా భక్తుడగు వాడీ సమగ్ర సత్యము నెఱింగి, నా స్థితిని బొందుట కర్హుడగును.

విశేషార్థము : తనలోపలనే యున్న భగవంతుని వీక్షించి, ఈ భగవంతుడే అందరిలోపలను ఉన్నాడని దర్శించి, ఈ భగవంతుడే ప్రకృతిని అనుప్రాణితము చేయుచున్న పురుష డని కనుగొని, ప్రకృతిసంభూతియగు ప్రపంచ మంతయు భగవంతుడను సనాతన సాగరమందు ఉద్భవించు ఒక తరంగ మనియు, ఉన్న సమస్తము ఒకే సత్త యనియు చూచుట జ్ఞానము. ఇట్లు చూచి, ఆరాధనాభావముతో

ఆ భగవంతుని వైపునకు సర్వాత్మనా తిరుగుట భక్తి. జ్ఞానపూర్వకమగు నీ పరిపూర్ణ (perfect) భక్తి మనలను మర్త్య ప్రకృతినుండి అమర సత్తలోనికి లేవనెత్తును. అపుడు ప్రపంచకల్లోలము మధ్య సైతము మనము విముక్తులమై, ప్రభువులమై విలసింతుము (13-24) ఇదియే మద్భావమును - భగవద్భావమును - బొందుట యన నర్థము - అని శ్రీ అరవిందుడు.

పై వివరణమునందు మఱియొక మెట్టును ప్రవేశపెట్టిన విషయము మఱింత విశదమగును: జ్ఞానమువలన భక్తి భక్తివలన సమ్యగ్జ్ఞానము, సమ్యగ్జ్ఞానమువలన పరిపూర్ణ భక్తి. ఈ పరిపూర్ణ భక్తియొక్క స్వరూపము ఆత్మసమర్పణము. ఇట్టి సర్వసమర్పణాత్మకమగు పరిపూర్ణ భక్తిచేత భగవద్భావప్రాప్తి (18-55).

ఇచ్చట శంకరుడును భక్తిని భవ్యముగా వర్ణించును: సర్వజ్ఞుడు, పరమ గురువు, ఈశ్వరుడు నగు వాసుదేవునియందు సర్వాత్మ సమర్పణము భక్తి. దేనిని చూచునో, దేనిని వినునో, దేనిని స్పృశించునో, అది అంతయు వాసుదేవుడే యను బుద్ధి ఎవనిని గ్రహమువలె ఆవేశించునో, అతడు భక్తుడు. అట్టి భక్తుడు పరమాత్మ భావమును బొందును. ఇంతవఱకు దివ్యముగనే యున్నది. కాని పరమాత్మ భావ మన మోక్ష మని శ్రీ శంకరుడు చెప్పును. ఇక శ్రీ శంకరుని దృష్టిలో మోక్షము నిష్క్రియ, నీరవ, నిర్విశేషము: ఇట్లు ఆ భవ్యభక్తి సైతము మోక్షపర్యంతమే. మోక్షమునందు, ఆయన తర్కమును బట్టి, భగవంతుడును లేడు, భక్తుడును లేడు:

అవతారిక: పరాపర ప్రకృతులు రెండును గలిసి జగత్కారణము (7-6) - అని పూర్వము చెప్పబడినది అవి తమ వ్యక్తరూపములగు క్షేత్రజ్ఞ, క్షేత్రముల ద్వారా ఎట్లు జగత్కారణమో ఇపుడు వివరించబడును.

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. 20

ప్రకృతిపురుషు లిరువురికిని ఆది లేదు, వారు నిత్యము-అని, అర్జునా, నీ వెఱుంగుము. మఱియు బుద్ధ్యాదులగు వికారములును, సత్త్వాదులగు గుణములును ప్రకృతినుండి పుట్టినవి-అని ఎఱుంగుము.

విశేషార్థము; ప్రకృతినుండి పుట్టిన వికారములు సంతతము మాఱుచుండును అవి క్షరములు, క్షణికములు అవి మాఱుచున్నపుడు; వానితోబాటు ప్రకృతిపురుషులు

గూడ మాఱుచున్నట్లు గన్పించును. ఈ కన్పించుటకు గారణము అవిద్య. ఈ అవిద్య లక్షణము ఆ వికారములతో తాదాత్మ్యము.

అవతారిక ; పైన ప్రస్తావించబడిన వికారము లెవ్వి యన –

**కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే,**
**పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే. 21**

కార్యములగు శరీరాదులను, కరణములగు బుద్ధీంద్రియాదులను ప్రకృతి సృజించును. కాగా పురుషుడు ప్రకృతి సృష్టి ననుభవించుచు, సుఖదుఃఖములను బొందును.

విశేషార్థము : ప్రకృతిపురుషుని భోగముకొఱకు కార్యకరణములనుసృజించును కాని గుణభూమికయందలి తన నిమ్న క్రియయందు ఆమె ఆభోగమును అప్రకాశము క్షుద్రము నగు సుఖదుఃఖరూపములలోనికి మార్చును. ఆనందము నిమ్నప్రకృతి యందు పురుషునకు సుఖదుఃఖరూపమున అనుభూతమగును. ఆ ఆనందము ఊర్ధ్వ భూమికయందు ప్రకాశమయము, విశాలము నగు ఆనందముగనే అనుభూతమగును. ఇట్లు భోగ మంతయు సంసారహేతువు గాదు, నిమ్న భోగము మాత్రమే. నిమ్న ప్రకృతిలో నుండి పర ప్రకృతిలోని కెగసి నపుడు, జీవనము బంధకారణము గాక, ఆనందసంధాయకము, లీలామయము నగును ఇది శ్రీ అరవిందదర్శనములోని ఒక పరమ విశేషము.

అవతారిక : పురుషునికి భోగ మెందుచేత సంసారహేతు వన –

**పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్,**
**కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు. 22**

పురుషుడు ప్రకృతియందు స్థితుడై ప్రకృతినుండి పుట్టిన గుణవికారముల నుపభోగించును. ఈ ఉపభోగమువలన గలుగు గుణసంగమే ఆతడు మంచి మఱియు చెడు జన్మ నెత్తుటకు గారణము.

విశేషార్థము: 'ప్రకృతిస్థః'=ప్రకృతియందు స్థితుడు, ప్రకృతితో తాదాత్మ్యము జెందినవాడు, నేను ప్రకృతి ననుకొనువాడు. ఇట్టి ప్రకృతిస్థత్వమే అవిద్య, దీనివలన సంగము, సంగమువలన కామము, కామమువలన తదనుగుణ కర్మ, కర్మవలన తదనురూప జన్మ – అని శ్రీ శంకరుడు, దీని కాక్షేపణ లేదు.

కాని భగవంతునివలె జీవుడును ప్రకృతిస్థుడయ్యును, ప్రకృతి కతీతముగా నదే సమయమునం దుండవచ్చును. అనగా నతడు ఏకకాలమున క్షరుడును, అక్షరుడును గావచ్చును. అప్పు డతడు ప్రకృతిలో మునిగిపోకయే, ప్రకృతి ననుభవించ వచ్చును. ఇట్టియెడ నేను ప్రకృతి నను అవిద్యయయు నుండదు, గుణసంగము నుండదు, కామము నుండదు. భగవదిచ్ఛ ననుసరించి కర్మయుండును, దివ్యభోగ ముండును ఈ కర్మ, భోగములు జన్మకారణములు గావు (13-24).

దేహమునందలి పురుషుడు క్షరప్రకృతితో తాదాత్మ్యమువలన భావనయందు తనను క్షరుడుగా నూహించుకొనును. ఈ శ్లోకమునందలి అనుభవము అతని బాహ్యానుభవము. కాగా దేహమునందే గల పరమపురుషుని అనుభవమును జూతము-

**ఉపద్రష్టాఽనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః,**
**పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః. 23**

పరాత్పరుడగు పరమ పురుషుడే ఈ దేహమునందు - "హృదయమునందు" (13-18) - అవస్థితుడై యున్నాడు. అతడే పరమాత్మ (15-17), అతడే ప్రకృతిని శాసించు మహేశ్వరుడు (5-29); ఈ మహేశ్వరుడే ప్రకృతిక్రియను కనిపెట్టియుండు ఉపద్రష్ట, ఆమె కార్యములను అనుమతించు అనుమంత, ఆమె కర్మనంతను ధరించియుండు భర్త, మఱియు నామె లీలను అనుభవించు భోక్త.

విశేషార్థము : దేహమునందలి పురుషుని భోక్తృత్వము అవిద్యాలక్షణము, గుణాధీనము మఱియు జన్మకారణము (13-22). కాని దేహమునందలి పరమ పురుషుని భోక్తృత్వము విద్యామయము, గుణాతీతము మఱియు సర్వస్వతంత్రము. ఈ పరమపురుషుని జ్ఞానము లభించినపుడు, పురుషుడు , అనగా క్షేత్రజ్ఞుడు లేక జీవుడు, తాను అభివ్యక్తియందు పరమపురుషునియొక్క ఒక అంశము (15-7)-అని ఎఱుంగును. అప్పు డతడు పరమపురుషునితో సాయుజ్యమును సాధించి, అతనివలెనే స్వతంత్రభోక్త యగును, (13-24) ప్రకృతికి అధీశ్వరుడగును -- అని శ్రీ అరవిందుడు.

పోతే, శ్రీ శంకరు డీ శ్లోకము నంతను నిష్క్రియాత్మపరముగా వ్యాఖ్యానించును. తటస్థమగు ఈ ఆత్మ ప్రకృతిక్రియను అడ్డుపెట్టదు గాన, దాని అనుమంత అయినట్లు గన్పించును. అట్లే బుద్ధియొక్క సుఖదుఃఖమోహములు ఆత్మ చైతన్యగ్రస్తములైనట్లు గన్పించును, గాన,ఆత్మ వాని భోక్త యనబడును. అటులే

సర్వాత్మత్వముచేతను, స్వతంత్రత్వముచేతను ఆత్మ మహేశ్వరు డనబడును. ఇచ్చట ప్రకృతిక్రియను అనుమతించుటగాని, శాసించుట గాని భోగించుటగాని, శంకరు ననుసరించి, నిజానికి లేనేలేదు ; ఇది ఎంత పేలవముగా నున్నది !

ఎందుచేత ఆయన నిష్క్రియాత్మపరముగా వ్యాఖ్యానించెను ? శ్లోకమునందు "పురుషః పరః" అని యుండనే ఉన్నది గదా, కనుక ఈ శ్లోకమును ఆత్మపరముగా గాక, ఈ పరమపురుషుని పరముగా వ్యాఖ్యానించవలసియున్నది గదా, మఱియు పరమ పురుషుని పరముగా వ్యాఖ్యానించిన, అపుడు 'అనుమంత', 'భోక్త' 'మహేశ్వరుడు' ఈ పదములకు స్పష్టార్థము సరిపోవును గదా ? అవును, సరిపోవును, చేయవలసినది కూడ అదియే. కాగా ఆయన పేలవ వ్యాఖ్యానమునకు గారణ మేమన, సిద్ధాంత రీత్యా ఆత్మయే ఆయనకు చరమ తత్త్వము, దానిపైన పరమ పురుష డను వా డెవ్వడును లేడు ;

పైగా శ్రీ శంకరునికి, పురుషుడు, పరమపురుషుడు – అని వాస్తవముగా ఇరువురు లేరు. పరమ పురుష డన ఆత్మయే మఱియు పురుషుని, అనగా జీవుని అస్తిత్వము జ్ఞానము కలుగనంతవఱకే. జ్ఞానమునందు జీవుడు ఉండనే ఉండడు. కాని "జ్ఞానమునందు జీవుడు ప్రకృతియందు గాక, నా యందే నివసించును" (12-8), "ఎట్లు వర్తించినను...." (13-24) – అను గీతావాక్యములకు శ్రీ శంకరు డేమి సమాధానము చెప్పును ?

అవతారిక : దేహము నందలి ఈ పరమపురుష నెఱింగి నపుడు –

యఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైః సహ,
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభి జాయతే. 24

ఏ జీవు డిట్లు పురుషుని మఱియు గుణసహితముగా ప్రకృతిని ఎఱుంగునో, అతడు ఎట్లు వర్తించినను తిరిగి జన్మించడు.

విశేషార్థము : "తిరిగి జన్మించడు", అనగా అతనికి మఱియొక శరీర మేర్పడదు, అతడు దానిని స్వీకరించడు – అని శ్రీ శంకరుడు. పోతే, "తిరిగి జన్మించడు", అనగా ఆ జీవు డే శరీరమును ధరించినను, అత డిక జన్మబద్ధుడు గాడు–అని శ్రీ అరవిందుడు. ఏలన, అతడు ఏ దేహమునందు ఎట్టి వ్యక్తిత్వమును ధరించినను, నిర్వ్యక్తికమగు ఆత్మద్వారా ఇప్ప డతడు అజుడగు (4-6) లోని మహేశ్వరునితో ఏకముగా నున్నాడు. శ్రీ అరవిందుని ఈ వ్యాఖ్య శబ్దార్థమునకు

కొంచెము దూరముగా నున్నను, 'ఎట్లు వర్తించినను'-అను సందర్భము ఈవ్యాఖ్యనే సమర్థించును. మఱియు (12-8), (6-31) శ్లోకములు దీనినే పోషించును.

అవతారిక : పరమ పురుషు నెఱుంగుటకు ఉపాయములు —

ధ్యానే నాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా,
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. 25

కొందరు తమ స్వీయసత్తయందే ఆత్మను ఆత్మప్రకాశముచేతనే కనుగొందురు. ఇతరులు సాంఖ్యయోగముచేతను, అపరులు కర్మయోగముచేతను ఆత్మను దర్శింతురు.

విశేషార్థము : చేతనయందు కల్లోలమే ఆత్మను మఱుగుపఱచు ఆవరణము. ధ్యానమునందు ఈ కల్లోలము శాంతించగా, ఆత్మ మనలోనే, స్వయముగనే వ్యక్తమగును పోతే, ప్రకృతిపురుష వివేచన సాంఖ్యయోగము. కర్మయోగమున, అనగా కర్మచేత యోగమున, మనము మన మనోహృదయములను, మన సకల సక్రియ శక్తులను ఈశ్వరునికి తెఱచియుంతుము. ఇట్టి ఉన్మీలనముద్వారా మన కర్మేచ్ఛ ఈశ్వరేచ్ఛతో ఏకమగును. అపుడు ఈశ్వరుడే మన కర్మ నంతను చేపట్టును (3-30) ఇచ్ఛతో బాటు పిమ్మట మన సర్వసత్తయు ఆ ఈశ్వరునితో ఏకమగును. ఇదియే కర్మయోగము.

కర్మయోగమునకు శ్రీ శంకరుడు చమత్కారార్థమును జెప్పును. కర్మ యోగము = కర్మచేత యోగము - అను సూటి అర్థము ఆయనకు పనికిరాదు. ఏలన కర్మ అవిద్యాలక్షణము. అయన చెప్పిన దేమన యోగము = ఘటనము-అని అర్థము చెప్పి, ఇచ్చట యోగ మన కర్మయే యనును. కనుక, కర్మయోగము = కర్మయే. ఇదియే ఆయన చమత్కారము. కర్మయే యగు కర్మయోగముచేత,అనగా కర్మచేత చిత్తశుద్ధి, చిత్తశుద్ధిచేత జ్ఞానోత్పత్తి, కర్మ జ్ఞానమునకు విరుద్ధము గాన, జ్ఞానమునందు కర్మసన్యాసము, చివరకు సన్యాసముచేత లయరూపమగు మోక్షము.

అన్యే త్వేవ మజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే,
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. 26

పోతే, ఈ యోగములను గుఱించి స్వయముగా దెలియు ఇతరులు అన్యుల నుండి విని, తదనుగుణముగా సాధనచేతురు. వినినదాని ననుసరించి తమ మనస్సును మలచుకొను వారును మృత్యువును తప్పక దాటి అమృతత్వములోని కడుగిడుదురు.

అవతారిక : ఇపుడు జగదుత్పత్తి ప్రక్రియను సూత్రప్రాయముగా జెప్పి, జగత్తునం దున్నను, దాని కతీతముగా నెట్లు జీవించగలమో, ఆ జ్ఞానమును మఱల కొన్ని శ్లోకములలో వివరించును —

యావత్ సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజంగమం,
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ తద్విద్ధి భరతర్షభ. 27

చరము గాని, అచరము గాని, ఏ యే వస్తువు పుట్టుచున్నదో, అర్జునా, అది యంతయు క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగముచేతనే యని తెలిసికొనుము.

విశేషార్థము : శరీరము కూడ క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగముచేతనే కలుగు చున్నది గాన, జన్మరాహిత్యమునకు, క్షేత్రజ్ఞుని ఈశ్వరునిలో లయముచేయవలెను, అపుడే మోక్షము—అని శ్రీ శంకరుడు. అట్లు కానవసరము లేదని శ్రీ అరవిందుడు. అమరము, అతీతము నగు ఈశ్వరుని యందు నెలకొని, మనము ప్రకృతియందు జీవించవచ్చును. అపుడు జన్మ మనలను బాధించదు. ఒకవేళ మనము జన్మ రాహిత్యము నపేక్షించినను, అట్లు ఈశ్వరునియందు నెలకొని నపుడు, మనము స్వతంత్రులము గాన, జన్మించకను యుండగలము. ఈ జ్ఞానమునే తర్వాతి శ్లోకములు మనకు బోధించు—నని శ్రీ అరవిందుడు.

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం,
వినశ్య త్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి. 28

సర్వభూతములయందును సమముగానుండి వాని శరీరములు నశించు నపుడు నశించనట్టి ఈశ్వరు నెవడు చూచునో, వాడే యథార్థమును చూచినవాడు.

విశేషార్థము : మనలో నేది నిత్యము మఱియు అమరమో, దానిని చూచు నదియే నిజమైన చూపు. ఇట్లు నిజానికి నేను నిత్యుడను గనుక, శరీరమును ధరించి నపుడు సైతము జన్మించని వాడనే. అనగా నే నెపుడును జన్మరహితుడనే అయినపుడు బాహ్యజన్మరాహిత్యము నా కెందుకు అవసరము గావలెను ?

అవతారిక : సమముగ పరమాత్మను జూచుటకు ఫలము —

సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం,
న హిన స్త్యాత్మ నాత్మానం తతో యాతి పరాం గతిం. 29

సర్వభూతములయందు సమముగా. స్థిరముగా నున్నట్టి ఈశ్వరుని దర్శించుట చేత మానవుడు తనను దాను హింసించుకొనడు, మఱియు నట్లు హింసించుకొనక, పరమ గతిని బొందును.

విశేషార్థము : సమమగు ఈశ్వరుని జూచి, అతని సమత్వములో నడుగిడుదుము, పిమ్మట సర్వము నగు అతనియందు నెలకొని, మనమును సర్వాత్మకుల మగుదుము. అపుడిక మన మానసిక మఱియు శారీరక అజ్ఞానము కల్పించు పరిమితులు మఱియు పీడలతో తాదాత్మ్యము జెందము, అనగా మనలను మనమే హింసించుకొనము. కనుక పరమ గతిని బొందుట యను మాటయందు శరీరము లేకపోవుటయను అర్థము లేదు. శరీరమాత్రముతో తాదాత్మ్యమును లేదు, అంతియే.

అవతారిక : పోతే, ఆ పరమ గతియందు కర్మల మాటేమిటి?

ప్రకృత్యైవచ కర్మాణి క్రియమాణాని సర్వశః,
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి.      30

సర్వవిధ కర్మలు ప్రకృతిచేతనే చేయబడుచున్న వనియు, ఆత్మ అకర్త యనియు ఎవడు చూచునో, వాడే నిజమును జూచువాడు.

విశేషార్థము : శరీరాదికమగు ప్రకృతితో తాదాత్మ్యము జెంద నపుడు, సర్వకర్మలు ప్రకృతియొక్క పరిణామము మఱియు వ్యాపార మనియు, మన వాస్తవ ఆత్మ నిర్వాహక (executive) కర్త గాదనియు, కాని అది ప్రకృతి క్రియయొక్క విముక్త సాక్షి, పరమ ఈశ్వరుడు మఱియు అసక్త భోక్త (13-23) యనియు కనుగొందుము.

ఈశ్వరుడు కర్మను సంకల్పించును, అతడు కర్మకు ఆరంభకర్త. ఈశ్వర ప్రకృతి ఆ కర్మను నిర్వహించును, ప్రకృతి నిర్వాహక కర్త.

ఈ శ్లోకమునందు గీత దేనిని ఆత్మ యనుచున్నదో, దానినే 32-వ శ్లోకమునందు పరమాత్మ యనుచున్నది, 28-వ శ్లోకమున ఈశ్వరు డనుచున్నది, మఱియు 23-వ శ్లోకమున పరమపురుషుడు, పరమాత్మ. మహేశ్వరుడు ననుచున్నది. కావున ఇచ్చట ప్రసక్తమైన ఆత్మ కేవల అక్షరాత్మ గాదని మనము తెలియవలెను. కేవల అక్షరాత్మయే యగుచో, దానికి భోక్తృత్వము గాని, ఈశ్వరత్వము గాని, ఆరంభ కర్తృత్వమైనను గాని యుండదు.

అవతారిక : అయితే ప్రకృతికిని, ఆత్మకును సంబంధమే లేదా?

యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి,
తత ఏవచ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా. 31

పైకి గన్పించు భూతముల వేఱువేఱుతనమేది గలదో, అది తన మూలమగు ఏకాత్మయందు ఏకముగానున్న దనియు, ఆ ఏకతనుండియే ఈ వైవిధ్యము విస్తరించు చున్న దనియు ఎవ డెపుడు గురు శాస్త్రముల ననుసరించి దర్శించునో, అత డపుడు బ్రహ్మ మగును.

విశేషార్థము : ఆత్మనుండియే ప్రపంచవైవిధ్యము వెలువడుచున్నపుడు, ఆ వైవిధ్యము లేక అనేకత్వమునకు ఆత్మయొక్క ఏకతయే ఆధారముగా నున్నపుడు, ఆత్మ సత్యము, ప్రపంచము మిథ్య యని చెప్పుట ఎట్లు సమంజసమగును? పైగా కర్మరూపమగు ప్రపంచప్రవాహము ఆత్మనుండి వెలువడి, తిరిగి ఆత్మలోనికే ప్రవహించు నపుడు, ఆ కర్మ ననుసరించి మనము ఆత్మ నెందుకు జేరుకొనలేము? కర్మ ఆత్మయోగమునకు ప్రతిబంధక మని ఎట్లు చెప్పగలము?—అని శ్రీ అరవిందుడు ప్రశ్నించును.

అవతారిక : ఇట్లు ఆత్మయే సర్వము నైనపుడు, అది దేనిని ఎందుచేత నంటుట లేదు?

అనాదిత్వా న్నిర్గుణత్వాత్ పరమాత్మాఽయ మవ్యయః,
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే. 32

పరమాత్మ మన శరీరమునందుండి ప్రకృతి కర్మలను స్వీకరించి అనుభవించు చున్నను, అది అవ్యయమే, ఏలన అది అనాది, అనగా నది జననమరణములకు అతీతము, కావున శరీరమరణము దానిని స్పృశింపదు, అటులే అది గుణముల యందు మార్పులచేత మార్పుజెందదు; ఏలన అది గుణములచేత నిర్ణయింపబడునది (determined) కాదు. మఱియు చేయుచున్నను చేయనిదే (4-13), ఏలన కర్మ ఫలితము లేమియు నంటని (4-14) ఒక పరిపూర్ణ ఆధ్యాత్మిక స్వేచ్ఛయందు అది కర్మలను ధరించియుండును. చివరకు, కర్మల నారంభించునది అదియే యైనను, వానిని నిర్వహించు తన ప్రకృతివ్యాపారముచేత నది ప్రభావితము కాదు; ఏలన అది తన గుణమయ ప్రకృతికి పరమునందుండును.

విశేషార్థము: నిర్గుణము = గుణములు లేనిది-అని శ్రీశంకరుడు. నిర్గుణము = గుణములకు అతీతమైనది-అని శ్రీఅరవిందుడు. అనగా పరమాత్మనుండియే గుణమయ ప్రకృతి వెలువడును, అయినను పరమాత్మ గుణమయ ప్రకృతి స్తరమునకు పై స్తరమునం దుండును గాన, అది అతీతము. అందుచేత నది గుణములచేత పరిచ్ఛిన్నము గాదు, గుణములు దానిని గీటిగీచి నిర్ణయించవు, గుణములమార్పుల చేత నది మాఱదు, కావుననే అది అవ్యయము. ఇట్లు గుణాతీతము గావున, పరమాత్మ అవ్యయము - అని శ్రీ అరవిందుడుచెప్పగా, గుణరహితము అందుచేత అవ్యయము - అని శ్రీ శంకరుడు చెప్పును. కారణము, ఆయనకు గుణమూలము గుణాతీతమునగు పరమాత్మలేదు, గుణరహితమగు ఆత్మయే సర్వోన్నత తత్త్వము,

పరమాత్మ చేయదు, అంటదు (లిప్తము గాదు) (13-32), మఱియు క్షేత్రజ్ఞుడు పరమాత్మయే (13-3). కనుక క్షేత్రజ్ఞుడును చేయడు, అంటడు. మంచిది, అయితే చేయునది, అంటునది ఏది? అది స్వభావము - "స్వభావస్తు ప్రవర్తతే" (5-14) అయితే స్వభావ మన నేమి? స్వభావము అవిద్యామాత్రము, అవిద్యకంటె నది మఱేమియు గాదు. చేయునది, అంటునది అదియే. నిజానికి ఏకమాత్ర పరమాత్మయందు ఈ స్వభావము లేదు. కనుక అది చేయును మఱియు అంటును - అనునది పరమార్థ భూమికయందు గాక, వ్యవహారభూమికయందు మాత్రమే కలదు. కావున జ్ఞాననిష్ఠులగు పరమహంస పరివ్రాజకులకు కర్మాధికార మును లేదు, కర్మలును లేవు - అని శ్రీ శంకరుడు.

పోతే, స్వభావము అవిద్యామాత్రము గాదు. స్వభావము = స్వ + భావము, పరమాత్మయొక్క భావము, పరమాత్మయొక్క సంభూతి (becoming) - అని శ్రీ అరవిందుడు. ఇది భగవదంశమే (15-7), ఇది క్షేత్రజ్ఞుడే-"స్వభావోఽధ్యాత్మ ముచ్యతే" (8-3). ఇది వికాసశీలము, అనగా అజ్ఞానమునుండి జ్ఞానములోనికి వికసించును. శ్రీ శంకరుడు వాదించునట్లు ఈ స్వభావము లేక క్షేత్రజుడు జ్ఞానోదయము నందు అదృశ్యము గాదు. అజ్ఞానమునందు కర్మలు తనవి, అనగా అహంకారముగా నున్న తనవి, అనుకొనును. పోతే జ్ఞానమునందు కర్మలు తన మూలమగు ఈశ్వరునివి-అని ఎఱింగి తాను చేయుచునే చేయనివాడగును, అందుచేతనే కర్మలను గాని, కర్మఫలములను గాని అంటడు - అని శ్రీ అరవిందుడు వివరించును. మఱియు పరమాత్మ కేవల ఏకము గాదు, అది బహుళ ఏకము. అనగా, అది ఏకముగా నున్న అనేకము, అనేకముగా నున్న ఏకము.

అవతారిక : ఉపమానముద్వారా అంటకపోవుటను విశదముచేయును —

యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే,
సర్వ త్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే. 33

సర్వత్ర వ్యాపించియున్న ఆకాశము, తాను మిగుల సూక్ష్మ మగుటచేత ఎట్లు దేనిని అంటదో, అటులే దేహమునం దంతటను అవస్థితమైయున్న ఆత్మ దేహముయొక్క గుణదోషముల నంటుట లేదు.

విశేషార్థము : ఆకాశమునుండియే తక్కిన భూతములు ఉత్పన్న మగును. ఇట్లు సర్వరూపములను ధరించునది ఆకాశమే. అయినను అది తాను ధరించిన రూపముల నంటదు; అంటక, తన విశుద్ధ సూక్ష్మ మూలవస్తువుగనే యుండును-అని శ్రీ అరవిందుడు. సామాన్యముగా ఆకాశమే ఈ రూపముల నన్నింటిని ధరించునని మనకు దెలియదు. ఈ మాటను చెప్పి నపుడే దృష్టాంతమునకు పూర్తి విలువ వచ్చును.

శ్రీ శంకరుడు, ఆత్మ శరీరమునందు ఉపలబ్ధమగును గావున, అది శరీరము నందు ఉన్నదని చెప్పుదుము-అని తెలుపును. కాని శ్రీ అరవిందుని బట్టి, ఆత్మకును శరీరమునకును గల సంబంధ మది మాత్రమే కాదు, తననుండియే వచ్చిన శరీరము నందు తాను (ఆత్మ) యున్నది. అయినను తనకును, తన ఉత్పత్తికిని గల సూక్ష్మతా భేదముచేత ఆత్మ శరీరము నంటదు. వేఱుమాటలలో ఆత్మ శరీరమునకు పరము (అతీతము) అగుటచేత దాని నంటుట లేదు.

యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత. 34

ఎట్లు ఒకే సూర్యుడు లోకము నంతను ప్రకాశింపజేయుచున్నాడో, అటులే, అర్జునా, క్షేత్రియగు లోని పరమాత్మ సమస్త క్షేత్రమును ప్రకాశింపజేయుచున్నది.

విశేషార్థము : క్షేత్రికిని, క్షేత్రజ్ఞునకును మన మించుక భేదమును జెప్ప కొనవచ్చును-ప్రతిక్షేత్రమునకును ఒక క్షేత్రజ్ఞుడు, అయితే ఆ క్షేత్రజ్ఞులందరు ఒకే క్షేత్రియగు పరమాత్మ.

మనము లోని పరమాత్మ వైపునకు దిరిగి నపుడు, ఆ పరమాత్మ-సూర్యుడు సమస్త క్షేత్రమును ప్రకాశింప జేయగా, ఆ ప్రకాశమునందు మన జ్ఞాననేత్రము

తెలిసికొనును. అపుడు మనము ఈ ప్రకృతి - అజ్ఞానమందు గాక, ఆ పరమాత్మ సత్యమునందు నివసింతుము-అని శ్రీ అరవిందుడు.

అవతారిక : ఉపసంహారమునందు జ్ఞానఫలమును జెప్పును -

క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞాన చక్షుసా,
భూతప్రకృతి మోక్షంచ యే విదు ర్యాంతి తే పరం. 35

క్షేత్రమునకును, క్షేత్రజ్ఞునకును గల భేదము నిట్లు జ్ఞానచక్షువుచే నెవరు కనుగొందురో మఱియు నా వివేచన జ్ఞానముచే భూతముల నిమ్న ప్రకృతినియమము నుండి విముక్తులగుదురో, వారు పరమ పదము నందుదురు.

విశేషార్థము : 'భూతప్రకృతిమోక్షము' = అజ్ఞానమునందు మనలను వేధించు ప్రకృతి ఏది గలదో, జ్ఞానమునందు దాని అభావము, అది లేకనేపోవుట (నెవ డెఱుంగునో....) - అని శ్రీ శంకరుడు. పోతే, 'భూతప్రకృతిమోక్షము' = భూతముల నిమ్న ప్రకృతినియమమునుండి మోక్షము, ముక్తి - అని శ్రీ అరవిందుడు. ఇచ్చట ప్రకృతియే అదృశ్యము గాదు, ప్రకృతి కల్పించు పరిమితినుండియు, బంధనమునుండియు జ్ఞాని ముక్తుడగును. మఱియు ముక్తుడై, 'పరము' ననగా పరప్రకృతి నందును.

పరప్రకృతి నందుటయను ఈ భాసుర మఱియు సమున్నత పరివర్తనమే చరమపరివర్తనము. ఇది భగవంతుని దివ్య మఱియు అనంతభావము(becoming) "మద్భావః" (13-19): ఇది మర్త్యప్రకృతిని త్యజించి, అమరజీవనమును స్వీకరించుట.

మర్త్యప్రకృతిని త్యజించుట యన, దానినుండి పైకెగసి, పరప్రకృతియందు నెలకొనుట యని అర్థము. అపుడు మర్త్యప్రకృతియు పరప్రకృతిసంపర్కము చేతను, క్రియచేతను స్వయముగా అజ్ఞానమునుండి ముక్తమై దివ్యమగును, దివ్యలీల కుపకరించును. నిజానికిదియే చరమ పరివర్తనము, ఈ ప్రకృతిపరివర్తనమే శ్రీ అరవిందుని కార్యమునకు చరమ లక్ష్యము.

కనుక 'భూతప్రకృతిమోక్ష' మన, 1. భూతముల నిమ్నప్రకృతినుండి అంతరాత్మయొక్క మోక్షము, 2. తన అజ్ఞానమునుండి స్వయముగా భూతముల నిమ్నప్రకృతియొక్క మోక్షము.

అజ్ఞానమునుండి బాహ్యప్రకృతి ఇట్లు ముక్తమైనపుడు, ఇపుడు నిగూఢముగా హృదయమునం దున్న పరమపురుషుడు, బాహ్యప్రకృతియందును ప్రస్ఫుటముగా గన్పించును, అతనితో అంతరాత్మ ఏకతయు అవిచ్ఛిన్నముగా నుపలబ్ధమగును. కావున శ్రీ శంకరుడు పదేపదే చెప్పు దేహరాహిత్యము అవసరమే లేకపోవును.

శ్రీ శంకరసంప్రదాయమున అజ్ఞానబద్ధమైన నిమ్నప్రకృతిని తన గతికి విడిచి వేసి, సాధకుడు అక్షరాత్మలో లీనమగును. కనుక ఈ ముక్తి వలన ప్రపంచమున కే మేలును గలుగదు, పైగా ప్రతి మహాపురుషుడు ఇట్లు ముక్తుడైనపుడు, అతని ఆధ్యాత్మిక ప్రభావమును గోల్పోయి, ప్రపంచము మఱింత పేదవడును – అని శ్రీ అరవిందుడు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే

## క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగో నామ త్రయోదశోఽధ్యాయః





# శ్రీ గీ తా యో గ ము

## అథ చతుర్దశో౽ధ్యాయః

## గుణత్రయ విభాగ యోగః

ఒక పరిశీలన : "అర్జునా! నీ కిపుడు ఏది జ్ఞేయమో, దానిని జెప్పెదను. దాని నెఱింగిన నీవు "అమృతత్వము ననుభవించెదవు,"(13-13)-అని భగవానుడు ప్రతిజ్ఞ జేసెను. అయితే అధ్యాయాంతమున, "క్షేత్రమునకును, క్షేత్రజ్ఞునకును గల విభేదము ని న్నెఱింగి నపుడు, గుణమయమగు క్షేత్రబంధమునుండి విముక్తి నంది, అర్జునా, నీవు పరమును బొందెదవు"-అని చెప్పి ముగించెను.

ఇపుడు విచారించవలసిన దేమన. "అమృతత్వము ననుభవించెదవు", "పరమును బొందెదవు"-ఈ రెండింటియొక్క అర్థ మొకటియేనా? కాదు, వీనికి సూక్ష్మ భేద మున్నది. పరమును బొందుట యన పరప్రకృతిని బొందుట, పర ప్రకృతి కే ధర్మము (law) గలదో, దానిని బొందుట. దీనినే గీత ప్రస్తుత అధ్యాయమున "సాధర్మ్యము" (14-2)--అని పిలుచును. ఈ సాధర్మ్యమునకే మఱియొక నామము పరమ సిద్ధి లేక సంసిద్ధి-"పరాం సిద్ధిం" (14-1). ఇదిగో, ఈ సాధర్మ్యము లేక సంసిద్ధియందు అమృతత్వము ఒక అంతర్భాగము అనగా సంసిద్ధి అమృతత్వమునకంటెను గూడ అధికము. ఏలన అమృతత్వముయొక్క ఆంతర్య (significance) మంతయు నీ సాధర్మ్య మగుటయే కాక, ఆధ్యాత్మిక స్వేచ్ఛ యొక్క సాక్షాత్ సారము గూడను ఈ సాధర్మ్యమే. ఎట్లు?

నిమ్న ప్రకృతియం దున్నపుడు జీవునకు అవిద్యవలన గుణసంగ ముండును. అపు డతడు గుణాధీనుడై గుణముల నుపభోగించును, అతనికి భోగముతో బాటు బంధన ముండును (13-22) దీనికి వ్యతిరేకముగా అదే దేహమునందు నివసించు పరమ పురుషుడు – "పురుషః పరః" (13-23) – గుణముల నుపభోగించుచున్నను, గుణాధీనుడు గాడు. పైగా అతడు గుణముల కీశ్వరుడు–"మహేశ్వరః". కారణము, అతడు గుణములకు పరుడు – "పరః", అతడు గుణాతీతుడు. అతని ప్రకృతి

పర ప్రకృతి, అతని ధర్మము పర ప్రకృతియొక్క ధర్మము. కనుక జీవుడు నిమ్న ప్రకృతినుండి పర ప్రకృతిలోని కారోహించి నపుడు, అతని వ్యవహారధర్మము సైతము పర ప్రకృతియొక్క ధర్మ మగును, అనగా నతడు (జీవుడు) భగవంతునితో సాధర్మ్యము నందును, అపు డతడు భగవంతుని వలెనే, పర ప్రకృతి సహజ మగు ఆధ్యాత్మిక స్వేచ్ఛ ననుభవించును. ఈ స్వేచ్ఛయొక్క సారతత్త్వమే ఆ సాధర్మ్యము.

భగవంతుడు దేహము ధరించి నపుడు సైతము అజుడే (4-6), ఏలన ఆ దేహము అతనిని గిటిగిచి నిర్ణయించదు, అనగా పరిచ్ఛిన్నము గావించదు. ఇట్లు భగవంతునికి పుట్టుకయే లేదు గావున, మరణమును లేదు. కనుక నతడు సదా అమరుడు లేక అమృతుడు. భగవంతుని కీ అమృతత్వము సహజముగనే సదా యుండును. భగవంతుని పర ప్రకృతియొక్క స్వభావమే అది. పోతే, నిమ్న ప్రకృతినుండి వెలువడి, ఆ పర ప్రకృతితో సాధర్మ్యము నందిన జీవునికి సైతము నిత్యమగు ఆ అమరత్వ ప్రజ్ఞ సదా యుండును, దేహముయొక్క జననమరణములవలన దానిలో నే మార్పును కలుగదు. ఇట్లు గీత ప్రతిపాదించు నిత్య అమరత్వముయొక్క అంతర్యము సాధర్మ్యమే. ఈ అమరత్వము జన్మరాహిత్యముపై నాధారపడదు.

ఇచ్చట మన మీ విషయము గమనించవలసి యున్నది: అవ్యక్తము అనిర్దేశ్యము (12-3) నగు అక్షర బ్రహ్మమునందు వైయక్తిక జీవునియొక్క లయము అమరత్వమున కర్థ మని గాని, నిబంధన యని గాని గీతలో నెక్కడను సూచనామాత్రముగా నైనను లే - దని శ్రీ అరవిందుడు; యోగముయొక్క సత్య లక్ష్యము గూడ నది గాదు. గీత వైయక్తిక జీవుని లయమును జెప్పకపోవుటయే కాక, సంసిద్ధియందు అంతరాత్మ పరమాత్మయందు నివసించును (12-8), శరీరమును ధరించి నపుడు గాని, త్యజించి నపుడు గాని అత డే వ్యథను జెందడు (14-2) - అని స్పష్టముగా జెప్పును.

సరే, సంసిద్ధికి సాధర్మ్యము ప్రాణము. కాని ఈ సాధర్మ్యము నెట్లు సాధించవచ్చును? నిమ్న ప్రకృతినుండి పర ప్రకృతిలోని కారోహించుటవలన. ఈ ఆరోహణకు అడ్డు వచ్చున దేది? నిమ్న ప్రకృతిలోని గుణసంగము. కాగా గుణ సంగమును త్రెంచుకొన వలె ననిన, గుణస్వరూపస్వభావములు మనకు దెలియ వలెను. ఈ విషయమును దెలుపుటకే ఈ గుణత్రయవిభాగయోగము. గుణవిభజన యొక్క జ్ఞానము గుణములపై కెగయుటకు మనకు దోడ్పడును గావునను, ఆ పై

స్థితి ఇంకను వర్ణించబడును గావునను, శ్రీ అరవిందు డీ అధ్యాయమునకు "గుణముల కావల"–అని పేరిడెను.

శ్రీ భగవా నువాచ –

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమం,
యజ్ జ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధి మితో గతాః. 1

శ్రీ భగవానుడు పలికెను – ఏ జ్ఞానము నెఱింగిన మును లందరు దేహము నుండి వెలువడి పరమ సిద్ధిని బొందియున్నారో. జ్ఞానములలోని కెల్ల నుత్తమమగు ఆ జ్ఞానమును, అర్జునా, నీ కిపుడు మఱల ప్రవచింతును.

విశేషార్థము : ఇది ఉత్తమ జ్ఞాన మేల యన, దీనివలన మానవుడు 'పరమ సిద్ధిని' పరమ పదమును బొందును. పోతే పరమ సిద్ధి యన, శ్రీశంకరునికి జననమరణము లుండని లయరూప మోక్షము; శ్రీ అరవిందునికి, జననమరణముల కతీతమగు వ్యక్తిత్వముతో గూడిన 'సాధర్మ్యము'. 'దేహమునుండి వెలువడి' యన దేహతాదాత్మ్యమునుండి వెలువడి–అని శ్రీ అరవిందుడు, దేహపతనానంతరము అని శ్రీ శంకరుడు. తర్వాతి శ్లోకము స్పష్టముగా శ్రీ అరవిందుని అర్థమునే తెలుపును.

ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః,
సర్గేఽపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ. 2

ఈ జ్ఞానము నాశ్రయించి నాతో సాధర్మ్యమును బడసిన వారు, అర్జునా, సృష్టికాలమున జన్మించను జన్మింపరు, ప్రళయకాలమున మరణించను మరణించరు.

విశేషార్థము ; సాధర్మ్యము = సమానధర్మత, భగవంతునితో సమాన ధర్మములను గలిగియుండుట : ఇది సూటి అర్థము భగవంతుడు తన సృష్టియందు ఎటుల జన్మించడో, అనగా తన సృష్టియందు ఉండియు, సృష్టికి అతీతముగా, నేను అజుడను–అని ఎటుల నిత్యప్రజ్ఞ గలిగియుండునో, అటులే భగవంతునితో సాధర్మ్యము నందిన జీవుడును దేహము ధరించి నపుడు సైతము, జన్మించుట లేదు. అతడు సదా భగవంతుని నిత్యత్వము (eternity) నందు నివసించును.

కాని, సాధర్మ్యము = స్వరూపము. సాధర్మ్యము నందుట = భగవంతుని స్వరూపము నందుట - అని చెప్పి, శ్రీ శంకరుడు సాధర్మ్యముయొక్క అర్థమును పూర్తిగా మార్చివేయును. ఎందుచేత ? క్షేత్రక్షేత్రజ్ఞులకు అభేదము (13-3) గనుక, అది భగవంతుని స్వరూపప్రాప్తియే కాని, భగవంతుని ధర్మమాత్రప్రాప్తి గా దని శ్రీ శంకరవాదము. అది స్వరూపప్రాప్తియు, సాధర్మ్యప్రాప్తియు—రెండును అని శ్రీ అరవిందుడు ఏలన జీవుడు స్వరూపతః ఈశ్వరుడు గాకపోయినచో, అతడు మానసిక, ప్రాణిక, దైహిక ప్రకృతితో మాత్రము ఏర్పడిన ఒక ప్రాకృత జీవియే అగుచో, అతడు భగవంతునివలె ఎప్పటికిని అమరుడు గాలేడు. తర్వాతి శ్లోకము నందలి సృష్టిప్రక్రియను బట్టి ఈ సత్యము స్పష్టపడును.

మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధా మ్యహం
సంభవః సర్వభూతానాం తతో భవతి భారత. 3

మహద్బ్రహ్మము నేను దేనియందు నా బీజము నుంతునో, ఆ గర్భము. ఆ గర్భమునందు నేను నా స్వరూపభూత బీజమును స్థాపింతును. ఈ బీజమునుండియే సర్వభూతములు, అర్జునా, సంభవించుచున్నవి.

విశేషార్థము : ఇట్లు ప్రతి జీవునియొక్క స్వరూపము భగవంతుడే. అంతియే కాదు, ప్రతిజీవునియొక్క బాహ్యరూపమును భగవంతుడే. ఏలన తన గర్భమగు మహద్బ్రహ్మము గూడ అతని శక్తియే, అతడే. చైతన్యముచేత అనుప్రాణితమై నప్పుడు భగవంతుని శక్తిని మహత్తు లేక మహద్బ్రహ్మ మందురు. తననుంచి పుట్టిన సర్వ వస్తువులకంటెను, అది మహత్తరమైనది గనుక, దానికి మహత్తు – అని పేరు.

ప్రకృతికి పైనుండు అధి – ఆత్మ (over-soul) గా భగవంతుడు బీజము నుంచును, ప్రకృతి – ఆత్మగా ఆ భగవంతుడే ఆ బీజమును స్వీకరించును. ఇట్లు అధి – ఆత్మయగు తండ్రియు, ప్రకృతి – ఆత్మయగు తల్లియు – నుభయము భగవంతుడే. కాని శ్రీ శంకరునికి చరమ తత్త్వము అక్షరబ్రహ్మము, అది తల్లియు గాదు, తండ్రియు గాదు. దానియందు మాతా పితృభావము ఉపాసనార్థము చేయు ఉపచారము మాత్రమే.

క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగముచేతనే స్థావరజంగమముల ఉత్పత్తి(13-26) - అని పూర్వము చెప్పి, ఆ సంయోగప్రకారము నీ శ్లోకమునందు చెప్పుట జరిగినది.

సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః,
తాసాం బ్రహ్మ మహద్ యోని రహం బీజప్రదః పితా. 4

సర్వగర్భములందును, కౌంతేయా, ఏ యే దేహధారి జీవులు పుట్టుచున్నవో, వాని కన్నింటికి సమష్టిగర్భము మహత్తత్త్వము మఱియు నేను గర్భాధానము చేయు పితను.

విశేషార్థము : పై శ్లోకమునందు కంటె ఈ శ్లోకమున విశేషముగా జెప్పిన అర్థ మేమిటి? "జగత్తున కీశ్వరుడు లేడు. స్త్రీపురుషసంయోగముచేతనే జగత్తు సంభవించుచున్నది. ఆ సంయోగమునకు కామమే కారణము."(16.8)-అని ఆసుర స్వభావము గల జను లందురు. అది యథార్థసత్యము కాదు, సత్యాభాసము మాత్రమే. ప్రతి జీవికి గూడ ఈశ్వరుడే పిత, ప్రకృతియే మాత-అని ఈ శ్లోకము రహస్యమును దెలుపుచున్నది. ఇదియే విశేషము. అట్లు గన్పించుచున్నను, అహం కారస్థాయినుండి కర్మ ఎట్లు వెలువడుట లేదో, అది ఈశ్వరమూలమునుండియే ఎట్లు వెలువడు చున్నదో, అటులే సంతానమును కామస్థాయినుండి కాక, ఈశ్వరసంకల్ప స్థాయినుండియే వెలువడుచున్నది.

అవతారిక : పరమాత్మ మఱియు ప్రకృతితోబాటు, భగవదంశమగు (15-7) జీవుడును నిజానిక అనాదియే (13-20), అనగా నతడును అజుడే. అయినను జీవు నకు ఏది జననమరణములు మఱియు బంధనముయొక్క బాహ్యానుభవమును గల్గించు చున్నది ?—

సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః,
నిబధ్నంతి మహాబాహో దేహే దేహిన మవ్యయం. 5

ఓ మహాబాహూ, అర్జునా, ప్రకృతినుండి పుట్టిన సత్త్వ రజ స్తమో గుణములు మూడును నాశరహితుడగు దేహిని, అనగా క్షేత్రజ్ఞుని లేక జీవుని దేహమునందు బంధించుచున్నవి.

విశేషార్థము : "బంధించుచున్నవి"-ఇది యథార్థమైన బంధనము గాదు. ఏలన జీవుడు స్వరూపతః గుణాతీతుడు. పోతే, భగవంతుని సనాతనాంశమగు జీవుడు అతని అమర ప్రతినిధిగా విశ్వప్రకృతియొక్క క్రియాకలాపములోనికి బంప బడియున్నాడు. ఈ క్రియాకలాపముయొక్క స్వభావముచేతనే—"అవశం ప్రకృతే ర్వశాత్" (9-8)-జీవుడు తన బాహ్యచేతనయందు ఆ గుణములతో తాదాత్మ్యము

చెందును, తన ఆంతర ఆధ్యాత్మిక సత్యతను గుర్తించనట్టి మనః ప్రాణ దేహము లతో తాదాత్మ్యము జెందును. ఈ తాదాత్మ్యమే జీవుని బంధనాశోసమునకు గారణము. అయితే తన బాహ్యచేతనయందును ఒకనాటికి జీవుడు తన ఆంతర నిత్య అతీతత్త్వమును గుర్తించు స్థితికి రాగలడు. ఆ స్థితియే పరిణామలక్ష్యము– అని శ్రీ అరవిందుడు కాని అమరము, అమృతప్రాయమునగు ఈ బాహ్యజీవన మును శంకరసిద్ధాంత మంగీకరించదు.

అవతారిక : అయితే ఏ గుణము లెట్లు బంధించును ?–

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయం,
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ. 6

ఈ మూడింటియందును సత్త్వగుణము శుద్ధమగుటచే కాంతికి మూలమై, వస్తువులను ప్రకాశింపజేయును మఱియు శుద్ధమగుటచేతనే ఎట్టి రోగావస్థను, దుఃఖమును బుట్టించదు. కాని సత్త్వగుణమునందు సుఖముతోను, జ్ఞానముతోను సంగము జనించును. కనుక నది సుఖసంగముచేతను, జ్ఞానసంగముచేతను, అర్జునా, నరుని బంధించును.

విశేషార్థము : సుఖము క్షేత్రధర్మము (13–7). అయినను క్షేత్రజ్ఞుడు, నేను సుఖిని – అని తలంచును. ఈ తలంచుటయే అతనికి సుఖముతో నేర్పడిన సంగము. ఈ తలంచుటకు గారణము అవిద్య. అవిద్య యన ఆత్మ యందు అనాత్మ బుద్ధి, అనగా అనాత్మతో ఆత్మయొక్క తాదాత్మ్యమును గల్గించు బుద్ధి.

సుఖముతో బాటు జ్ఞానమును క్షేత్రధర్మమే. బుద్ధి (13–6) క్షేత్రములోనిదే కదా. ఆ బుద్ధివృత్తియే జ్ఞానము. జ్ఞానమునందు రెండు భాగము లుండును – ఆత్మ ప్రకాశము మఱియు బుద్ధివృత్తి. ఇచ్చట జ్ఞాన మన బుద్ధివృత్తి పరిచ్ఛిన్నమైన ఆత్మప్రకాశము, లేక ప్రకాశయుతమైన బుద్ధివృత్తి. అవిద్యవలన గలిగిన ఈ వృత్తితో తాదాత్మ్యము ఆత్మను మఱుగుపఱచును. కనుక జ్ఞానసంగమును బంధన మగును.

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాఽఽసంగసముద్భవం,
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినం. 7

ఇక రజోగుణముయొక్క స్వరూపము రాగము (ప్రీతి). అది తీవ్రమగు కోరికచేత విషయమునందు గలిగిన ఆసక్తినుండి జనించును. అది, కౌంతేయా, ఫలముల నాశించి ఏ కర్మను జేతుమో, ఆ కర్మయందు సంగమును బుట్టించి లోని జీవుని బంధించును.

విశేషార్థము : ఒక వస్తువు కావలె నను కోరిక గలిగి నపుడు, దానియందు ప్రీతి జనించును. ఈ ప్రీతి ఒక అంతఃకరణవృత్తి. ఈ వృత్తికి ఒక రంగు–ఎఱుపురంగు–గూడ నుండును. అందుచేతనే రజోగుణస్వరూపమగు ప్రీతి రాగ మనబడును. రాగ మనగా రంగు–అని అర్థము కదా.

మఱియు నొక వస్తువునందు ప్రీతి జనించి నపుడు, దానిని సాధించుటకు కర్మతత్పరుల మగుదుము. ఈ కర్మతత్పరతయే కర్మసంగము. అపుడు నేను కర్మ చేయుచున్నా నను భ్రమ ముదిరి జీవుడు కర్మవ్యగ్రు డగును.

**తమ స్త్వ జ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినాం,**
**ప్రమాదాలస్యనిద్రాభిస్ త న్నిబధ్నాతి భారత. 8**

చివరకు. తమస్సు అజ్ఞానమునుండి పుట్టు నని ఎఱుంగుము. అది దేహులందరి జ్ఞానమును ఆవరించి, కలవరమును, మోహమును గలిగించును. పోతే, అది పరాకుచేతను, అలసత్వముచేతను నిద్రచేతను దేహిని బంధించును.

విశేషార్థము : ఇట్లు గుణముల కారణము, స్వరూపము, కార్యము చెప్పబడినవి. ఈ స్వరూపము మానసికము; ఉదాహరణకు, నిర్మలత, రాగము, అజ్ఞానాంధకారము – మూడును మానసికములే. మానసికములు గాన, భౌతిక వస్తువులను వలె వీనిని త్రాసులో నుంచి తూచుటకు వీలుపడదు. కావుననే ప్రకృతి శక్తి పనిచేయు నీ మూడు విధానములను గుణము లనుట జరిగినది. ప్రకృతి విధానములు మూడును స్వరూపతః గుణాత్మకము. వాని బాహ్య, భౌతిక రూపము మాత్రమే మాత్రాత్మకము (quantitative)–అని శ్రీ అరవిందుడు. పోతే, ప్రకృతి గుణములు ద్రవ్యము నాశ్రయించి యుండు రూపము, మున్నగు గుణములు గావు. అయినను రూపాద లెట్లు ద్రవ్యము నాశ్రయించి యుండునో, అటులే ప్రకృతిగుణములును గుణియగు క్షేత్రజ్ఞుని ఆశ్రయించి యుండును. (సాంఖ్యము నుడువునట్లు ప్రకృతికి ప్రత్యేక సత్తయుండదు.) ఈ ఆశ్రయ సాదృశ్యముచేతనే ప్రకృతి ధర్మములను గుణము లనబడుచున్నవి – అని శ్రీ శంకరుడు.

అవతారిక : తిరిగి గుణబంధనము సంక్షిప్తముగా జెప్పబడును —

**సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత,**
**జ్ఞాన మావృత్యతు తమః ప్రమాదే సంజయ త్యుత. 9**

అర్థము : సత్త్వము సుఖమునందును, రజస్సు కర్మయందును, జ్ఞానము నావరించి తమస్సు ప్రమత్తతయందును దేహిని బంధించును.

అవతారిక ; గుణములు మూడును అన్యోన్యసంబద్ధములు, అవిభాజ్యములు. అయినను ఒకొకటి ఒకొకప్పుడు ఆధిపత్యము వహించును. ఎట్లు ?

**రజ స్తమ శ్చాభిభూయ స త్త్వం భవతి భారత,**
**రజ స్సత్త్వం తమశ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా. 10**

అర్థము : రజస్సును, తమస్సును ఓడించి ఒకప్పుడు సత్త్వము ఆధిపత్యము వహించును అటులే సత్త్వమును, తమస్సును ఓడించి, ఒకప్పుడు రజస్సు పై నుండును మఱియు సత్త్వమును, రజస్సును ఓడించి,ఒకప్పుడు తమస్సు ప్రాబల్యము వహించును.

విశేషార్థము : 'ఒకప్పుడు' అనగా నెప్పుడు ? ఉదాహరణకు, సుఖము ననుభవించు నపుడు సత్త్వము, కర్మచేయునపుడు రజస్సు,అలసిపోయినపుడు తమస్సు పై చేయిగా నుండును. ఈ ఆధిపత్యములపట్ల మనము నిస్సహాయము గాము. తగిన ప్రయత్నముచే సత్త్వమును మనము క్రమముగా పెంపొందించుకొనవచ్చును.

ఒక అత్యంత ముఖ్య విశేషము : నిమ్నప్రకృతియందు మాత్రమే గుణము ఎట్లు ఒకదానితో నొకటి పోరాడుచు, వ్యత్యస్తముగా నుండును. అయి తేఅన్నింటికి వలెనే ఈ గుణములకును మూలరూపములు పర ప్రకృతిలో నున్నవి.

అపర ప్రకృతిలో జడతగా నున్న తమోగుణము పర ప్రకృతియందు శాంతి యగును. అటులే అపర ప్రకృతిలో గతి (motion) గా నున్న రజోగుణము పర ప్రకృతియందు తపస్సు లేక చిచ్ఛక్తి యగును. మఱియు నపర ప్రకృతిలో వృత్తి జ్ఞానముగా నున్న సత్త్వగుణము పరప్రకృతియందు జ్ఞానమునకు మూలమగు ఆధ్యాత్మిక జ్యోతి యగును అపర ప్రకృతియందు రజస్సుయొక్క గతికి విరుద్ధ మగు తమస్సుయొక్క జడత పర ప్రకృతియందు రజస్సుయొక్క తపస్సునకు ఆధారమగు శాంతి యగును. అటులే అపర ప్రకృతియందు సత్త్వముయొక్క

ప్రకాశమునకు (14-11) విరుద్ధమగు తమస్సుయొక్క అప్రకాశము (14-13), పరప్రకృతి యందు సత్త్వముయొక్క జ్యోతికి సహజమగు ప్రశాంతసుఖ మగును. ఇట్లు పరప్రకృతియందు గుణముల పరస్పర విరోధము బోయి, వాని అన్యోన్యతయు, సామరస్యమును, చివరకు ఏకతయు తెలియవచ్చును, అనుభూత మగును — అని శ్రీ అరవిందుడు తన అసాధారణానుభవమును వెల్లడించును.

గీత యందు గుణాతీతత్వము ప్రస్తావించబడినదే గాని, దాని స్వరూపము వివరింపపడ లేదు. గీత ఆ స్వరూపానుభవమును తన అనుభవమునకే వదలివేసెను. ఏలన దానిని వివరించినను అది మనస్సునకు సరిగా బోధపడదు. పైగా ఇట్టి పరమ రహస్యములను తత్త్వవేత్తయగు గురుముఖమునుండియే మనము స్వీకరించవలెను (4-34) - అనియు గీత విధించును.

పోతే, శ్రీ శంకరునికి గుణముల మాయారూపమే (7-13) గాని వాని పరరూపము లేదు. కావున అవి సర్వథా త్యాజ్యములు. మఱియు గుణములు లేనపుడు కర్మయే లేదు గావున, కర్మసన్యాసము అనివార్యము మఱియు మోక్ష లక్షణము. పర ప్రకృతిని గుర్తించి, దానిలోని కారోహించనిచో, శంకరుని ఈ నిష్క్రియ మోక్షము దగ్గఱనే ఆగిపోవలసివచ్చును.

అవతారిక : ప్రవృద్ధమైన ఏ గుణముయొక్క లక్షణము లేవియో చెప్పబడును —

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యాద్ వివృద్ధం సత్త్వ మిత్యుత. 11

దేహము నందలి సర్వద్వారము లందును ఎపుడు ప్రకాశమును, జ్ఞానమును ఉప్పతిల్లునో, అపుడు ప్రకృతియొక్క సత్త్వగుణము ప్రవృద్ధమైనదని తెలియవలెను

విశేషార్థము : "ప్రకాశమును, జ్ఞానమును"—జ్ఞాన మనబడు ప్రకాశము— అని శ్రీ శంకరుడు. అవబోధము (understanding), ప్రతిబోధము (perception) మఱియు జ్ఞానము దేని రూపములో,ఆ ప్రకాశము—అని శ్రీఅరవిందుడు. సంతోషముగా నుండి, చిరునవ్వు నవ్వునపుడు, ముఖమునందు వెలువడు వెలుగును మనము స్పష్టముగా గుర్తించవచ్చును.

లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమః స్పృహా,
రజ స్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ.　　12

లోభము, క్రియాప్రవృత్తి, కర్మారంభము, అశాంతి, కోరిక ; ఇవి, అర్జునా, రజస్సు ప్రవృద్ధమైన దని తెలిసికొనుటకు లక్షణములు.

విశేషార్థము : కోరికయే, ఒక వస్తువు కావలయునను తపనయే అశాంతి, అంతేకాదు; ఆ వస్తువు ప్రాప్తించి నపుడు సైతము, దాని నెట్లు ధరించవలెనో మఱియు అనుభవించవలెనో, తెలియదు గాన, దాని స్వామ్యము (possession), అనుభవము గూడ అశాంతినే బుట్టించును-అని శ్రీ అరవిందుడు.

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ,
తమ స్యేతాని జాయంతే వివృద్ధే కురునందన. 13

అప్రకాశము, క్రియావైముఖ్యము, పరాకు, మోహము : ఇవి అర్జునా, తమస్సు ప్రవృద్ధమైన దని తెలిసికొనుటకు లక్షణములు.

విశేషార్థము : ఇట్లు సత్త్వసారము ప్రకాశము (14-11) గనుకను, తమః సారము అప్రకాశము (14-13)గనుకను, తమస్సు సత్త్వమునకు విరుద్ధము. అటులే, రజఃసారము ప్రవృత్తి (14-12) గనుకను, తమఃసారము అప్రవృత్తి (14-13) గనుకను తమస్సు రజస్సునకు గూడ విరుద్ధమే.

అవతారిక : గుణప్రవృద్ధి ప్రభావము మరణకాలమునందు నిర్ణాయకమగును-

యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాతి దేహభృత్,
త దోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే. 14

ఎపుడు సత్త్వగుణము ప్రాముఖ్యము వహించునో, అపుడు మరణించిన జీవుడు ఉత్తమజ్ఞానము గలవారికి ప్రాప్తించు ప్రవిమల లోకములను బొందును.

విశేషార్థము : మరణక్షణము నందలిభావము భావిగతిని నిర్ణయించును (8-6). కాగా సత్త్వగుణము ప్రవృద్ధమై నపుడు జ్ఞానభావ ముండును. కనుక అట్టి క్షణమున మరణించినవాడు జ్ఞానుల కుచితమగు లోకములను బొందును.

రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే,
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. 15

రజోగుణము ప్రవృద్ధమై నపుడు మరణించిన జీవుడు కర్మవ్యగ్రులైనవారి మధ్య జన్మించును. అటులే తమోగుణ ప్రాబల్యమునందు మరణించినవాడు మూఢుల కులమునందు బుట్టును.

విశేషార్థము : ప్రపంచప్రళయమునే సామాన్యముగా ప్రళయ మందుము. కాని ఇచ్చట వ్యక్తి మరణమును గూడ గీత ప్రళయ* మనుచున్నది. కారణము, ప్రపంచప్రళయము తర్వాత తిరిగి ప్రపంచము ప్రభవించు నటులే, మరణమునకు పిమ్మట గూడ వ్యక్తి తిరిగి పుట్టును.

కనుక (14-2) శ్లోకము నందలి 'సర్గము' మఱియు 'ప్రళయము' సమష్టికే కాక వ్యష్టికిని వర్తించును. అపు డా శ్లోకార్థ మేమన, భగవంతునితో సాధర్మ్యము నందిన వాడు తాను దేహము ధరించి నపుడు గాని, ఆ దేహము మరణించి నపుడు గాని వ్యథ నందడు. ఇదియే అమరత్వమునకు పూర్ణార్థము - అని శ్రీ అరవిందుడు.

పోతే, శ్రీ శంకరుడు ఈ శ్లోకము నందలి సర్గ, ప్రళయములను ప్రపంచ పరముగా మాత్రమే అన్వయించి, సాధర్మ్యమునకు అక్షరాత్మతో తాదాత్మ్యము-అని అర్థము చెప్పి, నేను అక్షరాత్మనని తెలిసికొనినవాడు ప్రపంచము పుట్టి నపుడు పుట్టడు, ప్రపంచము ప్రళయము నంది నపుడు ప్రళయము నందడు - అని వ్యాఖ్యానించును. అనగా జననమరణములున్నంత కాలము మోక్షానుభవము, అమరత్వము నుండ దని ఆయన భావము.

అవతారిక : ఇపుడు ఏ గుణకర్మకు ఏ ఫలమో చెప్పును —

కర్మణః సుకృత స్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలం,
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలం. 16

సరిగా జేయబడిన సాత్త్వికకర్మయొక్క ఫలము సాత్త్వికము, నిర్మలమునగు ఫలమే యగును, సుఖము మఱియు జ్ఞానమే యగును (14-6). అటులే రాజసిక కర్మకు ఫలము దుఃఖము మఱియు తామసిక కర్మకు ఫలము అజ్ఞానము లేక మోహము (14-7, 8).

అవతారిక : ఇపుడు ఏ గుణమున కే సంతానమో చెప్పును -

సత్త్వాత్ సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ,
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవచ. 17

అది ప్రబలి నపుడు (14-11) సత్త్వమునుండి జ్ఞానమును, అటులే రజస్సు నుండి లోభమును, మఱియు తమస్సునుండి పరాకు, మోహము, ఇంకను అజ్ఞానము జనించును.

విశేషార్థము : గుణఫలమునకును, గుణసంతానమునకును ఇంచుక భేద మున్నది. ఉదాహరణకు తండ్రికి పుట్టిన బిడ్డ పండితు డైన, ఆ తండ్రికి కీర్తి వచ్చును. ఇచ్చట పండితుడు సంతానము కాగా, ఫలము కీర్తి.

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠతి రాజసాః,
జఘన్య గుణవృత్తిస్థా అధోగచ్ఛంతి తామసాః. 18

సత్త్వముయొక్క వృత్తి ఏది గలదో, దానియందు స్థితులైన సత్త్వస్థులు ఊర్ధ్వలోకములు లేక దశలను బొందుదురు, అటులే రాజసులు మధ్యమలోకమగు మానవలోకమును లేక పరిణామమునందు మధ్యమ దశను, మఱియు తామసులు అధోలోకములందు లేక పశ్వాది యోనులయందు జన్మింతురు.

విశేషార్థము : సత్త్వవృత్తి = జ్ఞానము, రజోవృత్తి = లోభము, తమోవృత్తి = అజ్ఞానము మఱియు నిద్రాదులు.

మంచిది, కాని ఈ గుణకర్మల ఫలముల నెందు కిచట చెప్పినట్లు? ఎందుకన, గుణములయం దున్న ఈశ్వరుడు బద్ధుడు గా నప్పటికి, గుణములయం దున్న జీవుడు బద్ధు డగును (14-5) జీవుని సంగమే ఈ వ్యత్యాసమునకు గారణము. ఈ సంగము ద్వివిధము — 1. గుణకర్మల ఫలముతో సంగము, 2. గుణకర్మలతో సంగము. సంగమును పూర్తిగా బాపుకొనుటకు మొదటి మెట్టు ఫలసంగమును వీడుట. అందు చేతనే ఏ గుణమున కే ఫలమో ఇచట ప్రత్యేకించి చెప్పబడినది. ఇక రెండవ మెట్టు కర్మతో సైతము సంగమును వీడుట. కనుక ఇప్పు డీ కఠినతరమగు సంగమును వీడు విధానము చెప్పబడును —

నాఽన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. 19

ఎవడు సత్యదర్శి యగుచు, గుణములకంటె వేఱొక కర్త లే డని, అనగా గుణములే సర్వమును జేయు కర్త యని అనుక్షణము జూచునో, మఱియు గుణములకు పరమునం దున్న దాని నెఱుంగునో, అట్టి 'ద్రష్టయగు జ్ఞాని' (4-34) నా (భగవంతుని) భావమును బొందును.

విశేషార్థము : కార్యకరణ విషయ రూపములను, అనగా దేహ, అంతః-కరణ, బాహ్యప్రపంచ రూపములను, ధరించిన గుణములే సర్వకర్మలను జేయు

చున్నవి - అని చూడవలెను. మఱియు ఈ గుణకర్మలకు పరుడును (అతీతుడును), కావుననే వానికి ఈశ్వరుడును అయిన భగవంతుని దెలియవలెను. తెలిసి, కర్మలకు అధీశ్వరుడైన అతని చేతులందు మన కర్మల నుంచవలెను (3-30). అపుడు మనము ఆ కర్మాధీశ్వరుని ఇచ్ఛకు ఒక నిష్కామ, సమచిత్త ఉపకరణముగా నుందుము. ఇట్లు మనకు కర్మసంగము నుండదు, భగవదిచ్ఛ మనద్వారా సాగిపోవుచును ఉండును. ఇట్టి కర్మవలన మానవుని కర్మసమస్య పరిష్కరింపబడును, కర్మను సన్యసించుటచే గాదు. మఱియు నిట్టి భక్తిజ్ఞానములతోఁగూడిన కర్మవలన మానవుడు భగవద్భావము నందును, అనగా భగవంతుని స్థితితోను, గతితోను, వేఱు మాటలలో భగవంతుని సత్తతోను, ప్రకృతితోను ఏకమగును. ఇట్టి దివ్యకర్మ మానవుని కర్మసమస్యను బరిష్కరించుటయే కాక, భగవద్భావరూపమగు అతని పరిపూర్ణతను సైతము సాధించును - అని శ్రీ అరవిందుడు.

పోతే, శ్రీ శంకరుని వ్యాఖ్య ఏమన, 'గుణేభ్యః పరం' = గుణములకు పరమునందుండు సాక్షిమాత్రమగు ఆత్మ. ఈ ఆత్మ కర్మసాక్షియే గాని, కర్మాధీశ్వరుడు గాడు, కావున అతడు కర్మలను సంకల్పించువాడు గాడు. కనుక నిట్లు సంకల్పించువాడు లేక, కర్మ లాగిపోవును, నిష్క్రియ మోక్షము సిద్ధించును - అని శ్రీశంకరుడు. ఇచ్చట కర్మసమస్యకు పరిష్కారమునులేదు. మానవునికి పరిపూర్ణతయు సిద్ధించదు.

అవతారిక : ఇట్లు భగవద్భావము పొందుటకు ఫలము —

గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్,
జన్మమృత్యు జరా దుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే.20

ఇట్లు 'మద్భావము' నంది, దేహోత్పత్తికారణమగు ఈ మూడు గుణములను దాటి, పైకి వెళ్లి, జన్మము, మృత్యువు, వార్ధకము మఱియు దుఃఖముల (అధీనత) నుండి ముక్తుడై, ముక్త జీవుడు అమృతత్వము నుపభోగించును.

విశేషార్థము : 'జన్మమృత్యువిముక్తుడు' = జన్మమృత్యువులనుండి విముక్తుడు, అనగా జన్మరాహిత్యము నందినవాడు - అని శ్రీ శంకరుడు. పోతే, 'జన్మమృత్యు విముక్తుడు' = జన్మమృత్యువుల అధీనతనుండి ముక్తుడు - అని శ్రీ అరవిందుడు. అనగా 'మద్భావము' నందినవానికి శరీరముయొక్క జన్మమృత్యువులు వ్యథాకరములు గావు (14-2). అదియే పరిపూర్ణతాలక్షణము.

అవతారిక : 'గుణముల నతిక్రమించి' – అను ప్రశ్నబీజమును బొంది అర్జును డిట్లు ప్రశ్నించును ___

అర్జున ఉవాచ –

కైర్లింగై స్త్రీన్ గుణానేతా నతీతో భవతి ప్రభో,
కిమాచారః కథం చైతాం స్త్రీన్ గుణా నతివర్తతే. 21

అర్జును డడిగెను – ఈ మూడు గుణములను అతిక్రమించినవాడు, ప్రభూ, కృష్ణా, ఏ చిహ్నములచేత దెలియబడును ? మఱియు నతని కర్మ ఏది యగును ? చివరకు, మనుజు డెట్లు ఈ గుణముల నతిక్రమించును ?

విశేషార్థము : 'కిమాచారః' = అతని కర్మ యేది యగును ? అనుటచేత గుణాతీతునకు సైతము కర్మ లుండు నని స్పష్టమగు చున్నది. అపుడు, గుణముల నెట్లు అతిక్రమించును ?' అనుటకు అర్థము, కర్మ చేయుచున్నను, కర్మలయందు సైతము, గుణముల నెట్లు అతిక్రమించి మించును? – అని యగును. ఈ అర్థము 20–వ శ్లోకమునకు శ్రీ అరవిందుడు చేసిన వ్యాఖ్యను బోషించును.

శ్రీ భగవా నువాచ –

ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవచ పాండవ,
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి. 22

శ్రీ భగవానుడు దెలిపెను – సత్త్వగుణకార్యమగు ప్రకాశము గాని, రజో గుణకార్యమగు కర్మప్రవృత్తి గాని, తమోగుణకార్య మగు మనో మోహము గాని (బాహ్య మనోవ్యాపారమునందును, కాయిక క్రియలయందును) పైకి లేచి నపుడు గుణాతీతుడు దానిని ద్వేషించడు, మఱియు లోనికి అడగిపోయి నపుడు, దానిని కాంక్షించడు.

విశేషార్థము : ఇది అక్షర పురుషునియొక్క స్థితి. ఇతని 'కూటస్థు' డనియు నందురు. ఇతడు మంచిని, చెడును—సర్వమును సాక్షిమాత్రముగా జూచుచు,దానిని తన ఉదాసీన చేతనతో ధరించునే గాని, ఆ క్రియలో కల్పించుకొనడు. ఇతడు కేవలము 'ఉపద్రష్ట మఱియు అనుమంత' (13–23), సర్వ కర్మను సమముగా జూచును, మఱియు సమముగా ననుమతించును. ఇది ప్రకాశము. కాన కావలయును;

ఇది మోహము, కాన త్యజించవలయును—అని సంకల్పించడు. కాగా అక్షర పురుషునిలో నెలకొని, గుణాతీతుడైన జీవుడును దేనిని పట్టించుకొనక సర్వసమముగా నుండును

ఇట్లు గుణాతీతునికి దేనియందు ద్వేషము నుండదు, ఆకాంక్షయు నుండదు. ఇదియే అతని ప్రథమ లింగము (చిహ్నము) అయితే ఇది ఇతరులకు గన్పించు లింగము గాదు. ఏలన ఒకనియందలి ద్వేషాకాంక్షలు అతనికే ప్రత్యక్షములుగాని, ఇతరులకు గోచరించునవి గావు.

**ఉదాసీనవ దాసీనో గుణై ర్యో న విచాల్యతే,**
**గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే. 23**

మఱియు గుణాతీతుడు ఉదాసీనునివలె నాసీనుడై (కూర్చొని) యుండి గుణములచేత విచలితుడు గాడు. గుణములే గుణములందు వర్తించుచున్న (3-28)-వని వాని కర్మలకు చలించక, స్థాణువువలె నుండును.

విశేషార్థము : ఉదాసీనుడు = ఉత్ + ఆసీనుడు, పైన కూర్చొనియున్నవాడు. అనగా గుణాతీతుడు గుణప్రకృతికంటెను పైనున్న ఒక ఊర్ధ్వచేతనయందు నెలకొని యుండును. మేఘములకంటె పైనున్న సూర్యునివలె, అతడును గుణచలనములకు చలించడు - అని—ఉదాసీన - పదమును విడదీసి, దాని రహస్యమును తెలిపినది శ్రీఅరవిందుడే. పోతే, ఉదాసీనుడు = ఉపేక్షించువాడు - అని శ్రీ శంకరుడు.

'కిమాచారః' = గుణాతీతు డేమి చేయును ? (14-21) - అని అర్జునుడు ప్రశ్నించెను గదా, 'ఉదాసీనవ దాసీనః' = ఉపేక్ష వహించి కూర్చొనును - ఇదియే ఆ ప్రశ్నకు సమాధాన మని శ్రీ శంకరుడు. కాదు, ఇదియు సమత్వ - లింగమును జెప్పు మఱియొక మాటయని శ్రీ అరవిందుడు. ఇంకను అతని సమత్వ మెట్టి దనిన —

**సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మ కాంచనః,**
**తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిందాత్మ సంస్తుతిః. 24**

మఱియు, గుణాతీతుడు అంతరమున సుఖదుఃఖములను సమముగా జూచును; మట్టి, రాయి మఱియు బంగారములను సమముగా జూచును. అతనికి ప్రియాప్రియములు, నిందాస్తుతులు సర్వథా సమములు. ఏలన అత డిప్పుడు ఆత్మస్థుడు మఱియు వివేకధీయుతుడు.

విశేషార్థము : ధీరుడు = 1. ధీమంతుడు, 2. చలించనివాడు. ఇచ్చట రెండు అర్థములును వర్తించును. ఏలన, అతడు ఇపుడు ఆత్మజ్ఞానము గలవాడు గాన, ధీమంతుడు; అంతేకాదు ఆత్మానాత్మల వివేచనాబుద్ధి యుక్తుడు గావునను ధీమంతుడు. మఱియు నతడిపుడు ఆత్మస్థుడు గావున, చలించనివాడు. ఆత్మ 'కూటస్థము, అచలము, ధ్రువమును' గదా.

**మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః,**
**సర్వారంభ పరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే. 25**

ఎవడు మానావమానములు ప్రాప్తించి నపుడు నిర్వికారముగా సముడై యుండునో, మఱియు శత్రుమిత్ర పక్షములందు నిష్పక్షపాతముగా వ్యవహరించునో, ఇంకను ఎవడు సర్వకర్మల ఆరంభమును స్వాభావికముగానే పరిత్యజించునో, అడిగో, అతడు గుణాతీతు డని చెప్పబడును.

విశేషార్థము : ఆరంభములు = ఆరంభింపబడునవి, అనగా కర్మలు-అని శ్రీ శంకరుడు. (13-24) లోని "కర్మయోగ" మను సమాసమునందలి 'యోగ' పదమునకు కర్మ యని అర్థము చెప్పినటులే, ఇచ్చటను ఆరంభములు-అను మాటకు కర్మలు-అను అర్థమును ఆయన చెప్పుచున్నాడు. ఏలన, అపుడు 'సర్వారంభ పరిత్యాగీ'=సర్వకర్మలను పరిత్యజించు శీలము గలవాడు-అని అర్థము వచ్చును. పోతే, శంకరసిద్ధాంతమునకు గావలసినది ఈ కర్మపరిత్యాగము లేక సన్యాసమే.

మంచిది, కాని శ్రీ అరవిందు డేమి చెప్పును? ఆరంభము = ఆరంభించుట, initiation. అపుడు 'సర్వారంభ పరిత్యాగీ' = సర్వారంభమును పరిత్యజించు శీలము గలవాడు-అని అర్థము వచ్చును. అనగా తాను గాక, ఈశ్వరుడే కర్మను ఆరంభించును, కర్మను సంకల్పించును, అట్లు ఈశ్వరునిచే సంకల్పించబడిన కర్మను ప్రకృతి నిర్వహించును-శాసనసభ చేసిన శాసనమును మంత్రివర్గము అమలుపఱచు నట్లు, గుణాతీతుని ప్రకృతిద్వారా ఈశ్వరుడు సంకల్పించిన కర్మలు - యుద్ధకర్మలు సైతము-జరుగుచునే యుండును. కావున గుణాతీతుడు బాహ్యముగా కర్మసన్యాసి గాడు, కానవసరము లేదు. అతడు ఆంతరముగా మాత్రమే కర్మసన్యాసి. ఏలన అతడు కర్మసంకల్పమును భగవంతుని యందును, (3-30), కర్మనిర్వహణమును ప్రకృతియందును (14-19) సన్యసించియున్నాడు.

మఱియు, 22 ... 25 శ్లోకములందు ఏ సమత చెప్పబడియున్నదో, కర్మ ప్రపంచమునందే దానికి అర్థ మున్నది గాని, కర్మసన్యాసస్థితియందు గాదు. ఏలన సన్యసించి, ప్రపంచమునకు దూరముగా సమాధియం దుండు వానికి మానావమాన ములవంటి వ్యత్యాసములతో సంబంధమే యుండదు గాన, అతనికి వానివల్ల సమతతో వ్యవహరించవలసిన అవసరమే యుండదు. కనుక ఈ సమతావర్ణనయు గుణాతీతునికి కర్మలు గల వని తెలుపును–అని శ్రీ అరవిందుడు పేఱొకచోట వివరించును.

'కిమాచారః'=గుణాతీతు డేమి చేయును ? – అను అర్జునుని ప్రశ్నకు మన కిపుడు సమాధానము వచ్చినది : ఈశ్వరుడు సంకల్పించిన కర్మలు అతని ప్రకృతి నిర్వహించును. ఇవియే అతడు చేయు కర్మలు మఱియు ఈ కర్మల వ్యత్యాసము లలో చిక్కుకొనక, అతడు సర్వసమముగా నుండును.

అవతారిక : ఇపుడు గుణాతీతత్వమునకు సాధనాంతరము చెప్పబడును —

**మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,**
**స గుణాన్ సమతీ త్యైతాన్‌బ్రహ్మభూయాయ కల్పతే. 26**

పోతే, నన్ను (భగవంతుని) వ్యభిచరించని ప్రేమతో ప్రేమించుచు, వ్యభి చరించని భక్తితో సేవించుచు, ఎవడు నన్ను బడయ ప్రయత్నించునో, అతడు గూడ గుణముల నతిక్రమించును, మఱియు నతడు సైతము బ్రహ్మ యగుటకు సమర్థు డగును.

విశేషార్థము : 12–వ అధ్యాయమున జెప్పబడి నట్లు, ద్వివిధ ఉపాసనలు గలవు – అక్షరోపాసన మఱియు ఈశ్వరోపాసన.

అక్షరోపాసనయందు ఇంద్రియాది ప్రకృతి నడచివేయుటకు (12–4) ప్రయత్నము జరుగును. ఏలన నీరవమగు అక్షరాత్మ ప్రకృతి నీరవము (నిశ్శబ్దము) అయిననే గాని ఉపలబ్ధము గాదు. ఇచ్చట మానావమానములయందు సమముగా నుండుటకు ప్రయత్నము చేయబడును. కనుక నిచ్చట మానావమానాదులయందు సమత సాధన మగును. ఇదిగో గుణాతీతత్వమునకు ఇది యొక సాధనము.

ఇక రెండవ సాధన మే మనిన, భగవంతునియందు వ్యభిచరించని భక్తి. ఇచ్చట మనము గమనించవలసిన దేమన, భగవదుపాసకుడు మార్గమునందు ఒక దశగా అక్షరాత్మను బొంది, అక్షరాత్మయొక్క గుణాతీత్వమును తనది గావించు కొనును – అని శ్రీ అరవిందుడు.

శ్లోకమునందు రెండవ అక్షరముగా చ - కారము గలదు. దీని అర్థము, చ - మఱియు, గూడ శ్రీ శంకరుడు మొదటి అర్థమగు మఱియు - ను దీసికొని, ఇట్లు చెప్పును: ఇట్టివాడు గుణాతీతుడు (14-25), మఱియు భగవంతుని భక్తితో సేవించినవాడు గుణాతీతు డగును - అని. కాగా, భగవంతుని భక్తితో సేవించినవాడు గూడ గుణాతీతు డగును - అని శ్రీ అరవిందుడు.

శ్రీ అరవిందు డిట మఱియొక ముఖ్య విషయమును వెలుబెట్టి చూపును: 5, 6, 7, 8, 9, 10, 11 - అధ్యాయముల అంతమునందు వలె, ఈ 14-వ అధ్యాయము నందును చివరకు అదే చరమ భగవత్-స్వరమును గీత ఆలపించును, పరిపూర్ణ సిద్ధి ప్రదమగు భగవదుపాసనను జెప్పును.

కాని ఎందు కట్లు చేయును? అట్లు చేయనిచో, అనగా పురుషోత్తముని జెప్పనిచో, క్షరాక్షరుల మధ్యగల అఖాత మట్లే యుండిపోవును, సాధకుని సత్త క్షరాక్షరులమధ్య విభక్తమగును, ఈ విభక్తచేతనయే పరమచేతన గావలసియుండును. కాగా, ఈ విభజనను దప్పించుకొనుటకు క్షర ప్రకృతిని, శరీరధారణవలన జనించిన గుణములను జాఱవిడచి, బ్రహ్మముయొక్క నిర్వ్యక్తికతయందును, నీరవ శాంతి యందు శాశ్వతముగా లీనము గావలసియుండును; మఱియు చివరకు ఈ లయమే యోగముయొక్క పరాకాష్ఠ - యని చెప్పవలసియుండును. ఈ ఆపత్తిని వారించుటకు గీత దాదాపు ప్రతి అధ్యాయాంతమునందును పురుషోత్తముని ప్రస్తావించును - అని శ్రీ అరవిందుడు.

అవతారిక: భగవదుపాసకుడు బ్రహ్మమును బొందుటకు గారణము? —

బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృత స్యావ్యయస్య చ,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాంతికస్య చ. 27

కారణ మేమి యన, నేను అమృతము, నవ్యయము నగు బ్రహ్మకు ప్రతిష్ఠను (ఆధారమను): అటులే శాశ్వతమగు ధర్మమునకు ప్రతిష్ఠను, మఱియు ఐకాంతిక absolute, స్వతఃసిద్ధ) ఆనందమునకు ప్రతిష్ఠను.

విశేషార్థము: ఇట్లు పురుషోత్తముడనగు నేను అక్షరబ్రహ్మకును ప్రతిష్ఠను, మూలమును గాన, నన్ను బొందగోరి సాధన చేయువాడు సహజముగనే బ్రహ్మను బొందును. ఇది సూటి అర్థము. బ్రహ్మముపైన పురుషోత్తము డున్నాడని గీతతో బాటు అంగీకరించి నపుడు మాత్రమే, ఈ సూటి అర్థము చెప్పుటకు వీలగును.

ఏ కర్మ చేయవలెను? ఇవ్విషయమున రాజసిక బోధనా, లేక కామప్రేరణా రూపమగు ధర్మము గలదు ఇచ్చట కామమే కర్మను నిర్ణయించు ధర్మము. ఇది మర్త్యతకు గారణమగు ధర్మము. దీనికంటెను మహత్తరమగు మఱియొక ధర్మము గలదు. అది ఈశ్వరసంకల్పము, ఇచ్చట ఈశ్వరసంకల్పమే మన కర్మను నిర్ణయించు ధర్మము. ఇది అమరత్వసాధక ధర్మము, అమరధర్మము. ఇది శాశ్వత ధర్మము. ఏలన ఇది మనఃసంకల్పము గాక, ఈశ్వరసంకల్పము.

సాత్త్విక సుఖము సైతము సత్త్వగుణము ప్రవృద్ధమైనపుడు మాత్రమే లభించును. సత్త్వగుణము పర్యాయక్రమమున తక్కిన గుణములచేత పరాజితమగును గాన, ఈ సుఖము తాత్కాలికము మఱియు సత్త్వవృత్తిపరిచ్ఛిన్నము. కాని భగవాను డే సుఖమునకు ప్రతిష్ఠయో, అది స్వతఃసిద్ధ, కాలాతీత, అమేయ ఆనందము.

మఱియు ఈ ఆనందము జ్ఞానయుక్తమగు భక్తిచేత బొందబడుచున్నది గాన ఇందు పరిపూర్ణ ప్రేమయొక్కయు, ప్రత్యక్ష ఏకతయొక్కయు సంయోగానుభవ ముండును. ఈ ఏకతా, ప్రేమల సంయోగమే భక్తికి పరమ కిరీటము. మఱియు నిట్టి ఆనందములోని కెగయుటయే ఆధ్యాత్మిక సంసిద్ధియొక్క సమాప్తియు, అమరత్వసాధక సనాతన ధర్మముయొక్క పరిపూర్తియు నగునని శ్రీ అరవిందుడు.

ముందు, "నన్ను ఎవడు భక్తితో సేవించునో, వాడు బ్రహ్మమునొందును(14-26)" అని చెప్పి తర్వాత, "కారణ మేమన, నేను బ్రహ్మకుగూడ ప్రతిష్ఠను(14-27)"- అని కారణమును దెలుపును. కనుక అచ్చటి "నన్ను", ఇచ్చటి "నేను" ఒకే పరమాత్మను లేక పురుషోత్తముని జెప్పుచున్న వనునది స్పష్టమే. శ్రీ శంకరుడును మొదటి నన్ను-కు పరమాత్మ యనియే అర్థము చెప్పును. కాని హఠాత్తుగా అర్థమును మార్చివేసి, ఆయన రెండవ నేను-కు పత్యగాత్మ అనగా అంతరాత్మ యని అర్థము చెప్పును. ఎందు కిట్లు చెప్పును? బ్రహ్మకు పైన బ్రహ్మకు ప్రతిష్ఠగా(14-27) నొక పురుషోత్తము డున్నా డని అంగీకరించుట కిష్టము లేక అట్లు చెప్పును. పోతే, ఆయన చెప్పిన అర్థమును బట్టి, అంతరాత్మ బ్రహ్మకు ప్రతిష్ఠ గావలయును; కాని ఇది ఎట్లు సంభవము? సద్వాదమున సంభవము గాదు. కావున, అంతరాత్మయే సమ్యగ్జ్ఞానముచేత చివరకు బ్రహ్మముగా నిశ్చయింపబడును గాన, అంతరాత్మ బ్రహ్మకు ప్రతిష్ఠ-యని బహుచతురముగా సమాధానించును. కాని ఆయనయే ఈ అర్థముతో తృప్తిపడక, 'అథవా'(లేక)-అని ప్రారంభించి, (14-27)లోని బ్రహ్మ-కు

'సవికల్పబ్రహ్మ' యని అర్థాంతరము చెప్పును, మఱియు (14-27) లోని నేను-కు అంతరాత్మ యని కాక, నిర్వికల్పబ్రహ్మ యని అర్థాంతరము జెప్పును. అపుడు సవికల్పబ్రహ్మకు నిర్వికల్పబ్రహ్మ ప్రతిష్ఠ యగును. కాని (14-27) లోని బ్రహ్మ, (14-26) లోని నిర్వికల్పబ్రహ్మనే పరామర్శించుచున్నది గాన, మరియు 'నేను' నిర్వికల్పబ్రహ్మ కాజాలదు గాన ఈ అర్థాంతరములు రెండును సందర్భమునకు అపచారము చేసినవేయగును.

ఇట్లు పొసగని అర్థములను, శబ్దములను విఱిచివిఱిచి ఎందుకు చెప్పవలసి వచ్చుచున్నది ? గీతావాక్యములను తాను పూర్వమే ఏర్పఱచుకొనిన తన మనసులోని అర్థములకు సరిపెట్టుటకు-అనియే చెప్పవలసియుండును.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే

గుణత్రయవిభాగ యోగో నామ చతుర్దశోఽధ్యాయః





# శ్రీ గీతాయోగము

## అథ పంచదశోఽధ్యాయః

## పురుషోత్తమప్రాప్తియోగః

ఒక పరిశీలన : "బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహం" (14-27)—నేను బ్రహ్మకు (సైతము) ప్రతిష్ఠను—అని క్రిందటి అధ్యాయముయొక్క చరమ శ్లోకమున భగవాను డర్జునునికి దెలిపియున్నాడు. అయితే ఈ సూత్రవచనము యొక్క సూటి అర్థము శ్రీ శంకరు డంగీకరించక, దాని నెట్లు విఱిచి చెప్పుటకు ప్రయత్నించెనో, మనము చూచియే యున్నాము. కావున ఎట్టి సందేహమునకు తావు లేకుండః ఆ సూటి అర్థమే తాను ఉద్దేశించిన అర్థమని సహేతుకముగను, సాక్షాత్తుగను దెలుపుటకే భగవాను డిపు డీ 15-వ అధ్యాయమును పూర్తిగా వెచ్చించును.

మఱియు, శ్రీ శంకరుడు 3-వ అధ్యాయము దగ్గఱనే గీతార్థ మంతయు సమాప్తమైన దని చెప్పియుండగా, ఈ 15-వ అధ్యాయమునందే గీతావిజ్ఞానము పెరిగిపెరిగి పరాకాష్ఠ నందుకొనును, ఈ అధ్యాయమే గీతాదేవికి తలమానికము – అని శ్రీ అరవిందుడు ఉగ్గడించును ఏలన, ఆదినుండియు నింతదనుక గీతాకిరీటమగు పురుషోత్తమభావము కేవలము ఉద్దేశింపబడెను (2-61), కేవలము సూచింప బడెను (3-22). నిరూపితమైనట్లు కేవలము తలంచబడెను. కాని ఇపు డా పురుషోత్తమ తత్త్వము పేరుపెట్టి ప్రత్యక్షముగా ప్రతిపాదించబడును (15-18).

మంచిది, కాని గీత ఎందు కిట్లు పురుషోత్తముని ప్రతిపాదించినట్లు ? తార్కిక మఱియు సాధనాపర మగు రెండు అతి కఠిన కఠినతలను పరిష్కరించుటకు, దివ్యముగా బరిష్కరించుటకు. ఆ దివ్య పరిష్కారమునే ఇపుడు దిఙ్మాత్రముగా జూతము.

ప్రపంచము పైకి దృష్టి సారించినపుడు, మన కేమి గన్పించును ? పురుగులు మట్టిలో బుట్టి మట్టిలోనే కలసిపోవుచున్నవి. అట్లే సర్వజంతువులును. జంతువులలో గన్పించు చేతన (తెలివి) యు ఆ మట్టియొక్క ఒక గుణమే.

కాని యిది పైకి అట్లు గన్పించు ఆభాససత్యము మాత్రమే. ఏలన ఈ మట్టియొక్క, అనగా ప్రకృతియొక్క క్రియ ననుసరించుచు, దానితో మాఱుచు, దాని ననుభవించుచు, దానిని శాసించుచు (5-29) నొక పురుషు డున్నాడు. ఇతడు ప్రకృతిలోపల నుండు పురుషుడు గాని, ప్రకృత్యంశమగు అహంకారము గాడు. ఇట్లు మాఱుచుండు ఈ పురుషుని గీత క్షరపురుషు డనును (15-16) ఇతడే సర్వభూతములును. పోతే, ఈ క్షరపురుషుని వెనుక, ఇతని ఆత్మయగు అక్షరపురుషు డున్నాడు. ఇతడు ప్రకృతి ననుసరించడు, దానితో బాటు మాఱడు దాని క్రియను నిరపేక్షముగా, ఉదాసీనముగా ధరించియుండును (13-23) ఇదిగో, సృష్టి యంతయు ఈ ఉభయ పురుషులతో గూడినదే – "ద్వా విమౌ పురుషౌ లోకే" (15-16)

గీతకు ఈ ఉభయ పురుషులను సత్యమే. అనగా పూర్ణసత్యము ఏకకాలమున క్షరము మఱియు అక్షరము గూడను, చరము మఱియు అచరము గూడను (13-16). కాని ఇది ఎట్లు సంభవము ? ఇది తర్కవిరుద్ధము గదా.

అవును, పురుషు లీ ఇరువురే యగుచో, ఇది తర్కవిరుద్ధమే. కాని గీత సర్వోత్తముడగు (15-17) తృతీయ పురుషుని ప్రతిపాదించును ఆ పురుషునియొక్క రెండు పార్శ్వములు క్షరాక్షర పురుషు లిరువురును. కావున అతనియందు ఈ పురుషు లిరువురు ఏకమగుదురు. ఈ తృతీయ పురుషుడు క్షర లేక అక్షర స్థరములోనివాడు గాడు. ఇతడు క్షరముకంటె నతీతుడు, అక్షరముకంటెను గూడ ఉత్తముడు (15-18). దీని అర్థ మేమన, ఇతడు క్షరునిచేత గాని, అక్షరునిచేత గాని పరిచ్ఛిన్నుడు గాడు. క్షరాక్షరాత్మకమగు ప్రపంచక్రియ ప్రవర్తించుచున్నను తాను దానుగనే యుండును. అందుచేతనే క్షరాక్షరు లిరువురు ఇతనియందు ఏకత నందుదురు. కనుక క్షరసత్యము అక్షరసత్యము పరస్పరవిరుద్ధము గావు. అవి సృష్టిక్రియందు పరస్పరపూరకములు. ఇట్లు క్షరాక్షరముల మధ్య తర్క విరోధము లేకపోవుటయే కాక, క్షరాక్షరద్వంద్వము సృష్టికి అవశ్యక మనియు దేలును.

ఇక రెండవ కఠినత సాధనకు సంబంధించిన కఠినత, క్షరాక్షర పురుషులిరువురే యున్నచో, ఒక దాని యం దున్నపుడు రెండవ దానియందుండుట అసంభవమగును, కారణము, అవి పరస్పరవిరుద్ధములు. ఎట్లన క్షరము ఒక సంభూతి; అది చలము, సక్రియము, సవ్యక్తికము, వ్యయశీలము. కాగా, అక్షరము ఒక సత్త; అది అచలము నిష్క్రియము, నిర్వ్యక్తికము, అవ్యయము. మఱియు క్షరమనేకముకాగా, అక్షరమేకము. అందుచేత చలమగు క్షరమునందు నివసించు నపుడు, అచలమగు అక్షరమునకు

దూరముగా నుందుము. దానియందు నివసింపజాలము. మఱియు అక్షరమునందు నివసించు నపుడు, క్షరము మనకు దూరమగును, అనగా క్షరప్రపంచమునకు సంబంధించిన దేశము, కాలము, కర్మ మననుండి పడిపోవును, ప్రపంచ మంతయు ఒక స్వప్నముగా మిథ్యగా గోచరించును. ఇదియే మాయావాదము వెనుక నున్న అనుభవము-" బ్రహ్మ సత్యం, జగ న్మిథ్యా".

తృతీయ పురుషుడగు పురుషోత్తముడు లేనిచో,ద్వితీయ పురుషుడగు అక్షరుని చేరుకొనుటకు నేతినేతి–మార్గమే శరణ్య మగును ఏలన,క్షరము సవిశేషము మరియు అక్షరము నిర్విశేషము. కావున నేతినేతి–యని క్షరమును నిషేధించుచు, దానితో సంబంధమును విడగొట్టుకొని, అక్షరమున ప్రవేశించవలెను. ఇట్టి మార్గమున 'జగన్మిథ్యా' వాద మనివార్య మగును.

పోగా, తృతీయ పురుషుడగు పురుషోత్తము డున్నపుడు, అతని చేరుకొను విధానము వేఱు. అతడు క్షరాక్షరు లిరువురికి మూలము, అనగా నతడు నిర్వ్యక్తిక మహాపురుషుడు (impersonal person). కనుక నతని చేరుకొను విధానము జ్ఞానసహితమగు భక్తి, కర్మలు. ఈ విధానమునందు అంతరాత్మ తన ప్రకృతిని త్యజించవలసిన పనిలేదు, దానిని తన మూలమగు దివ్యప్రకృతిలోనికి లేవనెత్తవలసి మాత్రమే యుండును. ఇట్లు లేవనెత్తి, జీవుడు భగవంతునితో 'సాధర్మ్యము'(14-2) నంది నపుడు, భగవంతునివలె ఏకకాలమున అక్షరాత్మయందు నెలకొని, క్షరాత్మ యందు వర్తించగలుగును (3-22). ఇట్లు పురుషోత్తమ ప్రతిపాదనచేత సాధనకు సంబంధించిన కఠినతయు పరిష్కరించబడును.

ఈ మార్గమునందలి ఒక విశేషము ; పురుషోత్తమునితో సాధర్మ్యము నంది నపుడు, జగత్తు మిథ్యగా తోచదు, దాని అర్థము మాత్రము మాఱిపోవును – అపుడది పురుషోత్తమునియందు (8-22), పురుషోత్తముడుగా (7-19), పురుషోత్తముని చేత (18-61), పురుషోత్తమునికొఱకు (5-29) వర్తించుచున్న దని తెలియవచ్చును.

మఱియు అమృతత్వ మన నేమి? క్షరమును విడిచి, అక్షరములో లీన మగుటయే మాయావాదము చెప్పు అమృతత్వము లేక మోక్షము. కాని ఇచ్చట ఈశోపనిషత్తు చెప్పునదేమి? – అక్షరజ్ఞానము లేక క్షరములో మునిగియుండుట ఒక అంధకారము, అజ్ఞానాంధకారము; మఱియు క్షరమును విడిచి, అక్షరములో మునిగి పోవుట అంతకంటెను ఎక్కువ అంధకారము, జ్ఞానాంధకారము. పోతే, ఉభయమును కలిసి తెలిసికొనినపుడే, అత డమృతత్వము ననుభవించును. అనగా జీవుడు ఏకకాల

మున అక్షరాత్మయందు అజుడుగా నుండి, క్షరాత్మయందు మునిగిపోక జీవించు నపుడే - అదియే అమృతత్వము. ఎటుల ద్వైత మున్నపుడే అద్వైతమున కర్థ మున్నదో, అటులే మరణము, లేక మార్పు ఉన్నపుడే అమృతత్వమున కర్థమున్నది. అమృతత్వమునకు గీత యిచ్చు నర్థము గూడ నిదియే - "సర్గేఽపి నోప జాయంతే, ప్రళయే న వ్యథంతి చ" (14-2)

కాని ఇట్లు ఉభయమునందు ఏకకాలమున నుండగలుగుటకు జీవుడు ఉభయము నకు బరమగు ఉత్తమునియందును ఉండవలెను. కనుకనే గీత, నేను (పురుషోత్తముడు) అమృతత్వమునకు ప్రతిష్ఠ (14-27) - అని చెప్పుచున్నది.

అయితే, స్వరూపతః పూర్వమే జీవు డీ మూడును లేక ముగ్వురును అయి యుండనిచో, అత డిట్లు ఏకకాలమున ముగ్వురియందును నెలకొనగలిగి యుండ జాలడు. కనుక ప్రతిప్రాణియు వస్తుతః ఈ మూడును అయియే యున్నాడు మూడు అయినను ఒకటియే యగు ఈ త్రివిధ చేతనయే (triple consciousness) గీత యొక్క కేంద్రభావన యని-శ్రీ అరవిందుడు. అది ఈ అధ్యాయము నందే ఒక సిద్ధాంతరూపమున వ్యక్తముగా ప్రతిపాదించబడినది దీనిని గుర్తింపజేయుటకే. శ్రీ అరవిందు డీ అధ్యాయమునకు 'త్రిపురుషులు' అని పే రిడెను.

శ్రీ భగవా నువాచ -

ఊర్ధ్వమూల మధఃశాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయం,
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్. 1

శ్రీ భగవానుడు చెప్పెను-విశ్వమను ఈఅశ్వత్థవృక్షమునకు మూలము పైనను, శాఖలు దిగువను గలవు. వేదమంత్రములే దీని ఆకులు. పెద్దలు దీనిని అవ్యయ మని చెప్పుదురు. కాగా ఈ వృక్షము నెఱింగినవాడు వేదవిదుడు.

విశేషార్థము : విశ్వమునకు పై నున్న 'ఆద్య పురుషునుండి ఇది ప్రభవించి నది' (15-4) గాన, దీనికి వేరు పైన గల దని చెప్పబడినది. 'అశ్వత్థం = రేపు ఉండనిది, సంతతము మాఱుచుండునది. ఈ విశ్వము క్షణ క్షణము మాఱుచుండు ఒక ప్రవాహము గాన, దీని కశ్వత్థ మను పేరు అన్వర్థకము. మఱియు ఆకులు చెట్టును పెంచి పోషించు కిరణజన్యక్రియను (photo-synthesis) తెలియజేయును అటులే వేదమంత్రములు మన సంసారమును పెంచు సకామయజ్ఞములను దెలుపును. కనుక వేదమంత్రములకు ఉపమానము ఆకులు. ఇచ్చట వేద మన పరమార్థవిషయకమగు

వేదము గాదు, 'త్రైగుణ్యవిషయకమగు' (2-45) వేదము, కావుననే ఈ వేదము లేక వేదవాదము గర్హింపబడినది (2-45). పోతే, ఈ వృక్షమవ్యయ మెట్లన, దేశమునందు గాని, కాలమునందు గాని దీని కాద్యంతములు లేవు (15-3).

అధశ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః,
అధశ్చ మూలా న్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే. 2

సత్త్వరజస్తమో గుణములచే వృద్ధి నందుచు, శబ్దాదివిషయములను చిగుళ్లుగా గల ఈ చెట్టు కొమ్మలు క్రిందికిని, పైకిని గూడ వ్యాపించియున్నవి. మఱియు కర్మప్రేరకములగు రాగాది వాసనారూపమగు దీని ఉపమూలములు క్రింద, మనుష్యలోకమునందు గూడ విస్తృతముగా నాటుకొని యున్నవి.

విశేషార్థము : మనుష్యస్థరమును బట్టి చూచిన, క్రిందకు స్థావరపర్యంతము, పైకి సృష్టికర్త, బ్రహ్మపర్యంతము శాఖలు ప్రసరించి యున్నవి. మానవులకే కర్మాధికారము గాన, మానవలోకమునందు ఉపమూలములు నాటుకొని యున్న వని చెప్పబడినది.

అవతారిక : కాని —

న రూప మస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాది ర్న చ సంప్రతిష్ఠా,
అశ్వత్థ మేనం సువిరూఢమూలం
అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా. 3

తతః పదం తత్ పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివర్తంతి భూయః,
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ. 4

పైన వర్ణించబడిన రీతిగా ఈ అశ్వత్థవృక్షముయొక్క యథార్థ రూపమిచ్చట తెలియబడునది కాదు. దీనికి ఆది గాని, అంతము గాని లేదు. మఱియు దీని కిచ్చట ఎట్టి సుస్థిర బాహ్యప్రతిష్ఠయు లేదు. బాగుగా వేళ్లు తన్నుకొని బలిసియున్న ఈ అశ్వత్థవృక్షమును బలమగు అసంగ శస్త్రముచేత నఱకివేసి —

పిమ్మట, ఎవనినుండి ఈ సృష్టివృక్షముయొక్క ఆద్యంతములు లేని క్రియా ప్రవృత్తి ప్రసరించుచున్నదో, ఆ ఆద్యపురుషుని మాత్రమే సర్వాత్మగా ఆశ్రయించి, ఏ పరమపదమును బొందిన తిరిగి జన్మించవలసిన అగత్య ముండదో, ఆ పరమ పదము నన్వేషించవలెను.

విశేషార్థము : ఈ సంసార వృక్షమునకు ఆదిగాని, అంతముగాని నిజముగనే లేదు. ఏలన అది ఒక సనాతనక్రియ—"పురాణీ" (15-4) మఱియు ఈ వృక్షమునకు 'ప్రతిష్ఠ' లేదన, అసలే లేదని కాదు. ఏలన పైనున్న ఆదిపురుషుడు దీని ప్రతిష్ఠగా గలడు. పోతే, ప్రతిష్ఠ లేదన, ఇచ్చట ఈ లోకమున ప్రతిష్ఠ లేదని మాత్రమే అర్థము – అని శ్రీ అరవిందుడు. పోతే, ఈ విశ్వము స్వప్నము, ఎండమావులు, ఆకాశనగరములు వంటిది గాన, దీనికి ఆది గాని, అంతము గాని, ప్రతిష్ఠ గాని ఉన్నదని చెప్పుటకు వీలులేదు – అని శ్రీ శంకరుడు. సృష్టి యొక 'పురాణ ప్రవృత్తి' ( 5-4) – అని తర్వాతి శ్లోకము స్పష్టముగా జెప్పుచున్నను, దాని నాయన పాటించ లేదు.

ఒకవేళ ప్రపంచము మిథ్య అయిన సత్యమగు ఆద్యపురుషునినుండి మిథ్యా ప్రపంచ మెట్లు వచ్చును ? – అని శంక గలిగిన, దాని కాయన సమాధాన మేమన గారడీవానినుండి మిథ్యావస్తువులు వచ్చుచున్నవి గదా ! కనుక ఆదిపురుష డొక గారడీవాడు !

3-వ శ్లోకముయొక్క ప్రథమ చరణము నందలి 'ఇహ' (ఇచ్చట) శబ్దము నకు శంకరవ్యాఖ్యానము లేదు. కాగా ఇచ్చట సదేహావస్థయందు ఈ సంసార వృక్షముయొక్క సత్యము మానవునకు దెలియదు–అని శ్రీఅరవిందుడు. ఎక్కడైనను ఒకడు ముక్తుడైనను ఈ విశ్వప్రవాహము ఆగిపోదు; దీనికి ఆద్యంతము లేవు– అను సత్యమును దేహసంగము లేనివాడు మాత్రమే తెలిసికొనగలడు – అని శ్రీ అరవిందుని ఆశయము.

చివరకు, పరమపదమును బొందుటకు ప్రపత్తి–'ప్రపద్యే' – శరణాగతి, సర్వసమర్పణ నొక్కడానినే ఇచ్చట గీత వక్కాణించి చెప్పుట గమనార్హము.

పురుషోత్తమభావముతో ఈ ప్రపత్తి ముడివడి యున్నది. ఇదియే గీతయొక్క మహావాక్యముగా (18-66) గూడ వచ్చును. శ్రీ అరవిందుడు గూడ నిదియే యోగ సంసిద్ధికి కీలక మని కొనియాడును. పోతే శ్రీ శంకరుని కిది ఇంకను భేదావస్థలో నున్న సామాన్య సాధకులకు జెప్పబడిన సాధన.

అవతారిక : ఈ 'ప్రపత్తికి' పూర్వసోపానము లేవి యన –

నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,
ద్వంద్వై ర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైర్
గచ్ఛం త్యమూఢాః పద మవ్యయం తత్. 5

నిన్ను మాయ కల్పించు వ్యాకులము మఱియు అహంకారము గతించినవారును గుణాదులయం దుండు (13-21) సంగదోషమును జయించినవారును, కామము లుప శమించినవారును, సుఖదుఃఖములను గల్గించు ద్వంద్వములనుండి విముక్తులైనవారును ఏతత్ఫలితముగా ఆధ్యాత్మికచేతనయందు సదా నిలిచియుండు వారు నగు సాధకులు అవ్యయమగు పరమాత్మ పదమును బొందుదురు

విశేషార్థము : 'వినివృత్తకామాః' = కామములు నివృత్తమైన యతులు సన్యాసులు-అని శ్రీ శంకరుడు. కామము లేనివాడు కర్మచేయడు, కామపూర్తికొఱకే కర్మ-యని ఆయన ఆశయము. కాని అది సర్వథా సత్యము గాదు. ఏలన కామ రహితమగు దివ్యకర్మయు నుండగలదు. ఎట్లన. "ఎవని బృహత్ కర్మలుసైతము కామసంకల్పవర్జితములో...."(4-19).

కర్మసహితముగా అత్మస్థుడైనవానికి, అచ్చట అతని అహంకారముమాత్రమే లయించును గాని, వ్యక్తిత్వము లయించదు. అప్పు డతనికి పరమాత్మతో దనకు గల సంబంధము దెలియవచ్చును; పరమాత్మకు తననుదాను సమర్పించుకొనును "ప్రపద్యే" (15-4). ఈ సమర్పణచేత నతడు ఆ పరమాత్మ పదమును(status) బొందును. ఇది లయము గాదు.

అవతారిక : ఆ పరమపదము 'నా' పదము —

న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః,
య ద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ. 6

(క్రిందటి శ్లోకమున జెప్పబడిన) ఆ అవ్యయ పదమును సూర్యుడు గాని, చంద్రుడు గాని, అగ్ని గాని ప్రకాశింపజేయజాలదు. అది నా పరమ ధామము. అర్జునా! దానిని ప్రాపించినవారు తిరిగిరారు (రానగత్య ముండదు).

విశేషార్థము: ధామము — 1. తేజము, 2. స్థానము; ఇచ్చట ఈ రెండు అర్థములు కలిసిన అర్థమును తీసికొనవలెను: ధామము = తేజోరూపమగు స్థానము. ఈ తేజము సనాతన పురుషుని సన్నిధియొక్క తేజము — అని శ్రీ అరవిందుడు ఈ తేజముయొక్క నిమ్న రూపమునే సూర్యాది తేజములు.

ఆ ధామమును బొందినవా రెందుకు తిరిగి రారు? అది భగవంతుని పరమ ధామము గనుక. అనగా క్షరము, అక్షరము—లు భగవంతుని కాలగత ధామములు కాగా, అది భగవంతుని కాలాతీత ధామము. అందుచేతనే అచ్చటినుండి తిరిగి రానగత్య ముండదు.

అవతారిక: జీవుడు స్వరూపతః ఆ 'పరమధామము' గానిచో, దానిని బొందజాలడు. ఆ సత్యమే ఇపుడు స్పష్టము చేయబడును —

మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః,
మనః షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. 7

జీవలోకమునందు జీవుడైనవాడు నా సనాతనాంశమే కాని, వేఱు కాదు. అతడు శరీరమున తమ తమ స్థానములం దుండు పంచేంద్రియములను మఱియు సామాన్యేంద్రియమగు మనస్సును తనతో బాటు తీసికొనిపోవును.

విశేషార్థము: జీవుడు జీవలోకమునందు నా అంశము. అనగా అభివ్యక్తియందు అతడు నా అంశము, అతడు నా ఆంశిక అభివ్యక్తి. అయినను అతడు నా అంశము గనుక, స్వరూపతః, అనగా తన ఆధ్యాత్మిక సత్యతయందు, అతడు నేనే, అతడు నాకంటె ఇతరుడును గాడు, నా నుండి వేఱుపడియు లేడు. ఏకమగు అక్షరము లేక ఆత్మ నేనైనట్లే, అనేకమగు క్షరము, లేక జీవుడును నేనే (15-17).

మఱియు ప్రతి జీవుడును భగవదంశము మాత్రమే కాక, భగవంతుని సనాతనాంశము, అనగా సనాతన వైయక్తిక పురుషుడు, ఏకమాత్ర భగవంతునియొక్క అజము, అమరము నగు ఒక సనాతనశక్తి. ప్రతిజీవుడు నిట్లు సనాతనుడు గావుననే, మోక్షమునందు గీత జీవలయము నెచ్చట చెప్పలేదు, లయమును సూచించు నే

పదమును వాడలేదు. పైగా జీవుడు సంసిద్ధియందు 'నాయందు నివసించును' (12-8) — అనిగూడ గీత చెప్పును. 'సనాతన' — అను శబ్దమున కేమైనను అర్థమున్నచో, ఇదియే దాని అర్థము. దీనిని విఱిచివిఱిచి. "తిమ్మిని" బొమ్మను జేయుట గీతకు అపచారము చేయుటయే అగును - అని శ్రీ అరవిందుడు ఆగ్రహముతో ననును.

అయినను, జీవుని అంశ మని చెప్పుచున్నను, గీతామతము విశిష్టాద్వైతమత మని మనము అమాంతముగా నిర్ణయించగూడదు. ఏలన గీత జీవు లందరికి ఆత్మ ఒకటియే (6-29), (5-7) - యని గూడ చెప్పును. అనగా అద్వైతము, విశిష్టాద్వైతము గీతయొక్క పురుషోత్తమునికి రెండు పార్శ్వములు. అనగా నా పురుషోత్తముడు అనేకమగు ఏకము మఱియు ఏకమగు అనేకము మఱియు ఏకానేకములకు అతీతము. అతీతము గావుననే ఉభయము.

పురుషోత్తమునియొక్క ఈ సనాతన బహుత్వమే అంతరాత్మ అభివ్యక్తి వెనుక నున్న పరమ గుహ్యము. ఈ బహుత్వము లేనపుడు జీవికి అంతరాత్మ ఉండదు, జీవియందు దివ్యాంశ మేమియు నుండదు, జీవి కేవలము మట్టినుంచి పుట్టి మట్టిలో కలిసిపోవు పాంచభౌతిక వస్తువే యగును—అని శ్రీ అరవిందుడు.

మఱియు నీ అంతరాత్మ ఇప్పటి తన అభివ్యక్తరూపముకంటె నెంతో అధికతరము. అది గతమున పశువునందు మానవునియందుకంటె తక్కువ అభివ్యక్తిగా నుండెను, ఇక ముందు అతిమానవునియందు మానవునియందు కంటె నెంతో ఎక్కువ అభివ్యక్తిగానుండును. ఇట్లు అంతరాత్మ మానవతకు మాత్రమే బద్ధమై యుండదు.

పోతే, శ్రీ శంకరు డేమి చెప్పునో చూతము—పరమాత్మ యందు నిజానికి అంశాలు, అవయవాలు లేవు. ఘటములోని ఆకాశము మహాకాశముయొక్క ఒక అంశముగా గన్పించును. ఘటమును పగులగొట్టినపుడు ఆ అంశము మహాకాశములో కలిసెను—అని మఱల అనిపించును. అటులే దేహాది ఉపాధిచేత పరమాత్ముడు జీవుడనిపించును. మఱియు ఆ ఉపాధిని భగ్నము చేసినపుడు, జీవుడు పరమాత్మను బొందెను—అని వ్యవహారమునకు చెప్పబడును. ఇది యంతయు అవిద్యాకృతము— అని శ్రీ శంకరుడు.

మంచిది, కాని పరమాత్మను అవిద్య ఎట్లు లొంగదీసికొనెను ? ఏమో, తెలియదు, అది 'అనిర్వచనీయము'—అని ఆయ ననును. పోతే, జీవుడు సనాతనుడు, జ్ఞానమునందును అతడు ఆధ్యాత్మికవ్యక్తిగా నిలిచియుండును (12-8)—అని గీత

చెప్పును గదా? దీనికి శ్రీ శంకరు డే మనును ? దీని నాయన దాటవేసెను దీనిని వ్యాఖ్యానించనే లేదు.

ఒకవేళ పరమాత్మకు అంశములు, లేక అవయవాల నంగీకరించిన, 'అంశవిభాగముచే' పరమాత్మకు నాశప్రసంగము వచ్చును. కావున అంశముల నంగీకరించుటకు వీలు లేదు — అని శంకరవాదము. కాని ఇది నిలువదు. ఏలన, అంశ మన పరమాత్మయొక్క ఒక ముక్క యని అర్థము గాదు. ప్రతివానికిని ఒక శాశ్వతమైన స్వభావము గన్పించుచున్నది గదా. ఈ స్వభావము = స్వ + భావము, స్వ = పరమాత్మయొక్క, భావము = శక్తి. అనగా ఎన్నెన్ని స్వభావములు గన్పించుచున్నవో, అవి అన్నియు పరమాత్మయొక్క, ఒకే పరమాత్మయొక్క, అనేకానేక శక్తివిశేషములు. అనగా ఒకే పరమాత్మ తన అనేకానేక సనాతన శక్తులచే అనేకానేక సనాతన జీవులయ్యెను (7-5). ఈ అర్థమున జీవులు పరమాత్మ యొక్క ముక్కలు గాదు. ఉన్న సనాతన శక్తియే జీవరూపమున అభివ్యక్త మగుచున్నది గాన, ఈ అభివ్యక్తిచేత పరమాత్మకు నాశప్రసంగమును లేదు.

పోతే, అభివ్యక్తి ఒక మార్పు గదా, మఱియు మార్పు నాశలక్షణముగదా — యనిన, అదియును గాదు. ఏలన పరమాత్మ మాఱుచుండు క్షరపురుషు డగుచునే, అదే సమయమున తదతీతుడగు పురుషోత్తముడు గూడను. అందుచేత మార్పునందు అతడు ఇమిడిపోడు. కనుక మాఱుచున్నను తాను దానగనే యుండును. ఇట్లు అభివ్యక్తిచేత నతనికి నాశప్రసంగము లేదు.

అవతారిక : ఇంద్రియముల నెప్పుడు జీవుడు తనతో గొనిపోవును ? —

**శరీరం య దవాప్నోతి యచ్చాప్యుత్క్రామ తీశ్వరః,**
**గృహీత్వైతాని సంయాతి వాయు ర్గంధా నివాశయాత్. 8**

ఈశ్వరుడే యగు జీవుడు నూతన శరీరమును ధరించునపుడును, పురాణ శరీరమును విడిచి వెళ్లునపుడును ఇంద్రియములను తనతోబాటు తీసికొనియే చనును — వాయువు పుష్పములనుండి గంధములను గొనిపోవునట్లు.

విశేషార్థము : క్రిందటి శ్లోకము క్రింద వ్యాఖ్యానించుకొనినట్లు, ఈశ్వరుడే జీవరూపమున విషయానుభవముకొఱకు ఇంద్రియములతో బాటు దేహము ధరించు చున్నాడని ఈ శ్లోకమున స్పష్టపడుచున్నది — అని శ్రీ అరవిందుడు. కనుక నిది శ్రీ శంకరుడు చెప్పినట్లు, మిథ్యావ్యాపారము గాదని తెలియవలెను. పోతే, ఇచ్చటి

ఈశ్వరపదమునకు సూటి అర్థము నంగీకరించుట కిష్టము లేక, "ఈ ఈశ్వరుడు దేహాది సంఘాతమునకు ఈశ్వరుడగు జీవు"డని శ్రీ శంకరుడు

అవతారిక : ఆ ఇంద్రియము లేవి యన —

శ్రోత్రం చక్షుః స్పర్శనంచ రసనం ఘ్రాణ మేవచ,
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే. 9

చెవి, కన్ను, చర్మము, నాలుక, ముక్కు మఱియు మనస్సు - ఈ ఆఱు ఇంద్రియములను దన వశమునం దుంచుకొని, వీనిద్వారా జీవుడు, ఇంద్రియవిషయములను అనుభవించును.

అవతారిక : అయినను ఈశ్వరుడే యగు ఈ జీవుని 'విమూఢులు' గనజాలరు—

ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానంవా గుణాన్వితం,
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః. 10

మరణసమయమున శరీరమునుండి లేచిపోవునపుడు గాని, శరీరమునం దున్నపుడు గాని, విషయములను అనుభవించునపుడు గాని, గుణకార్యములగు సుఖదుఃఖమోహములచే యుక్తుడైనపుడు గాని ఈ జీవుని విమూఢులు గనజాలరు, జ్ఞానచక్షువులు మాత్రమే కనగలరు.

విశేషార్థము : జీవుని గనజాలరు — అన, జీవునియొక్క మానవ లేక తదితర రూపములచే మోహితులైన విమూఢులు జీవునికిని, ఈశ్వరునికిని గల ఏకతను గనజాలరు, జీవుని నిజస్వరూపమును గన జాలరు-అని అర్థము. ఇట్లు గుణసంభ్రమమునకు లోనుగాక, తమ జ్ఞాననేత్రవికాసమును సాధించిన యోగులు మాత్రమే జీవుని పూర్ణసత్యమును గనగలరు.

అవతారిక ; ఈ జ్ఞాననేత్రము నెట్లు సాధించవలెను ?—

యతంతో యోగిన శ్చైనం పశ్యం త్యాత్మ న్యవస్థితం,
యతంతో౽ప్యకృతాత్మానో నైనం పశ్యం త్యచేతసః. 11

ఆధ్యాత్మిక చేతనతో యోగయుక్తులైన యోగులు ప్రయత్నము జేయుచు, తమయందే ఈ ఈశ్వరుని (15-8) దర్శింతురు. కాని, అట్టి చేతసలేని అకృతాత్ములు ఎంత ప్రయత్నము చేసినను, అతనిని గనజాలరు.

విశేషార్థము : 'అకృతాత్మలు' = అసంస్కృతాత్మలు, తపస్సుచేత చిత్త సంస్కారమును సాధించనివారు, దుశ్చరితులు. ఇట్టివారు శాస్త్ర ప్రమాణములను బట్టియే ప్రయత్నించినను, ఆత్మను గనజాలరు — అని శ్రీ శంకరుడు. పోతే — అకృతాత్మలు = కృతాత్మలు గానివారు, కృతాత్మ = తన ఆధ్యాత్మిక సత్తను నిర్మించుకొనినవాడు, తన ఆధ్యాత్మిక రూపమును నిర్మించుకొని పూర్ణుడైనవాడు. ఇట్టి కృతాత్ముడు మాత్రమే హృదయస్థుడగు ఈశ్వరుని తనయందే దర్శించగలడని శ్రీ అరవిందుడు

సామాన్యునికి అసత్యమాడుట ఎంత తేలికో, ధర్మరాజునకు అసత్యమాడుట అంత కష్టము, సత్యమాడుట అంత తేలిక. అనగా ధర్మరాజుయొక్క చేతనా నిర్మాణమే వేఱు. ఇటులే పశువుయొక్క చేతనారూపము(mould of consciousness) వేఱు, సామాన్య మానవుని చేతనారూపము వేఱు, ఆధ్యాత్మిక మానవుని చేతనా రూపము వేఱు ఈ దృష్టాంతమును బట్టి 'కృతాత్మ' - పదమునకు శ్రీ అరవిందుడు తన అనుభవమునుండి చెప్పిన అర్థము మనకు బోధపడగలదు.

కృతాత్మ-సమాసములోని 'కృత' మఱియు 'ఆత్మ'-శబ్దములకు ఇంత శాబ్దిక (literal) అర్థమును జెప్పినవారు అరవిందుడు గాక, మఱియొకరు లేరు అయినను అది గభీరానుభవమునకు సరిపోవుట చాల విచిత్రము. దీనిని బట్టి, అనుభవజ్ఞులు వాడిన అనేక శబ్దములకు సూటి అర్థమునే చెప్పుకొనవలసియుండును — అని మనకు సూత్రప్రాయముగా దెలియును.

శ్రీ శంకరుడు, పైన చూపినట్లు, చేతనయొక్క సంస్కారమును మాత్రమే చెప్పుచుండ, శ్రీ అరవిందుడు చేతనయొక్క రూపాంతరమును జెప్పును. సంస్కృత అనగా సంస్కరింపబడిన చేతనచేత అంతరాత్మ ప్రకృతిని విడిచి, అమాంతముగా ఆత్మలోనికి దూకగలదేమో గాని, ఆత్మయందు నెలకొని, అదే సమయమున ప్రకృతితో ప్రకృతియందు వ్యవహరించజాలదు ఈ పని శ్రీ అరవిందుడు చెప్పిన రూపాంతరిత చేతన చేయగలదు. అనగా ఒకటి జీవన సన్న్యాసములో దింపగా, రెండవది విముక్త జీవనవైభవము నిచ్చును.

అకృతాత్మలు చేతన లేనివారు — "అచేతసః"-అన, ఆధ్యాత్మికచేతన లేనివారు-అని భావము ఈ అర్థము పైన శ్రీ అరవిందుడు చెప్పిన 'కృతాత్మ'-అర్థమునకు అనురూపముగా నుండును. పోతే, 'అచేతసః' — అవివేకులు — అని శ్రీ శంకరుడు.

అవతారిక : కృతాత్ములు ఈశ్వరుని తమ లోపలనే కాక, వెలుపల ఆదిత్యాదులయందును జూతురు -

**యదాదిత్య గతం తేజో జగ ద్భాసయతేఽఖిలం,**
**యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకం.12**

సూర్యునియందు గల ఏ తేజము జగత్తు నంతను ప్రకాశింప జేయుచున్నదో, అటులే చంద్రునియందును, అగ్నియందును ఏ తేజము గలదో, అది అంతయు నా తేజమే యని, అర్జునా, నీ వెఱుంగుము.

విశేషార్థము ; సూర్యుని తేజము సరాసరి భగవత్తేజము గాదు. ఆ సూర్యుని తేజమునందు తదాత్మగా నే చైతన్యాత్మక తేజముగలదో, అది భగవంతుని స్వీయ తేజము. కాగా సూర్యుని బాహ్యజడ తేజము ఆ చేతనతేజముయొక్క నిమ్నరూపము. లోపలి తేజము బాహ్యతేజముద్వారా జగత్తును భాసింపజేయుచున్నది- అని శ్రీ అరవిందుడు. శ్రీ శంకరుడు ముందు 'బాహ్యతేజము' అర్థమును జెప్పి, తర్వాత శ్రీ అరవిందుని అర్థమునే చెప్పును.

**గామావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా,**
**పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః. 13**

మఱియు, నేను భూమిలోపల ప్రవేశించి, నా ఓజశ్శక్తిచేత భూతముల నన్నింటిని ధరించియున్నాను. అటులే సోమరసమునకు అధిష్ఠానదేవతనై భూమి యందలి రసముచేత మొక్కలను, చెట్ల నన్నింటిని పోషింతును.

విశేషార్థము : భగవంతుడు భూమిలోపల ప్రవేశించి, భూమియొక్క జడశక్తికి ఆత్మయై, వ్యక్తిగత శరీరమును వైయక్తిక ఆత్మవలె, జీవకోట్లను ధరించును – అని శ్రీ అరవిందుడు.

రసస్వరూపుడగు చంద్రుడై, భగవంతుడు ఓషధులను పోషించుచున్నాడు - అని శ్రీ శంకరుడు వ్యాఖ్యానించగా, రసాధిష్ఠాన దేవతయగు సోముడై భగవంతుడు భూమియందలి రసముచేత ఓషధులను పోషించుచున్నా - డని శ్రీ అరవిందుడు. ఈ అర్థము ఎక్కువ విజ్ఞానశాస్త్ర సమ్మతముగా నున్నది గదా.

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః,**
**ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధం. 14**

మఱియు, వైశ్వానరు డను పేరుగల జఠరాగ్నినై, నేను ప్రాణుల దేహము నందు ప్రవేశించి, అచ్చటి ప్రాణాపాన వాయువులతో గూడుకొని, భక్ష్య, భోజ్య, లేహ్య, శోష్యము లనబడు నాలుగు ప్రకారముల ఆహారమును జీర్ణముచేయుదును.

విశేషార్థము : జఠరాగ్ని యనునది ప్రాణులయందే యుండును. కావున జఠరాగ్ని ప్రాణులయందలి ప్రాణజ్యోతికి ఉపలక్షణము కనుక నిజానికి వైశ్వానరు డన ప్రాణజ్యోతియే. ఈ ప్రాణజ్యోతి అన్నమును పచనము చేయుటయే కాక, స్థూలశరీరమును గూడ పట్టి నిలుపును – అని శ్రీ అరవిందుడు.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనంచ,
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో
వేదాంతకృద్ వేదవిదేవ చాహం. 15

మఱియు, నేను సర్వజీవుల హృదయమునందును ఆసీనుడనై యున్నాను; నానుండియే జ్ఞాపకము, జ్ఞానము మఱియు తర్కవితర్కములు వచ్చుచున్నవి: సర్వ వేదములచేతను తెలియదగిన వాడను నేనే, చివరకు వేదవిదుడను గూడ నేనే, వేదాంతకర్తను గూడ నేనే.

విశేషార్థము : 'వేదాంతకృత్' = వేదాంతకర్త, వేదాంతార్థ సంప్రదాయకర్త. చూ. (4-1).

భగవద్విభూతులను జెప్పిన పై నాలుగు (15-12.... 15) శ్లోకములందును ఇతరులు పసికట్టని ఒక సంపూర్ణ క్రమమును శ్రీ అరవిందుడు మన కిట్లు తెలుపును– "వేఱు మాటలలో భగవంతు డేక కాలమున, 1. ద్రవ్యముయొక్క అంతరాత్మ (ద్రవ్యగత పురుషుడు) (15-12, 13), 2. ప్రాణముయొక్క అంతరాత్మ (15-14) 3. మనస్సుయొక్క అంతరాత్మ (15-15),-అటులే 4. మనస్సుమఱియు దానితార్కిక ప్రజ్ఞకు అతీతమగు "మత్తః"(15-15)-అతిమానస తేజమునకును అంతరాత్మ.

భగవంతుడు, ద్రవ్యమునకు అంతరాత్మ గనుకనే, ద్రవ్యము. ద్రవ్యము యొక్క ఈ అంతరాత్మను దెలిసినపుడు, ద్రవ్యము భగవంతుడే యని మనకు దెలియును. "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" (తై.ఉ.) అను ఉపనిషద్ వాక్య మీ అర్థమునే చెప్పును.

భగవంతుడు ద్రవ్యాదులయొక్క, ఒక వైపున, ఆత్మయగుచునే, రెండవ వైపున ద్రవ్యాదులయొక్క అంతరాత్మయు. శంకరసంప్రదాయమున ఈ ఆత్మ, అంతరాత్మల వివేచన లేదు. అచ్చట ఉన్న దంతయు అచలమగు ఆత్మ మఱియు చలమగు మిథ్యాప్రకృతి.

ఇట్లు లోకమునందు, అనగా సృష్టియందు, సృష్టిప్రక్రియకు ఆవశ్యకమగు రెండు తత్త్వములు గన్పించును–1. సంతతము మాఱుచుండు మనఃప్రాణదేహములు, 2. వానికి అతీతమగు మాఱనే మాఱని ఆత్మతత్త్వము. మఱియు ఈ రెండు తత్త్వముల యందలి పురుషు లిరువురును భగవంతుడే. ఈ సత్యమే తక్కిన అధ్యాయమున శాస్త్రీయ పరిభాషయందు ప్రతిపాదించబడును —

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ,
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే. 16

లోకమున క్షరుడనియు, అక్షరుడనియు ఇరువురు పురుషులు గలరు. అందు సర్వభూతములే క్షరుడు, మఱియు కూటస్థుడే అక్షరుడు.

విశేషార్థము : క్షరుడు= వినాశి, నశించు శీలము గలవాడు. పోతే సర్వభూతములే క్షరుడు, అనగా నశించు శీలము గల దేహాది ఉపాధిసమూహమంతయు క్షరుడు, అని శ్రీ శంకరుడు. ఇది సరికాదు, ఏలన దేహాదికము క్షరమగును గాని, క్షరు డెట్లగును, అనగా క్షరపురుషు డెట్లగును ? కనుక క్షరపురుషుడన దేహాదికముగాదు, దేహాదికములో, దేహాదికముతోబాటు మాఱుచు, దేహాదికమును ధరించియుండు పురుషుడు.

మఱియు, అక్షరుడు = అవినాశి, అచలుడు, పోతే కూటస్థుడే అక్షరుడు, అనగా మాయ, లేక మాయారూపమున నున్నవాడు అక్షరుడు – అని శ్రీ శంకరుడు. ఏలన కూటము = మాయ. ఈ మాయయే సంసార బీజము. మఱియు సంసార బీజమునకు అంతములేదు గాన, ఈ మాయ అక్షరము, అవినాశి – అని చెప్పి, శ్రీ శంకరు డెటులో సరిపెట్టును. కాని ఇదియును సరికాదు. ఏలన కూటస్థుడు = అచలుడు, అనునదియే సూటి అర్థము. మఱియు అక్షరు డనినను ఇదే అర్థము. కనుక అక్షరుడు = కూటస్థుడు, అనగా అచలుడగు ఆత్మపురుషుడు. (చూ. 12–3).

శబ్దార్థము గాక, సందర్భార్థమును దీనినే చూపును. ఎట్లన లోకమునందు క్షరాక్షరు లిరువురు గలరు, అనగా సృష్టిప్రక్రియకు వీ రిరువురు ఆవశ్యకము. ఇక సృష్టిక్రియయందు అక్షరుడు క్షరక్రియకు ఆధారముగా నుండును. కనుక

చలుడగు క్షరునకు ఆధారముగా నుండుటకు, అక్షరుడు అచలమగు ఆత్మయే కావలెను.

మంచిది, కాని క్షరుడు = దేహాదికము, అక్షరుడు = దేహాదికమునకు మూలమగు మాయ—అని శ్రీ శంకరు డెందుకు చెప్పినట్లు ? ఎందుకన క్షరాక్షరు లిరువురు రెండు ఉపాధులు, అవి జీవునికి పరిమితత్వము కల్పించి బంధించును. ఈ ఉపాధిద్వయము కంటె అన్యము ఆత్మ. ఈ ఆత్మ నిరుపాధికము, అనగా నిర్విశేషము, నిత్య శుద్ధము, ఉపాధిదోషములచేత అస్పృష్టము, ఈ ఆత్మనే శ్రీ శంకరుడు పరమాత్మ లేక పురుషోత్తము డని చెప్పను. ఆయనకు ఆత్మపైన మఱియొక తత్త్వములేదు అందుచేత ఆత్మ కూటస్థునికంటె అతీత మని చెప్పవలెననిన, కూటస్థుడన మాయ - యని ఆయనకు చెప్పక తప్పలేదు. పోతే క్షరమునకు ప్రత్యర్థియగు ఆత్మనే (అక్షరమునే) పరతత్త్వమని చెప్పుటచేత, ఆయన సిద్ధాంతమునందు క్షరాక్షరములకు సమన్వయ మెప్పటికిని కుదురదు.

అందుచేతనే విరుద్ధములుగా గన్పించు ఈ రెండు తత్త్వములును మానవ మనస్సును తమతమ వైపునకే బలత్కారముగా నాకర్షించుకొనుచుండును మఱియు నొకదాని నొకటి ధ్వంసముచేయ ప్రయత్నించుచున్నట్లు గన్పించును. ఇపుడు ఈ ఉభయపురుషుల సమన్వయము సాధించు తృతీయ పురుషుని గీత ప్రతిపాదించును -

**ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః,**
**యో లోకత్రయ మావిశ్య బిభర్త్య్వవ్యయ ఈశ్వరః. 17**

క్షాని క్షరాక్షరపురుషు లిరువురి కంటెను అన్యుడగు ఉత్తమపురుషుడు గలడు. అతనిని పరమాత్మ యందురు, అతడే అవ్యయ ఈశ్వరుడు, ముల్లోకములను ఆవేశించి భరించువా డతడే.

విశేషార్థము : 'అన్యుడు' = క్షరాక్షరులకంటె ఉత్తముడు అత్యంత విలక్షణుడు—అని శ్రీ శంకరుడు. ఏలన క్షరాక్షరులు. అవిద్యారూపులు. ఇది సరికా దని శ్రీ అరవిందుడు. ఏలన క్షరముయొక్క సత్యము గూడ పురుషోత్తముని యొక్క సత్యమే. కారణము, సర్వప్రాణుల హృదయమునం దున్నవాడు పురుషోత్తముడే మఱియు అసంఖ్యాక విభూతులద్వారా వ్యక్తమగుచున్న వాడును పురుషోత్తముడే మఱియు కాలపురుషుడుగా (11-32) అర్జునుని కాదేశ మిచ్చిన వాడును పురుషోత్తముడే. అటులే అక్షరసత్యమును పురుషోత్తమ సత్యమే. ఏలన సర్వభూతముల ఆత్మగా నున్నవాడు పురుషోత్తముడే (10-20). ఇట్లు

క్షరాక్షరుల సత్యమును పురుషోత్తముడే గావున, ఇతడు, శంకరుడు చెప్పినట్లు, క్షరాక్షరులకంటె అత్యంతవిలక్షణుడు గాడు.

మంచిది, కాని అతడు క్షరాక్షరులకంటె 'అన్యుడు' - అని ఏల జెప్పబడినది ? ఏలన, అతడు క్షరుడైనను క్షరుడు మాత్రమే గాడు, అటులే అక్షరుడైనను, అక్షరుడు మాత్రమే గాడు. నిజానికి అతడు అన్యుడు గావుననే, ప్రత్యర్థులగు నుభయపురుషులు ఏకకాలమున కౌగలిగెను – అని శ్రీ అరవిందుడు.

క్షరునికంటె పరుడు (పైనుండువాడు) గాన, అక్షరుడు 'ఉత్తరుడు'. అక్షరుని కంటె పరుడు గావున పురుషోత్తముడు 'ఉత్తముడు' (15-17) ఇట్లు ఉత్తముడను అర్థమున పురుషోత్తముడు క్షరాక్షరులకంటె అన్యుడు గాని, అత్యంత విలక్షణుడను అర్థమున గాదు.

ఈ ఉత్తముడు ఆత్మకు గూడ ఆత్మ గాన, ఇతనిని పరమాత్మ యందురు; ఇది సూటి అర్థము. పోతే, అవిద్యచేత ఆత్మలుగా గన్పించు దేహాది ఆత్మలకంటె పరము గాన, ఆత్మయే పరమాత్మ – యని శ్రీ శంకరుడు.

'బిభర్తి' = భరించును ; ఇచ్చట సత్య మంతయు మూడు రాశులుగా విభజింపబడినది – క్షరము, అక్షరము, ఉత్తమము. కాగా క్షరపురుషుడు క్షరప్రకృతి క్రియను అనుగమించుచు నుండనిచో, అనగా అనుగమించుట – యను రూపమున దాని భరించనిచో, క్షరక్రియ కొనసాగజాలదు. ఇట్లు పరమాత్మ క్షరపురుష రూపమున క్షరలోకమును భరించును. అటులే అక్షరపురుషరూపమున అక్షర లోకమును, ఉత్తమపురుషరూపమున ఉత్తమలోకమును భరించును.

'ఈశ్వరుడు' : పురుషోత్తముడు మూడు లోకములందును ఈశ్వరుడే. హృదయస్థుడై (18-61) క్షరలోకమును నడుపును గాన, అతడు క్షరలోకమున 'ఈశ్వరుడు'. మఱియు అక్షరపురుషుడుగా పురుషోత్తముడు క్షరక్రియను 'అనుమతించును' (13-23) గాన, అతడు అక్షరలోకమున 'ప్రభువు' (5-14). చివరకు ఉత్తమపురుషుడుగా యజ్ఞతపస్సుల ఉపభోక్తయగు (5-29) యజ్ఞేశ్వరుడు (8-4) గాన, పురుషోత్తముడు ఉత్తమలోకమున 'మహేశ్వరుడు' (5-29).

ఇట్లు ఉత్తమపదమునందు నైతము పురుషోత్తముడు మననుండి విడిపడి లేడు, మనగోడు పట్టించుకొనని నిర్వ్యక్తిక సత్తామాత్రము గాడు–శ్రీ శంకరుడు నిర్వ్యక్తిక సత్తామాత్రమనియే చెప్పును. అతడు పరిపూర్ణుడయ్యును (3-22) మన యజ్ఞము

నారగించును (5-29), మన పూజను స్వీకరించును (9-26), మనలను తన లోనికి ఉద్ధరించును (12-7), అతడు మనకు తల్లి మఱియు తండ్రి (9-17) అతడు జగత్తునకు మూలము (10-8), అనగా సర్వము తన పరమ సత్యము నతనియందు బొందును. ఇట్లతడు సర్వాత్మక పరబ్రహ్మము గాని, శ్రీ శంకరుడు ప్రతిపాదించు సర్వనిషేధక బ్రహ్మము మాత్రమే గాడు.

మఱియు, క్షరాక్షరు లిరువురు గలిసి పురుషోత్తము డగుదురు-అని తలంచుట యందు పెద్దపొరపాటే. పురుషోత్తముడు టరాక్షరాత్మకుడు మాత్రమే గాదు. క్షరాక్షరు లిరువురు అభివ్యక్త ప్రపంచమునకు సంబంధించిన వారు. మఱియు నీ ప్రపంచము నంతను భగవంతుడు తన ఒక అంశముచేత, కిరణముచేత, ధరించి యున్నాడు (40-42) ఇట్లు క్షరాక్షరుల దృష్ట్యా అతడు అనంతుడు. కావున క్షరాక్షరులచేత నతడు 'నిర్ణీతుడు'(determined), పరిచ్ఛిన్నుడు గాడు. అందుచేత క్షరాక్షరులు తననుండి వెలువడి నప్పటికి, తన విస్తారమే ఆయినప్పటికి తాను దాను గనే యుండును, తన కే వినాశప్రసంగమును ఉండదు.

ఫలతః పురుషోత్తముడు క్షరాక్షరులకు ఏకమాత్ర మూలము (15-1) గాన, వారు పురుషోత్తమునియందు సమన్వయమును, సామరస్యమును మాత్రమే కాక, తమ ఏకతను గూడ గనుగొందురు ఇట్లు ఈ పురుషోత్తమతత్త్వమే సమన్వయ కీలకము. మఱియు పురుషోత్తముడు క్షరాక్షరులకు అతీతుడు గాన,క్షరాక్షరులు అతని పార్శ్వములే గాన, అతడు ఏకకాలమున సగుణుడు మఱియు నిర్గుణుడు, సాకారుడు మఱియు నిరాకారుడు, సవ్యక్తికుడు మఱియు నిర్వ్యక్తికుడు, సక్రియుడు మఱియు నిష్క్రియుడు, అనేకుడు మఱియు ఏకుడు, సత్త మఱియు సంభూతి,....

అవతారిక : ఇపుడు నామతః పురుషోత్తముని ప్రథమ ప్రస్తావన —

యస్మాత్ క్షర మతీతోఽహం అక్షరాదపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః. 18

నేను, ఓ అర్జునా, క్షరపురుషుని కంటెను, అతీతుడను అక్షరాత్మకంటెను గూడ ఉత్తముడను. అందుచేతనే, పార్థా, లోకవ్యవహారమునందును, వేదపరిభాష యందు పురుషోత్తముడ-నని ప్రసిద్ధి కెక్కియున్నాను.

విశేషార్థము : ఇంత దనుక నేను నేను-అని అర్జునునకు ఉపదేశముచేయుచు వచ్చిన దివ్యగురు వెవరో, ఇపుడు మాత్రమే మనకు పూర్ణముగా ప్రకటింపబడినది అతడు సర్వమును, సర్వాతీతుడును, ఏకమాత్రుడును అయిన పురుషోత్తముడు.

వేదమునందు ఈపురుషోత్తమ సిద్ధాంతము వ్యక్తముగా ప్రతిపాదించబడిలేదు, అక్కడసూచనాప్రాయముగా మాత్రమే వచ్చును. "పురుషః.... అక్షరాత్ .... పరతఃపరః" (ముం. ఉ.) "పరాత్ పరం పురుషం" (ముం. ఉ.) – అనగా, పరుడగు అక్షరుని కంటెను పరుడగు పురుషుడు, పరాత్పరుడగు పురుషుడు. ఇట్లు వేదమునందు పరాత్పరుడు – అనే పదమే వచ్చినది గాని, పురుషోత్తముడు–అను పదము రాలేదు. మఱియు నక్కడ ఈ పరాత్పర సూచనయే వచ్చినది గాని, దానిని పెంపొందించి, దాని కొక సిద్ధాంతరూప మీయబడలేదు. ఆ సూచనకు సిద్ధాంతరూప మిచ్చి, విస్పష్ట శబ్దములలో ప్రతిపాదించి, దివ్యజీవనమునకు దారితీసిన అద్వితీయ ప్రతిభ మఱియు ఘనత గీతకే దక్కినని శ్రీ అరవిందుడు

పురుషోత్తమరూపమగు ఏ గుహ్యము(mystery)గలదో, అదియే దివ్యప్రేమ మఱియు దివ్యకర్మల వెనుకనున్న రహస్యము. పురుషోత్తముడు లేనిదే, అజ్ఞానము నందు తప్ప, జ్ఞానమునందు భక్తి కర్మల కాధారమే యుండదు. ఏలన జ్ఞానమునందు మిగిలియుండు అక్షరాత్మ నిర్వ్యక్తికముగాన, భక్తి కాధారముండదు. నిష్క్రియము గాన, కర్మ కాధారముండదు. ఈ పురుషోత్తముదే భక్తిజ్ఞానకర్మల గీతాసమన్వయము నకు ఆశ్రయము.

పురుషోత్తమ ప్రాతిపదికపై ఈ సమన్వయమును–మధ్యకాలమున లుప్తమైన ఈ సమన్వయమును – ఈ పూర్ణయోగమును ప్రతిపాదించిన అద్వితీయ ఘనత గీతకే దక్కెను. గీత అట్లు చేయనిచో సన్న్యాస సంప్రదాయము ప్రబలి, హిందూదేశము మఱింత దిగజాఱిపోయెడిది – అని శ్రీ అరవిందుడు.

అవతారిక : ఇపు డీ పూర్ణయోగము సూచనగా చూపబడును —

**యో మామేవ మసం మూఢో జానాతి పురుషోత్తమం,**
**స సర్వవిద్ భజతి మాం సర్వభావేన భారత. 19**

అర్జునా! మఱియు నెవ డిట్లు నన్ను పురుషోత్తమునిగా నెఱుంగునో, అత డిక సంమోహమునకు గుఱికాడు, అతడు సర్వవిదు డగును మఱియు సర్వాత్మగా నన్ను భజించును.

విశేషార్థము : 'అసంమూఢః' – ఎవడు అసంమూఢుడై పురుషోత్తము నెఱుంగునో – అని ఇతరులు అన్వయించగా, ఎవడు పురుషోత్తము నెఱుంగునో,

ఆతడు అసంమూఢు డగు - నని శ్రీ అరవిందుడు. పురుషోత్తము నెఱుంగక పూర్వము, మానవచేతన విరుద్ధములుగా గన్పించు క్షరాక్షరముల మధ్య నటు నిటు లాగబడుచుండును. ఒకొకప్పుడు క్షరము మిథ్యగాను, ఒకొకప్పుడు అక్షరము శూన్యముగాను గన్పించును. 'కవులు' సైతము ఇవ్విషయమున మోహితులు(4-16). ఇదియే మోహము. పురుషోత్తము నెఱింగిన వానికి క్షరాక్షరములమధ్య వైరుధ్యము తొలగి, సామరస్యము గోచరించును. అపుడు గాని అతని భ్రమ తీరిపోదు. అందు చేతనే శ్రీ అరవిందు డట్లు అన్వయించెను.

'సర్వవిత్' : పురుషోత్తముడే సర్వమునకు మూలము గాన, మఱియు సర్వము నయ్యెను గాన, పురుషోత్తము నెఱింగినవాడు సర్వవిదు డగును-చూ(7-1,2) ఆత్మ నిర్విశేషము, కాని పురుషోత్తముడు నిర్విశేషుడు మఱియు సవిశేషుడు - ఉభయము.కావున పురుషోత్తము నెఱింగినవాడు తత్త్వవిశేషముల గూడ నెఱుంగును. విశేషముల విజ్ఞానము కూడ అతనికి లభించును గాన, అతడు సర్వవిదు డగును.- విదుడు-విశేషముల నెఱుంగువాడు.

ఈ విజ్ఞానము విజ్ఞానము దగ్గఱనే ఆగిపోదు. అది అంతరాత్మకును పరమాత్మ కును గల సనాతన సంబంధమును దెలుపును. అందుచేత అంతరాత్మ లేక సర్వ విదు డగు జీవుడు సర్వమునందును గల భగవంతుని ఏకత్వము నాశ్రయించి భజించును (6-31)-అనగా ప్రేమించును, సేవించును, ఆరాధించును, అనురక్తు డగును. ఇట్లు జ్ఞానవిజ్ఞానములనుండి దివ్యభక్తి మఱియు దివ్యకర్మ వికసించునే కాని, సాంప్రదాయిక పాక్షిక, జ్ఞానమునందువలె నవి, ఊడ్చి పెట్టుకొనిపోవు. అంతరాత్మయొక్క క్రియాశక్తి, జ్ఞానశక్తి, ప్రేమశక్తి - ఈ మూడింటికిని పరమాత్మయే మూలము గాన, ఈ మూడింటితోను, అనగా 'సర్వభావేన', సాధకుడు భగవంతుని భజించును. అపుడు అక్షరాత్మయొక్క అగాధ ఏకతయు, నిస్సీమ సమతయు ఈ సమగ్రసాధనకు ఆధారముగా నుండును. ఇదియే సంసిద్ధికి గీతా మార్గము అని శ్రీ అరవిందుడు.

అవతారిక : దీని నెఱింగినవాడే బుద్ధిమంతుడు -

**ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయానఘ,**
**ఏతద్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత. 20**

పాపరహితుడవగు నో అర్జునా! నాచే నీకిట్లు పరమరహస్యమగు ఈ శాస్త్రము చెప్పబడినది. దీని నెఱింగినవాడే, పార్థా, బుద్ధిమంతుడు కాగలడు, కృతకృత్యుడు కాగలడు.

విశేషార్థము : 'గుహ్యతమం' = పరమ రహస్యము ఈ శాస్త్ర మెందుచేత పరమ రహస్యము? జీవనముయొక్క పరమరహస్యములోని కది మనలను నడుపును గనుక. ఏమి టా పరమ రహస్యము? ద్వంద్వముల ఏకత. ఉదాహరణకు, నేను చేయుచునే చేయనివాడను (4-13), .... కర్మా-కర్మలు నా యందు ఏకమగును. మఱియు పరమ రహస్యమగు నీ ఏకతాజ్ఞానము పరమరహస్యమగు దివ్య జీవనమునకు దారితీయును. అనగా అత్యున్నతమగు, దివ్యమగు భగవంతుని స్వీయ ప్రకృతి నెఱగి, అమరులమై, తదితరమగు సర్వధర్మములను పరిత్యజించి, సనాతన ధర్మము (14-27) ననుసరించి భగవంతునివలె జీవించుటకు దారితీయును.

'ఏతద్ బుద్ధ్వా' = దీని నెఱింగి. దేని నెఱింగి? సమగ్ర పురుషోత్తముని, అతని పొందుటకు సమగ్ర సాధనను ప్రతిపాదించు ఈ శాస్త్రము నెఱింగి. పోతే, శాస్త్రము నెఱుంగుట యన, శాస్త్రము చెప్పు సమగ్ర సాధన చేసి, సమగ్ర భగవంతుని పొంది — అని మాటి అర్థము. ఇది ఇంత స్పష్టముగా నుండ, శ్రీ శంకరుడు, ఎఱింగి — అను పదమును శాస్త్ర — మను పదమునుండి విడదీసి, ఎఱుంగుట యన, నిర్విశేష బ్రహ్మము నెఱుంగుట — యని వ్యాఖ్యానించును. మఱియు నీ ఎఱుకచేతనే 'కృతకృత్యు' డగును; ఏలన కర్మ యంతయు జ్ఞానము నందు పరిసమాప్త మగును (4-33) — అని ఆయన తనను సమర్థించుకొనును! అనగా జీవుడు నిర్విశేష బ్రహ్మములో లయమునొంది, తనను తాను అంతమొందించుకొనుటయే కృతకృత్యత!

కాని గీతను బట్టి, భగవంతునివలె జీవించుటయే, భగవంతునితో 'సాధర్మ్యము' (14-2) నందుటయే, జీవుని కృతకృత్యత. ఇందుకొఱకే సృష్టి, ఇందుకొఱకే జీవుని సుదీర్ఘ జీవనయాత్ర.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే
పురుషోత్తమప్రాప్తి యోగో నామ పంచదశోఽధ్యాయః





# శ్రీ గీతా యోగము

## అథ షోడశోఽధ్యాయః

## దైవాసురసంపద్విభాగ యోగః

ఒక పరిశీలన : క్రిందటి అధ్యాయమున గీతోపదేశము తన శిఖరాగ్రమును చేరుకొన్నది – అచ్చట సర్వము, సర్వాతీతము (15-17, 18) నగు పురుషోత్తము తత్త్వము పేరుపెట్టి మఱియు సిద్ధాంతరీత్యా ప్రతిపాదించబడి యున్నది. మఱియు ఈ పురుషోత్తము నెఱింగినవాడు కృత్స్నవిదుడు (15-19. 3-29) మఱియు కృతకృత్యుడు కాగల డని గానముచేయబడినది (15-20). మంచిది, కాని ఈ పురుషోత్తము నెట్లెఱుంగవలెను, ఎట్లు పొందవలెను ?

భగవంతుని విధానమున నేదియు ఆకస్మికముగా పొందబడదు; దేనిని పొందుట కైనను భగవంతు డొక ఆధారమును, విధానమును ఏర్పఱచియున్నాడు. ఈ ధర్మము ఆ పురుషోత్తమ ప్రాప్తికిని వర్తించును పోతే, ఈ పరమపురుషుడు మనలోపలనే యున్నాడు. అయినను ఇతని అనుభవమును పొందవలె ననిన, ఇతని నావరించి యుండు(7-25)మన ప్రకృతియొక్క నిమ్న రూపములనుండి ఇతనిని వెలికిదీయవలసి యుండును. కాగా నిమ్న ప్రకృతియొక్క అజ్ఞానమయ గుణ వ్యాపారములే ఈ ఆవరణరూపములు. కావున పురుషోత్తముడు మనకు ప్రకాశించవలె ననిన, గుణముల ఈ ఆవరక స్వభావమును మార్చవలసియుండును. కాని వీని స్వభావమును మార్చు టెట్లు ?

నిమ్న ప్రకృతియే యావత్ప్రకృతియు గాదు, పర ప్రకృతియు నొకటి గలదు. నిజానికి ఈ పర ప్రకృతియొక్క ఒక ఉత్పత్తియే (derivation) నిమ్న ప్రకృతి. కావున నిమ్న ప్రకృతి యందలి ప్రతి వస్తువుయొక్క మూల స్వరూపము, అత్యున్నత సత్యము, పరప్రకృతియం దుండును. ఉదాహరణకు, ఇచ్చటి సత్త్వగుణముయొక్క మానసిక ప్రకాశము (14-6) పర ప్రకృతియందు అతిమానస జ్యోతిగా నుండును; అటులే ఇచ్చటి రజో గుణముయొక్క మానసిక

ప్రవృత్తి పరప్రకృతియందు భగవదిచ్ఛయొక్క క్రియాశక్తిగానుండును; మఱియు ఇచ్చటి తమోగుణముయొక్క మానసిక జడత పరప్రకృతియందు దివ్యశాంతి రూపమున దర్శన మిచ్చును. మఱియు గుణముల మూలస్వరూపములగు ఈ జ్యోతి, శక్తి, శాంతి తమ పరమాత్మయగు పరమపురుషుని భాసింపజేయునేగాని, ఆవరించవు. కావున గుణములను లేవనెత్తి తమ మూలముతో నేకము జేసినచో, వాని ఆవరక స్వభావము మాఱిపోవును.

పోతే, సత్త్వగుణమున కొక ప్రత్యేకత గలదు. అది నిర్మలము మఱియు ప్రకాశకము (14-6) కనుక నది పెంపొంది తన పరాకాష్ఠ స్థానమును జేరుకొని నపుడు, దానియందు తన మూలమగు దివ్యజ్యోతి ప్రతిఫలించును, అది ఆ జ్యోతితో మానసిక తాదాత్మ్యమును సైతము పొందును అట్లు పొంది, తన పరిమితులను ఛేదించుకొని, తన మూలమగు జ్యోతిలో అదృశ్యమగును. అది జరిగినపుడు, దాని ఆవరక స్వభావము అదృశ్యమై, దాని ఉద్భాసక స్వభావము నిలిచియుండును.

కాని ఇట్లు రజస్తమోగుణములు స్వయముగనే సరాసరి తమ మూలముతో నేకము కాజాలవు. ఏలన అజ్ఞానముచేతనే అవి తమ మూలమునుండి వేఱుపడి యున్నవి. పోతే వాని అజ్ఞానము బాయవలె ననిన, అవి సత్త్వగుణముతో నేకము గావలెను, అనగా సత్త్వము రజస్తమస్సులకును, వాని మూలమునకును మధ్య మధ్యవర్తిగా వ్యవహరించవలెను

ఇట్లు పురుషోత్తము నెఱింగి, నిండు జీవితమునందును అతనితో సాయుజ్యము ననుభవించుటకు, ముందు రజస్తమస్సులపై సత్త్వాధిక్యమును, తర్వాత తన పరాకాష్ఠవఱకు సత్త్వముయొక్క స్వీయసముత్కర్షను సాధించు టావశ్యకము. అనగా, దైవప్రకృతిని పెంపొందించుకొనుచు, అసుర మఱియు రాక్షస ప్రకృతులను (9-12,13) వర్జించవలెను. అందు నిమిత్తమే గీత మిగిలిన అధ్యాయములందు వాని విభిన్న రూపములను విరివిగా చూపును.

శ్రీ భగవానువాచ -

అభయం సత్త్వసంశుద్ధిర్ జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవం. 1

అహింసా సత్య మక్రోధ స్త్యాగః శాంతి రపైశునం,
దయా భూతే ష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలం. 2

తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత. 3

శ్రీ భగవానుడు చెప్పెను – అభయము, అంతఃకరణశుద్ధి, జ్ఞానసాధన మఱియు లభించిన జ్ఞానమునందు సుస్థిరస్థితి, దానము, ఆత్మసంయమము, యజ్ఞానుష్ఠానము, మతాచారపాలనము, తపస్సు, సూటి వ్యవహారము, అహింస, సత్యమార్గానుసరణము, క్రోధాఽభావము, సుఖాదిత్యాగము, శాంతిస్వభావము, చాడీలు చెప్పకుండుట, సర్వభూతదయ, స్థిరత, మృదుత, బిడియము, అచంచలత; అటులే ఆధ్యాత్మిక తేజోవీర్యములు, క్షమాగుణము, దృఢనిశ్చయము, బాహ్యశౌచము, ద్రోహచింతన లేకుండుట, విపరీతపుగు స్వాభిమానము లేకుండుట – ఇవి, అర్జునా దైవసంపత్తిలోనికి బుట్టినవాని యందు సహజముగా వర్తించు గుణములు.

విశేషార్థము : ఆత్మత్యాగము, ఆత్మసంయమము మఱియు మృదుత ఎట్టి బలహీనతను సూచించవు. ఈ సత్యమును తెలుపుటకే, అభయము, ఆధ్యాత్మిక తేజము మఱియు శౌర్యము, మఱియు దృఢనిశ్చయములు గూడ దైవసంపత్తియందు పరిగణింపబడినవి – అని శ్రీ అరవిందుడు.

దేవతలు సత్త్వగుణప్రధానులు, కనుక దైవసంపత్తి యన సాత్త్విక సంపత్తి యని అర్థము. ఈ సాత్త్విక సంపత్తి సత్త్వగుణమును క్రమముగా తన పరాకాష్ఠకు లేవనెత్తును. అక్కడ అది తననుండియే తాను తప్పించుకొని, గుణాతీత పరప్రకృతి లోనికి దూసుకొని పోవును, అనగా నది స్వీయాతిక్రమణమును సాధించుకొని, తన గుణాతీత రూపమున విలసించును – అని శ్రీ అరవిందుడు వివరించగా, శ్రీ శంకరుడు గుణముల కావల గుణరాహిత్యము మాత్రమే యుండు నని వక్కాణించును. అనగా ఆయన ననుసరించి, గుణాతీత విముక్త దివ్యకర్మ లేదు, లేదు.

అవతారిక : ఇక డాసుర సంపత్తి విశేషములు –

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవచ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపద మాసురీం. 4

లేని గొప్పలు చెప్పుకొను దంభము, విద్యాధనాదికమువలన గలుగు గర్వము, నేను పూజ్యుడనను అభిమానము, క్రోధము, పరుషవచనము మఱియు అజ్ఞానము – ఇవి పార్థా, ఆసుర సంపత్తిలోనికి బుట్టిన వానియందు సహజముగా వర్తించు గుణములు.

విశేషార్థము : పూర్వము (9-12) కేవలము పేర్కొనిన ఆసుర సంపత్తి ఇపుడు విపులీకరింపబడుచున్నది. గీత అన్ని విషయములందును, ముందు సూచించి, తర్వాత విపులీకరించుట – యను ఈ విధానమునే అవలంబించియున్నది.

అవతారిక : ఇపు డీ రెండు సంపదలయొక్క కార్యము చెప్పబడును —

**దైవీ సంపద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా,**
**మా శుచః సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ. 5**

దైవ సంపత్తి పరిపూర్ణ మోక్షకారణము కాగా, ఆసుర సంపత్తి దృఢ బంధకారణ మగును : ఇది ప్రాజ్ఞుల నిర్ణయము. అర్జునా, నీవు శోకించ నవసరము లేదు, నీవు దైవ సంపత్తిలోనికే పుట్టియున్నావు.

విశేషార్థము : ఈ యుభయ సంపదల కార్యభేదమును చూపుటయే గీత చేసిన ఈ యుభయ సంపదల వివేచనయొక్క ఉద్దేశ్యము.

దైవ సంపత్తి, తన్ను దా నతిక్రమించుటకును, పరమపురుషునితో సాధర్మ్యము (14-2) లోనికి రూపాంతర మొందుటకును సాత్త్విక గుణమునకు సాయపడును. 'విమోక్ష' మన ఈ అతిక్రమణము, ఈ సాదృశ్యము – రెండు నని శ్రీ అరవిందుడు అనగా నపుడు మానవుడు దివ్యమానవుడై ఇచటనే దివ్యజీవనమును జీవించగలుగును. పోతే, విమోక్ష మన సంసారబంధమునుండి తప్పించుకొనుట యని శ్రీ శంకరుడు.

అవతారిక : సృష్టి స్వభావ, స్వకర్మలను బట్టి రెండు విధములు—

**ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ,**
**దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు. 6**

దైవసృష్టి, ఆసురసృష్టి యని ఈ లోకమున ప్రాణులు రెండు వర్గములుగా నుందురు. అందు దైవసృష్టి నీకు విస్తరముగా వర్ణింపబడినది (16-1, 2, 3). పోతే, పార్థా, ఇపు డాసుర జీవుల గుణములను విస్తరముగా వినుము.

విశేషార్థము : 'ఈ లోకమున' = జగత్తునందు - అని శ్రీ శంకరుడు. కాగా 'ఈ లోకమున'=ఈ పృథివీలోకమున, అనగా భౌతికలోకమున-అని శ్రీఅరవిందుడు. ఈ మానవుల లోకము వెనుక దేవతల లోకములును గలవు, అసురుల లోకములును గలవు. ఆ లోకములందు దేవతలయొక్క గాని, అసురులయొక్క మూలరూపము లుండును. ఆ రూపములు మాఱవు, ఆ లోకములలో ఆధ్యాత్మిక పరిణామధర్మము పనిచేయదు. ఆ లోకములలో దేవాసుర విభేదము విస్పష్టముగా గన్పించును - అని శ్రీ అరవిందుడు.

అయితే మానవలోకమున అట్లు గాదు. ఇచ్చట పరిణామము గలదు. జీవుడు తన స్వభావమునందలి రాజసిక ప్రవృత్తికి ఎక్కువ అవకాశ మిచ్చినచో, అతడు క్రమముగా అసుర డగును అటులే అతడు సాత్త్విక ప్రవృత్తి కవకాశ మిచ్చి సాత్త్వికుడును కాగలడు.

మానవుల వెనుక నున్న, దేవాసురలోకములు మానవులపై తమ ప్రభావమును బఱపును, ఇది ముఖ్యముగా మహాయుద్ధముల సమయమున వ్యక్తమగును. ఉదాహరణకు, క్రిందటి ప్రపంచ యుద్ధమున (1939-45) హిట్లరును, అతని పక్షమును నడిపినవారు అసురులు. అనగా, అమెరికా రష్యాలు తమ యుద్ధాలను తటస్థదేశాలలో సాగించినట్లు, దేవాసురులు తమ యుద్ధాలను మానవలోకమున సాగించుచుందురు! మనము ఈ సత్యమును చూడలేకపోయినప్పటికి, శ్రీ మాతారవిందుల కిది అతిస్పష్టము. అతి స్పష్టమే కాదు, వారు అసుర పరాజయానికి తమ దైవశక్తిని ప్రయోగించిరి గూడ.

అవతారిక : ఇపుడు ఆసుర సంపత్తియొక్క విస్పష్ట వర్ణన -

ప్రవృత్తించ నివృత్తించ జనా న విదు రాసురాః,
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే. 7

ఆసుర స్వభావము గల జనులు ధర్మాభిముఖమగు ప్రవృత్తినిగాని, అధర్మ విముఖమగు నివృత్తిని గాని ఎఱుంగరు. వారు దేనిని శుచిగా చేయరు, ఆచారముల ననుష్ఠించరు, వారియందు సత్యముండదు.

విశేషార్థము : ప్రవృత్తినివృత్తులు వారికి తెలియవు, అనగా నేది చేయవలెనో, ఏది చేయరాదో వారికి తెలియదు. అందుచేతనే వారు ఇంకను ఇంకను అధోగతికి పోవుదురు. వారియందు సత్య ముండదన, జగత్తునకు మూలమగు సత్యమును గుర్తించి, దానియందు నిష్ఠులు గారు. అందుచేతనే -

అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరం,
అపరస్పర సంభూతం కి మన్యత్ కామహైతుకం. 8

జగత్తు స్వయముగా సత్యము గాదు, దానికి సత్యము ప్రతిష్ఠగను లేదు, దానిని శాసించు ఈశ్వరుడును లేడు. అది స్త్రీపురుషసంయోగముచేతనే జనించును ఇట్లు కామమే దానికి హేతువు, దానికి బీజము. దానిని శాసించు శక్తి, పాలించు ధర్మము. కామము గాక, అది మఱి యేమియు గాదు.

విశేషార్థము: ప్రతి ప్రాణి జన్మకు నేనే బీజదాతను, మహద్బ్రహ్మము గర్భము (14-3) – అని భగవానుడు చెప్పిన దానిని ఈ ఆసుర మానవులు విశ్వసించరు. అవాంతర కారణమగు కర్మను (15-2) గూడ వా రంగీకరించరు కావున ప్రపంచమున సముచితమగు నెట్టి పూర్వాపర సంబంధమును లేదు, పూర్వాపరములను గలుపు కర్మసూత్రము లేదు. ఈ ప్రపంచము ఒక యాదృచ్ఛిక (chanee) సృష్టి. బౌద్ధికముగా ఈ అసుర మానవు లే మతము నవలంబించినను, ఆచరణయందు వారిని నడుపునది కామాహంకార మతమే.

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్ప బుద్ధయః,
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః. 9

కామమే ప్రపంచ హేతువు–అను నీ దృష్టి నవలంబించి, వారు తమ ఆత్మలను, బుద్ధిని నాశము చేసికొందురు. వా రపుడు ఉగ్రకర్మ నాచరించుచు, జగత్తునకు విధ్వంసకారకులును, వ్యక్తులకు హింసాకేంద్రములును అగుదురు.

విశేషార్థము: నష్టాత్మలు = నష్ట స్వభావులు, పరలోకసాధన మగు స్వభావము నశించినవారు – అని శ్రీ శంకరుడు. నష్టాత్మలు=ఆత్మ నశించినవారు – అని శ్రీ అరవిందుడు. ఇచ్చట ఆత్మ నశించుట యన, అసురభావముచేత కప్పబడి, ఆత్మ పనిచేయకపోవుట యని అర్థము.

కామ మాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః,
మోహాద్గృహీ త్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః. 10

మఱియు, ఎప్పటికిని తృప్తి జెందని కామము నాశ్రయించి, దంభము, అభిమానము మఱియు గర్వములతో గూడుకొని, వివేకమును గోల్పోయి, తమ కామతృప్తి నిమిత్తము అశుభనిశ్చయములను గావించి, అపవిత్ర కృత్యములకు పాల్పడుచు, వారు ముందుకు సాగుదురు.

విశేషార్థము : తమ కామపూర్తికొఱకు వారు అవశ్యముగా అపవిత్ర నిశ్చయములను, అశుభకార్యములను జేయక తప్పదు.

చింతా మపరిమేయాంచ ప్రళయాంతా ముపాశ్రితాః,
కామోపభోగ పరమా ఏతావ దితి నిశ్చితాః. 11

ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధ పరాయణాః,
ఈహంతే కామభోగార్థ మన్యాయే నార్థసంచయాన్. 12

మఱియు, విషయభోగమే జీవితపరమార్థము, ఇంతకు మించిన దేదియులేదు– అని ఒక నిశ్చయమునకు వచ్చి, తుది శ్వాసవఱకు తమను దహించివేయుచుండు అపరిమితచింతకు వారు గుఱియగుదురు. ఇందువలన వారు లెక్కలేని ఆశాపాశముల చేత కట్టుపడి, కామక్రోధములకు వశులై, తమ కామభోగమునిత్తము అన్యాయ పథమున అర్థరాశులను గోరుచుందురు.

విశేషార్థము : నిజానికి 'శాంతము లేక సౌఖ్యము లేదు', కాగా కామభోగ పరాయణుల అంతరంగము సర్వథా కల్లోలగ్రస్తమై యుండును. కనుక ఆసుర స్వభావులకు భోగాభాసమే యుండును గాని, వాస్తవ భోగ ముండదు. అయినను తా మెంతో భోగము ననుభవించుచున్నా మని వా ర్లనుకొందురు.

అవతారిక : ఇపుడు వారి మనోభావన వర్ణించబడును –

ఇద మద్య మయా లబ్ధం ఇమం ప్రాప్స్యే మనోరథం,
ఇద మ స్తీద మపి మే భవిష్యతి పునర్ధనం. 13

నేను గోరిన ఈ వస్తువు నేడు లభించినది. రేపు నా కావస్తువు లభించును. ఈ ధన మిపుడు గలదు, రేపా ధనము గూడ వచ్చును.

అసౌ మయా హతః శత్రుర్ హనిష్యే చాపరా నపి,
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ. 14

ఆ శత్రువు నాచే హతమార్చబడెను, తక్కిన వానిని గూడ కొద్దికాలములో రూపుమాపెదను. నేను ప్రభువును, నేను రాజును, నేను విశిష్ట భోగిని, నేను పరిపూర్ణుడను, బలవంతుడను, సుఖవంతుడను.

ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యో స్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః. 15

నేను భాగ్యవంతుడను, గొప్ప కులమున జన్మించినవాడను. కనుక నాతో బోలినవా డెవ డున్నాడు? యజ్ఞములు చేసెదను, దానము లిచ్చెదను; సుఖముల ననుభవించెదను – ఇట్లు వారు అజ్ఞానముచేత చిత్తభ్రమకు లోనగుదురు.

విశేషార్థము: మన అందరిలోను ఎంతోకొంత ఉన్న ఈ మనోభావనను మనము స్వయముగా గుర్తించజాలము. కాని ఇక్కడ వ్యాసమహర్షి వానిని కండ్లకు గట్టినట్లు వర్ణించగా, వానిని చూచి, మనము నవ్వుకొనగలము. "పొట్టవిచ్చిచూడ పురుగు లుండు."

ఆసుర మానవులు యజ్ఞాలు, దానాలు ఎందుకు చేతురు? ఆడంబరము, అధిక్యము గల్గించు 'మోదముకొఱకు' అని గీతా సమాధానము.

అనేక చిత్త విభ్రాంతా మోహజాల సమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ. 16

ఇట్లు, అది చేయుదును, ఇది చేయుదును – అనునట్టి చిత్తభ్రమకు లోనై, మోహజాలములో కట్టుపడి, కామోపభోగమునందు మైమఱచి, చివరకు అశుచి నరకమునందు బడిపోదురు.

విశేషార్థము: నిజానికి చేయునది నేను (అహంకారము) గాదు (3-27), అందుచేత, నే నది చేసితిని, ఇది చేసెదను – అని గాలి మేడలు కట్టుట చిత్త భ్రాంతియే యగును. ఈ భ్రాంతి ముదిరి నపుడు, అది మోహ మగును, భ్రాంతి పొగవంటి మబ్బు కాగా, మోహము నల్లని మేఘము వంటిది. ఇది ఎల్లపుడును అసక్తముగా నుండు ఆత్మను ఆవరించివేయును. కనుక నరు డా దశయందు కామ భోగములందు ప్రసక్తు డగును, ఆభోగములందు మునిగిపోవుమ, తదన్యముగా నత డేమియు కానివా డగును, తన ఆత్మను కోల్పోయినవా డగును. అదిగో, ఆ దశకు ఉచితమైన లోకము నరకమే – ఔపచారిక లేక వాస్తవ నరకమే. శ్లోకము నందలి, భ్రాంతి→ మోహము→ ప్రసక్తి→ నరకము; ఈ క్రమమును మనము గ్రహించదగును.

ఇట్లు అహంకారిక భావపరంపరచేత ఆవిష్టులై, మోహావృతులై, అసుర మానవులు కర్మలను జేతురు, కాని అపమార్గమున జేతురు, ప్రబలముగా జేతురు.

అయితే కామదేవతకొఱకు, భోగదేవతకొఱకు మాత్రమే చేయుదు గాని, తమలోని భగవంతునికొఱకును, మానవజాతిలోని భగవంతునికొఱకును జేయరు. అట్లు ప్రవర్తించుచు, తమ అశుభ కృత్యమే సృజించిన అశుచి నరకములో పడిపోవుదురు-అని శ్రీ అరవిందుడు వివరించును.

అవతారిక : వారే భావముతో యజ్ఞములు చేతురు ?

**ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,**
**యజంతే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకం.　　17**

అన్ని విషయములయందు మేమితరులకంటె సధికులము-అని ఈ అసుర మానవులు తమను దామే సమ్మానించుకొందురు, వారెవరికిని నమస్కరించరు, ధనముచే కలిగిన మానమదములతో మిడిసిపడుదురు. వారు శాస్త్ర విధిని పాటించక ఆడంబరముకొఱకు నామమాత్ర యజ్ఞ యాగములను జేతురు.

విశేషార్థము : వారు తమ ఘనతను చాటుకొనుటకే యజ్ఞము చేతురు గాన, వారా యజ్ఞమును భగవంతునికి గాక, నిజానికి తమ అహంకారదేవతకే చేసినవారగుదురు. అంతే కాదు, వారా దేవుని ద్వేషింతురు గూడ -

**అహంకారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః,**
**మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. 18**

అహంకారముచేతను, కామక్రోధములతో గూడిన బల దర్పములచేతను ప్రేరితులై, వారు తమ మఱియు ఇతరుల దేహమునందు గల నన్ను (ఈశ్వరుని) ద్వేషింతురు, మఱియు అవమానించి, తృణీకరింతురు.

విశేషార్థము : భగవంతుని ద్వేషించుట యన భగవచ్ఛాసనము నతిక్రమించుట, మఱియు 'అభ్యసూయకు'లన సన్మార్గస్థుల గుణములను సహించలేని వారు - అని శ్రీ శంకరుడు.

"నా పరమభావము నెఱుంగక, మానవ తనువు నాశ్రయించుటచే నన్ను మూఢులు అవమానింతురు." (9-11) - అని భగవానుడు చెలిపియున్నాడు. ఆ కృష్ణదేహములోనే కాదు, సర్వుల దేహములోను అటులే భగవంతుడు గలడు. ఆ కృష్ణదేహములోని భగవంతుని ద్వేషించినట్లే, వారు సర్వదేహములలోని భగవంతుని సైతము ద్వేషింతురు-అని శ్రీ అరవిందుడు అనగా, ఇది మంచిది కాదు, దీనినుండి.

అఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యో స్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః. 15

నేను భాగ్యవంతుడను, గొప్ప కులమున జన్మించినవాడను. కనుక నాతో బోలినవా డెవ డున్నాడు? యజ్ఞములు చేసెదను, దానము లిచ్చెదను; సుఖముల ననుభవించెదను — ఇట్లు వారు అజ్ఞానముచేత చిత్తభ్రమకు లోనగుదురు.

విశేషార్థము: మన అందరిలోను ఎంతోకొంత ఉన్న ఈ మనోభావనను మనము స్వయముగా గుర్తించజాలము. కాని ఇక్కడ వ్యాసమహర్షి వానిని కండ్లకు గట్టినట్లు వర్ణించగా, వానిని చూచి, మనము నవ్వుకొనగలము. "పొట్టవిచ్చిచూడ పురుగు లుండు."

అసుర మానవులు యజ్ఞాలు, దానాలు ఎందుకు చేతురు? ఆడంబరము, అధిక్యము గల్గించు 'మోదముకొఱకు' అని గీతా సమాధానము.

అనేక చిత్త విభ్రాంతా మోహజాల సమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ. 16

ఇట్లు, అది చేయుదును, ఇది చేయుదును — అనునట్టి చిత్తభ్రమకు లోనై, మోహజాలములో కట్టువడి, కామోపభోగమునందు మైమఱచి, చివరకు అశుచి నరకమునందు బడిపోదురు.

విశేషార్థము: నిజానికి చేయునది నేను (అహంకారము) గాదు (3-27), అందుచేత, నే నది చేసితిని, ఇది చేసెదను — అని గాలి మేడలు కట్టుట చిత్త భ్రాంతియే యగును. ఈ భ్రాంతి ముదిరి నపుడు, అది మోహ మగును, భ్రాంతి పొగవంటి మబ్బు కాగా, మోహము నల్లని మేఘము వంటిది. ఇది ఎల్లపుడును అసక్తముగా నుండు ఆత్మను ఆవరించివేయును. కనుక నరు డా దశయందు కామ భోగములందు ప్రసక్తు డగును, ఆభోగములందు మునిగిపోవును, తదన్యముగా నత డేమియు కానివా డగును, తన ఆత్మను కోల్పోయినవా డగును. అదిగో, ఆ దశకు ఉచితమైన లోకము నరకమే — ఔపచారిక లేక వాస్తవ నరకమే. శ్లోకము నందలి, భ్రాంతి→ మోహము→ ప్రసక్తి→ నరకము ; ఈ క్రమమును మనము గ్రహించదగును.

ఇట్లు అహంకారిక భావపరంపరచేత ఆ విష్టులై, మోహావృతులై, అసుర మానవులు కర్మలను జేతురు, కాని అపమార్గమున జేతురు; ప్రబలముగా జేతురు.

అయితే కామదేవతకొఱకు, భోగదేవతకొఱకు మాత్రమే చేతురు గాని, తమలోని భగవంతునికొఱకును, మానవజాతిలోని భగవంతునికొఱకును జేయరు. అట్లు ప్రవర్తించుచు, తమ అశుభ కృత్యమే సృజించిన అశుచి నరకములో పడిపోవుదురు–అని శ్రీ అరవిందుడు వివరించును.

అవతారిక : వారే భావముతో యజ్ఞములు చేతురు ?

**ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,**
**యజంతే నామయజ్ఞైస్తే దంభే నావిధిపూర్వకం. 17**

అన్ని విషయములయందు మేమితరులకంటె నధికులము–అని ఈ ఆసుర మానవులు తమను దామే సమ్మానించుకొందురు, వారెవరికిని నమస్కరించరు, ధనముచే కలిగిన మానమదములతో మిడిసిపడుదురు. వారు శాస్త్ర విధిని పాటించక ఆడంబరముకొఱకు నామమాత్ర యజ్ఞ యాగములను జేతురు.

విశేషార్థము : వారు తమ ఘనతను చాటుకొనుటకే యజ్ఞము చేతురు గాన, వారా యజ్ఞమును భగవంతునికి గాక, నిజానికి తమ అహంకారదేవతకే చేసినవారగుదురు. అంతే కాదు, వారా దేవుని ద్వేషింతురు గూడ –

**అహంకారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః,**
**మా మాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. 18**

అహంకారముచేతను, కామక్రోధములతో గూడిన బల దర్పములచేతను ప్రేరితులై, వారు తమ మఱియు ఇతరుల దేహమునందు గల నన్ను (ఈశ్వరుని) ద్వేషింతురు, మఱియు అవమానించి, తృణీకరింతురు.

విశేషార్థము : భగవంతుని ద్వేషించుట యన భగవచ్ఛాసనము నతిక్రమించుట, మఱియు 'అభ్యసూయకు'లన సన్మార్గస్థుల గుణములను సహించలేని వారు – అని శ్రీ శంకరుడు.

"నా పరమభావము నెఱుంగక, మానవ తనువు నాశ్రయించుటచే నన్ను మూఢులు అవమానింతురు." (9-11) – అని భగవానుడు తెలిపియున్నాడు. ఆ కృష్ణదేహములోనే కాదు, సర్వుల దేహములోను అటులే భగవంతుడు గలడు. ఆ కృష్ణదేహములోని భగవంతుని ద్వేషించినట్లే, వారు సర్వదేహములలోని భగవంతుని సైతము ద్వేషింతురు–అని శ్రీ అరవిందుడు అనగా, ఇది మంచిది కాదు, దీనినుండి.

విరమించుము – అని ప్రబోధించుచున్న హృదయస్థ ఈశ్వరుని ద్వేషించి, తృణీకరింతురు. వారి ఘోరతపస్య (17-6) లోని ఈశ్వరుని కెట్లు పీడ గల్గించునో, వారి ద్వేషము సైతము అటులే లోని ఈశ్వరునికి బాధ గల్గించును.

అవతారిక : ఆ ద్వేషమునకు ఫలితము ?

తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు. 19

క్రూరులు, పాపకర్ములు నగు నన్ను ద్వేషించు ఆ నరాధములను ఈ సంసార మార్గములందు తిరిగి తిరిగి అసుర జన్మలలోనికే విసిరివేతును.

విశేషార్థము : 'అసుర జన్మలు' = వ్యాఘ్ర సింహాది జన్మలు – అని శ్రీ శంకరుడు. అసుర స్వభావముగల మానవజన్మలనియే శ్రీ అరవిందుని భావము. వ్యాఘ్రాదులకు పుణ్యాపాపప్రసక్తి లేదు, అందుచేతనే వానికి స్వర్గనరకప్రసక్తియు లేదు – అని మనము తెలియవలెను.

తన నభివ్యక్తము చేయుటకు భగవంతుడు ప్రపంచమును సృజించి, తదనుకూల మార్గమున దానిని నడుపుచున్నాడు. దానికి అసురులు భీషణముగా అడ్డువచ్చుచున్నారు గావున, వారితో భగవంతుడును కఠోరముగానే వ్యవహరించును. అయితే ఇక్కడ నొక రహస్యము గలదు. చెడు ప్రతిఘటించనిదే, మంచి విజృంభించి వెలికి రాదు. కనుక మంచియొక్క వికాసానికే చెడు అవసరము. అందుచేత అసుర మానవులును దైవకార్యసాధకులే ! దేవాసురు లిరువురు ఇట్లు భగవత్కార్యమునే సాధించుచు ఒకరు భగవంతునియొక్క అనుగ్రహమునకు పాత్ర మగుచుండగా, ఒకరు భగవంతుని క్రోధమునకు గురియగుటకు ముందుకు వచ్చుచున్నారు. ఈ దృష్టితో జూచిన, దేవతల త్యాగముకంటె అసురుల త్యాగమే అధికతర మని శ్రీ అరవిందుడు తన అపూర్వదర్శనమును వెల్లడించును.

అవతారిక : అసుర జన్మకు పరాకాష్ఠ ? —

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని,
మా మప్రాప్యైవ కౌంతేయ తతో యాం త్యధమాం గతిం. 20

పడిపోయి, ఒకసారి అసురజన్మ నందుదు రేని, వారిక జన్మ జన్మయందును మూఢులై నన్ను వెదకను వెదకరు, పొందను బొందరు. ఇట్లు, కౌంతేయా, వారు పరమార్థమార్గ భ్రష్టులై, చివరకు, అధమ గతిని చేరుకొందురు.

విశేషార్థము : ఈ గతిశీల ప్రపంచమునందు ఏదియు ఉన్న చోటుననే యుండదు - అయితే పైకి పోవును, లేదా క్రిందికి పోవును. కాగా పై నున్న భగవంతుని పొంద గోరుటలేదు గనుక, ఆసుర మానవుడు అవశ్యముగా క్రిందికి, మఱింత క్రిందికి పోవును - అని శ్రీ అరవిందుడు.

ఇచ్చట శ్రీ అరవిందుడు మన కొక ముఖ్య భ్రాంతిని తొలగించును-ఆసుర జీవులను నేను మఱలమఱల ఆసురయోనులలోనికే త్రోసివేతును -అని భగవాడును చెప్పియుండుటచేత, కొందరిని భగవంతుడు ఆదినుండియు తిరస్కరించి,జ్ఞానాంధులను గావించి, శాశ్వత నరకము పాలుచేయును-అని మన కనిపించును. అట్లుచెప్పు కొన్ని మతములు గూడ గలవు. కాని అది గీతామతము గాదు.

భగవంతుని శక్తిని దురుపయుక్తముచేయుటచేత, ఆశక్తియే ఆసురమానవుని అంతరాత్మయొక్క అధమస్థితికి గొనిపోవును, అదియే అశుచినరకము (16-16). ఇక నంతకంటె క్రిందికి పోవుట కతని కవకాశ ముండదు, మఱియు తాను దురుప యుక్తము గావించిన భగవచ్ఛక్తియు అక్కడికి చేరు సరికి అడుగంటును. అపు డతనికి కనువిప్పు గలుగును. అపుడు తన దుఃస్థితిని గ్రహించి, హృదయావేదనతో వెలుగువైపునకు దిరుగును. ఇప్పు డిక గీతయే నుడివిన రెండవ సత్యము పని చేయును : ఎంతటి దురాత్ముడైనను నా వైపునకు దిరుగు నేని అచిరకాలములోనే ధర్మాత్ముడై నన్ను బొందును (9-30,31,32)-అని శ్రీఅరవిందుడు మనకు వివరించి చూపును. శ్రీ అరవిందుని సమగ్ర పరిశీలనకు -- పూర్వాపరములను ఆకళించుకొను సమగ్రపరిశీలనకు-ఇది యొక ప్రముఖనిదర్శనము.

శ్రీ అరవిందు డింకను పరిణామమును గుఱించి ఇట్లు దెలుపును;గీత దేవాసుర విజభన గావించి నపుడు, ఉభయులకు శాశ్వత భేద మున్న దని గీతాభిప్రాయము గాదు. ఏలన అందరును భగవంతునియొక్క శాశ్వత అంశములే (15-7). అందు చేత కొందరికి శాశ్వత స్వర్గము, కొందరికి శాశ్వత నరకము-అను పూర్వనియతి ఏమియు లేదు. పోతే దేవాసురు లెట్లు ఏర్పడి రన, ప్రకృతియందు అంతరాత్మ యొక్క పరిణామ మొక సాహసకృత్యము. మఱియు, స్వభావము మఱియు స్వభావనియతమగు కర్మ (18-47) - ఇవియే ఆ పరిణామసాధక ప్రధానశక్తులు. కనుక నివి ఇంచుక అతికి పోయి, పరిణామధర్మమును అపమార్గమునకు ద్రిప్పుచో, క్రమముగా అసురు డావిర్భవించును. ఇట్లు అసురు డేర్పడగల సంభావ్యత పరిణామ స్వరూపమునందే గలదు. కాని ఆ పరిణామస్వరూపమునందే అసురుడు తిరిగి దేవుడు కాగల విధానమును గలదు (9-30).

అవతారిక : ఇపుడు ఆసుర ప్రకృతియొక్క సంగ్రహము –

**త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః,**
**కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేతత్త్రయం త్యజేత్.21**

కామము, క్రోధము మఱియు లోభము–ఈ మూడును నరకమునకు మూడు విధములగు ద్వారములు. ఈ ద్వారములలో ప్రవేశించినపుడు ఆత్మ నష్టప్రాయ మగును. కావుననే ఈ ద్వారములను పరిహరించవలెను.

విశేషార్థము : కామాదులు మూడును నరకద్వారములు, సరే. అయితే ఆ నరకస్వరూపము ? రాజసిక ప్రకృతియే తన శిఖరమున ఆసురిక ప్రకృతి యగును, ఇక నీ ప్రకృతి అంతరాత్మను కామక్రోధలోభములకు దాసుని చేయును. అంతరాత్మ యొక్క ఈ ప్రకృతిదాస్యమే ఇచ్చట చెప్పబడిన నరకము. ఇది రాజసిక నరకము. ఇపు డిక తామసిక నరకము చెప్ప బడును –

**ఏతై ర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభి ర్నరః,**
**ఆచర త్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాం గతిం. 22**

తమస్సులోనికి గొనిపోవు ఈ మూడు ద్వారములనుండి విముక్తుడైన మానవుడు తన ఉచ్చతర శ్రేయమునకు పాటుపడును. అపుడు అత్యున్నత ఆత్మపదము నందును.

విశేషార్థము : కామాదిద్వారములలో ప్రవేశించి నపుడు, మొందు అంతరాత్మ ప్రకృతి దాస్యములోనికి దిగును. ఇక ఆసుర ప్రకృతియొక్క విశృంఖలశక్తి తరిగిపోయి, అడుగంటి నపుడు, అంతరాత్మ దుర్బలత, నిస్సారత, అంధకారముల లోనికి బడిపోవును; ఒక్క మాటలో రజస్సునుండి తమస్సులోనికి బడిపోవును. అందుచేతనే కామాదులు తమోద్వారము లని చెప్పబడినది. మూలాజ్ఞానముయొక్క ఏ యీ తమస్సు గలదో, అదియే అంతరాత్మకు అధమాధమ నరకము, అతి నికృష్ట స్థానము – అని శ్రీ అరవిందుడు.

ఇదిగో, ఈ నికృష్ట నరకమునుండి తప్పించుకొనుటకు, సాత్త్వికగుణము యొక్క వెలుగునకు మఱలవలెను, సాత్త్వికధర్మము ననుసరించి జీవించవలెను. మానవునితోను భగవంతునితోను, ప్రకృతితోను సరియగు సంబంధములను గలిగి యుండి నడుచుకొనవలెను.

మఱియొక మాట : సాత్త్విక, రాజస ప్రకృతులతో గూడిన దైవసృష్టిని ఆసురసృష్టిని మాత్రమే చెప్పెను గాని, మూడవ సృష్టినెందుచేత జెప్పలేదు? నిజానికి సృష్టిలో అధికాంశము తామససృష్టియే, అధికసంఖ్యాకులు క్రింది స్తరము లోని తామసిక జనులే కదా. వీరు పైకి వెళ్లి తమ మొగ్గను బట్టి అయితే సాత్త్వికు లగుదురు, లేదా రాజసికు లగుదురు, అనగా దైవమానవులు లేక ఆసురమానవులు నగుదురు. అందుచేత తామస సృష్టిని గీత విడిగా పేర్కొనలేదు - అని శ్రీ అరవిందుడు.

అవతారిక : కామగ్రస్తునకు దారిచూపునది శాస్త్రము గాన —

యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిం. 23

ఎవడు, అర్జునా, శాస్త్రప్రమాణము వదలి, తన కామము ప్రేరేపించి నట్లు ప్రవర్తించునో, అతడు ప్రకృతి జయరూపమగు సిద్ధిని గాని, అట్టి జయమువలన ప్రాప్తించు సుఖమును గాని (2-64), అట్టి జయమునుండి ముందుకుసాగి, చేరుకొను పరమపదమును గాని పొందడు.

విశేషార్థము : కామప్రవృత్తి నవలంబించిన కడగండ్లు తప్పవు, దాస్యము తప్పదు, చివరకు అంధకార నరకము తప్పదు. కాన మానవజాతి కామనియమము కంటెను ఉచ్చతరమగు మఱియొక నియమమునకు ఎదురుచూచుచు వచ్చినది, మఱియు దాను కనుగొనిన ఆ ఉచ్చతర నియమము శాస్త్రములో పొందుపఱచబడి యున్నది. ఇట్లు శాస్త్ర మన విజ్ఞాన నియమము, నైతిక నియమము, ధార్మిక నియమము, సాంఘిక నియమము, మానవునితోను, దేవునితోను, ప్రపంచముతోను వ్యక్తియొక్క సముచిత సంబంధమును దెలుపు నియమము. ఈ శాస్త్రమును కనుగొనినది అంతఃస్ఫూర్తి (intuition), అనుభవము మఱియు ప్రయోగవిజ్ఞానము. కనుక శాస్త్రము తామసిక మానవుడు అంధపరంపరగా అనుష్ఠించు ఆచారపరంపర గాదు. శాస్త్ర మన జీవనవిజ్ఞానము, జీవనకళ, జీవననీతి, జీవనవిషయమున జాతికి ప్రాప్తించిన ఉత్తమప్రమాణములు.

అవతారిక : కావున -

తస్మా చ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి. 24

కాపున ఏది కార్యము. ఏది అకార్యము ?-అను మీమాంసయందు అర్జునా, శాస్త్రమే నీకు ప్రమాణము. అందుచేత, పార్థా, శాస్త్రము దేనిని చెప్పునో లేక విధించునో, ఆ కర్మనే నీవు చేయదగుదువు.

విశేషార్థము : "శంసనాత్, శాసనాద్వా శాస్త్రం"-అనగా, ఇది చేయదగును- అని చెప్పునది, లేక ఇది చేయుము-అని శాసించునది శాస్త్రము.

ముందు సహజప్రేరణ (instinct) మఱియు కామనియమము వచ్చును. ఇది జంతు ప్రపంచమును శాసించు నియమము. తర్వాత శాస్త్రనియమము వచ్చును. ఇది సామాన్య మానవలోకమును శాసించును. ఈ నియమము ననుసరించి, మానవుడు తన బుద్ధిచేత తన నిమ్నప్రకృతిని నియమించుకొనును. ఇట్లు శాస్త్రము మానవుని మానవత్వ వికాసమునకు దోడ్పడును. పిమ్మట స్వభావనియమము వచ్చును. కొద్దిమంది మానవులు శాస్త్రనియమమును చక్కగా పాటించుటచేత, స్వభావనియమమును గుర్తించి, పాలింపగల అంతరంగవికాసము నందుదురు (18-47). వీ రిపుడు బాహ్యశాస్త్రమును గాక, లోని తమ స్వభావవిశేషమునే అనుష్ఠింతురు. చివరకు భగవదిచ్ఛను అనుష్ఠించుట యను సర్వోన్నత నియమము వచ్చును ఇచ్చట జీవుడు సరాసరి భగవదిచ్ఛనుండియే తన కర్మ చేయును, భగవదిచ్ఛయే తన కర్మనియమ మగును. అప్పు డతడు భగవంతుని పరప్రకృతియొక్క (7-5) పరిపూర్ణస్వేచ్ఛయందు నివసించును. ఇప్పు డతడు ఒక నియమము లేక ధర్మమునందు గాక, సర్వనియమాతీతమగు భగవంతుని తత్త్వముయొక్క పరిపూర్ణ స్వేచ్ఛయందు వర్తించును (6-31).

ఇట్లు మనకీ ఆరోహణక్రమము గన్పించును-కామనియమము→శాస్త్రనియమము→స్వభావనియమము→భగవదిచ్ఛానియమము→నియమాతీత పరిపూర్ణ స్వాతంత్ర్యము. అర్జునుని అనంతర ప్రశ్న ఈ క్రమమును గుఱించిన గీతాబోధనకే భూమిని సిద్ధము చేయును.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే
దైవాసురసంపద్విభాగ యోగో నామ షోడశోఽధ్యాయః





# శ్రీ గీతా యోగము

## అథ సప్తదశోఽధ్యాయః

## శ్రద్ధాత్రయవిభాగ యోగః

ఒక పరిశీలన : మన మే నియమము లేక ప్రమాణము ననుసరించి కర్మ చేయవలెను ? కామప్రేరణచేత కర్మచేయుట యొకటి గలదు, ఇచ్చట కామమే కర్మనియమము. ఈ కామము మన ప్రకృతియొక్క ఒక సజీవాంశముపై నాధారపడి యున్నది గాన, దాని కుండవలసిన ప్రామాణ్యము దానికిని ఉన్నది, అదియు నొక కర్మప్రమాణమే యగును.

కాని కామము ననుసరించుట ఆదిమమానవునికి వలె ఆధునిక మానవునికి భద్రమును గాదు, తృప్తికరమును గాదు.

కామము వ్యక్తివ్యక్తికిని మాఱుచుండును. అది ప్రతివ్యక్తికిని స్వకీయము కావున తన బ్రతుకు తాను బ్రతికిన ఆదిమ మానవునికి కామనియమము పనిచేయ వచ్చును. పోతే ఇప్పటి మానవుడు సంఘజీవి. కనుక యథేచ్ఛగా నతడు తన కామము ననుసరించజాలడు అట్లు అనుసరించిన, నది ఇతరుల కామముతో తలపడును, సంఘమున సంఘర్షము బయలుదేఱును. కావున సంఘజీవనము సాధ్య మగుటకు అందరిపట్లను సమముగా వర్తించు ఒక కర్మనియమము ఆవశ్యకము ఇట్టి నియమము వ్యక్తికి స్వకీయముగాదు, సంఘమునకుమాత్రమే స్వకీయము(personal). ఇది వ్యక్తి కామము నదుపులోనుంచి, సంఘసంక్షేమమును, దానిద్వారా వ్యక్తియొక్క భద్రతను సాధించును. ఇదిగో, ఇట్టి నియమమునకే సాంఘిక శాస్త్రమని పేరు గీతలోని శాస్త్ర పదమునకు ఇదియే ప్రారంభికార్థము.

ప్రారంభికార్థము మాత్రమే ఏలయన, గీత మానవుని సాంఘిక సౌఖ్యము యొక్క అభివృద్ధిని మాత్రమే లక్షించదు, గీత మానవసత్తయొక్క సంపూర్ణాభి వృద్ధిని లక్షించును. కావున గీతామతమున శాస్త్రము మానవుని బౌద్ధిక, నైతిక, సౌందర్యాన్వేషక, సాంఘిక మఱియు ధార్మిక సంస్కృతియొక్క ఫలితస్వరూపము. అంతే కాదు, గీతాశాస్త్రము యోగశాస్త్రము గూడను — "యోగశాస్త్రే."

అయినపుడు, ఎవడేని అట్టి శాస్త్రము నెందుకు ఉల్లంఘించును? తామసిక మానవుడు అజ్ఞానమువలన గలిగిన అవివేకము లేక మోహముచేత శాస్త్రమును ఉల్లంఘించును, లేక ఉపేక్షించును పోతే రాజసికమానవుడు కామప్రేరణచేత(16-23) తన కామపూర్తి కడ్డువచ్చు శాస్త్రనియమము నుల్లంఘించును. మానవుని వికాస క్రమమున నిదియు ఒక దశయందు అవశ్యకమే యగును. ఏలన ఇట్టి ఉల్లంఘనము మానవునియందలి తామసిక దోషమునకు ఔషధ మగును.

అయితే సాత్త్విక మానవుడు శాస్త్రము నెందుకు అతిక్రమించును? అతని అతిక్రమణకు రెండు కారణములు గలవు - 1. శాస్త్రము సామాన్య మానవుని కుద్దేశింపబడినది. ఈ సాత్త్విక మానవుడు సామాన్య మావన వికాసమును దాటి యున్నవాడైన, అపు డతనికి శాస్త్రము, అనగా బాహ్యనియమము, ప్రతిబంధకముగా గన్పించును. అందుచేత నతడు బాహ్యవిధిని పాటించక, తనలోని స్వభావ నియమములే అనుసరించును. 2. శాస్త్రము కాలక్రమమున చిట్టెము గట్టి, ఆచారములు మఱియు సాంప్రదాయముల ఒక రాశిగా మాఱిపోవును. శాస్త్రముయొక్క హృదయము మఱుగువడి, రూపము మాత్రము మిగులును. అపు డొక బుద్ధుడు వెలసి, ఒక నూతన అష్టవిధశాస్త్రమును ప్రతిపాదించును, ఒక కృష్ణుడు వెలసి, మఱుగుపడిపోయిన ఆ సనాతన ధర్మమును పునరుద్ధరించును. వీరు లేక ఇట్టివారు చేయునది శాస్త్రాతిక్రమణమే గాదు, అదే సమయమున అది శాస్త్రపరిపూర్తియు నగును. వారు అతిక్రమించునది శాస్త్రములోని అభ్యంతరకర భాగమును, ఇక వారు పరిపూర్తిచేయునది శాస్త్రముయొక్క నిమ్నస్వరూపమును.

శాస్త్రమును ఉల్లఘించినవాడు సిద్ధిబొందడు (16-23)-అని భగవానుడు చెప్పియే యున్నపుడు, శాస్త్రము నుల్లంఘించినవా డెట్టివాడు-అని మఱల అర్జును డెందుల కడుగును? అది అతని పిచ్చియా? కాదు, సిద్ధికి శాస్త్రమును పాటించుట ఆవశ్యకమైనను, సంసిద్ధికి శాస్త్రము నతిక్రమించుటయు అవశ్యకమే యగును "సర్వధర్మాన్ పరిత్యజ్య (18-66). ఇదిగో, ఈ విధముగా (16-23) శ్లోకమునకును (17-1) శ్లోకమునకును సమన్వయమును చూపినవాడు శ్రీ అరవిందు డొక్కడే.

అర్జున ఉవాచ -

**యే శాస్త్రవిధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః,**
**తేషాం నిష్ఠాతు కా కృష్ణ సత్వ మాహో రజ స్తమః. 1**

అర్జును డడిగెను - కాని, ఓ కృష్ణా, ఎవరు శాస్త్రవిధి నుల్లంఘించి, శ్రద్ధతో దేవునికి యజ్ఞము చేతురో, వారికి గల నిష్ఠ ప్రకృతియొక్క సత్త్వ రజస్తమస్సు లలో దేనికి చెందిన దగును ?

విశేషార్థము ; నిష్ఠ యన ఒక కార్యమునందు గల తత్పరత కాగా ఈ నిష్ఠకును, శ్రద్ధకును గల సంబంధ మేమి ? నిష్ఠ విశ్వాసమును బుట్టించును - అని శ్రీ అరవిందుడు. నిష్ఠ త్రివిధముగా నున్నను, అది శాస్త్రవిధి నుల్లంఘించిన నిష్ఠ గావున, దానివలన కలిగిన శ్రద్ధ ఏకవిధముగా నుండవచ్చును గదా - అని అర్జునుని అభిప్రాయము.

శ్రీ శంకరుడు శ్రద్ధను ఒక పరిమితార్థమున మాత్రమే ఉపయోగించును.ఆయనకు శ్రద్ధ యన శాస్త్రమునందు గల నమ్మకము. అందుచేత శాస్త్రవిధి తెలిసియు, దాని నుల్లంఘించినవాడు శ్రద్ధా సమన్వితుడు కా జాలడు. అందుచేత, 'ఉత్సృజ్య = ఉల్లంఘించి - అను అర్థమై నప్పటికి, ఆయన ఉత్సృజ్య = తెలియక - అని అర్థము చెప్పి, శాస్త్రవిధి తెలియక, పెద్దల వచనమును శ్రద్ధతో పాటించువారిని గురించియే అర్జునుని ఈ ప్రశ్న యని ఆయన వాదము.

పోతే, శ్రీ అరవిందుడు చెప్పిన దేమన, శాస్త్రమునందలి శ్రద్ధ మాత్రమే శ్రద్ధ యని చెప్పరాదు. శాస్త్రమును దాటి వెళ్లిన సాధకునకు తన స్వీయ అంతరనుభవమునందును శ్రద్ధ గలుగవచ్చును. అట్టివాడు శాస్త్రవిధి తెలిసియు, అధికతర అంతర్వికాసముకొఱకు దానిని ఉల్లంఘించను వచ్చును, స్వీయఅనుభవము నందలి శ్రద్ధతో యజ్ఞమును జేయను వచ్చును.

అవతారిక : అర్జునుని అభిప్రాయము సరిగాదు. ఎట్లు ?

శ్రీ భగవా నువాచ -

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. 2

శ్రీ భగవానుడు చెప్పెను - అర్జునా ! ప్రాణుల శ్రద్ధ త్రివిధము మఱియు నది వారి స్వభావమునుండి జనించును. సాత్త్విక, రాజస, తామస భేదములచే బరగు ఆ త్రివిధ శ్రద్ధను గుఱించి నీ విపుడు తెలిసికొనుము.

విశేషార్థము : అర్జునుడు నిష్ఠను గుఱించి అడుగగా, భగవానుడు శ్రద్ధను గుఱించి చెప్పుచున్నాడేమి ? నిష్ఠ ఎట్టిదో, దానినుండి జనించిన శ్రద్ధయు నట్టిదే గాన, నిష్ఠచేత స్వభావ మేర్పడును, స్వభావమునుండి శ్రద్ధ జనించును.

ప్రకృతియందలి సర్వము గుణభేదముచేత త్రివిధము, అటులే శ్రద్ధయు త్రివిధ మగును. ఉదాహరణకు, దానియందు సత్త్వగుణ మెక్కు వుండిన, అది సాత్త్వక శ్రద్ధ యగును.

అవతారిక : ఇపు డా శ్రద్ధను గుఱించిన ఒక విశిష్ట వచనము —

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః సఏవ సః.3

ప్రతి ప్రాణియొక్క శ్రద్ధయు, ఓ అర్జునా, అతని సత్త్వ స్వరూపమును బట్టి, అతని కేంద్ర స్వభావమును బట్టి యుండును. మఱియు నా ప్రాణియొక్క అంతరాత్మ అతని శ్రద్ధచేతనే చేయబడి నట్లుండును. అనగా ఎవని కెట్టి శ్రద్ధ యుండునో, అత డా శ్రద్ధయే యగును మఱియు నతడే ఆ శ్రద్ధ యగును.

విశేషార్థము : సత్త్వము = సత్ + త్వము = సత్తాద్రవ్యము (stuff of being), ఘటక(constituting) స్వభావము, నైసర్గిక జీవనశక్తి-అని శ్రీ అరవిందుడు. పోతే, సత్త్వము = విశిష్ట సంస్కారముతో గూడిన అంతఃకరణము-అని శ్రీశంకరుడు. ఉభయులకు భేద మేమన, శ్రద్ధ అంతఃకరణ సంస్కారమే గాదు, అది అంతరాత్మ యొక్క స్వరూపద్రవ్యమే - యని శ్రీ అరవిందుడు.

శ్రద్ధ= తనయందును, సృష్టియందును గల విశ్వాసము మఱియు ఆ విశ్వాసము ననుసరించి జీవించవలె నను సంకల్పము. ఇట్లు శ్రద్ధ కేవల విశ్వాసమే గాదు, అది సక్రియ సంకల్పము గూడను. మఱియు మానవుని శ్రద్ధ ముఖ్యముగా తనయందు తనకు గల విశ్వాసము గాన, శ్రద్ధ యనునది, శ్రీ శంకరుడు చెప్పునట్లు, శాస్త్రము నందలి విశ్వాసము గాదు. శాస్త్రము తన కనుకూలముగా నున్నంతవఱకే, అతడు శాస్త్రవిధిని పాటించును, లేనిచో, దాని నుల్లంఘించును. ఊర్ధ్వతర వికాసము నిమిత్తము అట్లు చేయవలసివచ్చును గూడ.

పోతే, "శ్రద్ధామయోఽయం పురుషో, యో యచ్ఛ్రద్ధః సఏవ సః" — ఈ చిన్న పంక్తియందు వ్యవహారవాదము (pragmatism) నకు సంబంధించిన ఆధునిక సిద్ధాంత మంతయు నిమిడియున్న-దని శ్రీ అరవిందుడు చెప్పును. ఏలన పురుషుడు

శ్రద్ధామయుడు, అనగా తనును గుఱించి పురుషునికి దెలిసిన సత్య మేమన, తన శ్రద్ధ తనకొఱకు దేనిని నిర్మించునో అదియే తాను, అదియే తన స్వరూపము; తనకు దెలిసినంతవఱకు నతడు మఱేమియు గాడు. అనగా, వ్యవహారతః అతని సత్యము ఒక సక్రియ సంభూతియే గాని, ఎప్పటికి నేమియు మాఱని, తనలోని ఒక సనాతన సత్త గాదు. తన మనఃప్రాణముల క్రియయందు మానవుడు తన సత్యమును దానే సృజించుకొనును, వేఱుమాటలలో, "మన ఆత్మలను మనమే నిర్మించుకొందుము, మనమే మన స్వరూపశిల్పులము." ఇదిగో, ఇదియే ఆధునిక వ్యవహారవాదము.

కాని ఇది సత్యముయొక్క ఒక పార్శ్వము మాత్రమే, అనగా గీతయొక్క "శ్రద్ధామయోఽయం పురుషః" ఒక పాక్షిక సత్యమును మాత్రమే చెప్పును. ఏలన మనము వ్యక్తిత్వ (personalit1) రూపమగు ఒక సంభూతి మాత్రమే గాము, ఆ సంభూతికి మూలమగు ఒక నిత్య సత్తయు నగుదుము. ఆ నిత్య సత్తనుండియే సర్వసంభూతియు ప్రవర్తించును, మఱియు నట్టి సంభూతియొక్క సమస్త శక్యతలు, తత్త్వములు, ఆద్య మఱియు అంత్యప్రేరణలు — అన్నియు ఆ సత్తకే చెందిన వగును ఇట్లు "శ్రద్ధామయోఽయం పురుషః" — అను గీతావచనము ఒక ఆంశిక సత్యము మాత్రమే యని వివరించినవాడు శ్రీ అరవిందు డొక్కడే.

పోతే, శ్రద్ధయొక్క మహిమను దెలుపు మఱియొక విశిష్టాంశము : చేతనా వికాసమును బట్టి మన సంభూతిధర్మమును మాఱుచుండును. అనగా శ్రద్ధ మాఱు చుండు ధర్మప్రకారమును సృజించును. అయితే అది మన సంభూతిని శాసించు ఒక సనాతన ధర్మమును గూడ సృజించ గలదా ? కలదు.

పరమ పురుషుని స్వీయ చేతనయందు ఒక సనాతన ధర్మము ఉండనే యున్నది. అచ్చట సంభూతి ఆ సనాతన ధర్మము ననుసరించియే సాగుచుండును, అది భగవంతుని స్వీయ సంభూతి - "మద్భావం" (4-10). ఆ శాశ్వత, దివ్య సంభూతినే యోగముచేత మన మిచ్చట మన సంభూతియందు సృజింప బూనుకొని యున్నాము. అదియు శ్రద్ధచేతనే జరుగవలెను. అనగా నట్టి సంభూతి యొకటి గలదని మనము గుర్తించవలెను, గుర్తించిన దానియందు శ్రద్ధయుండవలెను,మఱియు దానిని జీవించుటకు లేక అదియే యగుటకు మన అంతరాంతరమందు దృఢసంకల్ప ముండ వలెను. అపుడే మన పూనిక సిద్ధించును. కనుక మన దివ్యసంసిద్ధిని గూడ సాధించిన దీ శ్రద్ధయే, శ్రద్ధాసామర్థ్యమే. ఈ వ్యాఖ్యానమును శ్రీఅరవిందుని ఒక ప్రత్యేకతయే.

అవతారిక : నిష్ఠాభేదమును దాని కార్యముచేత తెలిసికొనవలెను -

యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజంతే తామసా జనాః. 4

సాత్త్వికులు దేవతలకు యజ్ఞము చేతురు; అటులే రాజసులు యక్షరాక్షసులకును, తామసులు భూతప్రేతగణములకును యజ్ఞము జేతురు.

విశేషార్థము : సాత్త్వికులు = సత్త్వనిష్ఠులు, సత్త్వగుణముయొక్క ఆధిక్యము గలవారు. అయితే రాజసతామసులకు అర్థము చెప్పుకొనవలెను.

ఒకని నిష్ఠను అతని కార్యముచేత మనము తెలిసికొనవలసియుండును. ఉదాహరణకు అతడు దేవతలను గూర్చి యజ్ఞము చేయుచో అతని నిష్ఠ సాత్త్విక మని తెలియవలెను. నిష్ఠను దెలియుటకు దాని కార్యమే మనకు లింగ (చిహ్న) మగును.

ఒక యజ్ఞవిషయముననే గాక, దరహముమీద చెప్పవలె ననిన, కామ ప్రేరితులై కర్మచేయువారి శ్రద్ధ రాజసము లేక తామసము. శాస్త్రము ననుసరించి వర్తించుచు, కర్మచేయువారి శ్రద్ధ సాత్త్వికము. ఈ రెండింటిని విడిచి, తమ అంతర్దర్శనమును బట్టి కర్మచేయువారి శ్రద్ధ పై మూడు శ్రద్ధలలో నేదియో యొకటి గావచ్చును. కాని భగవంతుని దివ్యప్రకృతి ననుసరించి వర్తింపజూచుచు, కర్మ చేయువారి శ్రద్ధ తన పరాకాష్ఠను జేరుకొని, తనను దాను అతిక్రమించుచున్న సాత్త్విక ప్రకృతియొక్క నిష్ఠయగును (14-19)–అని గీత చెప్పును.

అవతారిక : ఇపుడు ఆసురనిష్ఠను ప్రత్యేకించి చెప్పును –

అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః,
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః. 5
కర్శయంతః శరీరస్థం భూతగ్రామ మచేతసః,
మాంచైవాంతః శరీరస్థం తా న్విద్ధ్యాసురనిశ్చయాన్. 6

ఏ తపస్సునందు దంభము మఱియు అహంకారము గన్పించునో, ఏ తపస్సునకు గల బలము కామము మఱియు రాగము నగునో, ఏ తపస్య శాస్త్రవిరుద్ధము మఱియు ఘోరముగ నుండునో, అట్టి పీడాకరమగు తప మాచరించుచు,ఏ బుద్ధిహీనులు శరీరమునం దున్న ఇంద్రియజాతమును, సూక్ష్మశరీరమున నున్న నన్నును (నారాయణుని) కృశింపజేయుదురో, వారి తపస్య వెనుకనున్న నిశ్చయము ఆసుర మని తెలిసికొనుము.

విశేషార్థము : భగవంతుని శాసనమును పాటించకపోవుటయే భగవంతుని కృశింపజేయుట-అని శ్రీ శంకరుడు. కాని శ్రీ అరవిందు డింతకంటెను వాస్తవార్థమును జెప్పును --

శ్రీ కృష్ణుడు శరీరము ధరించి నపుడు, ఆయన శరీరమునకు ఒక దెబ్బ దగిలిన దనుకొందము. అది ఆయనను బాధించునా, బాధించదా ? తప్పక బాధించును. అయితే మన మట్టి బాధలో మునిగిపోదుము. ఆయన తన చేతనయందు దాని కతీతుడు గూడ గావున, దానిలో మునిగిపోడు. అదియే భేదము.

భగవంతు డైనను, ఆయన బాధకు కారణ మేమన, ఆయన తన అక్షర రూపమున దేనిని అంటక, సర్వమును వ్యాపించి యున్నను, తన క్షరభావమున సర్వమును వ్యాపించి, సంభూతియందు సర్వము ననుగమించు చుండును, అనగా సర్వము నంటియే యుండును. అట్లు అంటి యుండనిచో, సంభూతియే కొనసాగదు. అందుచేత మనః ప్రాణ ఇంద్రియ శరీరముల కే క్లేశము గలుగునో, వానిలోనుండి వాని ననుగమించు వాసుదేవునికిని (7-19) ఆ క్లేశము గలుగును.

అవతారిక : భౌతిక వస్తువులు గూడ త్రివిధముగా నుండును గాన —

**ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,**
**యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు. 7**

(భౌతిక వస్తువగు) ఆహారము సైతము త్రివిధము మఱియు నొకొక విధమగు ఆహారము ఒకొక విధమగు జనులకు ప్రియమగును. అటులే (మానసికములగు) యజ్ఞదాన తపములును త్రివిధములు. ఇపుడు వాని భేదమును జెప్పెదను, వినుము.

విశేషార్థము : పైన 4-వ శ్లోకమున ఒకడు చేయు యజ్ఞగుణమును బట్టి యజ్ఞముచేయువాని నిష్ఠాగుణమును దెలిసికొంటిమి. ఇపుడు దానికి విపరీతముగా, ఆహారము తీసికొనువాని గుణమును బట్టి ఆహారముయొక్క గుణమును దెలిసికొన బోవుచున్నాము -

**ఆయుః స త్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః,**
**రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః.**

ఆయువును, లోపలి తేజస్సును, వెలుపలి బలమును, ఆరోగ్యమును, సుఖమును, ప్రియమగు సుఖస్థితిని బాగుగా నే ఆహారములు పెంపొందించునో మఱియు

నే ఆహారములు స్వతః రసపూర్ణములు, మృదుసౌమ్యములు, దృఢతరములు, తృప్తికరములు నగునో, అవి సాత్త్విక మానవులకు ప్రియములు.

విశేషార్థము : కావున ఆహారములు స్వయముగ సాత్త్వికములు. అందుచేత సాత్త్వికతను బోషించుకొన గోరువారు ఆ ఆహారములను సేవించవలెను దానిని దెలుపుటకే ఈ శ్లోకము.

డాక్టరు ఏ ఆహారములో ఎంత ఆహారపు విలువ ఉన్నదో చెప్పగలడు గాని ఏ ఆహారము సాత్త్వికమో చెప్పజాలడు. కావున ఈ శ్లోకమునకు ప్రత్యేక మూల్యమున్నది.

కట్వమ్లలవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః,
ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయ ప్రదాః. 9

మిక్కిలి కారముగను, పుల్లగను, ఉప్పగను, వేడిగను, చుఱుకుగను, రస హీనముగను, దాహకరముగను ఉండి, దుఃఖమును, శోకమును, అస్వస్థతను గల్గించు ఆహారములు రాజసమానవులకు ప్రియములు.

యాతయామం గతరసం పూతి పర్యుషితంచ యత్,
ఉచ్ఛిష్టమపి చాఽమేధ్యం భోజనం తామసప్రియం. 10

చల్లారిపోయినది, రుచిలేనిది, పాసిపోయినది,నిలువయున్నది, ఎంగిలిచేసినది కావుననే భగవన్నివేదనకు యోగ్యము కానిదియు నగు నే భోజనము గలదో, అది తామసులకు ప్రియము.

విశేషార్థము : పై రెండు శ్లోకములలో ఆహార పదము వాడి, ఈ శ్లోకము భోజనపదము నెందుకు వాడి నట్లు ? భోజనము = అది యొక భోగముగా ఘటించునది. ఆ పాసిపోయిన కూటియందే తామసజనులు ఒక వికృత భోగమును బొందుదురని తెలుపుటకే ఇచ్చట భోజనపద ప్రయోగము శ్రీ అరవిందుడు మాత్రమే భోజన పదమున కణుగుణముగా అనువదించెను.

అవతారిక : ప్రతి ప్రబల కర్మయు తన సారాంశములందు యజ్ఞతపో దానములే యని మనము గాంచవచ్చును. ఏలన ఏ గతిమయ కర్మ నిర్వహించ దలంచినను, మనము మన సామర్థ్యము కేంద్రీకరించవలసి యుండును కాగా, ఈ సామర్థ్య కేంద్రీకరణమే తపము. అటులే వేనిని సాధించుట కైనను, మనము

మనకు గల దానిని కొంత దానము చేయవలసియుండును. ఈ దానమే కార్యసిద్ధికి మనము చెల్లించవలసిన మూల్యము. ఇట్లు దానమును కర్మయందు ఒక ప్రధానాంశమే. చివరకు, ప్రతి కర్మయందును వైశ్వశక్తులకు లేక కర్మప్రభువునకు యజ్ఞరూపమున మనము కొంత సమర్పించవలసియుండును. కనుక యజ్ఞమును కర్మ యందు ఒక ప్రధానాంశమే.

మఱియు ఈ యజ్ఞదానతపములు, చిత్తశుద్ధిహేతువులు గాన, అవశ్యము ఆచరణీయములు (18-5). కనుక వానిని ఉత్తమ ప్రకారమున చేయగలుగుటకు, గీత మన కిపుడు వాని వివిధప్రకారములను జూపును –

అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధి దృష్టో య ఇజ్యతే,
యష్టవ్య మేవేతి మనః సమాధాయ స సాత్త్వికః. 11

ఏ యజ్ఞము సత్యవిహితమో, కావున దేనిని చేయవలసియే యున్నదో, అందుచేత మనస్సును ఏకాగ్రపఱచి, ఫలమును కాంక్షించక చేయబడు అట్టి యజ్ఞము సాత్త్విక మనబడును.

విశేషార్థము : 'విధిదృష్టః' = శాస్త్రవిహితము–అని శ్రీ శంకరుడు చెప్పగా సత్యవిహితము – అని శ్రీ అరవిందుడు ఇంచుక భేదమును జెప్పను.

ఇట్లు సాత్త్విక యజ్ఞమునకు మూడు స్వభావలక్షణములు గానవచ్చును – 1. అది సత్యనిర్దిష్టము మఱియు సరియగు నియమముచేత అనుష్ఠితము. 2. అది చేయబడవలసినదియే గాన, ఫలము నాశించక ఏకాగ్రతతో చేయబడును. 3. చేయబడ వలసినదియే అని ఎట్టి మినహాయింపులు లేక అర్పింపబడును గాన, అది దేవతలకు ఆమోదయోగ్య మగును – అని శ్రీ అరవిందుడు.

అభిసంధాయ తు ఫలం దంభార్థ మపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసం. 12

అట్లు కాక, అర్జునా, ఫలము నాశించియు, దంభము కొఱకును ఏ యజ్ఞము చేయబడునో, అది రాజస యజ్ఞ మని తెలియుము.

విశేషార్థము : దీని పై రూపము మాత్రము యజ్ఞము. లోని స్వరూపము స్వార్థము మఱియు దంభముతో గూడిన అహంకారము.

విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణం,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. 13

పోతే, అర్జునా, చేనియందు శాస్త్రవిధి ననుసరించు విధానముండదో, అన్నదాన ముండదో, మంత్రవినియోగ ముండదో, సంభావనాసత్కార ముండదో, శ్రద్ధ బొత్తిగా నుండదో, అది తామస యజ్ఞ మని చెప్పుదురు.

విశేషార్థము : సృష్టియందు ఆదానప్రదానము మఱియు ఘనిష్ఠతాధర్మము గలదు. ఈ ధర్మమును పాటించనిదే సృష్టియందు ఐక్య ముండదు, అసలు మనుగడయే యుండదు. యజ్ఞము ఇట్టి ఆదానప్రదానాత్మకము మఱియు ఘనిష్ఠతా సాధక మను భావము లేకయే, అనగా దాని పట్ల శ్రద్ధ లేకయే, యాంత్రికముగా చేయబడు యజ్ఞము శ్రద్ధావిరహితము.

సృష్టిక్రియను బాలించు యజ్ఞనియమముయొక్క జ్ఞానమును, దాని నిర్వహణ విషయమగు సంకల్పమును భద్రపఱచు పవిత్ర శరీరమే మంత్రము, అనగా మంత్ర పఠనము మన యీ జ్ఞానమును సంకల్పమును జాగరిత మొనర్చును. తామస యజ్ఞమందు అట్టి మంత్రపఠన ముండదు — అని శ్రీ అరవిందుడు.

అవతారిక : ఇప్పు డిక త్రివిధ తపస్య చెప్పబడును —

దేవద్విజ గురుప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవం,
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే. 14

దేవతలు, సంస్కారవంతులు, గురువులు మఱియు ప్రాజ్ఞులను బూజించుట, బాహ్యాంతర శౌచము, సూటి వ్యవహారము, బ్రహ్మచర్య పాలనము, అహింసా వ్రతము — ఇవి శారీరక తపస్యయొక్క అవయములు.

విశేషార్థము : శారీర తపస్య = శరీరసాధ్యమగు తపస్య. కాని ఏ కర్మను కేవల శరీరముచే సాధించలేము. ఏలన ఎట్టి కర్మకైనను కర్తృకరణాది పంచ అంగము లుండును (18–15). కావున శరీర తపస్య యన, ప్రధానముగా శరీరముచే నిర్వర్తింపదగు తపస్యయని శ్రీ శంకరుడు.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. 15

సత్యమును, ప్రియమును, హితమును నై, ఇతరులకు అలజడి గల్గించని ఏ వాక్ప్రకారము గలదో, అదియును, పవిత్ర గ్రంథముల అధ్యయనమును వాచిక తపస్య అనబడును.

విశేషార్థము : "సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాన్ న బ్రూయాత్ సత్య మప్రియం, నాఽనృతంచ ప్రియం బ్రూయా దేష ధర్మః సనాతనః" (మనుస్మృతి)-ఈ శాస్త్రవిధి వాక్యమునకు 'సత్యమును', 'ప్రియమునే' లక్షణములుగా జెప్పుచుండ, గీతాధర్మము 'హితము', 'అనుద్వేగకరము' – అను మఱి రెండు విశేషణములను గూడ చెప్పుచున్నది.

తపస్సు జేయుటకు మన మే అరణ్యానికో పోవలసిన పనిలేదు, పై నిర్వచనమును బట్టి మన నిత్యవ్యవహారమునే తపోమయము గావించుకొనవచ్చును.

**మనః ప్రసాదః సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః,**
**భావసంశుద్ధి రిత్యేతత్ తపో మానస ముచ్యతే.　　16**

మనస్సుయొక్క స్వచ్ఛత, మఱియు ప్రసన్నత, మౌనము,మనోనిగ్రహము భావమునందు అమాయానిత్వము-ఈ అయిదింటితోను గూడినది మానస తపస్య.

విశేషార్థము : మాటలాడకుండుట వాచిక మౌనం, అటులే మనస్సులో తలంపులు లేకుండుట మానస మౌనము. మనస్సు ఆత్మసంపర్కమునం దున్నపుడు, మనస్సునకే మౌనము సహజమగును.

అవతారిక : తపస్సుయొక్క త్రివిధరూపము జెప్పి. ఇప్పు డిక దానియొక్క త్రివిధస్వభావమును జెప్పును –

**శ్రద్ధయా పరయా తప్తం తప స్తత్ త్రివిధం నరైః,**
**అఫలాకాంక్షిభి ర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే.　　17**

పైన జెప్పబడిన త్రివిధమగు తపస్సు పరమ శ్రద్ధతో తపఃఫలము నాశించని ఆత్మవశిత్వము గల నరులచేత అనుష్ఠింపబడి నపుడు, దానిని సాత్త్విక తప మందురు.

విశేషార్థము : సాత్త్విక తపస్య సత్త్వగుణముయొక్క పరాకాష్ఠ (culmination) నందుకొని, పిమ్మట తననుదా నతిక్రమించి, పరప్రకృతియొక్క సహజ 'తపస్సు' లో కుదురుకొనగలదు. అది సాత్త్విక తపస్సుయొక్క పరిపూర్ణ దివ్య

రూపము. దీని నెఱింగి, ఇట్టి పరమప్రాప్తి సాధ్య మని విశ్వసించుటయే పరమ ప్రబుద్ధ (enlightened) శ్రద్ధ. తామస, రాజస తపస్సులలో ఈ ప్రబుద్ధ శ్రద్ధ యుండదు - అని శ్రీ అరవిందుడు.

మఱియు సాత్త్విక తపస్సు ఆత్మసంయమమును, స్వీయప్రకృతియొక్క సామరస్యసాధనమును అపేక్షించును. ఆత్మసంయమము మఱియు సామరస్య సాధనమును - ఈ రెండును శ్లోకమునందలి 'యుక్తైః' పదముచే సూచించబడుచున్న వని శ్రీ అరవిందుడు. కాగా యుక్త నరులు = సమాహితచిత్తము గల నరులు - అని శ్రీ శంకరుడు.

సాత్త్విక తపస్యయే గీతాదర్శనము గాదు, ఈ తపస్య సహజమగు ఆధ్యాత్మ 'తపస్సు'నకు ఒక సాధనము అటులే సాత్త్విక యజ్ఞము గూడ గీతాదర్శముగాదు సాత్త్విక యజ్ఞరూపమగు సమర్పణద్వారా సిద్ధించు దివ్యయజ్ఞము, అథవా దివ్య కర్మయే గీతాదర్శము; దానికి సాత్త్విక యజ్ఞ మొక అమోఘ సాధనము - అని, శ్రీ అరవిందుడు పలిగట్టుకొని నిర్దేశించును.

సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్,
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువం. 18

ఇతరులనుండి సత్కారమును, సమ్మానమును, పూజలను పొందుటకు మఱియు తన గొప్పను చాటుకొనుటకు నే తప మాచరింపబడునో, మఱియు నేది క్షణిక విషయముల నుద్దేశించి చేయబడునో, అది రాజస తపము.

విశేషార్థము : 'చలము' = ఎప్పుడో ఒకసారి మాత్రమే ఫల మిచ్చునది - అని శ్రీ శంకరుడు. పోతే, రాజస తపస్సు ఇచ్చిన ఫలము చలము, అనగా క్షణికము అని శ్రీ అరవిందుడు. దీని భావ మేమన, ఆ తపస్యవలన ప్రాప్తించిన విషయము అంతరాత్మయొక్క ఊర్ధ్వగతి కెంత మాత్రము తోడ్పడదు.

మూఢ గ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతం. 19

మొండిపట్టు గల ఒక మూఢభావముతో ఒకడు తననుదానే పీడించుకొనుచు, (ఒక క్షుద్ర లాభముకొఱకు గాని), ఇతరులను నాశము చేయగోరి కాని ఏ తపస్య చేయునో, అది తామస మని చెప్పబడును.

విశేషార్థము : ఈ తపస్సును తామసము చేయునది తమోగుణముయొక్క ప్రధానతత్త్వమగు జడత్వము (Inertia) గాదు. ఏలన జడత్వ మున్న చోటున తపస్యయే యుండదు. పోతే ఈ తామస తపస్సునకు గారణము తమోగుణ సహజ మగు మనస్సు నందలి ఒక అంధకారము, ఆచరణయందలి ఒక వికృతి, లక్ష్యము నందలి ఒక పాశవిక కామము—అని శ్రీ అరవిందుడు మాత్రమే తెలుపును.

అవతారిక : ఇపు డిక చివరకు త్రివిధ దానముచెప్పబడును -

దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే,
దేశే కాలేచ పాత్రేచ తద్దానం సాత్త్వికం స్మృతం. 20

ఒకడు తనకు చేసిన లేక చేయబోవు ఉపకారమును స్మరించి కాక, ఇచ్చుట మంచిది గనుకనే ఇచ్చుచున్నాను — అను భావముతో ఏ దానము ఉచిత కాలమున, ఉచిత స్థానమున, యోగ్యుడగు పాత్రమున కివ్వబడునో, అదిగో, ఆ దానము సాత్త్వికము —

యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్యవా పునః,
దీయతేచ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతం. 21

పోతే, మానవులనుంచి ప్రత్యుపకార మపేక్షించి కాని, దేవతల నుండి స్వర్గాది ఫలము నపేక్షించి గాని కష్టముతో నే దానము చేయబడునో, అది రాజసదాన మనబడును.

అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతం. 22

దానమునకు తగని దేశకాలములందును, యోగ్యులు గాని పాత్రలకును సత్కారరహితముగా నే దాన మీయబడునో, మఱియు దేనిని గ్రహీత ఏవగించు కొనుచునే స్వీకరించునో, అదిగో, ఆ దానమును తామసదాన మని చెప్పుదురు.

విశేషార్థము : దానవిభేదముల ఈ వివేచనను పురస్కరించుకొని, క్రమముగా మనము సాత్త్విక దానములోనికి ఆరోహించగలుగుదుము. పిమ్మట నీ సాత్త్విక దానముయొక్క పరాకాష్ఠ నందుకొని నపుడు, అచ్చటినుండి ఆత్మదానము మఱియు నాత్మసమర్పణలోనికి మన మారోహించగలిగెదము — సాత్త్విక దానము యొక్క పర్యవసానము ఇతరులకు, ప్రపంచమునకు మఱియు భగవంతునికి చేయదగిన

ఆత్మసమర్పణలోనికి మనలను గొనిపోవును, మఱియు, నీ ఆత్మసమర్పణయే గీత ఆదేశించిన కర్మయజ్ఞముయొక్క పరమరూపము ఇట్లు, తపస్సు, భగవంతుని తపస్సులో పర్యవసించి నట్లే, దానమును 'భగవంతుని ఆత్మసమర్పణలో' పర్యవసించును – అవును, భగవంతుని ఆత్మసమర్పణమే.

భగవంతుడు తనను దాను ఆహుతి జేసికొననిచో, తనను, తన శక్తులను ప్రపంచమునకు అనుక్షణము ఇచ్చుకొననిచో, ప్రపంచము పుట్టను లేదు, కొనసాగను లేదు. కనుకనే, విశ్వమంతయు పురుషయజ్ఞమే యని వేదము చెప్పుచున్నది. ఇట్లు ఆత్మసమర్పణ భావము 'సృష్టియొక్క బృహత్తమ అర్థమునందు ప్రతిష్ఠితమై యున్నది. కాగా, ఆత్మసమర్పణయందు సంసిద్ధి నందిన అంతరాత్మ, భగవంతుని వలెనే, లోకసంగ్రహార్థము (3-25) ప్రపంచమునకు తనముదాను సమర్పించుకొనుచుండును – అని శ్రీ అరవిందుడు దెలుపును.

ఇది వినుటకు బాగుగనే యున్నది. కాని ప్రపంచమునుండి ముక్తియే జీవిత లక్ష్యముగాగల సాంప్రదాయికాద్వైతములో పెరిగిన మనలోనెందరు దీనికి సుముఖులై యున్నారు ?

అవతారిక : ఇప్పుడు యజ్ఞతపోదానముల గుణమును ఇనుమడింపజేయు సూత్ర ముపదేశింపబడును ——

ఓం తత్ స దితి నిర్దేశో బ్రాహ్మణ స్త్రివిధః స్మృతః,
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. 23

ఓం, తత్, సత్-అను సూత్రము బ్రహ్మముయొక్క త్రివిధ నామనిర్దేశముగా చెప్పబడినది. ఈ నామత్రయముచేతనే పూర్వము బ్రాహ్మణులును, వేదములును, యజ్ఞములును సృజింపబడినవి.

విశేషార్థము : బ్రహ్మయొక్క ఈ త్రివిధ నామములోని 'తత్'-తెలుగులో తత్తు-సర్వాతీత స్వయంసిద్ధ తత్త్వమును సూచించును 'సత్' –తెలుగులో, సత్తు పరము మఱియు వైశ్వసత్తును సూచించును. పోతే, ఓంకారమునందలి అ-కార, ఉ-కార, మ-కారములు క్రమముగా స్థూల, సూక్ష్మ, కారణ పురుషులను సూచించును మఱియు తన సాకల్యమున ఓం-కారాక్షరము తురీయ (నాల్గవ) స్థితిని వెల్లడించును. పోతే, 'ఓం,' ఓంకారము ప్రతి యజ్ఞకర్మ, తపఃకర్మ,దానకర్మయొక్క ఆరంభమున ఉచ్చరింపబడు ఆశీర్వర్థక ప్రవేశము మఱియు ఆదేశము-అని శ్రీ అరవిందుడు.

అంతేకాదు, ఈ త్రివిధ నిర్దేశము శక్త్యాత్మకమును. అందుచేతనే, దీనిచేత బ్రాహ్మణులు, వేదములు మఱియు యజ్ఞములు నిర్మింపబడినవి-అని చెప్పబడినది. ఈ సందర్భమున ఒక ఆసక్తికర విషయము:

కృష్ణచైతన్యము శ్రీమాతారవిందులలోనికి అవతరించిన పిమ్మట ఒకనాడు "సృష్టిశబ్దము ఇపుడు నా హస్తగతమై యున్నది. మీ రనుమతించిన ముందుకు సాగెదను" - అని శ్రీమాత శ్రీ అరవిందునికి దెలిపెను. ఇది ప్రపంచముయొక్క ఆధ్యాత్మిక చరిత్రలోనే అపూర్వమని విజ్ఞుల అభిప్రాయము.

అవతారిక : ఇపుడు ఓంకార ప్రయోగము చెప్పబడును -

**తస్మా దో మిత్యు దాహృత్య యజ్ఞదానతపః క్రియాః,**
**ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినాం. 24**

అందుచేతనే బ్రహ్మమును బాగుగా నెఱిగిన బ్రహ్మవాదులు ఎల్లపుడును ముందు ఓంకారము నుచ్చరించి,పిమ్మట యజ్ఞదానతపః కర్మలయందు ప్రవర్తింతురు.

విశేషార్థము : ఓం-అక్షరమునందలి అకార, ఉకార, మకారములు, స్థూల, సూక్ష్మ, కారణ రూపమగు త్రివిధ భగవంతుని దెలుపును. కనుక కర్మారంభమున ఉచ్చరింపబడిన ఓంకారము మన కీ విషయమును గుర్తుచేయవలెను - మన కర్మ అంతఃసత్తయందు త్రివిధ భగవంతుని ఒక ప్రకటనము గావలెను, మఱియు భావనమునందును, సంకల్పమునందును ఆ భగవంతుని వైపునకు దిరిగియుండవలెను- అని శ్రీ అరవిందుడు.

**త దిత్యనభి సంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః,**
**దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః. 25**

మఱియు, మోక్షము నాశించు ముముక్షువులు వివిధములగు నీ యజ్ఞదాన తపః కర్మలను ఫలము నాశించక చేతురు.

విశేషార్థము : మోక్షమార్గమున పురోగమించువారు తమ ప్రకృతివెనుక నున్న స్వయంసిద్ధ 'తత్తు' యొక్క భావము, అనుభవము మఱియు ఆనందముతో మాత్రమే కర్మ చేతురు గాని, ఫలము నాశించి కాదు. ఆనందస్పర్శ యుండును గాన, వారికి ఫలమువలన గలుగు క్షుద్రసుఖముయొక్క అపేక్ష యుండదు - అని శ్రీ అరవిందుడు సూచించును.

అవతారిక : చివరి కిపుడు సత్-శబ్ద వినియోగము చెప్పబడును —

**సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ ప్రయుజ్యతే,**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే. 26**

ఉన్నది - అను అర్థమునందును, మంచిది - అను అర్థమునందును సత్-అను శబ్దము ప్రయోగించబడును. అటులే ఉత్తమకర్మను దెలుపుటకును ఈ సచ్ఛబ్దమును వాడుదురు.

విశేషార్థము : ఉదాహరణకు, కలములో సిరా ఉన్నదా ? - అని అడిగినపుడు, ఉన్నయెడల, సత్ - అని సమాధానింతుము. అటులే ఆ సిరా మంచిదేనా ? - అని అడిగి నపుడు, మంచిదే యగుచో, సత్ - అందుము. ఇంకను, మంచిని దెలుపుటకే కాక, మంచికర్మను దెలుపుటకును అదే శబ్దము ప్రయోగించబడును. ఏలన 'సత్' = 1. యథార్థముగా నున్నది, 2. మంచిది, 3. మంచి వస్తువు - అను నీ మూడు అర్థములు గలవు.

మంచి కర్మ మన ఆత్మను మన 'సత్త'యొక్క ఉచ్చతర సత్యతకు సిద్ధము గావించును గాన, అనగా మంచి కర్మ సత్ - కు సాధనము గాన, మంచి కర్మయు దాని కొక అర్థ మయ్యెను.

**యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే,**
**కర్మ చైవ తదర్థీయం సదిత్యే వాభిధీయతే. 27**

యజ్ఞమునందును, తపస్సునందును,దానమునందును ఒకనికి గట్టి నిష్ఠ యుండు నేని, ఆ నిష్ఠను గూడ సత్ - అనియే అందురు. మఱియు యజ్ఞరూపమున, తపో రూపమున, దానరూపమున చేయబడిన కర్మ సైతము సత్-శబ్దముచేతనే చెప్పబడును.

విశేషార్థము : పై శ్లోకమున, మంచి కర్మ, అంతరాత్మను సంసిద్ధికి సిద్ధము చేయును గాన, సత్ - అని చెప్పబడినది. ఈ శ్లోకమున, యజ్ఞాది కర్మ, సంసిద్ధి నిమిత్తము అంతరాత్మకు ఒక ఆధారము నిర్మించును గాన సత్ - అని చెప్పబడినది.

అవతారిక : ఏ కర్మసాఫల్యమున కైనను, శ్రద్ధయే ప్రధానము గాన -

**అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతంచ యత్**
**అస దిత్యుచ్యతే పార్థ నచ తత్ ప్రేత్య నో ఇహ. 28**

పోతే, అర్జునా, అశ్రద్ధతో చేయబడిన హోమము గాని, దానము గాని, తపము గాని, తదితర కర్మ గాని అసత్-అని చెప్పబడును. ఏలన అట్టి హోమాదికము వలన ఇహమున గాని, పరమున గాని ఎట్టి ప్రయోజనము నుండదు.

విశేషార్థము : శ్రద్ధావిరహితమైన యజ్ఞము, పైకి యజ్ఞముగా గన్పించినను, యజ్ఞఫలము నివ్వదు గాన, యజ్ఞ హృదయము దానిలో లేదు గాన, అది అసత్తే, అనగా అనృతమే యగును.

శ్రద్ధ యనునది కేవల బౌద్ధిక విశ్వాసము గాదు, శ్రద్ధ యన విశ్వాసము మఱియు తదనురూపమగు సంకల్పము. ఈ సంకల్పశక్తియే మనము విశ్వసించిన దానిని తెలిసికొని, దర్శించి, అనుష్ఠించి, ఆ జ్ఞానము మఱియు దర్శనము ననుసరించి జీవించుటకును, అదియే యగుటకును ప్రయత్నించును – అని మనము మఱియొక తూరి గుర్తుచేసికొనదగును. కనుక నిట్టి శ్రద్ధ ఎంత బలముగా నుండునో, మన సంభూతి–సంభవతలును అంత ఎక్కువగా నుండును. అందుచేత ఏది సర్వోన్నతమో, ఏది పరమ దివ్యమో, ఏది పరమ వాస్తవము మఱియు సనాతనమో, అదిగో, దాని వైపునకు మన మీ శ్రద్ధను త్రిప్పినపుడే, పరమ సంసిద్ధిని ప్రాపించుట కది సామర్థ్యము నిచ్చును.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే

## శ్రద్ధాత్రయవిభాగ యోగో నామ సప్తదశోఽధ్యాయః





# శ్రీ గీతా యోగము

## అథ అష్టాదశోఽధ్యాయః

## మోక్షసంన్యాస యోగః

ఓం పరిశీలన : "యో యచ్ఛ్రద్ధః స ఏవ సః" (17-3), ఎవని శ్రద్ధ ఎట్టిదో, అత డట్టివాడు, అనగా ఒకని శ్రద్ధను బట్టియే అతని సక్రియ స్వరూప మేర్పడును — అని మనము 17-వ అధ్యాయమున చూచియున్నాము. విశేషించి, కర్మచేత తన సంపూర్ణ రూపములోనికి వృద్ధిజెందగోరు అంతరాత్మ ప్రయత్నము వెనుక పనిసేయు ఆవశ్యక బల మీ శ్రద్ధయే.

ఇట్టి శ్రద్ధ సాధనాప్రక్రియయందు ప్రధానావయవ మైనను, కార్యసాఫల్యమునకు ఇతర మానసిక శక్తులు, కరణములు మఱియు నిబంధనలు సైతము (18-14) అవసరమే యగును, అవియును కర్మయొక్క వేగమును, దిశను, ఆకృతిని ఘటించును. కనుక వాని స్వభావమును దెలిసికొనుటయు మన కావశ్యకమే. అందుచేత గీత ఈ చరమ అధ్యాయమున తన పరమ రహస్యమును ప్రతిపాదించుటకు పూర్వము, గుణములను బట్టి వానిని విశ్లేషించి చూపును, ఉదాహరణకు, గుణతః తామస, రాజస, సాత్త్వికమగు త్యాగరూపములను మన ముందుంచును (18-7, 8, 9). ఇందు నిమిత్తమే ఈ అధ్యాయముయొక్క మొదటి 1-39 శ్లోకములు వెచ్చించబడును. కాగా నిట్టి విశ్లేషణము 17-వ అధ్యాయమునందే ప్రారంభమైనది గాన, 18-వ అధ్యాయమునందలి 1-39 శ్లోకాలతో గూడిన ఈ విభాగము స్థూలముగా 17-వ అధ్యాయముయొక్క అనుబంధ మగును. ఇట్లు, ఇతర వ్యాఖ్యాతలు చెప్పునట్లు ఈ 18-వ అధ్యాయము పూర్వాధ్యాయముల సంగ్రహము మాత్రమే గాక, వాని విస్తరణయు నగును.

సరే, అంతరాత్మపరిణతికి కర్మ ఆవశ్యకము మఱియు నా కర్మను ఉత్తమముగా నిర్వర్తించుటకు దానిలో పాల్గొను శక్తులు మఱియు నుపకరణములయొక్క సాత్త్విక రూపములు మనకు జూపబడినవి. కాని ఆ 'ఆవశ్యకమగు కర్మ' ఏకర్మ యగును ?

యజ్ఞ దాన తపో రూపమగు కర్మ. ఏలన ఈ మూడు కర్మలును ప్రాజ్ఞులకు అంతఃకరణ పావనము లగును (18-5), అనగా నవి మానవుల సంసిద్ధిసాధకములు.

కాని ఈ యజ్ఞ దాన తపోఽనుష్ఠానము మానవు లందరికి దరహాముమీద జెప్పబడిన సామాన్యనియమము. పోతే మానవ స్వభావమున సామ్య మున్నప్పటికి వైవిధ్యము గూడ గలదు. ప్రతివ్యక్తి యందును కొన్ని విశేషము లుండును. ఆ స్వభావవిశేషములను బట్టి కూడ వ్యక్తి కర్మ నిర్ణయించబడవలెను. ఈ స్వభావ నియత కర్మనే గీత స్వధర్మమనును (18-47).

ఈ స్వధర్మమునకు గీత అత్యంత ప్రాముఖ్య మిచ్చును. స్వధర్మముచేత మానవుడు సిద్ధిబొందును(18-46)-అని ఉగ్గడించి, పరధర్మము భయావహము(3-35) అని హెచ్చరించును. పరధర్మమన నిచ్చట సామాన్యధర్మము గాదు, పరధర్మ మన మఱియొక స్వభావముగల వ్యక్తియొక్క ధర్మము. ఇట్లు గీత జాతికి అంతకును వర్తించు సామాన్యధర్మము మఱియు వ్యక్తికి మాత్రమే వర్తించు స్వధర్మము -- రెండింటికిని చోటు కల్పించును. ఆధ్యాత్మికముగా నీ రెంటికిని విరోధము లేదు. కావున గీత ననుసరించి ఆధ్యాత్మిక వికాసము బొంది నపుడే, మానవజాతి సామ్యవాదమునకును, ప్రాజాస్వామ్యమునకును,సామరస్యము సాధించు కొనగలదు.

తర్వాత, యజ్ఞ దాన తపముల నందరు చేయవలెను (18-5), మఱియు మానవుడు స్వధర్మమునే ఆచరించవలెను (18-47) – ఈ రెండు వాక్యములకు సమన్వయ మెట్లు ?

తెలిసియో, తెలియకో, మన మందరము యజ్ఞ దాన తపముల నాచరించుచునే యున్నాము [చూ. (17-11) యొక్క అవతారిక]. అవి మానవుల సామాన్య ధర్మము. వాని నాచరించుచునే, వ్యక్తి తన స్వధర్మమును గూడ నాచరించవచ్చును. ఇట్లు స్వధర్మమునే ఆచరించవలె ననిన, పరధర్మము నాచరించరా దని అర్థము గాని, సామాన్య ధర్మము నాచరించలే మని అర్థము కాదు.

ఇక రెండవ సమన్వయ మే మనిన, ప్రతి కర్మయు తన స్వరూపమున యజ్ఞ దాన తపములే యగును [చూ. (17-11) అవతారిక]. కనుక వ్యక్తి ఆవిషయ మును దెలిసి, తన స్వధర్మమునే యజ్ఞదానతపముగా నాచరించవలెను.

పూర్వమే (2-31) ఒక ప్రత్యేక సందర్భమున గీత స్వధర్మమును ప్రస్తావించినది (3-25). ఇపు డా ప్రస్తావననే గీత స్వభావముతో గూడ గలిపి,

ఒక సిద్ధాంతరీత్యా నిచ్చట ప్రతిపాదించినది. 18-వ అధ్యాయమునందలి 40-48 శ్లోకములవిషయ మీ 'స్వభావము మఱియు స్వధర్మ'మే. ఇది 18-వ అధ్యాయమున రెండవఘట్టము. ఈ ఘట్టమునను ఈ అధ్యాయము పూర్వాధ్యాయముల సంగ్రహమే కాక, అందలి విషయవికాసము నగును.

కాగా, ఈ 18-వ అధ్యాయముయొక్క 49-56 శ్లోకాలు, లేదా 49-63 శ్లోకాలు ఇందలి 3-వ ఘట్టమగును. అర్జును డెదుర్కొనిన కర్మసమస్యను గీతాబోధన ఏ విధముగా పరిష్కరించినదో, దాని సంగ్రహ మంతయు ఒకే చోట, ఈ కొలది విస్పష్ట శ్లోకాలలో వచ్చివేయును. 49-53 శ్లోకాలలో ప్రయోగించిన పదజాలమును. బాహ్య మఱియు నాంతర సన్యాసములలో దేనికైనను మనము సరిపెట్టుకొనవచ్చును. అయినపుడు ఇక్కడ నుద్దిష్టమైనది బాహ్యసన్యాసమో, అంతరసన్యాసమో మన మెట్లు నిర్ణయించగలము? ఈ శ్లోకముల వెనువెంటనే వచ్చిన 3-శ్లోకములచేత 54-56 శ్లోకములందు భక్తి మఱియు కర్మ తిరిగి ప్రవేశించును, ప్రవేశించి భగవంతునితో సాధకుని యోగమును పూర్ణ మొనరించును. ఇట్లు దివ్యకర్మకు, 49-53 శ్లోకములలోని జ్ఞాననిష్ఠ ఒక సాధనము గాన, ఆ జ్ఞాననిష్ఠయందలి సన్యాసము ఆంతర సన్యాసమే యని మనము గ్రహించదగును. మఱియు నొకవేళ అది బాహ్యసన్యాసమే యగుచో కర్మసమస్య పరిష్కరింపబడక మిగిలిపోయినదే యగును. కర్మ సమస్యను పరిష్కరించ దలపెట్టిన గీత అట్లెందుకు జేయును?

ఈ 3-వ ఘట్టమునందలి అతిముఖ్య విషయ మేమన, "భక్త్యా మా మభి జానాతి (18-55)"-భక్తిచేత నా లోతులను దెలిసికొనును ఇట్లు భక్తి జ్ఞానమునకు విరుద్ధము కాకపోగా, దానిని పూర్ణమొనర్చును, నిష్క్రియాత్మయు సక్రియ ప్రకృతియు చివరకు ఒకటియే యని, ఒకే పురుషోత్తము డని చూపి, కర్మ జ్ఞానముల సమన్వయమును సాధించును.

గుణమయ ప్రకృతి వెనుక మఱుగువడి యున్న నిష్క్రియ, నిర్వ్యక్తికాత్మ 'గుహ్యము', ఈ ఆత్మ మఱియు సక్రియ ప్రకృతియొక్క సమన్వయము 'గుహ్య తరము'-అని శ్రీ అరవిందుడు అపూర్వముగా వ్యాఖ్యానించును. మంచిది, అయితే గుహ్యతమ మేది యగును? ఆ గుహ్యతమమే 18-వ అధ్యాయముయొక్క చతుర్థ మఱియు చరమ ఘట్టముయొక్క పరమ విషయము. ఈ చరమఘట్టము 57-66,73 శ్లోకాలతో గూడి యున్నది. దీని యందలి ప్రథమ శ్లోక మిది -

"నిన్ను నీవు సర్వాత్మనా నాకు నివేదించుకొనుచు, మత్పరుడవై నీ సచేతన మానసమందు నీ కర్మల నన్నింటిని నాలోని కర్పించివేయుచు, సంకల్పముతో

గూడిన (2-41) బుద్ధియోగము నాశ్రయించి, హృదయము నందును, సర్వచేతన యందును నాతో సదా ఏకముగా నుండుము" (18-57). దీనిలో మనకు గాఢతమ ధార్మికావేశము గన్పించును; మానవునియొక్క అత్యంత ఆరాధనచేతను, అతని సమస్తసత్తయొక్క ఊర్ధ్వముఖ సమర్పణచేతను, ఎవనినుండి తానువచ్చి, ఎవనియందు నివసించుచున్నాడో, అట్టి అతీత మఱియు విశ్వమయ భగవంతునికి తనను దాను అశేషముగను, పరిపూర్ణముగను, ఇచ్చివేసికొనుటచేతను జనించు ధార్మికావేశ మిది.

అపర ప్రకృతిలో నున్న అంతరాత్మకు, గీత ఇచ్చట నొక దృఢ మఱియు నిశ్చిత, కాని ఆరోహణ పరమగు బహువిశాల మార్గమును, ఒక మహాధర్మమును విధించుచున్నది. ఇంతటి మహాధర్మమును గాకపోయినను, ఒక సామాన్య మతమును-గీత గాక, యొక సామాన్య మతమును-ఇటులే యొక ధర్మమును ప్రతిపాదించి, తన అనుయాయులను ఆ ధర్మపరిధిలోనే త్రిప్పుచుండును, కాని గీత తన మహాధర్మ ప్రతిపాదనతో సైతము ఆగదు, ఆ ధర్మబంధమునందే మనను బంధించియుంచదు. తాను ఇతః పూర్వము విధించిన 'సర్వధర్మములను దాటి, అవలకును, పైకిని దూకుము, ఎగురుము' - అని మనల నుద్బోధించును (18-66), అనంతముగా విస్తృతమైయున్న ఆకాశములలోనికి మనలను విడిచివేయును, పరిపూర్ణ స్వేచ్ఛాస్వాతంత్ర్యములతో విలసిల్లు, సర్వాతీత పురుషోత్తమపదములోకెని ప్రవేశపెట్టును. ఇదియే గీతయొక్క పరమ వైశిష్ట్యము. సర్వధర్మముల ఈ ఆధ్యాత్మికాతిక్రమణమే, ఈ దివ్య అతిశయనమే గీతయొక్క మహావాక్యము, గీత మన కావిష్కరించు గుహ్యతమ సత్యము, 'గుహ్యతమము' (18-64).

సమయము వచ్చినపుడు తల్లి-పక్షి బిడ్డ-పక్షిని అంతదనుక నాధారముగానున్న గూటినుండి అనంతాకాశములోని కెట్లు పంపివేయునో, అటులే గీతామాతయు తన బిడ్డలను చివరకు అనంత స్వాతంత్ర్యములోనికి విడిచివేయును.

ఇట్లు గీతయొక్క 18-వ అధ్యాయము, విశేషించి, అందలి మహావాక్యము ఇంతదనుక గీత మనకు బోధించిన సాధనావిధానముయొక్క, ఆధ్యాత్మికశిక్షణ యొక్క సంగ్రహరూపము కానే కాదు; అది ఆ విధానముయొక్క పరమాతిక్రమణము, దివ్యాతిశయనమునగును-ఈ సత్యము నింత స్పష్టముగా జూపిన విశిష్టత శ్రీ అరవిందునికే దక్కును.

మంచిది, కాని సర్వధర్మములను, ప్రమాణములను అతిక్రమించిన మహాయోగి తన కర్మయం దెట్లు ప్రవర్తించును ?-అని అర్జునునకు స్థితప్రజ్ఞుని విషయమున ఉదయించిన ప్రశ్న (2-54) మనకును ఇపు డుదయించును.

"త్వయా, హృషీకేశ! హృదిస్థితేన యథా నియుక్తోఽస్మి తథా కరోమి"- హే హృషీకేశ! హృదయమునం దున్న నీ వెటుల నియోగింతువో, నే నటుల చేతును-అని అర్జునుడే ఉత్తరగీతలో నుడువును. ఇదియును గీత లక్షించిన పరమ స్వాతంత్ర్యము, సర్వాతిక్రమణము గాదు. ఏలన ఇచట అర్జునునికి, హృషీకేశునికి మధ్య కొంత అంతరము గన్పించును. కావున అత డింకను పఱియొకరి నియోగమునకు అధీనుడే.

'మచ్చిత్తః సతతం భవ" (18-57) అర్జునా, నీ సర్వచేతన యందును నాతో నేకమగుము. ఇట్లు ఏకమైనపుడు, భగవదిచ్ఛయే అర్జునుని ఇచ్ఛయగును. మఱియు నిట్లు ఏకమై నపుడు అవరప్రకృతినుండి పైకెగసి, పరప్రకృతిలో కుదురు కొనినవాడగును. పరప్రకృతియే తన మూలప్రకృతియని తెలిసికొనిన వాడగును. ఇక ప్రకృతియందు సత్యమును వెదకవలసిన పని యుండదు.అది సదా సహజముగనే కరతలామలకమైయుండును. కనుక నే క్షణమున నేది చేయవలెనో, స్వయముగనే స్ఫురించుచుండును. వేఱు మాటలలో యోగికంటెను అన్యము గాని ఒక సహజ (spontaneous) ధర్మమును బట్టి, ఒక సహజతాధర్మమును బట్టి యోగికర్మ ప్రవర్తించును. ఆ ధర్మము స్వయం ప్రవర్తితము. అది వ్రాయబడియుండు ధర్మము గాదు. కనుక ఏ ధర్మమునుబట్టి యోగి ప్రవర్తించును?-అను ప్రశ్నయే అక్కడ ఉదయించదు.

మఱియు దానిని గూడ 'ధర్మ' మనియే పిలుచుటకు మన మంగీకరించినచో అది శాశ్వత లేక సనాతన ధర్మ (14-27) మగును హిందూమతమును 'సనాతన ధర్మ' మని నపుడు, దానిలో నింత అర్థ మున్నదని మనము గ్రహించవలెను. మఱియు నీ ధర్మమును 'అమృత ధర్మ' (12-20) మనియు నందురు. ఏలన పరమానందరూపమగు అమృతమునుండి అపుడు సర్వజీవనము సర్వకర్మలు వెలు వడును. మార్పును శాసించు మాఱని ధర్మ మది యొక్కటియే; మార్పును కర్మను అనందమయము జేయు ధర్మ మది యొక్కటియే. అట్టి ధర్మము గాని ధర్మమే గీతాధర్మముయొక్క పరమ లక్ష్యము! ఇపు డా లక్ష్యము వైపునకు సాగుదము!

అర్జున ఉవాచ -

**సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుం,**
**త్యాగస్యచ హృషీకేశ పృథ క్కేశి నిషూదన. 1**

అర్జును డడిగెను-ఇంద్రియ నియామకుడవు, కేశి యను రాక్షసుని సంహరించిన వాడవు నగు ఓ మహాబాహో, కృష్ణా! సన్న్యాసముయొక్కయు, త్యాగము యొక్కయు తత్త్వమును నీనుండి వేఱువేఱుగా దెలిసికొన గోరుచున్నాను.

విశేషార్థము : (4-18), (5-3), (6-2), (4-24), (4-41)-ఇత్యాది శ్లోకములందు త్యాగసన్న్యాసముల స్వరూపమును భగవానుడు వ్యక్తము చేసియే యున్నాడు కాని మాయావాదప్రభావానికి లోనైన లోకము సన్న్యాసశబ్దమునకు గీత ఉద్దేశించిన దానికి సరిగా వ్యతిరేకార్థమునే తీసికొనుచున్నది. దానిని తన కాలముననే ఊహించిన భగవానుడు మఱియొకసారి అర్జునునిచేత అడిగించి, దాని తత్త్వమును విశదపఱచుచున్నాడు —

శ్రీ భగవానువాచ -

కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః,
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః. 2

పండితులు, అర్జునా, కామ్యకర్మలను విడిచివేయుటయే సన్న్యాస మని చెప్పుదురు, మఱియు ప్రాజ్ఞులు సర్వకర్మల ఫలమును త్యజించుటయే త్యాగ మని పలుకుదురు

విశేషార్థము ; ఇచ్చట ముందు మనము గమనించవలసిన దేమన, స్వతః సన్న్యాస, త్యాగ శబ్దముల రెండింటికిని గల అర్థ మొక్కటియే — పరిత్యజించుట, విడిచివేయుట. పోతే, కామ్యకర్మను విడిచివేయుట సంన్యాస మనియు, సర్వకర్మల ఫలమును విడిచివేయుట త్యాగ మనియు పండితులు చెప్పుదురు, భగవానుడు గాదు.

ఇపుడు విచారించవలసిన దేమన, కర్మను త్యాజ్యము చేయునది స్వతః కర్మయా, కర్మఫలమా ? నిశ్చయముగా కర్మఫలమే. కామ్యకర్మలను త్యజించవలెను-అనుదానిలోని భావ మిదియే. పోతే, ఫలత్యాగము త్యాగముగాన, త్యాగమన్నపుడు కర్మ త్యాజ్యము గాదని తేలును. ఇక సర్వకర్మఫలత్యాగ మని నపుడు, సర్వకర్మల ఫలమును త్యజించుట సాధ్యమనియే భావము గాన, స్వతః ఏ కర్మయు త్యాజ్యము కాదని తేలును.

మఱియు, పండితులు మాత్రమే సన్న్యాసమును కర్మతో ముడి బెట్టిరి గాని, భగవానుడు గాదు. భగవానుడు మట్టుకు సర్వకర్మలను జేయుమనును (3-30)

అయితే వానిని తనయందు సన్న్యసించి, చేయుమనును. ఇట్లు భగవానుని సూత్రము : సర్వకర్మల ఆంతర సన్న్యాసము, బాహ్య అనుష్ఠానము. ఇది సాధ్యము మాత్రమే గాక, సంసిద్ధి సాధకమును (18-56).

సన్న్యాసమునకు ప్రాణము త్యాగము, అనగా ఆంతర సన్న్యాసము (6-2), ఇక నా త్యాగ ముండిన బాహ్యసన్న్యాస మనావశ్యకము.

గీత తన యీ సన్న్యాసము నెంత నూఱిపోసినను, అది మన మనస్సున కెక్కుట లేదు; అందుచేతనే మఱియొక సారి గీత సన్న్యాస తత్త్వమును చర్చించు చున్నది.

అయితే శ్రీ శంకరు డేమి చెప్పును? కామ్యకర్మలన అశ్వమేధాది కర్మలు : వాని త్యజించవలెను. భగవానుడు తన ఉపకరణరూపమున (11-33) అర్జునునిచేత ఘోరయుద్ధమునే చేయించినపుడు, దానివలన ప్రాప్తించిన అశ్వమేధమును మాత్రము ఎందుకు చేయించరాదు? ఇక 'సర్వ కర్మ' లన నిత్యనైమిత్తిక కర్మలని శ్రీ శంకరుడు ఒక గిఱిగీయును. పోతే, ఫలత్యాగమన, వాని ఫలత్యాగము. ఈ నిత్యకర్మానుష్ఠానము సైతము జ్ఞానోదయపర్యంతము మాత్రమే, అటు పిమ్మట దేహావసానపర్యంతము భిక్షాటనముమాత్ర ముండును. చివరకు దేహముతోబాటు నదియు బోవును. అపుడు ఆత్యంతికనిష్క్రియత్వము సిద్ధించును, అదియే మోక్షము, మోక్షము ననుభవించు వాడులేని మోక్షము.

అవతారిక : త్యాజ్యకర్మ విషయమున సైతము పండితులకు సమ్మతిలేదు -

త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః,
యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్య మితి చాపరే. 3

(కామ్యకర్మలనే కాక) కొందరు బుద్ధిమంతులు కర్మ యంతయు త్యాజ్యమే యని ప్రవచింతురు, కాగా మఱికొందరు యజ్ఞ దాన తపోరూపమగు కర్మలను త్యజించ రా దని పలుకుదురు.

విశేషార్థము : మానవుడు తన ప్రకృతియందు కర్మచేయని క్షణమే యుండదు (3-5) గదా? అయినపుడు ఆ 'బుద్ధిమంతులు' అట్లెందుకు చెప్పుదురు?

కర్మాధికారము గలవారు, కర్మాధికారము లేనివారు అని శ్రీ శంకరుడు మానవులను రెండు వర్గాలుగా విభజించును. ఇందు అజ్ఞానులు ప్రథమవర్గమువారు, జ్ఞానులు

ద్వితీయవర్గమువారు. ఆయన ననుసరించి, జ్ఞానికి భేదమే కన్పించదు. మఱియు కర్మకు, వ్యవహారమునకు భేద మావశ్యకము. అందుచేత జ్ఞానికి కర్మాధికారము లేదు, అనగా జ్ఞాని కర్మ చేయనే చేయ లేడు-అని ఆయన వాదము. మంచిది, కాని శ్రీ శంకరుడు జ్ఞానియే కదా, అయినపుడు ఆయన అంత మహాకర్మ నెట్లు చేయ గలిగెను ?-అని శ్రీ అరవిందుడు ప్రశ్నించును అస్తు. ప్రస్తుత మేమన, జ్ఞానికి కర్మాధికారము లేదు గావున, యజ్ఞ దాన తపః కర్మలును జ్ఞానికి లేవని శ్రీశంకరుడు పట్టుబట్టును.

అవతారిక : కాని భగవాను డే మనును ?

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ,
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః. 4

భరతకుల శ్రేష్ఠా, పురుషపుంగవా, అర్జునా, అట్టి కర్మత్యాగ విషయమున ఇపుడు నా నిశ్చయ మేదియో చెప్పెదను, వినుము. త్యాగ మనునది మూడు విధములుగా జెప్పబడి యున్నది

విశేషార్థము : 17-వ అధ్యాయారంభమున అర్జునుడు శ్రద్ధను గుఱించి అడిగి నపుడు, త్రివిధా విభజించి గాని శ్రద్ధను గుఱించి తెలుసుకొనుటకు వీలుపడ దని భగవానుడు చెప్పినట్లే, ఇచ్చటను త్యాగమును గుఱించి విభజించి చెప్పు చున్నాడు

త్యాగశబ్దము ఫలత్యాగమునకే కాక, కర్మత్యాగమునకును భగవాను డుప యోగించుట నిచట మనము గమనింపదగును. ఇది (18-2) లోని 'కవుల' సంప్ర దాయమునకు విరుద్ధము.

అవతారిక : ఇపు డా నిశ్చయ మేమనె -

యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్,
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణాం. 5

యజ్ఞము. దానము, తపస్సు-అనెడి కర్మలు త్యజింపదగినవిగావు, అవి చేయ దగినవియే. ఏలన అవి (ఫలమును గోరని) నియతాత్ములకు విశుద్ధిని గలిగించును.

విశేషార్థము : కర్మలు విశుద్ధిని, చిత్తశుద్ధిని గల్గించును, అంతవఱకే వాని వ్యాప్తి. మోక్షమార్గమున అక్కడితో నవి ఆగిపోవును, తర్వాత జ్ఞానమునకు మాత్రమే అధికారము, ఆ జ్ఞానముచేత నిష్క్రియ కైవల్యము-అని శ్రీ శంకరుడు.

కాని మానవుని లక్ష్యము ఇట్టి కైవల్యము గాదు, ప్రకృతిసంసిద్ధి – యని శ్రీ అరవిందుడు. కాగా, ఏ కర్మలు ముందు విశుద్ధిహేతువు లగునో, అవే కర్మలు తర్వాత సంసిద్ధి (perfection) సాధకము లగును, ఇంకను తర్వాత అవే కర్మలు సంసిద్ధివ్యంజకము లగును–ఈ చివరి కర్మలనే గీత ముక్తుని కర్మలు "ముక్తస్య కర్మ" (4-23)–అని అనును. ఇట్లు గీత మఱియు శ్రీ అరవిందు ననుసరించి కర్మ లెప్పుడును ఆగిపోవు.

అవతారిక : యజ్ఞాది కర్మలు పావనములు గావలె ననిన, ఒక షరతుగలదు–

ఏతా న్యపితు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ
కర్తవ్యా నీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమం. 6

ఈ యజ్ఞాది కర్మలను సైతము వానియందును, వాని ఫలమునందును సంగ మును త్యజించి చేయవలెను : ఇదియే, పార్థ ! నిశ్చితము, నుత్తమము నగు నా అభిప్రాయము.

అవతారిక : ఇపు డిక 4–వ శ్లోకమునందు ప్రతిజ్ఞాతమైన త్రివిధ కర్మ త్యాగమును జెప్పును –

నియతస్యతు సంన్యాసః కర్మణో నోపపద్యతే,
మోహాత్ తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః. 7

నియత కర్మను సన్యసించుట యుక్తము గాదు. కాగా మోహముచేత దాని నెవడు పరిత్యజించునో, అతని త్యాగము తామస త్యాగ మని చెప్పబడును.

విశేషార్థము : మున్ముందు, నియత కర్మ యన నేమి ? కామ ప్రేరణచేత ఇచ్చవచ్చిన కర్మ చేయుము. అట్టి ఇచ్చవచ్చిన కర్మ గాక, నియమించబడిన కర్మ 'నియత కర్మ' యగును. దేనిచే నియమించబడిన కర్మ ? శాస్త్రముచే నియమించబడిన పంచమహాయజ్ఞ ప్రధానమగు నిత్య కర్మయే నియత కర్మ – యని శ్రీ శంకరుడు, అందునను, శాస్త్ర మన యజ్ఞాదికమును విధించు ధార్మిక శాస్త్ర మనియే శంకరుని భావము.

కాని అది నియత కర్మ వ్యాప్తిని మిక్కిలి సంకుచిత పఱచుటయే యని శ్రీ అరవిందుడు. సముచిత జ్ఞానము, సముచిత కర్మలు, సముచిత జీవనములకు సంబంధించిన విజ్ఞానము మఱియు కళారూపమగు నే శాస్త్రము గలదో, అదిగో,

దానిచేత నియమించబడిన కర్మ నియత కర్మ యని శ్రీ అరవిందుడు. ఇంతకంటెను శ్రేష్ఠతరార్థ మేమన, స్వభావముచేత నియమించబడిన కర్మ (18-47) నియత కర్మ యగును. పోతే శ్రేష్ఠతమార్థ మేమన, మన లోపలను, పైనను గల భగవంతుని ఇచ్ఛచేత (18-61) నియమించబడిన కర్మ – అని శ్రీ అరవిందుడు.

ఇట్టి నియత కర్మను శోకాది మోహావేశముచేత గాక, ఎవడు మాత్ర మెట్లు త్యజించును: ఎట్లు త్యజించగలడు? స్వభావము (18-60) గాని, హృదయస్థుడగు నీశ్వరుడు (18-61) గాని ఆ కర్మ నతనిచేత నవశ్యము చేయించడా?

ఒకవేళ సామాన్య స్థాయిలో అది సంభవ మైనను, అది అకర్మయందు సంగ మగును – "మాకర్మణి సంగః" (2-47), అందుచేత నది తామసము. ఇట్లు గుణములను దప్పించుకొన సన్న్యసించిన వాని సన్న్యాసమందును గుణములే యుండును: కర్మలోనికి వలెనే కర్మ సంన్యాసములోనికిని గుణములు ప్రవేశించును.

తర్వాత, యజ్ఞ దాన తపః కర్మ త్యాజ్యము గాదు–అని పైన జెప్పి, ఇపుడు హఠాత్తుగా విషయమును మార్చివేసి, నియత కర్మ త్యాజ్యము గా–దని భగవానుడు చెప్పుచున్నా డేమి? ఏలన, యజ్ఞ దాన తపములను తమ విశాలతమ అర్థమున దీసికొనినచో, అవి నియత కర్మయే యగు – నని శ్రీ అరవిందుడు వ్యాఖ్యానించును.

అవతారిక : మఱియు –

దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్ త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. 8

పోతే, దేహమునకు క్లేశము, మనస్సునకు ఖేదము–ఇట్టి దుఃఖమును గల్గించు నని ఎవడు నియత కర్మను త్యజించునో, వాని కర్మత్యాగము రాజసము. అట్టి త్యాగమువలన త్యాగఫలమగు జ్ఞానము లభించదు.

విశేషార్థము : కాయక్లేశభయము అహంకారమునకు, అందుచేత అట్టి త్యాగము నకు మూలము అహంకారము, అట్టి త్యాగమునందు భగ ద్దృష్టి గాక, స్వచింతయే గలదు. అందుచేత అది రాజసత్యాగము, అందుచేతనే ఆధ్యాత్మికఫలము లభించదు.

అవతారిక : ఇపు డిక ఉత్తమత్యాగము చెప్పబడును –

కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున,
సంగం త్యక్త్వా ఫలంచైవ స త్యాగః సాత్త్వికో మతః. 9

ఇది నియత కర్మ, కావున దీనిని చేయవలసియే యుండును, అనగా నిది 'కార్యం కర్మ' (3-19) – అని చెప్పి, కర్మసంగమును, ఫలసంగమును త్యజించి, ఏ కర్మ చేయబడునో, అదియే సాత్త్విక త్యాగము.

విశేషార్థము : ఇచ్చటి సూక్ష్మమగు శబ్దప్రయోగమును గమనించదగును. కర్మత్యాగము త్రివిధము (18-4)-అని ప్రారంభించి, కర్మఫలమునందును, కర్మము నందును సంగమును త్యజించుటయే మూడవ ఉత్తమ త్యాగ మని చెప్పును. పోతే, కర్మమునందు సంగత్యాగ మన బాహ్యముగా కర్మ జరుగుచున్నను, నేను కర్మ చేయుట లేదు-అను లోపలి అనుభవము. ఇట్లు అంతరకర్మత్యాగమే, ఉత్తమ త్యాగము, బాహ్యత్యాగము తామసము లేక రాజసము – అని చెప్పకయే చెప్పిన ట్లయినది.

మఱియు ఆంతరకర్మత్యాగమున కర్మయంతయు భగవంతునినుండియే వచ్చు చున్న దని జ్ఞానము కలుగును గాన, ఆత్యాగమునకు గలుగు ఫలము ఆధ్యాత్మికము, సర్వోన్నతము.

ఇది సాత్త్విక త్యాగమా ? అనగా, ఈ త్యాగములోనికి గూడ గుణము ప్రవేశించునా ? ఇది సాత్త్వికత్యాగముతో ప్రారంభించి, సత్త్వాతీతస్థితియందు పర్యవసించును. కనుక లక్షణార్థమును బట్టి ఇది సాత్త్వికత్యాగము – అని అన వచ్చును గాని, పరిపాకమునందు ఈ త్యాగము గుణాతీత మగును, దీనియందు గుణము లుండవు.

పోతే, త్రివిధ కర్మత్యాగమును జెప్పెద-నని ప్రారంభించిన భగవానుడు, మూడవ దశయందు కర్మత్యాగమును త్రొక్కిపట్టి, అజ్ఞుల నుద్దేశించి, ఫలత్యాగ స్తుతి నిమిత్తము ఫలత్యాగమును మాత్రము చెప్పెను-అని శ్రీ శంకరుడు :

అవతారిక : అది నియత, అందుచేతనే కర్తవ్య కర్మ గావున —

న ద్వేష్ట్య కుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. 10

ప్రాజ్ఞుడు సత్త్వగుణముచేత సంవ్యాప్తమైన మనస్సునకు సహజమగు ప్రకాశమునందు లాభాలాభములకు సంబంధించిన సర్వసంకోచములను, సామాన్య మానసమునకు సహజమగు సర్వసంశయములను త్యజించి, కర్తవ్య కర్మను జేయును - అతడు నష్టము గల్గించు కర్మలను ద్వేషించడు, లాభము గల్గించువాని యందు సక్తుడు గాడు

విశేషార్థము : శ్రీ శంకరుని కీ శ్లోకమునందు కర్మానుష్ఠానమే గన్పించదు : త్యాగీ = కర్మఫలమును త్యజించి నిత్యకర్మ సేయువాడు. సత్త్వము = జ్ఞాన హేతువగు సత్త్వగుణము. త్యాగి గావున, ఇట్టి సత్త్వ సంయుక్తు డగును; ఈ సత్త్వసంయుక్తుడు మేధావి, అనగా జ్ఞాని యగును, జ్ఞాని గావున కర్మవిషయమున తాను చేయుచున్నా ననే సంశయ మతని కుండదు; ఛిన్నసంశయుడు. ఇట్టివాడు అకుశల, అనగా బంధమును గల్గించు, కామ్య కర్మను ద్వేషించడు, మోక్షమునకు దారితీయు కుశల (=నిత్య) కర్మయందు సక్తుడు గాడు. అత డిపుడు జ్ఞాని గాన, అతనికి కామ్య కర్మను ద్వేషించవలసిన పని గాని, నిత్యకర్మను పోషించవలసిన పని గాని, యుండదు - అని శ్రీ శంకరుడు.

అకుశల కర్మను ద్వేషించడు-అనిన, దానిని గూడ ద్వేషరూపమైన సంగము లేకుండ చేయును - అని స్పష్టార్థము. కాని, అకుశల కర్మ = కామ్య కర్మ - అని అర్థము చెప్పి, ఇప్పుడు జ్ఞానము పొందిన జ్ఞాని దానిని సైతము ద్వేషించడు, దానిపట్ల గూడ నుదాసీనముగా నుండును - అని శ్రీ శంకరుడు బహుచమత్కారముగా అర్థమును మార్చివేసినారు : అయితే ఇది శ్లోకార్థము గాదు, స్పష్టార్థమే శ్లోకార్థము-అని తర్వాతి శ్లోకము ధ్రువపఱచును -

సహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః,
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే. 11

ఏలన కర్మలను అశేషముగా త్యజించుట దేహధారియగు జీవునకు సాధ్యము గాదు. కనుక ఎవడు కర్మఫలత్యాగియో, అతడే త్యాగి - యని చెప్పబడును.

విశేషార్థము : 'ఏలన' - అను కారణప్రారంభక వచనము స్పష్టముగనే పై శ్లోకమును పరామర్శించుచున్నది : ఏలన = కర్మను అశేషము త్యజించుట ఎటులను సాధ్యము కాదు గనుక, అకుశల కర్మ నైనను, కష్టనష్టముల గల్గించు

కర్మనైనను, అది నియత కర్మ యైనపుడు, 'మేధావి' యగువాడు దానిని చేసియే తీరును - ఇది ఏలన - శబ్దముయొక్క అన్వయము.

కాని, ఈ రెండు శ్లోకములకు అన్వయమును జెప్పు ఏలన - శబ్దమునకు మఱియొక అన్వయము జెప్పి, పై శ్లోకమును (18-10) ఈ శ్లోకము (18-11)నుండి విడగొట్టి, అది జ్ఞానిపరముగాజెప్పిన వాక్యము, ఇది అజ్ఞానిపరముగా జెప్పినవాక్యము, అజ్ఞాని మాత్రమే కర్మను అశేషముగా త్యజించజాలడు, జ్ఞానిత్యజించగలడు — అని శ్రీశంకరుడు వాదించును, కాని ఈ వాదన గీతా విరుద్ధము. అనుభవ విరుద్ధము, ఏలన జ్ఞానికి కర్మచేయునది నేను గాదు—అని జ్ఞాన ముండునే కాని, అతనియందు సైతము ప్రకృతి కర్మ లాగిపోవు. అతనికిని దేహము గలదు కదా 'దేహభృతా' (18-11).

ఇచ్చట శ్రీ అరవిందు దొక చుఱకవంటి చుఱక వేయును—తాను చేయుట లేదని జ్ఞానికి దెలియును గదా అయినపుడు తాను చేయు కర్మను త్యజించవలసిన అగత్యము జ్ఞాని కెందు కుండును? ఉండదు. ఒకవేళ ఉన్నచో, అతడు జ్ఞాని కాడు-అని శ్రీ అరవిందుడు సిద్ధాంతీకరించును.

పోతే, గీతాసిద్ధాంత మేమన, బాహ్యకర్మల అశేషత్యాగ మనునది లేనే లేదు అశేష ఆంతర కర్మత్యాగము మాత్రమే గలదు. ఆ త్యాగము పరిపాకదశయందు కర్మఫలత్యాగమునందు అంతర్గతము. కనుక కర్మఫలత్యాగినే త్యాగియందురు(18-11). ఇచ్చట రెండవ త్యాగిశబ్దమునకు విశేషణము లేకపోవుట గమనార్హము; కావున, త్యాగి = ఉభయత్యాగి, ఫలత్యాగి మఱియు కర్మత్యాగి-అని అర్థము. ఫలత్యాగము నందు కర్మత్యాగము-కర్మయొక్క ఆంతరత్యాగము—గూడ నుండు నని తర్వాతి శ్లోకము మఱింత స్పష్టముచేయును -

**అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలం,**
**భవ త్యత్యాగినాం ప్రేత్య, నతు సంన్యాసినాం క్వచిత్. 12**

ఇష్టము, అనిష్టము, ఇష్టానిష్టము—అని కర్మఫలము త్రివిధము. అది ఫలమును త్యాగముచేయని కామదాసులకే దేహపాతానంతరము కలుగును గాని,త్యాగము చేసిన సన్యాసుల కెప్పటికిని కలుగదు.

విశేషార్థము : 'త్యాగముచేసిన సన్యాసులకు' — అని నపుడు, సన్యాసము త్యాగములో భాగ మనియే అర్థము, ఆంతర కర్మసన్యాసము ఫలత్యాగములో భాగ మనియే అర్థము. "అత్యాగులకు కర్మఫలము కలుగునుగాని, సన్యాసులకు గలుగదు"-

అని మూలమునకు శాబ్దికానువాదము. అనగా, త్యాగులు = సన్న్యాసులు - అనియే స్పష్టార్థము ఇట్లుండ, త్యాగులు = చిత్తశుద్ధికొఱకు ఫలమును త్యజించి కర్మ చేయు అజ్ఞులు, మఱియు, సన్న్యాసులు = పరమార్థ కర్మసన్న్యాసులగు జ్ఞానులు, కర్మను బాహ్యముగా త్యజించిన జ్ఞానులు - అని శ్రీ శంకరుడు వ్యాఖ్యానించును.

శ్రీ అరవిందు ననుసరించి, కర్మ యనునది దివ్య జీవనధర్మములో నొక భాగము, అది భగవతత్త్వముయొక్క సమున్నతగతివిద్య (dynamics). కావున సన్న్యాససారము, అనగా యథార్థ త్యాగము లేక సన్న్యాసము (6-2) స్థూలమగు ఒక బండ అకర్మనియమము గాదు; అదియొక సూక్ష్మ తత్త్వము - అదియొక నిఃస్వార్థ అంతరాత్మ, ఒక నిరహంకార మానసము, అహంకారమునుండి విముక్తము, నిర్వ్యక్తికము నగు ఆధ్యాత్మిక ప్రకృతిలోనికి ఒక సంక్రమణము (transition); అది ఆంతర కర్మసన్న్యాసముగాని, బాహ్య కర్మసన్న్యాసముగాదు, పృథగ్జీవనసన్న్యాసము గాని, యోగజీవన సన్న్యాసము గాదు, కామభోగసన్న్యాసము గాని, దివ్యభోగ సన్న్యాసము గాదు.

అవతారిక : ఇపు డిక కర్మస్వరూపము నెఱుంగుటకు కర్మావయవములు గణింపబడును -

పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణాం. 13

మహాబాహూ, అర్జునా! ఏ కర్మ యైనను జరుగుటకు అయిదు కారణములు గలవు. అవి కర్మస్వరూపమును దెలుపు సాంఖ్యశాస్త్రమున జెప్పబడినవి. ఇపుడు వానిని నావలన దెలిసికొనుము.

విశేషార్థము : సాంఖ్యము = వేదాంతము. కృతాంతము = కర్మాంతము. జ్ఞానమునందు కర్మ అంతమగును గాన, వేదాంతము కృతాంత - మని శ్రీ శంకరుడు. "సర్వకర్మయు జ్ఞానమునందు పరిసమాప్తి నొందును" (4-33) - అని ఆయన ఉదాహరణను జూపును గూడ

అయితే శ్రీ అరవిందు దేమిచెప్పును? నిజమే కర్మ జ్ఞానమునందు పరిసమాప్తి జెందును. కాని, కర్మ జ్ఞానములో అంతరించి, రూపుమాసిపోవు నని దాని అర్థము గాదు, కర్మ జ్ఞానరూపము ధరించు ననియే దాని అర్థ - మని శ్రీ అరవిందుడు. "బ్రహ్మయే పాత్రము, బ్రహ్మయే హవిష్యము, బ్రహ్మయే అగ్ని, ...."(4-24)- అని శ్రీ అరవిందుడు ఉదాహరించును.

అవతారిక : ఆ అయిదు కారణము లేవి యన –

**అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధం,**
**వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమం. 14**

1, అధిష్ఠానము, అనగా శరీరప్రాణ మనోరూపమగు అంతరాత్మయొక్క ఆధారము, 2. కర్తా, అనగా చేయువాడు, 3. కరణము, అనగా వివిధములగు శ్రోత్రాది ఇంద్రియములు, 4. చేష్టలు. అనగా కర్మశక్తిని సమకూర్చు వివిధ ప్రాణములు, 5. దైవము, అనగా ప్రకృతివెనకనుండి కర్మను నడుపుచు, కర్మఫల మును విధించు శక్తి లేక శక్తులు.

విశేషార్థము : దైవ మన చక్షురాదులకు అధిదేవతలగు ఆదిత్యాదు-లని శ్రీ శంకరుడు; వారు గాని, పరమేశ్వరుడు గాని-అని శ్రీ అరవిందుడు.

అవతారిక : చెడు కర్మలకు గూడ నవియే హేతువులు –

**శరీరవాఙ్మనోభి ర్యత్ కర్మ ప్రారభతే నరః,**
**న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. 15**

అది న్యాయ్యము గాని, అన్యాయ్యముగాని, శరీరప్రధాన, వాక్ప్రధాన, మనఃప్రధాన మగు ఏయే కర్మను మానవుడు చేయునో, దాని కెల్ల ఈ అయిదు మాత్రమే కారణములు.

విశేషార్థము : దైవము వెనుకనుండి కర్మను నడుపుచున్నది గదా, అయి నపుడు అన్యాయ్యమైన కర్మ ఎందుకు జరుగుచున్నది? దైవము అహంకారము ద్వారా కర్మను నడుపుచున్నది మఱియు అహంకారమును అమాంతముగా మార్చుటకు వీలులేదు గావున. కాని ఒకనాటి దుష్టుడు మఱియొక నాటి సాధువగుటను మనము తఱచుగా జూచుచునే యున్నాము.

'నరునికి' సంబంధించి ఈ కర్మ చెప్పబడినది, పశువు మాటేమిటి? శాస్త్రము నరునికే ఉద్దేశింపబడినది గాన, నరుని కర్మ - అని చెప్పబడినది గాని, నిజానిక పశువు కర్మకును ఈ అయిదే హేతువులు. అయినను పశువునందు కర్తృత్వభావ మంతగా వికసించలేదు గాన, ఈ శ్లోకార్థము ముఖ్యముగా నరునికే వర్తించును.

చివరకు, న్యాయాన్యాయాలకు అతీతమైన కర్మ మాటేమిటి ? న్యాయము యొక్క అర్థమును విశాలమొనరించి నపుడు, అది భగవద్ధర్మమునకు అనుగుణమగు న్యాయముగూడ నగును. అపుడు అతీతకర్మ సైతము న్యాయము క్రిందకే వచ్చును.

తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః,
పశ్య త్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః. 16

కర్మవిషయమున, ఈ అయిదును కర్మహేతువులై యుండగా, తన బుద్ధి ఇంకను శుద్ధరూపమున నిర్మింపబడి యుండకపోవుటచే ఎవడు తన (ఉపరితన సవ్యక్తిక) అహంకారాత్మనే-దానిని మాత్రమే-కర్తగా జూచుచున్నాడో, ఆ భ్రాంత బుద్ధి సత్యమును జూడని వాడే యగును.

విశేషార్థము : ఈ శ్లోకవ్యాఖ్యానమున శ్రీ అరవింద శంకరులు పూర్తిగా భేదింతురు, ఇచ్చట వారి మధ్య ధ్రువముల మధ్యగల అంతరము గన్పించును. ఈ శ్లోకమునందలి 'ఆత్మ'కు శ్రీ అరవిందుడు అహంకారపురుషు డని అర్థము చెప్పగా, శ్రీ శంకరుడు నిర్గుణాత్మ యని అర్థము చెప్పెను.

“అహంకారవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే” (3-27) – అహంకారముతో తాదాత్మ్యము జెందిన పురుషుడు, అనగా అహంకారము, నేను కర్తను, నేనే కర్తను-అని మోహవశమున దలంచును. ఈ మోహమునకు గారణము 'అకృత బుద్ధి' 18-16). కాని ఈ మోహము తొలగి, అహంకారము నశించి నప్పుడు, నిర్వ్యక్తికము, విశ్వవ్యాప్తము నగు మన సత్యాత్మ ముందుకు వచ్చును, విశ్వ పురుషునితో తనకు గల ఏకతాదర్శనమందు విశ్వప్రకృతి కర్మకర్త్రి యనియు, ఈ విశ్వప్రకృతిని నడుపునది భగవదిచ్ఛ యనియు నెఱుంగును. పోతే అహంకారము ఒక ప్రకృతినిర్మాణమే, మఱియు దాని యిచ్ఛ ప్రకృతి ఇచ్ఛయే. కనుక మన కంతవరకు పరిచితుడగు అహంకారపురుషుడు తా నొక్కడే-'కేవలం'-కర్తయని తలంచుచున్నను, అది సత్యము గాదు, భగవదిచ్ఛ ననుసరించి విశ్వప్రకృతి అహంకారదికముద్వారా కర్మ సేయును-అనునదియే సత్యము. ఈ జ్ఞాన మున్నప్పుడు కర్మ ఆత్మవిముక్తి కెట్టి క్షతిని గల్గించదు. ఒక్క మాటలో కేవలము అహంకారాత్మ మాత్రమే కర్త గాదు-ఇది శ్రీ అరవిందుని వ్యాఖ్యానము

పోతే, కేవలమైనట్టి, అనగా నిరుపాధికమైనట్టి, అనగా క్రియాకర్తృకారకాది రహితమైన ఆత్మ కర్త గాదు-అని శ్రీ శంకరుడు

ఆత్మ అకర్త యని శ్రీ అరవిందుడు గూడ పైన చెప్పనే చెప్పెను. అయితే భేద మెచ్చటనన, ఆత్మజ్ఞానము కలిగిన పిమ్మట పురుషునియందు కర్మ లాగిపోవును. ఏలన ఆత్మయందు క్రియాకర్తృభేద ముండదు – అని శ్రీ శంకరుడు. ఆత్మయందు

క్రియాకర్తృభేదము లేకపోయినను, ప్రకృతియందు ఆ భేదము గలదు. మఱియు ప్రకృతికిని, ఆత్మకును విరోధము లేదు ప్రకృతి క్రియకు ఆత్మ అచలాధారముగా నుండును. కనుక కర్మ ఆగిపోదు, అహంకారము లేకపోవుటచే మఱింత స్వచ్ఛము గాను, మఱింత ప్రబలముగాను జరుగును – అని శ్రీ అరవిందుడు మఱియు నప్పుడు జరుగు కర్మ కురుక్షేత్ర యుద్ధమువంటి ఘోరకర్మయు గావచ్చును. ఆ దృష్టితోనే గీత ఈ క్రింది శ్లోకమును జోడించుచున్నది –

యస్య నాఽహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే,
హత్వాఽపి స ఇమాన్ లోకా న్న హంతి న నిబధ్యతే. 17

ఎవనికి నేను చేయుచున్నాను – అను భావ ముండదో, ఎవని బుద్ధి దేనిని అంటుకొని యుండదో, అతడు ఈ లోకము లన్నింటిని చంపివేసినను, వానిని చంపినవాడును గాడు, ఆ కర్మచేత నిబద్ధుడును గాడు.

విశేషార్థము : విముక్త పురుషుడు చంపినను ఏల చంపినవాడు గాడు? అతడు వస్తుతః ఈశ్వరుడే అయ్యును, అభివ్యక్త ప్రకృతియందు అతడు ఈశ్వరుని యొక్క ఒక అంశముగా నుండును. అభివ్యక్తితత్త్వమే పరిమితీకరణము, ఆ పరిమితీకరణము లేనిచో, అభివ్యక్తియే లేదు కాగా అంశరూపమగు నీ విముక్త జీవుడు (15-7) ఈశ్వరునికి ఒక ప్రకాశమయ సజీవ ఉపకరణముగా వ్యవహరించును (11-33) భగవదిచ్ఛయే అతనిద్వారా తన పని జేసికొనును. కావున నిజానికి చంపునది ఈశ్వరేచ్ఛ గాని, ముక్తపురుషుడు గాడు. ఇట్లు అతడు చంపియు చంపనివాడే, కావుననే ఆ కర్మ అతనిని బంధించదు – తాను చేయని కర్మ తనను బంధించదు గదా.

ఇంతకంటెను ఉత్కృష్టతర లర్థమేమన, ఆత్మ ప్రకృతులు రెండును ఈశ్వరునియొక్క రెండు పార్శ్వములు. కాగా, ఈశ్వరుడు తన ప్రకృతిద్వారా చేయుచునే, తన నిష్క్రియ ఆత్మద్వారా చేయనివా డగును అతనివట్ల రెండును సత్యమే మఱియు నతడు అభివ్యక్తికి మూలద్వంద్వమగు ఆత్మ ప్రకృతులు రెంటికి అతీతుడు గాన, తాను ప్రకృతిరూపమునచేయు కర్మచేత సైతము బద్ధుడుగాడు. ఇక సంపూర్ణ సంసిద్ధియందు జీవుడు భగవంతుని సత్తతోనే కాక, భగవంతుని ప్రకృతితోను ఏకమగును గాన (15-19), అతడును భగవంతునివలె చేసియు చేయనివా డగును; ఇపు డతడు ఉపకరణము మాత్రమే గాడు, భగవంతునితో

సర్వథా 'సాధర్మ్యమును' (14-2) సైతము అనుభవించువా డగును. అందుచేత భగవంతుని 'కర్తారం అకర్తారం' (4-13) అతని పట్లను ఇప్పుడు నిజముగా సత్యము. ఇదియే గీతాయోగముయొక్క మహావైభవము.

గీత సాధించిన ఈ దివ్య సమన్వయముపై మనకు పట్టుచిక్కక పోయినచో గీతయొక్క హృదయమే మనకు అవగతము కాలేదని అర్థము.

అయినను, శ్రీ శంకరు దేమి చెప్పును ? ముక్తపురుషుడు చేసియు చేయని వాడు-అను వాక్యము అతని స్తుతినిమిత్తము చెప్పబడినది. నిజానికి ముక్తపురుషుడు కర్మచేయనే చేయడు, చేయలేడు. ఏలన అత డిపుడు ఆత్మతో తాదాత్మ్యము చెందియున్నాడు మఱియు నాత్మ అవికార్యము (2-25), శరీరస్థమై యున్నను, అది చేయదు (13-31). పోతే చేయునది గుణములే (2-27).

ఇది సిద్ధాంతము కాదు, తర్కము కాదు; తర్కాభాసము మాత్రమే. ఏలన ఆత్మతో తాదాత్మ్యము చెందిన జీవుడు కేవలమాత్మయే ఏల కావలెను ? ఆత్మతో తాదాత్మ్యము జెందిన జీవుడు ఆత్మకంటెను అతీతసమగ్రమగు పురుషోత్తమునితో ఏకత నందవచ్చును గదా. అట్లు జరిగి నపుడు, పురుషోత్తముని ధర్మము గూడ అతని ధర్మమగును గదా.

శ్రీ శంకరుని వాదములో మఱియొక ప్రధానలోప మేమన, ఆయన మతము అద్వైతము పేర బరగుచున్నను, నిజాని కది ద్వైతమే. ఏలన దానియందు ఆత్మ వేఱు, ప్రకృతి వేఱు. అందుచేతనే చేయునది గుణములు గాని, ఆత్మ గాదని ఆయన వాదించును. గీతయు దీనిని చెప్పును గాని, మఱల ప్రకృతియు ఆత్మ ప్రకృతియే యని నుడువును-"యేన సర్వ మిదం తతం" (2-17), "మ మాత్మా భూతభావనః" (9-5). ఇట్లు శంకరాద్వైతములోని ద్వైతము గీతలో లేదు.

అవతారిక : కర్మచేయుటయే ముఖ్యము గాదు; ఏ జ్ఞానమున కర్మ చేతుమో, అది ఆధ్యాత్మికముగా ముఖ్యమని పై చర్చను బట్టి స్పష్టమే. కనుక నిపుడు కర్మకు సంబంధించిన జ్ఞానాదులను జెప్పును -

**జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,**
**కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః.** 18

జ్ఞానము, జ్ఞానవిషయమగు జ్ఞేయము, మఱియు జ్ఞానముచేత నా విషయమును దెలిసికొను జ్ఞాత-ఈ ముగ్గురు కర్మచేయుటకు ప్రేరణను గల్పింతురు. పోతే కరణము, 'కర్మ' మఱియు కర్త-ఈ ముగ్గురును ఆ కర్మ నిర్వహింతురు.

విశేషార్థము : కరణము, 'కర్మ', కర్త-ఈ త్రయములోని కర్మకు సాంకేతికార్థము గలదు : కర్తయొక్క క్రియచేత వ్యాప్యమానమగునది కర్మ. ఉదాహరణకు, బాలుడు రాతిని తన్నెను : ఇచ్చట రాయి-అనునది కర్మ, ఏలన అది తన్నుట-అను క్రియచేత వ్యాప్తమైనది. జ్ఞానవిషయమును జ్ఞేయ మందుము గదా, అటులే క్రియావిషయమును, మఱియొక పదము లేనందుచేత కర్మ యందుము.

జ్ఞానం = కర్మసంకల్పములోని జ్ఞానము — అని శ్రీ అరవిందుడు.

అవతారిక : ఇపుడు గుణములను బట్టి జ్ఞానాదుల త్రివిధభేదమును జెప్పను- జ్ఞానాదులయొక్క ఉత్తమరూపమున కర్మ చేయుట కిది తోడ్పడును —

**జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః,**
**ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి. 19**

గుణములను గూర్చి విచారణ చేయు సాంఖ్యశాస్త్రమున జ్ఞానము, కర్మ మఱియు కర్త-ఈ మూడును సత్త్వ రజస్తమోగుణములను బట్టి మూడు విధములుగా మాత్రమే చెప్పబడినవి. ఇపుడు, అర్జునా, యథారీతిగ వానిని దెలిసికొనుము.

అవతారిక : వీనిలో ముందిపుడు జ్ఞానభేదములు —

**సర్వభూతేషు యే నైకం భావ మవ్యయ మీక్షతే,**
**అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికం. 20**

అనేకములగు సర్వభూతములందును ఏకము మఱియు అవ్యయము, అటులే విభక్తవస్తువులందు అవిభక్తము నగు ఆత్మవస్తువును ఏ జ్ఞానముచేత మానవుడు చూచునో, అర్జునా, అది సాత్త్విక జ్ఞాన మని యెఱుగుము.

విశేషార్థము : సాత్త్విక జ్ఞానము అనేక రూపములందు ఏకాత్మను జూచును : ఇది సమ్యగ్ జ్ఞాన-మని శ్రీ శంకరుడు.

పోతే, ఇదియే సమ్యగ్ జ్ఞానము కా-దని శ్రీ అరవిందుడు. ఇందు ఆత్మవిముక్తియే గలదుగాని, ఇంకను ప్రకృతి సంసిద్ధిలేదు. ఈ సాత్త్విక జ్ఞానముయొక్క శిఖరమునందు, దీని చూపు ప్రపంచమునందు గల ఏకమాత్ర పురుషుని (7-19) జ్ఞానమగును, సమస్త కర్మల ఏకమాత్ర నియామకుని (master) (13 28) జ్ఞానమగును, భగవత్తత్త్వముయొక్క వ్యంజకములగు విశ్వశక్తుల జ్ఞానమగును, మఱియు మానవునియందు భగవదిచ్ఛయొక్క క్రియారూపమగు కర్మయొక్కయే జ్ఞానమగును. ఇదిగో, ఇది సమ్యగ్ జ్ఞానము, అనగా సంపూర్ణ భగవంతునియొక్క జ్ఞానము.

మఱియు శ్రీ శంకరుని మతమునగల సమ్యగ్ జ్ఞానము సైతము ప్రపంచముతో నెట్టి సంబంధము లేనిది కాదు. ఏలన, అది ప్రపంచముయొక్క విభక్తవస్తువుల యందలి అవిభక్త ఆత్మజ్ఞానము (6-29). అయినపుడు ఆత్మజ్ఞానమున ప్రపంచము కలవలె కరగిపోవు నని ఆయన తఱచుగా చెప్పుట ఎట్లు సమంజస మగును? శ్రీ అరవిందు ననుసరించి, సృష్టియందలి ప్రథమ అభివ్యక్తియే ఆత్మ. ఆ ఆత్మ నుంచియే సర్వము "సర్వ మాత్మై వాభూత్" (ఈశ. ఉ.).

ఇంతకు, ఇచ్చట చెప్పబడిన 'సాత్త్వికజ్ఞానము' సత్త్వగుణమునందలి(14-6) జ్ఞానమా? లేక సర్వగుణాతీత జ్ఞానమా? వాచ్యార్థముచేత మొదటిది, లక్షణార్థము చేత రెండవది. సాత్త్విక జ్ఞానము తన పరాకాష్ఠను జేరుకొని నపుడు, తననుదా నతిక్రమించి, గుణాతీత జ్ఞానములో పర్యవసించును; ఇదియే నిజానికి సమ్యగ్ జ్ఞానము.

**పృథక్త్వేనతు యజ్ జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్,**
**వేత్తి సర్వేషు భూతేషు, తజ్ జ్ఞానం విద్ధి రాజసం. 21**

సర్వభూతములయందును వేఱువేఱు లక్షణములతో నుండు వివిధ భావములను (సత్తలను) (తమకు లోపలగల ఏకతయందు గాక) తమ అనేకతయందు మాత్రమే ఏ జ్ఞానము చూచునో, అది రాజస జ్ఞానము.

విశేషార్థము : రాజస జ్ఞానము (అనగా రాజస జ్ఞాని) యథార్థమగు ఏకతా సూత్రమును కనుగొన జాలదు, అందుచేత తన సంకల్పమును, కర్మను సమన్వయించ జాలదు. అట్టి తఱి అది తన అహంకార కామముల ప్రవృత్తినే అనుసరించును, చాపల్యముతో నటు నిటు పరుగులు పెట్టును (2-41) — అని శ్రీ అరవిందుడు.

**యత్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యే సక్త మహైతుకం,**
**అతత్త్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతం. 22**

పోతే, ఏది యథార్థ కార్యకారణములను పరికించదో, ఏది అదియే సర్వమైనట్లు ఒకే స్వల్పకార్యమునందు గాఢముగా సక్తమై యుండునో, మఱియు నేది తాను చేయు పనిని గుఱించి తానే ఎఱుగదో, అది తామస జ్ఞాన మనబడును.

విశేషార్థము : "అతత్త్వార్థవత్" = దేనిని తెలిసికొన వలయునో, దాని తత్త్వదృష్టి లేనిది — అని శ్రీ శంకరుడు, దేనిని చేయుచున్నదో దాని తత్త్వార్థమునే,

సంగతినే ఎఱుగనిది – అని శ్రీ అరవిందుడు. శ్రీ అరవిందుని అర్థమే తామస జ్ఞానముయొక్క స్వభావమునకు ఎక్కువ అనుగుణ మనిపించును.

అవతారిక : ఇప్పు డిక సాత్త్వికాది త్రివిధ కర్మ వర్ణించబడును –

నియతం సంగరహిత మరాగద్వేషతః కృతం,
అఫలప్రేప్సునా కర్మ య త్తత్ సాత్త్విక ముచ్యతే. 23

ఏది కర్తవ్యకర్మయో, దేనియందు కర్తకు సంగ ముండదో, ఏది రాగ ద్వేషములు లేక చేయబడునో, ఏది ఫల మాసించని కర్తచేత చేయబడునో, అది సాత్త్విక కర్మ యని చెప్పబడును.

విశేషార్థము : నియత కర్మ = నిత్యకర్మ. పంచమహాయజ్ఞాదికము – అని శ్రీ శంకరుడు, అది ఉచితము లేక విహితము అను నిర్వ్యక్తిక (impersonal) బుద్ధిచేత గాని, ఒక ఆదర్శముయొక్క ఆదేశము ననుసరించి గాని ఏది కర్తవ్య కర్మగా చేయబడునో, అది నియత కర్మ-యని శ్రీ అరవిందుడు. ఒక మహాపురుషుడు తన దేశమునకు ప్రాణము లర్పించి నపుడు, దానిని శ్రీ శంకరుడు చెప్పు నిత్యకర్మ యన జాలము, దానిని శ్రీ అరవిందుడు చెప్పు నియతకర్మయే యన వలెను.

ఈ నియత కర్మయే సర్వోత్తమ కర్మయా? కాదు, ఇది ఇంకను మానవుని బుద్ధిచేత చోదితమే. ఏది మనలోని ఈశ్వరచోదితమో, అదిగో, అది సర్వోత్తమ కర్మ. అనగా సాత్త్వికేచ్ఛ తననుదా నతిక్రమించి, ఈశ్వరేచ్ఛతో నేకమై నపుడు వెలువడు కర్మ సర్వోత్తమ కర్మ, దివ్య కర్మ.

"యదా వై సుఖం లభతేఽథ కరోతి, నాసుఖం లబ్ధ్వా కరోతి" (ఛాం ఉ.)- సుఖము లభించుచున్నపుడే చేయును గాని, అది లభించనపుడు ఎవడును చేయడు- అని సూత్రీకరించబడినది గదా, అయినపుడు ఫలము నాసించక ఈ నియత కర్మ నెట్లు చేయును? ఎట్లన, అది స్వభావనియతము, లేక ఆదర్శనియతము,లేక ఈశ్వర నియతమగు కర్మ. దానిని చేసినపుడు, కాదు, చేయుచున్నపుడు సాత్త్వికి బుద్ధికి ఎంతో తుష్టి, పుష్టి గలుగును. దానిని చేయ నపుడు అతని కెంతయో అశాంతి కూడ కలుగును. ఆ తుష్టిపుష్టులే ఇచట అతనికి లభించు సుఖము-సుఖమువంటి సుఖము లేక మనకు దెలిసిన సుఖమును మించిన సుఖము

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణవా పునః,
క్రియతే బహుళాయాసం త ద్రాజస ముదాహృతం. 24

పోతే ఏ కర్మ కామాధీనునిచేత గాని, చేయుచున్నది నేనే-అను అహంకారయుక్తునిచేత గాని ఒడలు విఱుచుకొనుచు, బహుళాయాసముతో చేయబడునో, అది రాజస కర్మ యని చాటబడును.

విశేషార్థము : సాత్త్విక మానవునియందును, అంతకంటెను ఎక్కువగా దివ్యమానవుని యందును భగవచ్ఛక్తి పనిచేయును, అదియే అధికాధికముగా కర్మను నిర్వహించును. పోతే, అహంకారముచేత భగవంతునినుండి వేఱుచేయబడిన రాజస మానవుని కా శక్తి లభించదు. అందుచేతనే అతనికి కర్మయందు బహుళాయాసము. మఱియు నతడు సాయంకాలానికే ఫలము లభించవలెను - అని శివమెత్తినట్లు వేగిరపడును, అదియు నతని అధికాయాసమునకు కారణమే.

అనుబంధం క్షయం హింసా మనపేక్ష్యచ పౌరుషం,
మోహా దారభ్యతే కర్మ యత్త త్తామస ముచ్యతే. 25

కర్మపరిణామమును, కర్మవలన గలుగు క్షయమును, హింసను, మఱియు కర్మను జేయుటకు దనకు గల సామర్థ్యమును గుఱించి చింతింపకయే, మోహముచేత ఏ కర్మ చేయబడునో, అది తామసము.

విశేషార్థము : తా నేమి చేయుచున్నాడో, తనకే తెలియనివాడు 'అతత్త్వార్థ విదుడు' – అని (18-22) క్రింద శ్రీ అరవిందుడు చేసిన వ్యాఖ్యానము నిది ధ్రువపఱచును. ఇక తెలియక ఎవడేని ఎట్లు చేయు ననిన, తన సహజ ప్రవృత్తులకును, ఆవేగములకును, అదర్శ భావములకును అతని యాంత్రిక విధేయతయే అతనిచేత ఆ పనులను జేయించును - అని శ్రీ అరవిందుడు.

అవతారిక : ఇపు డిక జ్ఞాన, కర్మ, కర్తలలో చివరిదియగు కర్తయొక్క భేదము చెప్పబడును –

ముక్తసంగోఽనహం వాదీ ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. 26

ఎవనికి కర్మయందు సంగ ముండదో, నేను కర్త-నను అహంకార ముండదో, ఎవడు దృఢనిశ్చయము మఱియు నిర్మలోత్సాహముతో గూడి యుండునో, ఎవడు

విజయమునందు పొంగును, అపజయమునందు క్రుంగును లేక, నిర్వికారముగా నుండునో, అతనిని సాత్త్విక కర్త యందురు.

విశేషార్థము: ఇతనికి కర్మయందు సంగ ముండ దనిన, ఇతడు రాజసకర్త వలె తన కర్మయందు మునిగిపోయి, క్లేశాయాసములను బొందడు, మఱియు నితనియందు 'నేను' ప్రముఖపాత్ర వహించదు. కావుననే ఇతడు నిర్వికారుడు. ఫలాపేక్ష లేకపోవుటచేతనే కాదు, సంగాఽహంకారములు లేకపోవుటయు ఇతని నిర్వికారతకు కారణము.

శ్రీ అరవిందు లొక్కడు మాత్రమే ప్రతి విషయమునందును దాని గుణాతీత రూపమును వర్ణించును. కర్త విషయమునను ఆయన దానిని మఱచిపోడు. గీత గుణాతీతతను (2-45), (14-19) ప్రస్తావించునే కాని, వర్ణించదు, ఆ విషయమును మునకే వదలివేయును.

సత్త్వగుణముయొక్క పరాకాష్ఠయందును, దాని కావలను సాత్త్విక కర్త యొక్క ధృతి (దృఢనిశ్చయము) మఱియు నుత్సాహము ఆధ్యాత్మిక 'తపస్సు' యొక్క - కార్యోన్ముఖ, దివ్య చిచ్ఛక్తియొక్క - స్వాభావిక వ్యాపార మగును; మఱియు తుట్టతుదకు ఒక పరమ ఆత్మబలముయొక్క వ్యాపార మగును, ప్రత్యక్ష భగవచ్ఛక్తియొక్క వ్యాపార మగును, మానవోపకరణమునందు భగవదూర్జము యొక్క ప్రబల,సుస్థిర ప్రవృత్తి యగును, దక్షసంకల్పము మఱియు దివ్యవిజ్ఞానము యొక్క స్వయంనిర్ణీత పదము లగును మఱియు దానితోబాటు విముక్త ప్రకృతియొక్క కర్మల యందు విముక్తాత్మయొక్క సువిశాల ఆనంద మగును - సాత్త్విక గుణము యొక్క ధృత్యుత్సాహములు తుట్టతుదకు గుణాతీతతయొక్క సువిశాల కర్మానంద మగును.

రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. 27

లోకే, ఎవడు కర్మయందు తీవ్రముగా నాసక్తుడై యుండునో, ఎవని దృష్టి కర్మఫలమునందే యుండునో, ఎవడు హృదయమునందు లోభియు, మనస్సునందు అశుచియు నగునో, ఎవడు తన కార్యసాధనయందు దారుణహింసకు సైతము వెనుదీయడో, జయమునం దెవడు హర్షమును, అపజయమునందు శోకమును అనుభవించునో, అతడు రాజస కర్త యని పిలువబడును.

విశేషార్థము : ఫల మపేక్షించని వానికి కర్మయందు ఉత్సాహ ముండ దనుకొందుము, కాని అది సరికాదు. ఏలన అతని కే అపజయము కూడ క్రుంగ దీయ లేని ధృత్యుత్సాహము లుండును(18-26). అతని శక్తికి మూలము గుణాతీత మగు 'తపస్సు', చిచ్ఛక్తి, భగవదిచ్ఛ. పోతే ఫల మపేక్షించి, కర్మచేయు రాజస కర్తయొక్క శక్తికి మూలము కామము. ఇక అపజయమునందు ఆ కామము ఆఘాతము నందును గాన, అతని శక్తియు దిగజాఱును.

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికో ఽలసః,
విషాదీ దీర్ఘ సూత్రీచ కర్తా తామస ఉచ్యతే. 28

హృదయ మర్పించి కర్మ సేయని వాడును, నలుగురియొక్క అతిప్రాకృత భావము ననుసరించువాడును, తన మూర్ఖతనుండి కదలనివాడును, మోసగాడును, పెద్దల నవమానించువాడును, అలసత్వము గలవాడును, అంతలోనే దిగజాఱిపోవు వాడును, ఒక రోజులో చేయవలసినది ఎన్నో రోజులు చేయువాడును తామస కర్త యనబడును.

విశేషార్థము : తామస కర్త యనగా తమోగుణము మాత్రమే కలవా డని కాదు. ఏలన అది కేవల తమోగుణమే యగుచో, అత డసలు కర్తయే కాజాలడు. అతడు కర్త యనుట అతనిలో తమూఽధీనమై యున్న రజస్సును సూచించును, అటులే అతడు శఠు డనుట సత్త్వగుణప్రవేశమును తెలుపును.

అయుక్తుడు = అసమాహిత చిత్తుడు—అని శ్రీ శంకరుడు, తాను స్వయముగా ఆలోచించి చేయక, యాంత్రికముగా నలిగిన దారిన నడచువా-డని శ్రీ అరవిందుడు.

అవతారిక : ఇపుడు మఱి రెండు మనఃశక్తుల భేదములను తెలుపును —

బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు,
ప్రోచ్యమాన మశేషేణ పృథ క్త్వేన ధనంజయ. 29

బుద్ధి మఱియు ధృతి - ఇవియు, నర్జునా, గుణములను బట్టి త్రివిధము. వాని భేదముల నిపుడు వేఱువేఱుగను, అశేషముగను జెప్పెదను, వినుము.

విశేషార్థము : బుద్ధిని, ధృతిని జత చేసి ఎందుకు చెప్పుచున్నది, గీత? బుద్ధి ఏ శక్తియొక్క అవగాహన (understanding) సామర్థ్యము, ధృతి అదే శక్తియొక్క సంకల్ప సామర్థ్యము—రెండును ఒకే శక్తియొక్క రెండు పార్శ్వములు.

దేనిని బుద్ధి ఉచితమని చూచునో, దానిని ధృతి (సంకల్పము) పట్టువిడువక అనుష్ఠించును. ధృతి యన ధారణశక్తి, అనగా కర్మను ధరించి, దానికి స్థిరతను గల్పించు దృఢసంకల్పమే ధృతి. పోతే, కామాధీనమై పనిచేయు నపుడు, బుద్ధికి దృఢత యుండదు, అది బహు శాఖలుగా చీలిపోవును (2-41), అట్టి బుద్ధియొక్క కర్మ నిర్వాహక సంకల్పమునకు బల ముండదు, కనుక ఒకే కార్యమునందు నిష్ఠ కలిగి యుండక విక్షిప్త మగుచుండును - బుద్ధికిని, ధృతికిని గల ఈ ఘనిష్ఠసంబంధమును శ్రీ అరవిందు డొక్కడే వివరించును

అవతారిక : ఇపుడు త్రివిధ బుద్ధి వర్ణింపబడును --

ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే,
బంధం మోక్షంచ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ.30

ఏ బుద్ధి కర్మయందు ప్రవృత్తి నియమమును, కర్మనుండి నివృత్తినియమము, నెఱుంగునో, అటులే కార్యాకార్యములను, భయాభయములను, బంధమోక్షముల నే బుద్ధి ఎఱుంగునో, అది సాత్త్వికబుద్ధి యనబడును.

విశేషార్థము : దేనినుంచి భయపడవలెనో, అది భయము, ఉదాహరణకు, అకార్యము భయము, అటులే ద్వేషము భయము. ఏలన ద్వేషమున హృదయము ముడుచుకొనిపోయి, బద్ధమగును. అటులే ప్రేమ అభయ మగును.

ప్రవృత్తి = బంధకారణమగు కర్మమార్గము; నివృత్తి = మోక్షకారణమగు సన్న్యాసమార్గము—అని శ్రీ శంకరుడు. ప్రవృత్తినివృత్తులు అదే శ్లోకమున గల బంధమోక్షములతోబాటు చెప్పబడినవి గాన, మఱియు కర్మచేత బంధమును, సంన్యాసము చేత మోక్షమును గలుగును గాన, ప్రవృత్తినివృత్తులకు కర్మమార్గ, సంన్యాస మార్గము లనియే అర్థ మని ఆయన వ్యాఖ్య.

పోతే, ప్రవృత్తి = మన కర్మను నిర్ణయించు నియమము, నివృత్తి = మనము చేయగూడని కర్మను నిర్ణయించు నియమము—అని శ్రీ అరవిందుడు. కర్మచేతనే జనకాదులు సంసిద్ధిని బొంది నపుడు (3-20), కర్మ బంధకము, సర్వ కర్మయు నంతే-యని శ్రీ శంకరు డెట్లు చెప్పవచ్చును ?

తర్వాత, బుద్ధి తెలిసికొనునా ? లేక బుద్ధి చేత పురుషుడు తెలిసికొనునా ? రెండవదియే సత్యమైనప్పటికి, పురుషునితో ఇంద్రియాదులకు లేని సాన్నిహిత్యము సాత్త్వికబుద్ధికి గలదు గాన, బుద్ధియే తెలిసికొనును—అని చెప్పబడినది.

చివరకు, ఈ సాత్త్విక బుద్ధి తనను దా నతిక్రమించి, సాత్త్విక ప్రకాశము నందుగాక, దివ్యదీప్తియందు నెలకొని నపుడు, ఇక దాని కే నియమములు, ధర్మములు నుండవు. అపుడది విముక్త పురుషునియొక్క అమరమగు సత్యము నందును, ఋతము (right) నందును నివసించును. అపుడు కర్మ ఒక నియమము ననుసరించి కాక, దివ్యదీప్తిచేత సహజముగా నిర్ణయించబడును. ఈ సూటి నిర్ణయశక్తినే ఋత మందురు.

యయా ధర్మ మధర్మంచ కార్యం చాకార్య మేవచ,
అయథావత్ ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ. 31

దేనిచేత, అర్జునా, ధర్మమును మఱియు నధర్మమును, అటులే కార్యమును మఱియు అకార్యమును మానవుడు ఉన్నది ఉన్నట్లు కాక, వక్రముగా నెఱుంగునో, అది రాజస బుద్ధి యన బడును.

విశేషార్థము : సాత్త్విక బుద్ధి ధర్మాధర్మములను యథావత్తుగను, రాజస బుద్ధి అయథావత్తుగను, తామస బుద్ధి విపరీతముగను గ్రహించును.

రాజస బుద్ధి కావలె నని, కోరి, తప్పును ఒప్పుగా స్వీకరించ నపుడు, ఆది తప్పు ఒప్పులను వివేచించగలదు. అయినను అది వానిని అయథావత్తుగా మాత్రమే తెలిసికొనగలదు, అనగా వానిని వివేచించి, వేఱుచేసి నప్పటికి, వాని మానములను (measures), మూల్యములను వికృతపఱచి మాత్రమే తెలిసికొనును. కారణము, రాజస బుద్ధియొక్క హేతువు అహంకారముయొక్క హేతువు మఱియు దానియొక్క సంకల్పము కామముయొక్క సంకల్పము, మఱియు నీ హేతుసంకల్పములు సత్య ధర్మములను తప్పుగా చిత్రించి, వికృతపఱచును — అని శ్రీ అరవిందుడు

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా,
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ. 32

పోతే, తమస్సుచేత నావరింపబడియుండుటచేత ఏ బుద్ధి అధర్మమును ధర్మమనియు, నటులే సర్వవస్తువులను తద్విపరీతముగాను దలంచునో, అది పార్థ, తామస బుద్ధి యగును.

విశేషార్థము : రాజస బుద్ధి మంచిని మంచిగనే ఎఱుంగును గాని, దాని నిజస్వరూపమున నెఱుంగదు. పోతే, తామస బుద్ధి మంచిని కేవలము చెడు అని తలంచును.

సాత్త్విక బుద్ధి ఎఱుంగును, రాజసబుద్ధిచేత తెలిసికొనును, తామస బుద్ధి తలంచును–ఈ మూడు వాక్యములందలి విభక్తి ప్రత్యయములను, క్రియాపదములను గమనించదగును.

అవతారిక : ఇపు డిక బుద్ధి వృత్తియగు ధృతి వివేచింపబడును –

ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియ క్రియాః,
యోగే నావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్త్వికీ. 33

యోగబలముచేత (8-10) గమ్యమార్గము తప్పని ఏ ధృతిచేత మానవుడు తన మనఃప్రాణేంద్రియ క్రియలను ధరించి, నిలుపునో, అది, పార్థ, సాత్త్విక ధృతి యగును.

విశేషార్థము : యోగము = సమాధి – అని శ్రీ శంకరుడు. సమాధిచేత అనుగతమగుటవలన ధృతి చలించక మనఃప్రాణేంద్రియ క్రియలను ధరించి సాగించు–నని ఆయన వ్యాఖ్యానము. కాని, అది సమాధియే యగుచో, అచ్చట మనః ప్రాణేంద్రియక్రియలు ఉండనే ఉండవు. ఒకవేళ ఉన్న, ధృతి వానిని అరికట్టుటకే ప్రయత్నించును గాని, నిలుపుటకు గాదు. కాన సాధారణార్థమున సమాధి యను అర్థ మిచ్చుట యోగమునకు పొసగదు.

పోతే, యోగము = భగవంతునితో యోగము–అని శ్రీ అరవిందుడు. మఱియు, ధృతి = సంకల్పస్థైర్యము. సాత్త్విక ధృతి భగవంతునితో యోగమునం దుండును, మఱియు నట్టి యోగముచేత ప్రాప్తించిన బలముచేత ఆ ధృతి మనఃప్రాణేంద్రియ క్రియలను దారి తప్పని యటుల నియమించుటయే కాక, తమ కార్యము సాధించుటకు వానికి వలయు ఉత్సాహమును గూడ నిచ్చును. ఇంద్రియముల నియమించుటకును (2.61), దివ్య కర్మను నిర్వర్తించుటకును (11-47) యోగము అవశ్యకమని గీతయే చెప్పును. దీనిని బట్టి యోగ మన భగవంతునితో సంపర్కమే గాని, సమాధి కాదని తెలియును. మఱియు, కేవల మొక్క చోట తప్ప (6-17) తక్కిన తావులం దెల్ల గీత ఈ విశాలార్థముననే యోగశబ్దమును ప్రయోగించును, ఉదాహరణకు "యోగస్థః కురు కర్మాణి" (2-48) – అని శ్రీ అరవిందుడు పనిగట్టుకొని, చెప్పును.

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి స్సా పార్థ రాజసీ. 34

కాని, పార్థ, ఫలమును గాంక్షించు మానవుడు, ఆ ఫలమునందు మిక్కిలి సక్తుడై, అట్టి సంగబలముతో గూడిన ఏ ధృతిచేత (మోక్షము వినా) ధర్మము, అర్థము మఱియు కామముల వ్యాపారమును ధరించి, నిర్వర్తించునో, అది రాజస ధృతి యగును.

విశేషార్థము : సాత్త్వికధృతికి గల బలము భగవంతుని సంకల్పముయొక్క ప్రత్యక్ష, కనీసము పరోక్ష బలము. పోతే,రాజస ధృతికిగల బలము రాజస పురుషుని కామరూప సంకల్పమునకు గల బలము. ఈ బలము సంగజనితము, ఈ ధృతి సంగబద్ధము.

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవచ,
న విముంచతి దుర్మేధా ధృతి స్సా పార్థ తామసీ. 35

చివరకు, ఏ ధృతిచేత మనుజుడు నిద్రను, భయమును, శోకమును, ఖేదమును, మత్తతను విడువక యుండునో, ఆ మనుజుడు కుత్సితమతి మఱియు నా ధృతి తామస ధృతి.

విశేషార్థము : మద్యము, మున్నగు వస్తువులను సేవించు నపుడు, మత్తత జనించును, ఆ మత్తత అతని బుద్ధిని హరించి,అతనిని దుర్మేధుని జేయును. అప్పుడా మత్తతయందు అతడా మధుసేవనమును ఇంకను, ఇంకను కొనసాగించునే కాని, విడువడు. ఇట్లు తామస ధృతికి గల బలము అట్టి మత్తతయే.

అవతారిక : గుణభేదముచేత క్రియలు మఱియు కారణములయొక్క త్రివిధ భేదమును జెప్పి, ఇపుడు వాని ఫలమగు సుఖముయొక్క త్రివిధభేదమును జెప్పును—

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ,
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతంచ నిగచ్ఛతి. 36

అభ్యాసబలమువలన చేనియందు మానవుడు రమించుచు, దుఃఖనివృత్తిని పొందునో, అట్టి సుఖముయొక్క త్రివిధ భేదముల నిపుడు, అర్జునా, వివరించెదను, వినుము.

విశేషార్థము : మానవప్రకృతియొక్క సర్వసామాన్యమగు ఏకైక ధ్యేయము సుఖము; ప్రత్యక్షముగా గాని, పరోక్షముగా గాని మానవు డన్వేషించున దది యొక్కటియే. అయితే అతడు బాధ నెందుల కనుభవించును? ఒకొకప్పుడు అది విశ్వప్రకృతియొక్క అపరిహార్య ఘటన యగును; అపుడు దానిని అనుభవించక తప్పక, మానవు డనుభవించును. పోతే, ఒకొకప్పుడు తన లక్ష్యమగు సుఖమునకు ఒక సాధనముగా గూడ మానవుడు దుఃఖమును వరించును. చివరకు, ఎవ డేని బాధకొఱకే బాధ ననుభవించువా డుండిన, అది అతని చిత్తవికృతియే (insanity) యగును.

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమం,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధి ప్రసాదజం. 37

ఏది మున్ముందు విషమువలెను, తుట్టతుదకు పరిపాకమున అమృతమువలెను ఉండునో, అది సాత్త్విక సుఖము, మఱియు నది బుద్ధి నిర్మల మైనపుడు దాని యందు స్ఫురించును.

విశేషార్థము : సుఖము ముందుమాత్రము విషమువలె నెటులుండును? సుఖము విషమువలె నుండు ననుట కర్థ మేమన, 1. ఈ సాత్త్వికసుఖము బాహ్య వస్తువులపై నాధారపడదు. మన ప్రకృతియందు నేది అంతరతమమో, దానియొక్క—బుద్ధియొక్క—ప్రఫుల్లనముపై నది ఆధారపడును. ఈ ప్రఫుల్లనము నిమిత్తము మన ప్రకృతిసాగరమును మనము మథించవలసియుండును. ఈ మథనమునందు సంఘర్షము, దుఃఖము ముందు వెలువడును. కాగా సుఖప్రాప్తి ఈ దుఃఖసంఘర్ష పూర్వకము గాన, ఈ సుఖము మున్ముందు విషమువలె నుండు నని చెప్పబడినది. 2. ప్రకృతి బాహ్యమునందు గూడ రూపాంతరము జెందక పూర్వము, లోపల ఈ సుఖము ననుభవించుచున్న సమయమునసే, బాహ్యప్రకృతి నడచిపెట్టవలసియుండును. ఇదిగో, ఈ అడచివేతయు విషమువలె మనలను బాధించి, కొంచెముసేపటిలోనే లోనిసుఖమును మఱుగుపఱచును. కావునను ఈ సుఖము ముందు విషమువలె నుండు నని వచింపబడినది—అని శ్రీ అరవిందుడు.

సర్వసుఖము త్యాజ్యము కాదు, పరిణామమునందు విషరూపము ధరించు రాజస సుఖము,మఱియు అజ్ఞానమునందు జనించి, మోహమును గల్గించు తామస సుఖము మాత్రమే త్యాజ్యములు. పోతే నిర్మల బుద్ధియందు స్వయముగా నుబుకుచుండు

సాత్త్వికసుఖము త్యాజ్యము కాదు, అంతరాత్మ తన హక్కుగా కోరున దీ సుఖమునే. ఈ సుఖమే జీవనసారము. అనగా, ఈ సుఖము లేనిదే జీవనమేలేదు మఱియు నీ సుఖముకొఱకే, కాదు, ఈ సుఖముచేతనే జీవనము. గీతాయోగమునందు నిష్క్రియ ఆత్మసుఖము మాత్రమే కాక, సక్రియ జీవనసుఖమును గలదు (11-33) మఱియు నీ రెండు సుఖములు విరుద్ధములు గావు (6-31).

సాత్త్విక సుఖమే జీవనసార మని చెప్పియున్నాము. కాని అది మానవ జీవన సారము మాత్రమే. దివ్యజీవనసారమగు మఱియొక పరమ సుఖము గలదు. అది, సాత్త్విక సాధన తనను దా నతిక్రమించుచు బిందువు లేక రేఖ దగ్గఱ పైనుంచి మనపై నవతరించు సుఖాతిశయము — అని శ్రీ అరవిందుడు ఎప్పటివలెనే ఇచ్చటను మనకు వస్తువుయొక్క గుణాతీత స్వరూపమును జెప్పును.

విషయేంద్రియ సంయోగాత్ యత్తదగ్రేఽమృతోపమం,
పరిణామే విష మివ తత్సుఖం రాజసం స్మృతం. 38

విషయేంద్రియ సంయోగమువలన జనించుటచే ఏది మున్ముందు అమృతము వలె నుండి, చివరకు విషమువలె పరిణమించునో, అది రాజస సుఖ మనబడును.

విశేషార్థము : ఈ రాజస సుఖము ఆంతరము గాక, బాహ్యస్పర్శపై నాధార పడును. ఇక నా స్పర్శ అంతమొందినపుడు, ఆ సుఖము నంతమొందును, ఆశా భంగము గల్గును. ఈ ఆశాభంగము నందలి కటుతయే విషము. అంతే కాదు, ఆ క్షణిక సుఖమువలన శక్తులు క్షీణించి దుఃఖము గూడ దాపురించును, అదియే విషము అటులే రాజస సుఖానుభవమున అతితృప్తి (మొగము మొత్తుట), ఆయాసము, ప్రకృతివిప్లవము, దానిపట్ల జుగుప్స, నష్టము, పాపము మున్నగు నవి ప్రాప్తించును. అవియే విషము.

యదగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః,
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామస ముదాహృతం. 39

ఏ సుఖము ఆరంభమునందును, పర్యవసానము నందును మనస్సునకు మోహమును గల్గించునో, అది తామస సుఖమనబడును. అది నిద్ర, అలసత్వము మఱియు నజాగ్రత్తలనుండి జనించును.

విశేషార్థము : ఉదాహరణకు, అలసత్వమునే తీసికొందము - అలసత్వము లోని సుఖానుభవము తమస్సును వృద్ధిపఱచి, మోహమును పెంచును. పనికి గడంగిన పిమ్మట గూడ, ఆ సుఖము విడిచివెళ్లిన సంస్కారము మనకు కునికి పాట్లను గల్గించుచునే యుండును. అనగా అనుబంధమునందు గూడ అది మనస్సునకు మోహమును గల్గించుచున్న దనియే అర్థము.

తామస మనస్సు తన మూర్ఖత మఱియు నజ్ఞానములందు ఒక వెచ్చని సుఖమును బొందగలదు; అది ప్రకృతి దానికి కట్టబెట్టిన ప్రత్యేకాధికారము—అని శ్రీ అరవిందుడు.

అవతారిక : ఈ ప్రకరణోప సంహారముగా ఇపుడు గుణవ్యాప్తి చెప్పబడును-

**న తదస్తి పృథివ్యాంవా దివి దేవేషువా పునః,**
**సత్త్వం ప్రకృతి జైర్ముక్తం యదేభిః స్యాత్ త్రిభి ర్గుణైః.**

భువియందు గాని, దివియందు గాని, దేవతలయందు గాని ప్రకృతినుండి బుట్టిన ఈ మూడు గుణములనుండి రహితమైన (ఈ మూడు గుణములతో గూడి యుండని) సత్త్వము లేనేలేదు.

విశేషార్థము ; సత్త్వము = సప్రాణ లేక అప్రాణ వస్తువు. అస్తు.

ఇట్లు విశ్వమంతయు గుణమయము, గుణమాయా కల్పితము గాన, విశ్వము నుండి నిర్గమించుట యొక్కటియే గుణవిముక్తికి మార్గ - మని శ్రీ శంకరుడు. ఎక్కడికి నిర్గమించవలెను ? గుణాస్పృష్టమగు నిర్గుణాత్మలోనికి - అని ఆయన సమాధానము. అందుకు ప్రథమోపాయము స్వధర్మాచరణము. కనుకనే ఇపు డా ప్రకరణము ప్రారంభించబడుచున్న దని ఆయన చేయు పూర్వాపర అన్వయము.

పోతే, శ్రీ అరవిందు డేమి చెప్పును ? అవును, గీతచెప్పినట్లు, విశ్వమంతయు గుణమయమే, కాని విశ్వమంతయు మాయా కల్పితము గాదు, అందలి అహంకారము మాత్రము మాయా కల్పితము. పోతే భగవంతుడే జగత్తునకు మాతయు, పితయు (9-17). మఱియు గుణవిముక్తి నందుటకు ప్రపంచమునే త్యజించ వలసిన పని లేదు, గుణాతీతుడగు భగవంతునితో ఏకత నందిన చాలును, దానికి మార్గము స్వధర్మాచరణము-అని శ్రీ అరవిందుడు అయితే ఈ స్వధర్మా చరణము జ్ఞానోత్పత్తివఱకు మాత్రమే యని శ్రీ శంకరునివలె శ్రీ అరవిందుడు నుడువడు. స్వభావము శాశ్వతము గాన, స్వధర్మమును శాశ్వతమే యని ఆయన చెప్పును.

స్వధర్మప్రస్తావన ఆదిలోనే వచ్చినది (2–31). మఱియు నా స్వధర్మము స్థూలముగా చతుర్విధ మని, దానిని బట్టి చతుర్వర్ణములతో గూడిన భారతీయ సంఘ వ్యవస్థ ఏర్పడిన దని మునుందే చెప్పబడినది (4–13). ఇపు డా చతుర్విధ స్వధర్మము వివరముగా చెప్పబడును.

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాంచ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై ర్గుణైః. 41

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు మఱియు శూద్రులయొక్క కర్మలు, అర్జునా తమ తమ స్వభావములనుండి పుట్టిన గుణములనుబట్టి వేఱువేఱుగా విభజింపబడినవి.

విశేషార్థము : స్వభావమునుండి గుణములు పుట్టినవా ? లేక, గుణములనుండి స్వభావము పుట్టినదా ? ఒకొకనికి ఒకొక స్వభావ ముండును, మఱియు నీ స్వభావ విభేదమునకు గుణములే కారణము. కావున గుణములనుండియే స్వభావము బుట్టు నని చెప్పవలెను. అయితే ఇట్లు ఏర్పడిన స్వభావము దృఢపడి ఒక సంస్కార రూపము ధరించును. మఱియు జన్మాంతరమున ఆ సంస్కారమునుండి గుణములు బుట్టును. కావున స్వభావమునకు కారణమైన గుణములచేత లేక స్వభావమే తమకు కారణమైన గుణములచేత కర్మవిభజన జరుగును–అని మనము చెప్పుకొనవలసి యుండును.

పోతే బ్రాహ్మణాది నామములు జన్మను బట్టి వచ్చినవా ? లేక కర్మను బట్టి వచ్చినవా ? స్వభావమును బట్టి కర్మ, మఱియు నా కర్మను బట్టి బ్రాహ్మణాది నామములు–అని పైన స్పష్టముగనే యున్నది.

'స్వభావజం కర్మ'–అని పలుతావులలో 18–42,43....) చెప్పబడి, ఒక్క చోట మాత్రమే (14–48) 'సహజం కర్మ' –అని చెప్పబడినది 'సహజం కర్మ'= జన్మతో వచ్చిన కర్మ. కొంతవఱకు స్వభావమును బట్టి జన్మ యుండును గాన, ఆమేరకు జన్మను బట్టియు కర్మయుండు నని మన మనుకొనవలెను. ఫలితార్థ మేమన, ముఖ్యముగా స్వభావమును బట్టి కర్మ, గౌణముగా జన్మను బట్టి కర్మ యుండును.

ఒక మహాపురుషునికి సామాన్యులలో, అధములలో జన్మించుట మనము చూచుచునే యున్నాము. కాన జన్మను బట్టి కర్మ-యను నియమము మిక్కిలి

తక్కువగా మాత్రమే వర్తించును. అయినను దురదృష్టవశాత్తు ఇదియే భారత దేశమున రానురాను ఎక్కువగా వర్తింపజేయబడినది. అందుచేత సంఘవికాసానికి దోహదముచేయ నుద్దేశించబడిన సంఘవ్యవస్థ కృత్రిమ భేదములను కల్పించుటకే దారితీసినది.

మఱియు నొక వ్యవస్థ ఒకనాడు ఎంత హితకారిగా నుండినను, కాలముతో బాటు నదియు మాఱవలసియుండును. అట్లు మాఱనిచో, కాలపురుషుడే (11-32) దానిని కాలదాచి రూపుమాపును.

చాతుర్వర్ణ్యమును భగవంతుడే ఒక దివ్యనియమము ననుసరించి సృజించెను (4-13) గదా, అయినపుడు దాని కెట్లు కాలదోషము పట్టును? ఈ ఆక్షేపణ నిలువదు. ఏలన, భగవంతుడు చాతుర్వర్ణ్యమును సృజించె నన, చాతుర్వర్ణ్యము వెనుక నున్న చతుర్విధ స్వభావమును సృజించె నని అర్థము. ఈ దేశము నందే కాదు, సర్వదేశములలోను మనకు గన్పించు సత్య మేమన, ప్రతిమానవునికి స్వభావము మాఱుచున్నను, మానవ స్వభావమున నాలుగు ప్రాథమిక ప్రకారములు గలవు-1. సత్త్వప్రకారము, 2. సత్త్వముతో గూడిన రజః ప్రకారము, 3. తమస్సుతో గూడిన రజః ప్రకారము, 4. రజస్సుతో గూడిన తమః ప్రకారము ఇవిగో, ఈ ప్రకారములనే ఈశ్వరుడు సృజించినది, మఱియు దాదాపు శాశ్వతమైనవి ఈ స్వభావప్రకారములు గాని, జన్మను బట్టి వచ్చిన వర్ణములు గావు.

స్పష్టముగా నిట్లే గీతావర్ణవ్యవస్థను మన మర్థముచేసికొనవలెను. అపుడు ఇవ్విషయమునను గీతయందు సంకుచిత మేమియు లేదని మనము గ్రహించగలము, గీత సార్వకాలిక గ్రంథ మను ప్రతిపాదనకు వర్ణవ్యవస్థయు ఒక కంటకము గా దని నిర్ణయించగలము.

అవతారిక : ఇపు డా కర్మలు (18-41) చెప్పబడును -

శమో దమస్తపః శౌచం క్షాంతి రార్జవ మేవచ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజం. 42

శాంతిభావము, ఆత్మసంయమము, తపస్య, శుద్ధత, క్షమాభావము, సరళ వర్తనము, జ్ఞానము, విజ్ఞానము మఱియు నాధ్యాత్మిక సత్యముయొక్క అంగీకారము- ఇవి తన స్వభావమునుండి బుట్టిన బ్రాహ్మణుని కర్మలు.

విశేషార్థము : శమము = అంతరింద్రియ నిగ్రహము – అని ఇతరులు చెప్పగా, శమము = ప్రశాంతి (calm)-అని శ్రీ అరవిందుడు. బ్రాహ్మణునియందు మనస్సు ఉపశమించియే యుండును, అందువలన ఆ మనస్సునందు సదా శాంతి వర్ధిల్లునని అర్థము.

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం,
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజం. 43

శౌర్యము, సాహసము, దృఢనిశ్చయము, దక్షత యుద్ధమునందు వెన్నుచూపకుండుట, దానగుణము, పరిపాలనాసామర్థ్యము : ఇవి తన స్వభావమునుండి బుట్టిన క్షత్రియుని కర్మలు.

విశేషార్థము : 'స్వభావ గుణములచేత కర్మలు విభజింపబడినవి' (18-41) – అని చెప్పబడిన అర్థమే 'స్వభావమునుండి బుట్టిన కర్మ' అను పదముచేత నిక్కడ చెప్పబడుచున్నది.

కృషి గౌరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం. 44

వ్యవసాయము, పశుపాలనము, వాణిజ్యము : ఇవి స్వభావజాతములైన వైశ్యకర్మలు, మఱియు పరిచర్య శూద్రునికి స్వభావజాతమైన కర్మ యగును.

విశేషార్థము : చేతిపనులు, శిల్పము గూడ వైశ్యకర్మలోనికే వచ్చివేయును.– అని శ్రీ అరవిందుడు.

ఆధునిక యుగమునందు యుద్ధము సంపూర్ణయుద్ధమైనది, అనగా యుద్ధసమయమున అన్ని వృత్తులవారు యుద్ధమునందు ఎక్కువతక్కువగా పాల్గొనవలసిన అగత్యమేర్పడినది. అందుచేత ఈ కర్మవిభజన అట్టి సమయమున అంత పనికిరాదు.

అవతారిక : అయితే ఈ కర్మవిభజన మెందుకు చెప్పినట్లు ? వినుడు –

స్వే స్వే కర్మ ణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. 45

తన స్వీయ స్వాభావిక కర్మయందు తత్పరుడైన మానవుడు సంసిద్ధిని బొందును. కాగా స్వకర్మతత్పరుడు ఎట్లు సిద్ధిని బొందునో, ఆ ప్రకారమును, అర్జునా, వినుము.

విశేషార్థము : స్వకర్మను అనుష్ఠించినంత మాత్రముచేతనే సిద్ధిబొందునా? లేదు, సరియగు జ్ఞానముతోను, సరియగు ఆశయముతోను అనుష్ఠించి నపుడే, స్వకర్మ నిరతుడు సిద్ధి బొందును – అని శ్రీ అరవిందుడు; స్వకర్మను ఎటు లాచరించినను, దానిచేత మాత్రమే మనుజుడు సిద్ధి బొందడు–అని శ్రీ శంకరుడు. ఇందు ఎవరి మాట సత్యమో తర్వాతి శ్లోకము తేల్చును –

యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతం,
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. 46

ప్రాణులకు కర్మప్రేరణ ఎవనినుండి వచ్చునో, మఱియు నెవనిచేత ఈ విశ్వ మంతయు విస్తరింపజేయబడినదో, మానవుడు స్వకర్మచేత ఆ ఈశ్వరు నారాధించి సిద్ధిని బొందును.

విశేషార్థము: స్వకర్మనిరతుడు ఎట్లు సిద్ధి బొందునో, చెప్పెదను, వినుము (18-45)- అని ప్రతిజ్ఞచేసి, ఈశ్వరు నా స్వకర్మచేత ఆరాధించి సిద్ధిబొందును (18-46) – అని ఉపదేశించబడెను. స్వకర్మ నెటు లాచరించినను సిద్ధి బొందడు–అని శ్రీ శంకరుడు చెప్పిన మాట దీనికి విరుద్ధము గాదా?

దీనికి ఆయన సమాధాన మేమన, ఈశ్వరారాధనగా జేసిన స్వకర్మచేత బొందెడి సిద్ధి సాక్షాత్ సిద్ధికాదు, అది జ్ఞాన నిష్ఠకు యోగ్యత నిచ్చు సిద్ధి మాత్రమే.

మఱల, ఈ వాదనకు శ్రీ అరవిందుని వ్యాఖ్యానమునుండి మనకు లభించు సమాధాన మేమన, ప్రాణులకు కర్మప్రవృత్తి ఈశ్వరునినుండియే వచ్చుచున్నది గదా. అయినపుడు ఆ జ్ఞానముతోను, కర్మచేత ఈశ్వరుని బొందవలె నను ఆశయము తోను స్వకర్మ ననుష్ఠించిన యెడల, ఈశ్వరు నెందుకు బొందజాలము? కర్మమూల మును వెదకుచు కర్మచేయుచుండిన, అది తన మూలమగు ఈశ్వరజ్ఞానమును గల్గించి, ఈశ్వరునితో సంయోగమును బొందించుట యుక్తియుక్తమే గదా. అయినపుడు కర్మకు, జ్ఞానమునకు బొత్తు లేదని శ్రీ శంకరు డెట్లు వాదించవచ్చును? – అని శ్రీ అరవిందుడు ప్రశ్నించును.

పైగా, సర్వకర్మలను జేయుచునే పరమ పదమును బొందును (18-56) – అని గీత తర్వాత చెప్పను గూడ చెప్పును గదా. మఱియు కర్మచేతనే జనకుడు సంసిద్ధిని బొందెను (3-20) అని వెనుక జెప్పబడియున్నది గదా.

ఇచ్చట శ్రీ రమణుని ఉపదేశము గూడ గుర్తుకు వచ్చును – "శబ్దమునకు మూలము ఆత్మ గనుక, మంత్రశబ్దముద్వారా ఆత్మను వెదకుము. అదియే తపస్య."– అని ఆయన చేసిన ఒక ముఖ్యోపదేశము. అటులే కర్మద్వారా కర్మమూలమగు భగవంతుని వెదకి, పొందుట సహజమే కదా.

అవతారిక : స్వకర్మచేత సిద్ధిని బొందును గావున –

**శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్,**
**స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషం. 47**

బాగుగా అనుష్ఠింపబడిన (తనది కాని) పరధర్మము కంటెను లోపయుక్తమైనను స్వధర్మానుష్ఠానమే శ్రేష్ఠతరము. కారణము, స్వభావనియతమగు కర్మను, అనగా స్వధర్మమును, ఆచరించు నపుడు, మానవుడు పాపమును లేక మాలిన్యమును బొందడు.

విశేషార్థము : బాహ్యదృష్టిని బట్టి పరధర్మము ఎక్కువ బాగుగ గన్పింపవచ్చును లేక ఎక్కువ ధనమును చేకూర్చవచ్చును. కాని ఆంతర వికాసమునకు ఒక సాధనముగా అది స్వధర్మముకంటెను హీనతరమే. దీనికి గారణ మేమన, పరధర్మమునకు ప్రేరణ బాహ్యమునుండి (కామమునుండి)వచ్చును, మఱియు నందు చేతనే దాని ప్రవృత్తి యాంత్రికము–అని శ్రీ అరవిందుడు. మఱియు స్వధర్మము సహజము గనుక, నేను చేయుచున్నా నను అహంకారము దానిలో తక్కువగా నుండును. కావున అది జ్ఞానోదయమునకు అవకాశ మిచ్చును. పులి చంపుచున్నను అది దాని స్వధర్మము గనుక, నెట్లు పాపమును బొందదో, అటులే స్వధర్మ నిరతుడును.

కర్మ సరిగా నియమించబడిన కర్మ గావలెను–"నియతం కర్మ", కాని అంత మాత్రము సరిపోదు; దానికి తోడు, అది తత్త్వతః తనది గావలెను, తనలోపలి నుండి వెలువడవలెను, తన సత్తయొక్క సత్యముతో శ్రుతిగలిసి యుండవలెను, అనగా స్వభావనియతము గావలెను– "స్వభావ–నియతం కర్మ".

అహంకార స్వభావము వేఱు, అంతరాత్మ స్వభావము వేఱు. ఇందు మొదటిదానిని గూడ నిజమగు స్వభావము క్రిందనే జమకట్టి, అది ఆడించినట్లు ఆడగూడదు (3–34), దానిని అధిగమించవలెను, అట్లు అధిగమించుట సాధ్యము గూడను.

పేడలో బుట్టిన పురుగునకు పేడ ఎట్లు హానిచేయదో, అటులే స్వభావనియత కర్మను జేయువాడును పాపము నందడు—అని శ్రీ శంకరు డిచ్చిన దృష్టాంతము.

అవతారిక : స్వకర్మ చేయువాడు పాపము నందడు గాన –

**సహజం కర్మ కౌంతేయ సదోష మపి న త్యజేత్,**
**సర్వారంభాహి దోషేణ ధూమే నాగ్ని రివావృతాః. 48**

తనకు సహజమైన కర్మను, అర్జునా, అది దోషయుక్తమైనను, విడువరాదు. నిజానికి, పొగచేత నిప్పు ఆవరింపబడియుండు నట్లు సర్వకర్మలును దోషముచేత కప్పబడియే యుండును.

విశేషార్థము : గుణముల స్తరమునం దుండి చేయు కర్మ యంతయు దోషయుక్తమే, మానవ కర్మ యంతయు దోషము, లోపము, లేక పరిమితత్వమునకు అధీనమై యుండును. కాని అందుచేత మన సముచిత కర్మను, మన సహజ వృత్తిని మనము పరిత్యజించరాదు. ఏలన సహజ కర్మ నొనరించు నపుడు, దాని దోషము మన కంటకపోవుటయే కాక, అది బుద్ధిని పావనము చేయునదియు నగును (18-5).

'సహజ కర్మను త్యజించరాదు' – అని చెప్పిన మాట అజ్ఞునకే నని – శ్రీ శంకరుడు. అజ్ఞుడు ఏదియో యొక కర్మ అనుక్షణము చేయక తప్పదు (3-5), మఱియు పరధర్మ రూపమగు కర్మ భయావహము (3-35), అందువలన అజ్ఞుడు స్వధర్మము నాచరించవలెను. పోతే, జ్ఞాని సర్వకర్మలను త్యజించగలడు గావునను, కర్మ అవిద్యాకల్పితము గావునను, అతడు వానిని త్యజించవలెను, మఱియు త్యజించును గూడ – అని ఆయన వాదించును.

ఇక్కడ ఒక్క ప్రశ్న : ఈశ్వరునికి కనీసము జ్ఞానియగు మానవున కున్న జ్ఞానము గలదు గదా. ఇక కర్మ అవిద్యాకల్పితమే యగుచో, ఆయన విశ్వసృష్టి నెట్లు చేసెను ? సృష్టియు ఒక కర్మయే గదా. కావున శ్రీ శంకరుడు చెప్పు నట్లు, మానసిక చేతనలో కర్మజ్ఞానములకు పొత్తు కుదురదేమో గాని, అతిమానస, దివ్య చేతనలో తప్పక కుదురును.

ఈ పై 41-48 శ్లోకములు గీతా కర్మయోగముయొక్క సంగ్రహస్వరూపమును జెప్పును. దీని నించుక సమీక్షింతము –

ఫలాసక్తి లేకుండ కర్మచేయుటయే కర్మయోగము–అని అనుకొందుము. కాని అది స్థూలాభిప్రాయము మాత్రమే. కర్మయోగముయొక్క ప్రథమ సత్యమేమన,

ప్రతిమానవుడు తన స్వభావము నిర్ణయించు కర్మ చేయవలెను. దీని అర్థము కుమ్మరి కొడుకు కుండలే చేయవలెనని కాదు. అది అతని స్వభావము గానిచో, ఆ పనిని అతనిపై విధించుట పరధర్మమును (18-47) విధించుటయే యగును.

తర్వాత, కర్మయోగముయొక్క ద్వితీయ సత్యమేమన, దరహాము మీద, మానవస్వభావము 4- ప్రకారములుగా నుండును (4-13). వీనిలో తానే ప్రకారము లోనికి వచ్చునో వ్యక్తి నిర్ణయించుకొని, ఆ ప్రకారము నిర్దేశించు కర్మక్షేత్రమును తా నెన్నుకొనవలెను. పోతే, కర్మయోగముయొక్క తృతీయ సత్యమేమన, వ్యక్తి ఆ క్షేత్రమున తన స్వకర్మచేత భగవంతుని అర్చించవలెను (18-46). తన కర్మను భగవంతునికి ఒక పూజాపుష్పము చేయవలెను. అట్లు చేసినపుడే, అది కర్మయోగ మగును, అనగా ఆ కర్మచేత భగవంతునితో యోగము సిద్ధించును.

శారీరిక కర్మనే కాక, స్వభావనియతమగు సర్వకర్మను మన మిట్లు అర్పించ వలెను, అర్పించగలము గూడ. అపుడు కర్మ యంతయు నొక యజ్ఞమై, జీవిత మంతయు నొక యోగ మగును (6-31) - "All life is yoga" - అని చెప్పిన శ్రీ అరవిందుని మహావాక్యము మన కనుభవమునకు వచ్చును.

అవతారిక : ఇంతదనుక భగవాను దర్జునునకు చేయవలసిన బోధయంతయు జేసివేసెను. ఇక నతడు గీతామహావాక్యమును (18-65, 66) మాత్రమే ఉచ్చరించ వలసి యున్నది. ఆ మహావాక్యము గీతాసందేశముయొక్క హృదయ మగును, గీతాసిద్ధాంతముయొక్క ప్రాణ మగును. అది గీతాసాధనయొక్క ఒక సంక్షిప్త, సారభూత వర్ణన మాత్రమే గాదు, అది సాధనయొక్క చరమ సోపానమును సైతము నతిక్రమించి పరిపూర్ణ, నిర్ద్వంద ఆధ్యాత్మిక స్వేచ్ఛలోనికి మనలను ప్రవేశపెట్టు మహావాక్య మగును.

కాని ఆ మహావాక్యమును ప్రవచించుటకు పూర్వము, గీత ఇంతదనుక తాను బోధించిన సాధనావిధానము నంతను తిరిగి 15-శ్లోకముల, 49-56 శ్లోకము, సంక్షిప్త స్థలములో నతిస్పష్టముగా మన ముందుంచును. ఈ పదునైదు శ్లోకములందు 41-48 శ్లోకములలోని కర్మయోగము సైతము మఱల వేఱుమాటలలో వచ్చివేయును. కనుక వీని నిపుడు మనము జాగ్రత్తగా పరిశీలింతము.

జ్ఞానమార్గము మఱియు గీతామార్గము-రెండును మానవుని తన అజ్ఞానమయ నిమ్నప్రకృతినుండి విశుద్ధ ఆధ్యాత్మిక చేతనలోనికి నడుపును. కనుక ఆ మేరకు

రెండును ప్రామాణికములే అందుచేత తర్వాతి అయిదు శ్లోకములందు గీత ఉభయ మార్గములకు అనువర్తించు పదప్రయోగము చేయును-అని శ్రీ అరవిందుడు. ఎట్లన-

అసక్తబుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసే నాధిగచ్ఛతి. 49

దేనియందును సంగము లేని బుద్ధిగలవాడును, ఆత్మను జయించినవాడును, కోరికలు గతించినవాడు నగు మానవుడు సంన్యాసముచే నైష్కర్మ్య రూపమగు పరమ సిద్ధిని బొందును.

విశేషార్థము: గీత ఇతఃపూర్వము చెప్పిన దాని యంతటి వెలుగు లోను (6-3,6)ఈ శ్లోకములను మనము పఠింతు మేని, సంన్యాస మన ఫల మతియు సంగసన్యాస మనియు, నైష్కర్మ్య మన ఆంతర నైష్కర్మ్య మనియు మనము సులభముగానే అర్థము చెప్పుకొనవచ్చును. ఇట్లు ఈ శ్లోకము రెండు మార్గములకు వర్తించును.

కాని శ్రీ శంకరు డేమి చెప్పును ? కర్మవలన గలుగు సిద్ధి (18-46) జ్ఞాన నిష్ఠకు యోగ్యతను మాత్రమే కల్గించు ననియు, ఈ శ్లోకము ఆ సిద్ధియొక్క ఫల భూతమగు బాహ్య సన్యాసమును, శుద్ధ నైష్కర్మ్యమును జెప్పుచున్న దనియు ఆయన వ్యాఖ్యానించును.

దీనికి విపరీతముగా, భగవదర్చనా రూపమగు కర్మవలన గలుగు సంసిద్ధికి(18-46) ఈ శ్లోకమునందు జెప్పబడిన ఆంతర నైష్కర్మ్య రూపమగు సిద్ధి ఒక ప్రథమ ఆవశ్యక సిద్ధి మాత్రమే, గీతాయోగముయొక్క ప్రథమ లక్ష్యము మాత్రమే యని శ్రీ అరవిందుడు పలుకును.

ఏలన, శ్రీ శంకరుని శుద్ధ నైష్కర్మ్యము పూర్ణత నందుకొనజాలక, ఎచ్చట- ఏ అక్షరాత్మయందు - ఆగిపోయి, వెనుకకు మఱలునో, అచ్చట గీతాయోగము - ఆంతర నైష్కర్మ్య రూపమగు గీతాయోగము-సుదృఢ సూక్ష్మతతోను, సమున్నత ధైర్యముతోను ముందుకు సాగి, నూతన క్షేత్రములపైకి ఒక కవాటమును దెఱచి, మానవుని భగవంతునిలో సంపూర్ణుని గావించును, మఱియు నంతరాత్మ ప్రకృతుల రెంటిని ఆ భగవత్తత్త్వమునందు సమన్వయపఱచి, ఏకము గావించును అట్టియెడ కర్మజ్ఞానముల విరోధము పోయి, అవి ఏకమగును - అనియు శ్రీ అరవిందుడు దెలుపును.

అవతారిక : నైష్కర్మ్యసిద్ధిని బొందినవాడు బ్రహ్మ నెట్లు బొందునో, ఆ క్రమమును వివరించును –

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే,
సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా. 50

ఈ నైష్కర్మ్యసిద్ధిని బొందిన మనుజుడు ఏ పరమ జ్ఞాననిష్ఠాప్రకారమున బ్రహ్మము నందుకొనునో, దానిని,ఓ కౌంతేయా, ఇపుడు సంక్షేపముగా దెలిసికొనుము.

విశేషార్థము : 49-వ శ్లోకములో, 'నైష్కర్మ్యసిద్ధిని బొందును' అని చెప్పి, 50-వ శ్లోకములో 'సిద్ధిని బొందినవాడు'-అనినపుడు, నైష్కర్మ్యసిద్ధిని బొందినవాడనియే అర్థము. ఈ అన్వయమునే శ్రీ అరవిందుడు చెప్పగా, శ్రీ శంకరుడు ఎక్కడో దూరముగా నున్న, 46-వ శ్లోకములో చెప్పబడిన, కర్మజమగు సిద్ధిని బొందినవాడని చెప్పెను. ఏలన శ్రీ శంకరునికి నైష్కర్మ్యసిద్ధియు, బ్రహ్మప్రాప్తియు నొకటియే గాన, 'నైష్కర్మ్యసిద్ధిని బొందినవాడు బ్రహ్మ నెట్లు బొందునో, వినుము' – అను వచనమున కర్థము లేదు.

దీనికి శ్రీ అరవిందుని సమాధాన మేమన, నైష్కర్మ్యసిద్ధి, అనగా అంతఃశమము కలిగిన వెంటనే, మనుజుడు బ్రహ్మమును బొందినట్లు గాదు, "సర్వభూతముల యందు సమముగానున్న బ్రహ్మను" (18-54) దెలిసికొనుటకు ఇంకెంతయో సాధన అవసరము, నైష్కర్మ్యము దానికి ఆధారము మాత్రమే – యని శ్రీ అరవిందుడు చెప్పెను.

ఈ శ్లోకమున ఉద్దేశించిన జ్ఞానము సాంఖ్యయోగము-"జ్ఞానయోగేన సాంఖ్యానాం"-అని యే జ్ఞానము చెప్పబడినదో, ఆ జ్ఞానము. తన యోగముతో చేయి కలిపి వెళ్లినంతవఱకు గీత ఈ సాంఖ్యజ్ఞానము నామోదించును. అయితే తన యోగము కేవలము సాంఖ్యయోగము గాదు, దానిలో కర్మయోగము గూడ నిమిడి యుండును-అని తెలుపుటకు, ఇపుడు చేయబోవు జ్ఞాననిష్ఠావర్ణనలో కర్మయోగమునకు ఉచితమగు త్యాగపదము-"త్యక్త్వా" (18-51)-మున్నగు పదములను వాడును.

మఱియు ఈ జ్ఞానము భగవంతునియందు పరభక్తికి-"మద్భక్తిం పరాం"(18-54) దారి తీయును గాన, ఇది కేవల సాంఖ్యజ్ఞానము గాదని స్పష్టముగా దెలియును.

అవతారిక : ఇపుడు 3-శ్లోకాలలో ఆ జ్ఞాననిష్ఠ వర్ణించబడును –

54]

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ,
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. 51

సాధకుడు విశుద్ధమగు బుద్ధిచేత ఆత్మతోయుక్తుడై, తన సత్తనంతను దృఢ సంకల్పముతో నియమించి, అపుడు ఇంద్రియ విషయములగు శబ్దాదులను త్యజించి, ఆవిషయములందు మనస్సున నుండు రాగద్వేషములను విడనాడి-(తర్వాతి శ్లోకముతో అన్వయము)

విశేషార్థము : 'బుద్ధ్యా విశుద్ధయా యుక్తః' = విశుద్ధ బుద్ధి సంపన్నుడు-అని శ్రీ శంకరుడు; విశుద్ధబుద్ధిచేత ఆత్మతో యుక్తుడు-అని శ్రీ అరవిందుడు. ఇదియే బుద్ధియోగము (10-10), (18-57). సమస్త గ్రంథమును మనస్సులో నుంచుకొని తదనురూపముగా శ్రీ అరవిందుడు వ్యాఖ్యానించును-అనుట కిది యొక నిదర్శనము ఆత్మతో ఈ బుద్ధియోగమునే శ్రీ అరవిందుడు ఇట్లు ప్రస్తుతించును-బహిర్ముఖము, అధోముఖము నగు దృష్టినుంచి, అంతర్ముఖము, ఊర్ధ్వముఖము నగు దృష్టికి బుద్ధి ఆధ్యాత్మికముగా మరలుటయే జ్ఞానయోగ సారము.

'విషయాం స్త్యక్త్వా'-శరీరధారణకు ఆవశ్యకమగు కొద్ది ఇంద్రియ విషయములను దప్ప,తక్కిన వాని నన్నింటిని త్యజించి-అని శ్రీశంకరుడు. కాని శ్రీఅరవిందుడు ఇచ్చటి 'త్యక్త్వా' లోని త్యాగపదముయొక్క అర్థమునకు మన దృష్టి నాకర్షించును. ఇది విషయత్యాగముగాని విషయసంన్యాసము గాదు. అనగా నిది విషయము లందుండు 'రస' (2-59) త్యాగము మాత్రమే. భగవత్ప్రాప్తి యందు ఇంద్రియ వ్యాపారముయొక్క ఉపయోగము గలదు. అందుచేత విషయములనే సంన్యసించి, ఇంద్రియములు మూసుకొనిపోగూడదు, ఇంద్రియాలు నిస్పృహతో వాని మధ్య మెలగవలెను (2-71),కోరికలు లేని 'కేవల ఇంద్రియములచేత' (5-11) సాధకుడు కర్మ చేయవలెను-అని శ్రీ అరవిందుడు విస్పష్టీకరించును.

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః,
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. 52

ఏ సాధకుడు ఏకాంతమున నివసించునో, అల్పాహారము మాత్రమే తీసికొనునో, మనోవాక్కాయములను వశము జేసికొనినవాడై, సంపూర్ణ వైరాగ్యము నాశ్రయించి, నిత్యము ధ్యానయోగ తత్పరుడగునో -

విశేషార్థము : ధ్యానయోగము ఒక దృఢ మఱియు ప్రత్యక్ష సాధనము. దీని నాశ్రయించిన అంతరాత్మ శక్త్యాత్మను మఱియు శాంతాత్మను దర్శించగలదు - అని చెప్పి, శ్రీ అరవిందుడు మఱియు నిట్లు హెచ్చరించును-అయినను, శుద్ధ ధ్యాన జీవితము నిమిత్తము సక్రియ జీవితమును విడనాడ రాదు, పరమ పురుషుని కొఱకు యజ్ఞముగా కర్మ సదా చేయబడుచునే యుండవలెను. లేనిచో, అనగా బాహ్యముగా గూడ కర్మను సంన్యసించినచో, అంతరాత్మ ప్రకృతికి దూరమై శాంతాత్మలో లీనమైపోవును. అది కర్మసమస్యను పరిష్కరించుట గాక, దాటవేయుటయే యగును.

ఇట్లు ధ్యానయోగపరుడై యుండియు కర్మను విడువగూడ దనుచున్నారు, శ్రీ అరవిందుడు; సరే, కాని 'వివిక్తసేవీ' - ఏకాంతవాసి-అను పదము ఆయన చెప్పిన దానికి విరుద్ధము గాదా ? కాదు, ఏలన అది నిర్వ్యక్తిక ఏకాంతము గాని, బాహ్య ఏకాంతము గాదు. నిర్వ్యక్తికాత్మయందు ఏ సహజ ఏకాంతము గలదో, సాధకుడు దానిని సేవించవలెను. మఱియు కర్మచేయుచునే దానిని సేవించవచ్చును గూడ-అని శ్రీ అరవిందుని వ్యాఖ్యను బట్టి తెలియును.

అవతారిక : అహంకారవినాశము బ్రహ్మప్రాప్తికి మార్గము గావున -

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం,
విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే. 53

(పై శ్లోకముతో అన్వయము) ఆ సాధకుడు అహంకారమును, దుష్టబలమును, మిడిసిపాటును, క్రోధమును, వస్తుసంగ్రహణమును విడిచివేసి, ఏ మమకారము లేక శాంతుడై బ్రహ్మ యగుట కర్హు డగును.

విశేషార్థము : ఆత్మ నిర్వ్యక్తికము, అది దేనిని కామించదు. కావున ల ఆత్మను పొందుటకు అహంకారము మఱియు దాని కామాది వృత్తుల నాశము మన కీ కమున శ్లోమార్గముగా జూపబడినది.

పోతే, ఈ 'బ్రహ్మభూయము', అనగా బ్రహ్మ మగుటయే మన పూర్ణ ధ్యేయముగాదు, ఇది ఇంతకంటెను అధికతరము, అద్భుతతరము నగు భగవద్భావము నకు – "మద్భావాయ" (13-19) - ఒక అవశ్యక, అపరిమిత ఆధారము మాత్రమే. తర్వాతి రెండు శ్లోకములు బ్రహ్మభావమునుండి మద్భావమునకు గల మార్గమును వర్ణించును. ఈ రెండును సంన్యాసవాదానికి మ్రింగుడు బడని శ్లోకాలు.

కాని ఈ ప్రస్తుత శ్లోకము (18-53) సర్వమును సంన్యసించిన పరమహంస పరివ్రాజకుడగు యతిని వర్ణించునట్టిది - యని శ్రీ శంకరుడు. ఈ యతి దేహధారణ నిమిత్తము మాత్రమే విషయములను స్వీకరించును, మఱియు దానియందు సైతము మమకారము లేకుండును, కావుననే అతడు శాంతుడు - అని ఆయన చెప్పెను. అస్తు.

అవతారిక : అహంకారాదికమును విడిచి బ్రహ్మమైనవాడు -

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి,
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. 54

ఒక డెపుడు బ్రహ్మ మగునో, కావుననే ప్రసన్నచిత్తుడై దేనికిని శోకింపడో (2-65), దేనిని కామింపడో, మఱియు సర్వప్రాణుల పట్ల సముడై యుండునో (5-19), అపు డతడు నాయందు పర (పరమ) భక్తిని పొందును.

విశేషార్థము : 51-53 శ్లోకములలో జెప్పబడిన జ్ఞాననిష్ఠ (18-50) సన్న్యాస, గీతామార్గముల రెండింటికిని అవశ్యకమే. అయితే సన్న్యాసమార్గమునందలి జ్ఞాననిష్ఠ సంకుచితము. అది నిర్వ్యక్తికాత్మవలకే మానవుని గొనిపోయి, అతనిని అందులో లీన మొనరించివేయును. ఇచ్చట బాహ్యసన్న్యాసమును ఒత్తి చెప్పుటచేత, అహంకారమే కాక, మానవుని ఆధ్యాత్మిక వ్యక్తిత్వమును నిర్వ్యక్తిక అక్షరాత్మలో లీనమై అంతరించిపోవును. ఇదియే ఈ మార్గమునందు జీవుని ఉన్నతికి అంతమును, పరాకాష్ఠయు నగును.

ఈ లయమునందు భక్తికి తావే యుండదు. ఏలన ఇచ్చట భజించువాడును లేడు, భజింపబడువాడును యుండడు. కాని బ్రహ్మభూతుడు పరభక్తిని పొందును - అని గీత చెప్పుచున్నది గనుక, సంకుచిత జ్ఞానమార్గము వేఱు, సమగ్ర గీతామార్గము వేఱు - అని మనకు తెలియును.

ఈ గీతాయోగమునందు జ్ఞాననిష్ఠయొక్క యథార్థలక్షణమగు అంతఃసన్న్యాసమే యుండునుగాని, బాహ్యసంన్యాస ముండదు: అహంకారమే లీనమగునుగాని ఆధ్యాత్మిక వ్యక్తిత్వము లీనము గాదు. ఈ వ్యక్తిత్వము తనద్వారా భగవచ్ఛక్తి తన కర్మలను చేయుచుండుటకు నిలిచియే యుండును. నిలిచి యుండి పురుషోత్తమునితో తన యథార్థ సంబంధమును కనుగొనును. ఈ సంబంధ మేమన, ఇపుడు మానవాత్మ ఒక పరమ ఆధ్యాత్మిక నిర్వ్యక్తికతయందు పురుషోత్తమునితో తన ఏకతను అనుభవించును, మఱియు నదే సమయమున మానవాత్మ తన విశ్వీకృత వ్యక్తిత్వమునందు

ఆ పురుషోత్తముని యొక్క ఒక అభివ్యక్త శక్తిగా తనను గాంచును. అక్షరాత్మను దాటి, పైకి వెళ్లిన అంతరాత్మకు సిద్ధించు ద్వివిధ సంసిద్ధి యిది. ఒక అవర్ణనీయ పరమ సత్యము యొక్క రెండు పార్శ్వముల సంయోగ మిది. ఇదియే ప్రకృతిలోనికి దిగిన అంతరాత్మవికాసము యొక్క పరమ భవితవ్యము.

ఈ సంసిద్ధియందలి జ్ఞానము సాంప్రదాయిక జ్ఞానమార్గమునందలి జ్ఞానము కంటెను ఉచ్చతరము, మఱియు విశాలతరము. ఉచ్చతర మేలయన, ఇది అక్షరాత్మ కంటెను ఉచ్చతరమగు(15-18)పురుషోత్తముని జ్ఞానము;ఇక విశాలతర మేలయన, ఇది ప్రకృతిరహితమైన అక్షరాత్మజ్ఞానము గాక, ప్రకృతిసహితమైన పరమాత్మజ్ఞానము. ఏకమగు నీ పరమాత్మ లేక పురుషోత్తముడు తన స్వభావముచేతనే సదా అనేక మగుచుండును; ఇక నీ అనేకము తన స్వరూపముచేతనే సదా ఏకముగా నుండును. ఏక మనేకమగుట మఱియు అనేకము ఏకముగా నుండుట - ఇదియే సృష్టిరహస్యము, మఱియు మన కంతుపట్టని సృష్టి గుహ్యము (mystery). ఇట్లు మన పురుషోత్తముడు తన బహుత్వము చేత విక్షిప్తమును గాడు, తన ఏకత్వముచేత బద్ధుడును గాడు.

అనేకత్వము బంధించును, ఏకత్వము విడిపించును - అని సదా సంప్రదాయము మనకు చెప్పుచు వచ్చినది. కాని, తన అనేకత్వముచేతనే కాదు, తన ఏకత్వము చేతను భగవంతుడు బద్ధుడు గాడు — అని మనకు దెలిపిన మహాద్రష్ట శ్రీ అరవిందు డొక్కడు మాత్రమే! ఇది ఎంతో మహత్త్వపూర్ణమగు విషయము. ఏలన పరమ స్వేచ్ఛ భగవంతునియొక్క పరమ పదము (status). మనల నా పరమ స్వేచ్ఛ లోనికి బంపుటకే, గీత 'సర్వధర్మాన్ పరిత్యజ్య' — అని ఉద్బోధించును. ఏకముగా నుండుచునే అనేకమగు స్వేచ్ఛ భగవంతునికి లేనిచో, అది అతని స్వేచ్ఛకు కొఱతయే యగును. అప్పు డతనికి పరమ స్వేచ్ఛ లేకపోవును, అతనిది పరమ పదము గాకపోవును.

పోతే, కర్మచేత చిత్తశుద్ధి, భక్తిచేత, అనగా ఉపాసనచేత, చిత్తైకాగ్రత, అంతమఱకే వాని వ్యాప్తి, జ్ఞాన ముదయించిన పిమ్మట వానికి తావు లేదు — అని సిద్ధాంతీకరించియున్న శ్రీ శంకరు డీ శ్లోకమున కేమి చెప్పును? 'జ్ఞాని పర భక్తిని పొందును'—అని చెప్పిన గీతావచనమును ఆయన అంగీకరించక తప్పలేదు. పోతే పరభక్తి యనగా, 7-వ అధ్యాయమున జెప్పబడిన (7-16) జ్ఞానలక్షణమగు చతుర్థ భక్తి యని మాత్రము చెప్పి చాలించును.

అవతారిక : ఏకానేకమగు పురుషోత్తముని జ్ఞాన మెట్లు కలుగును ?-

భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరం. 55

ఈ పరభక్తిచేత నేను (స్వరూపతః) ఎట్టివాడనో, మఱియు(శక్తితః) ఎంతటివాడనో భక్తు డెఱుంగును, మఱియు నా సత్తయొక్క సత్యతయందును, తత్త్వములందును భక్తుడు న న్నెఱుంగును. ఇట్లు సమగ్రముగా నెఱింగి, అతడు వెనువెంటనే నాలో ప్రవేశించును.

విశేషార్థము : జీవుడు తన అహంకారమును, అనగా పృథక్కార వ్యక్తిత్వమును, నిర్వ్యక్తిక బ్రహ్మములో లయము గావించి, ఆ బ్రహ్మమైనపుడు, అప్పుడే, తాను యథార్థమగు ఆధ్యాత్మిక వ్యక్తిగా జీవించగలడు, మఱియు పురుషోత్తముని యందు పరభక్తిని బొందగలడు. ఇక నీ పరభక్తి ప్రేమాత్మకమే కాక, వస్తు ప్రకాశకము గూడను గనుక, ఈ భక్తిమహిమచే జీవుడు పురుషోత్తముని సంపూర్ణముగా నెఱుంగును-"భక్త్యా మా మభిజానాతి". ఇది హృదయజ్ఞానము. మనస్సు తత్త్వము యొక్క ఎత్తులను దర్శించగా, హృదయము ఆతత్త్వము యొక్క లోతులను దర్శించును.ఇట్లు భక్తి మానసిక జ్ఞానమును పూర్ణముగావించును-అని శ్రీఅరవిందుడు.

జ్ఞానమున కందని లోతులు భక్తికి ద్వారము తెఱచును - అను భావము శ్రీ శంకరునిలో మన కగపడదు అయినను, పిల్లవానివలె భక్తుడు భగవంతుని అంతఃపురములోనికి సరాసరి పోవచ్చును-అని శ్రీరామకృష్ణపరమహంసయు వెల్లడించును.

పరభక్తివలన గలుగు నీ సమగ్ర జ్ఞానము హృదయమునందలి ఈశ్వర జ్ఞానము, విశ్వమునందలి వాసుదేవ జ్ఞానము, విశ్వాతీత నిత్యతయందలి పురుషోత్తము జ్ఞానము - మూడును.

ఇక్కడ నొక మాట : ఏది విశ్వాతీతమో, శ్రీ శంకరు ననుసరించి, అది అవ్యవహార్యము (incommunicable), అనగా, దానితో మనము వ్యవహరించజాలము. కాని, అట్లు కన్పించినను, నిజాని కది తన అత్యున్నత పదవియందు సైతము విశ్వక్రియ యొక్క ఆరంభక శక్తియు (10-8), సర్వభూత మహేశ్వరుడు (5-29), నగును - అని శ్రీ అరవిందుడు.

పోతే, "ఎఱింగి నాలో ప్రవేశించును" - దీని అర్థ మేమిటి ? ఎఱుంగుట, ప్రవేశించుట : ఇవి రెండు క్రియలు గావని శ్రీ శంకరుడు. జీవుడు స్వయముగా

బ్రహ్మము గనుక, ఆ సత్యమును ఎఱుంగుటయే కాని, ప్రవేశించుట - యనునది పొసగదని ఆయన వ్యాఖ్యానించును. సర్పము రజ్జువులో ప్రవేశించును - అని చెప్పుట పొసగదు గదా - అని ఆయన దృష్టాంతము నిచ్చును. ఆయనకు సమ్మత మగు సృష్టివివర్తవాదము నంగీకరించినచో, ఆయన మాట సరియైనదే యగును.

కాని, "యతో వా ఇమాని భూతాని" (తై. ఉ.), "యతః ప్రవృత్తిర్ భూతానాం" (18-46) - అను ఉపనిషద్, గీతావాక్యములు బ్రహ్మము లేక పురుషోత్తమునినుండి సృష్టి యథార్థముగా వెలువడిన దనియే పక్కాణించును. ఇక వెలువడి నపుడు, అది తిరిగి 'ప్రవేశించుటయు' సమంజసమే యగును. అనగా 'విశతే' యొక్క స్పష్టార్థమునే చెప్పుకొనవలసియుండును.

'ప్రవేశించును' = 1 లోన అడుగు పెట్టును, 2. లోలోపలకు చొచ్చుకొని పోవును - అని శ్రీ అరవిందుడు రెండు అర్థములు చెప్పును. జీవేశ్వరుల సమన్వయ జ్ఞానము చేత జీవుడు పురుషోత్తమునిలో అడుగిడును, మఱియు పరభక్తియందు పొంగులువారు పూర్ణానందముచే ఆ పురుషోత్తముని లోలోపలకు చొచ్చుకొనిపోవును, అనగా లోలోతులలో సైతము అతనితో ఏకమగును - ఆత్మానుభవమునందు అతనితో ఏకమగును; సత్తాచేతనయందును, సంకల్ప ప్రేరణల యందును అతనితో ఏకమగును; విశ్వముసందలి అతనితోను, విశ్వముతో నతనికి గల ఏకతతోను ఏకమగును; వ్యక్తి, విశ్వములకు పరమునందున్న అతనితోను ఏకమగును. ఏది పరమ జ్ఞానమునకు మూలకందమో, ఆ పరమ భక్తియొక్క పరాకాష్ఠయే ఈ సంపూర్ణ ఏకతాలాభము.

ఇది జ్ఞానలక్షణయగు భక్తి గనుక, మఱియు నీ భక్తి ఫలమును జ్ఞానమే గనుక, ఈ భక్తినిష్ఠను, అనగా వస్తుతః జ్ఞాననిష్ఠను సర్వకర్మసంన్యాసము చేతనే సాధించవలెను - అని శ్రీ శంకరుడు. ఈ మాటను తర్వాతి శ్లోకము స్పష్టముగనే కాదను చున్నది. చూడుడు ---

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయం. 56

మఱియు సదా నాయందు నిలిచి యుండి, సర్వకర్మలను చేయుటచేతను గూడ నా అనుగ్రహమువలన మనుజుడు శాశ్వత అవ్యయ పదము నందును: ఇది శ్రీ అరవిందుని అనువాదము.

సర్వకర్మలను, ప్రతిషిద్ధకర్మలను సైతము, సదా చేయుచు నన్ను అనన్యముగా ఆశ్రయించినవాడు నా అనుగ్రహముచేత శాశ్వతము, అవ్యయము నగు వైష్ణవ పదము నందును: ఇది శ్రీ శంకరుని అనువాదము.

విశేషార్థము: ఉభయులకు ఎంత వ్యత్యాస మున్నదో, వారి విభిన్న అనువాదములే మనకు దెలుపును –

'మఱియు' – అను పదము శ్లోకములో లేదు. అయినప్పటికి శ్రీ అరవిందుడు సందర్భమును బట్టి దానిని చేర్చును. దీని అర్థ మేమన, క్రిందటి శ్లోకమున జెప్పిన భక్తిచేత పరమపదము బొందవచ్చును. మఱియు ఈ శ్లోకమున చెప్పబోవు కర్మచేతను ఆ పదమును బొందవచ్చును.

'అపి' 1. కూడ, 2. అయినప్పటికి, ఇందు మొదటి అర్థమును దీసికొని, సర్వకర్మలను చేయుటచేతను గూడ, అనగా కర్మయోగి కూడ, శాశ్వత పదము నందవచ్చును అని శ్రీ అరవిందుడు చెప్పును (18-45).పోతే సర్వకర్మలను – ప్రతిషిద్ధ కర్మలను సైతము చేయుచున్నప్పటికి, ఈశ్వరానుగ్రహముచేత శాశ్వతపదము నందును–అని శ్రీ శంకరుడు వ్రాయును. నిజానికి శంకరు ననుసరించి, ఈశ్వరానుగ్రహమును ఒక దశవఱకే గనుక, ఆయన మఱియు నిట్లు చెప్పును. స్వకర్మచేత ఈశ్వరు నర్చించి నపుడు మనుజుడు ఈశ్వరానుగ్రహముచేత జ్ఞానయోగనిష్ఠకు యోగ్యతను బొందును. అటు పిమ్మట సర్వకర్మలను సన్యసించి జ్ఞానపరిపాకము బొందును. అదిగో, ఆ పరిమిత కర్మయోగప్రయోజనమును స్తుతించుటకే ఈ శ్లోక మని ఆయన సిద్ధాంతీకరించును: 'ప్రతిషిద్ధ కర్మలను చేయుచున్నప్పటికి'– అని శ్రీశంకరు డెందుకు వ్యాఖ్యానించినారో. బొత్తిగా దెలియదు. 'విగుణమగు స్వకర్మ చేయుచున్నప్పటికి (18-47)'–అని చెప్పవచ్చును గాని, ఇది ప్రతిషిద్ధ కర్మల కెట్లు వర్తించును? 'పూర్వము ప్రతిషిద్ధ కర్మలను చేసినప్పటికి' – అని (9-30) ననుసరించి చెప్పిన చెప్పవచ్చును. ఇచ్చట 'చేయుచున్నప్పటక', 'చేసినప్పటికి'– ఈ రెంటికిని గల భేదమును మనము గుర్తించవలెను. కనుక ఆయన వ్యాఖ్యాన మిచ్చుట విపరీతముగా గన్పించును.

కాని దీని స్పష్టార్థమునే శ్రీ అరవిందుడు వక్కాణించును – సర్వవిధ కర్మలను నియతముగా, నిరంతరముగా జేయవచ్చును, జీవన కార్యకలాపాలలో ఏ భాగమును పరిత్యజించుట మాట నటుంచి, తగ్గించవలసిన పనికూడ లేదు. 'సర్వకర్మాణి' – అను శ్లోకములోని పదమునకు ఇది స్పష్టార్థము. పైగా తర్వాతి శ్లోకము (18-57) దీనిని

మఱింత స్పష్టపఱచును. ఇట్టి కర్మానుష్ఠానము పరమ ఆధ్యాత్మికానుభవముతో సుసంగత మగుటయే కాక, తదనుభవమును బొందుటకు భక్తి లేక జ్ఞానము ఎంతో పటుతర సాధనమో, కర్మయు నంతే పటుతర సాధనము కాగల దని ఈ శ్లోకము నిర్ద్వంద్వముగా పక్కాణించుచున్న దని శ్రీ అరవిందుడు ఒత్తి చెప్పెను.

ఈ పటుతర కర్మయోగమునకు మూడు ప్రధాన సోపానములు గలవు– 1. మనమే కర్త – యను భావముతో ఈ సోపానమున కర్మ యొక యజ్ఞముగా జేయబడును(2-47), 2. ఆ భావముతో గాక, ప్రకృతియే ఏకమాత్ర కర్త్రి(3-27)-యను బోధముతో నిచ్చట కర్మచేయబడును, 3. పోతే, చివరి సోపానమున ఆ ప్రకృతి భగవంతుని యొక్క పరమ శక్తి – యను జ్ఞానము కలుగగా, మన సర్వ కర్మలను ఆ భగవంతునియందే సన్న్యసించి(18-57), ఆ భగవంతునికే సమర్పించుచు, కర్మ చేయబడును. ఇచ్చట వ్యక్తి ఆ కర్మకు ఒక వాహినిగాను, ఒక ఉపకరణము గాను మాత్రమే యుండును.

ఈ కర్మయోగముయొక్క స్వభావ మేమన, మనయందును, ప్రపంచము నందును గల భగవంతునితో మన ప్రకృతి యొక్క సంకల్పమును, తదితర సక్రియ భాగములను సంయుక్తము గావించి, ఆ గభీర సంయోగమున కర్మ చేయబడును. ఇట్టి సంయోగమున చేయబడు కర్మ మనలను బంధించదు సరికదా, నిమ్న ప్రకృతి యొక్క బంధనమునుండి పర ప్రకృతి యొక్క పరిపూర్ణతలోనికి మనల నుద్ధరించ నది యొక పటుతర సాధన మగును. అట్టి కర్మ, దాని బాహ్యరూప మేది యైనను పరిమిత ధర్మములనుండి తప్పించి, అమృత (12-20) ధర్మములోనికి మనల నుద్ధరించును, అనగా కర్మయందు భగవంతునితో నిచ్చటి సంయోగము భగవంతుని యొక్క కాలాతీతమగు నచ్చటి అమృతత్వములోనికి మనలను లేవనెత్తు సామర్థ్యము గలిగియుండును.

ఇట్లు ఈ 49-56 శ్లోకములు గీతాయోగము నంతను మనకు సంక్షిప్తముగానైనను, సమగ్రముగా సూచించును. ఇతః పూర్వము దివ్యగురువు మనకు ప్రసాదించిన జ్ఞానప్రకాశమున మన మీ 8– శ్లోకములను పరిశీలనగా చదివెద మేని, ఈ సంగతి మనకు స్పష్టపడును – ఇచ్చట మనకు సంపూర్ణ గీతాయోగము యొక్క తాత్త్విక భావము, ముఖ్యవిధానము, సమస్త సారము లభించును–అని శ్రీఅరవిందుడు ఉగ్గడించును.

అవతారిక : గీతాయోగ మన, అజ్ఞ ప్రకృతినుండి భాగవత ప్రకృతిలోనికి సంక్రమణము గావున –

చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ. 57

నిన్ను నీవు సర్వాత్మనా నాకు నివేదించుకొనుచు (మత్పరః), నచేతన మానసమునందు నీ సర్వకర్మలను నాలోనికి సమర్పించి, బుద్ధియోగము నాశ్రయించి, హృదయమునందును, చేతనయందును నాతో సదా ఏకముగా నుండుము.

విశేషార్థము : కర్మ చేయునట్టి ప్రకృతి భగవంతుని శక్తియే కావున కర్మ ప్రవృత్తి భగవంతునినుండియే (18-46). అనగా, నతడే తన ప్రకృతి ద్వారా మనయందు కర్మ సేయును. ఈ జ్ఞాన ముదయించి నపుడు అతని కర్మలను అతని లోనికే సమర్పించుట మనకు సహజమగును. అనగా నిపుడు మనకు సహజముగా అంతర కర్మసన్యాసము సిద్ధించును. దీనినే కర్మయోగము యొక్క తృతీయ సోపానముగా క్రిందటి శ్లోకము యొక్క విశేషార్థమున శ్రీ అరవిందుడు పేర్కొని యున్నారు.

పోతే, "నీ వేది చేయుదువో, ఏది తిందువో.... దానిని నాకర్పింపుము"(9-27)- అని చెప్పిన అర్పణయే ఇక్కడను చెప్పబడిన – దని శ్రీ శంకరుడు. కర్మలయొక్క అంతర సంన్యాసము, బాహ్య అనుష్ఠానము ఆయన మతమున లేదు గనుక, ఈశ్వరునియందు కర్మసన్యాస మన, ఈశ్వరునికి కర్మఫలత్యాగ మనియే ఆయన అర్థము చెప్పుచున్నారు. అనగా నిదియు, నేను చేయుచున్నాను – అని చేయు కర్మయోగము యొక్క ప్రథమ సోపాన మనియే ఆయన వ్యాఖ్యానము.

బుద్ధి = ప్రజ్ఞ + సంకల్పము; అనగా, బుద్ధి తెలిసికొను జ్ఞానశక్తియే కాక, ఆ తెలిసికొనినదానిని అనుష్ఠించు ఇచ్ఛాశక్తియు నగును. అనగా నెక్కడ జ్ఞాన ముండునో, అక్కడ కర్మ యుండును, ఎక్కడ కృష్ణు డుండునో, అక్కడ అర్జును డుండును (18-78) – అని శ్రీ అరవిందుడు వివరించగా, ఆత్మజ్ఞానము కర్మకు గర్భశత్రు– వని శ్రీ శంకరుడు.

(బుద్ధియోగం) 'అపాశ్రిత్య' - అని కొన్ని పాఠములు, 'ఉపాశ్రిత్య' అని కొన్ని పాఠములు. 'అపాశ్రిత్య' తప్పు గాదు, ఏలన 'వ్యపాశ్రయః'(18-56)-

అను పదమునందు 'అపాశ్రిత్య' యొక్క పుణియొక రూపము ఉండనే యున్నది. ఏలన వ్యపాశ్రయః = వి + అపాశ్రయః.

అపాశ్రిత్య-అవ+ఆశ్రిత్య = అపహాన్య + ఆశ్రిత్య, అనగా ఇంద్రియాది యోగమును దూరము చేసి, బుద్ధియోగమును మాత్రమే ఆశ్రయించి-అని అర్థము.

మచ్చిత్తః = నాయందే (భగవంతునియందే) చిత్తముగలవాడు-అని శ్రీ శంకరుడు; పోతే, చిత్తమునందు నాతో ఏకమైనవాడు, అనగా నాచేతననే తన చేతనగాగలవాడు అని శ్రీ అరవిందుడు.

చిత్తశుద్ధి కలిగిన పిమ్మట, చిత్తఏకాగ్రత కొఱకు చేయునట్టి ఉపాసనాపరమైనట్టిది శ్రీ శంకరుని అర్థము. ఈ అర్థమున చిత్తము చివరకు ఆత్మనుండి వేఱుచేసి విడిచివేయబడును. పోతే నిమ్నప్రకృతినుండి పరప్రకృతిలోనికి ఊర్ధ్వసంక్రమణమును సాధించునట్టిది శ్రీ అరవిందుని అర్థము. ఈ అర్థమున చిత్తము విడిచి వేయబడదు, అది దివ్యీకృత మగును. ఇట్లు చిన్న మార్పులో పెద్ద అంతరముః

అవతారిక : మచ్చిత్తతయొక్క మహత్త్వ మిపుడు ప్రకటించబడును-

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్ తరిష్యసి,
అథచేత్ త్వ మహంకారా న్న శ్రోష్యసి వినంక్ష్యసి. 58

ఇట్లు సదా మచ్చిత్తుడ వగుదు వేని, అపుడు నా అనుగ్రహముచేత సర్వ కష్టములను నీవు తరించెదవు. అట్లు గాక, అహంకారమువలన నీవు నా మాటను లక్ష్యపెట్ట వేని, సర్వథా నశించిపోదువు.

విశేషార్థము : "తెలియక పోయినప్పటికి ప్రజ్ఞావాదములను బలుకుచున్నావు" (2-11) - అని పూర్వమే భగవాను డర్జునుని మందలించియున్నాడు. ఆ ప్రజ్ఞావాదములకు అహంకారమే మూలము. అట్టి అహంకారమువలన నా మాట వినకుందువేని.... అని ఇచ్చటి అర్థము.

ఈ శ్లోకమునకు, (9-22) శ్లోకమునకు సన్నిహిత సాదృశ్య మున్నది అచ్చటి 'అనన్యాః'- అను పదము స్థానమున ఇచ్చట 'మచ్చిత్తః' వచ్చినది. "యోగక్షేమములను వహింతును"-అను అచ్చటి వాక్యస్థానమున 'నా ప్రసాదముచేత సర్వదుర్గములను తరించెదవు'-అని ఇక్కడ వచ్చినది. దీని ఉపపత్తి ఏమన, మన చిత్తమున మనము భగవంతునితో నిజముగా నేకమైనపుడు, మన మతడే గనుక, మన బాధ్యత అతనిదే యగును.

అవతారిక : మఱియు —

యద్యహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి. 59

ఒకవేళ నేను స్వతంత్రుడ-నను అహంకారమునందు, నేను యుద్ధము చేయ-నని నిశ్చయింతు వేని, అది నీ వ్యర్థ నిశ్చయమే యగును. కారణము, నీ స్వభావమే మెడలు వంచి, ఆ కర్మయందు నిన్ను నియోగించును.

అవతారిక : వేఱు మాటలలో —

స్వభావజేన కౌంతేయ నిబద్ధః స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి య న్మోహాత్ కరిష్య స్యవశోఽపి తత్. 60

కౌంతేయా ; నీ స్వభావమునకు సహజమైన ఏ కర్మ గలదో, అది నీ స్వకర్మ, ఆ స్వకర్మను తప్పించుకొనలేని విధముగా నీవు నిబద్ధుడవై యున్నావు-కావున తాత్కాలిక మోహావేశముచేత దేనిని జేయ నిచ్చగింపకున్నావో, ఆ యుద్ధమునే నీ వవశ్యముగా జేసితీరెదవు

విశేషార్థము : కర్మ చేయునవి ఇంద్రియములు (5-9), కాని వానిని కర్మయందు నియోగించునది స్వభావము. [మఱియు దుఃఖము ఇంద్రియములకే, కాగా స్వభావము ఇంద్రియముల సుఖమునుండి వలె వాని దుఃఖమునుండియు లాభము పొందును ] కనుక తాత్కాలిక దుఃఖభారముచే అర్జునుని ఇంద్రియములు కర్మ చేయ నిచ్చగించ కున్నను, అతని స్వభావమున వానిచేత స్వకర్మను చేయించితీరును.

అవతారిక : ఈ స్వభావమున కింత బల మెక్కడి దనిన —

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా.

సర్వభూతముల హృదయమునందును ఆసీనుడై యున్న ఈశ్వరుడు తన మాయ చేత (శరీర) యంత్రముల నారోహించి యున్న సర్వభూతములను గిరగిర త్రిప్పుచుండును.

విశేషార్థము : భగవంతుడు తన అభివ్యక్తికొఱకు సృజించుకొనినదే ఈ ప్రపంచము, మఱియు నత డీ ప్రపంచమును భూతముల స్వభావము ద్వారా

రూపొందించును. ఇదియే స్వభావమునకును, ఈశ్వరునకును ఉన్న సంబంధము. స్వభావము స్వకర్మను నిర్ణయించగా, దానిని బట్టి భూతములను ద్రిప్పువాడు ఈశ్వరుడు.

ఆత్మయే ఈశ్వరు-డని శ్రీ శంకరుడు అనేక పర్యాయములు చెప్పుచుండును (9-5),(18-66), (4-35) కాని ఇది పూర్తి సత్యము కాదు. ఏలన ఆత్మ: అనగా అక్షరాత్మ ఈశ్వరునియొక్క నిర్వ్యక్తికమగు నొక పార్శ్వము (15-17). ఈ ఆత్మ అచలము(12-3),నిష్క్రియము. ఇది సర్వసమము, మఱియు తటస్థముగా నుండి సర్వకర్మలకు కేవలము తన అనుమతి నిచ్చును-ఆ కర్మలు స్వభావసమ్మతము లైనను, కాకపోయినను అనుమతి నిచ్చును. ఇట్టి అనుమతి నిచ్చును గాన, గీత ఈ ఆత్మను ఒకచోట (5-14) 'ప్రభువు' అన్నది, కాని ఇచ్చటి 'ఈశ్వర' అర్థమున గాదు. ఈ ఈశ్వరుడు తటస్థుడు, ఉదాసీనుడు గాడు, ఇతడు మెడలు విఱిచి మనచేత స్వభావనియతమగు కర్మను జేయించును

ఈ ఈశ్వరుని గూడ గీత ఒకచోట (8-21) 'అక్షరపురుష' డనును. కారణము, ఇతడును గుణాతీతు డగుటచే అక్షరుడే. అనగా అవ్యయుడే, అమరుడే. 'అక్షరునికి భయపడి సూర్యుడు ప్రకాశించును' - అని బృహదారణ్యోపనిషత్తు చెప్పినపుడు, ఇచ్చట ఉద్దిష్టమైన అక్షరపురుషుడు ఈశ్వరుడు గాని, తటస్థమగు అక్షరాత్మ గాడు.

తటస్థ అక్షరునికిని, ఈశ్వర-అక్షరునికిని గల ఈ అతిముఖ్యమైన విభేదమును మనము గమనించనియెడల, గీత యొక్క మహోన్నతమగు త్రిపురుష సిద్ధాంతమును మనము గ్రహించనట్లే.

యంత్రారూఢాని భూతాని = యంత్రముల నారోహించియున్న భూతములను- అని శ్రీ అరవిందుడు; యంత్రముల నారోహించినట్లు ఉన్న భూతములను - అని శ్రీ శంకరుడు. కాని ఈ 'అట్లు' - అను శబ్దమును చేర్చవలసిన పని లేదు. ఏలన అహంకారమును పంచభూతములచే చేయబడిన ఒక యంత్రమే, మఱియు నజ్ఞానమున్నంతకాలము భూతములు ఈ అహంకారయంత్రము నారోహించియే యుండును.

అవతారిక : ఇతడు ఈశ్వరుడే గాక, సుహృదుడును (5-29) గావున—

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,**
**తత్ప్రసాదాత్ పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం.62**

హృదయస్థుడగు నా ఈశ్వరునే, అర్జునా, నీ సత్తయొక్క సర్వప్రకారము లందును శరణు బొందుము. అపు డతని ప్రసాదము వలన నీవు పరమ శాంతిని, శాశ్వత పదమును చేరుకొనెదవు.

విశేషార్థము : ఈశ్వరుడు జీవులను త్రిప్పును, నిజమే; కాని తన ఇచ్ఛ వచ్చినట్లు గాక, జీవుల స్వభావము ననుసరించియే త్రిప్పును. అందుచేత అట్లు త్రిప్పుటయందే ఈశ్వరానుగ్రహ మున్నది. ఇక వానిని సర్వభావేన మనము శరణు **గూడ** బొందెద మేని, ఆ అనుగ్రహఫలమగు శాశ్వత పదమును మనము అనాయాసముగను, అచిరకాలముననను (12-7) పొందగలిగెదము.

పరమ శాంతిని బొందెదవు-అని నపుడు, శాంతి = ఉపరతి, కర్మవిరామము - అని శ్రీ శంకరుడు. భగవంతుని యందు కర్మలను సన్యసించు (18-57), అట్లు అంతర నైష్కర్మ్యమును (18-49) సాధించుటచే మనకు సహజమగు ప్రశాంతి - యని శ్రీ అరవిందుడు.

మన మెందుచేత భగవంతునే శరణుబొందవలెను? మనకు దెలిసినను, దెలియక పోయినను మనయందును, ప్రపంచమునందును గల భగవంతునికొఱకే మనము జీవించుచున్నాము. ఈ జ్ఞానమునందు నివసించుట యన ఆయనను శరణు బొందుటయే యగును. ఇక నా జ్ఞానము సత్యము గాన, దానియందు మనము నివసించవలెను, అనగా ఆయనను శరణు బొందవలెను.

ఎట్లు శరణు బొందవలెను ? సర్వభావేన. ఇది సాధ్యమా ? సాంప్రదాయి కాద్వైతమున సాధ్యము కాదు. ఏలన ఆత్మ ఏకము, సర్వభావము అనేకము. కాన ఆత్మకును, సర్వభావమునకును పొత్తు ఉండదు. పోతే గీతాద్వైతమున అది సాధ్యము మాత్రమే కాక, సముద్ధారకమును. సాధ్య మేలయన, ఇచ్చట భగవంతుడు కేవల ఏకము గాదు, ఏకానేకము. మన సర్వభావములు అతని నుండియే వచ్చినవి. ఉదాహరణకు, మన సంకల్పము అతని సంకల్పము యొక్క ఒక అంకురము. కనుక మనయందలి ప్రతి భావమును అతనియందలి తన మూలముతోను శరణు బొందుట సాధ్యము, మఱియు సహజము. తర్వాత, అది సముద్ధారక మెట్లన, అట్లు సర్వభావేన శరణుబొందినపుడు, అది మనలను నిమ్నప్రకృతినుండి పరప్రకృతిలోని కుద్ధరించును, పరమ శాంతిని, శాశ్వత పదమును మన స్వత్వము గావించును.

'వినంక్ష్యసి' = వినాశమునందెదవు (18-58). తెలియ నపుడు తప్పుచేసిన, దానివలనను నాశము గలుగును. ఇప్ప డర్జునుడు ఒక నూతన చేతనలోనికి లేవనెత్త

బడెను. అహంకారిక కర్మను గాక, 'మయి సర్వాణి కర్మాణి సంన్యస్య' (18-57) - అని చెప్పి, దివ్యకర్మను జేయు మార్గ మతనికి జూపబడెను. కనుక ఈ నూతన మార్గము దెలిసియు, అతడు తప్పు జేయునేని, కర్మ చేయనని భీష్మించు నేని, అత డిపుడు మఱింత ఎత్తునుంచి పడిపోయినవా డగును, అతనికి నాశమే గాక, వినాశమును గలుగును. దాని ఆధ్యాత్మిక పరిణామములు దారుణముగా నుండును - అని శ్రీ అరవిందుడు మాత్రమే వ్యాఖ్యానించును.

57-62 శ్లోకములలో నుపయోగించిన పదములు ఆధ్యాత్మిక అనునయ భావముతో గాఢముగా స్పదించుచున్నవి. ఈ పదములు సర్వసమర్థుడైన ఒక తండ్రి దారితప్పుచున్న తన పుత్రునికి అనునయించి, హితోపదేశము చేయుచున్నట్లు గన్పించును; శ్రీ కృష్ణుడు రాయబారిగా వెళ్ళి, కౌరవసభలో పలికిన పలుకులను జ్ఞప్తికి తెచ్చును. ఇట్టి పదములు భగవంతుని యొక్క సవ్యక్తిక (personal) సత్యమునకును, సన్నిధికిని, అత్యంత ప్రాముఖ్య మిచ్చుటను మనము గమనించ వచ్చును.

భగవంతుడు కేవలము నిర్వ్యక్తిక (impersonal)ఆత్మతత్త్వము మాత్రమే యగుచో, "మత్ప్రసాదాత్" (18-58)-అను అనుగ్రహవచనమునకు అక్కడ తావే యుండదు. మన హృదయము యొక్క ప్రేమాకాంక్షలకు, మన సంకల్పము యొక్క బలవీర్యములకును అనుకూల తత్త్వము లక్కడ ఉండనే యుండవు. వీని నన్నింటిని ఇక్కడ దిగవిడచియే తదాత్మతత్త్వముతో మనము సంయోగమును సాధించవలసియుండును.

అట్లు గాక, అతడు నిర్వ్యక్తికు డగుచునే, అదే సమయమున సవ్యక్తికుడు గూడ నగుచో, అనగా నతడు నిర్వ్యక్తిక పరమపురుషు డగుచో, మన సంపూర్ణ ప్రకృతితో అతనితో మన మపుడు సంయోగము నందగలము. ఏలన మన హృదయ ప్రేమను స్వీకరించి, దానికి ప్రతిస్పందించగల పురుషు డిపుడు అక్కడ నున్నాడు. ఇట్టి సంయోగమునందు మనము నిర్వాణమునకు గుఱిచేయవలసినది మన అజ్ఞానము మఱియు నహంకారము మాత్రమే. తక్కిన మన ప్రకృతి యంతయు పరమ పురుషుని పరప్రకృతియందు పరిపూర్తి నందును. ఈ మార్గము పరిపూర్తి మార్గము గాని, నిషేధమార్గము గాదు.

కాని నిర్వ్యక్తిక ఆత్మపైన ఇట్టి పరమ పురుషు డొక డున్నా డని మన కేమి దెలియును? "ఆత్మని అథో మయి" (4-35)-అను గీతావచనమువలన. ఆత్మ

యందును, పిమ్మట నాయందును జ్ఞాని సర్వభూతములను జూచును. ఆత్మను జేరుకొని, ఆ నిర్వ్యక్తిక ఆత్మయందు పరిమిత వ్యక్తిభావమగు అహంకారమును వదలిన మనుజుడు, తనను, తన ఆధ్యాత్మిక వ్యక్తిత్వమును పిమ్మట 'నాయందు' (పరమ పురుషునియందు) కనుగొనును. ఈ పరమ పురుషుని సవ్యక్తిక అభయవచనములే మన కిక్కడ 57-62 శ్లోకములందు ప్రముఖముగా గన్పించుచున్నవి.

ఇక నీ పరమ పురుషునికి తన ప్రేమను, యజ్ఞమును అర్పించు జీవుడును అహంకారరూప ప్రాకృత పురుషుడు గాడు, కావున అతడు పరమ పురుషుని యొక్క ఒక నామము మఱియు రూపము మాత్రమే గాదు, నిర్వ్యక్తికతను స్పృశించి నపుడు విచ్ఛిన్నమైపోవు అహంకారపురుషుడు గాడు. జీవుడు పరమ పురుషుని యొక్క ఒక సనాతనాంశము (15-7), అతడును పరమ పురుషునివలె నొక ఆత్మ మఱియు పురుషుడు. అతనికిని, పురుషోత్తమునికిని గల సంబంధము శాశ్వతము. పరిపూర్ణత యందును అతడు పురుషోత్తముని యందు నిలిచి యుండును — "నివసిష్యసి మయ్యేవ" (12-8). ఇట్లు జీవుడు ఆత్మయొక్క నిర్వ్యక్తికత యందును, పురుషోత్తమునియొక్క అతీతభావమునందును ఒక కేంద్రముగనే నిలిచి యుండును గాన, అతనికి శాశ్వతమగు ఆధ్యాత్మిక వ్యక్తిత్వము గల దని మనకు తెలియును. అతనికి ఒక కేంద్ర ముండును, కాని అతని పరిధి అంతము లేని అనంతములో గలిసిపోవును—అని శ్రీ అరవింద వివేకానందు లిరువురును జెప్పుదురు. అతని కేంద్రము అతని వ్యక్తిత్వమును దెల్పగా, అతని అనంత పరిధి అతని నిర్వ్యక్తికతను దెల్పును.

ఇదియే గీతయొక్క గభీర సమగ్రత, మన అహంకారనాశమందు ఏ విశ్వీకృత నిర్వ్యక్తికతలోనికి మనము ప్రవేశింతుమో, ఆ నిర్వ్యక్తికతాసత్యమును గుర్తించుచునే, పరమోన్నత అనుభవము యొక్క ఒక అంశముగా గీత మన శాశ్వత ఆధ్యాత్మిక వ్యక్తిత్వముయొక్క సత్యమును గూడ గుర్తించును — అని శ్రీ అరవిందుడు.

అవతారిక : ఇక నిపుడు గీత తన మహావాక్యము నుచ్చరించబోవుచు, దాని మహత్త్వమును దెలుపుటకు తన బోధనలోని మూడు అంతస్సులను గుర్తించును-

**ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా,**
**విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు. 63**

ఇట్లు, అర్జునా, రహస్యముకంటెను రహస్యతరమైన జ్ఞానమును నీ కుపదేశించితిని. ముందు దీని నంతను బాగుగా విచారించి, పిమ్మట నీ కేది యిష్టమో, దాని నాచరింపుము.

విశేషార్థము : ఇచ్చట 'గుహ్యము' (రహస్యము), 'గుహ్యతరము' — అను పదములు ఆచి తూచి వాడినవే — అని చెప్పి, శ్రీ అరవిందుడు వాని నిట్లు వివరించును —

మన ఆత్మ, మన అందరియొక్క ఏకాత్మ, మన బాహ్యప్రకృతి వెనుక దాగుకొనబడి యున్నది. కనుక నది గుహ్యము. వివిధ యోగముల ద్వారా ఈ గుహ్యాత్మను మనము తెలిసికొని, దానియందు మనము అయితే సచేతనముగా నివసించవచ్చును, లేదా దానిలో లీనమై పోవచ్చును. వీనిలో నేది జరిగినను, మన ఒక మానసిక అజ్ఞానము విధించు బాధకు గురి కాము. అయినను ఈ గుహ్యము యొక్క జ్ఞానముచే మనకు సమన్వయము సిద్ధించదు, నిశ్చలాత్మయు, ప్రచల ప్రకృతియు పరస్పరవిరుద్ధములుగా గోచరించును

అయితే ఈ గుహ్యసత్యము కంటెను గుహ్యతర సత్యము మఱియొకటి గలదు, అది పురుషోత్తమ సత్యము. పురుషోత్తముడు గుహ్యతరము. ఏలన ఈ పురుషోత్తమ సత్యము సమన్వయాత్మకము. ఇతని యందు అక్షరాత్మయు విశ్వప్రకృతియు సమన్వయము నందును. ఇతడే ఆ రెండింటికిని మూలము గనుక, ఇతనియందు అవి ఏకము గూడ నగును

ఆత్మయందున్నపుడు, ఆత్మ ప్రపంచములకు మధ్య గన్పించు అఖాతము ఇతనియందున్నపుడు జీవునకు గన్పించదు: ఏలన ఇతడే ప్రపంచమయ్యెను, ఇతడే ప్రపంచమున సర్వాత్మకుడగు వాసుదేవుడుగా (7-19) నున్నాడు, మఱియు సర్వహృదయస్థుడగు నీశ్వరుడుగా (18-61) నున్నాడు, మఱియు నితడే సర్వ వస్తువుల యందును వాని నంటని ఆత్మగా (10-20) గూడ వెలయుచున్నాడు. ఇతడు విశ్వాతీతుడయ్యును, విశ్వముతో నీ బహువిధ సంబంధములను గల్గి యున్నాడు గాన, ఇతనికిని, విశ్వమునకు మధ్య నెట్టి అఖాతమును యుండదు, లేదు.

మఱియు నీ పురుషోత్తముడు కర్మను ప్రేరేపించు కాలపురుషుడు (11-32), సర్వజ్ఞానమునకు మూలమగు పరంజ్యోతి (13-18), అంతరాత్మ ప్రేమకు స్పందించు ప్రియతముడు(7-17), మఱియు కర్తృయజ్ఞముల నియామకుడగు మహేశ్వరుడు(5-29). కనుక నీ గుహ్యతరమునకు అంతరాత్మ తన బుద్ధి, సంకల్ప, హృదయములందు

ఉన్మీలిత మైనప్పుడు, దాని ఫలితము జ్ఞాన, కర్మ, భక్తుల సమగ్ర గీతాయోగ మగును. ఇట్లు సమన్వయస్థానమగు పురుషోత్తముడు గుహ్యతర సత్యము.

అవతారిక : ఇపు డిక 'గుహ్యతమ' ప్రస్తావన –

సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితం. 64

ఇపు డిక సర్వగుహ్యము (రహస్యము) లందును అత్యంత గుహ్యమగు గుహ్యతమ పరమ వచనమును తిరిగి చెప్పెదను, వినుము. నీవు నాకు నిశ్చయముగా నిష్టుడవు, అందుచేతనే నీ హితముగోరి, ఈ పరమ వచనమును బలుకుచున్నాను

విశేషార్థము: పురుషోత్తముడే పరమోన్నత తత్త్వము గదా అతనికి మించిన గుహ్యమే ముండును ? అయినపుడు క్రిందటి శ్లోకము యొక్క విశేషార్థమున పురుషోత్తముడు గుహ్యతరము, ఇక నిపుడు గుహ్యతమము వచ్చును – అని ఏల చెప్పబడినది ? ఏలన, పురుషోత్తమునికి మించిన దొకటి యున్న దని దాని అర్థము కాదు. ఇక నేమన, పురుషోత్తముని ఒక సత్యము గుహ్యతర మనియు, అతని యొక్కయే మఱియొక సత్యము గుహ్యతమ మనియు మాత్రమే దాని అర్థము. అతడు సర్వద్వంద్వముల, సర్వవిసంవాదముల సమన్వయస్థానము : ఇది అతని గుహ్యతర సత్యము. పోతే, ఒక దశకు బిమ్మట మనలో మన సాధనను అతడే స్వయముగా చేపట్టి మనకు సంసిద్ధిని చేకూర్చును : ఇది అతని గుహ్యతమ సత్యము. పిదప శ్లోకమున (18-66) అతని ఈ సత్యమే గీత యొక్క మహావాక్య రూపము ధరించును.

18-వ అధ్యాయము పూర్వ గ్రంథము యొక్క సంగ్రహవచనము మాత్రమే యని ఇతరుల అభిప్రాయము. కాని ఈ అధ్యాయమునందలి శ్రీ అరవింద దర్శనము వేఱు. ఈ అధ్యాయము, ఆయన ననుసరించి, పూర్వవిషయములనే కాక, నూతన సత్యములను గూడ ప్రవేశపెట్టును. ఉదాహరణకు, పూర్వము స్వధర్మము యొక్క ప్రస్తావన మాత్రమే రాగా (3-35), ఇచ్చట అదనముగా స్వభావముతో దానికి గల సంబంధమును జెప్పి (18-47), అది యొక సిద్ధాంతస్థాయికి లేవనెత్త బడెను. మఱియు పూర్వము గుణకర్మలను బట్టి చాతుర్వర్ణ్యము (4-13) – అని చెప్పె. ఆ గుణకర్మలు ఇచ్చట పేరుపెట్టి చెప్పబడును (18-42, 43, 44). తర్వాత నిక్కడనే స్పష్టముగా భక్తిజ్ఞానముల సమన్వయము చూపబడును (18-54, 55).

అన్నిటికంటె ముఖ్యమేమన పూర్వము స్వధర్మాది బహుధర్మ పాలనమును జెప్పి (18-45), ఇప్పుడా బహుధర్మముల పరిత్యాగము ఉద్బోధించ బడును (18-66).

మంచిది, అయితే 'తిరిగి చెప్పెదను'- అని ఇచ్చట భగవానుడేల యనును ? ఏలయన, 9-వ అధ్యాయమున 'గుహ్యతమమును జెప్పెదను' (9-1)-అని ప్రతిజ్ఞ చేసి, "మన్మనా భవ...." (9-33)-అను శ్లోకముతో ముగించును. కొద్ది మార్పుతో ఈ శ్లోకమే మఱల నిచ్చట ప్రోక్తమగును (18-55). అందుచేతనే 'తిరిగి చెప్పెదను'-అని నుడివెను కాని ఇది గీతామహావాక్యమునకు పూర్వాంగము మాత్రమే వాస్తవ గీతామహావాక్యము "సర్వధర్మాన్ పరిత్యజ్య...." అను శ్లోకము మఱియు నిది అనుక్తపూర్వము, అత్యుత్కృష్టము. కాన ఇవ్విషయమునను శ్రీ అరవిందుని అభిప్రాయమే సమంజసము.

'ఇష్టుడవు గనుక గుహ్యతమమును వెల్లడించుచున్నాను' : ఇచ్చట ఇష్ట-శబ్దమున కర్థము 'కాకి బిడ్డ కాకి కిష్టము'-అనునది గాదు. మఱి యేమన, "తాను వరించిన జీవునకు మాత్రమే భగవానుడు తన తనువును జూపును" (క. ఉ ).-అను ఉపనిషద్వాక్యమున ఏ 'వరించుట' గలదో, అదియే ఇచ్చటి ఇష్ట-శబ్దమున కర్థము- అనగా, తన కిష్టుడైన వానికే, తాను వరించిన వానికే భగవంతుడు తన సత్యమును ప్రకటించును. ఇక నెవనిని భగవంతుడు వరించు ననిన, ఎవడు భగవంతునికి మనః ప్రాణ హృదయములందు అత్యంత సన్నిహితుడో, అతడే గుహ్యతమమును సజీవానుష్ఠానములోనికి రూపొందించుకొనగలడు గాన, అతనినే వరించును - అని శ్రీ అరవిందుడు మాత్రమే ఇష్ట-శబ్దమునకు ఉపనిషదర్థమును జెప్పును.

అవతారిక : సంవరణమునకు సాన్నిహిత్య మ్షర్తగా జెప్పబడెను గదా, పోతే ఆ సాన్నిహిత్య మెట్లు సిద్ధించు ననిన –

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. 65

నా యందు మనస్సుగలవాడవు గమ్ము, నా భక్తుడవు మఱియు అనురక్తుడవు గమ్ము, నాకు యజ్ఞము చేయువాడవు గమ్ము మఱియు నాకు నమస్కరింపుము. అపుడు నన్నే పొందగలవు : ఇది సత్యము. నీవు నా ప్రియుడవు గాన, ఈ సత్యమును ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను.

విశేషార్థము : శ్రీకృష్ణుడు, నేను-అని నప్పుడెల్ల, ఆ 'నేను' పురుషోత్తమునే పరామర్శించును. అంతదనుక ఈ సత్యము గుప్తముగా నుంచబడినను, 15-వ అధ్యాయమున వ్యక్తము చేయబడినది (15-18). ఇక నీ పురుషోత్తముడు కురుక్షేత్ర రథసారథి మరియు గురువుగా జేయు బోధ వేఱు, తానే మానవునియందలి పురుషుడు మరియు భగవంతుడుగా జేయు ఉపదేశము వేఱు ఒకటి ప్రభుసమ్మితము, రెండవది కాంతా సమ్మితము-నని మనము స్థూలముగా జెప్పుకొనవచ్చును.

మొదటిదానియందు సాధకుడు గురువు దెలిపిన స్వధర్మాదికము నవలంబించి (18-41) స్వప్రయత్నము చేత సిద్ధి బొందజూచును. ఇక రెండవదానియందు ఆ పురుషోత్తముడే తన ప్రియుడుగా జేయు ఉపదేశము ననుసరించి, సాధకుడు సర్వాత్మగా తన ప్రియుని శరణుపొంది, తన సాధనాభారము నతనికే వదలి వేయును.

పోగా, ప్రస్తుత శ్లోకము ఈ రెండు విధానాలకు మధ్యనుండు పొలిమేరలోని వస్తువు. ఏలన, ఇందులో భగవంతుని ఆశ్రయించుటకు దారితీయు స్వప్రయత్నమింకను ఉన్నది. "నన్నే పొందగలవు" - అనే పదమే ఈ స్వప్రయత్నమును సూచించును.

కాగా ఈ స్వప్రయత్నమునందు, స్వప్రయత్నముచేతనే "నా యందు మనస్సు గలవాడ వగుము " - ఇది పూర్తిగా స్వప్రయత్నము గాదని తెలియవచ్చును. కనుక నిది ఉభయ విధానములకు పొలిమేర భూమి యని చెప్పుకొనవచ్చును

తర్వాత, "మన్మనా భవ" – నా యందు మనస్సు నుంచుము - అని కొందరు చెప్పగా, "మన్మనా భవ" = 1. నా యందు మనస్సు గలవాడవు గమ్ము, 2. నా మనస్సునే నీ మనస్సుగా గలవాడము గమ్ము - అని శ్రీ అరవిందుడు ఎంతో అంతరము ! ఇతరుల అర్థము శ్రీ అరవిందుని మొదటి అర్థమునకు దారితీయగా, సంపూర్ణ సమర్పణచేత ఈ మొదటి అర్థము రెండవ అర్థములో పర్యవసించును.

"నమస్కురు" – అనునది ఇచ్చట ఆవశ్యకమగు సంపూర్ణ సమర్పణను దెలుపును.

"మామే వైష్యసి" = నన్నే చేరెదవు (పొందెదవు) ఇచ్చటి 'చేరెదవు' చాలా సరళార్థకముగా గన్పించును. కాని అందులో నొక నిగూఢ ఆధ్యాత్మిక రహస్యమున్నది. ఇది శ్రీ అరవిందదర్శనములోని ఒక కీలక సత్యము.

స్వప్రయత్న మావశ్యకమే–"ఉద్ధరే దాత్మ నాత్మానం" (6–5). కాని ఇట్టి స్వప్రయత్నముచేత నొక దశ యొక్క పొలిమేరను జేరుకొనినపుడు, ఉదాహరణకు, సత్త్వగుణము యొక్క పొలిమేరను జేరుకొనినపుడు, ఎంత ప్రయాసపడినను, ఎంత గిజగిజ కొట్టుకొనినను, స్వప్రయత్నము చేతనే గుణాతీత భూమికలో నడుగుపెట్టుట సాధ్యము కాదు, కాదు. ఇట్టి యెడ భగవంతుని జ్యోతి, సన్నిధి మఱియు శక్తి మనలోని కధికాధికముగా నవతరించి, చేయూత నిచ్చి మనలను ఉద్ధరించవలెను. ఈ అవతరణ లేనిచో, పొలిమేర స్థానమునందును,దాని కావలను పరిపర్తనము సాధ్యము కాదు. ఈ కారణముచేతనే సాధన యొక్క చరమగతిగా ఒక పరిపూర్ణ ఆత్మ సమర్పణ యొక్క ఆవశ్యకత మన కన్నెదుట నిలుచును–అని శ్రీ అరవిందుడు తన గభీరానుభవమును దెలుపును.

కనుక "నన్నే చేరెదవు" - అని నపుడు, స్వప్రయత్న మిక ప్రసరించని స్థానమున, నీ వాత్మసమర్పణము గావించుకొనవలెను. అప్పుడు నేను నీలోని కవతరించి, నిన్ను ఉద్ధరించగా. నీవు నన్ను చేరెదవు - అను నర్థ మంతయు ఆ 'చేరెదవు' లో నున్నది. ఇదిగో, ఈ సమర్పణమును, సముద్ధరణక్రియను తర్వాతి శ్లోకము మన కుపదేశించును.

ఇట్లుండ (12–12) శ్లోకము క్రింద శ్రీ శంకరు దేమి చెప్పెనో. గమనించ దగును. అక్షరోపాసకులు (12-3) స్వతంత్రులు, వారు స్వతంత్రముగనే కైవల్య ప్రాప్తి నందగలరు. పోతే భేదదర్శులగు ఇతరులు, కర్మయోగులు, పరతంత్రులు. అందుచేతనే "తేషా మహం సముద్ధర్తా" (12–7) – అని వారికి ఈశ్వరాధీనత చెప్పబడినది! దీనికి సమాధాన మేమన, శ్రీ శంకరుడు చెప్పిన కైవల్యము శ్రీ అరవిందుని పరమ లక్ష్యమగు సంసిద్ధి (14-2) గాదు. ప్రకృతినుండి ముక్తిరూప మగు కైవల్యమునకు భగవంతుని సాయము ఆవశ్యకము గాకపోవచ్చును గాని, ప్రకృతిసంసిద్ధిరూపము గూడ నగు దివ్యస్థాన (18-62) ప్రాప్తికి భగవంతుని ఉద్ధారక హస్తము పరమావశ్యకము.

నిజానికి శంకరు డపేక్షించు 'నిర్వాణశాంతి'(6–15)సైతము 'నా అధీనము' – "మత్సంస్థాం" (6-15) – అని భగవానుడు ఒకచోట చెప్పియున్నాడు గదా, అయినపుడు అక్షరోపాసకుల స్వాతంత్ర్య మెక్కడ?

మఱియు, "ఉద్ధరే దాత్మ నాత్మానం"లో పారతంత్ర్యము లేనపుడు, మన అత్యున్నత ఆత్మయే (15–17) యగు ఈశ్వరు నాశ్రయించుట మాత్రము ఎట్లు పారతంత్ర్య మగును?

శ్రీ శంకరుడు పరకాయప్రవేశము చేయదలంచి నప్పుడు, ముందు కొన్ని ప్రబోధక శ్లోకములు రచించి పెట్టుకొనె నట. మఱియు, "నేను రాజశరీరమున ప్రవేశించి, మాయకు లోనై, నా నిజస్థితిని, మఱచిపోయిన పక్షమున, ఈ శ్లోకములను పఠించి, నాకు ప్రబోధమును గల్గించవలెను." అని శిష్యుల కానతిచ్చెనట శిష్యులును అట్లే చేసి రట. ఇచ్చట శ్రీ శంకరునికి సాయపడినది మాయకు ముందున్న తన ప్రబుద్ధాత్మ గదా. అట్లే మన ప్రబుద్ధాత్మయగు పరమాత్మ మనకు సాయపడిన అది పారతంత్ర్య మెట్లగును?

నీరు నిర్వ్యక్తికము. కాన ప్రేమవశమున అది స్వయముగా మన కడకు రాదు. దానిని తెచ్చి, మనమే తెచ్చి, చెట్టునకు పోయవలసి ఉండును. పైగా, నన్ను మీ చెట్టునకు పోసిన, అది మీకు అమృతఫలముల నిచ్చు నని, అది మనకు ప్రతిజ్ఞ చేసి చెప్పదు. కాని ఇచ్చట భగవంతుడే స్వయముగా వచ్చి, భక్తుని బుజ్జగించి, నీ కిది హితము-అని ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాడు. ఈ మాట భగవంతుని యొక్క సవ్యక్తిక సత్యమును ఎంతగా మనకు కన్నులకు గట్టినట్లు చెప్పుచున్నదో గమనించదగును. ఇట్టి భగవంతునియందు మనకు నిర్వ్యక్తిక ముక్తియే గాక, సవ్యక్తిక ప్రకృతి యొక్క పరిపూర్ణతయు ప్రాప్తించును. నేతి నేతి-మార్గమునందు వలె ఇచ్చట మనము మన ప్రకృతిని బలిపెట్టవలసిన అగత్యము లేదు, ఇచ్చట మనము బలిపెట్టవలసినది మన అజ్ఞానాహంకారములను మాత్రమే. "మన్మనా భవ...."కు శ్రీ అరవిందుడు చెప్పిన 2-వ అర్థము ననుసరించి, మన గుణమయ ప్రకృతి భగవత్ ప్రకృతిలో పర్యవసించును.

అవతారిక : "మన్మనా భవ...." - ఈ శ్లోకము దేనికి పూర్వాంగమో, అట్టి గుహ్యతమమైన గీతా-మహావాక్య మిపుడు మనకు ప్రోక్తమగును -

**సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.66**

సర్వధర్మములను పరిత్యజించి, నా ఒక్కనియందే శరణు బొందుము. అపుడు నేను నిన్ను సర్వ పాపము మఱియు నశుభమునుండి విడిపించెదను. కావున శోకింపకుము.

విశేషార్థము : ఇదిగో, ఇదియే మన మెదట చూచిన గీత యొక్క పరమ వచనము (18-64). గీతామహావాక్యము, భగవాను డీ పరమ వచనము నుచ్చరించు

చుండగా, ఇదిగో, ఈ పర్యవసానమునకే మానవాత్మ ఇంతదనుక ఆయత్తము చేయ బడుచు వచ్చినది, తక్కిన దంతయు దీనికి బాట జూపుచు, సామర్థ్యము నిచ్చు ఒక సాధనావిధానము మఱియు సిద్ధాంతప్రతిపాదనము - నని మన కనిపించును - అని శ్రీ అరవిందుడు తన హృదయస్పందనను దెలుపును.

ఇది తన మహావాక్యమే యైనను, గీత దీనిని మఱి ఎట్టి వ్యాఖ్య గాని,విస్తరణ గాని లేక విడిచివేయును కారణము ? దీనియందు గల అర్థపూరము, అనంతార్థము అంతరాత్మ యొక్క సంతతవర్ధమాన అనుభవమునందే వ్యక్తము కాగలదు గాని, దాని మానసిక ప్రతిపాదనమునందు గాదు.

ఇప్పుడు దిఙ్మాత్రముగా గీతాప్రణాళిక నిట్లు మనము గుర్తించవచ్చును - మున్ముందు గీత ఒక సునిర్మిత యోగమార్గమును మనకు జూపును. తర్వాత తదనుష్ఠానమునందు మన బుద్ధికి బోడము శంకలను బాపుటకు ఒక సువిశాల దార్శనిక సిద్ధాంతమును ప్రతిపాదించును. పోతే యోగము వస్తుతః ధర్మానుష్ఠానమే గాన, గీత స్వధర్మాది, ఉత్తరోత్తర విశాలతర ధర్మములను గట్టిగా ఒత్తి చెప్పును.ఆ యా ధర్మానుష్ఠానమునకు దోహదము చేయు అనేక నియమములను, విధులను వక్కాణించును. చివరకు తన ధర్మనిర్మాణమునే తాను భంగించి, "సర్వధర్మములను కొట్టి వేయుము, కొట్టివేసి ఒక్క భగవంతునికి మాత్రమే నిన్ను నీవు నివేదించుకొనుము: నీవు చేయవలసిన దంతయు నిదియే. ఇదియే సత్యము, బృహత్తమ మార్గము, ఇదియే వాస్తవ విమోక్షము" అని ముగించును.

ఇతర మతము లన్నియు తమ మతధర్మముయొక్క పరిధిలో సాధకుని పట్టి యుంచగా, గీత అతనిని ధర్మాతీతమునందలి పరమ స్వేచ్ఛలోనికి వదలివేయును. ఈ ధర్మాతీత పరమ స్వేచ్ఛయే గుహ్యతమ ఆధ్యాత్మిక సత్యము.

మంచిది, కాని భగవంతునియందు ఆశ్రయము గొనుటయు నొక ధర్మము గాదా ? కాదు, ఏలన పరమ స్వేచ్ఛయే భగవంతుని స్వరూపము. అట్టి భగవంతుని ఆశ్రయించుట పరమస్వేచ్ఛలో పర్యవసించును గాని, ఒక పరిధిలో బంధించి యుంచదు ఇక పరమ స్వేచ్ఛయే భగవంతుని స్వరూప మేలయన, భగవంతుడు ప్రపంచమును కొన్ని నిగూఢ నియమముల ననుసరించి నడుపు చున్నను, మానవుని తన జ్ఞానాజ్ఞానములు పుణ్యపాపములు, యుక్తాయుక్తముల ధర్మముల ననుసరించి ఉద్ధరించుచున్నను, అతడు మాత్రము వీని నన్నింటిని అతిక్రమించియుండును. కనుకనే అతని స్వేచ్ఛకే క్షతియు నుండదు.

"సర్వధర్మాన్ పరిత్యజ్య" =సర్వధర్మములను పరిత్యజించి,దీనికి సర్వఅధర్మములను గూడ పరిత్యజించి-అని శ్రీ శంకరుడు కలుపును. నైష్కర్మ్యము లక్ష్యము గనుక, అట్లు అధర్మములను గూడ పరిత్యజించుట అవశ్యక మని ఆయ నను.

నైష్కర్మ్య మనగానే, బాహ్య నైష్కర్మ్య మను భావము శ్రీ శంకరుని విడువదు. గీత చూపిన కర్మాకర్మల సమన్వయము నాయన పట్టించుకొనరు కనుక సర్వధర్మపరిత్యాగ మన సర్వకర్మసంన్యాసమే యని ఆయన చెప్పును.

పోతే, సర్వధర్మము లన, బాహ్య ధర్మములు, శాస్త్రధర్మములు, మానసిక ధర్మములు, చివరకు స్వభావధర్మములు – అని శ్రీ అరవిందుడు. ఏలన, అట్లు వానిని పరిత్యజించిననే గాని, నీవు సర్వాత్మనా భగవంతుని ఆశ్రయించజాలవు, అతనికి సర్వ సమర్పణ చేసికొనజాలవు. ఇక నట్టి సమర్పణ చేసికొనిననేగాని, భగవచ్ఛక్తి నీ యోగమును చేపట్టి, నీలో పనిచేయదు. ఏలన, అది అజ్ఞానము విధించు ధర్మములకు లోబడి పనిచేయదు, ఒకవేళ చేసిన, తన ఆశయమే భగ్నమగును. ఇదిగో, "సర్వధర్మాన్ పరిత్యజ్య"కు, "మా మేకం శరణం"కు "అహం మోక్షయిష్యామి"కి మధ్యనున్న క్రమగత సంబంధ మిదియే.

"మా మేకం శరణం వ్రజ" = నన్ను ఒక్కనినే శరణు బొందుము. ఇచ్చటి 'నేను' నకు శ్రీ శంకరు డేమి అర్థము జెప్పును? గర్భజన్మజరామరణ విపరీతము, సమము నగు సర్వాత్మయే ఇచ్చటి నేను, అదియే ఈశ్వరుడు – అని ఆయన వ్యాఖ్యానించును. 'శరణు బొందుము' అనగా ఈశ్వరనామకమగు ఆ సర్వాత్మను నేనే, నాకంటె అన్య మేమియు లేదు – అని నిశ్చయించుము : ఇది శ్రీ శంకరుడు చెప్పిన అర్థము. దీని నంతను జూడ, ఈ శ్లోకమును అక్షరోపాసకుల 'అహం బ్రహ్మాస్మి'తో ముడిపెట్టుచున్నా రని మనకు స్పష్టమగును.

ఈ అక్షరోపాసనయందు జీవుని జీవత్వమును, ఈశ్వరుని ఈశ్వరత్వమును, వానిని ఉపాధులుగా భావించి, నేతి నేతి ప్రక్రియద్వారా నిషేధించివేయవలెను. అపుడు నిర్విశేషమగు శుద్ధచైతన్యము మాత్రమే మిగులును. ఆ చైతన్యము నందు ఉభయులు ఏక మగుదురు, అథవా వేఱుమాటలో అచ్చట జీవుడు గాని, ఈశ్వరుడు గాని యుండడు కాని, జీవుడు సంసిద్ధియందు ఈశ్వరునితో తాదాత్మ్యమునే కాక, సాధర్మ్యమును(14–2)గూడ బొందు నని చెప్పు గీతాదర్శనమునకు శ్రీశంకరుడు చెప్పిన దిది యంతయు విరుద్ధ మగును.జీవుడు తన యొక్క గుణభావము స్వభావము మఱియు బ్రహ్మభావము (18–54) ద్వారా పయనించి, 'మద్భావము' (13–19), అనగా భగవద్భావమును బొందును-అనునదియే గీతాసిద్ధాంతము.

"నన్ను ఒక్కనినే శరణు బొందుము"-ఇచ్చటి 'ఒక్కనినే' లోని స్వారస్య మేమియన, నీవు నీ మనస్సును, నన్ను గూడ శరణు బొంద దలించిన,అది పొసగని విషయ మగును; నా జ్ఞానమునకు, మనస్సుయొక్క అజ్ఞానమునకు పొత్తు కుదురదు గదా. దాని నిబంధనలకు లోబడి, నేను నీకు విమోక్షమును సాధించలేను. కావున నన్ను ఒక్కనినే శరణు బొందుము — అని భగవానుని భావము. ఇట్లు, సర్వ ధర్మములను బరిత్యజించి నన్ను శరణు బొందుము — అనిన, సర్వ ధర్మములను బరిత్యజించకపోయిన, నన్ను శరణు బొంద లేవని భావము. అంతే కాని, ఏ ధర్మములను పాలించక పోయినను, నన్ను శరణు బొందిన చాలును — అని దాని అర్థము కాదు.

తర్వాత, నేను నిన్ను విడిపింతును — "అహం త్వా మోక్షయిష్యామి". ఇక్కడ మన మింకొక లోకములో ప్రవేశించుచున్నాము, మానవ లోకమునుండి దివ్యలోకములో నడుగిడుచున్నాము. ఏలన మనలోని పురుషుడు, మఱియు భగవంతుడు మన కిటుల దెలుపుచున్నాడు — "ఈ సర్వవిధ పురుషకారము (స్వప్రయత్నము) మఱియు స్వశిక్షణము చివరకు అవశ్యకము గాదు, నియమములు మఱియు ధర్మముల అనుష్ఠానమును, అవి కల్పించు పరిమితత్వమును నీవిపుడు త్రోసివేయవచ్చును. త్రోసివేసి, నాకు సమగ్రముగా ఆత్మార్పణము జేసికొన్నచో, నీ యోగమును నేనే చేపట్టెదను. నీవు నా చేతిలో ఒక తటస్థ ఉపకరణము వగుము. అపుడు చేయవలసిన దంతయు నేనే చేసి, నీకు సంపూర్ణ విముక్తిని ఘటింతును"-అని మన హృదయేశ్వరుడు మనకు ఆశ్వాస మిచ్చును, వాగ్దానము చేయును. ఇదిగో, ఇది స్వప్రయత్నమునుండి ఈశ్వర ప్రయత్నములోనికి చేయబడు సంక్రమణము.

అసలు కేవల స్వప్రయత్న మనునది లేనేలేదని తెలిసికొనగల ఒక సమయము వచ్చును. ఏలన మనలో నుపస్థితుడైన ఈశ్వరుడు లోనుండి నీరవముగా మనలను నిర్బంధించుచుండ, ఆ నిర్బంధము బుట్టించు మన మానసిక, ప్రాణిక ప్రతిక్రియలనే స్వప్రయత్న మనియు, స్వకర్మ మనియు మనము ఘనముగా పిలుచుకొందుము.

"సర్వకర్మలను నా యందు సన్న్యసించి చేయుము" (3-30)-అని పూర్వము చెప్పి, ఇపుడు "నా చేతిలో నొక ఉపకరణము వగుము" — అని మఱియొక మెట్టు పైకి గొనిపోవుచున్నాడు. అపుడు ప్రేరణ నాది, కర్మ నీది, ఇపుడు ప్రేరణ, కర్మ-రెండును నావే. ఇది అంతఃసన్న్యాసముయొక్క పరాకాష్ఠ. ఇట్లుండ జ్ఞానికి అంతఃసన్న్యాసము బాహ్యకర్మ — అనునవి సాధనములు కావు-అని శ్రీ శంకరుడు.

ఆత్మకు పైన కర్మను ప్రేరేపించు ఈశ్వరుడు లేనిచో, ఆత్మతో తాదాత్మ్యము పొందిన జ్ఞాని విషయమున శ్రీ శంకరుడు చెప్పినదే సత్యమగును.

ఒక వైపున ఈశ్వరుని ఆత్మగా జమకట్టుచునే, శ్రీ శంకరుడు మఱియొక వైపున అజ్ఞానాంధకారమును జ్ఞానదీపముచే హృదయస్థుడైన ఈశ్వరుడు నాశము చేయు (10-11)-నని చెప్పును. ఇది పొసగని మాట. ఏలన ఆత్మ నిరీహము, కావున అది అజ్ఞానక్రియను సైతము తటస్థముగా అనుమతించునే గాని, అజ్ఞానమును నాశ మొనరించదు. ఈ నాశనము చేయు క్రియ ఈశ్వరానుగ్రహము. అయి నప్పుడు ఆత్మయే ఈశ్వరు డెట్లగును?

ఇపుడు మఱియొక ప్రశ్న: సరే, ఈశ్వరుడు విముక్తిని కల్పించును; అయితే 1. దేనినుండి, 2. దేనిలోనికి విముక్తిని గల్పించును?

1. "సర్వపాపేభ్యః" = సర్వపాపములనుండి. ఇక పాపము లన ధర్మ అధర్మరూప బంధనములు, ధర్మాధర్మమూలములగు కర్మబంధనములు - అని శ్రీ శంకరుడు. చివరకు కర్మచేతనే శరీరప్రాప్తి మఱియు నాయన మతమున శరీరమే బంధనము గాన, ఆయ నట్లు చెప్పును. 2. ఇక దేనిలోనికి ముక్తి? ఈ ప్రశ్నను ఈ విధముగా లేవదీసినవాడు బహుశః శ్రీఅరవిందు డొక్కడే. శ్రీశంకరుడీ ప్రశ్నకు సూటిగా సమాధానము చెప్పినట్లు మనకు తెలియకపోయినను, ఆయన చేయు ముక్తివర్ణనను బట్టి, ముక్తియందు కర్మ లుండవు గాన, ఈ ముక్తి నిష్క్రియాత్మలోని కని ఆయన చెప్పకయే చెప్పినట్లగును. ఒక్క మాటలో ఈశ్వరుడు కర్మలనుండి నిష్క్రియాత్మలోనికి మనలను విడిపించును: ఇది శ్రీ శంకరుని మతము.

కాగా, నిజానికి, గీత యేమి చెప్పును? "మద్భావ మాగతాః" (4-10), "మమ సాధర్మ్య మాగతాః" (14-2)-అనగా అనేకులు నా భావమును బొందిరి, నాతో సమానధర్మమును బొందిరి. పోతే, భావము = 1. సత్త, 2. సంభూతి. కావున అనేకులు సత్తయందు నాతో ఏకతను, ప్రకృతియందు నా సంభూతిధర్మమును బొందిరి-అని పై రెండు ఉదాహరణల అర్థము.

భగవంతునికి సత్తాసంభూతులు, రెండును గలవు. సత్త యన మనకు తెలియును. పోతే సంభూతి యన సత్తకు ఏ శక్తి గలదో, ఆ శక్తిప్రవాహము, అభివ్యక్తియందు ఆ శక్తి యొక్క రూపధారణము. వేఱు మాటలలో. ఈ సృష్టి ప్రవాహము భగవంతుని సంభూతి పార్శ్వము.

కావున గీత ననుసరించి, దేనిలోనికి ముక్తి యన భగవద్భావము లోనికి ముక్తి, అనగా భగవంతుని సత్తాసంభూతులలోనికి ముక్తి. మఱియు దేనినుండి ముక్తి యన అపర ప్రకృతి యొక్క మాయనుండి ముక్తి (7-14). ఇట్లు ఈశ్వరుడు నిమ్న ప్రకృతి యొక్క మాయనుండి మనలను తనలోనికి విడిపించును. ఈ ముక్తి నిష్క్రియము గాదు. ఇందు ఆంతర నైష్కర్మ్యము, బాహ్య కర్మాచరణము, రెండును ఉండును – "కర్తారం అకర్తారం" (4-18); ఇదిగో, ఇది శ్రీ అరవిందు వ్యాఖ్యానము.

ఇదియే సత్యతమము, మహత్తమము నగు ముక్తియని శ్రీ అరవిందుడు. ప్రకృతి–అనేకత్వము సత్యము, ఆ అనేకత్వమునకు ఆధారమగు ఆత్మ – ఏకత్వము సత్యతరము. ఈ రెండింటికి సమన్వయస్థానము, ఈ రెండింటికి అతీతము నగు పురుషోత్తమ తత్త్వము సత్యతమము. ఇట్లు పురుషోత్తముడు సత్యతముడు, మహత్తముడును గావున, అతనిలోనికి ముక్తియు సత్యతమము, మహత్తమము నగును.

ఈ ముక్తియందు అంతరాత్మ కర్మకు బద్ధము కాదు సరే, అకర్మకును బద్ధము గాదు(2-47), (3-18). కావున ఈ విముక్తియందు మన ఆత్మ, ప్రకృతులు–రెండును పరిపూర్ణ సంసిద్ధిని (perfection) బొందును, అంతే కాదు ఈ విముక్తి ఆ సంసిద్ధిని అనివార్యము సైతము గావించును – అని శ్రీ అరవిందుడు. ఈ విముక్తి యందు ప్రకృతిసంసిద్ధి కావశ్యకమగు కర్మ–తన విశాలార్థమున కర్మ–గలదు గాన, మఱియు ఈ నీ కర్మ ఈశ్వరప్రవర్తితము గావున, ఇచ్చట సంసిద్ధి అనివార్యము.

ఇచ్చట యోగేశ్వరుడగు కృష్ణుడే (18-78) మన యోగమును చేపట్టెను గాన, అతడు మానసికమగు మన కుంటి విజ్ఞానము ననుసరించి కాక, అతిమానసమగు తన కృత్స్న విజ్ఞానము ననుసరించి మన యోగమును నిర్వహించును గాన, ఇచ్చట సంసిద్ధి అనివార్య మగును.

చివరకు, "మా శుచః" = శోకింపకుము. పాపములనుండియు, అవి కల్పించు కష్టములనుండియు నిన్ను గట్టెక్కించెదను, కావున శోకింపకుము : ఇది సామాన్యముగా నందరు చెప్పు అర్థము.

కాని అర్జునుని కస లెందుకు దుఃఖము కలిగెను ? "అర్జునా ! ఏమిటీ నిర్వీర్యతే ? లెమ్ము, నడుము కట్టుము !" (2-3)–అని భగవాను డుద్బోధించి నపుడు, "పూజ్యులగు

భీష్మ ద్రోణులను, కృష్ణా, చే జేతుల నే నెట్లు చంపగలను ?''--అని అర్జునుడు మొఱ పెట్టుకొనును భగవంతుని ఆదేశము లేక ఉపదేశము వేఱుగను,తన బుద్ధికిదోచుధర్మము వేఱుగను గన్పింప, అతడు భగవదాదేశమును మున్ముందు పాలింపలేకపోయెను. అదియే అతని శోకమునకు గారణము.అందుచేత భగవానుడిపుడు ఈఅభయము నిచ్చుచున్నాడు- "నీ అంతరాత్మ, ప్రాణ,కర్మలను చేపట్టి నా ఇష్టము వచ్చినట్లు, వానిని మలచనిమ్ము. నీ సముద్ధరణకై నేను నీతో వ్యవహరించు మార్గము మానవుడు తనపై విధించు కొను పరిమిత ధర్మముల ననుసరించకపోవచ్చును. అంతమాత్రముచేత కలవర పడకుము, వ్యథ జెందకుము, శోకింపకుము. నా మార్గము పరిపూర్ణ శక్తి ప్రేమ విజ్ఞానముల మార్గము. అది కృత్స్నదృష్టితో విశ్వవ్యాపారమునందు అంతర్భాగముగా నీ పాత్రను నిర్ణయించు మార్గము. నీ కా కృత్స్న దృష్టి లేదు గనుక, నీ కా మార్గము విపరీతముగా గోచరించవచ్చును. అయినను శోకింపకుము. ఎట్టి కష్టములు ఎట్టి సందేహములు ఎదురైనను, విశ్వప్రకృతియందు ఒక సంపూర్ణ దివ్యజీవనమునకును, విశ్వాతీత ప్రకృతియందు ఒక అమరఅస్తిత్వమునకును నిన్ను నడుపు చున్నానని గట్టిగా నమ్ముము సందేహింపకుము, భయపడకుము, శోకించకుము." ఇదిగో ఇదియే ఇచ్చటి 'శోకింపకుము' యొక్క అర్థ-మని శ్రీఅరవిందుడు వ్యాఖ్యానించును.

ఒక్క మాటలో, అర్జునుని శోకము తన స్వీయ కష్టములను గుఱించి కాదు, తన బుద్ధికి అధర్మముగా దోచు ఘోరకర్మ చేయవలసివచ్చిన దను చింతయే అతని శోకమునకు కారణము.

ఇపుడు మఱల శ్లోకము యొక్క మొదటి భాగమునకు వచ్చి, "సర్వధర్మాన్ పరిత్యజ్య" ను గుఱించి శ్రీ అరవిందుడు ఆవిష్కరించు మఱి కొన్ని లోతులను చూతము. ఇది ఆయన అపూర్వానుభవమునుండి వెలువడిన వచ్చిన వ్యాఖ్యాన మని మన కనిపించును. చూడుము -

"సర్వధర్మములను పరిత్యజించి" = కర్తవ్య కర్మవిషయమున బాహ్య మఱియు మానసిక ధర్మముల నన్నింటిని పరిత్యజించి-అని సామాన్యార్థము కానిసందర్భమును జాగ్రత్తగా పరిశీలించి నపుడు, మనకు బోధము విశేషార్థ మేమన, భగవంతుని కిది సమర్పించదగును, ఇది సమర్పించరాదు - అని మనమనుకొను సర్వధర్మము లను పరిత్యజించి- అని ఈ విధముగు సర్వధర్మములను బరిత్యజించి, భక్తుడు తన మంచిచెడుల, రెండింటిని, నిస్సంకోచముగా భగవంతునికి సమర్పించవలెను. అపుడు భగవంతు డా ముడిసరుకును సంతోషముగా స్వీకరించి రూపాంతర మొందించును-

అని శ్రీ అరవిందుడు చెప్పి, మఱియు నా రూపాంతరీకరణ ప్రకారము నిట్లు దెలుపును -

భగవంతుని సర్వజ్ఞ చేతన, మన జ్ఞానమును, అటులే మన అజ్ఞానమును, మఱియు మన సత్యమును,అటులే మన భ్రమను స్వీకరించి, వాని అపూర్ణతారూపము లను బరిత్యజించివేయును - "సర్వధర్మాన్ పరిత్యజ్య" మఱియు తాను స్వీకరించి చేపట్టిన ఆ సర్వమును దాని (మూలమగు) అనంత జ్యోతిలోనికి రూపాంతర మొందించును.

ఇక్కడ మనము గమనించవలసిన దేమన, "సర్వధర్మాన్ పరిత్యజ్య"-అను పదమును శ్రీ అరవిందు డిచ్చట భగవంతునకు గూడ వర్తింపజేయుచున్నాడు : ఇది నిజముగా అపూర్వము : మఱియొక ఈ అపూర్వత రూపాంతరీకరణ - మను మఱియొక అపూర్వతను మన ముందుంచుచున్నది.

ఈ రూపాంతరీకరణ ప్రక్రియ ఇంతటితో నాగిపోదు.కావున శ్రీఅరవిందుడు మఱియు నిట్లు వర్ణించును -

అటులే, భగవంతుని యొక్క ఒక మహాశక్తి మన పుణ్యపాపములను, మన ధర్మాధర్మములను, మన బలదౌర్బల్యములను స్వీకరించి,వాని సంకులితాకారములను పరిత్యజించివేయును- "సర్వధర్మాన్ పరిత్యజ్య", మఱియు దాని నంతను తన అలౌకిక శుద్ధతలోనికిని,విశ్వగత శుభములోనికిని, అమోఘ బలములోనికిని రూపాంతర మొందించును.

ఇంకను, భగవంతుని అవర్ణనీయానందము క్షుద్రమగు మన హర్షశోకము లను, ఆయాసపూర్ణమగు మన సుఖదుఃఖములను స్వీకరించి, వాని పరస్పర విరోధ ములను, వాని అపూర్ణ లయతాళములను పరిత్యజించివేయును - "సర్వధర్మాన్ పరిత్యజ్య" మఱియు దాని నంతను తన విశ్వాతీత, విశ్వగత, అనూహ్య ఆహ్లాదము లోనికి రూపాంతర మొందించును.

ఈ యోగసాధకుడు సాక్షాత్తు యోగేశ్వరుడే కావున, ఇచ్చట, ఇతర యోగములు సాధించగల దంతయు, తదధికము గూడ సాధించబడును, మఱియు నే మానవగురువు మన కీయజాలని ఒక మహత్తర విజ్ఞానముతో సాధించబడును. ఈ పరమ యోగము మనల నే ఆంతర ఆధ్యాత్మిక స్థితికి సముద్ధరించునో, ఆ స్థితి ఇచ్చటను, సర్వలోకములందును గల సర్వమునకు పైనుండును, అయినను, ఆ

సర్వమును తనలో నిముడ్చుకొని యుండును. అయితే ఆ సర్వము యొక్క పరిమిత త్వమును, బంధనమును ఊడ్చివేసి - "సర్వధర్మాన్ పరిత్యజ్య" - ఆ సర్వమును రూపాంతర మొనరించి, పిమ్మట తనలో నిముడ్చుకొని యుండును.

చివరకు, బంధనకరములగు సర్వధర్మములను పరిత్యజించి "సర్వధర్మాన్ పరిత్యజ్య"-పరమపురుషుని శక్తి ఒక దివ్య స్వేచ్ఛయందు చేయవలసిన దంతయు చేయును గాన, అట్టి కర్మవలన విముక్తాంతరాత్మపై నెట్టి బంధనశీల సంస్కారము పడదు.

ఇట్లు "సర్వధర్మాన్ పరిత్యజ్య" - అను మకుటమును, లేక పల్లవిని శ్రీ అరవిందుడు మన కిన్ని విధాల అన్వయించి చూపును

"సర్వపాపములనుండి విడిపింతును''-అని నపుడు, ఇందలి పాప-శబ్దమునకు విశాలార్థ మిక్కడ మనకు గన్పించును. 1. జ్ఞానాజ్ఞానముల అపూర్ణతారూపములే పాపములు, 2. పుణ్యపాపములు, మఱియు బలదుర్బలతల జటిలాకారములే పాపములు, 3. సుఖ దుఃఖాదుల పరస్పర విరోధములే పాపములు, 4. అపర ప్రకృతికి గల పరిమితత్వబంధనములే పాపములు, 5. చివరకు, సర్వధర్మములు బంధనకరములే గాన, సర్వ ధర్మములు పాపములే. [ఈ వాక్యమును సందర్భశుద్ధి లేకుండ చదివిన, అది హాస్యాస్పదము, అపాయకరము నగును !].

దీని తాత్పర్యము ధర్మమే లేదనియా ? కాదు. "ధర్మే సర్వం ప్రతిష్ఠితం"- ధర్మమునందే సర్వము నిలిచియున్నది. దేనియందు విశ్వ మంతయు ప్రతిష్ఠితమై యున్నదో,అట్టి ధర్మ మొకటి గలదు. దానినే గీత "శాశ్వత ధర్మ''(14-27)మనును.

ఈ శాశ్వత ధర్మ మెట్టి దనిన, మన అస్తిత్వము (existence) భగవ దస్తిత్వములోనికి స్వీకరించబడి నపుడు, అది, ఇపుడు మనకు గన్పించునట్లు, వేఱుగా నుండదు. అపు డది ఒక పరమానంతత యొక్క విశాలగతి యగును. కాగా ఏ ధర్మము చేత ఆ గతి నిర్ణయించబడునో, అదియే శాశ్వత ధర్మము లేక దివ్య ధర్మము.

అపర ప్రకృతి మనలను లోనుంచి నడుపుచుండు ఈశ్వరుని మఱుగుపఱచును. కావున అపర ప్రకృతియందు భగవదిచ్ఛ ఏదియో మనకు తెలియదు. కనుక అపుడు మనకు బాహ్య లేక మానసిక ధర్మములను అవలంబించవలసివచ్చును. మఱియు నీ ధర్మము లనేకము గనుక, కర్తవ్య నిర్ణయమునందు ధర్మసంఘర్షము తప్పదు.

పోతే, పర ప్రకృతి తనయందలి ఈశ్వరుని ఆవరించివేయదు, పైగా అపర ప్రకృతి ఆవరణను దొలగించి, ఈశ్వరుని ఆవిష్కరించును, మఱియు అభివ్యక్తము చేయును. కనుక నిచ్చట భగవదిచ్ఛ స్పష్టముగా దెలియుచుండును, మఱియు ఈ భగవదిచ్ఛయే విశ్వగతిని, విశ్వగతిలో నంతర్భాగముగా మన గతిని నడుపుచుండును గాన, మన కే ఇతర ధర్మము నాశ్రయించవలసిన పని యుండదు. ఇట్లు, ఈ భగవదిచ్ఛయే శాశ్వత ధర్మ మగును.

అయితే ఈ భగవదిచ్ఛ మన ఇచ్ఛ వంటిది గాదు. భగవంతుని చిచ్ఛక్తి యందలి చిత్తు దేనిని చూచునో, అదే చిచ్ఛక్తి యందలి శక్తి దానిని చెప్పకయే, సహజముగనే అనుష్ఠించును. అనగా మనయందువలె, జ్ఞానశక్తికిని, క్రియాశక్తికిని ఇచ్చట ఎడబాటు ఉండదు, విరోధ మసలే యుండదు. ఈ క్రియాశక్తియే భగవదిచ్ఛ గాన, మఱియు భగవదిచ్ఛయే శాశ్వత ధర్మము గాన, ఈ శాశ్వతధర్మము యొక్క సహజత మన కప్పుడు వ్యక్తమగును. ఇది ఇట్లు సహజము గావుననే, మన అనుభవమును బట్టి చూచిన, ఇది ధర్మముగా గన్పించదు. ఈ ధర్మము సర్వ ధర్మములకు అతీతమే యైనను, వానికి విరుద్ధము గాదు, పైగా వానికి మూల మగును (15-1).

ఈ శాశ్వత ధర్మము, మఱియు దీనిని బట్టి ప్రవర్తించు కర్మ ఎంత సహజముగా, అప్రయత్నముగా జరుగునో, శ్రీ అరవిందుని ఈ ఉదాహరణ మనకు దెలుపును - అంతుబట్టని అనంతాకాశము లోతులను నిర్గమించు మధుర సంగీతము వలె నుండును, భగవంతుని అగాధతలములనుండి వెలువడు కర్మకలాపము.

కనుక సర్వధర్మములను పరిత్యజించి, ధర్మము కాని ఈ ధర్మమును మనము చేరుకొనవలెను, అదియే మన జీవనసంసిద్ధి

ఇదిగో, ఇది గీతామహావాక్యమునకు శ్రీ అరవిందుడు చేసిన వ్యాఖ్యాన సంగ్రహము, ఇందు ముఖ్యముగా మనకు మూడు అంశములు గన్పించును — 1. "మా మేకం శరణం వ్రజ" – నన్ను ఒక్కనినే శరణు బొందుము : దీనియందు ఆయన సాధకుని యొక్క ఆత్మసమర్పణను జూచును; 2. "అహం త్వా (మోక్షయిష్యామి)" – నేను నిన్ను (విడిపింతును) : దీనియందు ఆయన భగవంతుని శక్తియొక్క అవతరణను జూచును. సాధకుని ఆత్మసమర్పణ ఫలితముగా, భగవంతుని శక్తి సాధకునిలో నవతరించి, అతని సాధనను తానే చేపట్టును;

3. "(అహం త్వా) మోక్షయిష్యామి"-(నేను నిన్ను) విడిపింతును : ఈ విడిపించుట యందు కేవల ముక్తినే కాక, ఆయన సాధకుని ప్రకృతి యొక్క పరివర్తనను గూడ చూచును. భగవచ్ఛక్తికి మాత్రమే, అతని అతిమానసచేతనకు మాత్రమే, ఈ పరివర్తన సాధ్యము.

శ్రీ అరవిందుడు తలపెట్టిన మహాకార్యము భువియందు దివ్యజీవన స్థాపన. దీనిని సాధించగల ప్రధాన శక్తులు, శ్రీ అరవిందదర్శనము ననుసరించి మూడే మూడు- 1. సాధకుని ఆత్మసమర్పణము, 2. భగవంతుని శక్త్యవతరణము, 3, సాధకుని ప్రకృతిపరివర్తనము. ఇతరులు గాంచని ఈ మూడు మహా సూత్రములను శ్రీ అరవిందుడు ఈ చరమ శ్లోకమున పసికట్టి, వెలువరించినారు గీత యందు భావి దివ్యజీవన బీజములను ఈ రీతిగా జూచినవారు, ప్రప్రథమముగా జూచినవారు, శ్రీ అరవిందుడే. దీనిని బట్టి గీత ఎట్టి మహాగ్రంథమో, దాని వ్యాఖ్యాతగా శ్రీ అరవిందు డెట్టి మహాపురుషుడో మనము ఊహించదగును.

అవతారిక : ఇపుడు గీతార్థము సమాప్తప్రాయము, గీతోపదేశము యొక్క ఫలితము మాత్రమే వర్ణించవలసి యున్నది. అది (18-73) శ్లోకమున చేయబడును. గీతార్థము సమాప్తప్రాయము గావుననే, ఇపుడు గీతా ప్రచార సంప్రదాయమును జెప్పుకున్నాడు —

**ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన,**
**న చాశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి. 67**

అర్జునా ! నీకు బోధింపబడిన ఈ గీతాశాస్త్రము తపోనిష్ఠ లేనివానికి గాని, భక్తుడు కానివానికి గాని, (గురువునకు) శుశ్రూష చేయనివానికి గాని, నాయెడ అసూయ జెందువానికి గాని ఎన్నడును చెప్పదగదు.

విశేషార్థము : శ్రీ కృష్ణుడు గీతయందు తానే ఈశ్వరు (5-29) డని అనేక పర్యాయాలు ఉద్ఘాటించును. కృష్ణుడు మానవు డని తలంచి, దీనిని మానవుడు చేసికొను ఆత్మస్తుతిగా జమకట్టి, ఎవడు గీతాప్రవర్తకునియందు అసూయపడునో, అతనికి దీనిని చెప్పరాదు. అనగా గీతాకృష్ణుడు భగవాను డను విశ్వాసము లేని వానికి దీనిని బొత్తిగా జెప్పదగదు. (చూ. 4-34).

అవతారిక : ఇపుడు గీతాప్రచారకునికి ఫలము జెప్పబడును -

య ఇమం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి,
భక్తిం మయి పరాం కృత్వా మామే వైష్య త్యసంశయః.   68

పోతే, ఎవడు, నాయందు తనకు గల పరమభక్తి ప్రేరేపించగా, పరమ గుహ్యమగు ఈ గీతాశాస్త్రమును నా భక్తులకు వచించునో, అతడు నన్నే పొందును, సందియము లేదు.

విశేషార్థము : "భక్తిం మయి పరాం కృత్వా" — ఈ భగవదుపదేశమును ఇతరుల కందించుట పరమ గురువగు భగవంతునికి శుశ్రూష చేయుటయే యను బుద్ధితో—అని శ్రీ శంకరుడు చక్కని అర్థమును చెప్పును.

ఇచ్చట కుల, మత విచక్షణ లే దను సత్యమును గమనించదగును. భక్తి యున్న చాలును, అది లేనిచో, నేది యున్నను చాలదు.

అవతారిక : మఱియు నతడు నా కెంత ప్రియు డనిన —

నచ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః,
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి.   69

మఱియు నట్టి గీతాబోధకుడు తర్వాత నన్ను పొందుటయే కాదు, ఇపుడు నా కత డత్యంత ప్రియుడు: అతనిని మించిన ప్రియుడు నా కిపుడు లేడు, ముందు ఉండబోడు.

విశేషార్థము : భగవంతుని కార్యము చేయువాడు భగవంతుని కెంత ప్రియుడో, హృదయమును కదలించివేయు ఈ వచనముల వలన మనకు వ్యక్తమగును. యుద్ధానంతరము శ్రీరాముడు స్వయముగా తన చేతులను జోడించి,"ఎన్ని జన్మలకైనను మీ ఋణమును నేను తీర్చుకొనలేను!"—అని కపులకు తన కృతజ్ఞతను వెలిబుచ్చుకొనును.

అవతారిక : ఇతరులకు గీతను పంచి ఇవ్వకపోయినను —

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః,
జ్ఞానయజ్ఞేన తే నాహ మిష్టః స్యామితి మే మతిః.   70

ఎవడు ధర్మసమ్మతము, మన సంవాదరూపము నగు నీ గీతాగ్రంథము నధ్యయనము చేయునో, అతడు నన్ను జ్ఞానయజ్ఞముచేత ఆరాధించినవా డగు — నని నా నిశ్చయము.

విశేషార్థము : ఋషులు మననుండి అపేక్షించునది కేవలము వారి గ్రంథము లను చదువవలె ననియే. అట్లు చదువుటయే ఋషి ఋణము తీర్చుట యగును : ఈ ఋణము చెల్లించినందువలన మనము సంపూర్ణ సంపన్నుల మగుదుము : గీతా కృష్ణునికిని మన మిట్టి ఋణమునే తీర్చవలెను. ఈ ఋణము తీర్చకపోయిన నేమి జరుగును ? "వినంక్ష్యసి" (18-58).

జ్ఞానయజ్ఞమునకు ఆధ్యాత్మికార్థము : నాకు జ్ఞానము కలిగి నపుడు నా జీవనమే ఒక యజ్ఞరూపము ధరించును (4-24). కనుక జ్ఞాని అట్టి జ్ఞానయజ్ఞము చేత భగవంతు నారాధించినవా డగును మఱియు నా జ్ఞానము గీతాఽధ్యయనము చేత గలుగును.

**అవతారిక :** చివరకు గీతను వినినప్పటికి, అట్టివాడు –

**శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపి యో నరః,**
**సోఽపి ముక్తః శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్ పుణ్యకర్మణాం.**

ఇక నే మనుజుడు శ్రద్ధావంతుడు, అసూయరహితుడునై గీతోపదేశమును కేవలము వినునో, అతడు సైతము పుణ్యకర్మలను చేసినవారికి ప్రాప్తించు పుణ్య లోకములను బొందును.

విశేషార్థము : యోగభ్రష్టుడు పుణ్యలోకములను బొంది, తిరిగి జన్మించి యోగశేషమును సాధించును (6-41). గీతాశ్రోతయు పుణ్యలోకములను పొందును– అని చెప్పుటచే, ఇతడును యోగభ్రష్టునివలె అపూర్ణయోగి యని మన మూహించ దగును.

అవతారిక : ఇపుడు ఆచార్యధర్మము ననుసరించి, పరమ గురు వడుగు చున్నాడు —

**కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వ యైకాగ్రేణ చేతసా,**
**కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రనష్ట స్తే ధనంజయః. 72**

పార్థా ! నీవు నా ఉపదేశమును ఏకాగ్రచిత్తముతో విన్నావా ? మఱియు అజ్ఞానముచే గలిగిన నీ సమ్మోహము సమూలముగ నశించినదా ?

విశేషార్థము : అర్జునుని విషాదమునకు కారణము సమ్మోహ మనియు, ఆ సమ్మోహమునకు కారణము అజ్ఞాన మనియు, భగవదుపదేశము యొక్క ఉద్దేశ్యము

అజ్ఞాననాశక మగు జ్ఞానోదయ మనియు భగవానుని ప్రశ్న మనకు చెప్పకయే తెలుపును. ఇక నా జ్ఞానస్వరూప మెట్టిదో, అర్జునుని సమాధానము దెలుపును –

అర్జున ఉవాచ –

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత,
స్థితోఽస్మి గత సందేహః కరిష్యే వచనం తవ. 73

అర్జునుడు చెప్పెను – హే కృష్ణా! నీ ప్రసాదముచేత నా మనోమోహము నశించినది, స్వాత్మవిషయక స్మృతి లభించినది, సంశయసందేహములు నశసిపోగా, ఇపుడు నిస్సందేహుడనై నిలచి యున్నాను, నీ ఆదేశమును నిర్వహించెదను.

విశేషార్థము : "సంమోహముచేత స్మృతివిభ్రమము" (2-63)-ఈ త్రయమే ఇక్కడను వచ్చినది. ఎట్లన, మనస్సు యొక్క సంమోహము వలన ఆత్మవిషయక స్మృతి నశించును గనుక, ఇచ్చట చెప్పబడినట్లు సమ్మోహము నశించి నపుడు, తిరిగి స్మృతి లభించును.

ఇది స్మృతియా, జ్ఞానమా ? స్మృతియే. ఏలన 'అంతరాత్మ' ఆత్మ యొక్క భావమే (2-17). కనుక అంతరాత్మకు నేను ఆత్మ-నను జ్ఞానము సహజము. కాని ఈ అంతరాత్మ జీవలోకములోనికి దిగి, జీవు డైనపుడు (15-7), తన జీవనము యొక్క భ్రమకారి ఆడంబరములు మఱియు ఆకారములచే అజ్ఞానము మఱుగున బడిపోవును. కనుక తన ఆత్మయొక్కయు, తన సత్యముయొక్కయు జ్ఞానమును తిరిగి పొందుట అంతరాత్మకు స్మృతియే యగును.

కాని తిరిగి లభించిన ఈ జ్ఞానము అర్జునుని కర్మశూన్యుని జేయునా ? చేయదు, చేయనే చేయదు. కావుననే "నీ ఆదేశము ననుష్ఠించుటకు సిద్ధముగా నున్నాను." అని చెప్పి, అర్జునుడు లేచి నడుము కట్టును, యుద్ధము చేయును. అయితే ఉపదేశమునకు బూర్వము అర్జునుడు చేయ వెఱచినది బద్ధుని యొక్క కర్మ కాగా, ఇపుడు తాను చేయనున్నది ముక్తుని యొక్క కర్మ-"ముక్తస్య కర్మ" (4-23). ఇదియే భేదము.

ఇచ్చట శ్రీ శంకరుడు సందిగ్ధము, చమత్కారపూర్ణము నగు వ్యాఖ్య చేయును. అది యేమన "కరిష్యే వచనం తవ" – నీ వచనము ననుష్ఠింతును, (ఇది సూటి అర్థము). అనగా, హే కృష్ణ! నీ ప్రసాదముచేత నేను కృతార్థుడ నైతిని, ఇపుడు నాకు కర్తవ్యమేమియును లేదు – అని అభిప్రాయము – అం

శ్రీ శంకర వ్యాఖ్యానము. ఇందలి రెం డర్థము లేవి యన 1. నాకు కర్తవ్యము లేదు, కనుక నాకు కర్మలేదు-అని భావము; 2.నాకు నాకొఱకై కర్తవ్యము లేదు,కనుక నీవు చెప్పినట్లు చేతును- అని భావము. ఈ రెండింటిలో మొదటిది శంకరమతము.

అవతారిక : ఇపుడు గ్రంథము గతార్థ మైనది. కాగా గ్రంథసంబంధము చెప్పబడును.

సంజయ ఉవాచ –

ఇత్యహం వాసుదేవస్య పార్థస్యచ మహాత్మనః,
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణం. 74

సంజయుడు చెప్పెను – ఈ ప్రకారముగా, ఓ ధృతరాష్ట్రమహారాజా, వాసుదేవుడగు (7-19) శ్రీ కృష్ణుని యొక్కయు, మహాత్ముడగు (7-19) అర్జునుని యొక్కయు రోమహర్షము గల్గించు ఈ అద్భుత సంభాషణమును వినియున్నాను.

విశేషార్థము : సంజయునకు రోమహర్షము ఎందుచేత గల్గెను ? సంవాదమునందలి అద్భుతతను గ్రహించగల్గెను గనుక. ఈ అద్భుతతను గ్రహించగల్గుటయే శ్రోత యొక్క యోగ్యత యగును. సాక్షాత్తు గీతయందుకంటె, శ్రీ అరవిందునిచే ఆవిష్కరించబడిన గీతారూపమునందు ఈ అద్భుతమునకు స్పందించుట ఎక్కువ సుకరమగును.

**అవతారిక :** అట్టి ఈ సంవాదమును –

వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నిమం గుహ్యతమం పరం,
యోగం యోగేశ్వరాత్ కృష్ణాత్ సాక్షాత్ కథయతః స్వయం.75

వేదవ్యాసమహర్షి ప్రసాదముచేత అతిరహస్యము, పరమోత్కృష్టము నగు నీ యోగసంభాషణను యోగేశ్వరుడగు కృష్ణుడే సాక్షాత్తు, స్వయముగా భాషించుచుండ నాకు వినగల మహాభాగ్య మబ్బినది

విశేషార్థము : వ్యాసమహర్షి మహామహిమోపేతుడు. అందుచేత, శ్రీ కృష్ణుడే దివ్యచక్షువును (11-8) అర్జునున కొసంగెనో, అదే దివ్యచక్షువును, దివ్యశ్రుతిని వ్యాసదేవుడు సంజయునికి ప్రసాదించెను. ఆ ప్రసాదసామర్థ్యముచేతనే సంజయుడు

ఆ గుహ్యసంభాషణను వినుటయే కాక, ఆ దివ్యరూపమును గూడ దర్శించగలిగెను. నిజముగా పెద్దలగు పెద్దల ప్రసాదమునకు మనము విలువకట్టజాలము.

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతం,
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః. 76

ఓ ధృతరాష్ట్ర మహారాజా : పాపహరము, అద్భుతము నగు శ్రీకృష్ణార్జునుల, ఈ దివ్యసంవాదమును మఱల మఱల స్మరించి, మఱల మఱల హర్షపులకితుడ నగుచున్నాను.

విశేషార్థము : సాక్షాత్తు విన్నపుడే కాక, స్మరించినపు డెల్ల హర్షము నందుచున్నాను-అను సంజయుడు చెప్పును. గీతాచేతన లోనికి ప్రవేశింతు మేని, మనకైనను, ఇపుడైనను ఇదే జరుగగలదు. "రోమహర్షణం" (18-74) యొక్క-అర్థమునే ఇచ్చటి "హృష్యామి" (18-76) - పదము చెప్పుచున్నది.

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః,
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునఃపునః.77

మఱియు నో మహారాజా, వాసుదేవుని యొక్క- అత్యద్భుత మగు ఆ విశ్వరూపమును స్మరించి, స్మరించి, నే నాశ్చర్యచకితుడ నగుచున్నాను, తిరిగి తిరిగి రోమాంచము నందుచున్నాను.

విశేషార్థము : పదము లెట్లు తూచి వాడబడుచున్నవో గమనించదగును - సంవాదమునకు 'అద్భుత'-మను విశేషణము, విశ్వరూపమునకు 'అత్యద్భుత'మను విశేషణము వాడబడినవి.

ఆశ్చర్యము ముదిరినపుడు 'విస్మయ' మగును, ఆ విస్మయము ముదిరినపుడు నిశ్చేష్టత గలుగును. అది భయముతో గూడిన విస్మయ మగుచో, దిక్కు-లు గూడ తెలియకపోవుట జరుగును (18-22, 25).

అవతారిక : ఈ చరమ శ్లోకమున గీతాసందేశము మనకు గర్భితముగా వినిపించబడును -

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీ ర్విజయో భూతిర్ ధ్రువా నీతి ర్మతి ర్మమ. 78

ఎచట యోగేశ్వరు డగు కృష్ణుడును, ధనుర్ధారి యగు నర్జునుడు నుందురో, అచట లక్ష్మి యుండును, విజయ ముండును, విభవ ముండును, సుస్థిర నీతియు నుండును : ఇది నా నిశ్చితాభిప్రాయము.

విశేషార్థము : యోగ మనగా సంయోగము, భగవంతునితో మానవుని సంయోగము. ఈ సంయోగము సైతము ఒక ప్రక్రియ గాన, ఇదియు నొక శక్తి నపేక్షించును. ఉదాహరణకు, తెలిసికొనుట ఒక క్రియ, అది జ్ఞానశక్తి నపేక్షించును. ఈ జ్ఞానశక్తి గలవాదే జ్ఞానము నందును. ఈ జ్ఞానశక్తి యొక్క పేరు బుద్ధి. ఈ బుద్ధి లేక జ్ఞానశక్తికి ఒక అధిదేవత యుండునట్లే యోగము లేక యోగశక్తికిని ఒక అధిదేవత యుండును. ఈ అధిదేవతయే కృష్ణుడు, కావుననే కృష్ణుని యోగేశ్వరు డందురు. యోగేశ్వరు డనగా, యోగశక్తి కృష్ణుని శాసనమునకు లోబడి పని చేయును.

ఉదాహరణకు, "ఎవనిని నేను వరింతునో, అతనికి నా స్వరూపము నావిష్కరింతును" (క.ఉ)–తన స్వరూపావిష్కరణము, అనగా తనతో యోగము, భగవదధీనమై యున్న దని ఈ ఉదాహరణ దెలుపును. అటులే "నిర్వాణశాంతి నా అధీనమై యున్నది" (6-15) – అని గీతయు జెప్పును.

కనుక నిచ్చటి పదము 'యోగేశ్వరుడు' గాని, కొందరు తలంచు నట్లు 'యోగీశ్వరుడు' కాదు. యోగీశ్వరు డనగా యోగులలో శ్రేష్ఠు డని అర్థము. ఒకొకప్పుడు 'యోగీశ్వర' – పదము శివపరముగా ప్రయోగించబడును.

ఇంతకంటెను మార్మికార్థ మేమన, ఏ శక్తిచేత భగవంతుడు తాను సృజించిన ప్రపంచముతో సంయోగము నం దుండియు, అదే సమయమున దాని కతీతముగా నుండునో, అది యోగము, దాని కీశ్వరుడు యోగేశ్వరుడు. ఈ యోగమునే గీత 'ఐశ్వర యోగ' (9-5) మనును.

మూడవ అర్థ మేమన, ఈశ్వరునితో సంయోగమునందు, అనగా గీతా పరిభాషలో, యోగమునందు చేయబడు కర్మయు–"యోగస్థః కురు కర్మాణి"(2-48)– యోగ మనబడును. ఉదాహరణకు, సాంఖ్యయోగములు – అని నపుడు, సాంఖ్య యోగము, మఱియు కర్మయోగము – అని అర్థము. ఇక యోగమునందు చేయబడు కర్మ యన, అహంకారమునుండి కాక, సరాసరి ఈశ్వరునినుండియే ప్రవర్తించు కర్మ(10-8), ఈ కర్మకు జీవుడు నిమిత్తమాత్రముగా నుండి నిర్వహించును(11-33) వేఱు మాటలలో, ఈశ్వరునితో యోగమునం దున్న ముక్త జీవుడు ఈశ్వరునియందు

కర్మలను సన్న్యసించి, లోపల నైష్కర్మ్యము ననుభవించుచు, కర్మచేయువాడు-నేను కాదు, నా ప్రకృతిద్వారా ఈశ్వరుడే కర్మచేయుచున్నాడు - అని కర్మ చేయును.

దీనిని బట్టి ఈ శ్లోకార్థ మిట్లుండును - యోగేశ్వరుడగు కృష్ణు డన యోగ కర్మను ప్రవర్తింపజేయు నారాయణుడు, మఱియు ధనుర్ధరుడగు అర్జును డన ఆ యోగకర్మను నిమిత్తమాత్రముగా నిర్వహించు నరుడు. కనుక యోగేశ్వరుడగు కృష్ణుడును, ధనుర్ధరుడగు అర్జునుడు ఎచ్చ టుందురో, అచ్చట ఈశ్వరప్రణాలిక ననుసరించి దివ్యకర్మ జరుగును - ఈశ్వరప్రణాలిక ననుసరించు ఈ దివ్యకర్మ యుద్ధకర్మయు గావచ్చును (11-32). కనుక నచ్చట సంపత్తియు, విజయమును, విభూతియు (విభవమును), నీతియు విలసిల్లును.

ఇదియే గీత మన కందించు దివ్య సందేశము. ఒక్క మాటలో, "యోగస్థః కురు కర్మాణి" (2-48) - ఇదియే గీతాసందేశ హృదయము.

ఈ యోగకర్మచేత, యోగమునకు మొదటి అర్థమగు సంయోగశక్తి ప్రాప్తించును(పైన జూడుడు).దీనివలన జీవుడు భగవంతునిలో పూర్ణుడగును(4-10). ఈ సంయోగము దారి చేయగా, భగవంతుని శక్తి జీవప్రకృతిలోని కవతరించి, దానిని దివ్యీకరించును. అట్లు దివ్యకృత మగు వ్యష్టి-జీవప్రకృతిలోనికి భగవంతుడే అవతరించి ప్రత్యక్షమగును. అపుడు బాహ్యప్రకృతికిని, భగవంతుకిని మధ్య ఏ తెరయు నుండదు. దీనినే, 'భగవంతుడు జీవునిలో పూర్ణు డగును-అని చెప్పుదురు. అనగా పైన యోగమునకు మార్మికార్థముగా మనము చెప్పుకొనిన అర్థము ఇచ్చట ఫలించును. ఏలన, బాహ్యప్రకృతిద్వారా వ్యక్తమగుచునే, ఇచ్చట భగవంతుడు తదతీతముగా నుండును.

భగవంతునియందు జీవుని పరిపూర్తి, మఱియు జీవుని యందు భగవంతుని పరిపూర్తి: ఇదియే గీతాసందేశముద్వారా మనకు ప్రాప్తించు పరమ ఫలము.

ఇక నీ ఫలము లక్ష్మి, విజయము, విభవము, నీతినిష్ఠలతో గూడిన సమృద్ధ దివ్యజీవనము గాని, జీవనసన్న్యాసలక్షణమగు నిర్విశేష మోక్షము గాదు. నిర్విశేష ఆత్మపై పరిపూర్ణ పురుషోత్తమునికి ఏ ఆధిక్యము గలదో (4-35), నిర్విశేష మోక్షముపై దివ్యజీవనమునకు అదే ఆధిక్యము గలదు.

ఈ చరమాధ్యాయము యొక్క నామధేయము 'మోక్ష సంన్యాసయోగము'. దీని అర్థ మేమి యగును?

మోక్ష సంన్యాసయోగము = మోక్షమునకు సంన్యాసము మార్గము. సర్వ ధర్మములను పరిత్యజించి, నన్నే ఆశ్రయింతు వేని, నిన్ను సర్వ పాపములనుండి - సర్వ అశుభములనుండి (4-16)-విడిపింతును - అని చివరి శ్లోకము అభయమిచ్చును. కనుక సంన్యాస మన సర్వ ధర్మసన్యాసము, అథవా సర్వధర్మసంన్యాసపూర్వకమగు భగవదాశ్రయము, మఱియు మోక్ష మన అశుభములనుండి - అజ్ఞానాహంకారములు కల్పించు అశుభములనుండి - మోక్షము, అథవా ఈ పరిపూర్ణ మోక్ష లక్షణమగు దివ్యజీవనము (18-78). కనుక మోక్షసంన్యాసయోగ మన ధర్మసన్యాసయోగము ద్వారా మనకు ప్రాప్తించు మోక్షలక్షణమగు దివ్యజీవనము. ఇది శ్రీ శంకరుడు కర్మసంన్యాస మార్గముద్వారా చెప్పు నిర్విశేషమోక్షము గాదు, ఆ నిర్విశేష మోక్షము ఒక లక్షణమగు దివ్యజీవనము.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి
శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే

## మోక్షసంన్యాస యోగో నామ

## అష్టాదశోఽధ్యాయః

## ఇతి శ్రీ మద్భగద్గీతాశాస్త్రం సమాప్తం

శ్రీ కృష్ణార్పణమస్తు.

ఓం తత్ సత్



ఓం

# శ్రీ గీతా మాహాత్మ్యమ్

ధరోవాచ -

భగవన్ పరమేశాన భక్తి రవ్యభిచారిణీ,
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో. 1

విష్ణు రువాచ -

ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతః సదా,
స ముక్తః స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే. 2

మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతి చేత్,
క్వచిత్ స్పర్శం న కుర్వంతి నలినీదళ మంబువత్. 3

గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే,
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై. 4

సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చయే,
గోపాలా గోపికా వాఽపి నారదోద్ధవ పార్షదైః,
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే. 5

యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతం,
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి. 6

గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహం,
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్లోకాన్ పాలయా మ్యహం. 7

గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః,
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్య పదాత్మికా. 8

చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునం,
వేదత్రయీ పరానందా తత్త్వార్థ జ్ఞానసంయుతా. 9

యోఽష్టాదశ జపే న్నిత్యం నరో నిశ్చలమానసః,
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదం. 10

పాఠేఽసమర్థః సంపూర్ణే తదర్ధం పాఠ మాచరేత్,
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః. 11

త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్,
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్. 12

ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తిసంయుతః,
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసే చ్చిరం. 13

అధ్యాయ శ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః,
స యాతి నరతాం యావ న్మనుకాలం వసుంధరే. 14

గీతాయాః శ్లోకదశకం సప్త పంచ చతుష్టయం,
ద్వౌ త్రీ నేకం తదర్ధం వా శ్లోకానాం యః పఠేన్నరః. 15

చంద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువం,
గీతాపాఠసమాయుక్తో మృతో మానుషతాం వ్రజేత్. 16

గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమాం,
గీతే త్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్. 17

గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా,
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే. 18

గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః,
జీవన్ముక్తః స విజ్ఞేయో దేహాంతే పరమం పదం. 19

గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః,
నిర్ధూతకల్మషా లోకే గీతా యాతాః పరం పదం. 20

గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్,
వృథా పాఠో భవే త్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః. 21

ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః,
స తత్ఫల మవాప్నోతి దుర్లభాం గతి మాప్నుయాత్. 22

సూత ఉవాచ –

మాహాత్మ్య మేత ద్గీతాయా మయా ప్రోక్తం సనాతనం,
గీతాంతే చ పఠే ద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్. 23

ాహాపురాణే శ్రీ గీతామాహాత్మ్యమ్

సంపూర్ణం

# తప్పొప్పుల పట్టిక

ముద్రణ యందు తప్పులురాకుండ, శుద్ధముగా ప్రకటించవలె నని మేము ప్రయత్నించి నప్పటికి, అనేక కారణాలవల్ల తప్పులు దొర్లక తప్పలేదు; అందుకు క్షంతవ్యులము. దయ యుంచి పాఠక మహాశయులు ఈ గీతాయోగ - పఠనానికి ఉపక్రమించుటకు పూర్వమే, ఈ పట్టిక ననుసరించి ఆ తప్పులను సరిచేసికొనెదరు గాక :

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 11 | 1981 | 24-11-1981 |
| 5 | 9 | బ్రహ్మాగ్నౌ | బహ్మాగ్నౌ |
| 9 | 19 | నిర్వర్వ్యక్తికమగు | నిర్వ్యక్తికమగు |
| 11 | 18 | విశిష్ఠతలను | విశిష్టతలను |
| 12 | 15 | (18-6) | (18-61) |
| 16 | 5 | వర్తించుచు | అనువర్తించుచు |
| 28 | 4 | లభించు | లభించని |
| ,, | 17 | (11-22) | (11-32) |
| 30 | 15 | ఏవహిః. | ఏవహి. |
| 35 | 1 | కృష : | కృష్ణ : |
| 40 | 9 | (7-10, 18-57) | (10-10,18-57) |
| ,, | ,, | విముక్తి | విముక్త |
| 44 | 1 | స్వర్గలోకమును | స్వర్గలోకమున |
| 54 | 24 | నామఽస్తి | నాశోఽస్తి |
| 55 | 21 | తయాఽవహృత | తయాఽపహృత |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 57 | 25 | కర్మచేయము. | కర్మచేయుము. సమత్వమే యోగము. |
| 58 | 1 | వైదిక కర్మలును గావు (2-47), | వైదికకర్మలును (2-42) గావు, |
| 58 | 2 | విక్షిప్తకర్మలును గావు (2-48), | విక్షిప్తకర్మలును (2-43) గావు. |
| 59 | 9 | శ్రుతస్యచ | శ్రుతస్యచ |
| 64 | 12 | అంతరించిపోనవి | అంతరించిపోవునవి. |
| 65 | 23 | ఆపూర్వమాణ | ఆపూర్యమాణ |
| 74 | 20 | యథార్థము | యజ్ఞార్థము |
| 78 | 4 | నిజ్ఞాయగు | జ్ఞానియగు |
| 82 | 1 | సమ్వృద్ధ | సమృద్ధ |
| 106 | 13 | నజ్ఞాముచే | జ్ఞానముచే |
| 112 | 8 | మూలములే | మూలమునే |
| 122 | 20 | ఆజానముచేత | అజ్ఞానముచేత |
| 124 | 13 | సితం | స్థితం |
| 141 | 1 | ధృతిగ్రహీతయా | ధృతిగృహీతయా |
| 141 | 21 | సమముగావించవలెను | వశముగావించవలెను |
| 148 | 21 | కాల గతిం | కాం గతిం |
| 153 | 10 | 6-12 | 7-12 |
| 159 | 26 | ఈవ్యాఖ్య | ఈ వ్యాఖ్యయూ |
| 162 | 21 | సృష్టిజ్ఞానము | సృష్టి, జ్ఞానము |
| 173 | 8 | (7-5) | (7-6) |
| 173 | 15 | విముక్తు | వియుక్తు |
| 186 | 10 | తత్త్వదర్శత | తత్త్వదర్శత |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 188 | 5 | ముక్తి మించిన | ముక్తికి మించిన |
| ,, | 5 | ముక్తికి గర్భిత | ముక్తి గర్భిత |
| 206 | 2 | కొందరు | కొందరి |
| 207 | 21 | అటు | అటులే |
| 207 | 22 | దేహములోనిలే | దేహములోని |
| 216 | 8 | జూచుచున్నాను, | జూచుచున్నానో, |
| 219 | 6 | అభావ | అగాధ |
| 225 | 12 | అహం | ఆహా |
| 227 | 7 | జలన్మాత్ర | జల తన్మాత్ర |
| 232 | 25 | భూతములనే | భూతములకే |
| 245 | 1 | ఘటము | ఘటనము |
| 250 | 9 | ప్రవేశము | ప్రదేశము |
| 255 | 8 | మట్టుపెట్టి, | మట్టుపెట్ట |
| 267 | 14 | చూపబడి | చూడబడి |
| 270 | 7 | వపి | నసి |
| 277 | 7 | విముక్తిప్రకృతికి | విముక్తప్రకృతికి |
| 279 | 2 | వివరించుచు | వివరించును |
| 284 | 24 | పరభక్తిని | పరభక్తికి |
| 291 | 23 | క్షేత్రక్షేత్రజ్ఞులకు | ఈశ్వరక్షేత్రజ్ఞులకు |
| 298 | 1 | వర్జితం | వివర్జితం |
| 304 | 27 | అజుడగు | అజుడై |
| 305 | 25 | దెలియు | దెలియని |
| 320 | 19 | ఎట్లు | లిట్లు |
| 321 | 7 | తన | మన |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 335 | 26 | అక్షరజ్ఞానము | క్షరజ్ఞానము |
| 338 | 6 | సర్వాత్మగా | సర్వాత్మనా |
| 340 | 7 | నిమ్నరూపమునే | నిమ్నరూపముతే |
| 350 | 7 | టరాక్ష | క్షరాక్ష |
| 351 | 24 | సర్వాత్మగా | సర్వాత్మనా |
| 374 | 6 | అయితే | అటులే |
| 376 | 9 | తృష | తృష్ణ |
| 382 | 24 | పరము | పర |
| 395 | 23 | భగద్దృష్టి | భగవద్దృష్టి |
| 398 | 11 | చేయు | చేయని |
| 408 | 17 | ద్రష్ట | ద్రష్టృ |
| 409 | 26 | సామర్థ్యము | సామర్థ్యమో |
| 410 | 6 | నిక్షిప్త | విక్షిప్త |
| 417 | 21 | (14-48) | (18-48) |
| 427 | 23 | కీకమునశ్లో | కి శ్లోకమున |
| 430 | 16 | లోతులు భక్తికి | లోతులకు భక్తి |
| 436 | 18 | స్వభావమున | స్వభావము |
| 438 | 10 | సన్యసించు | సన్యసించి |
| 441 | 23 | వంటి | వంటికి |
| 455 | 18 | లోతులను | లోతులనుండి |
| 458 | 20 | గురు వగు | గురు వను |
| 458 | 23 | ధనంజయః | ధనంజయ |
| 459 | 16 | అజ్ఞానము | ఆ జ్ఞానము |
| 463 | 15 | దివ్యకృత | దివ్యీకృత |



# మా ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ అరవింద పుష్పగుచ్ఛము | 1-50 |
| 2. | దైవసంరక్షితుడు | 2-50 |
| 3. | అతిమానస ఉషోదయము ద్వితీయ ముద్రణ (అచ్చులో) | |
| 4. | శ్రీ అరవిందుల సూక్తులు 2వ భాగము ,, ,, | |
| 5. | గీతావ్యాసములు ప్రథమ సంపుటం ,, ,, | |
| 6. | గీతావ్యాసములు ద్వితీయ సంపుటం | 12-00 |
| 7. | ఉత్తరపారా ఉపన్యాసము | 1-50 |
| 8. | సాధన.... .... .... .... | 3-00 |
| 9. | శ్రీ అరవిందుల విశ్వదర్శనం | 4-00 |
| 10. | శ్రీమద్భగవద్గీత (పారాయణోపయుక్తము) | 5-00 |
| 11. | శ్రీ గీతాయోగము (తులనాత్మక పరిశీలన) | 15-00 |
| | ,, ,, మేలుప్రతి | 20-00 |
| 12. | దివ్యజీవనము (Life Divine) .... .... .... | 10-00 |
| | 1st Book, I భాగము (త్వరలో వెలువడనున్నది) | |